

# శ్రీ కృష్ణ లీలామృతము

- డా॥ వేదుల సూర్యనారాయణ శర్మ

శ్రీరామచంద్రాయనమః.

# శ్రీ కృష్ణలీలామృతము

రావిలికోలను సుబ్బరాయ

విరచితము

## భూభారహరణలీల

యను

ద్వితీయ చుళుకము.

కోలంక వీరవరము లోనగు గ్రామముల
జమీందార్ గారగు
శ్రీశ్రీ రాజా రావు చెల్లాయమ్మరావు బహదరువారిచే
గౌరవకారణంబునఁ బ్రకటితము.

రెండవ కూర్పు.

౧౯౩౫




[వెల ౧-౮-౦

శ్రీ సీతా లక్ష్మణ భరత శత్రుఘ్న హనుమత్సమేత
శ్రీ రామచంద్ర పరబ్రహ్మణే నమః.
శ్రీగోపాలకృష్ణ పరబ్రహ్మణే నమః.
శ్రీశారదాయై నమః.



# శ్రీ కృష్ణలీలామృతము

## బలరామకృష్ణులు మథురానగరంబుఁ జూడఁబోవుట



కృష్ణుండును రాముఁడును నంత నపరాహ్ణ సమయంబున మథురాపురంబుఁజూడ వేడుకపడు గోపాలకులంగూడి నగరంబుఁ బ్రవేశించిరి. ఇట్లు ప్రవేశించి స్ఫటికగోపురములును బంగారు తలుపులును దోరణంబులును రాగిపిత్తళి ధాన్యపుఁ గొట్టులును, నగాధంబులైన యగడ్తలును రమ్యంబులైన యుద్యానంబులును గలిగి పలుతెగల మిద్దెలు మేడలు తిన్నెలు కట్టిమంబులు గలిగి నెమిళ్ళయుఁ బారావతంబులయు ధ్వనులచే మనోహరంబైన దానిని జూచి నీటిచే జిమజిమలాడు వీధులవెంటఁ బోవుచుండిరి.

అప్పు డప్పురస్త్రీలు రామకృష్ణులఁ జూచుతమకంబున మేడ లెక్కిరి. తాము చూచుటకు మున్న వారు దవ్వేగుదురో యను కొందరచే త్రా మంద్యూవలు కొందఱు క్రొన్నెరింగు పైఁటకొంగుగాఁ జీరలు కట్టియుఁ గొందఱు కాట్లు తెలియక హైకలుద్దోడి

గియుఁ గొందఱు బులాకులు చెవులకును బావిలీలు ముక్కులకునఁ బెట్టియుఁ, గొందఱు నొడ్డాణంబు కంఠంబునను గంటెలు నడుమునను బెట్టియుఁ, గొందఱుంగరంబులు కాలివ్రేళ్ళను మెట్టెలు చేతివ్రేళ్ళను ధరించియుఁ, గొందఱు ముఖమునఁ గాటుకబెట్టియుఁ, గొందఱొక చేతికిమాత్రమ రైకతొడిగియు, నొకచేతికి నొకకాలికి నొక చెవికి మాత్రమ యాభరణంబులు ధరించియు, నొకకంటికిఁ గాటుక పెట్టియు, భోజనంబు చాలించి నోటనున్న కబళంబు నమలుచు నొక తెయు, స్నానంబు చేయుచు తడిచీర నెగఁ బట్టుకొని యొక తెయు, నిద్రపోవుచు నులికిపడి లేచి జాఱెడిపైఁటతో నొక తెయుఁ, జనుఁబాలుత్రాగు శిశువును నీడ్చి నేలఁగూలవైచి యొక తెయు, సగ మల్లిన జడతో నొక తెయు, సగముకట్టిన చీరతో నొక తెయుబ త్తి గోఁచి నెగయఁజెక్కుచు నొక్క తెయు, విసవిస చనుదెంచి మేడ లెక్కి తెప్పలార్పక చూచుచుండిరి. శ్రీరమణుండైన యా యరవింద లోచనుండును మందహాస సుందరవిలాస విలోకనంబుల నాసుంద రుల డెందంబు తనవంక లాగుకొనుచు మత్తమాతంగ గమనంబున నన్నతోడ రాజమార్గంబునఁ బోవుచుండె. కృష్ణ చరిత్రంబులు విన్న యాయువతులు జూడ నువ్విళులూరు నావిలాసవతు లాతని సోయగంపుఁ జెలువున్న చూపులను నమృతరసంబుఁ గ్రోలి మానంబు వహించి యా నందనందను నానందమూర్తిని మనంబులఁ గౌఁగిలించి హృదయ తాపంబుఁ బాసిరి. ప్రేమవికసితముఖాంబుజ లా పల్లవపాణులు మేడలమీఁద నుండియె యా రామకృష్ణులపయిఁ బూవులు గురిసిరి. ద్విజులందఱు నక్షతలు పెరుఁగు జలపూర్ణ కుంభంబులు పూలదండలు గంధము లొసగు కానుక లర్పించుచుఁ బూజించిరి. పురస్త్రీలును

ఉ. ఎంత మహాతపంబు ఘటియించి జనించిన వారొ గోపికల్
స్వాంతము లుల్లసిల్ల నయనాంబుజముల్ వికసిల్ల నమ్మదా
క్రాంతహృదంతరంబుల జగజ్జనలోచన పూర్ణచంద్రు శ్రీ
కాంతు నజస్రముం గనఁగఁ గల్గిరి కూడి చరించి రెంతయున్.

## కృష్ణుండు రజకుని వధించి వాయక సుదామ త్రివక్రల సన్మానించుట.

ఇట్లని పౌరకాంతలు తనసౌభాగ్యమును చూపులఁ జూచుచుండ శ్రీరామకృష్ణులు మార్గంబు వెంటఁ బోవుచు విలువగల చలువ వలువలఁగొని తమ కెదురుగా వచ్చు చాకలిం గని రంతఁ గృష్ణుండు వానింజూచి యోరీ నీవు కొనిపోవు వస్త్రంబులందు మాకు యోగ్యంబులగు వానిఁ గొన్నిటినిమ్ము. వస్త్రదానంబు చేసినవారికిఁ బరమ శ్రేయంబు గలుగు ననిన నా కట్టిఁడియు రాజభృత్యుఁడ నను మదంబునఁ దన్ను బట్టలు వేఁడువా రెట్టివా రని తలపెట్టక దిట్టతనంబునఁ జేయుచుఁ గోపంబున నిట్లనియె. ఓరి గొల్లవాఁడా! యడవులఁ బసుల మేపు నడవిమనుష్యులగు మీరిట్టి వేనాఁడు కట్టియుంటిరి. మీపల్లెల దివదిన మిట్టివే కట్టుచుంటిరా? ఔరా మీకెంత కండక్రొవ్వు! రాజ వస్త్రంబుల నపేక్షించు చున్నవారు. మీరు బ్రదుకఁ గోరెదరేని మూఢులారా యూరక నోరుమూసికొని మీత్రోవఁ బొండు. మీ ప్రల్లదంబులు రాజభటులు వినిరేని మిమ్ముఁబట్టి కట్టుదురు కొట్టుదురు. మిమ్ముఁ గొల్లకొట్టుదురు మఱి చంపుదురు, అని దురుక్తులాడినఁ గృష్ణుండును వాని మెడమీఁద నఱచేతఁ గొట్టిన శిరం బెగిరి యావలఁ బడియె. వానితోడి చాకివాండ్రును మూట లచ్చటన పాఱవైచి దిక్కునకొక్కరుఁడుగ నానాముఖంబులఁ బరువెత్తిరి. రామకృష్ణులును దమకుఁ గావలసిన వస్త్రంబుల నందుండి కొని ధరించి కొన్నితోడి గోపాలుర కిచ్చి తక్కిన నంద విడిచి పోయిరి.

భగవానిలక్ష్మి హరింపఁ గోరువారు శ్రీకి నాకరంబులైన పదార్థంబుల బలాత్కారంబుగ హరింపవలయు నను రాజనీతి ననుసరించి పరపక్షాభిమాని వధించి వస్త్రంబుల హరించి యేగుచుండ సాలెవాఁ డొకఁడు వారిం గని భక్త్యతిశయంబునఁ జిత్రంబులైన పుట్టంబుల సొమ్ములఁ దెచ్చి వారి నిరువుర నలంకరించె. ఇట్లు నానావిధ వస్త్రాలంకారంబుల భాసిల్లు నా రామకృష్ణు లుత్సవకాలంబున నలంకరింపఁబడు తెల్లనల్ల యేనుఁగులవలెఁ బ్రకాశించిరి. భగవతుండును

వానియెడలఁ బ్రసన్నుండై యీ లోకంబునఁ బరమశ్రీయును దాని ననుభవింప బలంబును దానిం జక్కఁ వినియోగింప నీశ్వరత్వంబును గామాసక్తుఁడై చెడకుండ స్వవిషయస్మృతియు స్వదత్తంబైన యైహిక శ్రీ నిష్ఫలంబు గాకుండ నింద్రియ పాటవంబును నొసంగి దేహావసానంబున సారూప్యంబు ననుగ్రహించె.

అచ్చటినుండి కదలి సుదాముఁ డను మాలాకారు నింటికిఁ బోయిన నతఁడు వారిం గనుఁగొని దిగ్గన లేచి యెదురువచ్చి సాఁగిలంబడి నమస్కరించి యాసనాసీనులం గావించి యర్ఘ్యపాద్యంబు లొసంగి వారికిని దక్కిన గోపాలురకును గంధమాల్య తాంబూలాదు లొసంగి పూజించి యిట్లనియె.

దేవా ! మీరు నాయింటికిఁ జనుదెంచుటచే నాజన్మంబు సార్థకంబయ్యె. కులంబు పావనంబయ్యె. పితరులు దేవతలు ఋషులు నాయెడ సంతుష్టులైరి. ప్రభులారా ! మీరు విశ్వంబునకుఁ బరమ కారణంబులయ్యు సమస్తలోకమునకు యోగక్షేమంబు లాపాదింప నిందు స్వాంశముల జన్మించితిరి. సర్వభూతశరీరులైన మీకు నెవ్వని యెడను ద్వేషంబు గలుగదు. తన దేహంబుపై విరోధించువాఁ డెవ్వఁడే నుండునా ? సమస్తజనులపట్ల సములయ్యు మిమ్ము భజించువారిని మీరును భజింతే రు. పురుషోత్తములారా ! మీకు నేనుఁగింకరుఁడను. పని యెయ్యదియైన నాజ్ఞాపింపుఁడు. మీ రెవ్వరినలనఁ బనిగొందురో వారే యనుగ్రహింపఁబడినవారు. అని తన యభిప్రాయం బెఱిఁగించి సుదాముండు ప్రీతిమానసుండై ప్రశస్త సుగంధబంధుర కుసుమమాలికల వారి కర్పించె. వారును దివ్యమాల్యాదులచే నలంకృతులై తోడివెయ్యురకుఁ గొన్ని యొసఁగి వానింజూచి మాలకరీ ! వర మెయ్యది గోరెద వనిన నతండు వినయ వినమిత శిరస్కుండై

క. నీపాద కమల సేవయు,
నీపాదార్చకులతోడి నెయ్యమును, నితాం
తాపారభూతదయయును,
దాపసమందారఁ నాకు దయసేయఁగదే! భాగ.

అని వేఁడినఁ గృష్ణుం డట్ల యగుఁగాక వెండియు శ్రీయును వంశాభివృద్ధియు బల మాయుస్సు యశస్సు కాంతి కలుగుఁ గాక యని వరం బిచ్చి యన్నతోడ రాజమార్గంబునఁ బురంబుఁ జూచుచుఁ బోయెను.

## శ్రీకృష్ణుండు కుబ్జకు సౌందర్య మిచ్చుట.

ఇట్లు పోవుచు మార్గమధ్యంబున నానావిధలేపనంబులను పాత్రలం గొని చనుదెంచు నొకయువతిని నడ్డియు గూనియు వంకర మెడయుఁ గల ముమ్మొంక మేనిదానిఁ గుబ్జం గని నవ్వుచుఁ గృష్ణుం డిట్లనియె. ఓసి సుందరాంగీ! నీ వెవ్వతెవు? ఎవ్వరిదానవు? ఎవ్వరికీ లేపనంబులఁ గొనిపోయెదవు? వీనిని మాకిమ్ము, నీకు శీఘ్రకాలము నంద శోభనం బగు నని హరి యిట్లనియె.

అందగాఁడా! నన్నుఁజూచి యేల నవ్వెదవు? లోకములోని వారికందఱకు నీవలెఁ జక్కఁదనం బెట్లుండినచ్చును? నేను కంసునకు నిష్టురాలైన దాసిని. లేపనంబుల సమకూర్చు విద్యయందు సమర్థురాలను. నా లేపనంబుల రాజు మిక్కిలి మెచ్చుచుండు. నా పేరు త్రివక్రయందురు. ప్రాయపు వారికిఁగాక వీనినిమఱి యెవ్వరి కిత్తును. కావున మీరు వీనిని గొనుఁడని తదీయరూప మధురాలాప హాస విలాస కటాక్షంబుల మోహితచిత్తయై వారి కిరువురకును నా యంగరాగంబు లొసంగె. తమ నైజకాంతులఁ దడఁబాటు గలిగించు నా కలపంబులఁ బూసికొని వారును శోభిల్లిరి. అంతఁ గృష్ణుండు హృష్టుండై దాని దేహంబుఁ జక్కఁజేయఁదలఁచి దాని మీఁగాళ్ళను దన చరణంబులఁ ద్రొక్కిపట్టి గడ్డంబున కిరువంకలఁ జేతులువైచి చక్క మీఁదికి నెగయనెత్తుటయు నది నడుమున నొమ్మున మెడ యందుఁ గల వంపులన్నియుఁ దీరి వరారోహయు సింహమధ్యయుఁ బృథుపయోధరయునై ప్రమదోత్తమయై సుందరాకారంబు వహించి నిలిచె. కృష్ణుండు దాని నిఁక నీత్రోవఁ బొమ్మని చెప్పి యావలఁబోఁ జొచ్చె. అదియుఁ గృష్ణుని కొంగొడిసిపట్టి వీరుఁడా మనోహరుఁడా!

మాయింటికి రమ్ము. నీవు నా మనస్సు మథించుచున్నాఁడవు. నిన్ను విడువ మనస్సు రాకున్నది. నాయం దనుగ్రహింపుమని ప్రార్థింప నన్న ముఖంబును దోడిమిత్రులముఖంబును జూచి నవ్వుచు దానితో నిట్లనియె. జవ్వనీ! మేము వచ్చినకార్యంబు సాధించి పదపడి పురుషుల హృదయతాపంబడంచు నీయింటికి వచ్చెద. ఈయూర గృహంబులేని పాంథులమైన మాకు నీవేకదా పరమాశ్రయము. పొమ్మని మంచి మాటలచే దానిని సమాధానపఱిచి పుచ్చెను.

క. కొంచెము మంచి గుణంబు గ్ర
హించుచు స్త్రీపురుషశూద్ర పృథివీసురులం
చెంచక భేదముఁ దమి ర
క్షించుట శీలంబ యగును శ్రీహరి కెప్పున్.

వా రావల నంగడి వీథులవెంటఁ బోవుచుండి వైశ్యోత్తములును నానావిధములైన కానుకలు తాంబూలహారాదులు తమ కొసంగిన గ్రహించి కృష్ణుండు ధనుశ్శాల యెందున్నదని పౌరుల నడుగుచుఁబోయి యాశాలఁ జొచ్చి యింద్రధనుస్సుఁబోలి యద్భుతంబు గొలుపు నా చాపంబుఁ జూచి యందున్న కావలివారు వలదువలదని నివారించుచున్నను వినక యెడమచేత దాని నవలీల లాగి యెక్కుపెట్టిన నదియు నిమిషంబున నేనుఁగు విఱిచిన చెఱుకుగడవోలె ఫెళఫెళ ధ్వనులు భూమ్యాకాశంబు నిండ వినువారు చెవుడ్పడఁ గంసుని గుండెలు పగుల విఱిగె. అదిగని కావలిభటులు కోపంబున రేఁగి రామకృష్ణులఁ బట్టుకొన యత్నించి పైపడుటయు వారు లోఁబడక క్రుద్ధులై యావింటి తుంటలచే నాతుంటరుల నెల్లఁ జావమోఁది కంస ప్రేరితంబైన సైన్యంబును రూపుమాపి ధనుశ్శాలవిడిచి వచ్చి పురసంపదఁ జూచి సంతోషించుచుఁ బోవుచుండఁ బౌరులు వారి బలపరాక్రమంబులును రూపతేజః ప్రాగల్భ్యంబులును వీక్షించి వీరు దేవోత్తములని యెంచిరి. ఇట్లు వారు పట్టణంబున స్వేచ్ఛావిహారంబు గావించుచుండ సూర్యుం డస్తమించుటయు గోపాలురతోడ రామకృష్ణులు తము విడిసిన చోటికి వచ్చిరి. తక్కిన దేవతల నెల్ల వదలి

శ్రీమహాలక్ష్మి యెవ్వని గాత్రంబు నాశ్రయించె నట్టి గాత్రంబును జూచుకతనఁ గృష్ణుఁడు వ్రేపల్లెవిడిచి వచ్చు సమయంబున విరహతాప భరంబున వేఁగు గోపిక లేమని యాశీర్వదించిరో యా యాశీర్వాదంబు లెల్లఁ బురంబునకుఁ బురంబునవారికి సత్యమై ఫలించె. రామకృష్ణులు కాలుసేతులు కడుగుకొని యారాత్రి క్షీరాన్నంబు భుజించి మఱునాఁడు కంసుఁడు చేయఁదలఁచిన కార్యంబెఱింగి సుఖనిద్రం గావించిరి.

రామకృష్ణులఁ దలఁచి భయపడు కంసునకు దుశ్శకునంబు లగుట.

కంసుండు రామకృష్ణులు ధనుర్భంగంబు గావించుటయుఁ దాను బంపిన సైన్యంబును వధించుటయు లోనగు వారొనర్చిన కార్యంబులఁ దలఁచి తలఁచి భయంబునకుఁ గన్నుమూయక మూసిన కలవరింతలఁ గళవళించి లేచుచు దీర్ఘజాగరణంబు గావించె. ఆ రాత్రి యంతయు వానికి మృత్యుదూతలైన యపశకునంబులె కానవచ్చుచుండె. అద్దంబునందును జలంబులందును దననీడ *శిరస్సు లేనిదై కానవచ్చె. అసత్యంబయ్యె నాకాశంబున నిరువురు చంద్రములగపడిరి. తననీడఁ జూచిన దానియందు రంధ్రంబులు దోఁచె. వీనుల వ్రేళ్లుంచుకొనిన లోని ప్రాణశబ్దంబుఁ గుయ్యని వినరాదయ్యె. చెట్లన్నియు బంగారు చెట్లవలెనయ్యె. బురదయందుఁ బాదంబులుంచిన నడుగులు గోచరింపవయ్యె. పీనుఁగును గౌఁగిలించి నట్లును, గాడిదనెక్కి పయనించినట్లును, దామరతూండ్లను దినినట్లును, నూనె తలంటుకొన్నట్లును, దిగంబరుండై నట్లును, దాసాని పూలదండలు ధరించినట్లును, గల గనుచుండె. ఇట్లు నిద్రలందును మేలుకొన్నప్పుడును ననేక దుష్టశకునంబులం గాంచి కంసుండు చావుభయమున నిద్రలేక తపించుచుండె

అంతట సూర్యుం డుదయించుటయుఁ గంసుండు నగరు వెడలివచ్చి మల్లక్రీడా మహోత్సవంబు సాగింపఁ బూనె. భృత్యులు రంగస్థానంబును జక్కఁగ నలికి చందనాది సుగంధ ద్రవ్యములఁ జల్లిరి. తూర్యభేరీ ధ్వనులెసఁగె. మంచెలన్నియుఁ గుసుమ దామంబు

లచే నలంకృతంబులయ్యె. ధ్వజము లెత్తిరి. తోరణములు కట్టిరి. పౌరులు జానపదులు బ్రాహ్మణ క్షత్రియాదులు వారివారి యోగ్యాసనంబులఁ గూర్చుండిరి. కంసుండు మంత్రిసహితుండై రాజయోగ్యమైన మంచెయందుఁ బరిదూయమాన మానసుం డగుచు మండలేశ్వర మధ్యంబునఁ గూర్చుండె. జెట్టులును నలంకరించుకొని మత్తులై తూర్యఘోషంబులతో మల్ల తాలంబులతో నుపాధ్యాయ సహితులై రంగప్రవేశంబుఁ గావించిరి. చాణూరముష్టికులును శలతోసలులును మనోహర వాద్యంబులతో మల్లకూటంబుఁ జొచ్చిరి. కంసుండు పిలిపించిన మల్లాదులు తమ తెచ్చిన కానుక లతనికి నర్పించి యొకచో మంచెలపైఁ గూర్చుండిరి.

## శ్రీకృష్ణుండు కువలయాపీడ మను గజంబును వధించుట.

ఇంతలో రామకృష్ణులు స్నానాదిక్రియలు నిర్వర్తించి మల్ల దుందుభి ధ్వానంబు లాకర్ణించి దానింజూచు వేడుక రంగద్వారంబు కడకువచ్చిరి. ఇట్లు వచ్చిన తమ్ముఁ జూచి మావటివాఁడు ద్వారమున కడ్డంబుగఁ గువలయాపీడమను గజంబును నిలుపుటయు వాని తలం పెఱిఁగి కృష్ణుండు కట్టిన పుట్టంబును దట్టివలె నెగయఁజెక్కి మోమున వ్రేలాడు నుంగరపు ముంగురుల వెనుకకుఁ ద్రోచి ముడిచిమేఘ గంభీర భాషణంబుల నా మావటితో నిట్లనియె.

ఓరి మావటీ! నీయేనుఁగు నావలఁ దొలఁగఁదోలుము, రంగము లోనికిఁ బోవ మాకు వేగముగఁ దెరువిమ్ము. ఇయ్యవేని నిన్నును నీ యేనుఁగును బీనుఁగులఁ జేసెదనని బెట్టిదంబులాడిన వాఁడు కోపించి దంతావళంబును బ్రేరించి కృష్ణునిపైఁ గవియించె. ఆ కరికాఁడును బరి కొని యంకుశము పోటుల రోషించి ప్రళయకాల యమునివలెఁ గృష్ణునిపై నడరి తొండంబున న య్యదుమండను బట్టఁ బోవ నొడికంబునఁ దప్పించుకొని కృష్ణుండు దాని నెగసి తన్ని రెండు కాళ్ళనడుమఁ దూట్టి యుండె. అదియును నిటునటుచూచి యెందును గానక వాసనపట్టి తొండంబును గాళ్ళసందునఁ జొనుపుటయు దానితోఁకపట్టుకొని యిరు

వది యేనువిండ్ల దవ్వు వెనుకకులాగి యది కుడిప్రక్కఁ దిరిగినఁ దా నెడమప్రక్కఁ దిరుగుచు నది యెడమవైపు దిరిగిన దాను గుడివైపుదిరుగుచుఁ బట్టీక యూజగజెట్టి దూఁడలనాడించు బాలుని లీల దాని నాడించుచు విడిచి యువ్వనవచ్చి దానినొక గ్రుద్దు గుద్దె. ఇట్లు గ్రుద్దిన నది రోషించి కాలఁదన్నుటయు నా తాఁకు తప్పించుకొని నేలకు మ్రొగ్గినఁగృష్ణుండుపడియెనని తలంచి యదికొమ్ముల హుమ్మనిక్రుమ్మె. ఇంతలోఁ గృష్ణుండు దొలఁగుటయు దాని కొమ్ములు నేలలోఁ గ్రుచ్చుకొనియె. అట్లు తన పరాక్రమమ్ము వ్యర్థమ్మగుటయు మావటి ప్రేరింపఁగనలి యా యేనుఁగు కృష్ణుపై మరలఁ గవిసిన నాయనయు దాని తొండంబు పట్టుకొని నేలఁ బడఁద్రోచి కాలఁద్రొక్కి దంతంబు లూడఁ బెఱికి దాన నా యేనుఁగును బీనుఁగుఁ జేసి మావంతుతల వ్రయ్యలు చేసి చంపి గజదంతంబును మూఁపున ధరించి చిఱు చెమటలును మదరక్త బిందువులును మోము నలంకరింప వీరలక్ష్మీ విరాజితుండై భాసిల్లె.

అంత రామకృష్ణులు దంతి దంతాయుధులై గోపాలకులు కొందఱు కూడరా రంగస్థలంబుఁ జొచ్చిరి. ఇట్లు చొచ్చిన కృష్ణుండు మల్లులకుఁ బిడుగై, నరులకు నరవరుఁడై, కాంతలకు మూర్తిమంతుఁడైన కంతుఁడై, గోపకులకు స్వజనుండై, దుర్జనులకు శాస్తయై, తండ్రికిఁ బసిబాలుఁడై, కంసునకుఁ గాలుఁడై తత్త్వజ్ఞానములేని వారి కపర్యాప్తుఁడై, యోగులకుఁబరతత్త్వమై, వృష్ణులకుఁ బరదేవతయై కానవచ్చె.

## రామకృష్ణులు చాణూర ముష్టికాది మల్లుల వధించుట.

కువలయాపీడంబు హతంబౌట నాలకించియు, మహాభుజులై, యుత్తమ వేషధారులై, నటులవలెవిచిత్రవేషాంబరాభరణహారులై, లావణ్యాతిశయంబునఁ జూపఱు మనంబు చూఱఁగొను వారునైన రామకృష్ణులఁ దిలకించి ధీరుండయ్యుఁ గంసుండు మనఃక్షోభంబు వహించె. ఆ యుత్తమపురుషులం జూచి మంచెల యందున్న పౌరులు జానపదులు హర్షాతి శయంబునఁ గనులు మోము నెగయనెత్తి

నిశ్చంచల దృష్టులఁ దదీయ ముఖచంద్ర గతంబైన లావణ్యా సుధార సంబుఁ గ్రోలి గ్రోలి జిహ్వలఁ జవి చూచి చూచి నాసికల మూర్కొని మూర్కొని బాహువుల నాలింగనంబుఁ గావించి కావించి పరస్పర మిట్లు సంభాషింపఁ జొచ్చిరి.

ఓహో మన మెట్లనుకొంటిమో యేమని వింటిమో దానిని వీరి రూపగుణలావణ్యా మాధుర్యప్రాగల్భ్యంబులు స్మృతికిఁ దెచ్చుచున్నవి. వీరు భగవంతుఁడైన సాక్షాన్నారాయణుని యంశంబున వసుదేవు నింటఁ బుట్టినవారు. ఇతఁడే కదా దేవకి కడుపు చల్లగఁ బుట్టి గోకులంబునకుఁ గొనిపోఁబడి రహస్యంబుగ నందు నింటఁ బెరిఁగినవాఁడు. ఇతఁడే కదా పూతనను సుడిగాలి రక్కసుని ధేనుక కేశులను, శకట్యాదులను జంపి మద్దులఁగూల్చిన వాఁడు. ఇతఁడే కదా గోగోపాలకులఁ గారుచిచ్చునుండి రక్షించి కాళియు నణఁచి యింద్రుని నిర్మదుఁ జేసినవాఁడు. ఇతఁడే కదా యేడుదినము లొక కేలఁ బర్వతంబెత్తి గోకులంబును గాలివాననుండి రక్షించినవాఁడు. చిఱునగవు చూపులచే సదావికసితంబైన యీయనమోము వీక్షించి కదా సంతోషంబున గోపిక లేశ్రమంబు లేక యనేక తాపంబుల నుండి తరించిరి. ఈయన రక్షింప యదుకులం బవ్యాకులంబై మిక్కిలి విస్తరించి శ్రీయశోమహత్త్వంబుల శోభిల్లఁ గలదు. క్రొందమ్ముల కన్నదమ్ములైన నేత్రమ్ములు గల యల్లవాఁడె సుమీ శ్రీకృష్ణున కన్నయైన బలరాముఁడు. ఆయనయే ప్రలంబ బక వత్సకాదుల సంహరించినవాఁడు. అని యిట్లు జను లాడుకొను రవంబును దూర్యనినాదంబును గలిసి పరఁగుచుండఁ జాణూరుండు రామకృష్ణులం జూచి యిట్లనియె.

ఓరి కృష్ణా! యోరీ రామా! మీరు వీరులని బాహుయుద్ధంబున సమర్థులని విని రాజు మిమ్మిటకుఁ బిలిపించె మనోవాక్కర్మంబుల రాజునకుఁ బ్రియంబు సేయువారు శ్రేయస్సు గందురు. విరుద్ధవర్తనులు విపరీతఫలంబు లొంది నశింతురు. మీరు కాఁపడవులఁ బశువులను మేపుచు నొకరితో నొకరు బాహాబాహి పెనఁగులాడి యూరితేఱి

యుండుట నిశ్చయము కావున మీరును మేమును బెనఁగులాడి రాజునకుఁ బ్రియంబుఁ గూర్తము. రాజు సర్వభూతమయుండు గావున రాజు సంతోషించిన సర్వభూతంబులు సంతోషించు. అనిన విని కృష్ణుండు బాహుయుద్ధము తనకు నభిమతంబగుట నభినందించుచు దేశకాలోచితంబుగా నతని కిట్లనియె. అయ్యా మల్లుఁడా! మేము కాంతారంబులఁ బశుసంతానంబు మేపు వనచారుల మగుట భోజరాజు నేలుబడి లోనివారమే. కావున రాజునకుఁ బ్రియంబు సేయుట మాకును గర్తవ్యమే. అది మాకుఁ బరమానుగ్రహము. అయినను మేము బాలురము కాన బలంబునఁ బ్రాయంబున మా సమానులగు వారితో యథోచితంబుగఁ గ్రీడించుట తగును గాని మీయట్టి వారితోఁ దగదు. మాయట్టి బాలురతో మీరు బాహుయుద్ధమునకుఁ దొడరిన నీ మల్లసభాసదులెల్ల నధర్మంబునకుఁ బాలుపడుదురు. అనినఁ జాణూరుఁడా మాటల నెఱజాణ కిట్లనియె. మీరు బాలురును గారు పసికూనలును గారు. బలుఁడు బలిష్ఠులలో మేటి. నీవో వేయి యేనుఁగుల బలముగల దంతావళ మవలీల నంత మొందించితివి. ఇట్టి దిట్టలు మీరు గట్టిబలులు గాక బాలు రెట్లైతిరి? బలిష్ఠులు బలిష్ఠులతో యుద్ధ మొనర్చుటయం దన్యాయంబు కానరాదు. కావునఁ గృష్ణా నీవు నేను బోరుదము. ముష్టికుండు బలరామునితోఁ బోరువాఁడు.

అనిన నమ్మధుసూదనుం డట్లకా నిమ్మని నిశ్చయించుకొని చాణూరుతోడ మల్లసంగ్రామంబున కుపక్రమించె. బలరాముఁడును ముష్టికుం దొడరె. అంతఁ గృష్ణచాణూరులు నాలీఢపాదులై నిలిచి భుజంబులు తోడ లప్పళించి యొండొరులపై దృష్టులు నిగిడించి కుడి యెడమలుగాఁ దిరుగుచుఁ గేలుసాఁచినఁ గేలఁబట్టి లాగుచుఁ, గాలు చాఁచినఁ గాలు కాలు పెనవేసి యీడ్చుచుఁ, బిడికిలి పిడికిలి, మోఁకాలు మోఁకాలు, తలతల, ఱొమ్ము ఱొమ్ము దాఁకఁ గొట్టుచు, నొకరి నొకరు చుట్టి తిరుగుచుఁ, దిరుగునట్లుండి తటాలునఁ బైపడుచుఁ, బైపడిన విసరివైచుచు, వైచిన నేలఁబడక యెగసివచ్చుచు, వచ్చిన గుది

కాళ్లుకట్టి కూలద్రోయుచుఁ, ద్రోసినఁ బోక మరలి మెడపట్టుకొని వంచుచు, వంచిన రెండు కాళ్లనడుమఁ దూఱి యెత్తివైచుచు, నన్యోన్యంబు త్రోపులాడియుఁ, గ్రుమ్ములాడియుఁ, బెనఁగులాడియుఁ, గ్రుద్దులాడియుఁ, బరస్పరము మీఱు కోరిక లేరికలెత్తఁ బిఱుదివియక, జంకక, కొంకక, చిక్కక, స్రుక్కక, సరిసరిగ, సీమజోడుగ, నుద్దికుద్దిగ, వ్రేటునకు వ్రేటు, పోటునకుఁ బోటు, పాటునకుఁ బాటు, త్రోపునకుఁ ద్రోపుగ, సంగరం బొనర్చుచుండఁ జూచుచున్న పురాంగన లాబాలప్రౌఢుల యుద్ధంబుఁ జూచి దయార్ద్రహృదయలై యిట్లనిరి.

అయ్యో యిది యేమి యన్యాయము. కయ్యంబు వియ్యంబు నెయ్యంబు సమానులందుఁ జెల్లునందురు గాని యిట్లు బాలుని బలవంతునితోఁ బోరించు వా రుందురా? దీనివలన నీ రాజ సభ్యులకుఁ బాపంబు తప్పదు. రాజు నివారింపక యూరక తేరగానివలె వేడుక చూచు చున్నవాఁడు. కొండవలెఁ బెరిఁగి వజ్రసమానసారుఁడైన యీ జెట్టి యెక్కడ? యౌవనమును రాని యీముద్దులపట్టి యెక్కడ? ఈ యధర్మ మీసభాసదులఁ దప్పక కొట్టును నిజము. అధర్మ మెందు వర్తించు చుండు నందు బుద్ధిమంతులు నిలువరాదు.

ఆ. సభ్యదోష మెఱిఁగి చనరాదు సభలకు;
బుద్ధిమంతుఁ డట్లు పోయెనేని
తెలిసి తెలియదనినఁ దెలిసి పల్కకయున్నఁ,
దాఱుమాఱు పలుకఁ, దప్ప దఘము.

కట్టడి పగతునికిఁ బట్టీకఁ, యిట్టట్టు చుట్టిచుట్టి తిరుగు కృష్ణునెమ్మోముఁదమ్మిని గంటిరే నీటి బిందువులచే నావరింపఁబడిన తామర మొగ్గవలెఁ జెమట బొట్టులచే నెట్టు లున్నదో. అదిగోఁ గోపంబునఁ గన్నులఁ గెంజాయలొలుక నగవు జిగులు చిలుక ముష్టికుని గను రాముని వదన మెట్లున్నదో చూడలేదా? ఛీ! ఛీ! పురాపురుషుండైన శ్రీమన్నారాయణుండు మానుష వేషధారియై వచ్చియుండ నాయనను పరిభవించు సభ యిది యేటి సభ. ఉమాధవ

రమా సమర్చిత పదుండైన యీ మహాత్ముండు బలరామసహితుండై వేణువు వాయించుచు వన్యపుష్పంబుల ధరించి యావుల మేపుచు స్వేచ్ఛమైఁ గ్రీడించు వనభూము లేపో ధన్యములు. లావణ్యసారంబై తనకంటె నధికంబును దనకు సమంబును లేక, భూషణాదులు లేకయు స్వభావంబుచేతనే సుందరంబై, కీర్తిలక్ష్ములకు నేకాంతస్థానంబై, క్రొత్తక్రొత్తదై, పుణ్యహీనులకు లభింపనిదైన యీశ్వరు రూపంబు నేత్రపాత్రములచే సదా గ్రోలుచుండు గోపికలహహా యెంతటి తపం బొనర్చిరో కదా! ఔరా! వారు పిదుకునపుడు, దంచునపుడు, విసరునపుడు, సలుకునపుడు, నూడ్చునపుడును, గలయంపి చల్లునపుడును, బిల్లవాండ్రేడ్చునపుడు, వండునపుడు, వార్చునపుడు, నాడునపుడును, బాడునపుడుఁ, జేదునపుడు, దోడునపుడు, మోయునపుడు సర్వదాయనురాగయుక్తలై కృష్ణాయత్తచిత్తలై యానందబాష్పంబులు కంఠంబుల నడ్డగింపఁ గృష్ణగీతంబులనే పాడుచుందురుగదా. ధన్యలనిన వారే బో ధన్యలు. వారే లోకమాన్యలు. జేపట గోపాలురంగూడి యావులను దోలుకొని పోవునపుడును, మరల మాపట దోలుకొని వచ్చునపుడును శ్రీకృష్ణుండు వాయించు మురళినాదంబు విని యింటిపనులన్నియుఁ జాలించి విసవిస వచ్చి త్రోవలందు యీ గోపసుందరులీ యతిలోకదయావలోకంబైన మందహాస సుందర ముఖారవిందంబును గనులార నాపోవక చూచుచుందురుగదా. ఆహా వారెంత పుణ్యాత్మికలో!

అని యిట్లు మందయానలు మందలించుచుండ వారియాలాపంబులువిని దేవకీవసుదేవులు మోహంబునఁ దమబిడ్డల బలమెఱుంగని కతంబునఁ బుత్రస్నేహ శోకంబునఁ బరితపించిరి. ఇట్లు పురవనితలును జననీజనకులును దమకై భయపడుచుండ యోగేశ్వరుండును భగవంతుఁడునైన హరి శత్రువును హరింప సంకల్పించె. కృష్ణ చాణూరు లెట్లు పోరి రట్లు బలముష్టికులును బోరిరి.

అంతఁ గృష్ణుండు పిడుగుల వడువున బెడిదంబులగు పిడిగ్రుద్దుల యా మల్లుని దేహంబు నలిగులిగ దంచిన నెమ్ములు భగ్నమ్మ

లయ్యు నతండు పోటుడింపక పౌరుషంబున రోషంబునఁ బోరుచు డేగవలె మింటికెగిరి చివాలున రెండుముష్టులఁ గృష్ణుని ఱొమ్మున నడిచినఁ గృష్ణుండును బూలదండ తాఁకున నేనుఁగుఁబోలెఁ జలింపక యట్టె వానిం బట్టుకొని బట్టినపట్టువిడక గిరగిరపలుమఱుద్రిప్పి నేలపై మోఁదిన భూషణంబులు చెదరఁ దలవెండ్రుకలు వ్రేలాడ విగత జీవుండై యింద్రధ్వజంబువలెఁ గూలె. అట్టులే బలరాముఁడును ముష్టికుని దృఢముష్టుల మర్దించి విసరి నేల పయిం గొట్టిన ముక్కున నోట నెత్తురు గ్రక్కుచు వాఁడు పెనుగాడ్పునకుఁ బడు పెనుమ్రాఁకువలె గతాసువై పడిరి. అతనిపాటు గాంచి కూటుఁడను మల్లుండు తనపై నడరిన నొక్కపోటున రాముఁడు వాని నవలీల వధించె. అట్టులే శలుండనువాఁడు తోసలకుం డనువాఁడును గృష్ణు మార్కొనిన నెగసి కాలఁదన్నుటయు శిరంబులు వ్రక్కలై యా యిరువురు పీనుఁగులైపడిరి. ఇట్లు చాణూరముష్టిక కూట శల తోసలకులు చచ్చినఁ దక్కినమల్లులందు నిలువక ప్రాణభయంబునఁ బిక్కబలంబు కొలఁది పాఱిపోయిరి. అంతఁ దమ మిత్రులగు గోపాలురఁ బిలిచి రామకృష్ణులు వారితోడఁ దమకాలియందెలు ఘల్లుఘల్లుమని మొరయఁ దూర్యంబులు మ్రోగుచుండ రంగంబున నాట్యమాడిరి. కంసుండు దక్కఁ దక్కిన బ్రాహ్మణముఖ్యులు సాధువులు లోనగు చూపఱులు వారొనర్చిన కార్యమును మేలుమేలని మెచ్చిరి. ముదంబున హెచ్చిరి.

ఇట్లు మల్లులు కొండఱు చచ్చుటయుఁ గొండఱు పఱువిడుటయుఁ గాంచి తూర్యనాదంబు నిలుప నాజ్ఞయిడి తనభటులంజూచి కంసుం డిట్లనియె. యోధులారా! దుర్మదులైన వసుదేవనందనుల నూరు వెడలం గొట్టుఁడు. గోపాలకుల ధనంబెల్ల హరింపుఁడు. దుర్మతియగు నందుని బంధింపుఁడు. కొడుకులం జూచి సంతోషించు దుర్బుద్ధిని వసుదేవుని హింసింపుఁడు. పరపక్షాభిమానియైన యుగ్రసేను నతని యనుచరులతో వధింపుఁడు.

## శ్రీ కృష్ణుండు కంసు వధించుట.

అని యిట్లు కంసుండు కోపోద్రేకంబునఁ బ్రల్లదంబు లాడుచుండఁ గృష్ణుండు చివాలున నతఁ డున్న మంచెమీఁదికి లంఘించె. ఇట్లుగిరి తనకు మృత్యువునలె వచ్చు నా దేవకీనందనుఁ జూచి తటాలునఁ దానున్న మంచెపై లేచి కాలోచితకృత్యంబెఱింగిన కంసుండు ఖడ్గఖేటకపాణియై మింట గావా తిరుగు డేగవలెఁ గుడియెడమ యెడమకుడులుగాఁ దరవారి ద్రిప్పిత్రిప్పి జళిపించి విసరుచుండె. ఇట్లు తనపోటు తప్పించుకొన వాఁడు పడెడి పాటుఁజూచి యువిషహ్య పరాక్రముఁడైన కృష్ణుం డేమఱించి మీఁదదూఁకి కిరీటంబుఁ బడఁదన్ని వెండ్రుకలు పట్టుకొని గరుడుండు సర్పమ్మును జిమ్మువిధమ్మున విసరి రంగ మధ్యమునవైచి తోడన మీఁదదుమికి దేహంబు నలియఁగ్రుద్ది వధించి సింగం బేనుంగు నీడ్చునట్లు లాపీనుఁగునీడ్చి యావలఁ బాఱవైచె. ఇట్లు చచ్చినఁ గంసుంజూచి లోకులెల్ల హాహాకారంబులు గావించిరి. కంసుండును బ్రాణభీతి సర్వదా పానము చేయునపుడు మాటలాడునపుడు తిరుగునపుడు నిద్రించునపుడు శ్వాసము విడుచునపుడును నెదుట నీశ్వరుండైన చక్రాయుధుం డుండునట్లు చూచుచుండెడి వాఁడు కావున మరణానంతర మెట్టివారికి దుర్లభంబగు హరిరూపంబె వహించె. హతుండైన కంసుంజూచి యుతని సోదరులు కంకన్యగ్రోధాదులైన యెనమండ్రు కుపితులై పగదీర్చ యున్న ఋణంబు పాపికొనఁ గృష్ణుపైఁ గవిసిన బలరాముఁ డతిరోషంబున నందున్న యినుపకట్ల గుదియఁగొని వ్రేటున కొక్కనిగ నెనమండ్రను సింహంబు పశువులవధించునట్లు వధించె. అంత మింట దేవదుందుభులు మొరసె. బ్రహ్మేశాది సురసంతానంబు పుష్పవర్షంబుఁ గురిసె. అచ్చరల నాట్యంబు నెరసె. దేవతల ప్రశంసా వాక్యంబులు పెరసె.

ఆ మరణించినవారి భార్యలు లోనగు స్త్రీలతి దుఃఖితలై తలలు ఱొమ్ము మోఁదుకొనుచు వారు పడియుండిన తలంబునకువచ్చి పతులఁ గౌఁగిలించి నానావిధంబులఁ బనివి పనివి యిట్లు విలపించిరి.



శ్రీకృష్ణుండు కంసు వధించుట.

హా నాథా! హా ప్రియుఁ! హా ధర్మజ్ఞా! హా దయాశీలీ! హా పత్నీవత్సల నీ వొక్కఁడవు మరణించుటచే మేమును నీయిండ్లు బిడ్డలుగూడఁ

జచ్చితిమి. పతీ! నీ వొక్కఁడవు హతుఁడవగుటచే మానవతె నీ పురియు ననాథయై సర్వమంగళ కార్యరహితయై శోభిల్లకున్నది. ప్రాణేశ్వరా! నిరపరాధులైన వారికి నీవు ద్రోహంబుఁ జేసితివి. దాన నీ కీగతి సంభవించె. భూతద్రోహము చేయువాఁడెవ్వఁడుసుఖించు? మనోహరా! యీ కృష్ణుండు సమస్తజగంబు. సృష్టింపను రక్షింపను ద్రుంపను గర్తయైయుండ నీయనయెడ నిష్కారణము యలిగి తిరస్కరించితివి. కానఁగదా నీ కీ కష్టదశ లభించె అని యేడ్చుచుండఁ గృష్ణుండును దుఃఖించుచున్న సతులనెల్ల నూరార్చి యర్ధ్వకృత్యంబు లెల్ల నిర్వర్తింపించె. రామకృష్ణులు తల్లిదండ్రుల బంధనములు వదలించి వారి పాదంబులకుఁ బ్రాలి నమస్కరించిరి. దేవకీవసుదేవులు వారు జగదీశ్వరులని యెఱిఁగి వందనంబు చేయుచున్న వారల నాశీర్వదింపక యూరక నిండారు ప్రేమ నానందజలసందోహంబు గాఱఁ గౌఁగిలించిరి.

## రామకృష్ణులు తల్లిదండ్రుల నూరార్చుట.

వారు తమ్మూరక కౌఁగిలించి యాశీర్వదింప కుండు కారణ మూహించి శ్రీకృష్ణుండి ట్లనియె. వీరు నాతత్త్వంబును మనస్సునఁనిలిపి యున్నవారు. నన్ను వీరు పుత్రిస్నేహ సంతోషంబు కోరిరి గాని మోక్షంబు గోరినవారుకారు, అయినను వీరికి ముక్తినొసంగెదనని నా జన్మసమయంబునఁ జెప్పితి. దానికి వీరిప్రయత్న మక్కఱయేలేదు. నాతత్త్వమందు వీరుమనస్సు నిలిపి విరాగులై రేని వీరు కోరిన పుత్రి స్నేహసంతోషంబు వీరికిఁ గలుగదు. అది కలుగనీయకుండరా దని తలఁచి జనమోహినియైన తనవైష్ణవమాయచే వారిని ముంచె. ఇట్లు వారిని మాయామగ్నులఁజేసి యన్నతోడ వారికి మ్రొక్కి యమ్మాయని యప్పాయని వారి యొడిలోఁ గూర్చుండి ముద్దులు గురియుచుఁ బ్రీతియుప్పతిల్ల నుల్లంబు రంజిల్లఁజేసిరి. ఇట్లు వారికిఁ దమయందుఁ బుత్రిస్నేహం బుదయింపఁ జేసి కృష్ణుం డిట్లనియె.

తండ్రీ! మాబిడ్డలు బాల్యమందును బౌగండమందును గైశోర దశయందును జేయు చేష్టలు నాడు నాటలు నద్దులు ముద్దులు నున్న

జెప్ప డెప్పుడు విందుమో కందుమోయని మీరెంతో వేడుకపడు చుండినను నట్టి సంతోషంబు మీకుఁ గలిగింప మేము నోఁచమైతిమి. పుణ్యంబు చేసినబిడ్డలు కన్న తల్లిదండ్రులయొద్ద నుండి వారు వాత్సల్యంబున లాలించి పాలించి బుజ్జగించి చనవునఁ బెంప సంతోషంబునఁ బెరుఁగుదురు. దురదృష్టులమైన మాకు మీయొద్దనుండి యట్టిసంతోష మనుభవించు భాగ్యంబు చేకూరదయ్యె. నాయనా! సమస్త పురుషార్థములు సాధించుటకు దేహమేకదా సాధనము. అట్టి దేహమునొసఁగి కనిపెంచి పెద్దచేసిన తల్లిదండ్రుల ఋణంబు నూఱు సంవత్సరములు బ్రదికియు బిడ్డలు తీర్చుకొనఁ జాలరు. ఎవ్వఁడు సమర్థుఁడయ్యుఁ దన దేహకష్టమున నొండె ధనదానాదుల నొండెఁ దల్లి దండ్రులకు జీవనంబుఁ గల్పింపఁ డట్టి పుత్త్రుని మరణానంతరమున యమదూతలు నరకంబునఁ ద్రోచి వానిమేని మాంసంబు వాని చేతనే తినిపింతురు. మే మీచిన్నవయసున మీకు మఱియేవిధముగ నుపకరింపను నుపచరింపను జాలకున్నను మమ్ములను జూచి సంతోషించునంత మాత్రమైనను గలిగింపని మాజన్మ మేమిజన్మము? తల్లిని, వృద్ధుఁడగు తండ్రిని, పతివ్రతయగు భార్యను, శిశువైన కొడుకును గురువును, నాపదనొంది తన్నుఁజేరిన బ్రాహ్మణు, భరింపశక్తుఁడయ్యు యథాశక్తి నెవ్వఁడు భరింపఁడో వాఁడు నడపీనుఁగు బ్రతికియుఁ జచ్చినవాఁడే. కంసునిచే మీరు పడరాని పాట్లెల్లఁ బడుచుండ మాకు సామర్థ్యము లేమిని మీకెట్టి శుశ్రూషయుఁ జేయఁజాలక దినంబులు వ్యర్థంబుగఁ గడపితిమి. దుష్టాత్ముండైన కంసుండు మిమ్మెంత కష్టపెట్టెనో కదా. అట్టి యక్కఱవేళకు మీ కాదుకొని పరిచర్య సేయని మేము నీకబిడ్డలమే. మా పరాధీనస్థితి నాలోచించి తల్లిదండ్రులారా! మమ్ముక్షమింప నాలోచింపుఁడు. అని యిట్లు మాయా మనుష్యుండైన హరి పల్కిన దేవకీవసుదేవులు పుత్త్రమోహంబున వారి నొడిలో నుంచుకొని కౌఁగిలించి స్నేహపాశబద్ధులై కన్నుల జాలు వాఱు జలంబుల వారి శిరంబులు దడుపుచు నశ్రుకంఠులై యేమియుఁ బలుక నేరకుండిరి. అంతట వారి నిరువురఁ బలువిధ

శుల నూరార్చి కృష్ణుండు మాతామహుండైన యుగ్రసేనుం జేరి యిట్లనియె.

తాతా! యాదవులమైన మేము యయాతిశాపంబున సింహాసనమెక్క నర్హులముగాము. కావున నీవే రాజవుకమ్ము. మేము నీ ప్రజలలోనివారము. మేము మీభృత్యులమైయుండ మీకు దేవతలును దలవంచి కప్పంబులఁ జెల్లింతు రన నిఁకఁదక్కిన రాజుల మాట చెప్పనేల? అని యుగ్రసేను రాజుగా సింహాసనాధిష్ఠితుం జేసి కంసభయంబున నానాదేశంబులకుఁ బాఱి చనటుంబడు జ్ఞాతులను నంధక యదు వృష్ణి దశార్హ కుకురవంశజాతులనెల్లఁ బిలిపించి వారికి వలసిన ధనమిచ్చి వారివారి యిండ్లయందు వారిని బ్రవేశపెట్టె. వారెల్ల రామకృష్ణులవలనఁ దమదుఃఖంబులం బాసి లబ్ధమనోరథులై తద్భుజరక్షితులై పూర్ణకాములై సదయదరహాసవీక్షణ వికాసంబైన ముకుంద సుందర వదనారవిందంబు దినదినము దర్శించుచు నానందంబున మునుఁగుచు సుఖంబుండిరి. అందు వృద్ధులును బలురామ నందనందను సుందర ముఖారవిందామృతంబును నేత్రపాత్రంబులఁ గ్రోలి క్రోలి మరలఁ బ్రాయము తేజోబలములు గలవారై యుల్లసిల్లిరి.

అంత దేవకీ రోహిణీనందనులు నందునిఁజూసి యిట్లనిరి. తండ్రీ! నీవును మాయమ్మ యశోదయుఁ బరిపూర్ణ స్నేహాతిరేకమ్మున మమ్ముఁ గాచి ప్రోచి లాలించి పెంచి పెద్దవారిం జేసితిరి. తల్లిదండ్రులకుఁ దమ దేహమునందలి ప్రీతికంటె బిడ్డలయందలి ప్రీతి మెండు కదా? కన్నతల్లిదండ్రులు పోషణరక్షణంబుల నసమర్థులై చేవిడిచిన సమయంబున నోరెఱుంగని కూనలను దమ కన్నబిడ్డలవలె నెవరు రక్షింతురో వారే తల్లిదండ్రులు గాని పోషింపలేనివారు కన్నంతమాత్రమున వచ్చిన లాభమేమి? అక్కఱ కాదుకొన్నవారే కదా చుట్టములు. అట్టి మీ ఋణంబు మేమేవిధముగఁ దీర్చుకొనఁ గలము. తండ్రీ! మన మందఱ మిందింతకాలము తడయుటకుఁ దల్లి లోనగువారొంటిగ నెంత సంతాపించుచున్నారో. ఇప్పటికి మీరైనను మరల మందకుఁ బొండు. ఇచ్చటి సుహృజ్జనులకెల్ల బ్రియంబు సమకూర్చి

మామ్మోడఁ బాసిన తాపమున దుఃఖించు మిమ్ము నచ్చటి బంధువుల నెల్లఁ జూడవచ్చెదము. అని నందునిఁ దోడిగోపాలురను నూఱడించి వారికి నానావస్త్రాభరణంబులును గంచుపాత్రములు లోనైనవి సాదరంబుగ నిచ్చిన నందుండును వారిని విడిచి పోఁజాలక యనురాగ వివశుండై నీరునిండిన కన్నులతోడఁ దోడివారిం గూడి మందకరిగె.

## రామకృష్ణు లుపనీతులై గురుకులవాస మొనర్చుట.

వసుదేవుండును బ్రాహ్మణసమేతుండైన గర్గాచార్యుచే రామకృష్ణులకు యథావిధి నుపనయనం బొనరించి బ్రాహ్మణులకుఁ గాంచనమాలాలంకృతంబులై ధవళవస్త్రసమేతంబులైన యావులను దక్షిణలతోడ దానంబుచేసె. పూర్వము రామకృష్ణుల జన్మంబునఁ దాను దానమొనర్ప సంకల్పించిన వానిని స్మరించి యుపనయనంబునఁ గంసుండు హరించి తన యావులఁ దెప్పించి వానిని దానం బొసంగె. ఇట్లు రామకృష్ణులు లబ్ధసంస్కారులై ద్విజులై సువ్రతులై యదుకులాచార్యుచే గాయత్రి నుపదేశంబు నొంది బ్రహ్మచర్యవ్రతం బనుష్ఠింపఁ జొచ్చిరి. సమస్తవిద్యల కునికిపట్టులై సర్వజ్ఞులై జగదీశ్వరులై స్వతస్సిద్ధంబైన నిర్మలజ్ఞానంబు గలవారయ్యు మానవ చేష్టానటనంబునఁ దమ తత్త్వంబు దాఁచువారగుటచే గురుకులవాసంబు చేయ నంగీకరించి యవంతీపురంబునఁ గాఁపురం బుండు వాఁడయ్యుఁ దత్కాలంబునఁ గాశీనగరమం దుండు సాందీపనుఁడను బ్రాహ్మణు నొద్దకుఁ జని యాయనను నాశ్రయించి జితేంద్రియులై నిర్వంచనంబుగ భక్తిపురస్సరంబుగ దైవం బనుభావంబున నాయనకు శుశ్రూష గావించుచుండిరి. సాందీపనియు వారి నిర్మలభావంబునకు నడవడికి సంతోషించి సమస్త వేదవేదాంగంబులు నుపనిషత్తులు సరహస్యంబుగ ధనుర్వేదంబును ధర్మ న్యాయశాస్త్రంబులును దర్కవిద్యయు సంధివిగ్రహయానాసనద్వైధీభావ సమాశ్రయంబు లని యాఱు విధములైన రాజనీతియు సర్వంబు బోధించె. సర్వవిద్యాప్రవర్తకులైన యా బాలురును నొక్కసారి గురువుచెప్పినంతన గ్రహించుచు నఱువది నాలుగు విద్యల

నఱువది నాలుగు దినంబుల నేర్చి గురునితో నిట్లనిరి. ఆచార్యవర్య! మీ కృపవలన విద్యావంతులమైతిమి. గురుదక్షిణ నేమి సమర్పింపవలయు? మీ యభిప్రాయం బెఱింగింపుఁ డనిన వారి యద్భుత మహిమయు నతిమానుష చరిత్రమును జూచి యా బ్రాహ్మణుండు తన భార్యతో నాలోచించి కొంత కాలమునకు మునుపు సముద్రంబునఁ బ్రభాస తీర్థంబునఁ మునిఁగి హతుఁడైన తన సుతుని గొనితెండని వేఁడె. వారు నట్ల కానిమ్మని మహారథు లొక రథంబుపై నెక్కి చక్కఁ బ్రభాసతీర్థంబునకుఁబోయి యచ్చట సముద్ర తీరంబున నించుక విశ్రమించిరి. వారిని జూచి సముద్రుండు వీరు దేవమూర్తులని తగినరీతి సమ్మానించినఁ గృష్ణుండును సాగరా! మాగురుపుత్రుండీ తీర్థంబున స్నానమొనర్చునెడ నీయల లాబాలకు నీ లోనికిఁ గొనిపోయె. వానిని మరల నిమ్మనిన సముద్రుఁ డిట్లనియె.

దేవా! మీ గురు కుమారు నేను హరించినవాఁడను గాను. నా జలంబుల లోపలఁ బాంచజనుఁ డను మహాసురుఁ డొకఁడు శంఖ రూపధరుఁ డున్నవాఁడు. వాఁడు మీ గురుపుత్రు హరించె ననిన విని వారును జలంబులలోఁ జొచ్చిరి. ఇట్లు చొచ్చి కృష్ణుం డాయసురు సంహరించి బాలుంగానక వాని యంగంబునఁ బుట్టిన పాంచజన్యం బను శంఖంబుఁ గైకొని బాలుండు యమునిలోకంబున నుండునని నిశ్చయించి యందుండి కదలి బలరామునితో యముని ప్రియనగరం బైన సంయమనీపురంబునకుఁ బోయి ద్వారంబు కడ నిలిచి శంఖం బొత్తె. ఆ మహాధ్వని విని యముండు వచ్చి వారిం దోడ్కొని పోయి భక్తిం బూజించి లీలామానుషుండ వైన హరీ! యేమి కార్యంబున విచ్చేయుటయ్యె. నేను జేయఁదగిన దేమియో యానతిమ్మనినఁ గృష్ణుం డిట్లనియె.

అయ్యా! మా గురుపుత్రుని నీ కింకరు లిందుఁ దెచ్చిరి. ఆ బాలకుని మరల నిమ్మనిన వల్లెయని యర్పించిన నతనిం దోడ్కొని రామకృష్ణులు మరలివచ్చి గురువునకు నమస్కారపూర్వకంబుగ నచ్చిఱుత వాని సమర్పించిరి. సాందీపనుండును నాయనలారా! మీరు

గురుదక్షిణ చక్కఁగ సంపాదించి యిచ్చితిరి. మీయట్టివారు శిష్యులైన గురువునకు సఫలముగాని కోరికయు నుండునే? వీరులారా! యిఁక మీ యిండ్లకుఁబోయి విన్నమాత్రన పావనంబుచేయు నిర్మల కీర్తిని గడింపుఁడు. అని సెలవొసంగిన వారు రథంబెక్కి యది మేఘంబుఱిమినట్లు ధ్వనించుచుండ వాయువేగంబున నింటికి వచ్చిరి. ఇట్లు మరలివచ్చిన రామకృష్ణులంగని చిరకాలనష్టద్రవ్యంబు లభించినట్లు పురజనులెల్ల సంతోషించిరి.

## కృష్ణుండు యుద్ధవుని గోపికలయొద్దకుఁ బంపుట.

వృష్ణి వంశ్యులకు మంత్రిశ్రేష్ఠుండునుఁ దనకుఁ బ్రియమిత్రుండును బుద్ధిమంతులలో నుత్తముండును బృహస్పతి శిష్యుండునునైన యుద్ధవుం డనువానిం బిలిచి దోఃకాంతస్థలంబున నతని కేలు తన కేలం బట్టుకొని ప్రపన్నార్తిహరుండైన హరి యిట్లనియె. సజ్జనాగ్రణీ! యుద్ధవా! నీవు వ్రేపల్లెకుఁబోయి నాతల్లిదండ్రులకుఁ బ్రీతి సమకూర్పుము. నన్నెడబాయుటచేఁ దపించుగోపికలకు నా సందేశం బెఱిఁగించి వారిని దుఃఖవిముక్తలఁ జేయుము. వారు నాయందే మనస్సు నిల్పినవారు. నన్నే తమకుఁ బ్రాణంబుగాఁ దలంచియుండువారు. నానిమిత్తమై పతిసుతహితాదుల నెల్ల వదలియున్నవారు. నన్నే స్మరించుచుఁ దమ దేహపోషణమందైనను శ్రద్ధలేనివారు. నన్నె తమ ముఖ్యప్రియుఁడని మనస్సున నిల్పినవారు. తమకు సుఖసాధనంబులైన లోకధర్మంబుల నెల్ల నానిమిత్తమై వదలినవారిని నేను భరింతును. తను కత్యంత ప్రియుండనైన దూరమందున్న నాయందు గోపసుందరులు వెందంబు పొందుబఱిచి నన్నే స్మరించుచు దుఃఖపరవశలై దేహధర్మములు కూడ మఱచి నేను మరలవచ్చెద నని చెప్పిన పలుకు విశ్వసించి మచ్చిత్తలై నారాక కెదురు చూచుచు నెట్లో యతి కష్టము మీఁదఁ బ్రాణంబునిలిపి యున్నారు. కావున నయ్యా! నీవుపోయి వారల నూరార్పుము. అనిన నుద్ధవుండు భక్తసందేశంబును గొని రథ మెక్కి పయనించి సాయంసమయంబునఁ బశువుల గొఱిజల

లేగిన ధూళిచే రథంబు కానరాక మఱుఁగుపడియుండ నందు సదనంబునకుఁ బోయెను. ఇట్లరుగుదెంచిన కృష్ణప్రియానుచరు నుద్ధవుం గాంచి నందుండు కృష్ణుండు వచ్చినట్ల సానందుండై యాయనను కౌఁగిలించి యర్చించి పరమాన్నంబున భోజనం బిడి పానుపున సుఖాసనంబుఁ గల్పించి పాదంబు లొత్తి గాసిదీఱిన పదపడి యాయనతో నిట్లనియె.

అయ్యా చెలికాఁడా! పుణ్యాత్మా! వసుదేవుండు బంధనంబుల వదలించుకొని యిష్టులనెల్లఁ గూడి సుఖం బున్నాఁడు గదా? అదృష్టంబున ధర్మశీలురు సాధువులునైన యాదవుల సర్వదా ద్వేషించు పాపాత్ముండు కంసుండు తానుజేసిన పాపంబుననే తనవారితోడ హతుఁడయ్యె. మిత్రుఁడా! మా కృష్ణుండు తల్లిని సుహృత్తులను మిత్రులను దన్నే దిక్కుగ నమ్మిన గోపాలకులను గోకులంబును దానే శరణంబుగఁగల యావులను బృందావనంబును గోవర్ధనంబును నెప్పుడైనఁ దలంచునా? నెచ్చెలీ! యొకసారియైనఁ దనవారిని జూడ గోవిందుఁ డిటకు వచ్చునా? అటువచ్చెనేని యప్పుడైన నతని మందహాస సుందరేక్షణంబైన మోము చూడఁగలుగుదుము. కారు చిచ్చువలనను, వాయువువలనను, వర్షమువలనను, వృషభాసురువలనను సర్పమువలనను, మఱియుఁ బెక్కుమార్గ మృత్యువునోటినుండియుఁ గృష్ణుండు రక్షించె. అట్టి మహాత్ము నెట్లు మఱతుము. కృష్ణుని వీరచరిత్రంబులును లీలలును కటాక్ష వీక్షణంబులును, మందహాసంబులును, సుధామధుర భాషణంబులును స్మరించుచు మే మేకార్యముఁ జేయుటకు సమర్థులము గాకున్నవారము. ముకుంద చరణారవింద భూషితంబులైన నదులు, కొండలు, వనప్రదేశములును నాయన యాటపట్టులును జూచునపుడు మేము మేనులు మఱచి తన్మయత్వంబు నొందుదుము. రామకృష్ణులు గర్గుండు చెప్పినట్లు దేవకార్యంబు నిర్వహింప నిందుఁబుట్టిన దేవోత్తములే కావలయు. కాకున్న వేయేనుఁగుల బలము గల కంసుని మల్లులను గువలయాపీడ గజంబును సింహంబు పశువులఁ జంపినట్లు లవలీలఁజంప నితరులకు శక్య

మా? మూఁడు తాటిచెట్ల యెత్తై మహాసారమైన వింటిని నేనుఁగు చెఱకు విఱుచునట్లు విఱిచెను. ఏడు రాత్రులు కొండ నొక కేల నెత్తెను. ప్రలంబ, ధేను, కారిష్ట, తృణావర్త, బకాదు లను దైత్యులను సురాసురులను సునాయాసంబుగ గెలిచెనుగదా? అని యిట్లు నందుండు కృష్ణానురక్తంబైన చిత్తంబునఁ గృష్ణలీలలు స్మరించి బాష్పంబులు కంఠంబునిండి మాట నడ్డగింపఁ బలుకక ప్రేమ పరవశుండై యూరకుండెను. యశోదయు సుతుని చరితంబును బతివర్ణింప వర్ణింప విని కన్నీరు గార్చుచుఁ బుత్రస్నేహవశంబునఁ జేఁపె.

ఇట్లు యశోదానందులకు భగవంతుండైన శ్రీకృష్ణుపైఁ గల పరమానురాగంబుఁ జూచి యుద్ధవుం డమందానందంబున నందునితో నిట్లనియె. అయ్యా! అఖిలలోకగురుండైన నారాయణు నందు మీకిట్లు దృఢంబుగ మనస్సునిలిచెఁ గావున దేహధారులలో నెల్ల మీరు భార్యయు భర్తయు నిజముగా శ్లాఘ్యతములు. ప్రధానపురుషులైన యీ రామకృష్ణులు ప్రపంచమునకు బీజభూతంబులైన పృథ్వ్యాదులకుఁ గారణభూతులు. ఈ పురాణపురుషులే సర్వభూతంబులందు ననుప్రవిష్టులై శబ్దాది విషయగోచర జ్ఞానంబును బ్రవర్తింపఁ జేయుచుందురు. ఎవ్వండు ప్రాణప్రయాణ సమయంబున రాగాదులందుఁ బోనీక నిర్మలమనస్సు నెవ్వనియం దొకక్షణముంచునో వాఁడు తన యనాదికర్మ వాసనల నెల్ల దగ్ధంబుగావించి జ్ఞానస్వరూపుఁడై యప్రాకృత శరీరంబుఁ బడసి మోక్షంబుఁ గాంచు. మహాత్ములారా! యట్టి యఖిలాత్మహేతువై కారణ మనుష్యస్వరూపుఁడైన నారాయణునందు సర్వదా మీరు నిశ్చంచలంబుగ మనస్సు పాదుకొలిపితిరి. ఇఁక మీకేకార్యంబు కొఱఁతగలదు. అయ్యా! శీఘ్రకాలమునందే కృష్ణుండు గోకులంబునకు వచ్చు. వచ్చి తల్లిదండ్రులైన మీకుఁ బ్రియం బాపాదించు. యాదవ విరోధియైన కంసుని రంగమధ్యంబున వధించి కృష్ణుండు మీతో నేమాటచెప్పె నది సత్యంబొనర్చుం గాని మఱవఁడు. మహాభాగులారా! వగవకుఁడు. అచిరకాలంబునఁ గృష్ణు దర్శింపఁ గలరు. ముకుందుండు మధురయందుమాత్రమే నిలకొన్న

వాఁడని తలంపకుఁడు. సర్వవ్యాపియై సమిధలయం దగ్నివలె సమస్త భూతంబులం దంతరాత్మయై యున్నవాఁడు. కన్న తల్లిదండ్రులయిన దేవకీవసుదేవుల విడిచి మాగొల్లపల్లెకేల వచ్చుననకుఁడు. మమతాభిమానములు లేక సర్వసముఁడైన యమ్మహాత్మున కొకఁడు ప్రియుఁడని మఱియొకఁ డప్రియుఁడని యొకఁ డుత్తముఁడని మఱియొకఁ డధముఁడని భిన్నభావంబు లేదు. ఆయనకుఁ దల్లియనికాని దండ్రియని కాని భార్యయనికాని కొడుకులులోనగు వారనికాని తనవారని పరులనికాని దేహమనికాని కర్మమనికాని జన్మమనికాని లేదు. అయినను సాధువులరక్షింప దేవ మనుష్య పశుపక్ష్యాదులందుఁ గ్రీడార్థం బవతరించుచుండు. సత్త్వాదిగుణ రహితుండై వానికిఁ దాను లోపడక తన కవి వశపడఁ జేసికొని యుండువాఁడును బుట్టువు లేనివాఁడునయ్యు నుపకరణంబులైన సత్త్వ రజస్తమస్సులు ప్రధానంబులుగఁ గలదేహము లధిష్ఠించి జగంబుల సృజించుచు రక్షించుచుఁ బొలియించుచు నుండును. గిరగిర చుట్టు తిరిగినవానికి భూమి తిరుగుచున్నట్లు తోఁచురీతిఁ జిత్తంబు కార్యంబులఁ జేయుచుండఁ దాను జేయు చున్నట్లాత్మ తలంచుచుండు. భగవంతుఁడు మీయిరువురకు మాత్రమే తనయుండు గాఁడు. అందఱ కా యీశ్వరుండు కొడుకును, నాత్మయుఁ, దల్లియుఁ, దండ్రియునై యున్నవాఁడు. కనినది, వినినది, నడచినది, గొప్పది, చిన్నది సర్వము నచ్యుతునకంటె నితరమైన వస్తువేదియుఁ గొంచెమైన లేదు. సర్వంబు పరమాత్మ భూతంబు. అని నందుఁడు నుద్ధవుఁడు సంభాషించుచుండ రాత్రియే కడచిపోయె.

అంత నుషఃకాలం బగుటయు గోపికలు నిద్రలేచి దీపములు వెలిఁగించి వాస్తుపూజఁగావించి దీపకాంతుల నొడ్డాణంబుల రత్నంబులు ధగద్ధగాయమానంబుగ వెలుఁగఁ గుడియెడమలుగఁ గవ్వపుఁ ద్రాడీడ్చునెడ నితంబంబులు కరకంకణంబులు స్తనహారంబులు చలింపఁ గదలాడు కమ్మల తళుక్కుతళుక్కుమను కాంతులఁ జెక్కుటద్దములు మినమిన మెఱయఁ గుంకుమారుణ వదనలై కృష్ణగీతంబులు పాడుచుఁ బెరుఁగు చిలికిరి. దధిమథన ఘుంఘుం ధ్వానంబులును జంద్రవదనా

ఘుఘుమథనగానంబులును బెరసి మిన్నుముట్టి లోకంబున నమంగ ళంబు హరించె. అంతట సూర్యోదయించిన గోకులంబున స్త్రీ లూరివాకిటనున్న బంగారు దేరిం జూచి యిదియెవ్వరిదని విచారింపఁ జొచ్చిరి. కంసుని కార్యంబు సాధింప మనకృష్ణుని మధురకుఁ గొంపోయిన యక్రూరుం డను నసర్థ నామకుండు మరలవచ్చెనా యేమి? వచ్చి చచ్చిన తనభర్తకుఁ దృప్తిగ మన మాంసపుఁబిండము లిడును గాఁబోలు. లేకున్నవాని కిం కేకార్యము గలదు? అని గోపి కలు పలుకుచుండ నుదయకాలాహ్నికంబులు దీర్చి యుద్ధవుండు వారున్న చోటికి వచ్చెను.

## ఉద్ధవుఁడు గోపికలతో సంభాషించుట.

గోపికలును నిడివిచేతుల వాఁడును, క్రొందమ్మిరేకుల కనుల వాఁడును, బంగరు దుప్పటంబువాఁడును, గమలమాలిక కలవాఁడును, నిర్మల కుండలంబులవాఁడును, శుచిస్మితుండును, సుందర దర్శనుండును నగు నుద్ధవుంజూచి వీఁడెవ్వాఁడు కృష్ణుని వేషభూషణంబులు ధరించిన వాఁడని వితర్కించుచు హరిచరణకమలాశ్రయుం డగు నతనిఁ జుట్టు కొనిరి. ఇట్లు చుట్టుకొని వినయంబున శిరంబులు వ్రాల్చి, సిగ్గుతోడి చిఱునగవుల చూపులచేతను, దియ్యని పలుకులచేతను, నర్ఘ్యపాద్యం బుల చేతను, సత్కరించి యాపల్లవపాణులు హరిపంపిన దూతయగుట రెఱింగి రహస్యస్థలంబునకుం గొంపోయి యర్హాసనంబు సమర్పించి కూర్చుండిన యాయనతో నిట్లనిరి.

అయ్యా నీవు యదుపతియైన కృష్ణుని దూతవనియు నతండు తన తల్లిదండ్రుల కుశలంబు విచారించి వారికిఁ బ్రియంబుఁగూర్ప నిన్నుఁ బంపెననియు నెఱుంగుదుము. కృష్ణుండు వారినైన మఱ చెడుకదా మేలే. అటుగాకున్న నీ గొల్లపల్లెయం దతఁడు స్మరింపఁ దగిన దేవో మేమూహింపఁ జాలకున్నారము. తల్లిదండ్రులు మొద లైన బంధువుల సంబంధము మునీశ్వరులకైనను వదలించుకొన సాధ్యము కానిది. అరతియ్యకాని కార్యార్థమై యితరులతోఁ జేసెడి

మైత్రి కార్యముతీరుటతోఁ దెగిపోవును. తేనెఁగ్రోలినపిదప దుమ్మెదలు పూవులను, దమపని తీరినవెనుకఁ బురుషులు స్త్రీలను, ధనముడిపోయినవానిని వేశ్యలును, శక్తిలేని రాజును బ్రజలును, విద్య నేర్చిన శిష్యుఁడు గురువును. దక్షిణగొనిన ఋత్విజుండు యజమానుని, బండ్లుడిగిపోయిన వృక్షంబులను బక్షులును, భుజించిన యతిథులన్నమిడినవారి గృహంబులును, గాలిన యడవిని మృగంబులును, భోగించినపిదప ననురాగవతియైన స్త్రీని జారుండును విడుచుట కలదు గదా? అని యిట్లు వల్లవీపల్లకపాలికలు వాక్కాయ మానసంబులు కృష్ణునందునిలిపి గృహకృత్యాదులెల్ల వదలి హరిదూత యెదురనిలిచి కృష్ణుఁడు బాల్యకైశోరదశల నొనర్చిన చేష్టితంబులెల్లఁ దలఁచితలఁచి ప్రియుఁడొనర్చిన కార్యంబులను బాటలుగఁ బాడుచు సిగ్గువిడిచి యేడ్చుచుండిరి. అందు కృష్ణసంగమంబును గాంక్షించు నొక కాంత *పచ్చపుప్పొడితోఁకున గోరోచన వర్ణంబైన మీసములతోఁ దనయెదుర వ్రాలిన యొక తేఁటింజూచి యది ప్రియుండు పంప వచ్చిన దూతగాఁ గల్పించుకొని దానితో నమ్మానవతి యిట్లనియె.

† ఓ మధుపా! కితవబంధూ! సపత్నీగురు కుచమర్దితంబైన వనమాలయందలి కుంకుమముచే నెఱ్ఱనైన మీసములతోడ మా చరణంబుల నంటరాకుము. ఎవనికి నీయట్టివాఁడవు దూతవైతివో యా మధుపతి యా మానినుల యనుగ్రహమునకుఁ బాత్రుండై యాదవ సభయందు నపహాసభాజనంబగుఁ గాక.

---

కాంత=రాధ. క + అంత=కృష్ణునియందు నిశ్చయబుద్ధి గలది.

† మధుపా=(1) తేనెత్రాగు తేఁటీ, (2) మద్యపానము చేయువాఁడా! కితవబంధూ=శఠుఁడైనశ్రీకృష్ణునకుఁ జుట్టమా! మిమ్ము విడువనని బాసచేసి విడుచుటచేఁ గృష్ణుఁడు శఠుఁడని భావము. కృష్ణుఁడు నల్లనివాఁడు తుమ్మెద నల్లనిదియగుటవర్ణసామ్యముచేతను, నీవు మధుపము కృష్ణుఁడు మధుపతియగుట నామసామ్యమువహించుటచేతను, మద్యపానము చేయువారికిఁ గితవులకుఁ బ్రాయకముగ సఖ్యముండుటచేఁ గర్మసామ్యముచేతను గితవబంధు వని చెప్పబడెను. సపత్ని=సవతి.

మా యను బహువచనము గర్వాతిశయమును గాని గోపికల గుంపును గాని తెలుపును. అంటరాకుము=మేము మానధనలము,మానహీనుఁడవై ననీకుమమ్ము దాఁకు

*మోహినియైన తన యధరసుధ నొకసారి మమ్ముఁ ద్రావనే పానంబుచేయనిచ్చి ముందు తేనెఁగ్రోలిన సుమనస్సుల నీవు విడుచు నట్లే మమ్ము విడిచెను. అయ్యో! యాపద్మాదేవి యెట్లతని పాద పద్మంబులకుఁ బరిచర్యచేయుచున్నదో. తెలిసెఁ దెలిసె. ఉత్తమశ్లోక జల్పితంబులు విని యామె మతిహీనయయ్యెఁ గాఁబోలు.

---

రౌంకృతలేదు. నీయట్టివారు మమ్ముఁ బ్రసన్నలఁ జేయఁజాలరు. ఏల తాఁకరా దందువేని వినుమని కారణము చెప్పుచున్నది. మధుపతి = (1) యాదవులలో నొక శాఖవారికి మధువులని పేరు, వారికిఁబతి. (2) మద్యస్వామి. ఆమానినులు=ఏస్త్రీలతో నీవు సంభోగించితివో వారు; వారితోఁగలియుట శ్లాఘ్యమని నీలో నీవుతలఁచితత్సం భోగ చిహ్నములు ధరించితివి గాని నీ చేష్ట నష్టమని సభలయం దాక్షేపింపఁబడు దువు. తొలుత భోగించి నమ్మించి విడిచిన వాని స్నేహభావ మాక్షేపింపఁ దగినదే కదా. భుక్తపూర్వ పుష్పపరిత్యాగివినీవు. భుక్తపూర్వస్త్రీపరిత్యాగినీస్వామి. కావున స్వామికిఁదగిన దూతవే. మాచేఁ దృణీకరింపఁబడితివి కావున సేవని నుద్దేశించి దూతగవచ్చితివో యానందుని నూరార్పఁ బోము.

*కితవుఁడని యేలకృష్ణు దూషించెదవనినఁ గారణము చెప్పుచున్నది. పూర్వ వాక్యమందలి మధుపతి యను శబ్దము నే యిందుఁ గర్తృపదముగా గ్రహింపవలయు. కృతఘ్నునిపేరు చెప్పరాదని యీర్ష్యచే గోపికమరలఁ బేరుచెప్పదయ్యె. మోహిని= (1) తాపత్రయమును మఱవఁజేయునది. (2) బుద్ధిభ్రంశముకలిగించి దానియందే యత్యాసక్తిఁ బుట్టించునది. తన యధరసుధ=అసాధారణమగుటచేఁ దానైయిచ్చిన లభించునే కాని వేఱువిధముగ లభింపనిది. ఒకసారి=పెక్కుతడవలు పానము చేసి యుండినను నుత్కంఠ చేఁగలిగిన మఱపుచేఁ నిట్లు జెప్పఁబడియె. కృష్ణునిగూడియుండిన యన్ని సంవత్సరము లొక్కసారిచుంబించినంత యల్పకాలముగఁ దోఁచెడినని యందుఁ దనివితీర లేదనియు భావము. మమ్ము=సాధ్వులమైమాగృహ కృత్యములు నిర్వహించుచు నెంతో మాలయింటనున్న మమ్ము. తానే=పెక్కునిక్కులచే మమ్ము వశపఱుచు కొని బలాత్కారముగఁ దానే మాచే నధరామృతంబుఁ గ్రోలించి రుచిమరగపిచ్చి యాశ చూపి. సుమనస్సులు=పుష్పములు, సుమనస్సులనుటచే మేమును దనయందు ననురాగయుక్తమైన మంచిమనస్సు కలిగియున్నారమని భావము, నీది మధుపజాతి, నీ కాఁకలి దీరవలసినంత తేనె యొకపుష్పమునందే లభింపదు. కావున నీ దేహ రక్షణమునకై నీవు పెక్కుపూలయందలి తేనె గ్రోవుటొప్పు. ఇట్టి నీవు సుధ తన యధరమందే కలిగి మధుపతియై యితర రసములఁ గోరఁగారణములేకుండియు సుమనస్సుల మమ్ము దుఃఖముపాలుచేసిన యాకితవునితో బంధుత్వముచేయుటతగదు. అయినను నన్నెట్లు కృష్ణునితోఁ బోల్చితివందువేని చుట్టుతిరుగుట మధుర ధ్వని సేయుట బలాత్కారముగఁ జుంబించుట లోనైనవి నీయందును గలవు కదా.

* ఓ షట్పదమా! నీ విక్కడ నిల్లువాకిలిలేని మాయెదుట యదుపతిపురాణమును బహువిధముల గానము చేయుచున్నావేమి? ఓ విజయసఖ! చ్యుతకుచరుజలైన యాతని ప్రియులయొద్ద నీ వాతని ప్రసంగము గానముచేయుము. వారు సంప్రీతలై నీ కోరిక నెఱవేర్తురు.

---

శ్రీకృష్ణుఁ డంతటినిగ్రాగ్గయిన యెడల శ్రీమహాలక్ష్మి యెట్లాయనఁ బాదసేవ చేయుచున్నదంటివా వినుము. ఈ చరిత్రము మాకును తెలియరాకున్నది అయినను నామె యుత్తమశ్లోకుఁడైన యాతని తియ్యని మాటలకు బేలుపోయి యుండవలయును. లేదా స్వానుభవముచేతఁ గాక గతానుగతికముగ లోకములో నుత్తమశ్లోకులు శ్రీకృష్ణుఁడు మంచివాఁడని చెప్పఁగా విని వారిమాటలు నమ్మి మోసపోయినది. ఆమెవలె నంత యవిచారముగ స్వానుభవముగల మే మాయనకు వశపడువారము కామని భావము.

ఆయన స్వామి, నీవు భృత్యుఁడవు. నీ వాయనకు సముఁడవు గావు. ఆయన నీకు సముఁడు గాఁడు. మేము నీయట్టివారమే. ఆయనకు సమానలము గాము. సమానుల యందుఁగదా స్నేహము నిలుకడగ నుండును. కావున నాయనతో నిరంతర నిరంతరాయ సంశ్లేషము కలుగఁ జేసి సామ్యము నొంద మేము యత్నించెదమని రహస్యము. పద్మ కృష్ణపాదపద్మసేవఁ జేయుకారణము నామసామ్యమో లేక పద్మము తన తల్లి యనియో.

* పాదముల వ్రాలిన తుమ్మెదను పిలిపింపఁగా నది యెదుట ధ్వనింపఁగా నా తుమ్మెద కృష్ణుని ప్రశంసించి పాడుచున్నదని కల్పించుకొని రాధ యిట్లనుచున్నది. పాడుటయే స్వభావము గల తుమ్మెదా! నీవు పాడందలఁచి తలఁచి దుఃఖితస్థలమైన మాయెదుటఁ బాడుచున్నావేమి? అంగ యాదవులఁ బాడెద వేమి! అంగ యాదవుల పతిని బాడెదవేమి? ఇప్పు డాయన యాదవులఁ బాలించుచున్నవాఁడు, వారు నీ యిష్టముఁ దీర్తురు పొమ్ము. ఇచ్చట నుండువా రాయనచేఁ బరిత్యక్తలైన గోపికలు సుమా. వారియెదుట నీవు కొంచెముగనో గొప్పగనో పాడుట తగదు సుమా. షట్పదమా = నీవేల పాడునది తెలిసెను లోకములోఁ బశువులన్నియు నాలుగుకాళ్ళ జీవములు. నీవాఱుకాళ్ళ జీవమవు కావున నొకటిన్నర పశువవు. కనకనే యెక్కడఁ బాడవచ్చును, ఎక్కడఁ గూడదను జ్ఞానములేక పాడఁ జొచ్చితివి. ఆయనకు సర్వాధిక ప్రేమ వ్రజమందే యందువేని యా పురాణముఁ జాలింపుము. ఆయన ప్రేమ మోసములోఁ గూడినదని మా యనుభవమని భావము. లేక యిది చిరకాలబంధము. ఆయనకు నింతకుఁ బూర్వమే వ్రజమునకుఁ బంధము గలదు. అది నూతనము గాదని యర్థము. పురాణము=కృష్ణునకు వ్రజమందుఁ బ్రీతిగలదనుట ప్రాఁత సమాచారము. ఇప్పటి వార్త గాదు. కృషి ధాతువులవలనఁ బుట్టిన శబ్దమునకు నలిపి వేయువాఁడని యర్థము. ఇప్పు డాయర్థ మాయనయందు మా విషయమున నన్వయించునే కాని

* కపట రుచిరహాస భ్రూవిక్షేపంబుల నతనికి భూలోక స్వర్గ లోక రసాతలములం దెవ్వతె వశపడకుండును? లక్ష్మీదేవి యతని చరణరజంబు నుపాసించు చున్నది గదా. ఇఁక మేమెవ్వారము? అయినను నతని విషయమున నుత్తమశ్లోకశబ్దము కృపణపక్షమే.

---

యాకర్షించువాఁడను నర్థము పొసగదు. ఇల్లు వాకిలిలేని మాయెదుట=(1) మేము పశువుల మేపుచు నడవిలోనుండు వారముగదా. (2) తన సాంగత్యము లభించిన పిమ్మట మా మనస్సులు తనయందు వర్తించునట్లు తానేకదా చేసెను. (3) తాను మమ్ము వదలినపిమ్మట మే మిండ్లను వదలితి మని భావము. ఇట్టి మాయెదుటఁ బాడిన నీకేమి లాభము గలదు. అటయిన నీకనెక్కడఁ బాడుమనెదరందువా. విజయసఖ=విజయుఁడనఁగా సర్వమును వశపఱచి కొనువాఁడు కృష్ణుఁడు. అతనికి సఖుఁడవు నీవు. చ్యుతకుచరుజలు = ఖండిత కామపీడలు. మధురాపుర స్త్రీలు. ఆలింగనాదుల వారికామమును గృష్ణుఁడు దొలఁగించెనని భావము. ఆకారణమున వా రతనికిఁ బ్రియలు. వారియెదుట నీవు కృష్ణునిఁ బ్రశంసించిన వారు నిన్ను మెచ్చి నీ కోరికలు నెఱవేర్తురు. ఇది సకటాక్షోపహాసము.

* తల్లీ! నీ వట్లనఁ దగదు. నిన్ను స్మరించి కామవిహ్వలుండై కదా నన్ను నీ కడకు నిన్నుఁ బ్రసన్నురాలినిఁ జేయఁబంపెను. అని చెప్పి నట్లు శంకించుకొని యసూయతోఁ దత్త్వభావం బనువదించి యీర్ష్యతోఁ గూడిన గర్వముతో నతనికిఁ దాను వశపడకుండుట సూచించుచు నెత్తి పొడుచుచున్నది. కపట=కపటరుచిర హాసాదులని యైనం జెప్పవచ్చును. కపటశబ్దము సంబుద్ధిగనైన గ్రహింపవచ్చును. భూలోక=ముల్లోకములం దాయన యెక్కడఁ గోరిన నక్కడనే యేస్త్రీయైన నతనికి లోపడునని. లక్ష్మీదేవి సామాన్యస్త్రీ కాదే యామె వశపడలేదా యందువేని యామె యతని కాలి దుమ్మునకై యతఁడు పోయిన చోటికెల్లం దానును బోవుచుండును. మేమట్లు స్వస్థానమువిడిచి పోవువారము గాము. మా యిరువురిలో నుత్తము రాలెవ్వతెయొ· తెలిసికొనఁ తారతమ్య జ్ఞానములేని వాని యనుగ్రహము చాలుఁజాలు. ఇఁక మే మెవ్వర మనునది ఓఱునవ్వుతో శిరఃకంపముతోఁ జెప్పినమాట. ముల్లోకములలో నెక్కడ నేస్త్రీ కనఁబడిన దానితోఁ గలియుటే యతని కార్యము గాని యిది యుత్తమ యిది యధమయను విచారమతనికి లేదనుట. ఇట్టి నీచనాయకుని పొందు మావంటి యుత్తమస్త్రీ లెవ్వరు కోరుదురు? అతఁ డుత్తమశ్లోకుఁడని ప్రసిద్ధిగదా యని యందువేని, (1) దరిద్రు లతని నట్లు శ్లాఘింతురు. కృపణులు=దీనులు. పక్షము = సహాయము. (2) కృపణుల కోటిలో నతఁ డుత్తమశ్లోకుఁడే గాని మాయట్టి వారి యందుఁ గాఁడనుట. (3) ఇంతవఱకు దీనులై తన్ను నమ్మిన వారికిఁ దన్నైన నిచ్చి యుత్తముఁడను కీర్తికిఁ దగియుండెను. ఇప్పుడో యది విపరీతలక్షణచే నతని యందు వర్తింపదు. శ్లోకము-కీర్తి, నీ కపటదరహాసాదులకు లక్ష్మి లోనగు నితరస్త్రీలు నీకు వశలైనఁ గానిమ్ము. మేము విచక్షణలము గావునఁ గుటిల నటనములకు లోపడము.

‡ నీ శిరస్సునందలి నాపాదమును వదలుము. నీవు కృష్ణుచే దౌత్యమునందు శిక్షింపఁబడి యిచ్చకపుముచ్చటలయందును సమాధానవాక్యము లాడుటయందును నిపుణుండవై యతనికడనుండి వచ్చితివని యెఱుంగుదును. స్వనిమిత్తమై పుత్రులను భర్తలను నితర లోకములను విడిచిన మమ్ముఁ దాను విడిచెను. ఇట్టి యకృతజ్ఞునితో నేమి సమాధానపడవలసి యున్నది?

భ్రమరా! వినుము లుబ్ధధర్ముఁడై వేఁటకానివలెఁ గపీంద్రుని

---

‡ కమలభ్రాంతిఁ దన పదంబుల వ్రాలి ధ్వనించు తుమ్మెదను జూచి దేవి కోపింపకుము. శిరస్సుచే నీపాదములకు నమస్కరించుచున్నాము, నామనవి కొంచెమైన వినుమని యది చెప్పు నట్లెంచి రాధపలుకుచున్నది. నాపాదమును వదలుము. నన్నుఁ దాఁకుటకు నీకు యోగ్యతలేదు. ఇచ్చకపు ముచ్చటలను సమాధానవాక్యములను నా పాదములనుగూడ వదలుము. రాయబారమునందుఁ గృష్ణునిచే శిక్షింపఁబడుట నీవును వంచకుఁడవని యెఱుంగుదుము. ఆయన మాకేమి యపరాధము చేసెనందువా? స్వనిమిత్తమై=తన కొఱకుఁగాఁ గృష్ణుని కొఱకుఁగా. ఇతర లోకములను= పుణ్యలోకములను, తాను మమ్ము నుద్ధరించు నను నమ్మకముతో నీ లోకసంబంధములైన మగఁడు బిడ్డలు గృహకృత్యములను దన నిమిత్తమై వదలితిమి. దానధర్మాదులైనఁ జేసి స్వర్గాది పుణ్యలోకములను సాధించుటయు వదలితిమి. ఇట్టి మమ్ము వదలినవాఁడు కృతఘ్నుఁడా? తన నిమిత్తమై యెవరేమి చేసినది యెఱుఁగని శఠునితోఁ గఠినునితో నేమిసంధి కుదురును? స్వనిమిత్తమై = మేము పుత్రాదుల వదలునట్లు చేసినవాఁడితఁడే. పుత్రులను భర్తలను నితరలోకములను విడిచిన మమ్ముఁ దాను స్వనిమిత్తమై=(ఆత్మార్థమై) విడిచెననియు నొక యర్థము. స్వనిమిత్తము= సు+అనిమిత్తము - లేశమైనఁ గారణములేక యని చెప్పవచ్చును.

శ్రీరాముఁడు నల్లనివాఁడు - చెట్టుచాటున నుండి వానరుఁడగు వాలినిఁ జంపెను. లుబ్ధధర్ముఁడు=బోయల ధర్మము కలవాఁడు, కపీంద్రుని = వాలిని, నల్లని మగవారిని నమ్మరాదను సామెత నాధారముచేసికొని శ్రీరాముని నిదర్శనముగాఁ గొని కృష్ణుఁడును నమ్మరానివాఁడని రాధ చెప్పుచున్నది. వర్ణసామ్యముచేత నేకాక రామకృష్ణు లభిన్నులను బుద్ధితో నీవాక్యము చెప్పఁబడినది. శ్రీకృష్ణుఁడు కృతఘ్నుఁడే కాక పూర్వమునుండి క్రూరుఁడనియు జెప్పుచున్నది.

ఇట్లు పొంచి చంపుట క్రూరుఁడగు వేఁటకాని ధర్మముకాని దయావంతుల ధర్మముకాదు, అలుబ్ధధర్ముఁడనియుఁ బదచ్ఛేదము. వేటకానివలె ననుటచేత నేలుబ్ధ ధర్మము చెప్పఁబడినది కావున నలుబ్ధధర్మ మనుటొప్పు. బోయవాఁడు తనకాహారముగ నుపయోగపడు జంతువులను మాత్రమే చంపునుగాని యితర మృగములఁ

* కపట రుచిరహాస భ్రూవిక్షేపంబుల నతనికి భూలోక స్వర్గ లోక రసాతలములం దెవ్వారె వశపడకుండును? లక్ష్మీదేవి యతని చరణరజంబు నుపాసించు చున్నది గదా. ఇఁక మేమెవ్వరము? అయినను నతని విషయమున నుత్తమశ్లోకశబ్దము కృపణరక్షమే.

---

యాకర్షించువాఁడను నర్థము పొసగదు. ఇల్లు వాకిలిలేని మాయెదుట=(1) మేము పశువుల మేపుచు నడవిలోనుండు వారముగదా. (2) తన సాంగత్యము లభించిన పిమ్మట మా మనస్సులు తనయందు వర్తించునట్లు తానేకదా చేసెను. (3) తాను మమ్ము వదలినపిమ్మట మే మిండ్లను వదలితి మని భావము. ఇట్టి మాయెదుటఁ బాడిన నీకేమి లాభము గలదు. అటయిన నీఁకనెక్కడఁ బాడుమనెదరందువా విజయసఖ=విజయుఁడనఁగా సర్వమును వశపఱచి కొనువాఁడు కృష్ణుఁడు అతనికి సఖుఁడవు నీవు. చ్యుతకుచరుజలు = ఖండిత కామపీడలు. మధురాపుర స్త్రీలు ఆలింగనాదుల వారికామమును గృష్ణుఁడు దొలఁగించెనని భావము. ఆకారణమున వా రతనికిఁ బ్రియులు. వారియెదుట నీవు కృష్ణునిఁ బ్రశంసించిన వారు నిన్ను మెచ్చి నీ కోరికలు నెఱవేర్తురు. ఇది సకటాక్షావహాసము.

* తల్లీ! నీ వట్లనఁ దగదు. నిన్నుస్మరించి కామవిహ్వలుండై కదా నన్ను నీ కడకు నిన్నుఁ బ్రసన్నురాలినిఁ జేయఁబంపెను. అనిచెప్పి నట్లు శంకించుకొని యసూయతోఁ దత్ప్రభావం బనువదించి యీర్ష్యతోఁ గూడిన గర్వముతో నతనికిఁ దాను వశపడకుండుట సూచించుచు నెత్తి పొడుచుచున్నది. కపట=కపటరుచిర హాసాదులని యైనం జెప్పవచ్చును. కపటశబ్దము సంబుద్ధిగనైన గ్రహింపవచ్చును. భూలోక=ముల్లోకములం దాయన యెక్కడఁ గోరిన నక్కడనే యేస్త్రీయైన నతనికి లోపడునని. లక్ష్మీదేవి సామాన్యస్త్రీకాదే యామె వశపడలేదా యందువేని యామె యతని కాలి దుమ్మునకై యతఁడు పోయిన చోటికెల్లం దానును బోవుచుండును. మేమట్లు స్వస్థానమువిడిచి పోవువారము గాము. మా యిరువురిలో నుత్తములెవ్వ రౌనో· తెలిసికొనఁ దారతమ్య జ్ఞానములేని వాని యనుగ్రహము చాలుఁజాలు. ఇఁక మే మెవ్వర మనునది చిఱునవ్వుతో శిరఃకంపముతోఁ జెప్పినమాట. ముల్లోకములలో నెక్కడ నేస్త్రీ కనఁబడిన దానితోఁ గలియుటే యతని కార్యము గాని యిది యుత్తమ యిది యధమయను విచారమతనికి లేదనుట. ఇట్టి నీచనాయకుని పొందు మావంటి యుత్తమస్త్రీ లెవ్వరు కోరుదురు? అతఁ డుత్తమశ్లోకుఁడని ప్రసిద్ధిగదా యని యందువేని, (1) దరిద్రు లతని నట్లు శ్లాఘింతురు. కృపణులు=దీనులు. పక్షము = సహాయము. (2) కృపణుల కోటిలో నతఁ డుత్తమశ్లోకుఁడే గాని మాయట్టి వారి యందుఁ గాఁడనుట. (3) ఇంతవఱకు దీనులై తన్ను నమ్మిన వారికిఁ దనైన నిచ్చి యుత్తముఁడను కీర్తికిఁ దగియుండెను. ఇప్పుడో యది విపరీతలక్షణచే నతని యందు వర్తింపదు. శ్లోకము-కీర్తి, నీ కపటదరహాసాదులకు లక్ష్మి లోనగు నితరస్త్రీలు నీకు వశలైనఁ గానిమ్ము. మేము విచక్షణలము గావునఁ గుటిల నటనములకు లోపడము.

‡ నీ శిరస్సునందలి నాపాదమును వదలుము. నీవు కృష్ణుచే దౌత్యమునందు శిక్షింపఁబడి యిచ్చకపుముచ్చటలయందును సమాధానవాక్యము లాడుటయందును నిపుణుండవై యతనికడనుండి వచ్చితివని యెఱుంగుదును. స్వనిమిత్తమై పుత్రులను భర్తలను నితర లోకములను విడిచిన మమ్ముఁ దాను విడిచెను. ఇట్టి యకృతజ్ఞునితో నేమి సమాధానపడవలసి యున్నది?

భ్రమరా! వినుము లుబ్ధధర్ముఁడై వేఁటకానివలెఁ గపీంద్రుని

---

‡ కమలభ్రాంతిఁ దన పదంబుల వ్రాలి ధ్వనించు తుమ్మెదను జూచి దేవీ కోపింపకుము. శిరస్సుచే నీపాదములకు నమస్కరించుచున్నాను, నామనవి కొంచెమైన వినుమని యది చెప్పినట్లెంచి రాధపలుకుచున్నది. నాపాదమును వదలుము. నన్నుఁ దాఁకుటకు నీకు యోగ్యతలేదు. ఇచ్చకపు ముచ్చటలను సమాధానవాక్యములను నా పాదములనుగూడ వదలుము. రాయబారమునందుఁ గృష్ణునిచే శిక్షింపఁబడుట నీవును వంచకుఁడవని యెఱుంగుదుము. ఆయన మీకేమి యపరాధము చేసెనందువా? స్వనిమిత్తమై=తన కనఁగాఁ గృష్ణుని కొఱకుఁ గా. ఇతర లోకములను=పుణ్యలోకములను, తాను మమ్ము నుద్ధరించు నను నమ్మకముతో నీ లోకసంబంధములైన మగఁడు బిడ్డలు గృహకృత్యములను తన నిమిత్తమై వదలితిమి. దానధర్మాదులైనఁ జేసి స్వర్గాది పుణ్యలోకములను సాధించుటయు వదలితిమి. ఇట్టి మమ్ము వదలినవాఁడు కృతజ్ఞుఁడా? తన నిమిత్తమై యెవరేమి చేసినది! యెఱుఁగని శఠునితోఁ గఠినునితో నేమిసంధి కుదురును? స్వనిమిత్తమై = మేము పుత్రాదుల వదలునట్లు చేసినవాఁడితఁడే. పుత్రులను భర్తలను నితరలోకములను విడిచిన మమ్ముఁ దాను స్వనిమిత్తమై=(ఆత్మార్థమై) విడిచెననియు నొకయన్వయము. స్వనిమిత్తము=సు+అనిమిత్తము - లేశమైనఁ గారణములేకయు నని చెప్పవచ్చును.

* శ్రీరాముఁడు నల్లనివాఁడు - చెట్టుచాటుననుండి వానరుఁడగు వాలినిఁ జంపెను. లుబ్ధధర్ముఁడు=బోయల ధర్మము కలవాఁడు, కపీంద్రుని = వాలిని, నల్లని మగవారిని నమ్మరాదను సామెత నాధారముచేసికొని శ్రీరామాదుల నిదర్శనముగాఁ గొని కృష్ణుఁడును నమ్మరానివాఁడని రాధ చెప్పుచున్నది. వర్ణసామ్యముచేత నేకాక రామకృష్ణు లభిన్ను లను బుద్ధితో నీవాక్యము చెప్పఁబడినది. శ్రీకృష్ణుఁడు కృతఘ్నుఁడే కాక పూర్వమునుండి క్రూరుఁడనియు జెప్పుచున్నది.

ఇట్లు పొంచి చంపుట క్రూరుఁడగు వేఁటకాని ధర్మముకాని దయావంతుల ధర్మముకాదు, అలుబ్ధధర్ముఁడనియుఁ బదచ్ఛేదము. వేఁటకానివలె ననుటచేత లుబ్ధధర్మము చెప్పఁబడినది కావున నలుబ్ధధర్మ మనుటొప్పు. బోయవాఁడు తనకాహారముగ నుపయోగపడు జంతువులను మాత్రమే చంపునుగాని యితర మృగములఁ

వధించెను. స్త్రీజితుండై కామయానయగు శూర్పణఖను విరూపఁ జేసెను. బలియిచ్చిన బలిని స్వీకరించియు నతనిని బంధించి యధో లోకంబునఁ ద్రోచెను. అట్టి యసితవర్ణు సఖ్యము చాలుఁజాలు. అతని కథార్థములు త్యజింపరానివి.

*ఎవ్వాని చరితలీల యను కర్ణామృతంబున నొక్కబిందు

---

జంపఁడు. కావున నాహారమున కుపయోగింపని క్రోఁతిని జంపుట లుబ్ధధర్మమును గాదు. అంతకంటె ఘోరమైనదని భావము. అందు నిరపరాధియగు వాలినిజంపుట మహాఘోరము. దీనివలన మహాకఠినుఁడని యేర్పడెను. స్త్రీజితుఁడు=స్త్రీకి వశుఁడైన వాఁడు, సీతాప్రియుఁడు, కామయాన=(1) కామమే యిష్టప్రాప్తికి (యానము) సాధనముగాఁ గలది, (2) స్వైరసంచారము గలది. (3) తన్ను వలచివచ్చినది. ఇట్లు స్త్రీని దన్ను వలచివచ్చిన దానిని ముక్కు సెవులుగోసి విరూపఁజేయుట యెంత క్రూరకార్యము. రాముఁడు క్షత్రియుఁడు కావునఁ గ్రూరస్వభావుఁ డందువేని మఱియొక నల్లనివాఁడు బ్రాహ్మణుఁడు బ్రహ్మచారి యగు వానిచరిత్రము వినుము. బలిచక్రవర్తి తనకు బలి యియ్యఁగా కాకి బలిని గ్రహించినట్లు గ్రహించి కృతఘ్నుఁడై యాయననే బంధించి యధోలోకము పాలు గావించెను. దీనివలన మలినాంగులు మలినచిత్తులగుట రూఢియయ్యెఁ గావునఁ గృష్ణునితో సఖ్యము చాలును. అటైన నతని కథలనేల, మీరు ముచ్చటించుకొనెదరందువేని యది వారింపరానిది పరనిందకారాదని యెఱింగియు నతనిచే మోసపోయిన వారము కావున రోషావేశంబున నూరకుండఁ జాలకున్నారము. ప్రకృతిబలంబున మన స్వాయనయందే వర్తించుచున్నది. అది నిరాకరింపరాకున్నది యేమిచేయవచ్చునని రహస్యము.

*భ్రమరమా! యతని కథాస్మరణము మాకు మాత్రమే విడఁపరానిది కాగ. ఆతని నిమిత్తమై యిల్లు వాకిలి సంసారము విడిచినవారము మేము మాత్రమే కాము. అనేకులు కలరని స్తుతిగర్భనింద. లీల=స్వచ్ఛందక్రీడ, నిరస్త ద్వంద్వ ధర్ములు= (1) తొలఁగింపఁబడిన దాంపత్య ధర్మము గలవారు. ద్వంద్వము=భార్యాభర్తలు. (2) తొలఁగింపఁబడిన శీతోష్ణరాగద్వేషాది ద్వంద్వములుగలవారు, దీనగృహకుటుంబాదులు=దుఃఖించుచున్న తల్లిదండ్రి భార్యబిడ్డలు గలవి. దీనులై=గృహాది సుఖములవలన భ్రష్టులై, అనేకులు=అనేకజనులు, భక్తులు, విహంగములు=పక్షులు, భిక్షుచర్య=సన్న్యాసిచర్య; కష్టములచేఁ దమ ప్రాణములను మాత్రము కాపాడుకొను వృత్తి, వినులంబడినంతన=తానుగా నుచ్చరింపకపోయినను నితరులు చెప్పుకొనఁగా నాశబ్దములు తమంత నవివచ్చి చెవిలోఁ జొరఁబడినను, నీస్వామి కథలు వినుటకుఁ గర్ణరసాయంబుగ నుండును. ఐననేమి? అందొకటియైన నెప్పుడో యొకసారియైనఁ జెవిని బడినంతమాత్రమున నావినువారు వెంటనే మిథునధర్మమును శీతోష్ణాది భోగములను వదలి యింటఁ దల్లిదండ్రులు దారపుత్రాదులు దుఃఖించుచున్నను వారిని

వెప్పుడో యొకసారి వీనులఁ బడినంతన నిరస్తద్వంద్వధర్మలై మహా నష్టులై గృహకుటుంబాదుల విడిచి తత్క్షణమం దదీనులై యనేకులు విహంగములవలె భిక్షుచర్యఁ జరించుచున్నారు.

* వేఁటకాని మధురరవంబు విని వానివలలోఁ బడు కృష్ణ

---

విడిచి యేకాకులై తా నడవులపాలై తన శరీరము మాత్రము పోషించుకొనుచు దుఃఖపుబ్రతుకు బ్రదుకుచుఁ బక్షివలె నల్లాడుచున్నారు. తత్క్షణమందు అదీనులై= కుటుంబదుఃఖముచేఁ గలఁత నొందని మనస్సుగలవారై యని యర్థము. మహానష్టులై= మహా+అనష్టులు=ఏమియు నశింపనివారు. భగవంతుని నామ మొక్కసారి చెవినిఁ బడిన నరులు సంసారమును త్యజించి ప్రవృత్తిమార్గమును వదలి నివృత్తిమార్గ నిష్ఠులౌదురని స్తుతిపర్యాయమున నర్థము. విహంగమువలె భిక్షుచర్య=హంసలవలె వివేక చతురులై పరమహంసవృత్తి నవలంబింతురని భావము. ఒకసారి=సకృదేవ ప్రపన్నాయ యనుట స్మరింపవలయు. ఒకసారి స్మరించువారి కట్టిగతిఁ గల్పించు వాఁడు సర్వదా స్మరించు మమ్మేగతిఁ బట్టింప నున్నాఁడో యని భావము.

* ఇంతటి తెలివిగలిగి విచక్షణలమని చెప్పుకొను మీ రెట్లతనికి వశపడితి రని యడిగెదవేని వినుము.-కృష్ణవధువులు=కృష్ణసారము(జింక)యొక్క భార్యలు, హరిణులు=ఆఁడు జింకలు, అజ్ఞలు= 'ఎఱుకగలరె తరుణులెందు' నన్నట్టు స్త్రీలము గావున నెరుటివా రేదేని మంచిమాటాడినఁ దటాలున నమ్ముదుముగాని వారిలోఁతు పాఁతు తెలిసికొనఁ జాలని వారము. కృష్ణవధువులైన మేము=కృష్ణునకు వివాహిత భార్యలవలె విధేయలై యున్నవారము. కుటిలుని=అతఁడు మా స్తనప్రాంతముల నించిన యీగోటికాటులను జూచినపిమ్మట వీనివలె నతఁడు కుటిలుఁడని యతనినడవడిచే నిప్పు డెఱిఁగితిమి. నఖస్పర్శములు=అతఁడు మాతోడ నుండినపుడు బోయవాని బాణములవంటి యతని గోళ్లగిచ్చులవలని బాధతప్ప మ రేసుఖ మెఱుఁగము. పలుమారు మమ్ముఁ దాఁకి చెఱిచెనుగాని తనివిదీరఁ గామసుఖముఁ గూర్చినవాఁడు కాఁడు. అతఁడు విడిచిపోయి సహింపరాని మన్మథవేదనపాలు గావించెను. ఈనఖస్పర్శములంగని=అతనితోడ నదఁగి పెనఁగి యుండిననాఁటి యిట్టి చిహ్నములను జూచిచూచి తల పోసిపోసి తపించుచున్నారని భావము. ఆయన జ్ఞాపకార్థ మీ చిహ్నముల నిప్పటికి మాయనీక కాపాడుకొనుచున్నారము. కూడియుండినపుడు నఖక్షతములచేతను విడిపోయినపుడు మదనతాపముచేతను బాధపెట్టు నతని కథలేల? వేఱుకథలేవైనఁ జెప్పుము. అతని చరిత్రము స్మరించుకొలఁది మాకు స్మరతాప మతిశయించునుగాని శాంతింపదు. కావున నది శాంతిపడు మంచిమాట లేవైన నుండిన జెప్పుము. ఉపమంత్రీ=దూత! హాస్యము ప్రధానముగాఁగల భండవిద్యయందు సమర్థుఁడా. ఈ యుపవాసవార్తకంటె వేఱగువార్త నేదైనఁ జెప్పుము.

వధువులైన హరిణులవలె నజ్ఞలైన మేమును నాకుటిలుని వాక్యములు నిక్కములని నమ్మి పెక్కుతడవ లతని యీ నఖస్పర్శములంగని తీవ్ర స్మరవేదన పాలయితిమి. కావున నో యుపమంత్రీ! యితరవార్త లేవైనం జెప్పుము.

* ప్రియసఖుఁడా! మరల వచ్చితివా? ప్రియుఁడు నిన్ను

* ప్రియసఖుఁడా!=ప్రియునిసఖుఁడా! మరలవచ్చితివా? కమలభ్రాంతినిదన పాదములవ్రాలిన తుమ్మెదను విదలింపఁగా నది పోయి హస్తపాదపద్మాది సౌగంధ్య లోభంబున మరలివచ్చినందున నది ప్రియునియొద్దకుఁ బోయి మరలవచ్చి నట్లెంచి రాధ సంబోధించుచున్నది. ప్రియుఁడు...బంపెనా? ప్రియుఁడగువాఁడెట్లయినఁ బ్రియురాండ్ర సమాధానపఱుప యత్నించును గావున నేనన్నమాట లతఁడు నీచే విని కోపింపక మమ్ము శాంతిపఱుప మరల నిన్నుఁబంపెనా? అనిప్రశ్నింపఁగా నది ధ్వనింపకయూరకున్న మౌనమంగీకార చిహ్నమని తలఁచి రాధ చెప్పుచున్నది. అట్లైనచో నీవు మా పూజకుఁ దగినవాఁడవే. ఇప్పుడు నీకు మధుప కితవబంధు శబ్దములు తగవు, పూజ్యుఁడవై యతిథిగా దూతగా మాకడకు వచ్చిన నీ కోరిక నెఱవేర్చుట మాకు విధి కావున మమ్మేమి చేయుమనెదవు? నీ యిష్ట మేదిజెప్పుము. అనియడిగి మీరు మధురాపురికివచ్చేయుట నాకోరికయని యాతుమ్మెద ప్రత్యుత్తర మిచ్చి నట్లెంచి రాధ చెప్పుచున్నది, దుస్త్యజ ద్వంద్వుఁడు=విడువరాని మధురాపుర స్త్రీలతో మిథునీభావము కలవాఁడు కృష్ణుఁడు. అతని పార్శ్వమునకు నీవు మమ్ముఁ దోడుకొని పోయెదవా? అందఱు సవతు లుండుచోటికి మేమెట్లు వత్తుము. వారికి వశుఁడైనకృష్ణుఁడు మమ్మాదరించునా? అని యడిగి మీరువచ్చినయెడలఁ గృష్ణుఁడు వారినందఱ ధిక్కరించుట నిజమని యదిప్రత్యుత్తరమిచ్చినట్లు భావించిరాధ చెప్పు చున్నది. నీవు చెప్పినది సత్యము, మామందఱ నావరాక లెంత? అయినను నిక్కడ నుండికృష్ణుని వెంటఁబోయిన శ్రీ=(సర్వదా యాశ్రయించియుండినది) సాకముగ= సంతోషముతో నెల్లప్పుడతని వక్షస్థలమందే రమించుచున్నదిగదా, ఇది యీర్ష్య తోఁగూడినమాట, శ్రీ= సర్వజనులాశ్రయించునది యను, సా=(స+అ) విష్ణువును గూడియుండు నది లక్ష్మి, కమ్ముగ=సుఖముకలుగునట్లు, అనియు భేదము, ఇదిశ్రీకృష్ణుని లక్ష్మీరేఖలను లక్ష్మిగా నుత్ప్రేక్షించి చెప్పినమాట, లేదా లక్ష్మియనపాయిని యను భావముతోనైనఁ జెప్పఁబడినది. కృష్ణుఁడిచ్చట నుండినపుడు లక్ష్మియు నుండెను గదా యందువేని మా వ్రజస్వాభావ్యముచే నామె యిట నాదరింపఁబడ లేదు. ఆమె సంపత్తికంటె నెక్కువ సంపత్తియే మామందయందుఁ గలదు. అచ్చటనో యట్లుగాదు. ఆమెసంపత్తి మాత్రమే పురుషార్థసాధకమగుటచే నామెకచ్చట గౌరవము మెండు, అట్టిచోటికి మే మెట్లువత్తుము? కావున నాయన నేయిచ్చటికిఁ దోడితెమ్మని రహస్యభావము, ఇందు నీర్ష్యయు, స్పృహయు వ్యంగ్యములు.

మరలఁ బంపెనా? అట్లైన నీవు మాకుఁ బూజ్యుఁడవే. కావున నయ్యా నీ యిష్టమేదైనఁ గోరుము. దుస్త్యజ ద్వంద్వపార్శ్వంబునకు మమ్ముఁ దోడుకొని పోయెదవా? అదియెట్లు పొసఁగు? సౌమ్యుఁడా! శ్రీ సాకమ్ముగ నిరంతర మతనివక్షస్థలమునందే యుండును గదా.

సీ. కాంచన రత్నసంఘటిత సౌధంబులే
మాకుటీరంబులు మాధవునకు?
వివిధ నరేంద్రసేవిత రాజధానియో
మాపల్లె యదువంశ మండనునకు?
సురభిపాదపలతా శోభితారామమే
మా యరణ్యము సింహమధ్యమునకుఁ?
గమనీయలక్షణ గజతురంగంబులే
మాధేనువులు కంసమర్దనునకు?
తే. రూపవిభ్రమనైపుణ రూఢలైన
మగువలమె మేము మన్మథ మన్మథునకు?
నేల చింతించు? మముఁ గృష్ణుఁ డేల తలఁచు?
పృథివి నధిపులు నూతన ప్రియులు గారె.

అయ్యా! యా యార్యపుత్రుండు మధురయం దిప్పుడు సుఖమున్నాఁడా? తండ్రి యింట్లను బంధువులను గోపకులను నెప్పుడైన స్మరించునా? అతఁడు తన కింకరీజనులమైన మాకథ లెప్పుడైన నొక కైనఁ బ్రస్తావించునా? అకటా యగరువాసన గుబులుకొను నతని కరంబు మా శిరంబులపై నెన్నఁడుంచునో కదా?*

---

*అయ్యో! యేమి యిట్లు వదరుచున్నాను. అడుగవలసినవిషయ మడుగక పోయితిని గదా యని యార్జవము, గాంభీర్యము, దైన్యము, ఉత్కంఠగూడిన పలుకులను గన్నీళ్ళు కార్చుచుఁ బలుకుచున్నది. ఆ యార్యపుత్రుండు=గోకులమునకుఁ బ్రాణమువంటి వాఁడగు నార్యపుత్రుండు, ఆర్యపుత్రుఁడు = మాపతి, ఇది యార్జవమును దెలుపును. మధురయం దున్నాఁడా = అని దీర్ఘకాలముగ నతని యొద్దనుండి సందేశమైన రానందున నడుగఁబడెను. అయినను ఆయన మతియెందుఁ బోయినవార్త వినకుండియు నిట్లు గాంభీర్యముచే నపహాసముగఁ బ్రశ్నింపఁబడెను. తొలితొలి ప్రశ్నలతోఁ దృప్తి లేకుండుటచేత 'అందు సుఖమున్నాఁడా? మమ్ము స్మరించునా యని మీఁదమీఁదఁ దరువాతిప్రశ్న లడుగఁబడెను. బంధువులను = ఉపనందుఁడు లోనగువారిని, గోపకులను = శ్రీదామాదులను, అతఁడు =

## ఉద్ధవుఁడు గోపికలకు శ్రీకృష్ణసందేశమును దెలుపుట.

అని యిట్లు పలుక నుద్ధవుండు కృష్ణదర్శన లాలసలైన యా మదాలసల వాక్యంబు లాకర్ణించి వారి నూరార్చి యిట్లనియె. ఆహా! కృతకృత్యలనిన మీరే కృతకృత్యలు. మీరే లోకపూజితలు. భగవంతుఁడైన వాసుదేవునకు మీరింత నిశ్చలంబుగ నిర్మల మనస్సు నర్పించితిరి. దానములు వ్రతములు తపస్సులు హోమములు జపములు వేదాధ్యయనము జితేంద్రియత్వము లోనగు శ్రేయస్కర మార్గములన్నిటిచే సాధింపఁదగినది కృష్ణభక్తియే. మునులకును దుర్లభమైన యనుత్తమ భగవద్భక్తిని మీరు పొందితిరి. ఔరా! యెంతటి యదృష్టము? పతి సుత హిత బంధు గేహ దేహంబులను విడిచి పరమ పురుషుండైన కృష్ణుని వరించితిరి, వరించుట మాత్రము కాదు. సర్వకాలసర్వావస్థల సర్వప్రకారంబుల నాయనయందు భక్తిఁ జేసితిరి. మహాభాగలారా! మీ యట్టి భక్తురాండ్ర దర్శింపను విరహంబున మీభక్తి యిట్టిదని నాకుఁ దెలుపను భగవంతుఁడు నన్ను మీకడకుఁ బంపుటయుఁ బరమానుగ్రహంబ. విరహపరవశత్వంబున మీరు కావించిన కృష్ణస్మరణంబు విని నేనును గృతార్థుండనైతిని. కల్యాణులారా! సుఖావహంబైన ప్రియసందేశంబు వినుఁడు. మీభర్తకు నేను రహస్య కార్య ఘటకుఁడను. భగవంతుఁ డీమాటలు మీతోఁ జెప్పుమనెను.

సతులారా! మనకు వియోగంబు కలిగెనని దుఃఖింపవలదు. ఏప్రకారము చూచినను నేను మిమ్ము విడిచి యుండువాఁడఁ గాను. ఎట్లంటిరేని సమస్త చరాచరపదార్థములందు నంతరాత్ముఁడనై యుండు

---

ప్రాణవల్లభుఁడు, చనవునఁ జెప్పినమాట. ఎప్పుడైన=ఏసందర్భమందైన, నేకాలమందైన కింకరీజనులము=బహువిధముల సేవించినవారము సేవింపఁ గోరువారము. కథలు=ఇవియనేకము లగుటబహువచనము. వానిలో నొకటైన = ఇది దీనోక్తి, అగురువాసన = అగురుకంటెను మంచిపరిమళము స్వభావముగనే గల, కరంబు శిరంబులపై నుంచునో = కింకరీజనముగా గ్రహించితినని యభయహస్తమిచ్చునో, ఆర్యపుత్రుఁడని తొలుతఁ జెప్పి కింకరులుగా గ్రహింపుమని ప్రార్థించుట దైన్యము చేతనే, ఆయనయింటిలోఁ జీపురుకట్టవలె నెంచి నమ్ముఁ దనసరిఁ జేర్చుకొనినను ధన్యులమని యాయనకైంకర్యము చేయుచుందుమని భావము,

వాఁడనుగదా. అంతియకాక పృథ్వ్యాకాశ వాయ్వగ్ని జలభూములు చరాచర భూతంబుల నాధారంబుచేసికొని యుండు నట్లు మనస్సు ప్రాణము బుద్ధి యింద్రియములు గుణములు తత్కారణ భూతుండ నైన నన్నాధారము చేసికొని యున్నవి. కారణమును విడిచి కార్య ముండదు గదా. నా సంకల్పప్రభావంబునఁ బంచభూతములయు నేకాదశేంద్రియములయు సత్త్వరజస్తమోగుణములయు రూపంబున నన్ను నేనే నాయందుఁ బుట్టింతును గిట్టింతును బోషింతును. జీవుండు జ్ఞానరూపుఁడు స్వతశ్శుద్ధుఁడు కావుననే దేహేంద్రియ మనఃప్రాణా దులకంటె వ్యతిరిక్తుండు. ఆకారణముచేతనే వాస్తవమునఁ బ్రాకృత సత్త్వాది గుణరహితుండు. అటులయ్యును బ్రకృతి పరిణామములవలనఁ గలిగిన మనోవ్యాపార విశేషాత్మకంబులైన మాయావృత్తులగు జాగ్ర త్స్వప్నసుషుప్తులచే జీవుండావరింపఁబడి యున్నవాఁడు. నిద్రనుండి లేచినవాఁడు కలలోఁ జూచినపదార్థములవలె నింద్రియార్థములు మృషలని తలంచుచు నా యింద్రియార్థంబులైన విషయంబులకై యింద్రియంబులఁ బోనిచ్చు మనస్సును దొలుత నిరోధింపవలయును. ఇట్లీ మనోనిగ్రహమందు హెచ్చరిక గలిగియుండువాఁడు నన్నుఁ బొందును. నదులకన్నిటికి సముద్రప్రాప్తిగో యంత్యఫలమైనట్లు మనీషులకెల్ల యోగము సాంఖ్యము త్యాగము తపస్సు దమము సత్య మను సమామ్నాయమునకు మనస్సు నిగ్రహించి దానిని నాయందు నిల్పుటగో యంత్యఫలము.

రమణులారా ! నేను మీచూడ్కికి దూరమునందుండుట నా యందు మీకు నిరంతర నిరంతరాయ ధ్యానము కలిగించుటకే గాని నిర్దయబుద్ధిఁ గాదు. దూరమునందుఁ దమప్రియుఁ డున్నప్పుడతనిపై మనస్సు నిల్చునట్లు స్త్రీల కతఁడు సమీపమున నున్న వేళ నిలువదు. మనస్సంతయు నాయందేయుంచి దానివలన సమస్త చిత్తవృత్తులవలన విడువఁబడి నన్నే సతతము ధ్యానించుచు శీఘ్రకాలమునందే నన్నుఁ బొందఁ గలరు. కల్యాణులారా ! యారాత్రి తల్లిదండ్రులు లోనగు వారు బలాత్కరించి వారింప రాసక్రీడకు రావలను పడక యింటఁ

జిక్కిన గోపికలు మత్స్వభావంబునే తీవ్రంబుగ ధ్యానించుచు నన్నుఁ బొందిరి కదా! తీవ్రధ్యాన ఫలం బిట్టిది. ఇట్టిది మీకు సమకూరఁ జేయ దూరమునందున్నవాఁడనని కృష్ణుండు మీతోఁ జెప్పుమనియె నని యుద్ధవుండు పలుకఁ దత్సందేశంబు విని సందేహంబువాసి గోపా ముదితలు ముదితలై లబ్ధస్మృతులై యాయనతో నిట్లనిరి.

అయ్యా! యాదవకుల విరోధియు దుఃఖదాతయు నగు కంసుండు మా యదృష్టంబున హింసింపఁబడియె. మా యదృష్టంబున నాప్తులవలన సర్వార్థములుపొంది మాకృష్ణుండు కుశలియై యున్నవాఁడు కదా? సాధువరా! స్నేహపూర్ణమును సలజ్జము హాసోదారంబులైన చూడ్కుల మేమర్పించిన కృష్ణుఁడు పురసతుల విభ్రమవచన చాతుర్యాదులకు వశుఁడై వారియందుఁ బ్రీతి కూర్చుచున్నాఁడు గదా? రతివిశేషజ్ఞుండైన ప్రియుండు నగరి కరిగమనల నుడికారంబులకు నోడింబడక యుండునొక్కో? ఆ మిటారుల గోష్ఠినుండు నెడ వారి ముచ్చటలలో నవాంతరకథగానైన నీ పల్లెటూరి గొల్లపల్లవోష్ఠుల గోవిందుఁడు స్మరించునా? కుముదకుంచేందు సుందరంబైన బృందావనంబున మనోజ్ఞకథలు వచించుచు మనోహరచరణ నూపుర ఝుళంఝుళారవం బెసఁగ రాసక్రీడ సలిపిన గాత్రులనైన నెపుడేని యా ముకుందుండు మనస్సునకైనఁ దెచ్చునా? అయ్యా! యింద్రుండు మేఘములచే వనంబు నుజ్జీవింపఁజేయు భంగిఁ దన నిమిత్తంబున సుమ్మలికంబుపాలైన మమ్ము బ్రతికింప నామురళీగానవినోదియిటకువచ్చునా? ఏల వచ్చును? రాఁడు రాఁడు, ఏలంటివా? పగతుర జయించి రాజ్యంబు బ్రాపించి చుట్టములెల్లఁ దన్నతిప్రీతిఁ జుట్టుకొని సేవింపఁ దనకు నీడుజోడగు రాచకన్నెలఁ బెండ్లియై పురియువాఁ డిట కేల వచ్చును? మహాత్ముఁడును శ్రియఃపతియు నవాప్త సమస్త కాముఁడు నైన కృష్ణునకు నడవులఁబడియుండు మాతోఁగాని మఱి యితరుల తోఁగాని యేమికార్యంబు గలదు? పింగళ యను స్వైరిణి యాశ మానుకొనుటే పరమసుఖంబని వచించెఁ గాని యది యెఱింగియు మే మదేమో కృష్ణునియం దాశ మానలేకున్నారము. తానై కోర

కున్నను లక్ష్మీదేవి తనంతటఁ దానేవచ్చి యెవ్వని వక్షస్థలంబున నిలిచి-యనపాయినియై యుండు నట్టియుత్తమశ్లోకుని రహస్యవార్త లెవ్వఁడా కర్ణింప నుత్సహింపరు. అయ్యా! బలరామసహాయుండై కృష్ణుం డీనదీ శైల వనప్రదేశంబుల మేపిన యీ యావులును వేణురావంబును మఱిమఱి కృష్ణునిఁ దలపించుచున్నవి. లక్ష్మీవాసంబులైన యాయన యడుగుల గుర్తులు మఱవ నాకెట్లు శక్యము? సలలితోదారహాస లీలావిలాసావలోకనంబులను మరందబిందుతుందిలసూక్తులును మా యుల్లంబులు కొల్లగొనిన యా నవనీతచోరు నెట్లు మా మనంబుల నుండి వెలిపెట్టఁ గలము?

క. మాకాంత! రమాకాంత! ప్ర
జాకాంతా! దీనరక్ష! జననాథ! మహా
శోకార్ణవమున మునిఁగిన
గోకులమును నుద్ధరింపు గోవింద! హరీ!

సాధుజనోత్తమా!

సీ. నూపల్లెవీథుల మాధవుం డరుదేరఁ
గన్నారఁ గనెడి భాగ్యంబు గలదె?
కనినంతఁ జులుకుఁజూపున బొమ ముడివెట్టి,
వాతెఱ విఱిచెడి వలను గలదె?
ప్రాణేశు నర్మసంభాషలు శ్రవణామృ
తంబుగా విను నదృష్టంబు గలదె?
చేరినయంతన చేయూఁతఁ గౌఁగిటఁ
నదిమి ముద్దిడెడి పుణ్యంబుగలదె?
గీ. వచ్చునా యిటకెన్నఁడేని వాసుదేవుఁ?
డిచ్చునా మోవిపానకం బిమ్ముమీఱఁ?
గ్రుచ్చునా మమ్ముఁ గౌఁగిటఁ గూర్మివెలయ
బంధుజీవమ! నిక్కంబు పలుకవయ్య.

అని యిట్లా కాంతలు తమ స్వాంతములఁ గల వంతయంతయు వెల్లడించి రమాకాంతు సందేశంబుఁ దలంచి యధోక్షజుండు తమ

యంతరాత్మయని నిత్యసన్నిహితుఁడని తెలిసి యూరడిల్లి విరహతాపం బణంచుకొని యుద్ధవునిఁ బూజించిరి. ఆయనయు గోపికల దుఃఖమార్చుచుఁ గొన్ని నెలలు గోకులంబునందు కృష్ణలీలాకథలు వినుచుఁ బాడుచు సుఖంబుండె. ఉద్ధవుండు నందసదనంబున నున్న యన్నిమాసంబులు వాసుదేవ కథాశ్రవణంబునఁ జేసి గోకులంబు వారికి క్షణప్రాయంబుగఁ గడచె. కృష్ణుండు సంచరించిన నదీ వన గిరిగుహాదుల వీక్షించుచు నందుఁడు నందనందనుం డొనర్చిన కార్యంబు లెవ్వియని గోపికలఁ బ్రశ్నించి వారికి గృష్ణలీలలు స్మరణంబునకుఁ దెచ్చుచు హరిదాసుండు కాలంబు గడపె. అప్పుడా గోపికలు కృష్ణావిష్టమనస్కలై విహ్వల లైనంజూచి యుద్ధవుండు పరమప్రీతుండై వారికి నమస్కరించి యిట్లు గానంబొనర్చె.

ఓరా! యీగొల్లపడుచులే సార్థకజన్మలు. జననమరణభీతిచే మోక్షాసక్తులైన మునులును మేమును, దేనిని గోరుదుమో యట్టి యఖిలాత్ముఁడైన హరియందలి భక్తియీవల్లవపాలికలందు సర్వకాలసర్వావస్థల నిశ్చలంబయ్యె. నారాయణకథలయం దనురాగము గలవానికి లేనివానికిని బ్రాహ్మణజన్మంబన నేల బ్రహ్మజన్మంబైన నేమి ఫలము? అడవుల విచ్చలవిడి దిరుగు పడుచుఁ జేతల గొల్లపడుచు లేడ? పరమాత్ముఁడైన కృష్ణునందు నచంచలభక్తి యేడ? తెలిసెఁ దెలిసె. వస్తుతత్త్వంబుఁ దెలియకయు నమృతంబు సేవించిన రోగంబులు నశించి యారోగ్యాభివృద్ధి యగునట్లు భగవత్తత్త్వంబు తెలియని స్త్రీశూద్రాది పామరులైనను నేకారణముచేనైన భగవంతుని సేవించిరేని శ్రేయస్సు గందురు. భగవత్తత్త్వమంతయు నెఱింగి సేవింప నెవ్వఁ డోపు? రాసక్రీడయందు ముకుందుండు తన బాహుదండంబుల వీరి కంఠంబులు గౌఁగిలించి వీరిని సఫలమనోరథలం గావించెఁ గదా? ఇట్టి యనుగ్రహంబు మహాత్ముదేహంబునే యాశ్రయించి నితాంత రతిగల శ్రీదేవికైనను నళినగంధకాంతులు గల యచ్చరలకైన లభించెనే? ఇఁక దక్కిన వారిమాటయేల? నేనో విడువరాని బంధువులను నార్యమార్గంబును విడిచి వేదంబులు వెదకుటయందు శ్రమించు

గోవింద పదారవిందంబులందు సంతతాసక్తచిత్తలగు నీమత్తకాశినుల పాదధూళిఁ బవిత్రంబులైన బృందావన గుల్మలతౌషధీక్రిములం దేదేని యొక రూపంబుగ జన్మింప నాశపడుచున్నాఁడను. రమారమణియు నాప్తకాములైన బ్రహ్మాదులును యోగీశ్వరులును దమ యాత్మలం దెవ్వాని నర్చింతు రట్టి ముకుందుచరణారవిందంబులును రాసకేళియందుఁ దమ స్తనంబులఁ గౌఁగిలించి లోవెలితాపంబుల నెల్ల నెవ్వ రుజ్జగించిరి. యెవ్వరు కృష్ణకథాగానంబుల ముల్లోకంబులను బావనంబు చేయుదు రట్టి నందవ్రజ సుందరుల పాదరేణు బృందంబునకు వందనంబులు గావించెద.

అని వారల మాహాత్మ్యంబు వర్ణించి యుద్ధవుండు గోపికల యనుజ్ఞ పడసి యశోదానందులకు గోపాలురకుఁ బోయి వచ్చెదనని చెప్పి ప్రయాణసన్నాహంబుఁ గావింప నందఁలు నానావిధములయిన కానుక లర్పించిరి. అప్పుడు నందాదులు కన్నుల బాష్పంబు లురల నాయనతో నిట్లనిరి. అయ్యా! మామనోవృత్తులు కృష్ణుపాదాంబుజంబుల నాశ్రయించి యున్నవి. వాక్కాయననామమునే జపించు చున్నది. దేహంబు లాయనకు నమస్కారాదు లొనర్ప నాసక్తము లైనవి. పుణ్యాపుణ్యకర్మము లొనర్చి సంసారమున వర్తించు మాకే జన్మమందైన నీశ్వరేచ్ఛవలన శుభకార్యములవలనను దానములవలనను భగవంతుఁడైన కృష్ణునియందలి భక్తిలభించుఁ గాక. అని కృష్ణభక్తిచే సంతోషపెట్టఁబడినవాఁడై యుద్ధవుండు రథంబెక్కి కృష్ణపాలితంబై పరిపూర్ణకామధురయగు మధురకు నరుగుదెంచి కృష్ణునకు నమస్కరించి గోకులవాసుల భక్త్యుద్రేకంబు నెఱింగించి రామకృష్ణులకు నుగ్రసేనునకు వారిచ్చిన కానుకల సమర్పించె.

## కృష్ణుండు కుబ్జాగృహంబునకుఁ బోవుట.

అంతఁ గృష్ణుం డొక్కనాఁడు పూర్వముకుబ్జకుఁ దానొసఁగిన వాక్యదానంబుస్మరించి సర్వాత్ముఁడును సర్వదర్శనుఁడైన కృష్ణుండు కామత ప్తయైన కుబ్జయింటికి దానికిఁ బ్రియంబొనర్ప నేగె. అస్పష్టయు

మైన గృహోపకరణములచేతను, క్రీడోపకరణంబులచేతను, ముక్తాదామపతాకాదుల చేతను, వితాన శయనాసనాదులచేతను, సురభి ధూపంబులచేతను, దీపంబులచేతను, గంధహారాదులచేతను, రతి బంధచిత్రలేఖనంబులచేతను రమ్యంబైన తన యింటికివచ్చు కృష్ణుం జూచి కుబ్జయు సంభ్రమంబున లేచి యెదురేగి తోడితెచ్చి యర్ఘ్యాసనాదుల గౌరవించె. ఉద్ధవుండును జక్క గౌరవింపఁబడినవాఁడై తన కర్పించిన పీఠంబును స్పృశించి క్రిందఁగూర్చుండె. కృష్ణుండును లోకాచారం బనువర్తించి నూతనశయ్యపైఁ గూర్చుండె. అదియును స్నానమాడి తోడిపూసికట్టి తాంబూలచర్వణంబుఁ గావించి యలంకరించుకొని కృష్ణునకుఁ గానవచ్చు నట్లొకయోర లజ్జాలోలస్మిత విభ్రమవిలోకనంబులఁ జూచుచు నిలువంబడియుండె. కృష్ణుండును దాని కంకణాలంకృతకరంబును బట్టుకొని చేరరాఁ దిగిచి శయ్యపైఁ జేర్చి యంగరాగార్పణ వశంబునఁ బుణ్యంబొనర్చిన యాయింతితో నది కోరినట్టు రమించె. అదియును గామతప్తయై యతని కరంబు నురంబున నేత్రంబుల స్తనంబులనుంచుకొని గాఢంబుగఁ గౌఁగిలించి దీర్ఘతాపంబును బాసె. ఈ విధంబుగఁ గైవల్యనాథుం డంగరాగ దాన కారణంబున లభింప నా నిర్భాగ్యురాలు మోక్షంబు గోరక యిఁకఁ గొన్నిదినంబులు నాయింటనుండి నాతో రమింపుమని కోరుకొనియె. కృష్ణుండును దాని కోరినవరంబిచ్చి యుద్ధవసహితుండై తన యింటి కరిగె.

## రామకృష్ణు లక్రూరునింటికిఁ బోవుట.

అంత నక్రూరునకుఁ దానిచ్చిన బాసదలంచి కృష్ణుండు రామోద్ధవసహితుండై యతని గృహంబున కరిగె. అతండును నరవరశ్రేష్ఠులును స్వబంధువులు నగు వారిమువ్వుర దూరంబుననంద కాంచిలేచి సంతోషంబున వారిని గౌఁగిలించి వారికి నమస్కరించి వారి యభివాదనంబులు గైకొని యర్ఘ్యాసనంబులఁ గూర్చుండఁజేసి పాదప్రక్షాళనంబు గావించి యాపాదతీర్థంబు శిరంబుపైఁ జల్లికొని

యోగ్యాంబరభూషణ గంధమాల్యాదు లర్పించి వారిపాదంబులు తొడపై నిడికొని యొత్తి వినయంబున శిరంబువ్రాల్చి రామకృష్ణులతో నిట్లనియె.

కులద్రోహియైన కంసుండు సపరివారుండై మా యదృష్టంబున హతుండయ్యె. మీ వలన నీ యదువంశంబు దుఃఖంబువలన నుండి యుద్ధరింపఁబడి యభ్యుదయంబు నొందె. మీరు జగత్కారణులు జగన్మయులునైన ప్రధానపురుషు లరు. మీ కంటె నుత్కృష్టమైనది కాని తదాత్మకంబు గానిది గాని వేఱొండు లేదు. ప్రకృతి పురుషకాలంబులను స్వశక్తులచే నాత్మసృష్టంబై నామరూపవిభక్తంబై చిదచిదాత్మకంబైన యీ విశ్వంబును నియంతయు నంతరాత్మవునై యనుప్రవేశంబుఁ గావించి శ్రుతిప్రత్యక్షర గోచరంబుగా నానా విధముల మీరు కాన వచ్చుచుందురు. ఎట్లనఁ జరాచర భూతంబు లందుఁ బృథివ్యాది పంచభూతంబులు పలువిధములఁ దోఁచు భంగిని నేకరూపుఁడవును స్వతంత్రుఁడవును నంతరాత్మవునై నీవు నీవలనన కలిగిన పదార్థంబు లందు నానావిధంబులఁ బ్రకాశింతువు. ఆత్మశక్తులైన రజస్తమస్సత్త్వగుణంబులచే విశ్వంబును సృష్టింతువు. హరింతువు రక్షింతువు గాని వాని గుణకర్మములచే బద్ధుఁడవు గావు. జ్ఞానాత్ముఁడవైన నీకది బంధకారణ మెట్లగు? జీవాంతరాత్మవైన నీకు దేహాద్యుపాధులు నిరూపింపఁ బడకుండుటచే నీకు సాక్షాజ్జన్మంబు లేదు. ఆ కారణమువలన నీకు జన్మకారణమైన కర్మబంధమును లేదు. దాని నుండి విడివడుటయు లేదు. కావున స్వభావమునఁ గామాది విరహితుండ వగు నీకు దేహాద్యుపాధులు కల వనుట మా యవివేకము. ఎప్పు డెప్పు డనాది వేద మార్గంబును దుష్టపాషండ మార్గంబు బాధించు నప్పు డప్పుడు లోకరక్షణార్థంబు నేనుబరిశుద్ధసత్త్వమయ విగ్రహంబు ధరింతు నని నీవ చెప్పియుంటివి. దేవా! యట్టి నీ విప్పుడు రాజు లను నెపమున భూమికి బరువుగఁ బుట్టిన రాక్షసుల ననేకాక్షౌహిణుల రూపుమాపి భూభార మణంపనిజాంశమున యదుకులంబు వెలుంగ వసుదేవు నింట నవతరించితివి. అధోక్షజా! యెవ్వఁడు సర్వదేవ పిత్ర

భూత నరదేవమూర్తి యెవ్వని పాదశౌచజలంబులు లోకంబులఁ బావనంబు గావించు నట్టి జగద్గురుండ వగు నీవు ప్రవేశించిన కతంబున మా గృహంబు లిపుడు మహాపుణ్యవంతము లయ్యె. భక్తులకుఁ బ్రియుండవును, భక్తులయందు బ్రీతిగలవాఁడవును, సత్యవచనుండవును, కృతజ్ఞుండవును, హితైకాచరణశీలుండవును, భజనశీలురకు సర్వకామంబు లననేల నిన్నే యిచ్చువాఁడవును, వృద్ధిక్షయ రహితుండవును, నగు నిన్ను విడిచి యెఱుకగలవాఁడు మఱొక్కని నేల శరణంబు వేఁడు. జనార్దనా! నాభాగ్యవశంబున యోగీశ్వరులకును గానరాని నిన్ను నేను నేఁ డిక్కడఁ గంటిని. నీ మాయను సుతకళత్రధనాప్తగేహదేహాది మోహరజ్జువును శీఘ్రంబునఁ ద్రుంచి నన్ను రక్షింపుము.

అని యిట్లు స్తుతించి యర్చించుచున్న యక్రూరుని జిఱునవ్వు వెలయ మాటలచేతనే యతని మోహంబున ముంచునట్టులు హరి యిట్లనియె.

అయ్యా! నీవు మాకు గురుండవు. జనక సోదరుండవు. సర్వదా శ్లాఘ్యబంధుండవు. మంచిచెడ్డలు తెలిపి రక్షింపఁ దగినవాఁడవు. మీకు మేము బిడ్డలము. మీవంటి భాగవతులు యోగ్య సత్తములు కావునఁ దమ శ్రేయస్సుగోరు మానవుల కెల్ల వేళ సేవ్యులు. స్వప్రయోజనపరులైన దేవతలు సాధువులు కారు. జల మయంబులైన తీర్థంబులు మృచ్ఛిలామయంబులైన దేవవిగ్రహంబులు దీర్ఘకాలంబునకుంగాని పావనులఁ జేయఁజాలవు. కావున వానిని దీర్థంబులని వారిని దేవతలని యనరాదు. దర్శన మాత్రముననే సాధువులు సేవించు వారిని బావనులఁ జేయుదురు. అట్టి సాధుసత్తముఁడవైన నీవు మాహితకాములలో శ్రేష్ఠుఁడవు. కావున మాశ్రేయంబుఁ గోరి హస్తినాపురి నున్న పాండవులయొద్దకుఁబోయి వారిదుఃఖంబు లరసి రమ్ము. తండ్రి లేనిబిడ్డలను దల్లి కుంతీదేవితోడ ధృతరాష్ట్రుండు తన పురికిం బిలిపించుకొనెననియు నిప్పుడు వారు హస్తినాపురంబున నున్నవారనియు వినుచున్నారము. ఆగ్రుడ్డిరాజు తనపుత్రులకు లోఁబడి తమ్ముని బిడ్డల

పట్ల సమప్రీతివర్తింపఁ డనుట నిశ్చయము. కావున నీ విప్పుడ పోయి యతని నడవడి సాధువో యసాధువో తెలిసికొని రమ్ము. కలదూ పెఱిఁగి మనవారికి మేలగుమార్గము సంఘటింతము. అని యక్రూరు నాజ్ఞాపించి కృష్ణుండు రామోద్ధవులతోఁ దన భవనంబునకుఁ బోయెను.

అక్రూరుండును హస్తినాపురంబునకుంబోయి ధృతరాష్ట్ర భీష్మ ద్రోణాశ్వత్థామకృప విదురాదులం గాంచి కుశలప్రశ్నం బుచితరీతిం గావించి యందుఁ గొన్నిదినంబులుండి పాండవుల విద్యాశస్త్ర పాండిత్యంబును జూచి ధార్తరాష్ట్రులు చూపోపక విషము పెట్టుట నీళ్ళఁ ద్రోయుట పాములఁ గఱపించుట లోనగు దుష్టకార్యంబులు చేయుట లెల్ల కుంతీవిదురులు చెప్పనెఱింగి క్రమ్మఱివచ్చు సమయంబునఁ గుంతి యిట్లనియె.

కృష్ణా కృష్ణామహాయోగీ విశ్వాత్మా విశ్వభావనా గోవిందా! బాలురతోడ దుఃఖించు నన్ను విపన్నురాలిం గావుము. మృత్యుసంసారమునఁబడి పరితపించు వారికి నీ చరణ కమలములు తప్ప వేఱొండు శరణంబు గానరాదు. శుద్ధుండవును, బ్రహ్మంబవును బరమాత్మయు యోగేశ్వరుండవును యోగంబవును నగు కృష్ణా! నీవే నాకు గతి. అని యిట్లు కుంతి దుఃఖింప నామెనూరార్చి యక్రూరుండు ధృతరాష్ట్రుఁ గానంబోయి యిట్లనియె.

విచిత్రవీర్యనందనా! కురుకులకీర్తి వర్ధనా! నీవు తమ్ముఁడు పాండుని మరణానంతరము సింహాసన మధిష్ఠించితివి. ధరణిని ధర్మంబునఁ బాలించియుఁ బ్రజలను మంచినడవడిచే రంజింపఁజేసియు, స్వజనులయందు సమబుద్ధిగలిగి పక్షపాతంబు లేక వర్తించియుఁ గీర్తి యార్జింపఁ గలవు. అటుచేయవేని లోక నిందలకుఁ బాలయి నరకమునఁ బడుదువు. కావునఁ బాండవులయందును నీ పుత్రులయందును భేద మెంచక సమబుద్ధిగలిగి వర్తింపుము. విదువరానట్టియు సర్వవిధములఁ ద న్ననుసరించియుండు నట్టియుఁ దన కన్నకొడుకులవలెఁ దమ్ముని బిడ్డల నెట్లు చూడవచ్చునందువేని వినుము,

అయ్యా! జీవలోకంబున నెవ్వరితోడను దేనితోడను విడువని కూటమి గలుగదు. తన దేహమునే తాను విడిచి పోవుట సిద్ధమై యుండ నిఁకఁ బెండ్లాముబిడ్డలవార్త చెప్పనేల? భూమిపై నొంటరిగానే మనుష్యుఁడు పుట్టుచున్నాఁడు. ఒంటరిగానే చచ్చుచున్నాఁడు. పుణ్యమును దానొక్కఁడే యనుభవించు చున్నాఁడు. పాపమును దానొక్కఁడే యనుభవించు చున్నాఁడు. అంతియగాని తన పుణ్యపాపములను బంచుకొనువా రెవ్వరును లేరు. కూడఁబుట్టి కూడఁజచ్చువారును లేరు. కావున నధర్మమార్గంబున సంపాదించు ధనమువలనఁ గలుగుపాపమును దానొక్కఁడే యనుభవించును. అయ్యా! దారపుత్రాదు లేదోయొకవిధముగ నొకప్పుడైనఁ గొంత కాలమువఱకుఁ గూడియుందురు గదా. అట్లుండు వఱకైన వారి రక్షణార్థము ధనము కావలదా యందువేని మూఢుండై యధర్మమార్గమున సంపాదించిన ధనమును నెవరెవరో యనుభవయోగ్యులగు భార్యాపుత్రాదుల మను నెపమునఁ దెలియునట్లు కొంత దెలియనట్లు కొంత హరించుచుందురు. ఎట్లందువేని జలములే జీవనముగాఁ గలిగి యందే వసించు జలజంతువులు జలములను భక్షించి గదా జీవించు. ఏదో యధర్మమార్గమున ద్రవ్యమార్జించి నాది నావారని, వీరిని బోషింపవలసిన భారము నాది యని యభిమానముచేఁ బోషించిన భార్యాపుత్రాదులు దేహము ప్రాణము ధనము లోనగునవి సంపూర్ణముగఁ దమ్ముఁ బోషింపకయే చచ్చిన మూఢుని వదలిపెట్టుచున్నవి. అన్నిటికంటె నెక్కుడయగు తన ప్రాణమే తన్ను విడిచిపోవుచుండ నితరులు విడుచుటేమి వింత. అట్టి వారికై యధర్మమార్గమున ధనమార్జించియుంచువాఁ డెంతటి బుద్ధిలేనివాఁడో! తన కనర్థము సంపాదించుకొన సమర్థుఁడైన యీ బాలిశుఁడు పాపమార్జించి యెవరికై దానాపాపమును గడించెనో యట్టి దారపుత్రాదులు తన్ను వదలిపోఁగా నా యపరిపూర్ణమనోరథుండు స్వధర్మవిముఖుం డంధతమిస్రం బను నరకంబునఁ గూలు.

కావున రాజేంద్రా! యీలోకమును స్వప్నమాయా మనోరథంబని నమ్మి నీవు నీమనస్సును నిగ్రహించి శాంతుండవై సమచిత్తుండ వగుము.

అనిన లోభదూషితమతియగు ధృతరాష్ట్రుండును నమృతంబు చిలికినట్లు పలుకులు పలికితి వని యతనిఁ బొగడి పంపి తన కుత్సిత మార్గంబును వదల కుండె. అక్రూరుండును నందఱచే ననుజ్ఞగొని క్రమ్మఱి మధురకువచ్చి హస్తిపురంబునఁ దాను గన్నది విన్నది తానొనర్చినది సర్వము రామకృష్ణుల కెఱిఁగించి తన మందిరంబున కేగె.

గీ. భక్తవాత్సల్య పూర్ణుండు పరమ పూరు
షుండు నేకాంతభక్తు లౌ శుద్ధమతుల
యోగమును క్షేమమును దానె యుద్వహించి
యరయుచుండును బంధుమర్యాద దోఁప.

## జరాసంధుఁడు మధురపై దండెత్తుట.

శ్రీకృష్ణునిచేఁ దమ భర్త కంసుండు దుష్టచేష్టాపరుండును హింసితుండు గాఁగ నతనిభార్య లస్తిప్రాప్తి యనువారు తమ జనకుండగు జరాసంధునిపాలికిఁ జని గోలుగోలున నేడ్చిన నతండు బిడ్డలార! యేల యిట్లు విలపించెద రనిన వారు

శా. ఏఁద్రాఁతుల్యుఁడు నాకు విక్రమమునం దీరేడు లోకంబులన్
వీఁడ్రాఁ తండ్రిని బందిపెట్టినని విద్వేషించి గోపాలకుల్
తోఁడ్రా బంధుసమేతుఁ గంసు ననిలోఁ దున్మాడి వైధవ్యమున్
కీడ్రాఁ జేసెను వాసుదేవుఁ డగు శ్రీకృష్ణుండు తండ్రీ! యిటుల్.

క. కుంకుమముఁ దాఁక కుండఁగఁ
గుంకలఁ గావించె మమ్ము గోడుగొనఁగ నా
మంకుఁ బరి మాఱ్పఁకుండిన
నింకేవియు నేల మాకు నేలా బ్రతుకుల్.

క. సతులున్ సుతులున్ జ్ఞాతులు
హితులున్ మొఱ్ఱో యటంచు నేడువఁగా దు
ర్మతులు బలరామ కృష్ణులు
మృతిఁగూర్చిరి కంసభూప ముఖ్యుల కెల్లన్.

క. నీయల్లు వాని పగతురు
నాయాభీరులకుఁ దోడునై వచ్చిరి తం
డ్రీ! యాదవమయ మయ్యెను
మా యూరని నమ్మియున్న మధురాపురమున్.

తే. ఆఁడు వారము గావునఁ బ్రాణములకుఁ
దెగక మందల విడుచుటఁ బగఱు నిన్నుఁ
జూడఁగంటిమి; తేపో మఱ్ఱాఁడో వార
లెత్తివత్తురు నీమీఁది కింత నిజము.

జనకా! మా కతంబున గతంబునకు శోకింపఁ బనిలేదు. బలోన్మత్తులైన యాదవుల మొత్తంబు లిట కెత్తివచ్చి మా తల్లికిని మా దశఁగూర్పకమున్నె నాయత్త పడుము.

అని శోకబాష్పంబులు జాలువాఱ దీనాస్యలై ప్రలాపంబు గావించిన నా మగధరాజా యప్రియంబువిని యదరిపడి శోకరోషం బులు పెనఁగొనఁ రేఁగి లోకం బయాదవంబుఁ గావించెదఁగాక యిఁక వారిని మన నిత్తునేయని భీషణపౌరుషంబులు పలికి యిరువదిమూఁ డక్షౌహిణుల సేనంగూర్చుకొని యదురాజధానియైన మధురను ముట్ట డించె. మగని యింటఁ బట్టుదప్పిన విధవలు పుట్టినిల్లు పాడుచేయ కుందురా? లంకయు మగధరాజ్యము పాడగుట నాడుబిడ్డలచేఁ గదా. ఇట్లు పొంగి పొరలి చెలియలికట్ట దాఁటివచ్చిన సము ద్రమువలె నరాతిసేన పురజనులకు ముట్టడంబుగఁ దన పట్టనంబు నకు ముట్టడంబు గావించిన కారణ మానవుండైన దానవాంత కుండు దేశకాలాను గుణంబుగఁ దన యవతారప్రయోజనం బిట్టు లాలోచించె.

నేను సాధురక్షయు నసాధుశిక్షయు భూభార నిర్మూలనము ధర్మపాలనము గావింపఁగదా యవతరించితిని. ఇప్పుడీ మాగధుం డిరు వదిమూఁ డక్షౌహిణులతోడఁ బురంబు ముట్టడించె. గజకరితురగ భటులతోడ నీప్రతిభట సేన నంతయు నిర్మూలించెదను. జరాసంధుని మాత్రము చంపక విడిచితినేని వాఁడు మఱిమఱి సేనలఁగొని వచ్చు చుండు. వారిని వధించు చుందును. అటులైనఁ గొంతకుఁ గొంత భూభారము క్రమముగ నశ్రమముగ నణఁగును.

అని యిటు లాలోచించుచుండ నాకాశంబున నుండి సకలా యుధసూతసమేతంబులైన రెండు దివ్యరథంబులు తన్నుఁ డాయ న్వ చ్చిన వానిం బలరామునకుఁ జూపి కృష్ణుం డిట్లనియె.

అన్నా! మనల నమ్మిన యదువులకెట్టి దుఃఖపాటు పాటిల్లెఁ గంటివే. ఇపుడు మన మూరకుండరాదు. ఇవె దివ్యరథము లా సన్నములైనవి. వీని నధిరోహించి యందలి యాయుధములం గొని పురంబు నిరోధించిన విరోధులఁ బరిమార్తము. అసాధుల బాధించి సాధులకు శుభం బాపాదింపను గదా మన మవతరించితిమి. ఇప్పు డీ నగరంబును ముట్టడిగొన్న యిరువదిమూఁ డక్షౌహిణుల బిలుకు మార్చి భూభారంబు హరింపుము. అని యా యన్నదమ్ములు కలియఁ బలుకుకొని శతాంగంబులెక్కి యల్పసేనతోఁ బురంబు వెలువడి శంఖంబులఁ బూరించి శత్రుసేనలం దాఁకిరి. అప్పుడు రెండు దండు లకు హృదయక్షోభకరం బగు బవరంబు చెల్లె. అందు దారుకుం డుదారకుశలత్వంబునఁ దేరునడప దారుణాభంగి నభంగవిక్రమంబున వైరివిదారణంబుఁ గావించుచు రణంబుసేయు కృష్ణుని శంఖనినాదం బునఁ గలగుండుగొని బెండుపాటిన తనదండుం జూచి యుద్ధండుండై జరాసంధుండు వాసుదేవునితో నిట్లనియె.

ఓరీ కృష్ణా! పురుషాధమా! మేధామందుఁడా! బంధునాశకా! రహస్యవర్తనుండవును జూడ బాలకుండ వగు నీతో యుద్ధంబుసేయ సిగ్గయ్యెడిఁ దొలఁగి పొమ్ము.

ఓరీ రామా! యుద్ధమందు శ్రద్ధగలదేని ధైర్యమున సిద్ధుడవుము. నా కోదండంబున నుండి వెలువడు దండకాండంబుల కాండంబుల నీదేహంబు ఖండఖండంబులు గాఁగ స్వర్గమండలంబునకైనఁ బొమ్ము.

అనినఁ గృష్ణుం డిట్లనియె. ఓయీ! శూరులు సమరాంగణంబునఁ బౌరుషంబులు నెఱపుదురు గాని తమ్ముఁ దామెన్నఁడు పొగడి కొనరు. ఆసన్నమరణుండైనవాని జన్నిమాటల నెవఁడు పాటించును.

అనిన జరాసంధుండు రోషాంధుండై ససైన్యంబుగ వారిపై నురవడించి చిత్రజల్లునలె శరవర్షంబు గురియించి సూర్యుని మేఘంబులు, నగ్నిని ధూళియుఁ, గప్పునట్లు తన నారాచధారలచేఁ దాల గరుడధ్వజచిహ్నంబులైన యరదంబులు దృగ్గోచరంబు గాకుండ రామకృష్ణులం గప్పె.

అప్పు డప్పురంబున నెత్తగు మేడలు నట్టాలకంబులు లోనగు వానిపైనుండి చూచు లోలలోచనలు రామకృష్ణులం దలంచి శోకించిరి. వైరివాదంబుల శరధారలఁ బీడితంబైన తన సైన్యంబునుజూచి కృష్ణుండు శార్ఙ్గంబు మీటి సంధానాకర్షణ ప్రయోగంబులు తెలియనీని వేగంబున వెల్లి విరియునట్లు శితశరంబు లవారిగఁ గురిసి కొఱవి త్రిప్పినట్లు మెఱసి శతాంగమాతంగ తురంగపదాతి సైన్యంబును నుఱుమాడె.

రాముండును విరోధిసేనం జొరంబాఱి హలంబున గుంపుల నాకర్షించి ముసలంబున వారిశిరంబులు తుత్తునియలుగ మోఁదిమోఁది వధించి హతసైన్యుండయిన జరాసంధునిపైఁ గవిసి యతని విరథుఁ గావించి నాఁగేట నీడ్చి రోఁకటఁ దలపగులవేయ నుంకింప శౌరియడ్డపడి వీని వధింపవలదు. వీనితోడ నింకను గాఁగల కార్యంబు గలదు. విడువుమనిన రాముండు వాని మందల విడిచె. జరాసంధుండును నిశ్శేషహతసైన్యుండై దైన్యంబున సర్వవీరలోకసత్కృతుండైన తనకైన యవమానంబు దలంచి యిఁక నే మొగంబున నగరంబుఁ

జొత్తును? ఉపవనంబునఁ దపంబునఁ గాలంబుఁ గడపెదఁ గాక యని వనగమనోన్ముఖుండైన నతని మిత్రులు నానావిధంబుల నీతులు ధర్మంబులు బోధించి యల్పులగు యాదవులచే నీకుఁ బరాభవంబు గలుగుట కర్మఫలంబు గాని యితరంబు గాదు. యాదవులు నిమిత్తమాత్రంబ. ఇప్పుడు వారికిఁ దోడుపడిన కాలంబు మరల మనకుఁ దోడు గాకుండునా? అప్పుడు వారిని నిర్మూలింపవచ్చును. ఇంత మాత్రమున కేల దుఃఖించెదవని యూరార్చిన నతండును దుఃఖావిలచిత్తుండై తన రాజధానికిం జనియె.

రామకృష్ణులును జేసొగ్గరుగాకుండ శాత్రవ చమూసమూహంబు దహించినంగాంచి సురలు విరులు గురిసి పొగడిరి. పురజనులు మేళతాళంబులతో యదువీరుల నెదుర్కొనిరి. వీధులం బోవు నా పురుషపుంగవులపైఁ బౌరాంగనలు కుసుమ విసరంబులు లాజలు ప్రీత్యావేశంబునఁ జల్లిరి. సూతమాగధులు మాగధ విరోధుల జయంబుఁ గీర్తించిరి. పగతుర నిర్జించి యార్జించిన విత్తం బంతయుఁ గృష్ణుం డుగ్రసేన రాజున కర్పించె.

అమ్మణ్ణి—కక్కా! భూభారముఁ దగ్గించుటకుఁ గృష్ణుం డవతరించె నని చెప్పితివే. భూమి యిందఱనైన మోయును. ఇంతకు మించిన మోయఁ జాల దను లెక్కగలదా?

తండ్రి—భూభార మనునది జనసంఖ్యను బట్టి గాదమ్మా విను. పాపాతిశయమునుబట్టి. అధర్మము పాపము బరువు. ధర్మము పుణ్యము తేలిక. సదాచారసంపన్నుల ధర్మప్రవర్తకులఁ బుణ్యకార్యములు చేయువారల నెందఱనైన భూమి భరించునుగాని పాపాత్ములు మితిమీఱిన మోవఁజాలదు. ఒక దృష్టాంతము చెప్పెద విను. అమ్మా! యమ్మణ్ణమ్మ యెంతటి మంచి యిల్లాలని నిన్ను లోకమంతయుఁ బొగడిన నీకు బ్రతుకు బరువుగాఁ దోచునా? అటుగాక యేదైనఁ జెడ్డనింద యొకటి వచ్చిన నప్పుడు నీకెట్లుండును? ఏల మనము బ్రతికి భూమికిఁ జేటని యనుకొందువా యనుకొనవా? అప్పటి దేహమేకదా యిప్పుడును? భారముగఁ

దోషఁజేయునది యేది? దుర్మార్గప్రవర్తకు లగు నలువురబిడ్డల భరించుట బరువా? సుజనులగు పదుగురు బిడ్డల భరించుట బరువా? అట్టులే. భూమికిని వివాహనియమములు తప్పి యిష్ట మువచ్చినట్లు పెండ్లిండ్లు చేసికొని వావి వరుసలు ఋతుధర్మములు తప్పి స్త్రీపురుషులు సంగమించుటచేతను మృతభర్తృకలు నవివాహితలు బిడ్డలఁగనుటచేతను నధర్మసంతానములు దేశమున నిండుటచేతను, లోకులు కామక్రోధాదులకు దాసులై యకార్యములు చేయుటచేతను, బాపభారమెక్కుడైన భూమిదుఃఖించును. మన వేదములు శాస్త్రములు పురాణము లన్నియు ధర్మమార్గమున నే మితముగఁ గామము ననుభవింప వలయునని ఘోషించుచున్నవి. ఆర్యు లావిధముగ నే నడచుచుండిరి. అటులున్నను రాక్షసాంశములఁ బూర్వము క్షత్రియాది వంశములఁ బురుషులు స్త్రీలు పుట్టి దుష్కార్యములు చేయుచుండిరి. ఇప్పుడు నాలుగు వర్ణములయందును విచ్చలవిడిపుట్టి యిచ్చవచ్చిన చొప్పునఁ బ్రవర్తించుచున్నారు. విధవ కొడుకులు, కన్నెబిడ్డలు, వృషలీపతి సంతానములు లోకమున వెల్లివిరియు చుండుట యందఱెఱిఁగిన విషయమే. అధర్మము మితముగానున్నప్పుడు మారి మహామారి దండుమారి లోనగు వ్యాధు లుత్పన్నములై ప్రజలనాశముచేయును. మితి మించినపు డిప్పుడు యూరపుఖండములో జరగు యుద్ధము వంటి యుద్ధములుకలిగి దేశములే పాడగును. దుర్యోధన ధృతరాష్ట్రుల ధనకామముగదా మన భరతఖండమును నీవిధముగఁ బాడు గావించినది.

రుక్మిణి—ఈ యంటురోగముల వలనను యుద్ధములందును జచ్చువారందఱుఁ బాపాత్ములా?

తండ్రి—కారు. వారిలో ననేకులు మంచివారు నుందురు. సంఘాత మరణమునందును బ్రలయమందును మంచి చెడ్డ లేర్పడవు. అడవులు కొండలు మండునపుడు కంపచెట్లు మాత్రమే దగ్ధ

మగునా? ఎన్ని మహాఫలవృక్షములు జీవజంతువులు నశిం చును? సహవాస దోషమున వడ్లతోఁగూడఁ దట్ట వెం డును. ఇనుమునుగూడిన యగ్నికి సమ్మెటపెట్లు. తరువాతి చరిత్ర విను.

## —♦ హం స డి భ క వ ధ. ♦—

ఈ విధముగ జరాసంధుఁడు తడవకు నిరువదిమూఁ డక్షౌహి ణుల సేననుగొని పదునేడుమార్లు మధురను ముట్టడించెను. పదునేడు మార్లును యాదవసహాయులైన రామకృష్ణులచే హతసమస్త సైన్యుం డై యొంటి పాఱిపోయెను. ఈ పదునేడు తడవలలో నొకసారి జరా సంధుఁడు మహాబలపరాక్రమ సంపన్నులు, శస్త్రంబులచే మరణంబు లేకుండ వరంబుఁ గాంచిన లోకభయంకరులు, నగు హంస డిభకు లనువారలను సహాయులుగఁ గొని యపరిమిత సేనతో మధుర ముట్ట డించె. యాదవసేనాపరివృతులై బలరామకృష్ణులు వానినెదుర్కొని పోరిరి. అప్పుడు శ్రీకృష్ణుండు నశస్త్రహతు లగు హంస డిభకుల నెట్లు వధింపవచ్చునని యాలోచించుచుండ దైవవశంబున హంసుఁడను రాజొకఁడు బలరామునిచే నిహతుండయ్యె. కృష్ణుం డది నెపముగఁ గొని డిభకుఁ డుండు సేనయం దంతయు హంసుఁడు చచ్చెనను వార్త ప్రకటించె. అది విని తనమిత్రుఁడగు హంసుఁడే మరణించెనని తలఁచి విచారదూరుఁడైన డిభకుఁడు ప్రాణత్యాగంబు కావించె. ఆవార్త విని హంసుఁడు నయ్యో! నా వియోగంబు సహింపలేక కదా డిభ కుండు మరణించె. అట్టి ప్రాణమిత్రుని వియోగంబు నేనెట్లు సహిం పఁగల నని యమునకు మేని నర్పించె. హంస డిభకు లిరువురు పర లోకమేగుట విని ఖిన్నుండై జరాసంధుండు మరలిపోయె. అంతకుఁ బౌరుషంబు వీడక యా వాఁడిమగఁడు పదునెనిమిదవసారి మరల నిరువదిమూఁ డక్షౌహిణులసేనం గూర్చుకొని మధుర ముట్టడింప యత్నించుచుండెను.

ఈలోపల భగవత్కార్యమునకు సహాయపడు నారదునిచేఁ బ్రేరితుండై కాలయవనుం డనువాఁడు పశ్చిమదేశాధిపతి మూఁడు కోట్ల సేనతోడ మథురపై దండెత్తి వచ్చెను.

## —♦ కాలయవన వృత్తాంతము. ♦—

రుక్మిణి—అప్పా! యీ కాలయవనుం డెవండు? వాఁడు మథురపై నేల దండెత్తె?

తండ్రి—వినుఁడు. కాలయవనుండు గార్గ్యుని కుమారుఁడు. గార్గ్యుండు వృష్ణ్యంధక పురోహితుఁడు. అతండు మహావ్రతపరుఁడు. నిత్య బ్రహ్మచారి. వివాహితుఁ డయ్యు భార్యతోడ సంసారంబుఁ జేసిన వాఁడు కాఁడు. అదిగని యతని భార్యాసోదరుం డొక నాఁడు సభలో రాజుతోడ గర్గుండు షండుండని వచించెను. ఆ పలుకువిని సభ్యులందఱు హసించిరి. గర్గుం డవమానితుండై యా యజితంజయ పురంబు విడిచి శ్యాలకుపైఁ గోపంబున భార్యాసంగమం బొల్లక యాయసచూర్ణంబు భక్షించుచుఁ బండ్రెండు వర్షంబులు తపంబుసేయ రుద్రుం డతనికిఁ బ్రత్యక్షుండై యతఁడు కోరినట్లు యాదవుల నెల్ల నిరాకరింప శక్తిగల కుమారుండు గలుగ వరంబిచ్చె. అతం డట్టివరంబుఁ గాంచుట విని యనపత్యుండైన యవనుం డాయనను బ్రార్థించి తెచ్చి తనగృహంబున నునిచికొని యాయనసేవకై గోపాలికల నియమించె. అప్పుడొక యచ్చర గోపీవేషంబు ధరించి యతని వశపఱచుకొని యతనివలన నొక కుమారుఁ గనియె. ఆయన కుద్భవించిన యా కుమారుఁ దనకు మారుగ యవనుండు గైకొని పెంచి పెద్దఁజేసె. జరాసంధుఁ డీవరంబు నెఱిఁగినవాఁడగుట నతనిసాహాయ్యంబుఁ గోరుటచే యాదవసహజ విరోధియగు నతం డతనికిఁ గోడ్పడి రామకృష్ణుల వధింప నుద్యమించె. వాని యుద్యమం బెఱిఁగి వాని ప్రజ్ఞాబలంబు నెఱుంగ గోరి కృష్ణుఁ డొక ఘటంబున సర్పంబును బదిల

పఱిచి దూతచే నతని కడకంపె. అతం డది యెఱిఁగి కుండ నిండ జలిచీమలను విడిచి మరలఁబంపె. కృష్ణుండు ఘటంబు విచ్చిచూడ సర్పంబు చచ్చియుండె. వీఁడు సులభసాధ్యుఁడు కాఁడని కృష్ణుండు గ్రహించె. అప్పుడు శ్రీకృష్ణమూర్తి బలరామునితో నిట్లనియె.

అన్నా! కాలయవన వీరుఁ డపారపారావారముంబోలు సేనావారముతో మనపట్టణము ముట్టడించెను. నేఁడో రేపో మఱునాఁడో జరాసంధుఁడును బ్రబలసైన్యంబుతో దాడిపెట్టునని వింటిమి. మన మీ యవనునితోఁ బోరుచుంటిమా జరాసంధుఁడు క్రోధాంధుఁడగుట పురంబుఁ బ్రవేశించి యాదవాదుల హింసించు నొండె నొండెఁ జెఱపట్టుకొని పోవును. కావున దీని కొకయుపమ నాలోచించితి.

## ద్వారకా నిర్మాణము.

పరులకు దుర్గమంబైన జలదుర్గంబొకటి నిర్మించి యందు మన బంధువుల నెల్ల నుంతము. వారలు సురక్షితులై యుండఁ గాలయవను వధింతము. అని తన మతంబున కాయన సమ్మతింప విశ్వకర్మం బిలిచి నీవు సముద్రమధ్యంబునఁ బండ్రెండు యోజనంబుల నిడివి వెడల్పు గల నగరంబు నిర్మింపుము, అని యాజ్ఞాపించె. అతండు వల్లెయని నిజశిల్ప చాతుర్యంబు మెఱయ విశాలమార్గంబులు, నున్నతహర్మ్య ప్రాసాదంబులు, జలధరంబులనంటు గోపురంబులు, బ్రాహ్మణ క్షత్రియ వైశ్యశూద్రులకు వాటంబులగు పేఁటలు వాడలును, దేవతావృక్షంబులచే మాననీయంబులగు నుద్యానంబులు, నిర్మల వారిపూరభారంబు లగు కాసారంబులు, లోనగు సకల పదార్థములతో మనోహరంబగు ద్వారకానగరంబును వాస్తుశాస్త్రంబు చొప్పు తప్పనీక యప్పుడ జలదుర్గంబుగ నిర్మించె. ఇంద్రుండు సుధర్మయను నిజ సభాభవనం బందు నెలకొల్పె. దేహమంతయుఁ దెలుపును, నొక చెవి నల్లనైన గుఱ్ఱముల మనోజవంబుల వేయింటిని వరుణుండొసంగె. కుబేరుఁడు నవనిధు లందుంచె. తక్కిన దిక్పాలురును దమ యధిపతి

త్వమునకుఁ దగినట్లు మేలిపదార్థముల నంపిరి. ఈవృత్తాంతం బంత యు విశ్వకర్మ తెలుపఁ గృష్ణుండు మధురాపురజనుల నెల్ల వారి వారి ధనధాన్యాదులతోడఁ దన యోగమహిమచే వారు శత్రువులకు గోచరింపకుండఁజేసి ద్వారకయందుఁజేర్చి మరలివచ్చి రామునితో నాలోచించి పద్మమాలికాధరుండును, నిరాయుధుండునై పురద్వారం బున వెలువడి వచ్చె.

## —♦ కాలయవనుండు కృష్ణుని బట్టుకొన వెంబడించుట. ♦—

ఇట్లు పురంబు వెలువడి యొక్కరుండ వచ్చి శీతుండునుంబోలెఁ బరువిడుచుండఁ గాలయవనుండును నుదయించు చంద్రునివలెఁ జూడ్కికి నింపైనవాఁడును, శ్యామని చాయమేనివాఁడును, పీతకౌశేయ వాసుండును, శ్రీవత్సవక్షుండును. కౌస్తుభమాలాలంకృతుండును, బృథుదీర్ఘబాహుచతుష్కుండును, నవసరసిజంబులఁబోలునయనమ్ముల వాఁడును, నిత్యప్రముదితుండును, శ్రీమత్కపోలుండును, శుచిస్మితుండును, మకరకుండలవిరాజమాన సుందరవదనారవిందుండును, నగు నప్పురుషోత్తముఁ జూచి నారదుండు చెప్పిన గుర్తుల వాఁడు వీఁడె పో. కృష్ణుండు సందేహంబు లేదు. వీఁడు నిరాయుధుండై రిత్తకాళ్లఁ బరువిడుచుండ నేను సాయుధుండనై వీనితోడఁ బోరుట ధర్మంబు గాదు. కావున నేనును నిరాయుధుండనై కాలినడఁజని పట్టుకొనియెద నని యూహించి తన యెద్దుముఖముగుఱ్ఱమును డిగి యోగులకును బట్ట రాని దిట్టఁ బట్టుకొనియెద నని యాకట్టిఁడి యాయన వెంట జవంబునం బఱచె.

హరియును బగతుండు తన్నుఁ బట్టఁ బాఱుఁ దానును బాఱుచు నతండు నిలిచినఁ దాను నిలుచుచుఁ బట్టవచ్చినఁ గుప్పించి దాఁటుచుఁ బట్టుట దుష్కరంబని నిలిచిన డాయుచు, రోషంబు పురి గొల్ప ఱాలు వేయుచు, వృథాహాదు లడ్డంబువచ్చిన నిటుచూపి యటు లటు చూపి యిటు దాఁటులు పెట్టుచుఁ, దన కడ్డంబురాఁగ నిట్టట్టు కేడించి దూసికొని వెళ్లుచు, మిట్టలెక్కుచుఁ బల్లముల దిగుచు, నిట్లు

కృష్ణుండు నతనికి రోషంబుం బుట్టింప "నన్ను నీవా పట్టెదరారమ్ము. నీ గమనజవంబు చూతు"మని గికురించి వంచించి మోసగించి పరుష దూషణంబులను బౌరుష భాషణంబులను సోత్ప్రాసాలాపంబులను లెక్కగొని దవ్వు పోయిపోయి తటాలున నొక గుహఁజొచ్చి తిరోహితుండయ్యె. కాలయవనుఁడును నోరీ! మగతనంబుమాని పందవై యేల పాఱెదవు. యదుకులంబునఁ బుట్టిన నీకిట్టి పిఱికితనము తగదని యాక్షేపించుచుఁ జిక్కితివి రా యింకెందుఁబోయెద వని తానును లోపలఁ జొరఁబాఱె.

ఇట్లు వేగంబున గుహ సొచ్చి నలుదెసలు పరికించి యందొక్కఁడు నిద్రించుచుండ వాఁడె కృష్ణుండని భ్రమసి యోరీ! యీ దొంగచేష్టలు నా యొద్దనా యని గద్దించుచు లే లెమ్మని వెఱగసి కాలఁ దన్నె. ఇట్లు తన్నుటయు దీర్ఘకాలంబుగ నిద్రించుచున్న యప్పురుషుండు లేచి కోపదృష్టిఁ జూచుటయుఁ గాలయవనుఁడు నిలువునఁ గాలి భస్మంబై కాలుబ్రోలికిం జనియె.

రుక్మిణి-కాలయవనుఁ డనఁగా నల్లతురకయని కదా యర్థము?

తండ్రి-యవనశబ్ద మిప్పుడు తురకలకు యూరోపుఖండవాసులకు నన్వయించుచున్నను బూర్వము గ్రీకులకుఁ జెల్లుచుండెను. గ్రీకుశబ్దమునకు గర్గశబ్దమునకుఁ గల సామ్యమును బట్టి కాంబోలు గర్గాశ్రమమే గ్రీస్ అందురు. దాని కనుగుణముగ గర్గునకు యవనునకు సంబంధ మున్నట్టులీ కథవలన నేర్పడుచున్నది. గర్గుఁడు గొప్ప జ్యోతిషుఁడనుట సుప్రసిద్ధము. గ్రీసుదేశవాసులు జ్యోతిశ్శాస్త్రమునఁ బ్రసిద్ధులు కదా. బ్రాహ్మణుఁడగు గర్గుఁ డీదేశంబుననుండి పోయినవాఁడగుట గ్రీసుదేశమునకు జ్యోతిషము తొలుత మన దేశమునుండియే పోయెననుట సమంజసము. ఆవల నచ్చటివారు వృద్ధిపఱచిరి. వారి సంకేతములు గొన్ని మనశాస్త్రమునం దిప్పుడు గాన నగు.

ఈ నిద్రించుచుండిన పురుషుం డెవ్వండో చెప్పెద వినుడు. అతం డిక్ష్వాకు కులజుండగు మాంధాత కొడుకు. పేర ముచుకుం దుండు. ఆయన బ్రహ్మణ్యుం డని సత్యసంగరుండని విఖ్యాతి వహించిన వాండు. తమ్ము రాక్షసులనుండి రక్షింపు మని దేవత లాయనను బ్రార్థించిరి. ఆయనయు నంగీకరించి దీర్ఘకాల మా దేవతల రక్షించె. తరువాత షణ్ముఖుండు దేవ సేనాధిపత్యంబు వహించె. అంతట బృందారకు లందఱు ముచుకుందుం గాంచి రాజేంద్రా! నీవు నిష్కంటక రాజ్యమును, సర్వసుఖములను వదలి యిట కరుదెంచి మమ్మింత కాలము రక్షించితివి. ఈలో నీ పుత్రమిత్రకళత్రజ్ఞాతిబాంధవ మంత్రులును, నీ సమకాలికులైన ప్రజలు గాలపాశ వశులైరి. వా రెవ్వ రిప్పుడు లేరు. పసులకాపరి పసులంబోలె భగవంతుం డవ్యయుండు. కాలరూపంబున సర్వభూతంబులు తనకు వశపడం జేసికొను చుండును. కావున నీవొక్క వరంబుం గోరుము అనిన నతండు ముక్తి గోరె. దేవతలు నయ్యా ముక్తినొసంగ శక్తుండు విష్ణుండు తప్ప మఱి యెవ్వండును గాండు కాన మఱి యొండెద్దియైనం గోరుమనిన నాకు దేనిపై వాంఛ లేదు. దీర్ఘకాలంబు సుఖంబుగ నిద్రింప వరం బొసంగుండు. నాకు నిద్రాభంగంబు గావించినవాండు నే నల్గిచూచిన భస్మంబగుం గాక యనిన వారు నట్ల యొసంగిరి. ముచుకుందుం డా గుహసొచ్చి యది మొదలు నిద్రాసంగమ సౌఖ్యం బనుభవించు చుండె.

ఇట్లా భూపాలు కోపానలంబున యవనుండు భస్మీభూతుండగుటం గృష్ణుండును దక్షిణం శోభక్తాగ్రేసరునకుం బ్రత్యక్షమై నిలిచిన నీల మేఘశ్యాముండును పీతాంబరుండును, శ్రీవత్సవక్షుండును, కౌస్తుభ వైజయంతి వనమాలికా విరాజితుండును, చతుర్భుజుండును, చారు ప్రసన్నవదనుండును. మకరకుండల మండితుండును, త్రిలోకీ దర్శనీయుండును, గరుణాకలాక్షవీక్షణుండును, నవయౌవనుండును, మత్త సింహవిక్రముండును నగు నమ్మహాతేజుం దేఱిచూడంజాలకయు, సవినయంబుగ నయ్యా నీ వెవ్వండవు? ఈ గిరి కందరమున కేల వచ్చితివి?

కఠిన కంటకనివేశంబైన యీప్రదేశంబున నెత్తమ్మిరేకులజోకఁ గోమలంబులైన రిత్తగాళ్ల నేల తిరిగెదవు? నీవు తేజస్వుల మూర్తీభూతతేజంబవా? సూర్యుండవా? చంద్రుండవా? ఇంద్రుండవా? లోకపాలకులలో నొక్కరుండవా? త్రిమూర్తులలో నొక్కరుండవా? దీపంబుకోపున నీగుహా చీకటుల మాయఁజేయు తేజంబున వెలుఁగుటజేసి పురుషోత్తముఁడవైన విష్ణువుగా నిన్నుఁ దలఁచెద. నీకిష్టంబేని నీ కులగోత్రకర్మముల వినిపింపుము. పురుషపుంగవా! మే మిక్ష్వాకువంశంబునఁ బుట్టిన క్షత్రియులము. నా పేరు ముచుకుందుఁడందురు. మా తండ్రి యువనాశ్వపుత్రుండైన మాంధాత. చిరకాలము మేల్కని యుండిన కతంబున గాసిలి యీవిజనప్రదేశంబున నిద్రించుచుండి యిప్పు డెవ్వఁడో లేపిన మేలుకొంటిని. ఆ నిద్ర లేపినవాఁడు వాని పాపంబున వాఁడే భస్మితుండయ్యె. అంతలో శ్రీమంతుఁడా! చెంత నీవు గాన వచ్చితివి. నీ మహాతేజంబున హతశక్తుండనై నిన్నుఁ దేటి చూడఁ జాలనైతిని. చూడకుండు మనెద వేని సర్వదేహిమాననీయుఁడవైన నిన్నుఁ జూడకుండిన జన్మంబే వ్యర్థంబు అనిన నమ్మహారాజుంజూచి భగవంతుండు మేఘగంభీర భాషణంబుల నిట్లనియె.

## —♦ ముచుకుందునితోఁ గృష్ణుండు సంభాషించుట ♦—

అయ్యా! నాకు జన్మకర్మ నామధేయంబులు వేనవేలు కలవు. అవి యనంతము లవుటచే వానిని లెక్కింప నేనును శక్తుండఁ గాను. బుద్ధిమంతుఁ డెవ్వఁడేని యెప్పుడేని యెట్టులేని భూపరాగంబున నణువులు లెక్కింపగలిగినను నెన్నిజన్మంబులనైన నా గుణకర్మనామంబులు లెక్కింపఁ జాలఁడు. పరమర్షులును గాలత్రయ గోచరంబులైన నా జన్మకర్మంబుల నెన్నఁబూని పారముఁ గనలేకున్నవారు. అయిన నీ కాలంబునకు సంబంధించిన నాజన్మ గుణకర్మనామధేయంబుల నేన చెప్పెద నాకర్ణింపుము. బ్రహ్మదేవుండు ప్రార్థింప ధర్మరక్షణార్థంబుగను, భూమికి భారముగనున్న యసురుల నశింపఁజేయను యదుకులంబున వసుదేవునింట నవతరించితి. వసుదేవ సుతుఁడనౌట నన్ను వాసు

దేవుఁ డంమరు. కంసుఁడుగా జనించిన కాలనేమియుఁ బ్రలంబుఁడు లోనగు వారు హతులైరి. నీనేత్రజ్వాలల దగ్ధుడైన నీఁడు యవనుఁడు. నిన్ననుగ్రహింపఁగోరి వాని నిటకు నుపాయంబున లాగి తెచ్చితి. నీవు పూర్వంబున నన్ను నారాధించితివి. నీవు కోరిన వరంబులెల్ల నిచ్చెదఁ గోరుము. నాకుఁ బ్రపన్నుఁడగు వాఁడెన్నఁడును సంసార మునఁజిక్కి శోకింపఁడు సుమా? యనిన ముచుకుందుండును నిరువది యెనిమిదవ యుగమున నారాయణుండు వసుదేవునింట నవతరించు నని చెప్పిన వృద్ధగర్గు వాక్యంబుల స్మరించి సంతోషించి కరంబులు ముకుళించి నమస్కరించి యిట్లనియె.

## ముచుకుందుడు శ్రీకృష్ణునకుఁ దనకోరిక విన్నవించుట.

ఈశ్వరా! స్త్రీపురుషాత్మకంబైన యీ జనంబు నీమాయచే మోహితంబై యనర్థరూపంబైన సంసారంబున దృష్టినిలిపి యాత్మ హితంబైన దానిఁ గాన లేక సుఖమాశించి మోసపోయి దుఃఖకారణంబులైన గృహంబులందు నాసక్తమగుచు నిన్ను భజింప కున్నది. అనఘా! త్వదారాధనోపయుక్తంబైన మానుష దేహంబు దుర్లభంబు. అది లభించియు వికలంబుగాక దృఢంబుగ నవయవపూర్తి కలిగియుండుట కష్టంబు. అట్టి దప్రయత్నంబుగ లభించియు నీ పాదారవిందంబుల భజింపక పశువులవలెఁ బచ్చిక కప్పిన గావినంటి సంసారంబున దుర్గతులు గూలుచున్నవారు. అజితా! రాజ్యశ్రీవలనఁ గలిగిన మదంబున దేహంబె యాత్మయని భ్రమించి సుతసతీధనాగార భూములందాసక్తుఁడనై దురంతచింతచే గతకాలంబు నంతయు వ్యర్థంబుగఁ గడపితిని. ఇంటిమంటి గోడవంటి యీ కళేబరమందు నేను మానవేశ్వరుఁడ నను నభిమాన ముంచి రథకరితురగపదాతి సేనావృతుండనై దుర్మనంబున నిన్ను గణింపక దేశంబులెల్లఁ గ్రుమ్మరితిని. ఈ కార్యమిట్టు లాకార్యమట్టులు గావించెద నిది యిట్లనుభవించెద నను కోరికల ప్రోవులచే మత్తుఁడనై విషయలాలసుఁడనై మేర మీఱు లోభంబునకుఁ జిక్కిన నన్ను నంతకుండవు నప్రమత్తుండవు నగు

నీ వాఁకలిగొనిన సర్పము మూషికమునుం బోలె మ్రింగుదువు. ముందు కనకాభరణంబుల నలంకృతంబులైన రథగజముల మీఁద నొయ్యారంబుగఁ దిరుగుచు మహారాజ ఖ్యాతిఁగన్న కళేబరములే దురత్యయంబైన కాలంబు మహిమఁబూడ్చినను గాల్చినను క్రిములని మలమని బూడిద యని పేరులఁ బొందుచున్నవి. దిశావలయం బంత యు జయించి తనయట్టి పరాక్రమసంపన్నుఁడు లేడని ప్రఖ్యాతిఁ జెంది సరిరాజులు సేవింప వెలుంగు మగవాఁడు మైథున సుఖమే ప్రధాన ముగాఁ గల స్త్రీలచే గృహములందు నీశ్వరా! క్రోఁతివలె నాడింపఁ బడుచుండును. తొలుత రాజను గావలయునని యేవియో కర్మములు చేసి రాజశరీరంబు ధరించియు నంతటితోఁ దృప్తిలేక యాశాపాశ శతబద్ధుఁడై యతం డంతకంతకుఁ బెరుఁగు గోరికలకు లోబడి యింద్ర పదవిఁగోరి నేలఁబరుండియుఁ, బస్తులుండియు, బ్రహ్మచర్యం బవలం బించియుఁ, బ్రాప్తించిన సుఖమునైన భోగింప లేకున్నవాఁడు. సంసారమునందలి భ్రమ నివర్తించుకాల మాసన్నంబైనపుడు సాధు జనులతోడి సహవాసంబు లభించు. సజ్జనసహవాసం బెప్పు డలవడు నప్పుడ సద్గతియుఁ బరావరేశుండ వగు నీపయి మతియు జనించు. సాధువులగు రాజులును నఖండ భూమండలాధిపత్యము వహించియు నేకాగ్రచిత్తంబున వనంబుఁ బ్రవేశించి తపశ్చర్యనుండి దేనిని గోరు దురో యట్టి రాజ్యానుబంధనివృత్తి నాప్రయత్నము లేకయే కలుగ నీవే యనుగ్రహించితివి. ఇతరవాంఛ లేవియు లేని నీ యేకాంత భక్తులు గోరు నీ పాదసేవ తప్ప మఱి యేవరంబుఁ గోరనొల్ల. మోక్ష ప్రదుండవగు నిన్నారాధించిన బుద్ధిమంతుఁ డెవఁ డాత్మబంధనంబు లగు విషయ సుఖంబులఁ గోరు? కావున నీశ్వరా! సత్త్వరజస్తమో గుణానుబంధనంబులైన కామక్రోధాదుల నెల్ల వదలి నిరంజనుం డవును, నిర్గుణుండవును, నద్వయుండవును, బరమపురుషుండవును, జ్ఞానైకస్వరూపుడవును, నగు నిన్ను శరణు చొచ్చెదను. ఈ సంసార మునఁబడి తాపత్రయంబుచేఁ దపించి దాన ననేక దుఃఖంబులచేఁ బీడితుండనై యరిషడ్వర్గంబులకుఁ జిక్కి చిరకాలంబునకు నేఁడెట్లో

శాంతిని గని రక్షకా! యభయంబును, సత్యంబును, నశోకంబును నగు నీపాదాబ్జంబుల బ్రాపుఁగాంచితి. ఆపన్నుఁడనై యుండి యిప్పుడు ప్రపన్నుఁడనైన నన్ను నీశ్వరా రక్షింపుము. అనిన భగవంతుం డిట్లనియె.

సార్వభౌమ మహారాజా! నీబుద్ధి రాగాదిమల రహితంబై దృఢంబునై యున్నది. నీ కోరికలెల్లఁ దీర్చెద వరంబులు గోరుమని యాసకొల్పినను నీబుద్ధి కామంబుచే హతంబు గాదయ్యె. నీమనస్సు ప్రమాదపడకుండుటకై వరంబుఁ గోరుమంటిని. నాయేకాంతభక్తుల బుద్ధి యెప్పుడును గామంబులకుఁ బట్టుపడదు. ప్రాణాయామాది యోగంబుల మనస్సు నియమించుకొనిన వారు నాయందు భక్తిగల వారు గాకేని యెప్పుడైన నిజకర్మవాసనాబలమున విషయములకుఁ బట్టువడుదురు. మనస్సు నాయందు నిలిపినవాఁడవై నీవు యథేచ్ఛంబుగ లోకంబునఁ గ్రుమ్మరుము. నీకు నాయందలి భక్తి సర్వదా యవిచ్ఛిన్నంబుగ నిలుచును గాక. నీవు సాక్షాత్కరించియు నిప్పుడ మోక్షమీయక దేశాటనంబు గావింపుమని కాలవిలంబనంబుఁ గావించెద వేల యందువేని విను. నీవు క్షత్రియధర్మమందు నిలిచి వేఁట నెపమున జంతుహింస గావించితివి. ఆ పాపంబు క్షయింప నన్ను నీవు మనంబున నిల్పి తపంబుఁ గావింపుము నీవు జన్మాంతరమున బ్రాహ్మణుండవై సర్వభూతహితమతివై పుట్టి కేవలుండ వైన నన్నుఁ జేరఁగలవు.

అని యిట్లు భగవంతుఁ డనుగ్రహించిన ముచుకుందుండు గోవిందునకుఁ బ్రదక్షిణ వందనంబు లాచరించి గుహ విడిచి వెలి వచ్చి హ్రస్వాకారంబుల నున్న మనుష్యులను బశుపక్షి మృగ వృక్షాదులను జూచి కలియుగంబు ప్రాప్తించుచున్న దని తలఁచి యుత్తరాభిముఖుండై చని శ్రద్ధాయుతుండును ధీరుండును, నిస్సంగుండును, ముక్తసంశయుండునై కృష్ణునందు మనంబు పదిల పఱిచి గంధమాదనంబుఁ బ్రవేశించి నరనారాయణాలయంబైన బదరికాశ్రమంబుఁ జేరి సర్వద్వంద్వసముండును, శాంతుండునునై

తపస్సుచే హరి నారాధించె. కృష్ణుండును మరలి మధురకు వచ్చి మ్లేచ్ఛబలంబు నెల్ల వధించి వారల ద్రవ్యంబెల్ల నెల్లమీదను మనుష్యులచేతను ద్వారకకుఁ బంపె. ఇట్లు ధనంబు సాగిపోవుచుండ నింతలో జరాసంధుం డిరువదిమూఁడక్షౌహిణుల బలంబుతో పదునెనిమిదవమాఱు మధుర ముట్టడించె.

## వికద్రుఁడు జరాసంధుతో యుద్ధము సేయుట వలనఁ గలుగు నష్టకష్టములఁ దెలుపుట.

ఇట్లు జరాసంధుండు ప్రబలసేనావారంబుతో వచ్చుచుండుట విని కర్తవ్యమాలోచింప యాదవులందఱు సభకుఁజేరిరి. అందు నీతి శాస్త్రవిశారదుం డగు వికద్రుం డనువాఁడు జలజాక్షునితో నిట్లనియె. మీరందఱు యదుసంతతివారు. ఆ సంతతియం దిప్పుడు భౌమ, సాత్త్వత, భోజాంధక, యాదవ, దాశార్హ, వృష్ణినామంబుల నేక శాఖలవారు గలరు. మీ పూర్వులు నానాదేశంబుల నానా రాష్ట్రంబుల స్థాపించి యందందు రాజ్యంబుఁ బాలించుచుండిరి. ఇందు వసు వను వాని తనూభవుఁడు వసుదేవుఁడు. ఆయన చెల్లెండ్రు కుంతియు, శ్రుతశ్రవయును. అందుఁ గుంతి పాండురాజు పత్ని యయ్యె. చేదిరాజగు దమఘోషుండు శ్రుతశ్రవను వివాహమయ్యె. ఇప్పు డీకులము వారికెల్లఁ గాలము సమీపించి నట్టులుండ నీ వీ కుల ముద్ధరింప జన్మించితివి. నీవు సర్వజ్ఞుఁడవు, సర్వభర్తవు, నీకలమాపు దేవతలు నెఱుఁగరు. నీవు జరాసంధునితోడఁ బోర సమర్థుఁడవు. నిన్ననుసరింప మేమును సిద్ధపడియున్నారము కాని జరాసంధుఁడు మహాబలసంపన్నుఁడు. అనేకరాజ పరివృతుఁడు. అపార సేనాసహా యుఁడు. మనకా యాదాయము మితము. ఊరియందు నాహార పదార్థములు వంటచెఱకులు కొలఁదులు. పట్టనమునకా కోట లేదు. అగడ్తలు సుస్థితిని లేవు. ద్వారములు యంత్రపూరితములు గావు. జరాసంధుని ధాటి కిది యొకనాఁడైనఁ దాళునావలదిగ్గోన్నత వప్ర ప్రాకారములు నాయుధశాలలు నిర్మింపఁబడవలయును. కంసుఁడు

నిజభుజబలమున నగరముఁ గాచుచుండెఁ గావునఁ వీనిని లక్ష్యపెట్టిన వాఁడు గాఁడు. కావున నిప్పు డీనగరము సురక్షితము గాదు. కంస భృత్యులు, పోషితులు, మిత్రులు నగు యాదవులు కంసవిరోధిపక్షా వలంబులమైన మనయందుసంశయించి భేదంబులు కల్పించుచున్నారు. వారు నిక్కముగ మనకు సహాయులగుట సంశయము. జరాసంధ భీతిఁ బలాయితులైన రాజులును నతనితోఁడ బోరాడ సమకట్టిన మనల నిందింతురు. యాదవుల యంతఃకలహంబులచే మేము చెడితి మని పౌరులును మనల దూషింతురు. ఈ యంతఃకలహమునకుఁ గారణభూతుఁడవు నీవ. కావున నీవే దీనిఁ జక్కఁబెట్టవలయును. నేను నీకుఁ గర్తవ్యము బోధించుచున్నాఁడ నని తలంపకుము. నా యభిప్రాయము తెలుపుచున్నాఁడను.

అనినఁ గృష్ణుం డిట్లనియె. అయ్యా నీవు నీతియుక్తము ధర్మ సమ్మతమగు నట్లు పలికితివి. నేనును బ్రజాక్షేమము గోరువాఁడనే. మా వలన వారి కేక కష్టము రారాదు. కావున జరాసంధు నెదిరింప శక్తులమయ్యును నతఁడు కనుచుండ వెఱచినవారివలె నూరు విడిచి పరువెత్తెదము. వానికి ద్వేషము మామీఁదనే కావున వాఁడు మమ్ము బట్టుకొన మావెంటఁ బఱతెంచుఁగాని యూరిపైఁ బడఁడు. అంతియ గాక పౌరుషశాలియగు వాఁడు తన ద్వేషులపైఁ బగ సాధింపఁ దలంచునుగాని రిత్తప్రజలఁ గారింపఁడు. అని వచించి యన్నతోఁ గలియఁ బలుకుకొని మాగధుండు చూచుచుండ బలరాముతోఁడ నిరాయుధుఁడై మధుర విడిచి భీతి నటించుచుఁ బరువు వాఱె.

## —♦ రామకృష్ణులు దక్షిణాపథాభిముఖులై పరువెత్తుట. ♦—

ఇట్లు దక్షిణాపథాభిముఖులై రామకృష్ణులు కామరూపంబుల నానాదేశంబులు గడచి చని సహ్యశైలంబెక్కి దక్షిణంబుగఁ బోవు బాటఁగని దానివెంట నల్పకాలంబరిగి స్వవంశజనాధిష్ఠితంబైన కరవీరపురంబు డాసి యందు వేణానదీతీరంబున నొక మహోద్యుం

బరంబుఁ గనిరి. అచ్చటఁ బరశురాముఁడు వారికి గోచరించె. అమ్మ
హాత్ముఁగని కృష్ణుండు "మహాపురుషా! నీవు క్షత్త్రియ కులాంతకుఁడవగు
భార్గవరాముఁడవని నే నెఱుఁగుదును. నీవు బాణవేగంబున సముద్రు
నాకులపఱిచి నేలఁగొని సుర్పారకనగరంబు నిర్మించితి వనియు
సముద్రతీరంబున సహ్యప్రాంతంబున రాష్ట్రనిర్మాణంబుఁ గావించితి
వనియు నెఱుగుదును. మేము యాదవులము. వసుదేవనందనులము.
కంసభీతుఁడైన మాతండ్రి మమ్ము నందవ్రజంబున నుంచ నంద పెరిఁగి
తిమి. మాకు నీడువచ్చిన వెంటనే మధురకుంజని కంసునిఁ బరిమార్చి
యుతని తండ్రికిఁ బట్టాభిషేకముఁ గావించితిమి. ఆవల జరాసంధుఁడు
పెక్కుతడవలు మధుర ముట్టడించె. పురప్రకృతిజనరక్షణార్థమై
మేము కాలినడఁ బరువెత్తి వచ్చితిమి. మేము బలవంతులము గాము.
సన్నాహమును లేదు. అసిచర్మవర్మశకట భటాదులు సర్వమంగళము.
ఇప్పుడుమిమ్ముఁ జేరితిమి. మాకుఁ గర్తవ్య మెయ్యది యుపదేశింపుము.

అనిన రేణుకానందనుం డిట్లనిరెం. కృష్ణా! నీకుఁ గర్తవ్యము
నెఱిఁగింప నేను సశిష్యుఁడనై యిట కరుదెంచితి. నీ గోవ్రజవాసము
దుష్టదానవనిబర్హణము, కంసవధ, జరాసంధ దురాగతము. నెఱుం
గుదు. బాలుఁడు గాకుండియు దేవకార్యార్థమై జగత్పాలుండు
బాలుం డగుటయు నెఱుంగుదు. జగత్త్రియంబున నీకు నెఱుంగ
రాని దేదియు లేకుండినను, భక్తిమాత్ర కారణంబుగ నా విన్నవించు
నది వినుము. పూర్వ మీ కరవీరపురంబు భవత్పూర్వ నిర్మితంబు.
ఇప్పుడు రాష్ట్రంబు వారే యేర్పఱిచిరి. దీనిని సృగాల వాసుదేవుఁ
డనువాఁడు వీరద్వేషానుశాయియై నీ బంధువర్గంబు నెల్ల నిర్మూలించి
పాలించుచున్నవాఁడు. ఈ సృగాలుఁడు పరమకోపనుఁడు. మహాగర్వి
ష్ఠుఁడు. అతిమాత్సర్యపరుఁడు, నజితాత్ముఁడు, ధనధాన్యమత్తుం
డునయి స్వపుత్రకులనే బాధించు చున్నవాఁడు. కావున సర్వరాజ
దూషితంబైన యీపురంబున మీరు నిలువరాదు. మీకు శత్రు
నిరాకరణ సమర్థంబైన స్థలంబు వా కొనెద మన మీ దిన మంద
యీ వేణానది బాహులచే నుత్తరించి యీ రాష్ట్రమునకు గఱుసుగ

నుండు దుర్గమశైలంబుపై వసింతము. ఒకరాత్రి సహ్యపర్వతంబు ఛాలులలో నొక్కటై మాంసభక్షకులగు చోరులకు వాసంబై నానాద్రుమలతాయుతంబైన యజ్ఞగిరియందుండి నికటోపల భూషితంబైన ఖట్వాంగ నదిం దరింతము. అటనుండి క్రౌంచనగ రంబుఁ జేరుదము. ఇప్పు డాపురంబును భవదీయవంశుఁ డగు మహా కపియను ధర్మాత్ముండు పరిపాలించు చున్నవాఁడు. ఆయనను మనము చూడకుండఁ జని యనడుహం బను తీర్థంబున రాత్రిఁ గడపుదము. అచ్చటనుండి సహ్యవివరంబున విరాజిల్లు గోమంతంబను పర్వతంబుఁ జేరుదము. ఆ పర్వతంబు బహుశిఖరంబు. అందొక్క శిఖరము పక్షు లకు నగమ్యమై యాకాశమంటుచున్నది. అది స్వర్గమునకు సోపాన భూతమై దేవతలకు విశ్రమస్థానమై యున్నది. దానిని మీ రధి రోహించిన నుదయించు నస్తమించు సూర్యచంద్రులను, నపారద్వీప భూషితంబైన సముద్రంబును గనఁగలరు. ఆ శిఖరంబున మీరుండితి రేని ససైన్యుండైన జరాసంధుఁడు మిమ్ముఁ జెనకఁ జాలఁడు. అనిన రామకృష్ణు లియ్యకొని హోమధేను దుగ్ధంబులఁ ద్రావి పరశురాముని తోడఁ బయనించి సాయంవేళ గోమంతంబుఁ జేరిరి. ఇట్లు గోమం తంబుఁ జేరి యమరసన్నిభులైన యా మువ్వురు గరు డానిలవేగంబునఁ దదీయోత్తరశృంగంబునెక్కి యందుఁ దగిన యావాసంబుఁ గల్పించి కొనిరి.

అంతట నా యదుపుంగవుండైన కృష్ణుంగని భార్గవరాముఁ డి ట్లనియె. నాయనా! మీతోడ వచ్చుటఁ జేసి నాయవ్యయదేహంబు ధన్యంబయ్యె. ఇఁక సెలవొసఁగెద వేని శూర్పారక పురంబునకుఁ జని యెద. ఇందు మిమ్ము దేవతలైన నెదిరింపఁజాలరు. జరాసంధుఁ డిందు మహాపారసేనావృతుఁడై వచ్చు. మీరు స్వదివ్యాయుధంబుల ధరించి యా దండునంతయు దండధరుపాలి కంపుఁడు. అష్టభుజుండవై యుద్ధంబుసేయు నిన్నుఁగని యమర్త్యులును భయపడుదురు. భూభారావతరణంబునకి దియే యంకురార్పణంబగుఁ గాక యని వారల వీడ్కొని యథేచ్ఛ మరిగె.

రామకృష్ణులజాడఁ గనిపట్టి జరాసంధుం డపారపారావారముంబోలు సేనావారంబుతోడ నానారాజాధిరాజులు సేవింప నచ్చటికి వచ్చె. కాళింగుఁడైన మద్రుండును, బాహ్లికరాజగు చేకితానుండును, గాశ్మీర రాజగు గోనర్దుండును, కరూశాధిపతియుఁ గింపురుషాధిపతి ద్రుముండును, బార్వతీయులైన మాళవులును, గిరి వెనుకభాగంబునను, బురువంశ్యుఁడైన వేణుదారియు, విదర్భాధిపతియగు సోమకుఁడును, భోజాధిపతియగు రుక్మియు, మాలవుఁడు సూర్యాక్షుఁడును, పాంచాలాధీశుఁడు ద్రుపదుండును, నవంతీశ్వరులగు విందానువిందులును, దంతవక్త్రుండును, ఛాగలి, పురమిత్రుండును, దరదుండును, కౌశాంబిరాజును, శతధన్వుఁడును, విదూరథుఁడును, భూరిశ్రవుఁడు, త్రిగర్తాధిపతియు, బాణుఁడును, పంచనదుఁడును, నుత్తరంబునను, నులూకుఁడు, నంశుమంతు కుమారుఁడు కైతవేయుఁడు, నేకలవ్యుఁడు, దృఢాశ్వుఁడు, నుత్తమౌజుఁడు, జయద్రథుఁడు, సాల్వుఁడు, కేరళాధీశుఁడు కౌశికుఁడు, విదిశుండైన వామదేవుండును, సుకేతుండును, దూర్పుభాగంబునను, బర్వతం బధిరోహించి శిఖరంబును వ్రక్కలింపుఁడు సేనను దరదుండును, జేదీశ్వరుండును దక్షిణంబున నిలిచి పర్వతారోహణంబు గావించెద మని జరాసంధుఁ డాజ్ఞాపింప నందఱు పర్వతమును జుట్టుకొనిరి. అప్పుడు చేదినాథుండిట్లనియె.

మగధేశ్వరా! పట్టనంబుల ముట్టడించుట గలదుగాని మహాదుర్గమపర్వతంబుల ముట్టడించు టెందుఁగలదు? ఈ రాజులందఱు సమతలంబుల నిలిచి విలువిద్యమెఱచి దురంబుఁగావింప నభ్యసించినవారేకాని యీ సుకుమారులు పర్వతగుహలలో నల్లిబిల్లిగ నల్లుకొని కాలిడ నెడములేని చెట్లనడుమ నిలిచి యుద్ధము చేయనేర్తురా? శత్రువులు చూడఁ బిన్నలుగాని బలపరాక్రమంబుల నందఱకన్న మిన్నలని పేరెన్నిక గన్నవారు. వారెందున్నారో యెంత బలంబుతో నున్నవారో యెఱుంగము. దోవడొంక తెలియని వీరు వారితో నెట్లు పోరాడఁగలరు. కావున ముట్టడించుట వ్యర్థప్రయాసము. ఈ పర్వతము నలువైపులు గడ్డిగాదములు పేర్చి

తగులఁ బెట్టింపుము. అట్లైన నీకొండ యరణ్యముతోడఁ గాలి పోవును. ఆ మంటలో వారు చిక్కి హతులై గానిమ్ము. లేదేని పానీయాహారములు లేక నలఁగి వెలికైన రానిమ్ము. అప్పుడు వారితోఁ బోరొనరింప నగు. అనిన జరాసంధుఁ డది మంచియుపాయమని యట్లు చేయ నాజ్ఞాపించెను.

నలువైపులు వెంటనే మింటినంటు మంటలతో దావంబు గ్రావ తరుదాహంబు గావింపఁ దొడఁగె. జంతుజాలము, రొదాళముతోడ బెరసి కాలు వెదురుపోదలు లోనగు వృక్షముల చటపట ధ్వనులు దిగంతరాళంబుల నిండె. అదిగని బలరాముండు కృష్ణుని తో నిట్లనియె. కృష్ణా కంటివే మననిమిత్తముగ ననేక భూతజాత నికేతంబైన యీ మహాధరంబునకు జాతవేదునిచే నైన విపత్తు. ఇది మన ముపేక్షించిన లోకంబున నగడు తప్పదు. కావున మనము శత్రుసేనల నడుమ దుమికి వారినెల్లఁ దుఱుము కావించు టొప్పునని పలికి శాత్రవచమూసాగరంబున దుముకుచుఁ గృష్ణుండును బాద ఘట్టనంబు గావించినఁ గొండయవిసి పగుళ్లలోనుండి సెలయేఱు లుద్భవించి పాఱఁదొడఁగె. నిరంతర ధారాపాతంబులగు నా నిర్ఘ రంబులచే నగ్నియంతయుఁ జల్లారెను. అది గని పగతురు గుండెలు తల్లడిల్లఁ గుందిరి. వెన్నుండును నన్నతోడ రిపుసేనల నడుమ దూఁకె. అప్పుడు వారికి మున్ను చేపడిన శంఖచక్రాద్యాయుధం బులు మరల దివంబుననుండి యాసన్నంబైన బలరామకృష్ణులు వానిని గైకొని యాతుంటరి మూఁకలనెల్లఁ బీనుఁగు పెంటలు గావించిరి. అనేక వీరులు హతులైరి. సైన్యంబు పలాయనపరాయణంబయ్యె. అంత మాగధుండు బలరామునెదిర్చి పేర్చిన నతండును హలంబు వానిమెడకుఁ దగిలించి లాగి రోఁకటఁ దల పగుల్పఁబోయి యాకాశ వాణి వలదని వారింప మందల విడిచె.

మాగధుండును బరాభూతుండై హతశేషంబైన సేనతో ఖిన్న వదనంబున స్వపురంబునకు మరలె.

ఇట్లు ప్రతిపక్షసైన్యంబు దైన్యంబు నొందించిన జగన్మాన్యులఁ గాంచి చేదిరాజు దమఘోషుండు చేదికారూశ బలంబులతోడ వారిని డాయవచ్చి మృదువాక్యంబుల నిట్లనియె.

నాయనలారా! యక్షతతనులైన మిమ్ముఁగని చాల సంతోషించితి. మీ జనక సహోదరియే నాభార్య. కావున మనము బంధువులము. మన బాంధవంబుఁ దలంచి జరాసంధునితో మీతోడి విరోధంబు వలదని యెన్నిమాఱులు చెప్పినను వాఁడు సూడు వీడక మీకుఁగీడు చేయుచున్నవాఁడు. వాఁడింతకు వైరానుబంధంబు మానెడివాఁడు కాఁడు. వానితోడ బొత్తొల్లక ససైన్యుండనై వచ్చితి ననినఁ గృష్ణుండు నతని సాంత్వవాక్యంబుల బహూకరించె.

అంత దమఘోషుండు కృష్ణుఁగని యయ్యలారా! యిచ్చటఁ గరవీరపురంబునఁ బరమదుర్మార్గుండు సృగాలుం డనువాఁడు కలఁడు. వాఁడు మనబంధువుల ననేకులఁ బొరిగొన్న వాఁడు. వాని పని మీరు చక్కఁజేయవలయునని ససైన్యుండై యచ్చాలురం దోడ్కొని యతండు కరవీరపురంబునకుం జనియె.

వారి రాక విని సృగాలుండును మహావాహినీ సమూహంబుతోడ వారి నెదుర్కొని పోరొనరింపఁ గృష్ణుం డతని శిరంబు చక్రంబున ఖండించి యతని భార్య పద్మావతి ప్రార్థింప క్షమించి యతని కుమారుఁడు శక్రదేవునకుఁ బట్టాభిషేకంబుఁ గావించె. అచ్చట నుండి దమఘోషుండు తననగరంబునకుం జనియె. రామకృష్ణులు ద్వారకఁజేరి స్వజనులతోడ సుఖంబుండిరి.

రుక్మిణి:-అప్పా! తడవకు నిరువదిమూఁ డక్షౌహిణులవంతునఁ బదునెనిమిదిమార్లు జరాసంధుఁడు దండెత్తి వచ్చెఁగదా. ఈ ౪౧౪ అక్షౌహిణులనఁగా నెంతసేన చెప్పుము.

తండ్రి:-౨౧౮౭౦ రథములు ౨౧౮౭౦ ఏనుగులు ౬౫౬౧౦ గుఱ్ఱములు ౧౦౯౩౫౦ భటులుగల సేనకు నక్షౌహిణి యని పేరు. జరాసంధుడు ౧౭ మార్లు తెచ్చినది ౪౦ అక్షౌహిణులే.

అనగా ౮,౭౨,౮౦౦ రథములు. ౮,౭౨,౮౦౦ ఏనుఁగులు. ౨౬,౧౮,౪౦౦ గుఱ్ఱములు. ౪౩,౬౪,[illegible]౦౦ భటులు.

రుక్మిణి:—జరాసంధునివలన ౨౩ దుర్యోధనునివలన ౧౮, అక్షౌహిణులు హతములయ్యెఁగదా. ఇంతిసేస మన హిందూ దేశములోనిదా ?

తండ్రి:—ఇప్పుడు యూరోపులో జరగిన యుద్ధములో యూరోపులోని వారు మాత్రమా చచ్చిరి ? ఇతర ఖండములవారుగూడ నందు మరణింపలేదా ? మనవారు వేనవేలుగఁ బోయి ప్రాణము లర్పించిరికదా? అప్పుడు నిట్టులే.

రుక్మిణి:—మన మార్గదాసులము కావుననిష్టముండినను లేకుండినను బోవలసి వచ్చెఁ జావవలసివచ్చె. మననిమిత్తమై యితర వర్షవాసులేల వత్తురప్పా.

తండ్రి:—ఎంతమాట యంటివి, మనమాగర్భదాసులమే కాని మన పూర్వులుకారు. వారు స్వతంత్రులు. పూర్వమనఁగా భారత యుద్ధమువఱకుఁ బాండవులు జీవించియుండువఱకును, మన రాజుల యధికారము గ్రీసు దేశమువఱకుఁ బశ్చిమమున, నుత్తర కురుభూముల (సైబీరియా)వఱకు నుత్తరమునఁ, జెల్లుచుండెను. దుర్యోధను కాలంబున నతని ప్రతినిధి (యిప్పుడు మనకుఁడు వైస్‌రాయ్ వలె) తురికిదేశమందుండె ననియు, దుర్యోధనుఁడు హతుఁడగుట విని యతఁడు మరల వచ్చుచుండఁగా 'యూ ఫ్రటీస్' అను నదియొద్ద నతనికిని దద్దేశవాసులకు ఘోర యుద్ధము జరిగెననియు నందతఁడు చంపఁబడెననియు నతఁడు మరణించిన చోటనుండు వంతెన కిప్పటికి నాతని పేరే యున్న దనియు నొక పాశ్చాత్య చరిత్రకారుఁడు వ్రాసెను. కావున మనబ్రతు కెప్పటి కింతే యనుకొనవలదు. కలిమి లేములు కావడికుండలు. భగవంతున కొక దేశమువారు బంధువులు మఱియొకరు కారని లేదు. నఱిమిరకపు మనుష్యునివలె దేశప్రజలును దక్కువస్థితిలో నున్నప్పుడు దేవుఁడని శ్ర

భక్తులు నాచారవ్యవహారములు దయాదాక్షిణ్యములు ధర్మ
చింతగలవారై యుందురు. ఆ గుణములవలన సంతో
షించి వారికి భగవంతుఁ డైశ్వర్యము ప్రాభవము నొసఁగును.
కొన్నితరములు దాఁటిన పిమ్మట నా సంతతివారి కేకారణ
ములవలనఁ దమపూర్వుల కైశ్వర్యము గలిగెనో మఱచి భగ
వద్దాసులగుట విడిచి కామినీకాంచనదాసు లగుదురు. ఆ
కారణముచే క్షీణింతురు. ఒకజాతి క్షీణించిన వేఱొకజాతి
హెచ్చుచుండును. ఇది లోకమర్యాద. తొలుత మన
మున్నతస్థితియందుంటిమి. ఆవలఁ బారసీకులుండిరి. వారి
వెనుక గ్రీకులు వారి కావల రోమనులు. పిదప స్పానియా
దేశమువారు. పిదప ఫరంగివారు. తదనంతర మాం
గ్లేయులు. ఇప్పు డమెరికావారు ప్రబలియున్నారు. ఉద
యమత్పూర్వ్యులు జపానువారు. మనదేశమున మరల నరు
ణోదయ మగుచున్నది. క్రమముగఁ జక్రమెట్లు తిరుగు
చున్నదో దైనతరంత్రము చూడుము.

## —♦ కల్యాణ లీలారంభము. ♦—

కృతయుగంబున రైవతుఁడను రాజు తన పుత్రికకుఁదగిన వరుని
భూలోకంబున నెంచనుగానక బ్రహ్మకడకేగి యాయన యితర
కార్యాసక్తుండై యుండ ముహూర్తకాలంబు వేచి నిలిచిన బ్రహ్మ
యాయన రాకకుఁ గారణంబడిగిన నా నృపాలుఁ డిట్లనియె.

దేవోత్తమా:! యీ కన్యక నాకూఁతురు. దీనికిఁదగిన వరుం
డెందును గానరాకున్నవాఁడు. ఎవని కీయఁదగుఁ దెలుపవే యనిన
విధాత నవ్వి నీ విచటికి వచ్చిన యింతలోన భూలోకంబున ననేక
యుగంబులు గడచి చనియె. నీవుద్దేశించిన వారుగాని వారివంశం
బుల వారు గాని యిప్పుడు లేరు. ఇప్పుడు భూలోకంబున ద్వాపర
యుగంబు వర్తించుచున్నది. ద్వారకయందు సంకర్షణుండు బలరా
ముఁడై యాదవవంశంబునఁ బుట్టియున్నవాఁడు. నీవా యదుసత్తమున

కూఁతునిచ్చి వివాహంబు గావింపు మనిన నట్లెయని యతండు భూలోకంబున కరుదెంచి హ్రస్వాకారంబులనున్న మనుష్యులు లోనగు వానిఁ గని కలిసమీపించెనని తలఁచుచుఁ జక్క ద్వారకకేగి బలరామున కాకన్యకనిచ్చి వివాహంబు గావించె. బలరాముఁడును హలంబామె మెడకుఁ దగిలించి యీడ్చిన నామెయు హ్రస్వాకృతిఁ దాల్చి యాయనకుఁ బరిణయ యోగ్యయయ్యె. ఇది బలరాముని వివాహ వృత్తాంతంబు. తదనంతరంబు స్వయంవరంబునఁ గృష్ణుఁడు జరాసంధ శిశుపాలాదులనెల్ల గెల్చి భీష్మకనందనయగు రుక్మిణీదేవిం బెండ్లియాడె.

సకలసంపత్సందర్భ విదర్భదేశంబున భువనమండనంబు కుండినంబనుపేర నరాతిజాతిహృదయపుట భేదనం బొకపుటభేదనంబు గలదు. దానిని ధర్మకరుండై రిపుజన భీష్మకుండగు భీష్మకుండు ధర్మపరుండై ప్రజలంబోలిన ప్రజలకు శర్మకరుండై లాలనంబునఁ బాలనంబు గావించుచుండె. ఆయనకు రుక్మి, రుక్మరథ, రుక్మబాహు, రుక్మకేశ, రుక్మమాలు లని యేవురు సుందరగాత్రులు పుత్రులు సొరిది జనించిరి. ఆసుతపంచకంబునకు సోదరియై కల్పవంచకసోదరి యంశంబున - భోగమోక్షస్వరూపత్రిక యొకపుత్రిక సర్వాంగసుందరి సుశీల ప్రాగ్దిశఁ జంద్రరేఖలీల లోకమాన్య యసామాన్య సౌజన్య ధన్య కన్యామణి రుక్మిణియను నామధేయంబున జనకభాగధేయంబుగ జనించె. కాలక్రమంబున నా యండజయానకు సుమకోదండు నిక్షుదండంబున ఫలంబువోలె నయనావనంబు యౌవనం బంకురించె. సకలగుణమందిరయగు నా సుందరి నిజజనక మందిరంబున కరుదెంచు భూబృందారక బృందంబు బృందారకవందిత పదారవిందుఁడైన గోవిందు రూపసౌందర్యగాంభీర్య వీర్యౌదార్యాది గుణగణంబులెల్ల శ్రవణరసాయనంబుగ రసాయనంబుగఁ గీర్తింప నాలకించి సాధుగతియగు నయ్యదుపతినే తాను బతిగాఁ గోరుట సాధుగతియని మతి నిశ్చయించుకొని యుండె. అచ్చట ధూర్తజన నిరాకరిష్ణుండు కృష్ణుండును బుద్ధిలక్షణౌదార్య రూపశీలగుణజాలాలయ కమలాలయ యగు రుక్మిణియే తనకు యోగ్యభార్య యని తలఁచియుండె.

అంత బంధువులెల్లరు రూపగుణవీర్యబంధురుండు శక్తితసింధు రుండగు రుక్మిణికిఁ దగినవరుండని యాయన కీయఁదలంచిరిగాని మంథర వివేకుండు రుక్మి మందరధరుపైడ మాత్సర్యంబుకతన నాయనను దూషించి భాషించి రోషించి బంధుజనులతో ద్వేషించియైన నా మించుఁబోణిని నహ్యుద్యుండగు చైద్యున కీయ నిశ్చయించి జనకుం గని యిట్లనియె.

మ. పసిఁడింగేరు తనూప్రభ ల్గలుగుని బాలామణిన్ రుక్మిణిన్
బొసఁగం బెండిలిసేయ విష్టపమునం భూపాత్మజుల్ లేరొకో
యసమానప్రథ మాననీయ చరితుల్ హా! చిత్రమూహింపఁగాఁ
బసులం గాచెడి వెఱ్ఱిగొల్లనిపయిన్ భావంబు నీ నిల్పుటల్.

ఉ. వాని యెఱుంగఁ, డన్యగృహవర్తనలం గడుమేటి, మానముం
భావము లేదు, నిల్వఁగ నభావము తెంకి, సమానసర్గసం
భావన సున్న, జాతి నహి, భవ్యమె యాకటిమేని వానికిం
దానకకన్య, గూర్చిన విధాతృని వెంగలి యంచుఁబల్కరే.

ఉ. మామ యటంచు నన్నతఁడు మానుగఁ బల్కఁగఁ గల్గెనేని సీ
నామనమాజ్యధార దహనంబునఁ బోసిన రీతి మండదే
యేమన నన్ను బావ యని యేవినఁ బల్కిన నెట్టులుండునో
యేమిటికంత? పొమ్మనిన నేగెద నే నిపుడే ధరాధిపా.

తే. పసిఁడి బొమ్మ కయోమయప్రతిమ సరియె
పొసఁగునే మణి బొగ్గునఁ బొదిఁగి యుంచ
గృష్ణుఁడేయూరు కోమలోత్కృష్టరూప
భూరివైభవ భైష్మి యే యూరు చెపుమ.

ఈ చెలువను బచ్చువలువ వాని కీయఁజాల. మదరిపువిపా లుండగు శిశుపాలున కొసంగెదనని దైవజ్ఞుల రావించి ముహూర్తంబు నిశ్చయించి శిశుపాలున కావార్త దెలియఁబంచిన సాల్వజరాసంధాది బంధుయుతుండై బలరామకృష్ణులు వచ్చి రేనిఁ బరిభవింప సమకట్టి మదబంధురుం డతండు కుండినంబున కరుదెంచె.

రుక్మిణిజననం భుంతయు నెటింగి యసిత నేత్రాంతయగు రుక్మిణీ కాంత నితాంత చింతాక్రాంత స్వాంతయై యంతఃపురంబున నేకాంతంబున నంతరంగంబున నిట్లు తలపోసె.

ఉ. చిక్కని వైరభారమున శ్రీహరి కిచ్చిన నోర్వ నంచు గం
పెక్కగ గర్రటబల్కి నను నిచ్చెద నా శిశుపాలదంతి కం
చెక్కడి తోడ బుట్టు? వితడేటికి జేసెడి నిట్టు లక్కటా?
మక్కువ బాసి యీసునను మామక పూర్వకృతంబో దైవమా.

తే. వసుధపై గృష్ణసంగతి పొసగదేని
వసుధపై గృష్ణసంగతి పొసగుటరుదె
యా వివాహంబు రమణుడై యమరదేని
యావివాహంబు రమణతి యమరనుతిము.

అని తనకు నత్యంతాప్తుండగు పురోహితుం బిలిపించి వినయ వినమితగాత్రయై యా చారునేత్ర యుదంతంబు సాంతంబుగ వినిచి యిట్లనియె.

భూసురోత్తమ! సురోత్తమవందితు నందితభక్తలోకపాలుం గనకచేలు, వందారు మందారుం గాన ద్వారక కిప్పుడ పయనింపుము. చని యాయనం గని నేను బంపితినని సవినయరీతిం బ్రీతివచించి రుక్మి దుశ్చింతయు నావంతయు నావంతయు దాపక వినిపించి, చయ్యన నిట కరుదెంచి కయ్యంబున నెల్లరనోడిచి యెట్టులైన నన్నుం గొనిపొమ్మని నెయ్యంబు తియ్యంబు దీపింప బ్రార్థింపుము. అని బోధించి పంపిన నతండును ద్వారక కేగి ప్రతిహారప్రవేశితుండై సువర్ణాసనంబున నాసీనుండై సుఖంబున్న యన్నళిననయనుం గనియె. అమ్మహాను భావుండును దోడన పసిడి గద్దియడిగి తన్ను సురలర్చించువిధంబునం ద్యానాత్మెస్సురు నర్చించి భుక్తవంతుండును విశ్రాంతుండునైన యా య్యన చరణంబులొత్తుచు మెత్తని మాటల నిట్లనియె.

ధరణీసురవరప్రవరా! స్వధర్మము వృద్ధసమ్మతమై యొప్పుచున్నది గా! అయత్నలబ్ధంబైన దానితో నీమనస్సు సంతుష్టి పడుచున్నది

గదా! అప్రయత్నంబుగ దేహధారణమునకై లభించినదానితో సంతుష్టుండయి నిజవర్ణాశ్రమోచితధర్మంబున వర్తించు బ్రాహ్మణునకు సనాతనధర్మమే కామధేనువై యుండు. అసంతుష్టుండు త్రివిష్టపనాథుండైనను నుభయలోకభ్రష్టుండగు దరిద్రుండైనను సంతుష్టుండగువాఁడు సర్వాంగతాపరహితుండై నిశ్చింతముగఁ గన్నారనిద్రించును. *స్వలాభసంతుష్టులు, పరోపకారులు, దేహాత్మాభిమానరహితులు, జితేంద్రియులునగు బ్రాహ్మణులకు మఱిమఱి శిరంబుచే నమస్కరింతును. విప్రోత్తమా! మీ రాజవలన మీకు సుఖంబుగలదు గదా. ఏరాజు తనప్రజలను యథాసుఖంబుగఁ బరిపాలించుచుండునో వాఁడే నాకుఁ బ్రియుండు. నీవేల యింతగాసికిలోనై దుర్గంబులు దాఁటి నాకొఱకై వచ్చితివి? రహస్యంబుగాదేని వచింపుము. నావలన నీకుఁ గాదగు ప్రయోజనంబెద్ది? అని లీలాగృహీతదేహుండైన పరమేష్ఠి ప్రశ్నింప నతండు సర్వ మిట్లు వివరింపఁ దొడంగె.

పురుషోత్తమా! ప్రమదోత్తమయగు రుక్మిణీదేవి యనుప నినుఁ గానవచ్చితి. ఆమె పుచ్చిన సందేశ మాలకింపుము; పదపడి యథోచితంబుగ వర్తింపుము. అని రుక్మిణి వ్రాసియిచ్చిన పత్రికను వసుదేవనందను చరణారవిందంబులకడ నునిచి నమస్కరించె. యదుసత్తముఁ డాయుత్తరంబు గొని పఠింపుమని బ్రాహ్మణునకిచ్చిన నాయనయు నిట్లు పఠించె.

భువనసుందరా! శ్రవణరంధ్రములమార్గమున లోనఁజొచ్చి యంగతాపంబు హరించు నీ గుణగణములను, గన్నుల కలిమిసార్థకంబుసేయుచు సకలార్థలాభకరంబైన నీరూపంబునువిని యచ్యుతా! నాచిత్తంబు విగతలజ్జమై నీయంద వసించుచున్నది. ముకుందా! మహాగుణవతియు, రూపవతియు, శీలవతియు, విద్యావతియు, వయోవతియు, ధనవతియుఁ గులవతియుఁ దేజోవతియు ధైర్యవతియునగు నేకన్య

* స్వలాభము=స్వసత్తాలాభము. అనఁగా వాస్తవబ్రాహ్మణత్వము. 'స్వోజ్జీవనేచ్ఛా యదితే, స్వసత్తాయాం స్పృహాయది; ఆత్మదాస్యం హరేస్స్వామ్యం స్వస్వభావంచ సదా స్మరేత్.

వివాహకాలంబునఁ దనకు సమానుఁడై నరలోకమనోభిరాముఁడైన వాని నిన్నుఁ బతిఁగాఁ గోరక యుండును? ఆకారణంబుననే నేను నిన్నుఁ బతిఁగా వరించి యాత్మార్పణంబుఁ గావించితిని. కావున నీవు భార్యగా నన్ను గ్రహింప ననుగ్రహింపుము. అంబుజాక్షా! వీరా గ్రేసరా! సింగముపాలి బలిని నక్క యాశించినట్లు నీసొత్తైన నన్నుఁ జైద్యుఁడు బలాత్కారంబున గ్రహింప సిద్ధపడి యున్నవాఁడు. వాపీకూపతటాకాది నిర్మాణంబుల, యాగాదుల, దానంబుల, నియమంబుల, వ్రతంబుల, దేవగురు భూదేవతార్చనాదుల, భగవంతు నారాధించి యుండితినేని దేవు శ్రీకృష్ణుం డిటకు నరుదెంచి నే నితరులపాలు గాకుండునట్లు నాపాణిని గ్రహించునుగాక. చమూ సమూహ పరీవృతుఁడవై విదర్భ కరుగుదెంచి శిశుపాల జరాసంధాది మదాంధుల పీచమణఁచి వీర్యశుల్కనగు నన్ను రాక్షసవివాహంబునఁ గొనియరుగుము. అంతఃపురాంతరచారిణి నగు నిన్ను నీ బంధులనెల్ల వధించిగాని యెట్లు తేవచ్చు నందువేని యుపాయంబుఁ జెప్పెద వినుము. వివాహమునకు ముందుదినము పెండ్లికూఁతు కులదేవయాత్రకై యూరివెలుపలనుండు పార్వత్యాలయంబునకుఁ బోవుట మా యింటి యాచారము. ఆసమయంబున నీవు వచ్చి నన్ను హరించికొని పొమ్ము. తమ యజ్ఞాన నివృత్తి కొఱకై మహాత్ములనేకులు మానాథువలె నెవనిపాదపంకజరజంబు శిరసావహింపఁ గోరుదు రట్టి నీయనుగ్రహంబు నాకు లభింపదేని నూఱుజన్మంబులం దైనను వ్రతముల శుష్కించి ప్రాణముల విడుతును.

అని యిట్లు పత్రికయందలి వాక్యంబులు చదివి యదువీరా! నే నీసందేశంబుఁ గొనివచ్చితి. కార్యంబు విమర్శింపుమనిన గోవిందుఁ డానందంబున నా విప్రుని వ్రేలు పట్టుకొని నవ్వుచు నిట్లనియె.

అయ్యా ధరణీసురోత్తమా! రుక్మిణికి నాయందుఁగల ప్రీతిని దెలియనివాఁడఁ గాను. ఆ కన్యకామణి నన్నుంబోలె నే నాకన్నియను వలచియే యున్నవాఁడ. ఆ చెలువ తలంపును గొనసాగ నీయక రుక్మి యడ్డపడి శిశుపాల పక్షావలంబియై యుండుటయు

నెఱుంగుదు. కన్నియలమన స్సఱచేతి పాదరసము. ఏ వేళ కెట్లుండునో. అం దామందగమన జనకాధీన. జనకుఁడు తనయ వశంగతుఁడు. కావునఁ గార్యము తెఱఁ గెట్టిదియోయని సందేహ డోలాందోళిత చిత్తుఁడనై యా కలువకంటి వలపు పెంపున వాసరములు హరివాసరములుగను రాత్రులు శివరాత్రులుగాను వెడలఁ ద్రోయుచున్నవాఁడను. అని లగ్నంబు మఱునాఁడ యగుట నెఱింగి దారుకునిఁ దేరు పన్ని దేర నియోగించె. అతండును శైబ్యసుగ్రీవ మేఘపుష్ప వలాహకంబులు పూన్చి సర్వతోలంకృతంబై సర్వాయుధ సన్నద్ధంబైన యరదంబుఁ దెచ్చిన వాసుదేవుండు భూదేవునితోడ నాక్షణమ పయనమై తరలి కుండినపురంబునకుఁ జనియె.

బలరాముఁడు శ్రీకృష్ణుండు కుండినంబున కొక్కఁడ చనుటయు నందలి శత్రుబాహుళ్యంబును నాలోచించి యదు వీరుల నెల్లఁ బిలిచి కార్యంబు తెఱం గెఱింగించి నాతోఁడు తోడు లేక పోయినవాఁడు ఆలంబు సిద్ధంబు. మీ రాలంబుచేసిన నాతోడు నుఁడీ రా రండని తోరపుసేనలను దోడుకొని యరిగె.

అందు ననయతనయప్రేరితుండై జనకుండును దనదనయను జేదిరాజునకీయ నమకట్టి సర్వంబును దిట్టంబుగఁ గట్టాయితంబుచేసి పట్టనం బెల్లపట్టుల నెట్టన నలంకరింపించి శిశుపాలునకు విడిది కల్పించి తదీయానుచర జరాసంధాదులకుఁ దగిన మందిరంబులు పొందుపఱచి లగ్నంబెల్లియని యెల్లరకుఁ దెలియఁ జాటఁబనిచె.

రుక్మిణియు వేదనాధూయమాన మానసాంభోజయై తన యంపిన భూనిలింపుఁడు రాఁడాయెనని తామరపాకు నీటివలె మనంబు చలింప దీనవదనయై యయ్యా రాత్రియుఁ గడచనియె. ఇఁక లగ్నకాలము నిమిషములమీఁద లెక్కలు గట్టుకొని వచ్చుచున్నది కాని పోయిన బ్రాహ్మణుఁడుమాత్రము రాఁడాయె. తడవేల యాయెనో ! బ్రాహ్మణుఁడే పోఁడో. కృష్ణుఁడే యూరలేఁడో ! ఉండినను నా మాట నమ్మఁడో ! నమ్మినను రిత్తకలహ మేలయని

గాఁడా? శ్రీహరి నాకుఁ బెనిమిటి కాఁడా? ఏదియుఁ దెలియదాయె. సిగ్గా భాగ్యారాలనగు నాఁడెడ బ్రహ్మదేవునకును దయలేదాయె. ఇలువేలుపు గౌరికిని గరుణ రాదాయె. ఇఁక నాగతి యేమి! ఎందుఁ జొత్తు? ఏమిచేయుదు? ఎవరి శరణంబు వేఁడుదు? వెలుగు చేను మేయఁబూనె నిఁకఁ గాచువారెవ్వరు? హా దైవమా యని బ్రాహ్మణుని వచ్చు మార్గమంద దృష్టులు నిలిపి తపించు సబ్బాలిక కును శిశుపాలునకునుగూడ నడుమక న్నడమభుజ మదరుతోఁడ నేకకాలంబున నదరె.

వాసుదేవచోదితుండై ధరణీసురుం డంతఃపురంబు బ్రవే శించె. దవ్వునంద యతని హసన్ముఖవిలాసం బుపలక్షించి కార్యంబు పండగుట భావించి యేమేమి యుచితింగించునో. యని తొట్రుపాటు పడు నాసతి కా నిమేషంబు లపూర్వవేదనాకరంబులై యుండె. అంత నావిప్రుండు డాయఁజని ప్రదక్షిణ నమస్కారపూర్వకంబుగ నిలుచున్న రుక్మిణింగని యిష్టవల్లభుఁ జేపట్టుమని దీవించి వచ్చెఁ గృష్ణుఁడు. నీమాట నచ్చె. ముదంబున హెచ్చె. నాకుఁ గానుక లిచ్చె. నీగుణంబు మెచ్చె. ఇఁక నచ్చు లేదు. నిన్నుఁదోడుకొని ద్వారకకు నేగునని కృష్ణవాక్యంబులు వినిచిన నమ్ముదితయు ముదిత యై కరకమలంబులు ముకుళించి యిట్లనియె.

ధరామరోత్తమా! నా పలుకాదరించి శ్రమంబనక యంత దవ్వేగి నా ప్రాణేశ్వరుఁ దోడి తెచ్చి నాప్రాణంబు నిలిపితివి. కరుణా వరుణాలయా! యింతటి మహోపకారంబుఁ గావించిన నీకు సమర్పమైన దిచ్చుటకు నీలోకంబున నేదియుఁ గానను. ఇదియే నా నమస్కారంబు గ్రహింపు మని సవినయంబుగ నమస్కరించిన నతండు మిక్కిలి సంతసిల్లి నిజగృహంబున కరిగె.

భీష్మకుండును బలరామకృష్ణులు నిజకన్యకావివాహంబున కరుదెంచిరని విని సంతుష్టుఁడై వారిని గౌరవించి తెచ్చి సముచిత సౌధంబున దించె. పౌరజనులును గృష్ణుని రాక విని యాయన విడి

దికిఁజని కని తదీయసౌందర్య లావణ్యాగాంభీర్యాదుల కచ్చెరువంది మనరుక్మిణి కీయనయే తగినవరుండు. ఈయనకు మనరుక్మిణియేతగు. దాంపత్యము చక్కఁగఁ గుదిరినది. మన మీజన్మంబుననో తొల్లి జన్మంబులందో యేమేని సుకృత మాచరించి యుంటిమేని భగవంతుఁ నకు మనయందు దయకలదేని కృష్ణుఁడే మనరుక్మిణికరంబు గ్రహించునుగాక, మఱి యనుగ్రహించుగాక. అని యందఱు నాయన లావణ్యారసంబును నేత్రపుటంబుల నెంతద్రావియు నాపోకలేక యుండిరి.

అంత నంతఃపుర కాంతలు రుక్మిణీదేవిని గౌరీదర్శనార్థంబు గొనిపోవ సమకట్టి పన్నీటజలకం బార్చి కురులతడియొత్తి విరులసరులు దుఱిమి కీలుగంటు వైచి చతుర్విధాలంకృత శరీరం గావించిరి, రుక్మిణి యుఁ దల్లితోడఁ బాదచారిణియై సఖులు పరివేష్టింప మున్నుమున్న వీరభట పరివారంబు విగతపరివారంబులగు. తరవారి వారంబుల జళిపించుచు నడువ, నులుపంబులఁ గేలఁగీలుకొలిపి, చెలువుగల విలువచెలువ లేగ నేల తెలిగంటి తెలివలు మంగళారాతికల్లం బాడుచుం దోడరాఁ, బణవమర్దల ఢక్కాకాహళ, కోలాహలంబు దోహలంబుగా, శుద్ధాంతంబు శుద్ధాంతరంగంబున. వీడి గోవింద పదారవింద మిళిందాయమాన మానసంబున మదనమథన శశివద నాసదన పదంబుఁ జేరి, సదమలకమల ధౌతకరచరణకమలయై. శంభు కుటుంబినీ ప్రాసాదంబులోనికిఁ దత్ప్రసాదంబుఁ గోరి చనె, ముదుసలి నేలవేలుపు ముత్తైదువలు భవయుతయైన భవానికి రుక్మిణీదేవిని నమస్కరింపఁ జేసిరి. రుక్మిణీదేవియు ధూపదీపనైవేద్యతాంబూల నీరాజనంబులఁ బూజించి పతిమతులైన విప్రసతు లాశీర్వచనపుర స్సరంబుగ నొసఁగిన యక్షతలఁ దలఁ దాల్చి శివాదేవింగూర్చి యిట్లని నమస్కరించె.

క. పతిసంతాన సమేతా!
　క్షితిధర కన్యాలలామ! శ్రీకృష్ణుఁడు నా

పతిగా నను గ్రహింపుము
ప్రతిలోక శివంకరీ! భవానీ! గౌరీ.

ఇట్లు ప్రార్థించి మౌనంబుఁ జాలించి యంబుధర నికరంబు నిర్గమించి చనుదెంచు రాకాసుధాకర బింబంబు డంబు విడంబింప సురవాహినీ ధరగేహినీ గేహంబు వెలువడి మదమరాళంబు చందంబున మందగమనంబు నాకాసనికాశ పీకాశంబైన మధ్యం బల్లలనాడ, మెఱుంగుఁ గమ్మలతళతళల మిఱుమిట్లు గొలుపు చెక్కుటల్ల మోవిల నద్దంబు నెమరనుంచిన దీపకళికవలె నత్తుప్రొంగారఁ, దమ్మి నెత్తమ్మున నృత్యమ్ము సలుపు తుమ్మెద కొదమలన ముంగురులు చలింపఁ, జిఱునవ్వు వెన్నెలలును చూపులు కనుఁ దోవలకు ననిమేషత్వంబు గలిగింప, మీనకేతన కేతన నూతన విభ్రమంబునఁ గొలఁకొంగు పయ్యంట దూఁగాడ, నించువిల్కాఁడు యువజనంబుల మనంబు లగలింపఁ దటాలున నొఱదూసి తళతళలు వెలవార జళిపింప దగద్ధగాయమానంబగు కృపాణంబు మరీచి వీచికాపరంపరలునానా వాలుఁగంటి క్రేఁగంటి చూపు వాలుఁగంబుల రాచమగల మదంబు సదమదంబుకాఁగ సముజ్జ్వల మేఖలా కీలితరత్న వితానంబులకాండ కాండధరవాహకోదండ జనకంబులై మెఱయు, మొగులు మొఱఁగి ధరమరగి తిరుగు మెఱుఁగు తెఱఁగున నత్తెఱవ యొఱపు మీఱ నందనందనాలోకన కౌతుకంబున జగన్మోహనియై చనుదెంచుచున్న సమయంబున.

సీ. ఇంచు కించుక నత్తులెత్తి ముదంబొర
మోముల వికసనములుగఁ జేసి
యురువంకలఁ గదల్చి శిరమును స్తంభించి
కనుఱెప్ప లెగయించి మనము నిల్పి
సుందరగ్రీవంబు ముందుగా వాలయించి
గండభాగం బింత కంపనముగ
సమదృష్టి గీల్కొల్పి సర్వాంగకంబులు
పులకింప నాసాగ్రమునను జూపు

గీ. వ్రేలు గదియించి నిర్వాహోలీలఁ బోత
బొమ్మలన నొప్పి రావేళ భూమిపాలు
రెల్లఁ గుండిన పురవర వల్లభాత్మ
జాత సౌందర్య దర్శన సమయమునను.

మదనుండు మచ్చుపొడిచల్లి నెల్లరని శ్చేష్టులఁ జేసెనో నా రాజకుమారులెల్ల దిగ్భ్రమ గొనినట్లు చూచుచుండ రుక్మిణీదేవియు నంద నందనుం డెందున్నవాఁడో యని ముంగురు లెగఁద్రోసికొనుచు నోరగంటఁ జూచుచు మంద మంద యానంబున నడచుచుండి యొకచోఁ గృష్ణునిం గని హర్ష పులకితగాత్రయై యాయనను గనుచు నిలిచె. ఇట్లు రథారోహణంబుఁ గోరు నవ్వారారోహం గని మధు మథనుండు మృగంబుల నడుమఁదూటి తద్బలి గ్రహించు సింగంబు వడువునఁబోయి రాజులనెల్లఁ దృణీకరించి యామె నెత్తికొనివచ్చి గరుడధ్వజాంకితంబైన రథంబున నిలిపి శంఖంబు పూరించి ద్వారకా పురమార్గంబుఁ బట్టి మెల్లగఁ బోవుచుండె. బలరామాదు లాయన వెంట నంటిరి.

అప్పుడు జరాసంధాది మానవపాలురు తమకుఁ గలిగిన యవమానము నపకీర్తిసహింపక యోహో సింహముల కీర్తి దోఁడేళ్ళవలె మన కీర్తిని గొల్లవాం డ్రపహరించుకొని పోవుచున్నవారని యుద్ధసన్నద్ధులై కవచులు ఖడ్గులు ధన్వులునై తమతమ వాహనంబుల నారోహించి స్వబలంబులతోడ యాదవానీకంబుపైఁ బడిరి. వారును నదరు బెదరు లేక వీఁకనెదురుకొని శరపరంపరాసారంబు తోరంబుగఁ గురియించుచు బలరామాది యదువీర సాహాయ్యంబున శత్రువుల నెల్లఁ బలాయన ప్రముఖులఁ గావించి రంత నాలిం గోలుపోయినవాని లీల శోకజాల తప్తుండైన శిశుపాలుం గదిసి పురుషశార్దూలా! యేల దుఃఖించెదవు. ప్రియాప్రియంబుల రాక పోకలు దేహస్వభావంబులు. నర్తకునిచేతి కొయ్య బొమ్మలకుంబోలె నీశ్వరతంత్రంబున దేహులకు సుఖదుఃఖంబులు గలుగుచుఁ-దొలఁగుచునుండును. అనిరాజులూరడింప జరాసంధుఁ డిట్లనియె. శిశుపాలా! యపజయం బొదవెనని

దుఃఖింపకుము. నేను నిరువదిమూఁడక్షౌహిణులతోడ మధురాపురంబుపై దాడివెట్టి పదునేడుమార్లు పరాజితుండనై పదపడి యొక మాఱు జయంబుఁ గొంటినిగాని యోటమికి వగచినవాఁడఁ గాను. గెలుపునకు సంతోషించినవాఁడనుగాను దైవాత్మకంబైన కాలంబున జగంబు సర్వంబు విద్రావితంబని తలంచి యూరకుంటి. మనమందఱ మిపుడు యూథపయూథపులమయ్యు నల్పబలులైన కృష్ణపాలిత యాదవులచేఁ బరిభవింపఁ బడితిమి. కాలము వారికిప్పు డనుకూలమైన కతంబున వారలు మనల జయించిరి. మనకుఁ గాలము మేలై వచ్చిన యెడ వారల మనము జయింతము. ఇంతమాత్రమునకు విషాద పడనేల? కాలంబు వేచి యుండమని బోధించె. రాజులందఱుఁ దలలు వ్రేలవైచికొని వచ్చిన మార్గంబుఁ బట్టి తమతమ పురంబులు చేరిరి.

శ్రీకృష్ణుండు తన చెలియలిని రాక్షస వివాహంబునఁ గొని పోవుటఁ బరికించి రోషావిష్టచేతస్కుండై రుక్మి కృష్ణుని జయించి రుక్మిణిని మరల గ్రహించికాని కుండినపురంబుఁ జోరనని బీరంబులు వచించి వెన్నుని వెన్నడించి చని యెదిరించి మార్కొని

సీ. కయ్యంబునకు మఱి నెయ్యంబునకు ధర
వియ్యంబునకుఁ దుల్యవిధమువలయు
నీతోడ ననిసేయ నీతోడు సిగ్గయ్యె
ధీరులే ధరణి నాభీరజనులు
జాతిహీనుఁడ వౌట సఖ్యంబు కారాదు
కారాదు వియ్య మాకతనఁ జేసి
పోటుమానిసివోలెఁ బోరాటమునకయి
పూనితి వెంతయు బుద్ధిమాలి

గీ. తెలియఁ జెప్పెద నింతయుఁ దెలిసికొనుము
బాలుఁడవు వెండియును గోపబాలుఁడవుట
విడువు నాసోదరిని వేగ విడువవేని
గసవుమెసవిన విడువక నసువుఁగొందు.

సీ. వనములఁబడరాదు మనునాశ బాడబో
    పమమాటచే నాదుబాణగణము
వనములఁబడరాదు ఘనశిలీముఖములు
    దావపావకశిఖా దారుణములు
కనవనీపకుఁడయి మనరాదు చనరాదు
    కనదవనీపక గణముమీఁద
వనములఁజొరరాదు మునివృత్తి నివసింప
    ద్వారకాపురమునఁ దరముగాదు

గీ. ధరఁ బ్రబుద్ధతకలదేనిఁ దరుణివిడిచి
కల్కితనమున మెఱయుము ఘనతగలదు
గాక నామాట వినకున్నఁ గలవు వినఁగఁ
గాలహరికంఠ ఘంటికాజాలరవము.

ఇట్లుపలికి రుక్మి యీరసంబు పెల్లున నారసంబుల వాసుదేవునిపైఁ జిత్తజల్లువలెఁ గురియించి యార్భటించి విజృంభించినఁ గంసవైరియుఁ గోపంబు రూపంబు గొన్నగతినై శార్ఙ్గంబు మీటి మేటినారాచంబుల వాని పట్టినవిల్లు నఱికి మఱియునెత్తిన విండ్లన్నియు నఱికి శతాంగంబు హతాంగంబుఁ గావించి యెత్తినకత్తిని ముత్తునియలుచేసి మఱియు నతండు వైచిన పరిఘబట్టసశూల చక్రాసిశక్తితోమరంబుల భూమిపాలుగావించిన నతండును కృష్ణవధోద్యోగంబున కుత్సహించి ఖడ్గఖేటకపాణియై పావకుమీఁదికి నుఱుకు శలభంబుఁబోలెఁ గవిసిన నిలునిలుమని యదల్చుచు నతని ప్రాణంబులఁగొనఁ గృపాణంబుగొన్న ప్రాణేశ్వరుంగని వణఁకుమేనితోఁ జాఱుపయ్యంటతోఁ దడఁబడుపలుకుతోఁ దడసినకంటితో ముకుళిత కరకమలయై రుక్మిణి తటుకున నడ్డంబుచొచ్చి యిట్టు విన్నవించె. నాథా! క్షమింపుము క్షమింపుము. వీఁడు మీయెడఁ గృతాపరాధుఁ డగుట సత్యము అది కాదనను. వీఁ డెట్టివాఁడైనను నాకు సోదరుఁడు. పూర్వజన్మమున నేమెట్టి పుణ్యంబుఁ గావించితిమో మాకుఁ బాలవెల్లి

యల్లుఁ డల్లుఁడయ్యెనని సంతోషవార్ధి మునింగియున్న నా తల్లిదండ్రులను బుత్రశోకమహాంబుధిఁ ద్రోయుట మీకుఁ బాడిగాదు. ప్రథమాపరాధంబుక్షంతవ్యంబని దీనోక్తుల వేఁడ ననుకంపాయత్తచిత్తుండై యతని మిత్తివాతఁ ద్రోయనొల్లక యతనివస్త్రంబున నతని బంధించి యుంచుచుక మిగులఁ బఱియలు వాఱఁ దలయును మీసములు గొఱిగి విరూపుఁ గావించె. ఈలో నరాతి చమూసమూహంబులఁ బాఱఁద్రోలి హలాయుధుండు దరుదెంచి వికారరూపంబున నున్న హతప్రాయు రుక్మింగని బంధంబులు వదలించి యనుకంప పెంపున శ్రీకృష్ణునితో నిట్లనియె.

కృష్ణా! నీవు గావించిన యీ కార్యంబు నింద్యంబు. బంధువునకు శిరమును మీసములు గొఱుగుట శిరంబు ఛేదించుటయే కదా యని రుక్మిణీదేవివంకఁ గని యిట్లనియె.

కళ్యాణీ! నీ సోదరునకుఁ గలిగిన వైరూప్యంబు కతన మమ్ము నిందింపకు. పురుషునకు సుఖములు దుఃఖములు స్వకృతఫలంబులై వచ్చుంగాని పరులవలన రావు అని కృష్ణు నాక్షేపించి యంతకు శాంతింపకున్న రుక్మిణింగని భద్రా! యిట్టిది క్షత్రియులకు ధర్మంబుగఁ బ్రహ్మదేవుఁడు కల్పించె. సోదరులను సోదరులే ఘోరతరంబుగ వధించుచుందురు. అని యామెకు సంతోషంబుగ మరలఁ గృష్ణుంగని యిట్లనియె. శ్రీమదాంధులు తామే వీరులమను దురభిమానముగలవారు. రాజ్యభూమివిత్త శ్రీమానాదికారణంబుల బంధువులఁ బరాభవింతురు. అట్టి చర్య మనకు సముచితముగాదు. అని కృష్ణునిఁ బరుషంబులు పలికినను నూఱడిల్లక విషణ్ణవదనయైయున్న యక్కన్నియంగని యిట్టి విషమబుద్ధివలన నీకుఁ గృష్ణునియందుఁ బరమప్రేమ లభింపదుసుమా యను రహస్యం బామెకు మనస్సున నాట నిట్లనియె. సర్వ భూతములలో హితులకు మేలు నహితులకుఁ గీడును దలఁచు నీ విషమబుద్ధి యజ్ఞులకుండఁ దగినది. నీకు సర్వభూతములం దేకరూపమైన బుద్ధి తగును జుమా. దేహమే యాత్మ

యను నభిమానముగలవారికి భగవన్మాయచే వీరు శత్రువులు వీరు మిత్రులు వీ రుదాసీనులను నాత్మమోహము మనుష్యులకుఁ గలుగు చుండునుగాని కృష్ణునియందే ప్రేమగలవారి కితరులయందు సౌ హృదాదిస్ఫూర్తి గలుగఁజాలదు. అని కృష్ణుఁ డొక్కఁడే సర్వ శ్రేష్ఠుఁడు. ఆయనయందలి ప్రేమ లభింపనివారు పుత్రభ్రాతృకళ త్రాదులందుఁ బ్రేమ యుంతురు. సూర్యజ్యోతి లభింపనప్పుడు దీప ముల గ్రహించుటయు నాకాశమునందు స్వేచ్ఛగాఁ దిరుగలేని యత్తిపండులోని పురుగు లా పండునందలి యాకాశముతోనే సం తృప్తిపడుటయుఁ గలదుగదా కావున నీకుఁ గృష్ణప్రేమ లాభకారి గాని భ్రాతృప్రేమ శ్రేయస్కరంబుగా దను రహస్యంబు మనస్సు నకుఁ దోఁప వెండియు నిట్లనియె. సర్వ జీవాత్మలలో గూఢముగ నుండు నంతరాత్మ యొక్కఁడే పరుఁడు. కాష్ఠమునం దగ్ని గూఢ ముగాఁగదా యుండును. సర్వత్ర వ్యాపించియుండు నభంబునకు వ్యాప్యగత దోషస్పర్శము లేకుండును గదా. అట్టులే పరమాత్మయు సర్వజగం బాయనకు శరీరభూతమై పాణిపాదాది రూపంబున నుండ నందు శత్రుమిత్రాది విభాగకల్పనము సముపపన్నముగాదు. మూ ఢుల కట్టి విభాగకల్పనము తగును. దేహంబు పృథివ్యాది భూతము లయు నింద్రియములయు గంధాది గుణములయు సముదాయ రూ పంబు. అది యాద్యంతవంతంబు. ఆత్మ నిత్యంబు. అట్టివానికి జనన మరణ రూపసంసారము ప్రకృతివలనఁ గలిగెను. ఆత్మ తనకు స్వాత స్సిద్ధమైన కృష్ణభక్తిని మఱచుటకు దేహమే కారణము కావున బుద్ధి మంతులు హెచ్చరిక గలిగియుండవలయు. సతీమణీ! పరమాత్మకు నసత్తయిన దేహముతోడ నుత్పత్తి మరణరూపకములైన సంయోగ వియోగములు లేవు. ఏలయంటివేని దేహంబు పరమాత్మ సంకల్ప హేతుకంబును దదధీనంబును. ఎట్లంటివేని వినుము. కన్నులు సూర్యునిచే ననుగ్రాహ్యంబులు. శ్యామాదిరూపంబులో తత్ప్రకా శముచేఁ బ్రకాశించునవి. అట్లయ్యు నారెంటిచే సూర్యుఁడు దూర స్థుఁడగుట బద్ధుఁడుఁ గాఁడుగదా. అట్టులే పరమాత్మయుఁ దదధీన

దేహంబులోనుండియు దాని నంటియుండఁడు గావున దేహదోషము లాయనను నంటవు. జన్మాదులు దేహవికారంబులే కాని యొకఁడై న నాత్మకు సంబంధించినవి కావు. అట్లయిన జీవునకు మృతియను వ్యవహార మెట్లు కలిగెనందువేని యమావాస్యనాఁడు చంద్రుని కళలు క్షయించునేకాని చంద్రుఁడు క్షయింపకున్నను జంద్రుఁడు క్షయించెనందురుకదా. అట్టులే జీవుని విషయంబునం దని తెలియం గుము. స్వప్నమునందుఁ దోఁచు పదార్థము లస్థిరములయ్యును నిద్రించు పురుషుఁడు స్థిరబుద్ధిఁజేసి తాను భోగించువాఁడనని స్వాప్న విషయములు భోగ్యములని ఫలంబు భోగంబని తలంచుఁగదా. అట్టులే యజ్ఞుఁడు సంసారము ననుభవించు. కావున శుచిస్మితా! యజ్ఞానమునఁ గలిగి శోషింప మోహింపఁజేయు శోకంబును దత్త్వ జ్ఞానముచే నిరసింపుము. అని బలరాముండు బోధింప రుక్మిణియు నైమనస్యంబు వదలి సమాధానపడి యుండె. కొంత యూపిరితో విడువఁబడి శత్రుమర్దితసైన్యుండై రుక్మి విరూపకరణంబుస్మరించి వ్యర్థ మనోరథుండై కుండినంబుఁజొరక భోజకటంబను పురంబున నివసించె. శ్రీకృష్ణుండును వైరులనిర్జించి వైదర్భిని గ్రహించి ద్వారకకరుదెంచె.

ద్వారకాపురంబునవారు శ్రీకృష్ణుండు భీష్మకకన్యకను గ్రహించి తెచ్చుటాలించి యమందానందంబునఁ బొంగిరి. యాదవులు శ్రీకృష్ణవివాహోత్సవంబు పురంబున నెల్లెడఁ జాటింపఁబంచి పురంబు నలంకరించి రంత.

సీ. ఏ చాయలను జూడ మృగనాభికాలిప్త
చారువేదీకుడ్య చత్వరములె
యేత్రోవలనుబోవ దృబ్ధుదావహరత్న
వారసందానిత తోరణములె
యేవాడలనుజూడ శ్రీవాసఘనసార
వర్ణక వృకధూప పరిమళములె
యేవంకఁగన భూషణావళీభూషిత
కాంతకాంతాక్రాంత ఘనపథములె

గీ. సకలవీథుల శ్రీహరిజయరవములతో
నిఖిలగృహముల మంగళనిస్వనములతో
గేహగేహంబునందు నుద్వాహమునకు
నగర మలరారె జనమనోనందనముగ॥

ఇట్లు పురం బలంకరింపించిరి. అంత శుభముహూర్తంబున శ్రీ కృష్ణుండు.

క. మంగళరవములు మ్రోయఁగ
మంగళసూత్రంబుఁగట్టె మంగళకరయౌ॥
మంగళ దేవతగళమున
మంగళమని పాడుచుండ మంగళవతులున్.

ఇట్లు ముహూర్తంబు జరపించి బ్రాహ్మణులకు ముత్తైదువులకు భూరి దక్షిణ తాంబూలాదు లిప్పింప వధూవరులు వారివలన నాశీర్వచనంబులం గొని రంతఁ దక్కిన కల్యాణ కార్యంబులు యథావిధి నడచె.

ఇప్పుడు ద్వారక తొల్లిటికంటె సంపత్సమేతమై శోభాయమానంబయ్యె. లక్ష్మీదేవి ప్రత్యక్షంబై ప్రసన్నంబై యుండుచోట నట్టి కొఱంత లేల యుండు? ఇట్లు కృష్ణుండు ద్వితీయాశ్రమంబు గైకొని తృతీయ పురుషార్థంబు సార్థకంబు చేయుచు.

ఉ. తీరని మోహభారమున దేవకిసూనుఁడు భీష్మపుట్రితో
వారకక్రీడసల్పెఁ జెలువంబగు వాఁకల మారువాకలన్
సారసశయ్యలం ఘనమసారసమంచిత హర్మ్యవీథులం
దోరపునిష్కుటంబులను దోయరుహాకర తీరభూములన్.

ఉ. కోకనదంబులన్ లసిత కోకనదంబుల సద్గృహంబులన్
శ్రీకనదంబులన్ రుచిర శీతమయూఖమయూఖపాళికా
భ్రాకలితైక వేదికల భాసురరమ్యవనాంతరంబు లం
దేకపుతిం జరించెను రసైకతసైకతచారుభూములన్.

ఇచ్ఛావిహారంబుల నా దంపతులు క్రీడించుచుండ రుక్మిణీదేవికి కపోలంబులు తెల్లనయ్యె. చూచుకంబులు నల్లనయ్యె. నోర జల మూరె. నడచిన శ్రమము మీఱె. నడుము బలిసె. వళులు కలిసె. ఈ గర్భిణీచిహ్నములం గని యెల్లవా రుల్లసిల్లిరి. ఒక్క శుభ ముహూర్తంబున రుక్మిణీదేవి మారుం దన కుమారుగం గనియె. ఈతండె ప్రద్యుమ్నుండు.

ఈ బాలుండు తనపాలి కాలుండని సురమదవిఘాతుండైన శంబరాసురుండు నారదుచే విని నిజ మాయాతిమిరజాలంబునం దన్ను మఱుంగుపఱచుకొని ద్వారక కేతెంచి రుక్మిణీదేవి నైజన నంబుం* జొచ్చి తల్లిప్రక్కం బరుండిన నా శిశువును హరించికొని పోయి సముద్రంబునం బాఱవైచి నిర్విచారుండై యా క్రూరుండు నిజాలయంబున కరిగె.

ఇందుం బ్రసూతిగృహంబున నున్న మందగమనలు సుందరా కారుం గుమారుం గానక బిట్టు వాపోయిరి. యాదవులును బలు తావుల దేశంబుల రోసిరోసి కానక గాసి మరలి వచ్చిరి. కృష్ణుం డెఱింగియు నేమియు దెలియని వానివలె నూరకుండె.

అట్లు సముద్రకీలాలంబులం† గూలిన యా బాలుని నొక పెనుమీనంబు మ్రింగి యథేచ్ఛ నరిగె. దైవయోగంబున నా కాలంబున దత్ప్రాంతంబున మత్స్యంబులం బట్టుచున్న బెస్తలవలలో వలరాజును మ్రింగిన చేప చిక్కికొనియె. ఆ మహామీనంబుం గని సంతుష్టులై యా ధీవరులు ధీవరులుగావునం దమ యేలిక యగు శంబరాసురునకుం గానుకగా దాని సమర్పించి బహుమతులు గొని చనిరి. శంబరుండును నా ఝషంబును సూదకారులకప్పగించె. వారు మహానసంబునకుం* గొనిపోయి దాని ఛేదించిరి. అంత దాని జఠరాంతరంబునుండి, నిజకాంతులు దిశాక్రాంతంబులుగ రాకానిశాకాంతు నిసంతులు గొట్టు మోముగల శిశువు వెలువడియె.

* నైజననము = పురుటిల్లు. † కీలాలము = జలము. * మహానసము = వంటయిల్లు.

పాచకులును నబ్బురంబున దబ్బిబ్బులై గొబ్బున నబ్బాలు శంబరాసురునకుఁ జూపిరి. మదిరామత్తుండైన యా దుష్టచిత్తుండు తన పాలిమిత్తి యాతండ యన్ని గుర్తింప నేరడయ్యె. అప్పుడు మాయావతి యను పేర మాయావేషంబున ననింద్యచరితంబున శంబరాసురు నింట మెలంగుచున్న రతీదేవి యా కుమారుండు తన మనోహరుండైన మారుండ యని నారదుచే వినియుంట నా మచ్చకంటి నే నీబాలు సాకెదనని శంబరు నడిగి యిప్పించుకొని కడు హెచ్చరిక మచ్చికఁ బెంచుచుండె.

ఆ ప్రద్యుమ్నుండును శైశవంబు బాల్యంబు దాఁటి కౌమారంబుమీఁటి నవయౌవనవంతుండై యస్త్రశస్త్రవిద్యాపారంగతుండయ్యె.

ఇట్లు ప్రాప్తయౌవనుండైన యా నవచరకేతనుం గని రతీదేవి తన్నెఱింగించుకొని సమయం బరుదెంచె నని యూహించి నిరుపమాన సౌందర్య గాంభీర్య సౌర్య ధైర్యశీలాది విశేషంబులు మెఱయు మనసునఁ బుట్టిన వానిపైఁ దనమనస్సునఁ బుట్టిన మరులు నిలుపలేక శృంగారభావహావ విలాసచేష్టల నతని మ్రోలఁ జేయఁ దొడంగె

సీ. వలుఁద గుబ్బల మీఁదిపయ్యెద జాఱించు
జాఱించి సవరించుఁ జక్క నొత్తుఁ
తళతళ మనుగండ ఫలకంబు మెఱయించు
మెఱయించి తెలుకున మఱుఁగు సేయు
ముసిముసి నగవుల మురిపెంబుఁ గడుఁజూపుఁ
గడుఁజూపి భ్రూలతల్ ముడుఁచు ముడిఁచి
కనుఱెప్ప లల్లార్చుఁ గడకంటఁ దిలకించుఁ
దిలకించి పులకించుఁ గులుకు లొలుక
గీ. లీలఁ గాల్మెట్టియలు రవళింపఁ గొట్టు
దిట్టతనమున నగుచు మో మట్టె చూచు

గోల యీవేళఁ దమిఁ జాలఁ దాళలేక
చిత్తజాతునికై బాళిఁ దత్తఱిలుచు.

మఱియుఁ గురులు దువ్వి విరులు సవరించు నెపంబున వెన్నుని కుమారు వెన్నున వక్షోజంబులొత్తు. ముఖంబునఁ దిలకంబుదిద్ది గుప్పు గుప్పునఁ జెక్కిళ్ళఁ దనివార ముద్దుగొను. రైక తొడగికొను నెపంబునఁ జుబుకంబున నొత్తిపట్టిన పైఁటకొంగు ప్రమాదంబునఁబోలె జాఱవిడిచి మరల నఱపైఁటగ సవరించును.

ఇట్టి చేఁతలం గని వింతలుపుట్టి చిత్తజాతుం డొక్కనాఁడ మ్మత్తకాశినిం గని.

ఉ. పెంచితి విన్నినాళ్ళుగను బ్రీతిని మాత యిదేమి చేఁత? నేఁ
డించుక యోని భీతి గణియింపక కాముకరీతి నీతిఁ జా
లించుచు నాముఁబెంచి పెదలేదె వివేక విచారమింతి? నర్గ
నాంచవొ? నీ కుమారుఁడనుగానొ నిజంబుగఁ దెల్పు భామినీ.

ఉ. మానిత సద్వ్రతంబులను మానక యెప్పు డొనర్చుచున్నదో
మానిని మానసంబునను మా ముద మందుదు సాధ్వివంచు స
న్మానముతోడ నిట్టియెడ మానము నానయుఁ దూల నిస్సిగో
యానొకొ యీలువెంచు మగనాలికి నీ వెలయాలి పోఁడుముల్.

మ. తగదమ్మా సుతు తోడిసంగమునకై తర్షంబు; పాపంబు నేఁ
తగదమ్మా; సరివారువిన్న వసుధం దర్పించి నవ్వంగ గోఁ
తగదమ్మా మఱి జీవితంబు మరియాదా చూడవా నాదు మా
త గదమ్మా పయి నీకుమారుఁడనుగాదా యమ్మ చింతింపుమా.

అనిన రతీదేవియుఁ *కుమారా! నీవు నాకు మారుండవే కాని కుమారుండవు కావు. మన పూర్వవృత్తాంతము వినుము. జఱభి సని తలంపకు. కాంతా! తొలిజన్మంబున నీవు నా కాం

* కుమారా = మన్మథుఁడా! జఱభి = అసతి. ఇది దేశ్యము. అవధారు వచనాభియంగువలె నిందును వర్ణముక్కు కొనఁబడెడి.

తుండవగు కంతుండవు. నేను నీ కాంతను రతీదేవిని. ఏకాంతంబున గానానంతరమునఁ దపోనిష్ఠాతాంతుఁడగు త్రిపురాంతకు తపంబుఁ జెఱుప లతాంతంబులఁ గురియించితివి. దాన గౌరీకాంతుని స్వాంతంబు భ్రాంతంబగుటయు రోషాక్రాంతుఁడై నిన్ను లలాటనేత్రాంతజ్వాలకు బలిగావించె. అంత నేనెంతయుఁ బ్రార్థింప సదయాంతరంగుఁడై మఱుజన్మంబున నీపతి నీకు మూర్తిమంతుఁడై లభ్యుండగు. అంతవఱకు నీకుమాత్రము గోచరించుచుండుఁ గావున నీకు వైధవ్యంబులేదు పొమ్మని వచించె. అవల నారదుండు నా పరితాపంబు వీక్షించి దయాయత్తుండై నీవు ద్వారకావాసులైన రుక్మిణీకృష్ణులకుం బుత్రుండవగుదు వనియు ని శంబరుండను నిన్ను హింసింపఁ గోరి శంబరనిధిం బారవైచుననియు నది యొకమీను మ్రింగుననియు జాలరులు దాని నీని కిచ్చెదరనియు నందుండి జనయుక్తుండవై నీవు వెలువడుదువనియు నంతవఱకు నీవు వీనియింట మాయావతి యను పేర మాఱువేషంబున వసింపుమనియు యౌవనవంతుఁడవైన నీచే నీలోకకంటకుఁ జంపించి నిన్నుంగొని మరల ద్వారకఁ జేరుదువనియు బోధించెఁగావున నింతకాలంబుగ నీకై వేచియున్నదాన.

ఉ. కానసురారి వేగ జముఁగానఁగఁ బంచి భవజ్జనంబులం
గానఁగఁ బోవుటొప్పు నినుఁ గానక నీతలిదండ్రు లెంత శో
కానల దహ్యమానులయి యక్కట కుందెదరో మనంబునన్
మానుప నీతిగాదె యనుమాన మిఁకేటికి నీదు పోఁటికిన్.

క. కొమకందు ప్రక్కలోఁ జను
గుడువఁగ నెవ్వండొ గోడు గుడువంజేసెన్
దడయక యని మిడుకుచు వెత
గుడుచుచు నీతల్లి యెంత గుందెడి నోకో.

క. క్రేపును బాసిన గోవనఁ
బాపండగు నిన్నుఁ బాసి పటుదుఃఖముచేఁ
దాపముఁ జెందదె కుందదె
రూపరి నీతల్లి సుతుఁడు రూపఱె ననుచున్.

అని హరితనయునికిఁ దన యునికి సర్వంబు నెఱింగించి నిజ పితృదత్తంబగు సర్వమాయావినాశిని మహామాయ నెఱింగించి సర్వ సాధనంబులు సమకూర్చి యిచ్చినఁ బ్రద్యుమ్నుండును శంబరా సురుం బవరంబునకుఁ జీరి యతని వధించె.

ఆవల నా నవలామిన్న యా వలఱేని యోగబలంబున నెత్తి కొని గగనమార్గంబునం జని ద్వారకం గని రుక్మిణీశుద్ధాంత సౌధంబున డిగిరి. అవరోధవధూమణులు లా బిబ్బోకవతిని వాని చేఁగొని యున్న జలదగాత్రుఁ జలజదళ విశాలనేత్రు శృంగారరసైక పాత్రు జయంతవసంతమైత్రుఁ గని యచ్చెరువాటు నెఱపాటు గుబ్బ తిల్ల నిబ్బరంబు చెడి తబ్బిబ్బులై గొబ్బున రుక్మిణి కడకుం బరువు వాఱువారును ఱా బొమ్మలవలె నిలఁబడువారును మూలమూలల నొదుగువారును గుసగుసలు వోవువారు నైరి.

ఈ వింతవార్త రుక్మిణీకాంత విని యచ్చోటికి వచ్చి చూచి చన్ను దోయి చేప సంభ్రమ దైన్యంబులఁ దోడివారలతో నిట్లనియె.

చెలువలారా! నిండు జాబిల్లి వెల్లం బోవఁజేయు నెమ్మోముఁ దమ్మియుఁ దమ్ములకనుంగుఁ దమ్ములైన కన్నులును, గన్నులవింటివాని మాఱువడఁజేయు రూపును, గల యీ కుమారుం డెవ్వఁడో కదా? ఏ భాగ్యవతి తన కడుపు పాఱసివోవకుండ నీతనిఁ గని సార్థక జన్మ యయ్యెనో, ఏ కాంతుఁ డీ కాంతు నేకాంతయందుఁ బుత్రునిఁగాఁ బడ సెనో, ఈతని చెంత నీ యింతి యెవ్వతెయో, వీరిట్టివారని చెప్పఁ గలవారిం డెవ్వరు లేరుగా. వీనినిఁ జూడంజూడ నీతని చరిత్రం బెఱుఁగ మనంబువ్విళులూరుచున్నది అదియేమో కాని సఖు లారా! వీనిఁ గన్నదిమొదలు నా తొలిచూలు కుమారుఁ గన్న యట్లాలయ్యెడు. అయ్యో నా కంతటి భాగ్యమా. పురుటింట నా పొదిగిట నుండఁగానే యే పాపియొ నా పాపనిఁ జనుఁ గుడుచు వానిని హరించి కొనిపోయెను. నాఁటినుండి నేఁటివఱకు వానిజాడ తెలియరాకున్నది. వాఁ డేపుణ్యాత్మురాలిచేనైనఁ జిక్కకుండునా?

ఏసుకృతవతికైనవానిని రక్షింపదా? అక్కలారా! వాఁడు నాకుఁ దక్కకుండినఁ బోనీ. అమ్మాయని నన్నెఱుంగకుండిన మానెను. ఎక్కడైన వాఁడు జీవించియుండిన నంతియు చాలు. ఆ వార్తయు నెఱుఁగరకున్నది. కాంతలారా! నా మూపు గొన్నకుమారుఁడగు నా కుమారుఁ డింతదాఁక బ్రదికి యుండెనా, మాఁదవిలాస వయోగతి మంబుల సందేహము లేక యింతవాఁడై యుండును గదా. సుంద గమనలారా! నన్నొక సందేహము బాధించుచున్నది. వీఁడు నా కొడుకే యగునేమో. అట్లు కాదేని నా ప్రాణము మొక్కట్లు వీనియందుఁ గానరాఁ గారణంబేమో. అంతియ కాదు. వీనిఁ గన్నదిమొదలు చనులు చేఁపుచున్నవి. అని సందేహంబున నది యూఁదు డెందంబున వీఁడు నా కొడుకే యని కౌఁగిలింతునా కాకున్న సవతులు గేలిసేయుదురేమో కాదని యూరకుందునా మనఁ బూన కుండకున్నది యని వితర్కించి మందగమన కనుఁగొనుచుండు నవార్త విని కృష్ణుండు దేవకీవసుదేవులతోడ నయ్యెడ కరుదెంచి సర్వం బెఱింగియు నేమియు నెఱుఁగనివానివలె నుండె. అంత నారదుండు వచ్చి శంబరుండు పురుటింటియందు కుమారుఁ గొని పోవుట లోనగు నదంతయు సాంతంబుగ వినిపింపఁ జచ్చిన బిడ్డఁడు మరల బ్రదికెనని యందఱు నమందానందంబున నోలలాడిరి. రుక్మిణి యు నందనుఁ గౌఁగిలించుకొని యానందాశ్రువుల నతని శిరంబు దడుపుచు నిట్లనియె. కుమారా! నిన్నుఁ బాపపు రక్కసుఁడు సముద్రమునఁ ద్రైచెనా? ఎన్నాళ్లాయెరా నాయనా నిన్నుఁ జూచి. ఎట్లు బ్రతికితివి. వాని నెట్లు వధించితివి. ఎంతపుణ్యాత్ములనో మరలఁ జూడఁగంటిని. కోడలా! నీవు నాకుఁ గోడలివిమాత్రము కావు. నాకుఁ బ్రథమపుత్రభిక్ష నిచ్చిన తల్లివి. నీవలనఁ గదా నా కొడుకు జీవించి రాఁగలిగెను.

అని సంతోషించి కొడుకును గౌఁగిలించుకొని కోడలిగుణం బుల శ్లాఘించి వినోదించుచుండె.

ప్రద్యుమ్నుఁడు శంబరాసురుని పెంపుఁ బెరుఁగుచున్న సమ యంబున నిటు రుక్మిణీదేవి చారుదేష్ణుండను పేరుగల కుమారుఁ గనియెను.

## — స్యమంతకోపాఖ్యానము —

రాజేంద్రా! సత్రాజితుండనువాఁడు కృష్ణుండు తనస్యమంతకమణి నపహరించెనని యపవాదంబుఁ గల్పించి యది యసత్యంబని స్పష్టపడుటయుఁ దన పాపంబునకు ప్రాయశ్చిత్తంబుగ నా మణియును దన కూఁతు సత్యభామను నాయనకు సమర్పించె. ఆ చరిత్రంబు సవిస్తరంబుగఁ జెప్పెద వినుము.

సత్రాజితుండనువాఁడు పదునాల్గొండు దినములు సముద్ర తీరంబున సూర్యునారాధించిన నద్దేవుండు వేఱు మూర్తి ధరించి సౌమ్యాకారంబున నతనికిఁ బ్రత్యక్షంబయ్యె. సత్రాజితుండును భాస్కరు నుద్దేశించి దేవా! నీవు నీ నైజ తేజంబున గోచరించిన నేనెట్లు నిన్నుఁ గనుఁగొనఁ గలవాఁడననిన నయ్యర్కుండు తన మెడనున్న స్యమంతకమణిని నతనిమెడ వైచిన రత్నహీనుండగుట సౌమ్యతేజంబునఁ గ్రాలు నద్దేవుఁ దేఱిచూచి సత్రాజిత్తు స్తుతించె. మార్తాండుండును వరంబుఁ గోరుమనిన నమ్మణిని దానంబుగఁ గోరె. రవి యద్దాని నతని కొసంగి దివంబున కరిగె.

సత్రాజిత్తామణిని మేన ధరించి ద్వారకానగరంబుఁ జొచ్చి పురవీథులఁ దన గృహంబునకుం బోవుచుండ మిఱుమిట్లు గొలుపు దాని కాంతులచే దుర్నిరీక్షుండైన యతని లక్షింపనేరక పౌరులు కృష్ణుం జూసి యిట్లనిరి.

దేవాదిదేవా! సాష్టాంగ నమస్కారంబులు. ఇంద్రాణీ వాణీ శర్వాణీ వల్లభులు భవత్పాద సందర్శన వందనాపేక్ష యిందరు దెంచుచుందురుగదా! నేఁడు వాఁడెవ్వఁడో కాని పురవీథులవెంట నరుదెంచుచున్నవాఁడు. వాని తేజంబు దుస్సహంబై తేఱి చూడరాకున్నయది.

అని యాడిన యమ్మూర్ఖుల మాటలు విని నవ్వి కృష్ణుండు వచ్చెడివాఁడు మణిసమేతుండైన సత్రాజితుండుగాని సూర్యుండు

గాఁడని వచించె. సత్రాజిత్తుండును దన గృహంబునకుఁ బోయి దానిని బ్రాహ్మణోత్తములచేఁ బూజాగృహంబునఁ బ్రతిష్ఠింపించె. ఆ మణిప్రభావం బద్భుతంబు. అది ప్రతిదిన మెనిమిది బారువుల బంగారము మొసంగుచుండు. అది యెందుఁ బూజింపఁబడుచుండు నందు దుర్భిక్ష మారీముఖాది వ్యాధులు నశుభంబులు పొసంగవు. మాయావులగు ఖలులును దక్కరు. అట్టి మణి నొక్కనాఁడు కృష్ణుండుగ్రసేనున కిమ్మని యడిగిన లోభియగు సత్రాజిత్తొసఁగఁ డయ్యె. రాజా! యర్థాతురులకు గురువనియు బంధువనియుఁ దలఁపు కలుగునా? భగవంతునకు నివేదింపక దేనినైన ననుభవించువాఁడు కాలాంతరంబుననైనఁ గీడు పొందక మానఁడు. ఎట్లంటేని తరువాతి కథ వినుము. ఒకనాఁడు సత్రాజిత్తు తమ్ముఁడు ప్రసేనుఁడనువాఁడు మణిని గంఠంబున ధరించి హయారూఢుండై వేఁటకై యడవికిఁ బోయెను. ఆ మూఢుం డశుచియై దానిం దాఁకినఁ గీడు మూడునని యెఱుఁగఁడు. ఇట్లు ధరించి యతం డడవులఁ గ్రుమ్మరుచుండ నొక సింహము వానిపైపడి గుఱ్ఱంబుతోడ వానిని వధించి మణిని గొనిపోవుచుండ జాంబవంతుఁ డా సింహమును సంహరించి మణిని హరించి కొనిపోయి బాలునకుఁ గ్రీడా కందుకముగ నొసంగె.

ఇక్కడ ద్వారకయందుఁ దన యనుజుండు మరల రాకుండుట చూచి సత్రాజిత్తుండు మణికై కృష్ణుండు తన తమ్ముని జంపెనని చెప్పుకొనసాగె. ఆ మాటలు కర్ణాకర్ణిగఁ గృష్ణుని వీనులంబడియె. నిష్కారణంబుగఁ దనకుఁ దాపరించి తారసిల్లు నపవాదంబుఁ బాపుకొనఁ గోరి కొందరు పౌరులం దోడుకొని కృష్ణుండు ప్రసేనుండు పోయిన మార్గముం బట్టిపోయె. ఇట్లు పోయిపోయి యొకా నొక కాననంబునఁ బ్రసేనుండును వాని గుఱ్ఱంబును దానికిఁ గొంత దవ్వున సింహంబును జచ్చి పడియుండఁ గని యచ్చటి యడుగుల జాడఁ బట్టిపోవ నది జాంబవంతుని గుహ ముంగలకుఁ దీసికొనిపోయె. కృష్ణుండును మీరందఱిందుండుఁడని గుహ వాకిటిఁ దోడివారి నెల్లర నిలిపి తా నొక్కఁడ యా చీఁకటి గుహలోనికిం బోయి

యందు బాలుని యొద్దనున్న రత్నంబుఁ గాంచి హరింప నెంచి డాసిన బాలుని దాదియు వింత మనుష్యునిఁ జూచి భయపడి యఱచినశతానంద * నందనుండు పఱతెంచి తనస్వామియని గుర్తింపనేరక యెవ్వండో ప్రాకృతపురుషుం డని తలఁచి కృష్ణునితో యుద్ధంబు సేయఁ దొడంగె. ఇట్లు మాంసమునకై పోరు డేగలవలె యదువిధి నందనులు పదు నెనిమిది దినములు తెఱపిలేక రేవగలు రణంబొనర్చిరి. అందు వజ్రసమంబులైన కృష్ణ ముష్టిఘాతంబుల నొచ్చి గతసత్త్వుండై మేనెల్లఁ దడియ భల్లుకేశ్వరుం డిన్ని దినములు నా యెదుర నదరు బెదరులేక నిలిచి కలన నన్ను నొప్పింపఁగల వీరుం డెవ్వండని యోజించి యెఱింగి యిట్లనియె.

## జాంబవంతుండు శ్రీకృష్ణుని స్తుతించుట

దేవా! నిన్ను సమస్త భూతంబులకు ప్రాణంబును నోజస్సును వేగ బలంబులునైన పురాణ పురుషుండవు ప్రభవిష్ణుండవు నధీశ్వరుండవునగు విష్ణువుఁగా నెఱింగితి. నీవే మహదాది పృథివ్యంతంబులైన తత్త్వములకు స్రష్టవు. సృజ్యంబుల కుపాదానకారణంబవు నీవ. వర్తమాన పదార్థములకెల్ల నాశము కలిగించువారి కీశుఁడవు నీవ. జీవాత్మలకు నంతర్యామివైన పరమాత్మవు నీవ.

భవద్వినోదార్థంబ జగత్సృష్టిస్థితి సంహారంబులు గావింతు వండ్రు. దుఃఖజలపూర్ణంబైన సంసారసాగరంబున మునిఁగి తేలు జీవులఁ గనుట నీకు వినోదంబగునే. కొందఱు ప్రపంచంబే మిథ్య యండ్రు. సత్తునుండి యసత్తె ట్లుత్పత్తియగు. అనాదికర్మవాసనా బలంబునఁ బ్రకృతివశులై దుఃఖించు జీవులయందుఁ గరుణించి వారి నుద్ధరింప నెన్నియో పోకలఁ బోవుచుందువు. పుట్టువులేని నీవు బహువిధంబుల జనింతువు. నిమిషమాత్రంబున సంకల్పబలంబున ననేక కోటి బ్రహ్మాండంబులఁ గల్పింపను హరింపను సమర్థుండవగు నీవు దుష్టాసుర సంఘంబు సంహరించుట నెపంబుగఁగొని దర్శనమిచ్చి

* శతానందనందనుఁడు = బ్రహ్మకొడుకు జాంబవంతుఁడు.

భక్తజనవాంఛా పూర్తి గావింపఁ బ్రాకృతపురుషరూపంబుధరింతువు. గుప్తమహిముఁడవైన నిన్ను నజ్ఞులు మనుష్యమాత్రునిఁగ నెఱుంగుదురు. తత్త్వజ్ఞులు యథార్థంబెఱింగి సేవించి మృత్యువనుండి తరింతురు. ఎఱుకయు భవత్కృపాలేశంబునఁ గలుగుచుండును. దేవా! కౌసల్యాగర్భశుక్తి ముక్తాయమానుండవై పితౄజ్ఞ మిషగాఁగొని లోకకంటకులనెల్ల వధించితివి. ధర్మరతార్థంబు జనించి శివధర్మ భంగంబు గావించితివి. జనకసుతాది రహితుఁడవయ్యు జనకసుతా సహితుఁడవైతివి. ధర్మోద్ధరణంబుగావించు నీవు జనకసుతను, ధాత్రీ కన్య నెట్లు వరించితివో. బ్రాహ్మణరతాదీక్ష వహించియు బ్రాహ్మణ తపఃఫలంబు విధ్వంసంబు గావించితివి. ఖరదూషణాలాప విముఖుండవగుట ఖరదూషణ హననంబు సముచితంబ. దుష్ట సాంగత్యంబు హానికరంబని బోధింపఁగదా లంకాపరిఖాయమానుఁడైన సముద్రుని శాతబాణకిణముద్రితుఁ గావించి బంధించితివి. సత్సహవాసంబు శ్రేయస్కరంబని తెలుప హనుమన్మిత్రు మిత్రసుతు నేలితివి. నీ సౌశీల్యంబు ప్రకటింపఁగదా శబరీశబరగృధ్రవానర భల్లూకంబులతో నెయ్యంబు గావించితివి. నీ దయ యపూర్ణకుక్షియగుట నెఱింగింపఁగదా చేతనా చేతనంబులకును మోక్షం బొసంగితివి. రాతిని నాతిగఁజేసిన నీవు నాతికి ముఖభంగంబు గావించితివి. అట్టి జగన్నాథుండును మన్నాథుండును నగు శ్రీరామమూర్తివి నీవేకదా. నీవేకదా నాఁడు నేఁడును ధనుర్భంగంబు గావించితివి. నాఁడును నేఁడును మృతశిశువుల బ్రతికించితివి. నాఁడును నేఁడును గోపాలకుండవైతివి. నాఁడును నేఁడును నద్వార రక్షకుండవైతివి. ఇంతయు నెఱింగియుఁ బశుబుద్ధిఁజేసి ప్రమాదవశంబున నకార్యం బొనర్చితి. క్షమింపుము.

అని సవినయంబుగఁ బ్రస్తుతించినఁ గృష్ణుం డాభక్తుని శరీరంబు శంకరంబగు తన కరంబున నిమురుటయుఁ గాయంబు గాయంబులు మాని యెప్పటియట్లు జవసత్త్వంబులఁ గూడియుండె. ఇట్లు కోలుకొనిన నతనింజూచి శ్రీకృష్ణుండు మేఘగంభీర భాషణంబుల

నిట్లనియె. జాంబవంతా! యీ మణిని నే నపహరించితినని పుట్టిన లోకాపవాదంబుఁ బాపికొనుటకు నీ గుహకు వచ్చితి. నీ వీమణిని నా కొసంగి నిందఁ బాపుమనిన ఋక్షేశ్వరుండును నా క్షణము జాంబవతియను తన కన్యకామణిని మణిని యదుకులమణికిచ్చె. ఇట్లు రత్నంబును గన్యారత్నంబును బరిగ్రహించి భగవంతుండు పునరావృత్తి రహితంబైన ముక్తిపదం బతని కొసంగె.

అట దరీముఖంబునఁ గాచియున్న జనులు పండ్రెండు దినంబులయ్యెఁ గృష్ణుండు రాఁడు లోన మడిసెం గాఁబోలునని తలంచి దుఃఖార్తులై పురపురఁ బొక్కుచుఁ బురంబునకుఁబోయి యీ వార్త యదువృద్ధులకుఁ దెలిపిరి. కృష్ణుండు మరల రాఁడాయె నని దేవకీ వసుదేవులు రుక్మిణి లోనగువారు బంధువులు విలపింపసాగిరి. లోకులు సత్రాజిత్తును నానావిధంబులఁ దిట్టి కృష్ణునకు మేలుగూర్పుమని దుర్గాదేవిం బూజించిరి. దుర్గయు శ్రీకృష్ణుండు సుఖంబుగ మణితోఁ గన్యామణితో వచ్చునని వారికిఁదెలిపె. ఇంతలో నింతి చెంత నరుదేర మణిని గంఠంబున ధరించి కృష్ణుండు పురంబుఁజొచ్చె. ఆయనం గని మృతుఁడైనవాఁడు పునరాగతుఁడైనట్లు లెల్లరుఁ బెల్లుగ నుల్లసిల్లిరి.

శ్రీకృష్ణుండును రాజసభయందు నా మణివృత్తాంతంబంతయుఁ దెలిపి దానిని మరల రాజుసమక్షంబున సత్రాజిత్తున కిచ్చి యథావిధి జాంబవతిని వివాహంబై సుఖంబుండె. ఈమె కుమారుండు సాంబుండు.

సత్రాజితుండును నిష్కారణంబుగఁ గారణపురుషుపై నింద మోపితినని సిగ్గుపడి తలవాంచి తనపాపంబునకుఁ దానే పరితపించుచు నింటికిఁబోయి చింతాకులితస్వాంతుండై బలవద్విరోధంబు పాటిల్లె. దీనిఁ దరించు మార్గంబెద్ది? ఎట్లు తన్నుఁ గృష్ణుండు క్షమించు! ఏమిచేసిన జనులు తన్ను నిందింపకుందురు? ఛీ! నే నెంత మూఢుఁడను. ఎంత దీర్ఘాలోచన లేనివాఁడను, ఎంతటి ధన

లోభిని. పాపులపాపంబులఁ బాపు శార్ఙ్గచాపుపైఁ బాపంబు తేరకు వక్కాణించితి. ఈ పాపంబు దొలఁగుటెట్లు? దీనికిఁ దగిన ప్రతి విధానంబు మఱేదియును లేదు. ఈ రత్నంబును స్త్రీ రత్నంబైన నా పుత్త్రికను శ్రీకృష్ణునకిచ్చి శరణువేఁడుటే సమంజసమార్గంబని నిశ్చయించి సత్రాజిత్తుమణిని దనకూఁతురగు సత్యభామను నాయన కొసంగె. శ్రీకృష్ణుండును శీలౌదార్యరూప భామయగు సత్యభా మను యథావిధి వివాహంబై సత్రాజిత్తుతో నిట్లనియె. అయ్యా! మాకీ కన్యకారత్నంబు చాలును. నీ రత్నంబును నీవ కొనుము. నీవు సూర్యు నారాధించి పడసితివి. కావున నది నీయొద్దన యుం డుట న్యాయంబు. కావున నీవ యది యుంచుకొమ్ము. ఫలము మే మనుభవించెదము. అని స్యమంతకంబును మరల సత్రాజితున కొసఁగె.

ఈ సమయంబునఁ గుంతీదేవియుఁ బాండవు లేవురు వారణా వతంబున లక్కయింట దగ్ధులైరనువార్త వచ్చిన వాస్తవార్థ మెఱింగి యు దానిని బయలుపుచ్చ రాకుండుటచే నెఱుఁగని యట్లు నటించి మాయామానుష విగ్రహుండు బలరామునితోడఁ గులోచితకార్యం బులు దీర్చ హస్తినాపురంబున కరిగె. తమతో సమానదుఃఖులైన భీష్మకృప విదుర ద్రోణగాంధారులఁ గని యాహా యెంత కష్టము ఘటిల్లె నని యావిషయంబులు ముచ్చటించుచుండె.

అక్కడ ద్వారకయందు రామకృష్ణులు లేనిసమయంబుఁ గని యక్రూరకృతవర్మలు శతధన్వునితో నోయీ సత్రాజితుం డెంత ద్రోహముచేసెఁ గంటివా? తన పుత్రిని సత్యభామను మన కిచ్చెద నని చెప్పుచుండి కృష్ణున కిచ్చెను. ఇప్పుడు రామకృష్ణు లింట లేరు గదా నీవేల యా మణిని హరింపరా దనిన నప్పాపాత్ముండు నర్థ రాత్రివేళఁ జని స్త్రీలెల్ల విలపించుచుండఁ గటికవాఁడు పశువునుబోలె సత్రాజిత్తును జంపి మణిని నపహరించికొని పోయెను.

సత్యభామయు దిక్కులేని దానివలెనై హతుండైన తండ్రిని జూచి దుఃఖాతిరేకంబున హా తండ్రీ యని విలపించి మూర్ఛపోయి లేచి దిటంబు తెచ్చుకొని జనకు కళేబరంబును తైలద్రోణియందుం బదిలంబు సేసి హస్తినానగరంబునకుం జని విదితార్థుండైన కృష్ణునకు సర్వవృత్తాంతంబు వినిచె. రామకృష్ణులును లోకవిడంబనార్థంబు హా యెంతకష్టము సంభవించెనని వగచిరి. కృష్ణుం డన్నతోడను భార్యతోడను మరలి ద్వారకకు వచ్చి శతధన్వు వధించి మణిని గ్రహింపం దలపెట్టె. ఆ వార్త యెఱింగి శతధన్వుండు భయపడి కృష్ణుతోడ యుద్ధంబునకు సహాయుండవు కమ్మని కృతవర్మ నడుగ నతం డిట్లనియె. సపరివారంబుగం గంసుహింసించి జరాసంధుం బసునేడు మార్లు పాఱఁదోలిన రామకృష్ణులతో నెవ్వండు బుద్ధిమంతుండు విరోధించుం బొమ్మనిన నతండక్రూరు సాహాయ్యంబు కోరిన నతం డిట్లనియె.

ఎవ్వండు జగన్నిర్మాణ పోషణశోషణకార్యంబు లొనర్చు, ఎవ్వని మాయచే మోహితులై జనులాయన సృష్ట్యాదికార్యంబులు తెలిసికొనలేరు. ఏడేండ్ల బాలుండై యెవ్వండు గోవర్ధన పర్వతంబును బాలుండు పుట్టగొడుగువోలె నొక కేల నెత్తె. అట్టి యద్భుత కర్ముండును భగవంతుండును ననంతుండు నాదిభూతుండును గూటస్థుండును బరమాత్ముండును నగు కృష్ణునకు నమస్కారంబు లొనర్చువాఁడనే కాని తిరస్కారంబొనర్చి యాయనతోడ నిగ్రహించువాఁడను గాను బొమ్మనినఁ బ్రత్యాఖ్యాతుండైన శతధన్వుం డక్రూరున కా మణి నీయొద్ద నుంచుకొమ్ము మరలవచ్చి గ్రహించెదనని యాయన యొద్దనుంచి దినమునకు నూఱు యోజనంబుల పోఁగల వడిగల విజ్ఞాతహృదయ యను గుఱ్ఱంబు నెక్కి ద్వారకవిడిచి పరువెత్తె.

రామకృష్ణులు గరుడధ్వజంబెత్తిన రథం బధిరోహించి యా గురుద్రోహిని వెన్నంటి వేగంబునం బోయిరి. శతధన్వుండును మిథిలా ప్రాంతకాంతారంబు నంతికంబునం దురంగంబు డస్సిపడిన దానిని విడిచి రిత్తకాళ్లం బరువెత్తం దొడంగె. కృష్ణుండును బోకు

పోకుమని చక్రంబున నతని శిరంబు ఖండించి యతని వస్త్రంబుల
మణిని వెదుక నది గానరాదయ్యె. ఆ వార్త రామున కెఱింగించిన
నాయనయు వీఁడు మణి హరించుట సత్యంబు. అది వాని యొద్దఁ
గాక మఱి యెందుండఁగలదు? నేను దాని నాశించెదనని నీవు లోభివై
ధనాశచే బొంకాడుచున్నాఁడవు. ఛీ నీవేటి తమ్ముఁడవు. తమ్ముఁ
డవని నిన్ను క్షమించితి. చాలుఁజాలు నీ పొత్తు. ఇఁక నీవును వలదు.
యాదవులును వలదు. నా గతి కోలఁది నేను బోయెదఁ బోపొమ్మని
మొగంబునఁ గంటువెట్టుకొని చేరువనున్న మిథిలకేగి యందు జన
కునిచేఁ బూజితుఁడై పదుమూఁడు సంవత్సరములు సుఖంబుండె.
అర్థ మెంత యనర్థకరమో గంటివిగదా, బలరాము నంతటివాఁడు
కృష్ణు నంతటివానిఁ దేరకు సందేహించినచో నిఁకఁ బ్రాకృత జనం
బుల నేమనవలయు. ఈ కాలంబునంద భీమునిపై ద్వేషంబున
దుర్యోధనుఁడు బలరామునొద్ద గదావిద్య నేర్చి కుశలుండయ్యె.
కృష్ణుఁడును నీ నూతనాపవాదంబునకు ఖిన్నుండై ద్వారక కరిగి శత
ధన్వుం జంపుటయు మణి లేకుండుటయు సత్యభామ కెఱింగించి
మరణించిన మామగారికి నపరక్రియలెల్ల జరగించె.

## —♦ అక్రూరుండు స్యమంతకమణిని సమర్పించుట ♦—

అంత శతధన్వుండు హతుండగుట విని యక్రూరకృతవర్మలు
సత్రాజిత్తును దాము చంపించితిమని కృష్ణుండు తమ్ము దండించునో
యని భయపడి యూరు విడిచి యెందేని పోయిరి. అక్రూరుండు
ద్వారక విడిచిపోవుటచేఁ దమ కాధివ్యాధులు దైవికభౌతిక బాధలు
కలుగుచున్నవని లోకు లొండొరులతో ముచ్చటింపఁ జొచ్చిరి కాని
ముందు కృష్ణుండు చేసిన చర్యలను నమ్మహాత్ముండున్నచోట రోగము
లెట్లు వచ్చుననియు నప్పామరులు తలంపరైరి. తొల్లి కాశీనగరం
బున వర్షంబు లేకుండుతఱి గాశిరాజు శ్వఫల్కుఁడనువానిఁ బిలిపించి
తనతనయ గాందిని నిచ్చి వివాహంబుఁ గావించె. శ్వఫల్కుండు
కాశిఁ బ్రవేశించినంతమాత్రన వర్షంబు గురిసె. ఆ గాందినీ

శ్వఫల్కులతనయుం డక్రూరుండు తండ్రి యట్టి ప్రభావంబుగలవాఁడు. ఆతఁడున్నచోట దుర్భిక్ష డామరమారీత్యాదు లెవ్వియు నుండవు. అని మునులు కృష్ణున కెఱింగింప విని కృష్ణుఁడు నగి యిది మణి తొలఁగిన దోషంబుగాని యక్రూరుండు లేని దోషంబు గాదని వారి కెఱింగించి దూతల నంపి యక్రూరు రావించి యతనిఁ బూజించి ప్రియకథలెల్ల వచించి యఖిలచిత్తజ్ఞుండైన హరి నవ్వుచు నిట్లనియె.

దానపతీ! శతధన్వుండు నీయొద్ద మణిని దాఁచనిచ్చుట మున్నే యెఱుంగుదు. సత్రాజితుండు పుత్రహీనుండౌట నతని పుత్రికలు తండ్రికిం బరలోక క్రియలు గావించి ద్రవ్యమును ఋణమును బంచుకొనుచున్నారు. స్యమంతకంబు నునికి తెలియరాకుండుటచే మాయన్న నన్ను నమ్మక నేను హరించితినని నాపై నలుక వహించి యున్నవాఁడు. నీవు దానిని నలువురికిఁ జూపి బంధువులకు మన శ్శాంతిని గలిగింపుము. నీయజ్ఞంబు లవిచ్ఛిన్నంబుగ నెఱవేఱుం గాక యని మంచిమాటలు చెప్పిన నక్రూరుండును దన వస్త్రంబున ముడిఁచిన దానిని సూర్యునివలె వెలుంగుదానిని స్యమంతకమణిని నలువురియెదుటఁ దీసి హరికిచ్చె. దానిం జూచినంతమాత్రమున నాతండ్రిస్వత్వము గావున నిది నా ద్రవ్యమని సత్యభామ దలఁచె. నేను బెద్దనగుట నాదియని కృష్ణుండు నిర్దోషియని యెఱింగించి బంధువు లొహ్వానింపవచ్చిన బలరాముండు తలఁచె. కృష్ణుండును దానిని బంధువులకెల్లఁ జూపి యపవాదంబుఁ బాపుకొని తన చేతు లార మరలఁదాని నక్రూరున కొసంగి యిట్లనియె. అయ్యా! యీ దివ్యరత్నంబు నీయొద్దన యుండుఁగాక. దీని నితరులు భరింప సమర్థులు గారు. అనాచారులయొద్దనుండి మైల సోఁకిన నిది యనర్థక హేతు కంబగుఁ గావున దీనిని భరింపనీవే యోగ్యుండవు. అనిన నప్పలు కెల్లరు సంతసించిరి.

విష్ణుప్రభావ ప్రకాశంబై పాపహరంబై సుమంగళకరంబైన యీ యాఖ్యానంబు విన్నవారును జదివినవారును స్మరించువారును దుష్కీర్తియుఁ బాపంబును బాసి మనస్సమాధి నొందుదురు.

బాంధవావృతుండై బలరాముండు మిథిలనుండి ద్వారకకుఁ జేరిన కొన్నాళ్ళకు ద్రుపదుండు తనపుత్రి ద్రౌపది నర్జునున కీయఁ దలఁచి పాండవులు లాక్షాగృహ దాహంబున మడసిరని విని వగచి స్వయంవరంబుఁ జాటింపఁ బంచిన రామకృష్ణులు ప్రద్యుమ్నచారుదేష్ణ సాంబసాత్యకికృతవర్మాక్రూరాది పరివృతుండై ద్రుపదుపురంబునకుఁ జని యతనిచే నభ్యర్చితులై రాజబృందంబు నడుమ గూర్చుండి యుత్సవంబుఁ దిలకించుచుండిరి. అప్పుడు బ్రాహ్మణసమూహములో నివురు గప్పిన నిప్పులాగెనున్న పాండవులను గృష్ణుండు బలరామునకుం జూప నతండును హర్షించె.

స్వయంవరావలోకన కుతూహలంబున మూఁగిన రాజలోకంబు నెల్లఁ జూచి ధృష్టద్యుమ్నుండదె యాకాశంబున వ్రేలాడు మత్స్య యంత్రంబు. ఇదె విల్లు. ఇవె యైదుబాణంబులు. ఈ విల్లు మోపెట్టి యీ యేనుబాణంబుల నెవ్వఁ డా మత్స్యయంత్రంబుఁ దెగవ్రేయు నవ్వీరుండె నా చెలియలు ద్రౌపదికి వరుండని తెలియఁబలికిన నటఁ జేరిన నృపాలురు కొందఱసాధ్యంబని కొందఱు వృథాశ్రమంబని యూరకుండిరి. కొందఱు యత్నించి విఫల మనోరథులైరి. ద్రౌపది పాండవార్థమని నిశ్చయించినవాఁడగుట కృష్ణుఁడు యదుకుమారుల నందఱ నా ప్రయత్నంబు మానించె. ఇట్లు రాజులందఱు విరమింప విప్రసమూహమునుండి యర్జునుండు లేచివచ్చి యత్నమంబున నయ్యంత్రంబుఁ దెగనేసె. ద్రౌపదియు నతని వరించి పూజించి పుష్పమాలాలంకృతుం గావించె. అదిచూచి చూపోపక భూపాలురు మొత్తంబుగఁగూడి యీ పాంచాలుండు మనల నవమానించె నితని వధింతమని యందఱు ద్రుపదుపై నడరిన నతఁడు బ్రాహ్మణుల మఱుఁగు చొచ్చె. అప్పు డర్జునుండు భయపడకుఁడని చెప్పి యా విల్లు గైకొని యాం క్షత్రియవీరులఁ దాఁకె. అందు గర్ణుం డర్జును మార్కొనె. శల్యుండు భీముని దుర్యోధనుండు ధర్మరాజును దుశ్శాసనుండు సహదేవునిఁ దాఁకి యందఱు పరాజితులైరి. కృష్ణుండు నందఱ సమాధానపఱిచి వారివారి దేశం

బులఁ గనిచె. తమ్ము గుర్తెఱుఁగుదు రనుతలంపున మున్నె ధర్మజ నకుల సహదేవులు విడిది కేఁగిరి. పదపడి భీమార్జునులు ద్రౌపది దోడ్కొని తాము దిగియున్న కుమ్మరియింటికిఁ బోయిరి. బలరామ కృష్ణులును రహస్యంబుగ నచటికిఁ బోయి మేనత్తను పాండవులను జూచి కుశలప్రశ్నంబు గావించి తన పురంబునకుం బోయిరి. పాండవులును వ్యాసోపదేశంబునఁ ద్రౌపదిం బెండ్లియాడి ద్రుపదుపురంబున నుండునంతఁ జారులు స్వయంవరవృత్తాంత మంతయు విచారించి పోయి దుర్యోధనునితో నిట్లనిరి. కౌరవేంద్రా! ద్రౌపదీ స్వయం వరంబున మత్స్యయంత్రంబుఁ డెగనేసి కర్ణు నొడిచినవాఁడు ఫల్గు నుండు. శల్యు బోరగిలఁ ద్రోచి మహావృక్షహస్తుండై యరాతుల భీతులఁ జేసి పారదోలినవాఁడు వృకోదరుండు. సోదర సమేతుండ వైన నిన్ను గెలిచినవారు ధర్మజ నకుల సహదేవులు. వారేవు రిప్పుడు పాంచాలనగరంబున నున్నవారనిన విని దుర్యోధనుండు శోకాక్రాం తుండై లక్కయింటఁ బురోచనుం డొక్కరుండె హతుండయ్యె నని వగచి రోషంబునఁ గర్ణ దుశ్శాసన శకునులతో నాలోచించి సేనా పారంబుతోడఁ బోయి పాంచాలరాజధాని ముట్టడించిరి. వారి రాక వేగులవలన నాకర్ణించి ధర్మనందనుండు దూతలఁ బిలిచి తమ కైన కష్టము కృష్ణున కెఱిఁగించి రండని పంచినవారును జవనాశ్వం బుల నధిరోహించి శీఘ్రయానంబునఁ జని సర్వంబుఁ గృష్ణునకు నివేదించిరి. రామకృష్ణులును సముచితచమూసమూహంబుతోడను యదుకుమారులతోడను ద్రుపదుపురంబునకు వచ్చిరి. ఈలోనఁ బాండవులు ద్రుపద ధృష్టద్యుమ్నాది సహాయులై కౌరవుల నెల్లఁ బాఱదోలిన వారెల్ల మొగములు వ్రేలవేసికొని వచ్చినత్రోవఁ బట్టి హస్తిపురంబుఁ జేరిరి. రామకృష్ణులును యాదవులతోడ ద్రుపద పూజితులై కొన్నాళ్లు పాంచాలపురియందుఁ బాండవులతోడ సుఖం బుండిరి.

ఇట్లుండ నొక్కనాఁడు హస్తినాపురంబుననుండి విదురుండు చనుదెంచి ద్రుపదపాండవుల కుశలంబు విచారించి బాంధవమును

గొండాడి మీ యనుజ్ఞమెయిఁ బాండవులఁ దోడితెమ్మని ధృతరాష్ట్రుండు పంచెనని వచించినఁ గృష్ణద్రుపదు లాలోచించి వల్లెయని యంగీకరించి పాండవులు హస్తినానగరికిఁ బోవ సమ్మతించిరి. అంతఁ బాండవేయులు పాంచాలితోడ, గృష్ణ ధృష్టద్యుమ్న సహాయులై హస్తినాపురంబునకుం బోయిరి. ధృతరాష్ట్రుండు కృష్ణుని సమక్షంబున ధర్మరాజునకు సగపాలు రాజ్యముఁ బంచియిచ్చి మీరు ఖాండవప్రస్థపురంబున నుండుడని కోరె. వారును గృష్ణసహితులై ఖాండవప్రస్థంబుఁ జేరిరి.

ఇట్లు ఖాండవప్రస్థంబున నుండుతఱిఁ గృష్ణార్జును లొక్కనాఁడు యమునాతీరమున వినోదక్రీడలఁ జరించుచుండ నగ్నిహోత్రుండు బ్రాహ్మణ వేషధారియై వారిని జూసి పుణ్యాత్ములారా! నా కన్నంబు పెట్టింపుఁ డని కోరెను. వారును దాని కియ్యకొనిరి. అప్పు డాభూమిసురుఁడు తా నగ్ని ననియుఁ దన కాహారముగ నింద్రుని ఖాండవవనం బిప్పింపుఁ డనియుఁ గోరె. మేము నిరాయుధుల మెట్టులీ కార్య మొనర్ప సమర్థుల మని యర్జునుం డన నగ్ని యాయనకు గాండివంబను చాపంబును, నక్షయబాణ తూణీరంబులును శ్వేతాశ్వంబులఁ బూన్చిన దివ్యరథంబును నిచ్చె. అప్పుడు కృష్ణుం డర్జునునకు సారథియై యాయనచే ఖాండవంబు దహింపఁజేసి యెదిరిన యింద్రాదుల జయింపఁజేసె. ఆ మహాదాహంబువలన ముక్తుఁడైన మయుఁడు సంతుష్టుఁడై ధర్మరాజున కొక సభ నిర్మించి యిచ్చె దీనియందే రాజసూయయాగ సమయంబున స్థలజల నిర్ణయజ్ఞానహీనుఁడై దుర్యోధనుండు పరిహాసపాత్రుండయ్యె.

## —♦ కాళిందీ పరిణయము. ♦—

ఖాండవ దహనానంతరంబున నొక్కనాఁడు కృష్ణార్జునులు శరచాపాసిధారులై రథంబులెక్కి యమునాతీరంబున వేఁటాడు తమకంబున నేగి సింహశార్దూలశరభరురుఖడ్గాది మృగంబుల వధించి నీరువట్టు పెల్లున జలంబుఁగ్రోల యమునానదికడ కేగిరి. ఇట్లు

వారేత్తు దాహమాఱ నీరంబుఁ గ్రోలి యందు వారితీరంబునఁ బచారంబు సేయు నొక కన్యాలలామంబుఁ గాంచిరి. కాంచి వాసుదేవ ప్రేషితుండై యర్జునుండు నిందువదనయు సుదతియు నగు నా ప్రమదోత్తమను డాయ నరిగి తలోదరీ! నీ వెవ్వతెవు? ఎవ్వరిదానవు? ఇందుఁ జరింపఁ గారణమేమి? నీవిధంబుఁ జూడ బతిని గోరి తిరుగుచున్నట్టు దోచుచున్నది యని ప్రశ్నింప నయ్యింతి యా కౌంతేయున కిట్లనియె.

అయ్యా నేను శతపత్రమిత్రు పుత్రికను. నాపేరు కాళింది. దీనశరణ్యుండును, దేవవరేణ్యుండును నగు విష్ణుఁ బతిఁగాఁగోరి తపంబు సలుపుచున్నదానను. జనకాజ్ఞ శిరసావహించి తన్నిర్మిత నికేతనంబున నీ జలంబుల శ్రీనికేతనురాక వేచియున్నదాన. అనాథనాథుండగు జగన్నాథుండుదక్క మఱియొక్కని వరించుదానఁగాను. అని వచించిన నాయించుఁబోఁడి వచనంబులు విజయుండు వనమాలి కెఱింగించె. సర్వజ్ఞుండైన భగవంతుఁ డీ వృత్తాంతంబు మున్నె యెఱింగిన వాఁడగుటం జేసి యాసుందరాంగిని తన శతాంగంబున నిడికొని ధర్మరాజుఁ జేర జనియె.

ఇంతకు మున్న యుధిష్ఠిరుండు తమకు వాసయోగ్యంబయిన నగరంబు నిర్మింప యోజింపుమని కృష్ణునిఁగోరిన నాయన యింద్రుం దలఁచి సన్నిహితుండైన యతనితో నిట్లనియె. సురేశ్వరా! యిందుఁ బాండవులకు నీ నగరంబుఁబోని యొక రమ్యనగరంబు నిర్మించి యిమ్ము. అది నీపేరన యింద్రప్రస్థంబని ప్రసిద్ధివహియించుఁగాక యనిన నింద్రుఁడు విశ్వకర్మఁ బిలిచి పురనిర్మాణంబున నియమించె. విశ్వకర్మయుఁ గృష్ణునియోగంబు చొప్పున నతిరమణీయంబుగ నింద్రప్రస్థంబు నిర్మించియిచ్చినఁ బాండవు లందు సుఖావాసంబు గావించిరి. తదనంతరంబ కృష్ణుండును మీకడకు నారదుండు వచ్చు. ఆయన యుపదేశించిన విధంబున వర్తింపుఁడని పాండవులకు బోధించి ద్వారక కరిగె. అందు సూర్యపుత్రిఁ గాళిందిని యథావిధి వివాహంబయ్యె.

ఆవల నారదుం డరుదెంచి ద్రౌపది యొక్కొక్కరియొద్ద నొక్కొక్క సంవత్సర ముండునట్లును వారు సహాసీనులై యుండఁ జూచినవారు పండ్రెండు నెలలు తీర్థయాత్ర గావించునట్లును సమయంబు చేయించి చనియె. అట్లుండ నొకనాఁడు బ్రాహ్మణుని గోవులను జోరులు ముచ్చిలింప వారిని దండింప నాయుధంబులు వలసి యర్జునుండు శస్త్రశాలకుఁ బోయి యందున్న ద్రౌపదీ యుధిష్ఠిరులం జూచి యానిమిత్తమునఁ దీర్థయాత్రకై వెడలె.

సమయప్రకారము తీర్థయాత్ర గావించి కడపట ద్వారకకు వచ్చి కృష్ణుని సాహాయ్యంబున సుభద్రను హరించి యర్జునుం డింద్రప్రస్థంబుఁ జేరె. కుపితులైన యాదవులనెల్ల సమాధానపఱచి కృష్ణుండు బలరామాది సహితుఁడై యింద్రప్రస్థపురమునకు వచ్చి పాండవులఁ దగురీతి సత్కరించి కొన్నిదినములకు యాదవుల నెల్ల మరల ద్వారకకంపి తా నర్జును నెయ్యమునఁ జేసి యందు కొన్ని నెలలుండె.

## —♦ మిత్రవిందా వివాహము. ♦—

కృష్ణునకు మేనత్తయు నవంతిపురీకాంతుని కాంతయునైన రాజాధిదేవి పుత్రి మిత్రవింద విందానువిందుల యనుజాత జాతరూపవాసు వాసుదేవు దేవాదిప్రవరు వరుఁగాఁ గోరియుండ దాని యభిలాషం బెఱింగి దుర్యోధనవశులైన విందానువిందు లా సుందరి చింత కంతరాయంబుఁ గూర్ప నామెకు స్వయంవరంబుఁ జాటించిరి. శ్రీకృష్ణుం డావృత్తాంతం బెఱింగి యక్కడకుఁ జక్కనరిగి యరి గట్టిన యరుల గట్టిమొనలఁ దునిమి జయలక్ష్మిని గన్యారత్నంబును నేకకాలంబునఁగొని ద్వారవతికి వచ్చి శాస్త్రచోదిత ప్రకారంబునఁ బరిణయం బయ్యె.

## —♦ సత్యావివాహము. ♦—

ఆ సమయంబునఁ గోసలదేశంబును నగ్నజిత్తనురాజు పాలించుచుండెను. ఆ నృపాలునకు సత్యయను బాలిక కలదు. నగ్నజిత్తు

పుత్రియగుట నామె నాగ్నజితి యనియుఁ బ్రఖ్యాతి వహించెను. ఆ రాజుమందయం దేడు వృషభంబులు మత్తిల్లి మెత్తిన క్రొవ్వు పెంపునఁ దెంపరులై పెట్టివీరుల సరకుసేయక వీరగంధంబు సహింపక విచ్చలవిడి చరించుచుండె. వానిని జెనకి మనికితో మనికికిఁ జనిన మానవుఁడు లేఁడు. కావున నా తేఁజామేడు గిత్తలమిత్తిం గూర్చిన వీరునకు నా కూఁతుఁ బ్రీతినొసఁగెదనని తన యాకూతంబు ఘోషింపఁబంచె. ఆ వృత్తాంతంబు విని నితాంత బలవంతులైన యనేక ధరాకాంతులు కాంతవ బాణహతితాంతులై పౌరుషంబు లూఁతఁగఁ గన్యాగ్రహులై చని యాకోడెల కోడి పాఱిరి. అంత శ్రీకాంతుండు సేనాసమేతుండై యా వీటికిం జనియె. ఇట్లరుదెంచిన యించు విలుకానిజనకుం గని యా రాజు వివిధగతులఁ బూజించెను. సౌజన్యధన్యయగు నా కన్యయుఁ బాంచజన్యధరుండు తన జనకుం గన రాక విని యా లోకైకమాన్యునంద వినివేశిచిత్త గావున నిట్లు తలపోయుచుండె. అవురా నా భాగ్యంబు. నా సౌభాగ్యంబు నేఁడు ఫలింపఁగలదు. నేను బతిగాఁగోరిన రమాపతియే మా వసతికి వచ్చియున్నవాఁడు. ఈ జగన్నాథుండ నాకుఁ బ్రాణనాథుం డగుం గాక. నేన నన్యచిత్తనేని వేల్పులకు నా మ్రొక్కిన మ్రొక్కులు నా నోఁచిన నోములు, పెద్దల మంగళాశాసనంబులు సఫలంబు లగుఁ గాక.

అంత నా కుమాకాంతుం డుచిత సత్కారంబులు గావించి యుత్తమాసనాసీనుఁడైన శ్రీనివాసుం గాంచి యిట్లనియె. జగత్పతీ! నారాయణమూర్తీ! అవాప్తసకలకామా! ఆత్మానందా! భవదీయ చరణారవిందంబులందలి పరాగ చయంబు నిందిరయు నిందుధరుం డును బృందారక జ్యేష్ఠుండును సమస్తబృందారక బృందంబును శిరం బులఁ దాల్చుచుందురు. స్వకృత ధర్మసేతువు రక్షింపఁగోరి యా యాకాలంబుల విలాసార్థంబు లీలాశరీరంబు ధరించుచుందువు. ఇట్టి నీకు నల్పుఁడనైన నావలనఁగాగల ప్రయోజనంబెద్ది? ఎట్టి కైంకర్యం

బున నీ వానందింతువు? అనతిమ్మనిన మందహాస భాసురవదనార విందుండై సుందరధరుం డిట్లనియె.

రాజేంద్రా! స్వధర్మంబున వర్తించు రాజులకు యాచన నిషిద్ధ మని పెద్దలు వక్కాణింతురు. అయినను నీ స్నేహంబుఁ గోరి నేను నీ కన్యను దాన మొసంగ యాచించుచున్నవాఁడను. కన్యాశుల్క మొసఁగువారము మేము కాముసుమా యనిన నగ్నజిత్తు మధు జిత్తున కిట్లనియె.

ఎవ్వని యురంబు గుణాభోలుభ యగు శ్రీ నివాసంబుగఁ గాని సర్వదా యుండు నట్టివాఁడు దేవుఁడ వగు నీకన్న మిన్నయగు వరుండు నా కన్నె కెందు లభించు? అయినను గన్యావరపరీక్షకై యింతకు మున్న యొక చిన్నప్రతిన వచించినాఁడ. విన్నవింతు వినుము, మా వీట నేడు గిత్తలు మత్తున నెట్టివారికి వారింపరాక యున్నవి. కావున నా వృషభసప్తకంబుఁ బోరిగొనిన వీరునకు నా కన్నియ నొసఁగెదనని చులక ప్రతిజ్ఞ గావించితి. అనేకులు రాకుమారులు వచ్చి మచ్చరంబునఁ బోరి పురివిచ్చి భగ్నదర్పులై భిన్నగాత్రులై పోయిరి. నా కన్య వీర్యశుల్కయగుఁగాని ధన శుల్కగాదు. ధన మునకై కన్నియల విక్రయించు నీచులము మేముగాము. కావున నా సంకల్పంబు వ్యర్థంబు గాకుండ రక్షించు భారంబు నీయది. నా మాట పొల్లువోకుండ నా దుర్దమంబులగు బలీవర్దంబుల మర్దించి జనార్దనా! మమ్ము హర్షసమ్మర్దంబునఁ దేల్చి మా కన్యఁ బరిగ్ర హింపుము.

అని యా రాజేంద్రుండు తన సమయము వినిపించిన యాదవేంద్రుండును వల్లెయని యంగీకరించి లేచి కట్టినదోవతి రాఁగఁజెక్కి యుత్తరీయంబు నడుమునకుఁ జుట్టి యేడురూపముల ధరించి యా వృషభంబుల సమీపించి యవలీల వాని పగ్గంబులఁ బట్టుకొని బిట్టుగసి తన్నిన తాఁకున నవి దంతములతోడఁ బ్రాణములు పోవ నేలఁ గూలిన బాలుఁడు మట్టిబొమ్మల నీడ్చు విధంబున కృష్ణుండు వాని నీడ్చె.

నగ్నజితుండును శౌరి పరాక్రమంబునకు నాశ్చర్యపడి విధి పూర్వకముగఁ దనకూఁతుఁ గృష్ణుని కిచ్చి వివాహంబు గావించె. రాజపత్నియుఁ దన పుత్రికకుఁ గృష్ణుండు వల్లభుండయ్యెనని పరమానందభరితయయ్యె. ఈ వివాహంబు మహాడంబరంబునఁ బ్రవర్తింపఁ జేసి కూఁతునకు నల్లునకు ననేక రథకరితురగభట నారీవారంబులఁ గానుకలిచ్చి దంపతుల రథారూఢులం జేసి మహాసేనతో స్నేహార్ద్రీభూతచేతస్కుండై కోసలరాజు సాగనంపె.

తాము వలచిన పొలంతిని గృష్ణుండు తెచ్చుకొనుచున్నాఁడని విని మును యాదవులచేతను వృషభంబులచేతను భగ్నదర్పులయ్యుఁ గృష్ణుశ్రేయస్సు సహింపనేరని రాజులు త్రోవనరికట్టి కృష్ణుసైన్యంబుఁ దాఁకిరి. అప్పుడు బంధుప్రియకరుండైన నరుండు గాండీవధరుండై క్షుద్రమృగంబులను మృగరాజుంబోలె వారినెల్లఁ బటాపంచలుగఁ బాఱఁదోలె. కృష్ణుండును మామగారొసఁగిన యరణంబుతోడ సత్యాదేవితో ద్వారకకు నరుదెంచి యిచ్ఛావిహారంబుల నామెతోడ రమించుచుండె. తనకు మేనత్తయుఁ గేకయరాజపత్నియునైన శ్రుతకీర్తిసుతను భద్రయను కన్యాలలామంబును నామె సోదరులు సంతర్దనాదులొసంగఁ గృష్ణుండు మహావైభవంబునఁ బరిణయమయ్యె.

## —♦ లక్ష్మణావివాహము. ♦—

మద్రదేశాధీశుండైన బృహత్సేనునకు సర్వశుభలక్షణయగు లక్ష్మణయను కుమారి గలదు. ఆయమ జనకునింటికి నారదుండు వచ్చిన సమయంబున మునీంద్రా! సద్గుణమాన్యయగు నా కన్యకు వరుండు గాఁదగు భూవరుం డెండుఁగలఁడు తెలుపుఁ డని యతండు కోరినఁ ద్రిలోకవిదుండైన నారదుం డిట్లనియె.

రాజేంద్రా! సర్వలక్షణసంపన్నయగు నీ కన్నెకుఁదగిన పతి శ్రీయఃపతిగాని తక్కిన యేమానవపతియుఁ గాఁడు. ఇది నిక్కంబు. అసిప్రభవిష్ణుండైన కృష్ణుని పవిత్రచరిత్రంబు కర్ణరసాయనంబుగా

వినిచినఁ గలకండపలుకులఁబోని యప్పలుకులు వినుచుండిన యా బాల గోపాలవరుండే తనకు వరుండుగా మది నిశ్చయించి నియతయై భక్తియుతయై వ్రతంబు లాచరించుచుండె.

మహిత్మవత్సలుండైన యాభూపాలుండు తనతనయ యభిమతంబెఱింగి దాని నెఱవేర్ప సమకట్టి రెట్టి రాపట్టికిని భేదింపరాని మత్స్యయంత్రంబుఁ గల్పించి పుత్రీ స్వయంవరంబుఁ జాటింపఁ బంచె. ద్రుపదుని మత్స్యయంత్రంబు వెలికిమాత్ర మగోచరంబై యుండె. ఇది లోపలను వెలుపలను గానరాక స్తంభమూలమున నుంచిన జలపాత్రమందలి ప్రతిబింబముచేమాత్ర మెఱుంగఁ దగి యుండె.

ఈ స్వయంవరంబునకై సమస్తదేశరాజు లరుదెంచి యా వింటిని గాంచి కొందఱెక్కువెట్టి వంచి కొందఱు నారబిగించి కొందఱు వ్యర్థప్రయత్నులై తలలు వంచుకొని పోయిరి. జరాసంధుఁడు— విందానువిందులు శిశుపాలుఁడు భీమదుర్యోధనకర్ణులు విల్లెక్కు పెట్టియు బాణంబు సంధించియు గుఱి కనలేక మగిడిరి. అర్జునుండు మాత్రము జలప్రతిబింబమున గుఱియెఱింగి బాణమునై చేఁగాని యది మత్స్యంబు దెగవ్రేయుపటిమ చాలక దానిని దాఁకి మిట్టి యావలఁబడిరా. అంత వసుదేవనందనుండు దరహాససుందరవదనేందుబింబుండై సభామధ్యంబునుండి యరుగుదెంచి యవలీల నమ్మీన యంత్రంబు ధర నురలనేసె. ఇట్లభిజిన్మహూర్తంబున యంత్రంబుఁ దెగనేయ దేవమందుభిధ్వానంబులు నెరసె. చూపఱు జయ జయ ధ్వానంబులు బెరసె. అంత సర్వాలంకారవిరాజితయై బాలసోమాలిక యగు నా భూపాలబాలిక సువర్ణమణిగణమాలికఁ గేలఁగొని డెందంబున నానందంబు కదలింప నందనందను కంధరమ్ము నలంకరించె. నర్తకుల యాటలు గాయకుల పాటలు విప్రుల దీవన మాటలు విస్తరిల్లె.

శ్రీవత్సలక్షణుండు లక్షణం దన తేరిపై నెక్కించుకొని త్రోవ నాఁకట్టిన యసూయాపరులు నరులను సింహంబు గ్రామసింహంబులం బోలెఁ దోలి విజయుఁడై ద్వారకానగరంబున కరుదెంచె.

బృహత్సేనుండును నిజాభీష్టంబు సమకూరుటగాంచి హర్షించి కూఁతునకు నల్లునకు యోగ్యవిధంబుగ నరణంబొసంగి వివాహంబు గావించె.

అవలఁ గృష్ణుండు నరకాసురునిచేఁ గారాగృహంబున బద్ధలైన ముగ్ధలఁ బదునాఱువేవుర నా రాక్షసుం ద్రుంచి కొనితెచ్చి పరిణయంబయ్యె. ఆ విధంబు వినుతు వినుము.

## —♦ నరకాసుర వధ. ♦—

కర్కశుండు నఱకుండైన నరకుం డా సుందరీబృందంబుల బందిమందిరంబునందుఁ ద్రోయు వాని దుష్కామాతిశయంబ కారణంబుగాని వేఱొండు కారణంబులేదు. ఆ వారిజాక్షుల నెల్లవారిని దన దారలుగఁ జేసికొన నతఁడెంచెఁగాని యా యించుఁ బోణులో వశపడమిని వారినెల్లఁ గ్రూరుండై కారాగారంబునఁ ద్రోచి బాధించె.

ఒకనాఁడు కృష్ణుండు రుక్మిణీదేవి ధామంబున నామెతో విలాసగోష్ఠి వర్తించునెడ నచ్చటికి నారదుం డరుదెంచి కృష్ణునకొక పారిజాత కుసుమంబు సమర్పించె. ఆ దివ్యప్రసూనంబును శ్రీకృష్ణుండు రుక్మిణీదేవి కొసఁగె. ఆమె దానిని గైకొని నారదకృష్ణులకు నమస్కరించి కొప్పున ముడిచె. దానివలన నామె యభినవవిలాస సౌందర్యసంపత్తి కొక యపూర్వకాంతిసంపద యొదవె. దానింగని కలహాశనుండు కలహము కలిగింపఁ గారణ మొదవెనని సంతోషించి రుక్మిణీదేవితో నిట్లనియె.

మహానుభావురాలా! నీ సౌభాగ్యాతిశయంబు నేనెంత కొనియాడఁగలవాఁడ. ఇది బృందారక లోకంబునఁ బురందరునందనో

ద్యానంబున నుండు పారిజాతభూజాతము నలంకరించు దివ్యకుసుమము. పవిత్రచరిత్రా! యిది పులోమజాదులకుఁ దప్ప సామాన్య దేవతాస్త్రీలకును దుర్లభంబన నిఁక భూలోకశోలవిలోకనలమాట చెప్పనేల? ఈ మందారకుసుమంబులను శ్రీదేవి గౌరిదేవి సరస్వతీదేవి శచీదేవి శిరమున ధరింతురు. ఇప్పుడు నీవు వారితో సమానురాల వయితివి. అంతియకాక నీవు నీ భర్తకు వెలుపలిప్రాణమ వనియుఁ దెలియవచ్చె. వాసుదేవునకుఁ బెక్కురుదేవు లున్నవారుగాని భాగ్య సౌభాగ్యంబులను బతిప్రీతి పడయుటంనును నీకు నీడుగారు. ఈ సునుము మహిమము నీవేమని తలంచితివో. ఇది యెన్నాళ్లైనను వాడదు. వాసన వీడదు. సర్వదాపరిమళించుచు నానందదాయకమగు చుండును. ఇది నీవేమికోరిన నప్పుడ యవియన్నియు సమకూర్చుచుండును. మీరు భార్యాభర్తలు పడుకటింటనుండు వేళ సురటియై మీకు విసరుచు శ్రమముఁ బాపుచుండును. దీనిని ధరించుటచే నీవు సవతులలోనెల్ల మేటివై యో నీమాటీ! వారిచే నూడిగంబు చేయించుకొను మహిమగలదాన వగుదువు. ఇది చలివేళ నుష్ణగుణమును వేసవిని జల్లఁదనమును గలిగించును. ఇన్నిదినములు వెన్నుఁడు సత్యభామ కన్నుసన్నల మెలఁగుననియు నందఱియందలి ప్రీతికంటె నాయన కా వగలాఁడియందు మోహ మెక్కుఁడనియు విని నిజమనుకొనుచుంటిని. ఇప్పు డది కల్లయనియు నిజమైన ప్రీతి నీయందే యున్నదనియు నీవే నీ పతికి నిజమైన వల్లభవనియుఁ దెలిసికొంటిని. తానే సుందరియని తానే జవ్వని యని తానే పేరు పెంపుగలదాన నని తానే పతికి దయితయని తానే ప్రాణేశ్వరు వశపఱిచికొంటి నని సత్యభామ మెడమీఁద దల నిలువక నిక్కినిక్కి మిడిసిపడుచుండెను. ఈ వార్త వినినయంతనే యామె మిడిసిపాటు నేలపాలగును. ఈ పుష్ప మొక సంవత్సరము నీయొద్ద నుండును. ఆవలఁ బారిజాత వృక్షమునకుఁ బోవును. అని చెప్పి యా ముళ్ళముని కృష్ణునిచే సెలవుగొనిపోయెను. సత్యభామాదూతిక లీవార్త నప్పుడే సత్యభామ కెరిగించిరి.

మానవవతియగు సాత్రాజితి తన్నుఁ బ్రాణనాథుఁ డవమానించెనని యెంచి కోపించి మండిపడి యలంకారములెల్లఁ ద్యజించి మాసిన చీర ధరించి కోపగృహముఁ బ్రవేశించె. దూతిక లీ వార్త చెప్పిన సహజకోపన సత్యభామ యేమని కోపించునోయని కృష్ణుండును వెంటనే యామె యింటికివచ్చి యెప్పుడుండు విలాసమందిరాంగణమునఁ గానక కోపగృహమున నుండుట చెలిచే నెఱింగి యచ్చటికిఁ బోయి యామెను బలువిధముల సమాధానపఱుచుచు నీవొక పుష్పపత్రమునకా యింత కోపించెదవు ? నీవు కావలయుననిఁ గోరినఁ బారిజాత వృక్షమునే తెచ్చి నీ పెరటిచెట్టు చేసెదను. ఊఱడుమని చెప్పి శాంతచిత్తఁ గావించె. అంత నొక్కనాఁడు కృష్ణుండు సత్యభామా నిశాంతంబుననుండ శచీకాంతుం డరుదెంచి యిట్లనియె. దేవా! నీవు శిష్టుల రక్షింపను దుష్టుల శిక్షింపను నవతరించిన భగవంతుండవు. సర్వలోకరక్షణభారంబు నీయందున్నదన్నమాటఁ జెప్పనేల? నరకుఁడను నసురుం డజయ్యుండై ప్రబలి వరుణచ్ఛత్రం బపహరించె. మాతల్లి యదితిదేవి ధరించు దివ్య కుండలంబుల లాగికొనిరి. మేరుపర్వతంబులోని మణిపర్వతంబును నాక్రమించె. ఆ కించునలని బాధల నొకించుకయైన సహింపఁ జాలని యకించనులమగు మాపై నీ కటాక్షాంచలంబు పఱపి రక్షింపుము. అని వేఁడిన యాదవవల్లభుఁడు నిలింపవల్లభు నూరడించి నరకు వధించి నీకుందు డిందుపఱుతుఁ బొమ్మని వీడుకొలిపి గరుడుం దలంచిన నప్పక్షిరాజు క్షణంబున సన్నిహితుండయ్యె.

ఇట్లు నరకవధ దోహలుండైన గదాగ్రజుం జూచి పతిప్రేమ సీమయగు సత్యభామ ప్రణయసల్లాపంబుల నిట్లనియె. వల్లభా! రణరంగమున నీ బలపరాక్రమంబులు లోకు లత్యద్భుతముగ వర్ణింపఁ గర్ణపర్వంబుగ వినుటయకాని కనియెడి యదృష్టంబు నా కింతవఱకు లభింపదయ్యె. ఇప్పుడు నీవు స్త్రీజనబాధాకారకుండగు నరకుని వధింప నేను గన్నులారఁ జూడఁగోరెద. ఆ బాలల నెల్లఁ జెఱసాల నుండి నేన విడిపింపఁ గోరెద. నా కీ చనవొసంగుమని వేఁడుటయు రమాకాంతుండు నిజకాంతతో నిట్లనియె.

చంచలాక్షీ! యబలలు కోరరాని కోరిక నీవు కోరితివి. సమర మన నీ మనమున నేమని తలంచితివి.

సీ. సమదపుష్పంధయ ఝుంకారములు గావు
భీషణ కుంభీంద్ర బృంహితములు
వాయు నిర్గతపద్మ వన రేణువులు గావు
తురగరింఖాముఖోద్ధూతరజము
లాకీర్ణ జలతరంగా సారములు గావు
శత్రుధనుర్ముక్త సాయకములు
కలహంససారస కాసారములు గావు
దనుజేంద్రసైన్యకదంబకములు

గీ. కమలకహ్లారకుసుమసంఘములు గావు
చటులరిపుశూల ఖడ్గాది సాధనములు
కన్య నీవేడ రణరంగ గమనమేడ
వత్తు వేగమ నిలువుము వలదువలదు.		భాగ.

అనిన నత్తలోదరి వేడుకోలులీల కన్నులం దెలుపుచుం గమ లాక్షుతో నిట్లనియె.

ప్రాణేశ్వరా! నీ భుజములను కోటమాటున నే నుండం గోటి రాక్షసులైన ముక్కోటిదేవతలైన నేమి భయము? నీ పరాక్రమ మెఱుంగని ముగ్ధనని తలంచితివి కాంబోలు. నీ మాటలతీరు భీరువు లకుం జెల్లుంగాని నీయట్టి ధీరునకుం జెల్లదు. కావున నా కోరిక రిత్తపఱుపక యీ చనవు చెల్లింపుము. సత్యభామ కోరిక కృష్ణుండు నిరాకరించె నని నన్ను సవతులు నవ్వకుండం జేయుము. ఇదే నీకు నమస్కారంబని కరకంజంబులు మోడ్చినం గంజాక్షుండు నక్కాం జాక్షిం జేరందీసి "నీయనుమతిగాని కాని నీకుమారు నరకు వధింప" నని తొల్లి భూదేవికిం దా నొసంగిన వరంబును సత్యభామ భూమి యంశంబునం బుట్టుటయు స్మరించి రారమ్మని తనతోడ గరుడ వాహనంబున నాసీనంజేసి చక్కంగం బ్రాగ్జ్యోతిషంబున కరిగె.

ఆ పురంబు కొండకోటలచేతను, నగడ్తలులోనగు జలదుర్గంబులచేతను, యంత్రపూరితంబులైన శస్త్రదుర్గంబులచేతను, నగ్నిదుర్గంబులచేతను, వాయుదుర్గంబులచేతను, దుర్గమంబై యుండె. అంతియ కాక నరకాసురుని సేనానియగు మురుఁడనువాఁడు శస్త్రములచే భేదింపరాని యురులవంటి పాశములచేఁ బట్టనమంతయు నావరింపఁ జేసి యుండెను.

అట్టినగరం బాకాశమార్గంబునఁజేరి గిరిదుర్గంబులను గదచేతను, శస్త్రదుర్గంబులను సాయకముల చేతను, నగ్నిజలవాయుదుర్గంబులను జక్రధారను, మురపాశంబులను నందకంబు చేతను భేదించి ఛేదించి శంఖనాదంబున యంత్రములను నరక మురాసురాదుల హృదయంబు ప్రక్కలించి గదాధరుండు ప్రాకారంబునకు గదాఘాతంబుల నథఃపాతంబొనగూర్చె. ప్రళయకాలమందు విడివడి యెడదెగక పడుపిడుగుల నులివు వడువున వీతెంచు పాంచజన్యనాదంబు చెవులఁబడిన జలంబులనుండి పంచశిరుండైన మురుండు లేచి యుగాంతసూర్యానల కాంతిస్ఫీతంబై యెట్టివారికిఁ దేఱిచూడరాని భయంకర త్రిశూలంబును గేలఁదాల్చి పంచముఖంబులఁ మూఁడులోకంబుల నొక్కపెట్టమ్రింగువానివలె మహాసర్పమో యన గరుడునిపై కుఱికె.

ఇట్లురవడించి యా యసురుండు గరుట్మంతుని త్రిశూలంబున వైచి యైదుముఖంబుల నట్టహాసంబు గావించిన నా ధ్వని దిగంతరాళంబులు నిండి బ్రహ్మాండకటాహంబు నొరసె.

వైనతేయునిపైఁ బఱతెంచు నా త్రిశూలంబును నంబుజోదరుండు శరపరంపరఁ దుమురు గావించి విచ్చిన యతని ముఖంబులు నిండ బాణంబులఁ జొనిపిన నతఁడు కృష్ణునిఁ దనగద నడిచె.

గదాగ్రజుం డాగదను దనగదచే రెండు ఖండములుగావించె. ఇట్లు తన నమ్మిన యాయుధంబులు రెండును వమ్మైన నమ్మురుండు బాహువుల మీఁదికెత్తి కృష్ణుని మ్రింగ మీదికుఱికినఁజక్రియుఁ దన చక్రంబున నతని శిరంబుల నన్నిటిని నవలీల నఱికివైచె. ఇట్లు

ఖండిత శిరుండైన మురుండు వజ్రపాతంబునఁ గూలు మహాగిరి శృంగ మో యన జలంబులఁ గూలెె. వానిపాటుచూచి రోషకషాయితాక్షులై యతని పుత్రులు తామ్రుఁడు, నంతరిక్షుఁడు, శ్రవణుఁడు, విభావసుఁడు, వసుప్ర, నభస్వంతుఁడు, సరణుఁడు నను వారేడ్వురు పితృ ప్రాణంబు దీర్పఁగోరి నరకప్రేరితులై పీఠుండను సేనాపతిని మున్నిడుకొని యుద్యతాయుధులై చక్రాయుధుపైఁ గవసిరి.

ఇట్లు కృష్ణుపైఁ గవసి శరములు పరశువుల గదలు బాణములు శక్త్యృష్టి తోమరశూల జాలంబు లొక్కుమ్మడి ముమ్మరమ్ముగఁ జిత్తజల్లుపోలెఁ గురియించినఁ గృష్ణుం డమోఘంబులైన నారాచంబులవానినెల్లఁ దిలప్రమాణంబులుగ ఖండించి పీఠుఁడు మొదలగు ముఖ్యుల తలలు తొడలు చేతులు కాళ్లు నఱకివైచె.

ఇట్లు తన సేనలును సేనానులును హతులైనఁ జూచి ధరాకుమారుండైన నరకుండు ద్వీపాంతరంబుల జన్మించిన నేనుఁగుల పిండుదండుతోడ వెడలి సూర్యోపరిస్థంబైన మెఱపుతీఁగతోడి మేఘమువలె భార్యాసమేతుడై తార్క్ష్య వాహనంబున విరాజిల్లు పచ్చవలువదాలుపుం దాఁకి శతఘ్నిం బ్రయోగించె. తక్కిన భటులంద ఱొక్కుమొగి నేకకాలంబున వాసుదేవునిపై వివిధశస్త్రంబులు గురియించిరి. విచిత్రపత్రంబులయిన శాతశరంబుల నికరంబుల కంబుకంధరుండా శతఘ్ని తుత్తుమురుసేసి భటుల నెల్ల నికృత్తబాహూరుకంఠులఁ గావించి కరితురగ కదంబకంబులఁ దఱిగివైచె. రాజేంద్రా ? చిత్రమేమి చెప్పుదు. భటప్రయుక్తంబులయిన శస్త్రంబులు తనమీఁదికి రాకమున్న వారినెల్ల వధించి పడపడి వానినెల్ల నుఱుమాడె. తార్క్ష్యపక్షజాత వాతంబున దంతావళంబులెల్లఁ జెల్లాఁచెదరై తచ్చరణ చంచువుల విదారితంబులై యాసేనలెల్లఁబోట్లై రూపుమాసిపోయె. హతశేషంబులు పురంబుఁ జొరఁబాఱె. నరకుం డొక్కరుం డసహాయుండై కృష్ణు మార్కొనియె.

ఇట్లు మార్కొని కరినికరంబుల ఱెక్కల గాలిఁ దూలించు గరుడునిపై నింద్రుడు వజ్రంబును బ్రతిహతంబుఁ గావించిన శక్తిఁ బ్రయో

గించె. పూలదండ తాఁకున గంపింపని మదపుటేనుఁగుం బోలె గరుత్మంతుఁడును దాని తాఁకున నించుకయుఁ జలింపఁడయ్యె. ఇంతలో సత్యభామయు సంగరకౌతుకంబు ముడి వడుచుండ వ్రేలాడు జడఁదొత్తి చుట్టగఁ జుట్టి, చీరముడి గట్టిగబిగించి, జాఱుపయ్యెద బిట్టుగఁ జెక్కి, తన హృదయేశ్వరు చెంగట లేచినిలిచిన నామె యభిలాష దెలిసి కృష్ణుండు బాలా! నీవేల యీలీల నాలంబునకై లేచితివి. ఈ లీలలు మా కవలీలలుగాని లీలావతులకుఁ గావు. అయినను నీ కోరిక దీర్తుపఱుపనొల్ల. ఇదె విల్లందుకొని మొల్లంబున దన్నావేశింప విల్లుమీటి కంకణ ఝణఝణత్కారంబు తోరంబుగ నారసంబులు దీయుట తొడగుట వ్రేయుట యెఱుక పడకుండఁ బగతునిపైఁ గాండంబులు దండోప దండంబులుగఁ గుప్పించె. రాగోదయంబుతో శృంగారవిలాసభాసురయై యొక కంట హరిని, రోషోదయంబుతోడ వీరరసవిభాసమానయై వేఱొక కంట నరిని జూచుచు నా కువలయాక్షి శృంగార వీరరసములు వెల్లి గొలుపుచు రణ మొనర్చె.

మ. అలినీలాలక చూడనొప్పెసఁగెఁ బ్రత్యాలీఢ పాదంబుతో
నలికస్వేదవికీర్ణ కాలకలతో నాకర్ణి కానీతస
ల్లలితజ్యానఖపుంఖ దీధితులతో లక్ష్యావలోకంబుతో
వలయాకార ధనుర్విముక్త విశిఖవ్రాతాహతారాతియై.

సీ. బొమ్మపెండ్లిండ్లకుఁ బోనొల్ల నసుబాల
రణరంగమునకేల్లు గాఁ దలంచె
మగవారిఁ గనినఁ దా మఱుఁగుఁ జేరెడునింతి
పగవారి గెల్వ నే పగిదిఁజూచెఁ
బసిఁడి యుయ్యాలలెక్క భయమందు భీరువు
ఖగపతిస్కంధ మేకడేఁదినెక్కె
సఖుల కోలాహల స్వనము లోర్వనికన్య
పటహభాంకృతుల కెబ్బంగినోర్చె

తే. నీలకంఠములకు నృత్యంబు గఱపుచు
నలసి తలఁగి పోవు నలరుఁబోఁడి
యేవిధమున నుండె నెలమి నాలీఢాది
మానములను రిపులమాన మడఁప.

సీ. పిడిఁజక్కఁగఁబట్ట వెర వెఱుంగనికొమ్మ
బాణాసనంబెట్లు పట్టనేర్చె
ప్రాఁకునఁదీగెఁ గూర్పంగ నేరనిలేమ
గుణము నేక్రియ ధనుఃకోటిఁగూర్చె
సరవి ముత్యము గ్రువ్వఁ జాలని యబల యే
నిపుణత సంధించె నిశిత శరముఁ
జిలుకకుఁ బద్యంబు చెప్ప నేరనితన్వి
యస్త్రమంత్రము లెన్నఁ డభ్యసించెఁ

ఆ. బలుకమనినఁ బెక్కుపలుకనిముగుద యే
గతి నేర్చె సింహగర్జనములు
ననఁగ మెఱసెఁ ద్రిజగదభిరామగుణధామ
చారుసత్యభామ సత్యభామ.

సీ. రాకేందు బింబమై రవిబింబమై యొప్పు
నీరజాతేక్షణ నెమ్మొగంబు
కందర్పకేతువై ఘనధూమకేతువై
యులరుఁ బూఁబోఁడి చేలాంచలంబు
భావజుపరిధియై ప్రలయార్కపరిధియై
మెఱయు నాకృష్టమై మేలఁతచాప
మమృత ప్రవాహమై యనలసందోహమై
తనరారు నింతి సందర్శనంబు

ఆ. హర్షదాయియై మహారోషదాయియై
పరఁగు ముద్దరాలి బాణవృష్టి
హరికి నరికిఁ జూడ నందంద శృంగార
వీరరసము లోలి విస్తరిల్ల.

భాగ

ఇట్లు కదనంబు సేయుచున్న మెచ్చి యచ్యుతుండు ముందే భార్యయుఁ గోరిన నీయని దివ్యహారంబు తన మెడనుండి తీసి యా కలకంఠి కంఠంబున వైచె.

అంత నరకుండును మురవైరిం గని జాయాపూర్వుఁడవై రణంబు సేయు నీవేటి మగవాఁడవు? మగవా రాఁడువారితోఁ బనిసేయరు. మగతనంబు గలదేని రమ్మని చేతి శూలమ్మున యదువర్యు వ్రేయ నెత్తుటయు దానిని బ్రయోగింపక మున్న కృష్ణుండు క్షుర నిశిత ధారంబగు చేతిచక్రంబున నరకుశిరంబు నేలఁ దొరఁగించె. అదియును దల్లీ! నీవల్లభుం డుల్లంబునఁ గనికరంబులేక కన్నకొడుకని యైన నెంచక యెంతకుఁ దెగించెఁ గంటివే యని చెప్పఁగొనఁబోయిన రీతి ధరణింబడియె. ఇట్లు కిరీటకుండల మండితంబైన నరక శిరంబు పుడమిఁబడుటయు వాని వారలు హాహాకారం బొనర్చిరి. దేవతలు మేలుమేలని మెచ్చి పుష్పవర్షంబుఁ గురియించిరి.

అంత భూకాంత సత్యాకాంతుం డాసి ప్రతప్త జాంబూనద రత్నప్రభా కుండలంబులును వైజయంతీ వనమాలికలును వరుణచ్ఛత్రంబును నొక మహామణియు సమర్పించి నరకకుమారు భగదత్తు ముందిడుకొని యిట్లని స్తుతించె.

దేవదేవేశ్వరా! శంఖచక్రగదాధరా! భక్తాభిలాష గృహీత శరీరా! పరమాత్ముఁడవైన నీకు నమస్కారములు.

కమలనాభుఁడవును, గమలమాలియుఁ, గమల నేత్రుఁడును, గమలచరణుండును నగు నీకు నమోవాకంబులు. భగవంతుఁడవును, వాసుదేవుఁడవును, విష్ణుఁడవును, బురుషుండవును, నాదిబీజుండవును, బూర్ణబోధుండవును నైన నీకుఁ బ్రణామంబులు.

జగత్కారణుండవును, నజుఁడవును, బ్రహ్మంబును, ననంత శక్తివియును, బరావరాత్ముఁడవును, భూతాత్ముఁడవును, బరమాత్ముఁడవు నగు నీకు నేటికోళ్లు.

జగత్సృష్టి సంకల్పించినపుడు రజోగుణప్రధాన చతుర్ముఖాఖ్య దేహానుప్రవేశంబున సృజింతువు. జగత్పతీ! జగద్వినాశంబు సంకల్పించు సమయంబున నగ్నిరుద్రాదుల ననుప్రవేశింతువు. జగద్రక్షణార్థం బుత్కటసత్త్వంబు వహించిన మన్వాదుల శరీరంబులఁ బ్రవేశింతువు. కాలంబు, ప్రధానంబు, పురుషుండు నీవయయ్యు వానికిఁ బరుండవై యుందువు. నేను, జనము, వాయ్వగ్ని గగనపంచతన్మాత్రలు నింద్రియాధిష్ఠానదేవతలు, మనస్సు, నింద్రియంబులు నహంకారంబు మహత్తు లోనగు నిఖిల చరాచరం బద్వితీయుండవైన నీయందు యుండు. ఇవి స్వతంత్రంబులనుట భ్రమమాత్రంబ. దేవా! వీఁడె నీచే నిహతుండైన నరకాసురసుతుండు భగదత్తుండు భీతుండై ప్రసన్నార్తిహరుండవైన నీ పదపంకజంబు లాశ్రయించె. సమస్త కల్మషాపహంబైన నీయభయహస్తంబు వీని మస్తంబున నునిచి పాలింపుము.

అని భక్తివినమ్రయై భూదేవి ప్రార్థింపఁ గృష్ణుండు భగదత్తున కభయహస్తమిచ్చి భోగ్యభోగోపకరణ సమృద్ధమైన నరకాసుర గృహంబుఁ బ్రవేశించె. ఇట్లు ప్రవేశించి నరకుండు పరాక్రమంబున రాజుల జయించి బలాత్కారంబున హరించి తెచ్చిన హరిణేక్షణలఁ గన్యలఁబదునాఱువేల నూర్వురను విలోకించె. ఆ కన్యలును రోచిష్ణుఁ గృష్ణుఁ దిలకించి యితండె తమకుఁ బతిగావలయునని మనస్సుల వరించిరి. ఇతండె నాకు విభుండగుఁగాక. బ్రహ్మ నా సంకల్పంబు నెఱవేర్చుంగాక యని యందఱు కన్యకలు వేఱువేఱు తమ మనంబులా హరికి సమర్పించిరి. పీతాంబరుండును వారికెల్ల నిర్మలాంబరంబు లొసంగఁజేసి వారినెల్లఁ బల్లకులం దుంచి నరకుని ధనాగారంబునం గల ధనరాసులతోడను నైరావతకులసంభవంబులై ధవళంబులైన చతుర్దంతగజంబు లఱువదినాల్గింటితోడను ద్వారకకుం బనిచె.

## పారిజాతాపహరణము

అంతట సత్యాకాంతుండు గరుడవాహనారూఢుండై యమరావతికిం జని యదితిదేవికిఁ గుండలంబు లొసంగి శచీదేవియు

నింద్రుండును దమ్ము గౌరవింప నందుండి సత్యభామాప్రేరితుండై నందనోద్యానంబునొచ్చి పారిజాతంబు పెకలించికొని ద్వారకాభిముఖుండై వచ్చుచుండ. నింద్రుండు సురనికరంబుతోడ నాయనను దాఁకె. వాసుదేవుండును వారినెల్ల నవలీల జయించి వృక్షంబుఁ దెచ్చి సాత్రాజితీ మందిరసుందరోద్యానంబున నాటించె. దేవత లెంతమూఢులో! యెంత తమోగుణ భూయిష్ఠులో!! తమ కెంతటి యుపకారమైనఁ జేయు నుపేంద్రుఁ డొక వృక్షమాత్రముఁ గొనిపోవ సహింపక యెదిరించి యుద్ధమాడిరి. అవురా వారి కృతఘ్నత.

## —♦ కృష్ణుఁడు పదునాఱువేల రాచకన్యకల వివాహమాడుట ♦—

అంత నవ్యయుండైన కృష్ణుఁడు నరకుని చెఱసాలనుండి తోడి తెచ్చిన మచ్చెకంటులకు వేఱువేఱ గృహంబులు నియమించియిచ్చె. వా రెందఱో తా నన్ని రూపములు ధరించి వారివారి యగారంబులందు వారివారిని యథావిధి వివాహంబయ్యె. ఆహా! యచింత్య చేష్టితుండైన శ్రీకృష్ణభగవానుని మహిమ యేమనవచ్చును. కేవల కామాసక్తులైన భర్తలు తమ ప్రియురాండ్ర విడిచి యెట్లుండ రట్టు లమ్మహానుభావుండు భోగ్యపదార్థంబుల సమాధికంబులు లేని వారి గృహంబుల నెల్లవేళల నెడఁబాయక గృహస్థధర్మంబులెల్ల నిర్వర్తించుచు రూపాభిరాములైన యా రామలతో రమించుచుండె.

అపరిచ్ఛిన్నుండును, నవ్యయుండును నయ్యు భక్తుల మనోభీష్టానుసారంబు రూపంబులెత్తు మురఘస్మరుండు తన యిల్లాండ్ర తృప్తికై నానారూపంబులు ధరించుటేమి వింత. యోగేశ్వరేశ్వరుండైన కృష్ణుండు లోపల వెలుపల నన్నియెడల నూఱువిధముల వేయివిధముల భక్తులకుఁ గానవచ్చుచుండ నానాఁ డన్నిరూపములఁ గానవచ్చుటేమి యబ్బురము. బ్రహ్మాగోచర మహిముఁడైన రమాపతిని దమపతిగా వరించి వియోగరహితంబై యంతకంతకుఁ హెచ్చు పెరుఁగు నచ్చపుమచ్చిక పేర్మిఁ జిఱునగవుల వగల చూపులఁ క్రొత్తకలయికల, మేలంపు ముచ్చటల నాసిగ్గరికత్తె లుత్తమంబగు

ప్రమోదంబున నుల్లసిల్లిరి. వారికందఱు నొక్కొక్కతెకు నూర్వురు నూర్వురు పరిచారికలుండినను నా రాచకన్నియలు కృష్ణునకుఁ దామే యెదురుగఁబోయి తోడి తెచ్చి వరాసనంబు సమర్పించి పాదప్రక్షాళనంబు గావించి స్నానంబు చేయించి యాహారమిడి తాంబూలం బిచ్చి శ్రమము వాయ వింజామరలవీచి చందన మలంది మాల్యంబుల నలంకరించి తలదువ్వి ముడివైచి పానుపుపఱచి పాదసేవచేసి యిట్లు నిర్మలచిత్తంబుల దాస్యంబు గావించుచుండిరి.

ఆ కన్యలందఱు భగవన్మహిమ మెఱుంగని వారగుటచే నందుఁ బ్రతికన్యకయుఁ దనయిల్లువిడిచి క్షణమైన నేకారణముననైన వెలుపలఁబోక తనయింటనే యుండు ప్రాణేశ్వరుంగని యాయనకుఁ దానే మిక్కిలి ప్రియురాలనని పొంగుచుండెను. భగవంతుని యరవిరితామర మొగ్గఁబోలు వదనము విలాసమునకు, నిడుదలైన బాహువులకు, వెడఁదలైన నేత్రంబులకు ననురాగరసంబు తొలఁకు హాసరసవిలోకనంబులకు మనోహరభాషణంబులకుఁ దామె సమ్మోహితులైరి. కాని తమ వెన్నిచిట్టంటుచేఁతలచేతను* నా జగచ్చేతను మనస్సు చలింపఁజేయఁ జాలరైరి. చిఱునగవుతోడి యొయ్యారంపుఁ గడగంటి చూపులచేతను, గనువారిమనస్సు హరింపఁ జాలు సొంపారు కనుబొమ్మల యార్పులచేతను, సురతతంత్రపాండిత్యముచేతను, నా పదునాఱువేల స్త్రీలయం దొక్కతెయు నాత్మారాముఁడైన యాయన మనస్సును బూవిలుతుని ములుకులకు లోను చేయఁజాలదయ్యె. బ్రహ్మేంద్రాదు లెవ్వనితత్త్వంబుఁ గనఁజాల రట్టి రమాపతినిఁ బతిగాఁగని యెడఁబాటులేక పెరుఁగుచున్న యనురాగాది విలాసాదుల నత్యంత ముదంబు గాంచిరి. భర్త యుపచారమునకు దాసీజనుల నియమింపక తామే యాయనకు సమస్తసేవలు చేయుచుండిరి. ఈ పదునాఱువేవురకు నొక్కొక్కతెకుఁ గృష్ణసమానులైన సుతులు పదుగురేసి పదుగురేసి ప్రభవించిరి.

---

* చిట్టంటుచేఁతలు = విలాసచేష్టలు.

## — శ్రీకృష్ణునిహిమ చూచ నారదుండు వచ్చుట —

నరకుని యింటనున్న పదునాఱువేల రాజకన్యకల శ్రీకృష్ణుం డేకకాలంబున నందఱ వివాహం బయ్యెనని విని యాచిత్రంబుఁ జూడఁగోరి నారదుం డొకనాఁడు ద్వారక కరుదెంచి చక్కఁరుక్మిణీ మందిరంబుఁ బ్రవేశించి సహస్రసఖీజన పరివేష్టితయై రుక్మిణీదేవి చామరంబుఁగొని వీచుచుండ సుఖశయనంబున విశ్రమించియుండు శ్రీకృష్ణుం గనియె. ఇట్లదాటున నరుదెంచిన విప్రోత్తముంగాంచి సకలధర్మరక్షకుండైన శ్రీకృష్ణుండు తటాలున రుక్మిణీ పర్యంకంబుదిగి కిరీటయుక్తంబైన శిరం బాయన పాదంబులు సోఁకఁ బ్రణమిల్లి భీష్మకన్య యందిచ్చు జలంబుల నాయన చరణయుగళంబుఁ బ్రక్షాళించి పరమగురుండును, సాధువులకుఁ బాయియు గతియు బ్రహ్మణ్యదేవుండను సార్థకగుణ నాముఁడును, దన పాదవారియే లోకపావనతీర్థంబు నగువాఁడును, నగు కృష్ణుం డా జలంబును శిరంబుపైఁ జల్లుకొనియె. ఇట్లు నరసఖుండై పురాణఋషియై యవతరించిన నారాయణుండు దేవమునిని యథావిధిం బూజించి సుధామధురభాషణంబులఁ బ్రభూ! యీ మాకింకరులవలనఁ దమకుఁ గావలసిన ప్రయోజనంబెద్ది? ఏమి కార్యం బానతిచ్చెద రనిన నారదుం డిట్లనియె.

అఖిల లోకేశ్వరా! సకలజనంబులందు మైత్రియు, దుష్టుల యందు దండంబును, నీవు వహించు టాశ్చర్యంబుగాదు. జగత్స్థితి రక్షణములకును, భక్తులకు మోక్షమిచ్చుకొఱకును, నీవు స్వసంకల్పంబున నిచ్చకోలఁది నవతరించితి వని మాకందఱకు స్పష్టముగఁ దెలియును. ప్రపన్నులయిన జనులకు మోక్షమొసఁగునట్టియు, బ్రహ్మాదులచే మనస్సునమాత్రము ధ్యానింపఁబడునట్టియు, నెట్టివారికిని బ్రభావ మెఱుఁగరానట్టియు, సంసారకూపంబునఁ గూలినవా రొడ్డుచేర నాధారమునగు నీ చరణయుగంబుఁ గంటిని. దేవా! దానిని ధ్యానించుచు లోకంబున సంచరించెదను. మఱపు రాకుండునట్లనుగ్రహింపుము. అని వేఁడి వీడుకోలువడసి యోగేశ్వరేశ్వరు యోగ

మాయాప్రభావం బెఱుంగవేఁడి వేఱొక కృష్ణభార్య యింటికిఁ జనియె.

అందు గృష్ణుండు భార్యతోడను యుద్ధవుతోడను, జూదమాడుచుండి నారదు రాకగని చివాలున లేచి యెదురేగుదెంచి యాసనాద్యర్పించి పూజించి యేమియు నెఱుఁగనివానివలె నెప్పుడు వచ్చితిరని కుశలప్రశ్నంబుఁ గావించి మహానుభావా! సంసారమునమునింగి యపరిపూర్ణులైన మావలనఁబూర్ణులయిన మీకుఁ గావలసిన ప్రయోజన మేమిగలదు? అయినను మీ కోరిక తెలిపి మా జన్మంబు సఫలంబు సేయుఁడు. అనిన నారదుఁ డాశ్చర్యపడి ప్రత్యుత్తర మేమియుఁ జెప్పక వేఱొక యింటికిఁ బోయెను. అందు శిశువుల లాలించు కృష్ణునింగాంచి మఱియొకర్తునింటికిఁ బోయి యందు స్నానప్రయత్నంబున నుండు భగవంతుఁ జూచి వేఱొక యింతి నిశాంతంబున కరుగ నందు గృష్ణుండు బ్రహ్మయజ్ఞాదు లాచరించుచుండె. ఇట్టులే యొకచోట బ్రాహ్మణుల కన్నదానముచేయు కృష్ణుని, మఱియొకచో భుజించు కృష్ణుని, నొకచో సంధ్యవార్చు కృష్ణుని, నొకచో డాలువాలుఁబూని లీలావిహారంబుగావించు కృష్ణుని, నొకచో గుఱ్ఱము నెక్కు కృష్ణుని, నొకచో గజముపైనుండు కృష్ణుని, నొకెడ రథస్థుండైన కృష్ణుని, నొక్కెడఁ బరుండిన కృష్ణుని, నొక స్థలంబున యుద్ధవాదులతో మంత్రమాలోచించు కృష్ణుని, నొక తలంబున జలక్రీడారతుఁ గృష్ణుని, నొకప్రదేశంబున బ్రాహ్మణులకు గోదానమొసర్చు కృష్ణుని, నొకయింట నితిహాసపురాణంబులు విను కృష్ణుని, నొక విటఁ బ్రియురాలితో బరిహాసభాషణములాడి నవ్వు కృష్ణుని, నొక్కట ధర్మార్థకామముల సేవించు కృష్ణుని, నొక మందిరంబునఁ బ్రకృతిపరుండైన పురుషుని స్వాత్మను ధ్యానించు కృష్ణుని, నొక గేహంబున గురు శుశ్రూషఁ గావించు కృష్ణుని, నొక నికేతనంబున సంధియు, వేఱొక భవనంబున విగ్రహంబు గావించు కృష్ణుని, నొక యగారంబున బలరామునితోడఁ గూడి సాధువుల యోగక్షేమము లాలోచించు కృష్ణుని, నొకశాలఁ గొడుకులకుఁ

కొమార్తెలకును మనువులు కుదుర్చు కృష్ణుని, నొక ప్రాంగణంబున పల్లెర నాఁడుబిడ్డల సాగనంపు కృష్ణుని, నొక దేశమున యజ్ఞము లొనర్చు కృష్ణుని, నొక బయల ధర్మార్థము తోఁపులు వేయించి బావులు త్రవ్వించి యాలయ ప్రతిష్ఠలు గావించు కృష్ణులను నొక మోసల హయారూఢుండై వేఁటాడఁ బోవనున్న కృష్ణుని, నొక యజ్ఞశాల యాదవులఁ గూడి యజ్ఞపశువధముం గావించు కృష్ణుని, నొయూపరిచారకుల భావమెఱుంగ మాఱువేషంబున నంతఃపురంబునఁ జరించు కృష్ణునిఁ జూచి నారదుండు విస్మయావిష్ట హృదయుండై దరహాసంబును ముఖవిలాసంబును భాసింపఁజేయ నిట్లనియె.

యోగేశ్వరేశ్వరా! యోగసిద్ధులకు దర్శింపరాని నీ యోగమాయను నీ పాదారవింద సేవాబలంబునఁ గంటిని. దేవా! యింక ననుజ్ఞ పాలింపుము. నీ కీర్తి గంగాప్రవాహంబున నిష్కలుషంబైన లోకంబుల భువన పావనంబైన నీ లీలలు బాడుచుఁ జరించెద. అనిన వాసుదేవుఁడు బ్రహ్మర్షీ! ధర్మము నుపదేశించుచు లోకమునకు దాని విధంబు నేర్పుటకై మనుష్యలోకమున నీ స్వరూపముననే నాధర్మము ననుష్ఠించి యుండుదు. నాయనా! యీశ్వరుండయ్యు నిట్టి మనుష్య ప్రవృత్తికిఁ బాలుపడెనని దుఃఖముగాని, నేను మనుష్యమాత్రుఁడనని మోహముగాని చెందకుము. అని బోధించిన నారదుం డప్రమేయుం డగు కృష్ణుని యోగమాయావిలాసంబు స్మరించుచుఁ బొగడుచుండె. షోడశస్త్రీసహస్ర గృహంబుల భగవంతుఁడు నానావిధంబులఁ జరించిన చరిత్రము శ్రద్ధతో వినువారికిఁ గీర్తించువారికి విని సంతోషించు వారికి మోక్షసాధనంబైన భగవద్భక్తి లభించును.

## సత్యభామ కృష్ణుని నారదునకు దానము చేయుట

అపారిజాతుఁడైన దేవకీగర్భజాతుండు పారిజాతంబును దన యింటఁ బెరటిచెట్టుగ నాటించుటగని సత్యభామ తన కన్నుసన్నల వశుండై మెలంగు విభుఁడు లభించెనని పొంగుచు నాయనయే జన్మ

జన్మంబునఁ దనకుఁ బతిగాఁ గోరి నారదుం గని యిట్లనియె. మహాత్మా! నీవు త్రికాలవేదివి. సర్వజ్ఞుఁడవు. నే నేమి వ్రత మాచరించిన శ్రీకృష్ణుండే నాకుఁ బ్రతిజన్మంబున మగండగు నెఱిఁగింపవే యనిన నారదుం డా నారదవేణితో నిట్లనియె.

జగద్వల్లభుండు నీ కీజన్మంబున వల్లభుండగుట నీవు పూర్వజన్మంబునఁ జేసిన పుణ్యంబు ఫలంబు. ఈ జన్మంబున నెయ్యది దానం బొనర్చెదవో యదియే నీకు మరల వేఱుజన్మంబున లభించును. కావునఁ నీ కంతటి చనువు స్వాతంత్ర్యము గలదేని శ్రీకృష్ణుని నొక యుత్తమబ్రాహ్మణునకు దానం బిమ్ము. అనిన నేను గావలయుననిన శ్రీకృష్ణుఁడు కాదనును. నాచేత కే సవతి యడ్డము రాఁగలదని గర్వించి యావశాగమన యదితినందన వందితపాదారవిందు దానం బీయ సమకట్టి రుక్మిణిందక్కఁ దక్కిన సవతులనెల్ల నొప్పించి నారదునకు శ్రీకృష్ణు దానమియ్య సర్వసన్నాహంబులు గావించె. అమ్మచ్చకంటి మచ్చరంబు కతన రుక్మిణీదేవితో హెచ్చరింపదయ్యె. పూజావిధానంబంతయుఁ జక్కనయిన పదపడి నారదుంగని యాకుందరదన మునీశ్వరా! దానంబుగొన నీకంటె సత్పాత్రంబునాకు లభింపదు కావున నీకే శ్రీకృష్ణు దానమిచ్చెదఁ గొనుమనిన నతండు గ్రహించె. నారదుండును గృష్ణుంగని కృష్ణా! యిఁక నీవు నా దాసుఁడవైతివి. నాయాజ్ఞ మెయి వర్తింపుము. ఇదో వీణె, మోచికొనిరమ్ము. అని మహతిఁ జేతి కిచ్చిన శ్రీకృష్ణుండును దాని శిరంబున నుంచుకొని నారదు వెంట బోవుచుండె. అప్పుడు సవతులందఱు సత్యంగనియిది యేమివ్రతమే. నీ వ్రతఫలముగ మఱుజన్మంబున శ్రీకృష్ణుఁడు మగఁడగునో కాఁడో కాని యీ జన్మంబునందే శ్రీకృష్ణవియోగంబు నీవు శాశ్వతపఱచికొంటివే. నీగతి యెట్లయినఁగానిమ్ము మాగతియేమి యనిన సత్యయు మరల నారదువెంటఁ బోయి యాయనకు సపత్నీవాక్యంబులును దన వియోగతాపంబును నెఱిగించె.

నారదుండును నట్లగునేని కృష్ణునియెత్తు ధనమిచ్చి విక్రయించుకొనుఁడని చెప్పిన నట్లెయని య ల్లీలావతితక్కెడయం దొకప్రక్క

నక్కరిరాజవరదునుంచి వేఱొకప్రక్క తనయింటఁగల సొమ్ములన్నియు నుంచె. ఇంటగల ధనము, నగలు వస్త్రము లెన్నియుంచినను గృష్ణుఁడుండుతట్టు చింతాకంత యయిన లేవదయ్యె. మంగళసూత్రంబు కట్టుచీర తప్పఁదక్కిన సర్వస్వముంచినను లేవకున్నఁ దక్కిన సవతుల నెల్ల బ్రార్థించి వారివారి యింటఁగల సర్వధనములు వస్త్రము లాభరణము లెన్ని తెచ్చి యుంచినను గృష్ణునిప్రక్క వ్రాలినముల్లు కదలదయ్యె. ఇఁక నేమిగతియని సవతులెల్ల నాలోచించి మచ్చరంబుడిగి రుక్మిణిఁ బ్రార్థించితిమేని యామె ధనంబిచ్చును దెత్తమని సత్యను దోడుకొనిపోయి రుక్మిణీదేవిం బ్రార్థించిరి. ఆమెయు స్నానంబుచేసి శుద్ధవస్త్రంబులు ధరించి యొక తులసీదళంబు బంగరు పళ్లెరంబున నుంచి దానిఁ జేతఁగొని యటకువచ్చి తక్కెడయందుంచిన ధనాదికంబెల్లఁ దీసివైవుండని నియమించి శ్రీకృష్ణునకుం బ్రదక్షిణించిరి త్తె తట్టయందుఁ దులసీదళం బుంచె. ఉంచినవెంటనే కృష్ణుఁ డుండుతట్టు మీఁది కెగసె. తొలసిదళంబుంచు తట్టు నేలయుంచె. అంత రుక్మిణీదేవి యాదళంబు నారదున కర్పించి మునీంద్రా! మా పతిని మాకనుగ్రహింపు మని ప్రార్థించె. నారదుండును నామెను బ్రశంసించుచు యథేచ్ఛ నరిగె.

అమ్మణి!-భీష్మకుఁడు రుక్మిణిని శిశుపాలున కిచ్చెదనని వానిని బిలిపించి ముహూర్తముకూడ నిశ్చయించెఁగదా. అట్టి బీటలమీఁది పెండ్లి చేయుచుట కృష్ణునకుఁ దగునా? పూర్వనిశ్చితయైన కన్యను దా నెట్లు పరిగ్రహించెను?

తండ్రి:-ఇప్పుడు మనదేశములో వివాహధర్మము చెడినట్లు మఱియేధర్మము చెడలేదని నాకుఁ దోఁచుచున్నది. దేశాభివృద్ధికి మతాభివృద్ధికి సదాచారములకు సత్సంతానములకు నింతయేల యుభయలోకముల దరించుటకు వివాహమే మూలకందము. అట్టి వివాహము లేనాఁడు యథావిధి జరపక వారివారి యిష్టానుసారము కామముకొలది జరపఁ బ్రారంభించిరో యానాఁడే మనదేశము హీనస్థితికి రాఁ బ్రారంభించెను. ఈ విచా

రము విరమించి నీ ప్రశ్నలకుఁ బ్రత్యుత్తరమిచ్చెదను. మన శాస్త్రములం దెనిమిది విధముల వివాహము పేర్కొనఁబడి నవి. అందు రాక్షస వివాహము గాంధర్వ వివాహము క్షత్రియులకు విధింపఁబడినవి. గాంధర్వమనఁగా యుక్తవయస్సు వచ్చిన రాచకన్నియయు రాజపురుషుఁడు పరస్పరము వలచి వెంటనే వివాహ మాడుట. దీనికి మంత్రతంత్రములు లేవు. వలపు మాత్రము ప్రధానము. శకుంతలా దుష్యంత వివాహము, సుభద్రార్జున వివాహము గాంధర్వవిధి ననుసరించినవే.

రాక్షసవివాహ మనఁగా వరుఁడుగాని వానికి మాఱు మఱి యొకరుగాని కన్యకను దాని బంధువుల జయించి బలాత్కారముగఁ గొనిపోవుట. భీష్ముఁడు తన తమ్ములకై స్వయంవరమండపములో నుండు కాశీరాజకన్యకల హరించెను. అంబ యనునది తాను సాల్వుని వలచినదాన ననుటచే దానిని వదలిపెట్టెను. రుక్మిణీకృష్ణ వివాహము రాక్షసవివాహమే. కావున రుక్మిణిని గృష్ణుఁడు హరించి కొనిపోవుట ధర్మవిరుద్ధము గాదు. రుక్మిణి పూర్వనిశ్చిత యంటివి. ఎవరిచేత ? రుక్మిణి మనోవాక్కాయకర్మములందు శిశుపాలుని వరింపలేదుగదా ? యుక్తవయస్సు వచ్చిన పిమ్మట వరుని వరించు భారము కన్యకదిగాని తల్లిదండ్రులది గాదు. యుక్తవయస్సు వచ్చిన పిమ్మటఁ గన్యాభిప్రాయము ప్రధానముకాని తలిదండ్రుల యభిప్రాయము కాదు. రజస్వల యైన కన్యను దమ యిష్టానుసార మిచ్చు నధికారము తల్లిదండ్రులకు లేదు. కన్యాభిప్రాయము జనకాభిప్రాయ మేకమైనచో నే దోషము లేదుగాని పరస్పరము విరోధించినపుడు కన్యాభిప్రాయము చొప్పునఁ దల్లిదండ్రులు నడచుకొనవలయుట విధి. రజస్వల నగువఱకే కన్యకలమీఁదఁ దల్లిదండ్రుల కధికారము. ఆవల వివాహవిషయమున వారికి నధికారము లేదు. కన్యకయే స్వతంత్ర. కావున యుక్తవయస్సు వచ్చిన రుక్మిణి విషయమున నామె యభిప్రాయమునకు విరోధముగఁ దల్లిదండ్రులు జరుప యత్నించుట దోషయుక్తము. ఆమె యభిప్రాయమునకు విరోధముగ నామెను

శిశుపాలునకే యిచ్చియుండిరా శాస్త్రదృష్టిని రుక్మిణి శీలవతి యగునా యని సంశయింపవలసి యుండును. రజస్వలలు తామే వరుల వరింపఁబూనినచో ననర్థకములు పెక్కులు సంభవించుట చూచి క్షత్రియులుకూడఁ దమ పుత్రికలు కన్యకలుగా నుండఁగానే వివాహములు గావించుచుండిరి.

నేను వ్రాసిన సావిత్రీచరిత్రమందు సావిత్రికి నామెతండ్రికి జరిగిన సంవాదమును బఠింపుఁడు. కన్యక వరుని నొక్కసారి వరింప వలయునుగాని పెక్కుమార్లు వరింపరాదు. మొదటిసారి తాను మనస్సున వరించిన పురుషునివదలి వేఱొకని వరించెనేని యది భ్రష్టశీలయే. యుక్తవయస్సు వచ్చిన కన్యక తా నొకని వరించి యుండ వానికిఁ గాక వేఱొకనికిఁ దల్లిదండ్రులు వివాహము చేసిరా యట్టివాఁ డుపపతియే కాని పతి కాఁజాలఁడు. అట్టులే రెండవ పతిని మనస్సునందైన వరించునది జారిణియె. ఈ ధర్మసూక్ష్మత్వమును మీరు గోపికల విషయమునందును నన్వయింపఁ దగు. గౌరీపూజచేసి గోపకన్యకలు కృష్ణునిఁ బతిగా వరించిరి. అట్టివారిలోఁ గొందఱను వారి తల్లిదండ్రులు మఱెవ్వరికో యిచ్చి వివాహము గావించిరి. శాస్త్రదృష్టిని గోపకన్యకలు వరించిన కృష్ణుండే వారికిఁ బతిగాని తక్కినవారు గాఁజాలరు. బలాత్కారకృతము లకృతములని మనువు వచించెను. మఱియొకని బలాత్కారముచేత నాకిష్టములేక నే నొకనిని జంపితినేని యా పాపము బలవంతపెట్టిన వానిదేకాని నాదికాదు. ఇట్టి గోపస్త్రీలు తమపతులను వదలి కృష్ణునొద్దకు వచ్చిరి. తరువాత వీరు సంసారమునే రోసి కృష్ణపదారవిందములే ధ్యానించు చుండిరిగదా. కావున నట్టివారియందును జారత్వము మోపుట శాస్త్రసమ్మతము గాదు.

రుక్మిణీదేవి తల్లిదండ్రులును నామెను శ్రీకృష్ణున కీయ సమ్మతించిరి. రుక్మి బలవంతుఁడగుటచే వారిప్రయత్నము సాగినది కాదు. తల్లిదండ్రులు జీవించియుండ సోదరునకు వరనిశ్చయమం దధికారము లేదు.

---

# విజయలీలారంభము



## పౌండ్రకవధ ఘట్టము.

కరూశదేశాధీశుఁడు పౌండ్రకరాజ కుమారుఁ డొకరుఁడు తనకు వాసుదేవుండను పేరుపెట్టుకొని తన యాయుధంబులకు సుదర్శన పాంచజన్య శార్ఙ్గ కౌమోదకీ నందక నామధేయంబులిడి సర్వదా శంఖచక్రభూషితహస్తుండై తిరుగుచు విజ్ఞుఁగి శ్రీకృష్ణుతోఁడ బద్ధమత్సరుఁడై వెఱ్ఱిగొల్లపిల్లవాఁడు వాఁ డేటి వాసుదేవుఁడు నేన నిక్కంపు వాసుదేవుఁడ నని మురియుచునుండు. అతం డొక్కనాఁడు మిత్రులు సామంతులునగు ధరాకాంతులు పరివేష్టింపఁ బేరోలగంబున నుండి వారితో నిట్లనియె.

భూపాలులారా! గోపాలుఁ డొక్కరుండు కండక్రొవ్వున నా పేరు తాను ధరించి నేను దాల్చునాయుధంబులపేర్లు తన యాయుధంబులకిడుకొని తానే వాసుదేవుఁడనని సిగ్గుమాలి లోకంబున మాఱులేక తిరుగుచున్నవాఁడు. ఈ యాగడంబు కంటిరే. ముం దెన్నఁడైన నిట్టిది వింటిరే. ముందువచ్చిన చెవులకంటె వెనుక వచ్చిన కొమ్ములు వాఁడు లయ్యె. కల్లబంగారునకుఁ కలుకులు మెం డన్నట్లు వాఁడిట్లు వేషముధరించి తన్ను భూషించుకొనుచు భాషించుచుండ నేనెట్లు విని సహింతు; నేనెట్లులైన సహింతును బొందు మా యిరువురిలో నిజమైన వాసుదేవుఁ డెవ్వఁడో యను లోకుల సందేహం బెచందంబున డింపపడు; కావున నా పోకలమారిపైఁ బోరికరిగి నా సాధనంబుల నతని యాయుధంబుల రూపుమాపి యతని నామంబు మాయంబుజేసెద. అంతటఁగాని నాకీర్తి నిరంకుశంబు గానేరదని చెప్పినఁ దదనుచరులు లెస్సలెస్స యవశ్య మట్లు కావింపవలయుననిరి. కాని కృష్ణుచేతిబలు వంతకు ముందు రుచి చూచినవారు వీని కేదియో కీడుమూంఁడ నున్నదని తలఁచిరి. ఆ సమయమంద నారదుండచ్చోటికి విచ్చేసె. పౌండ్రకుండును సభా

స్తారులు లేచి తగురీతి నమ్మహాత్ము సత్కరించి యుచితాసనస్థుం గావించిరి. అప్పుడా దేవమౌనిం జూచి పౌండ్రకుం డిట్లనియె.

మునీంద్రా! నీవు త్రిలోకసంచారివి. త్రికాలవేదివి. నీ వెఱుంగని యర్థంబులు లేవు. లోకంబున నిక్కంపు వాసుదేవుండ నేనుండ ద్వారకయం దొక యాదవుఁడు తాను వాసుదేవుఁడ నని చెప్పుకొనుచు నా యాయుధంబుల నామధేయంబులు తన యాయుధంబుల కిడికొని యున్నాఁడఁట. తేపటినుండి కుమ్మరియుఁ దాను జక్రవర్తి నని చెప్పుకొనునుగదా. ఈ విషయంబున మీకు నే నొకటి విన్నవించెద. సకలరాజ సభలందును. లోకపాలక సభలందును త్రిమూర్తుల సభలయందును, నిక్కంపు వాసుదేవుఁడు పౌండ్రకుఁడే కాని యాదవుఁడు కాఁడని మీరు నన్ను వర్ణించి చెప్పుచుండ వలయును. మీరిట్లు చేసిన సత్యంబు స్థాపించినవా రగుదురు. అనిన నారదుండు నవ్వుచు నిట్లనియె. పౌండ్రకా! నీవు గర్వాతిరేకంబునం గన్నుగానక మన్నుమిన్నెఱుఁగక ప్రేలుచున్న వాఁడవు. సర్వంబు నతనియందు వసియించును, సర్వంబునం దతఁడు వసించును గావున వాసుదేవుం డనుపేరు భగవంతుఁడగు శ్రీకృష్ణునకు సార్థకమై యున్నది. అది నీకెట్లు సార్థకమో చెప్పుము. నీవు వాకొనిన ఉపమానము నీకే చెల్లుచున్నది. నీవు వాసుదేవుఁడ ననుకొనుట కుమ్మరవాఁడు చక్రవర్తి ననుకొనుట యట్టిద. కర్మబద్ధుండవైన ప్రాకృతపురుషు నిన్నెవ్వఁడు భజించు? భజించి యెవ్వఁడు కడతేఱు. విధవకునమస్కరించిన నాయట్లు యుండుమని దీవించినట్లు నిన్ను భజించువానికి నీవేమి యీయఁగలవు. మూఢుఁడా! గేహేశూరుఁడవై మూలయింటఁ గూర్చుండి ప్రగల్భములు వాగిన రాఁగల లాభమేమి? నీ ప్రల్లదములు యదువల్లభుండు వినెనా నీకు నూటేండ్లు నిండు. ఏల చెట్టుకొట్టి మీఁదఁ ద్రోచికొనెదవు. కుడిచి యింట నెమ్మదిగఁ గూర్చుండలేవు కాఁబోలు. అనిన నట్టైన నతని రణరంగమున జయించి సత్యంబు స్థాపించెద. నీకుఁ గలహమనినఁ బండుగుగదా. నీకుఁ గడుపారఁ గుడుపుపెట్టెద. అప్పుడు నన్ను నా

వేడికోలు లేకయే నీవు ప్రశంసింతువు. అని పౌండ్రకుండనిన నారదుం డట్లు కావింపుమని సభవిడిచి ద్వారకకుఁ బోయి కృష్ణునకు సర్వంబు నెఱిఁగించి యదృశ్యుం డయ్యె.

అంతఁ బౌండ్రుండు తన మిత్రుఁడగు కాశీరాజునొద్దకు బోయి యచ్చట మూఁగిన రాజలోకంబుతోడ నాలోచించి దామోదరు కడకు నొక దూతను బుచ్చె. వాఁడును ద్వారక కేగి సభాసీనుండైన కృష్ణుంగాంచి యెల్లరు విన నిట్లనియె.

యదువరా కృష్ణా! నేను బౌండ్రక వాసుదేవుఁ డంపిన దూతను. మీకొక వార్త దెలుప నన్ను మా రాజు పుత్తెంచె. తనమాటలుగా విని మీతోడవాదోడక మా తేఁ డాడుమనియె. సావధానచిత్తుండవై విని యుత్తరమిచ్చెదవేని కొంపోయెద. "ఓరీ యాదవుఁడా! పుట్టిననాఁటనుండియు గొల్లమందలోఁ బసులతోపాటు పెరిఁగి ధర్మకర్మంబు లెట్టివో యెఱుఁగక స్త్రీవధ గావించితివి. గోహింస సలిపితివి. బంధువులఁ జోరిగొంటివి. అవన్నియు నాకేల యని యూరక సహించియుండితి. ఇప్పుడు సాదు రేఁగినఁ దలపోలమునఁ గాని నిలువదన్నట్లు నాపేరు పెట్టుకొని నా యాయుధముల పేరు నీ యాయుధముల కిడితివి. ఇది సహింపరాదు. కావున మతిమంతుఁడ వైతివేని వానినెల్లవదలి నా పేరుమాని యిచ్చటికివచ్చి నాచరణంబుల శరణంబు గోరుము. ఒండె మరణంబు నిక్కంబు." అని నీకుఁదెలుపు మనియె ననిన విని కృష్ణుండు మందహాస రోచిష్ణుండై యిట్లనియె.

నన్నచ్చటికి రమ్మని మీప్రభువు గోరెఁగావున తేప యచ్చటి కవశ్యము సర్వాయుధములతోడ వచ్చెద. ఆయుధముల వదలు మనియెఁ గావున వానినెల్ల వానిపై వదలెద. శరణంబు చొరుమ నియెఁ గావున నతని శరణంబుఁజొచ్చి సర్వసంపదలు హరించెద. పేరు పెంపుగల మీరాజు నాజ్ఞ యనుల్లంఘనీయము గావున నీయాజ్ఞ చెల్లింతునని మీ రాజునకుం జెప్పుము. అని దూతను వస్త్రమాల్యా దుల సత్కరించి యంపె. అతఁడును మరల చని కృష్ణవాక్యంబులు పౌండ్రకునకు నెఱిఁగించె.

పౌంండ్రకుండును సంగరమునకుఁ జతురంగ బలంబులఁ గట్టా యితంబు చేసికొనియుండె. అంతఁ గృష్ణుండు యుద్ధసన్నద్ధుఁడై తోడు రా నుంకించు యాదవ వీరులనెల్ల నిలువఁజెప్పి యొక్కరుండ గరుడా రూఢుండై కాశికానగరంబుఁ జేరం జనుదుఁ బౌండ్రకుండును గాశీ రాజసహాయుఁడై సకల సేనలతో శ్రీకృష్ణుతోఁ దలపడియె.

శ్రీకృష్ణుండును దర్పాదహృదయభేదన ధన్యంబైన పాంచ జన్యంబు నొత్తి జన్యంబునకుఁ దొడరి యనన్య సామాన్యకరలాఘ వంబున శరపరంపరలు నిరంతరంబుగఁ గురియించి సేనలనెల్లఁ బిలుకు మార్చి యార్చి కవిసినఁ బౌండ్రకుండును రంగస్థలమందలి పాత్రంబు బోలె వాసుదేవ వేషధారియై సుదర్శన పాంచజన్య నందక కౌమోదకీ శార్ఙ్గనామ కలితంబులైన యాయుధంబుల ధరించి కృత్రిమ గరుడధ్వజంబు గ్రాలు తేరిపైనుండి యెదురేగు దెంచిన శ్రీకృష్ణుండు వానిని జూచి నగుచు నిట్లనియె.

ఓరీ దుర్మతీ మూఢచిత్తా ! భారవహనమాత్ర సార్థకంబులైన యీ యాయుధంబులు నిన్నెట్లు రక్షింపజాలు ? నీవు కోరినట్ల వచ్చితి. నా రూపంబు శాశ్వతంబుగ ధరింపఁ గుతూహలుండవేని నా శరణంబు సొరుము. ఇవియన్నియు నీ కొసంగెద. అట్లు కాదేని నీవు చెప్పినట్ల నా యాయుధంబుల నీపై విడిచెద. నీ చిహ్నంబుల నేల పాలు గావించి నీ శరీరంబు కంక గృధ్ర జంబుక శునకంబుల కాహారంబు గావించెద ననిన నమ్మత్తుం డిట్లనియె.

ఓహాహో! యేమి నీ రంతులు. విన వింతలు. భూభారమణఁ గింప నవతరించిన నిక్కపు వాసుదేవుండను నేనై యుండ నా వేష ము నీవు ధరించి తిరుగుటయకాక నన్నే యాక్షేపింపఁ జొచ్చితివి. నీ వింత నందుఁ గొందఱు భూపురందరుల భ్రమందింపఁ జూచియు నా పూనిన కార్యంబునకు నీవు తోడుపడితివని యిన్నినాళ్లు సహిం చితి. నీవు నీ యంతరం బెఱుంగక మత్తిల్లుటంజేసి యిఁక నిన్ను మిత్తి కెర గావింప నెత్తికొనవలసె. అని గుణంబు మీటి నూటిగ బాణ

జాలంబులు కృష్ణుపైఁ బరఁగించిన నమ్మహానుభావుండును శిఖిశిఖానుకారంబులగు సార నారాచంబుల నతనిఁ గారుచిచ్చునఁ గాలిన కొండవలెఁ గావించె. దాని సహింపక పౌండ్రుండు నిశాతశరంబునఁ గృష్ణుని నయనోపాంతంబు భేదించె. నెత్తు రోడియుచుండె. దాన దానవారి కినిసి యొక పరుషంబగు విశిఖంబున నతని యురంబుఁ బగిల్చిన నతండు సోలి తేరిపై వ్రాలి తేఱి కౌమోదకియను తన గదచే గదానుజు వైచె. హరియును దన కౌమోదకిచే దాని ముత్తు నియలు చేసె. అమ్మందుండు నందకంబు వైచినఁ దన నందకంబున నందనందనుండు తుత్తుమురు గావించె. అవక్రచరిత్రుండు చక్రంబు వైచిన భక్తసుదర్శనుండు రిపుజన దుర్దర్శనంబగు తన సుదర్శనంబున దాని పొడవడఁగించె. ఇట్లతని యాయుధంబులు పొడిపొడియైన వాఁడును నీసుడింపక చాపంబు కేలంగొని బాణయుద్ధంబు గావించిన విరించిజనకుండు వాని సారథి తలఁద్రుంచి తన గరుడునిచే నతని గరుడధ్వజంబు భూపతనంబు గావింపించి తురంగంబుల రణరంగంబునకు బలియిచ్చి యతనిదేహంబు రక్తమయంబుఁ గావించి నగుచు నిట్లనియె.

ఏమిరా నీవాసుదేవ చిహ్నంబులన్నియు నేమియయ్యె. ఇఁక వాసుదేవ నామధేయంబున కర్హుఁడవు కావుగదా. ఓరీ నిన్నిట్లు మూఁదలించుటకై యింతసేపు సైరించితిసని చెప్పి యతని విల్లును శంఖంబును దునిమి యవక్రవిక్రమంబగు చక్రంబును వైచిన నది యతని శిరంబు ధరం బడ నఱకె.

అతని మిత్రుండు కాశీరాజెదిరించిన నాతని శిరం బాకశరంబునఁ ద్రుంచి యతని పురంబు నడుమఁ బడవైచిన నగరంబున వారు దానిని గని కరంబు దుఃఖార్తులైరి.

అరాతివితానంబును యమసన్నిధానంబునకుఁ బనిచి భక్తుల పెన్నిధానంబగు కృష్ణుండు ద్వారక కరుదెంచి యాప్తులకెల్లఁ దానొనరించివచ్చిన కార్యంబు సవిస్తరంబుగఁ దెలిపె.

—♦ కృత్యావధ. ♦—

అక్కడఁ గాశికాపురంబునఁ గాఁపురంబుండు లోకులెల్ల దుష్టసహవాసంబునఁ దమరాజు యమరాజుఁ జూడఁ జనియె నని పలవించిరి. కాశిరాజు తనూజాతుఁడు సుదక్షిణుండనువాఁడు జనక మరణంబునకు విషాదపడి కృష్ణుపైఁ బగ సాధింపఁగోరి పురోహితుం బిలిచి యభిచార హోమంబుఁ జేయించి యందొక శక్తి యుదయిం చినదానిని ద్వారకానగరంబు ధ్వంసంబుచేసి కంసారాతిని హింసించి రమ్మని పంచె. ఆ పిశాచియు సాఁచిన నాలుకలు సెలవుల నాకుచు జ్వాలకీలాభీలంబగు శూలంబుఁగొని హలహలధ్వనుల లోకంబు కోలాహలంబుగాఁ గేకలు వేయుచుఁ బెంధూళిలాకసంబు గప్పఁ దెప్పున నగధరు నగరంబుఁజేరి మింటిమంటినంటు పెనుమంటలఁ దత్పురంబుఁ గాల్పఁ జొచ్చిన దానిఁగని పౌరులు భీరులై భయార్ణవ హల్లోహల చిత్తంబులఁ దత్తఱపాటున భీతార్తిహరుండగు మురహరు పాలికి రక్షరక్షేతి వాక్యంబులఁ జేరంబోయి దేవా! ప్రళయానలంబు పురంబుపైఁ గవిసి భస్మంబు చేయుచున్నదని విన్నవించిన వెన్నుండపు నగుచు నాలోచించి కాశీరాజ సుతప్రేరితంబై యకృత్యం బాచ రింపవచ్చిన కృత్యయని తెలిసి దానిపై సుదర్శనంబును బ్రయో గించె. అదియును సహస్రమార్తాండప్రచండ తేజో మండితంబై దుష్కృత్యయగు కృత్యాపయిం గవిసిన నది యదరి బెదరి చెదరి కాశిపురంబువంకఁ బాఱె. సుదర్శనంబును దాని వెనుకొనియె. అది కాశీపురంబుఁ జొచ్చిన హెచ్చిన మచ్చరంబునఁ జక్రి చక్రంబును నగరంబుపై పడి కృత్యతోడ సర్వంబు నిర్మూలించి కాశిని బూదిరాశి యొనర్చి మరలి హరికరం బలంకరించె. ఈ విధంబున దుర్జన సాంగత్యంబునంజేసి దేవాసుర దుర్లభమైనఁ దేటి చూడరాని యా దివ్య పురంబు వెలిమిడి ప్రోవై రూపుమాసి చనియె.

—♦ ఉషాపరిణయ ఘట్టము ♦—

శ్రీవిష్ణుమూర్తి వామనుండై జనియించి యెవ్వని మూఁడడు గులు యాచించి త్రివిక్రముఁడై విజృంభించి ముల్లోకంబులు వ్యాపించె

నట్టి బలిచక్రవర్తికి నూర్వురు పుత్రులు గలరు. అందు బాణుఁడను వాఁడు జ్యేష్ఠుఁడు. అతఁడు సహస్ర బాహువు. మాన్యుఁడు వదాన్యుఁడు ధీమంతుఁడు సత్యసంధుఁడు దృఢవ్రతుఁడు. శివభక్తి పరుఁడు. అతండు లోకంబున స్వేచ్ఛావిహారంబుఁ గావించుచు నొక్కనాఁడు కుబేరమందిరంబగు పర్వతంబున సుందరకందరప్రదేశంబునఁ గుమారస్వామింగాంచి యాతని తేజోరూపంబులకు విస్మితుఁడై యాహా! యీయన యేమితపంబు చేసి భవునకుఁ దనూభవుఁడై జనియించెనో యని తలపోసి తానట్టి గౌరవంబు సంపాదింప సమకట్టి దిట్టమగు మనంబున నూరువుసట్టి తపంబుసేయ నతనిభక్తికిఁ బార్వతీసమేతుండై శివుండు ప్రత్యక్షుండై వరంబు వేఁడు మనిన నతం డిట్లనియె.

దేవా ! యీ మహాదేవి పర్వతరాజకన్య నన్నుఁ దన తనయునిఁగా నంగీకరింపవలయు. నీవును గుమారునట్లు నన్ననుగ్రహింపవలయు నిదియే నా కోరిక యనిన శంకరుండు సంతసిల్లి మృడానిం గని యిట్లనియె.

దేవీ! యీతండు నీకుమారుండు. కుమారు వెనుకటివానిఁగఁ గ్రహించి వాత్సల్యదృష్టిం జూడుమనిన నామెయు నట్లయగాక యనియె. ఈశ్వరుండును నతనికి శోణపురంబు రాజధానిగ నొసఁగి తాను దత్పురరక్షాదీక్షవహించి ద్వారంబునఁ గావలివాఁడై నిలిచె. కుమారస్వామియు నతనియెడ సౌభ్రాత్రంబు పాటించి యతనికి వాహనంబును గేతువునై వెలుంగ నొక్క దివ్యమయూరం బొసంగె.

ఇట్టి వరంబులఁ బొంది యాతఁడు సర్వాసురచక్రవర్తియై లోకపాలకుల జయించి లోకంబులఁ జీకాకు గావించి తన కెందును మాఱులేని యవక్రవిక్రమంబునఁ బరాక్రమించుచుండె. శంకరానుగ్రహపాత్రుఁడైన యతనికి దేవతలెల్లఁ గింకరులైరి.

ఒకనాఁడు ప్రదోషకాలంబున ఖండపరశుండు తాండవంబాడ సహస్రభుజుండు బాణుండు వాద్యంబు వాయించి మెప్పించె. భగ

శంతుఁడును సర్వభూతేశుండును శరణ్యుండును భక్తవత్సలుండును, భక్తమనోవశంకరుండును నగు శంకరుం డాతని వరంబు కోరు మనఁగ నదియె, కావరంబునకుఁ గావలంబైన యా కావలుండు కిరీటంబును జంద్రజూటు పాదంబులు సోఁకఁ బ్రణమిల్లి

ఉ. శంకర ! భక్తమానస వశంకర ! దుష్టమదా సురేంద్రనా
శంకర ! పాండు నీలరుచి శంకరవర్ణనిజాంగ ! భోగిరా
ట్కంకణ ! పార్వతీహృదయశైరవశైరవమిత్ర ! యోగిహృ
త్పంకజ పంకజాప్త ! నిజతాండవఖేలన ! భక్తపాలనా ! భాగ.

దేవా ! నీవు భక్తజాతంబునకుఁ బారిజాతంబ-వని యెఱుఁగుదుఁ గావున వేఁడెద. నరసురగరుడగంధర్వాదులం దెవ్వరు నాతో యుద్ధంబున నెదిరించి పోరంజాలు వాఁడు కానరాఁడు. నా దోర్బలంబునఁ బర్వతంబులు చూర్ణంబుచేసి దిగ్గజంబుల వెనుకొన నవి భీకాముగములై పాఱుచున్నవి. సమరమున నాతో సముఁడగు లేవరి నీ వొక్కఁడు తక్క నింకొక్కరుఁడు లేఁడు. చేతులతీట పోవ సమరపాటవంబు నెఱప వలనులేమి వేయుచేతులును వృధా భారముగ నున్నవి. ఏమిచేయుదునని యలా టించుచుండును గ్రుద్ధుఁడై మూఢబుద్ధీ ! నీ కచిరకాలంబున నీకులంబు బలంబు చలంబునకు సరిపోవ నాతో సముఁడగు వానితో రణంబు ఘటిల్లు. నీ నికేతనంబున మయూరకేతనం బెప్పు డకారణంబుగ ధారిణిఁ గూలునప్పుడ నీకుఁ బరిభవనిదానంబగు నాయోధనంబు చేకూరు బొమ్మనిన నమ్మందుం డమందానందంబునఁ దన మందిరంబున కరిగి కేతనంబునకు భూపతనం బెప్పు డౌదవునో యని తహతహతో నెదురు చూచుచుండెను. అంత నొక్కనాఁడు నిష్కారణముగ నిజ వినాశహేతువు కేతువు నేల వ్రాల దానిం గని యా బాలిశుండు బలవంతునితోడఁ బోరాదవు నని ముదమందుచుండె.

ఈ బాణాసురునకు సుందరీ జనమాన్యయు విలాసధన్యయు నగు కన్యగలదు. ఆ కన్నియ పేరుష. ఆమెకుఁ జెలియై మంత్రియగు

కుంభాండు కూఁతురు ఫాలవిజిత శశిరేఖ యగు-చిత్రరేఖ మనస్సె ఱింగి వర్తించుచుండును. ఉషయును బ్రతిదినంబును బరమేశ్వరీ దర్శనంబునకుఁ బోయి వచ్చుచుండును.

వసంతకాలంబున నొకనాఁ డుద్యానంబునఁ బార్వతీపరమేశ్వరులు స్వైరవిహారలోలురై చరించుచు నలసియొక్క-చో విశ్రమించిన తఱి మంచుఁగొండ కొమార్తను దొడపైఁ గూర్చుండఁ బెట్టుకొని శివుండు లాలించుచు ముద్దుగొనుచుండె. దైవవశంబున నుషయు నా సమయమందె యందేగి కుచంబులు ప్రాణేశ్వరు నురంబు నొఅయు గుఱువుపయిఁ గూర్చుండి కులుకు నుమం గని తనలో నిట్లు లాలోచించె. ఆహా తన యీడుజోడై మనస్సెఱింగి వర్తించుచు నాదరించు పతితోడ నాడు నాఁడుదాని జన్మంబె సార్థకంబు. లేఁబ్రాయంపుటింతి యింతియగాక మఱి యేభాగ్యంబుఁ గోరు. పతివినాకృతయైన సతికి సమస్తభాగ్యంబు కాననంబునఁ గాచిన వెన్నెల. ఈమెవలె నేనును నా మనోహరుతోడఁ గలసిమెలసి కేళుల నలసి సొలసి యుండు నదృష్టంబు గలుగునా? ఏల కలుగరాదు? నే నీజగన్మాత నాశ్రయించితినేని నా కోరిక రిత్తగానేరదని తలపోయుచుండ గౌరియు నా కుమారిని వీక్షించి చేరఁజీరి యిట్లనియె.

బాలా! నీతలంపు మేలైనది. వైశాఖ శుక్ల ద్వాదశినాఁటి రాత్రి నీ స్వప్నమం దెవ్వఁడు నీతోడఁ గలయు వాఁడె నీకుఁ బతి గాఁగలఁడు. అనిన నవ్వచనంబులఁ గలిగిన లోనిపొంగు దరహసిత వికసిత వదనాంబుజంబు చాటుచుండ నయ్యండజయాన సపరివారయై గృహంబున కరిగె.

ఆవల నొక్క-నాఁ డుషాకన్య నిజసౌధతలంబున హంసతూలికాతల్పంబున ననల్ప సంతోషంబున నిద్దురించుచుండి తన్నెవ్వఁడో సుందర పురుషుండు నవకందర్పాకారుండు రతి గూడినట్లు కలఁగని యులికిపడి లేచి నలువంకల శంకాతంక కలంకిత చిత్తయై చూచి యెవ్వరి జాడఁ గానక మకరికాపత్ర భంగములు మోవి కెంపులు

లోనగుచిన్నె లచ్చొత్తి నట్లుండుట చూచి కల్లకల యననేరక, తన కన్యాకాత్వమున కెవ్వఁడో భంగంబు గావించెనని లజ్జయు భయము నవమానము పురిగొన రోదనంబు గావించుటయుఁ జుట్టు పరుండిన చెలికత్తెలు లేచి యేమియేమియని హెచ్చరించిన నచ్చంచలాక్షియుఁ బొచ్చెంబులేక కలలో నెవ్వఁడో తన్నేమేమో చేసిపోయెనని చెప్పిన నప్పల్లవాధరలు "బాలా! స్వప్నమాత్రమున కేల యీలీలఁ దూలెదవు? నీ తండ్రిపేరనిన దేవాదులును వడఁకుదురు. సాయుధు లైన వీరవరుల మొత్తమ్ములు విచ్చుకత్తులఁ గావలి యున్నవారు. ఎవ్వఁడు రానోపు. వచ్చి ప్రాణంబులతోఁ బోనోపునని యెంత ధైర్యము చెప్పినను నమ్ముగ్ధ వినక తనవలనఁ గులమునకు జననీ జనకాదులకు నవమానము ఘటిల్లెనని పల్లటిల్లుచుండె.

అంతఁ జిత్రరేఖ మతిమతియగుట శంకరి వచించిననాఁడానాఁడేయగుట స్మరించి యుష కావిషయంబు వచించి యూరడించె. ఉషాకన్యయు దాని స్యాపంబుల హృదయతాపంబు వాసెఁగాని కలలోఁ దోఁచిన సుందరుఁడే తన ప్రాణేశ్వరుఁడని యెఱిఁగి వలపు పెంపునఁ దపింపఁ జొచ్చె. ఆ కుంభాండనందనయు బాలా! యింత మాత్రమున కీ లీల యలరు వాలురమ్ములజోదు కీలలపాలై యేల జాలిఁ గాలెదవు. నీస్వప్నగతపురుషుఁ డెవ్వఁడు చెప్పుము. వాఁడెట్టి వాఁడైన నెందున్నఁ గొని తెచ్చెద ననిన యుష యిట్లనియె.

కలలోఁ దోఁచిన లీలామదనుఁడు నాపాలి భాగధేయంబు నామధేయం బెట్టిదో యెందులవాఁడో నేనెఱుఁగ. ఆ చెలువుని రూప ధేయంబు విధేయమై నాకుఁ గనులఁ గట్టిన ట్లెడఁబాయకున్నదిగాని వర్ణింపనేర. నేనేమి సేయుదు. మరల నా మనోహరుఁ గలియుటెట్లని వగచిన నట్లైన నిలు మిదిగో వచ్చెదనని చిత్రలేఖనకళావతి యగు నవ్విద్యావతి యచిరకాలంబున నరసురాసుర యక్షరాక్షసాదుల రూపంబులెల్లఁ బటంబునఁ జిత్రించి దానిని దెచ్చి యచ్చకోరాక్షి కిచ్చి యిటు ముచ్చటించె.

జగన్మోహినీ! యీ పటంబునఁ దగులని సుందరుఁడు లోకంబున లేఁడు. దీనిని సావధానచిత్తవై చక్కఁ బరిశీలింపుము. నీ ప్రియుఁ నీవు గుర్తింపుమని పటము చేతికీయ నా బాలనాఁగ దాని నందుకొనియె. చిత్రరేఖయు నందలి యందఱఁ జేర్వేర వర్ణించి దేవాదులఁ జెప్పి మనుష్యలోకంబున రాజుల రాజకుమారులఁ జూపుచు వీఁడు జరాసంధుఁడు, వీఁడు భగదత్తుఁడు, వీరు పాండవులు, వీరకౌరవులు నని కనఁబఱిచి యదుకులంబునఁ గృష్ణబలరాములను బ్రద్యుమ్నునిఁ జూపె. ప్రద్యుమ్నునిఁ జూచినంత నాకాంత యంతరంగంబున నతండ తన కాంతుఁడని భ్రాంతిగొనియు వెంటనె యా యించువిలుకు నంచుననున్న యనిరుద్ధుఁజూచి అపూర్వక యావలఁ జూపుపోనీయక సంభ్రమము నత్యాదరము నద్భుతము కౌతుకము పెనఁగొను చూపుల నతని యురము, కరములు, పెదవులు నవితన్నుఁ జేసిన చేష్టలును దలంచునదివోలెఁ జూచుచుండెను. చిత్రరేఖయుఁ దన నెచ్చెలి అపూర్వని చూపులును, జలింపని మనస్సును ననిరుద్ధునందు బద్ధమై యావలికి సాగిపోకుండుట చూచి యమ్మత్తకాశిని చిత్తంబెఱింగి తెలవా! వీఁడా నిన్న నిన్నటి కలలో వలలో వేసికొని నీ మనంబుఁ దన వెంటఁ దీసికొనిపోయిన యంటుకాఁడనిన నుప యిట్లనియె.

చెలియా! నీ కరకౌశల మేమని కొనియాడుదునమ్మా! నేను గలలోఁ గన్న రూపును దూచా తప్పక నీవు చిత్రంబున లిఖించితివి. వీఁ డేవంశమువాఁడు. ఏ యూరివాఁడు. ఇతని తల్లిదండ్రు లెవ్వరు? ఇతని నిచ్చటి కెట్లు తెచ్చితివనినఁ జిత్రరేఖ యిట్లనియె.

లోకంబులుగావ ధరణిఁ గృష్ణుం డన నవతరించిన విష్ణుఁడు ద్వారకానగరంబున నున్నవాఁడు. ఈ సుకుమారుఁడగు కుమారుఁ డా యన కుమారుని కుమారుఁడు. ఆయన తండ్రియో ప్రద్యుమ్నుఁ డన జన్మించిన మారుఁడు. ఈతని పేరనిరుద్ధుఁడు. నా యోగమాయాబలంబున నితని నిరుద్ధుఁజేసి యిందుఁ దెచ్చెదఁ జూడుమని యా కలికి నమ్మఁబలికి రే యగుటఁ జిత్రరేఖ యోగబలంబున మనో

జవంబున ద్వారావతి కరిగి యెవ్వరుఁ గానకుండ నెట్లానందనందన నందనునందను హరింతు; హరించితిఁ బో సర్వజ్ఞుండగు వాసుదేవుం డిది యెఱుంగకుండెడినే. ఎఱింగిన నన్ను సహించునే. అని భయ భ్రాంతుల స్వాంతం బేకాంతంబు చింతామగ్నంబుగా నేమిసేయు టకుఁ దోఁపక యొకయుద్యానంబున దిగి తన యదృష్టంబుకొలఁది నం దరుదెంచిన విరించననందనుఁ గని నమస్కరించి కేలుమో డ్చిన. గిరికన్యక బాణకన్యకకు నిచ్చినవరంబును, వరదానబలంబున ననిరుద్ధుం డుషాకన్య స్వప్నంబునఁ దోఁచుటయుఁ దన యాగమన కారణంబును, దా ననిరుద్ధుఁ గొంపోయి యంతఃపుర నిరుద్ధుఁ జేసిన బాణుం డెఱిఁగి యతని బద్ధుంజేసిన బాణ చక్రపాణులకు యుద్ధంబు సిద్ధంబగుటయు, సహస్రబాహుఁడు మదోన్మత్తుండై మోహంబున శంకరుచేఁ బడసిన వరంబున నతనికోటమి వాటిల్లుట సత్యమనియుఁ దెలిపి యిట్లనియె.

మహానుభావా! తన తనుజను మనుజుండు పట్టుట వినిన నద్దనుజుండు కుమారుఁ జెఱసాలఁ బెట్టుట నిక్కము. అప్పాట మీరా యాగడంబు కంబుధారికిఁ దెలిపి జగడంబునకై పురికొల్పవలయును. కాదేని నేనింత చేసియు వ్యర్థంబగు. అనిరుద్ధుండు కలకాలంబు కారాబద్ధుండై యుండవలసివచ్చు. తానై హరి యెఱింగెనేని నాపై నుషపై నేమి కినియునో; కావున మీరీవార్త యాయన కెఱింగించి మాపైఁ గినియకుండను నయినసంబంధంబు చెడకుండను, గాపాడఁ బ్రార్థించెద. అని యా దానవి పలికిన నారదుం డిట్లనియె.

బాలికా! యిదిదైవకృతంబు. నీవు నిమిత్తమాత్రమవు. నీవు చెప్పినట్లు బాణునకు ముప్పు తప్పదుగాని దీనమూకేమియు నొప్పుమి యుప్పతిల్లదు. దానికి నేను బూఁట. నీకుఁ దామసియను విద్య నొసంగెద. దాన నీ యిష్టార్థంబు కరతలామలకంబగు. తద్రక్షిత వగు నిన్ను నెవ్వరేమియుఁ గనఁజాలరు. చెనఁకజాలవు. బాణనందక పాణుల రణంబుఁ జూడ నరుదెంచెద. కలహాశనుండనగు నాకు నీవు విందు కల్పించితివి. సర్వంబు సుమంగళంబగు కల్యాణీ. వెఱవకు.

అనిరుద్ధు హరించికొని పొమ్మని చెప్పివచ్చె. అనన్య సామాన్య విద్యాధురీణయగు నాయరీణచరిత్రయుఁ జక్క నన్నిరుద్ధు సౌధంబున కేగి తనుమధ్యల మధ్యంబున నిద్రాముద్రిత నేత్రశతపత్రుండైన యా శృంగార రసపాత్రునిఁ గని యా కోమలగాత్రుని మెల్లఁ డాయఁ బోయి యతని ముఖాదిలక్షణంబు లుపలక్షించి యితం డెవ్వ తెనో కలలోఁగూడి యలరెడి వానిభంగిఁ దోఁచెడు. ఉషాకన్య రేయి కన్నకల యీయనయుఁ గనుచున్నవాఁడు కాఁబోలు. హిమధర కన్య మహిమ కేల యన్యథాత్వంబు ఘటిల్లు. ఈ వంచిత పంచ బాణు వంచించి హరించికొనిపోయితినేని మేలుకొనిన పడపడి యేమి తలఁచునో తనంతఁ దావలచివచ్చిన మచ్చెకంటిని మగవారు తిరస్కరింతురుగదా. అందు మోసకత్తెల నెవ్వఁ డాదరించును. కావున నీయనను మేలుకొలిపి కలియఁ గలుపుకొని వాస్తవం బెఱిఁగించి కొనిపోవుట మేలని తలంచి యా యంచయాన యంచున నిదురించెడి చంచలాక్షులపైఁ దామసీవిద్య ప్రయోగించి యాయనకు మేలుకొలిపి యిట్లనియె.

రాజకుమారా! నా విన్నపం బాలింపుము. నేను బాణకన్యయగు నుషాదేవి చెలిని. చిత్రరేఖయనుదానను. మా దేవి యుమాదేవి వరంబున నిన్నుఁ గలసినట్లు కలగని నీవెవ్వరో యెఱుంగక మఱుంగుచుండ నా లిఖించిన చిత్రలేఖ నీ రూపరేఖా విలాసంబులఁ గాంచి నీవె యామె మానంబు మనంబు హరించిన సొబగుకాఁడవని గుర్తించె. నీమీఁది బాళి విరాళిఁ దాళఁజాలక యానీబాలిక యిందు రాఁ దొలుత సాహసించెఁగాని బాలికయగుటచే భీరువై నీ డెందంబు చందంబెఱుంగక మున్నాడి వచ్చిన నాఱడిపోదునోయను భయంబున నన్ను నీకడకుఁ బుత్తెంచె. నీవిం దరుదెంచెద వేని నా యోగవిద్యా బలంబున నిన్నిప్పుడ యా యిందువదనమందిరంబుఁ జేర్చెద. అనిన నా యిందుకులనందనుం డిట్లు మందలించె. మీ సుందరి కన్న కలయే నేను గని యదిమొదలు చిత్తాళిగొని కాళ్లి పాలయినవాఁడ. నా పూర్వపుణ్యంబునఁ జేసి కలఁగన్న చోట్టిక్కి

గంపకొత్తుకొని వచ్చితివి. మేలవ్వ. తద్విరహానలంబునఁ దూలు నాకు రేయేదో పవలేదో నిద్ర యెట్టిదో యాఁకలి యెట్టిదో తెలియ రాకున్నది. నేను నిన్ను వేఁడుకొనఁ దగు కార్యమునకై నీవ నన్ను వేఁడుకొనుచున్నదానవు. కలిమి కలసివచ్చుట కిదికదా చిహ్నము. సిరి రా నెవ్వఁడు మోఁకాలొడ్డును. అవశ్యము నన్నుఁ గొనిపోయి నీ సఖితోడఁ జేర్చి పుణ్యముఁ గట్టుకొమ్ము. అనిన నా మేధావిని యతనిఁ దామసిచే మోహితుఁ జేసి కరతలంబునఁ గుసుమంబుఁ బోలె గ్రహించి యాకాశ గమనంబునఁ జని రాకాసిఱేని వీటిం బ్రవేశించి యంతఃపురంబున నుషాకన్య పానుపున నతని డించి నిలిచినఁ గని యుష యానందసాగరంబున హల్లోహలంబగు నుల్లంబున లజ్జాశ్చర్యసంభ్రమ కౌతుకంబులు పురిగొన నా ననఁబోఁడిం జూచి యిట్లనియె.

చెలి యనుపేరు నీకుఁగాక మఱి యెవ్వరికిఁ జెల్లు. కలలోఁ గన్న రూపును బ్రత్యక్షంబు చేసితివి. ధన్యనైతినిగాని యిమ్మహామహుం డిందుండుట యెఱింగిన మా యిరువుర కేమికీడు మూఁడునో యని వెఱచెద ననినఁ జిత్రరేఖ యిట్లనియె.

మందహాసినీ ! యీ యెడాటమున సందేహింపకుము. చెలికత్తెలందఱు నీవారని నమ్ముము. నీ యిచ్చవచ్చినట్లు వర్తింపుము. అని ధైర్యంబుగొనఁ బలికి తామసి విద్యమాన్చి తనంతఁ బోయె. అనిరుద్ధుండును నుషాదేవి కౌఁగిట మేలుకొని మేలుకొంటినని సంతసించి యథేచ్ఛక్రీడల వర్తించుచుండె. ఇట్లు కొన్నిదినంబు లరిగె.

అంత నావృత్తాంతంబు సడి యెఱిఁగి యంతిపురము కావలి భటులు దేవతాప్రతిభటుఁ జేరఁ జని, రాజేందుశేఖరా ! నీ యంతఃపురంబున నుషాకన్య మందిరంబున నెవ్వఁడో మానవసుందరుండున్నవాఁడు. ఉన్నవార్త యెఱిఁగింప వచ్చితిమి. అనిన నతఁ డదరిపడి యేమీ నా శుద్ధాంతంబునకు నొక మనుజకాంతుండు రాకయు నా కూఁతుతోడఁ బలు పోకలు పోకయుఁ గలిగెనఁట. ఇంతకన్న విపరీతం బెందుఁ గలదు. దనుజులు మనుజస్త్రీలఁ బట్టుటకలదు గాని

మనుజులు దనుజస్త్రీలం బట్టుట యెందుం గలదు. మున్నిట్టిది కంటిమా వింటిమా పట్టుకొంటిమా? గుండులు తేలె బెండులు మునిఁగె నని యనేకసహస్రకింకరులం బంచిన వారు తన సౌధంబుడాయం జను దెంచుట కాంచి యుషాకన్య భీతయై యయ్యో దైవమా! నేనెంతటి దూరాలోచనము లేని దురాత్మికను. కన్నియ లెవ్వరైన నెన్నరాని సన్నని కార్యములకు లోనై కులటనై కులనాశ మొనరింపం బాలుపడితిని. స్త్రీబుద్ధిః ప్రళయంకరీ యనుట సత్యమయ్యె. కామాంధకారముచే మిన్నుమన్ను గానక వర్తించితిని. యువతికి బుద్ధి పెడతల నుండుననుట నాయందు నిజమయ్యె. స్త్రీసాహసమునకు నేనే లక్ష్యభూతనగుదు నేమో, నా కామసుఖమునకై యెందో సుఖమున్న సుందరుని నిందిరానందనాకారునిం గొనివచ్చి దుఃఖముల పాలొనర్చితిని. త్రిలోకవల్లభుండైన తండ్రిమనస్సు రోయించి యతనికి దూరస్థనైతిని. ఇట్టి యాగడ మొనరించి తల్లిదండ్రుల మొగ మెట్లు చూతును. నా సరివారిలోఁ దలయెత్తి యెట్లు తిరుగుదును? అదియెల్ల నెట్లైన నగుఁగాక. నావలనం గలిగిన యీ దుఃఖమునకై నా నాథుఁడు నన్నేమని యెంచును. తొయ్యలులకన్న రమ్యవస్తువులు లేవు. వారలే కష్టములకెల్లఁ గారణము లను సూక్తి సరి దాఁకెనని తలఁపఁడా? నా మనోహరునకీ యుపాయంబు దొలంగ నే సదుపాయంబుఁ గావింతును. ఈయనకొక యొప్పమి పుట్టుట నా ప్రాణమునకుఁ బుట్టు లేకదా. తండ్రిపాదములపైఁ బడుదునా? ఆయన యెట్టి నాదురాగతంబు క్షమించు. నా జీవితం బిఁక వ్యర్థంబు. మహా పాపాత్మకంబు. నాథుని గష్టదశయందుఁ జూచుటకు మున్నే ప్రాణముల విడుతునా? జగదీశ్వరియగు మహేశ్వరి యిచ్చిన వరంబు పొల్లు వోవునా? నాపాలి భాగ్యదేవలలారా! ఇలువేల్పులారా! మాకీ యాపద దొలఁగింపుఁడు. మమ్ముద్ధరింపుఁడు. అని దీనవదనయై శోకసదనయై కన్నీరుగాఱఁ జేతులు పిసికికొనుచున్న ప్రేయసింగని యనిరుద్ధుం డిట్లనియె.

బాలా ! నీవు నాలావు తెలియక తలంకెద వేల? బాణ పరిచరులకు గిరిచరులకు వెఱచెడివాఁడ నేను గాను. నీ వీ వాతాయన రంధ్రంబుల నుండి నా బలపరాక్రమ విభవంబుఁ గన్నారఁ జూడుము. ఈ ముక్కిడిమూఁక యేకరణి ధరణి వ్రాలునోయని తలుపునకు వేసిన యినుప యడ్డమ్రానుఁ లాగికొని సౌధంబుఁ జుట్టు ముట్టిన యా కట్టిఁడి రాక్షసులపై నా జగజెట్టి దిట్టతనంబు మెఱయ నుఱికె. ఆ సమయంబున నారదుండు మింటనుండి వేడుక చూచుచుండె.

అనిరుద్ధుండు యుద్ధ దోహలంబునఁ గోలాహలంబుగ రాక్షసుల మూఁకలపై లేళ్ల పిండుపైఁ గవియు సింగంబు భంగి నుఱికి యభంగర విక్రమంబునఁ జేతిపరిఘంబు చిత్ర విచిత్రగతులఁ ద్రిప్పుచు వ్రేటునకు నొకటిరెండు పదిపండ్రెండు తలలు లెంకాయలఁ బోలెఁ బకీల్ బకీల్మని పగుల నాకాశంబు దనకు నంపిన వర్షంబునకు మాఱు ధాత్రిణి తాను మరల నంపుచున్నగో యన్నట్టు కీలాల జాలబిందు సందోహంబులు చివాలున మింటికెగయఁ గొఱవి త్రిప్పినట్లు లెంపుఁ జూచిన దానవులై పరిభ్రమణ వేగంబునఁ దా నెందును గానరాక చరించిన నా కోల్తల కోరువఁ జాలక కూలువారును వ్రాలువారును, జచ్చువారును, విచ్చువారును, విఱుగువారును, నొఱగువారును, దొలంగువారును, నలఁగువారును, దిరుగువారును, సురుఁగువారును నైన హతశేష రాక్షససేన యంతయుఁ గాందిశీకంబై పాఱిన యా కుమారుండుబ్బి తన్ను కిటికీనుండి చూచు బిబ్బోకవతి యానందంబున నుబ్బ బొబ్బ యిడెను, ఇట్లు లబ్బలియునితోడఁ బోరు నిబ్బరంబులేక తబ్బిబ్బులై యుబ్బుచెడి వచ్చిన రక్కసులంగని బాణుండనంత చమూసమూహంబుతోడ నా మారుకుమారుఁ దాఁకె. అనిరుద్ధుండును నీడఁబోక యా వాహినినంతయు రక్తవాహిని పాలుచేసి విజృంభించుచుండ నిఁక నేను దడసినఁ దెక తేరకు దానవబలంబు నిర్మూలంబగునని తలంచి తోషితస్థాణుండు బాణుండా కుమారుపైఁ గవిసె. వారిరువురకు ఘోరసంగ్రామంబు వర్తిల్లె. ఇంతకాలం బుక్కు మిగిలి యొక్కరుండ పెక్కురతో రణంబు సేసియు డయ్యక యసమానబల

విక్రమంబుల రాజిల్లు నల్లుంగని తన యమ్ములన్నియు వమ్ములై పోవుట తిలకించి యితండు సులభసాధ్యుండు గాఁడని తలంచి యష్టఘంటా యుక్తంబై గంధమాల్యాసక్తంబై యముని నాలుకఁ బోలెఁ గ్రాలు నొక మహాశక్తి చేకొలఁది విసరి యా సుకుమారుపైఁ బ్రయోగించె. అదియును మెఱుంగులు తుఱంగలింపఁ జూపఱు మిఱుమిట్లు గొన వచ్చుటంగాంచి యా పంచబాణనందనుం డొడికంబున నెగసి పట్టి బిట్టురయంబున విసరి దాన నద్దానవేంద్రు నురంబు మొత్తె. ఆ వేటుపడి యాతండు ధ్వజదండం బూఁతగా సోలిన రాక్షససైన్యం బులు దీనవదనంబుల హాహాకారంబులు నించె. అంతఁ గొంతవడికిఁ దెప్పతిల్లిన యతనిం గని కుంభాండుం డిట్లనియె.

దానవేంద్రా! పగతుఁ డల్పుఁడుగాఁడు. చూడ బాలుఁడు గాని రణమునఁ బశ్యాత్ఫాలుఁడు. చేయవలసిన యుపాయములు చేసి తిమి. చూపవలసిన బలపరాక్రమములు చూపితిమి. వీఁ డసాధ్యుం డని తోఁచె. నీ వేయుపాయంబునన్నైన నిన్ను, నన్ను రాక్షసకులం బును నుద్ధరించుకొను నుపాయంబుఁ జూడుమని బోధింప నమ్మాటలఁ దెలిసొంది బాణుండు మాయ గ్రహించి యంతరిక్షగతుండై యేరికి గోచరింపకుండి దాయ యేమాయెనోయని నలుదిక్కులు దిగ్భ్రమ గొని కను యదుకుమారు నాగాస్త్రంబున బంధించి నేలఁ ద్రోచె.

ఇట్లనిరుద్ధు నాగాస్త్రంబున బంధించి యంతఃపుర ద్రోహి యగు వీని తల తీయుఁడని భటుల కాజ్ఞాపింపఁ గుంభాండుం డెదు సొచ్చి యిట్లు విన్నవించె.

దేవా! కోపంబు కార్యంబుగాదు. ఇతఁడు మహా వీరుఁడు. నీతోడసమానముగఁ బోరినవాఁడు. కావుననే శ్లాఘ్యుఁడు. వీఁడు రణివాస ద్రోహియగుట సత్యంబు. వీఁడెవ్వఁడు? ఎందులవాఁడు? ఏల వచ్చెను? ఎట్లు వచ్చెను? ఎవరు తెచ్చిరి? యనుట నీవు విచా రింపవలసి యుండును. నీ పుత్రి నితండు గాంధర్వవిధి వరించె. కార్యంబు గడచె. మించిన కార్యమునకై కోపించిన ఫలమేమి?

వీనిని ద్రుంచుట నీ పుత్రిని వైధవ్యదుఃఖమున ముంచుటగాదె. నాపైఁ గోపింపవేని నా మనంబునఁ గలయది గలయట్లు దెలిపెద. రూప శౌర్య బల పరాక్రమంబులఁబట్టి చూడ వీఁడు నీకు జామాతగాఁ దగినవాఁడుగాని యల్పుఁడుగాఁడు. కావున వీని నిప్పుడు క్షమింపుము. కాఁగల కార్యంబు మీఁద నాలోచింతమనిన నతండు నట్ల యాలోచించి నిట్టూర్చి యెక్కడి కులట నాకుఁ గూఁతురయ్యెనని జుగుప్స పడుచు నతనిని నుషాకన్యను గారాగారంబునఁ ద్రోచి కావలిపెట్టి విషాదగ్రస్తుండై తన గృహంబున కరిగె.

అంత నక్కడ ద్వారకాపురంబున ననిరుద్ధుసౌధతలంబున నతని ప్రియురాండ్రు వేకువ మేలుకని తమ మనోహరుం గానక నలువంకల వెదకి వ్యర్థప్రయత్నలై యొక్కచోఁ జేరి యెండకువాడిన విడి తామరలం బోలు నెమ్మోములును, మరందబిందువులు చిందు నరవిందంబులఁ బోలి బాష్పంబు లురలు కన్నుఁగవలును, ప్రేలు కురులును, జాఱు విరులునుఁ జిక్కువడిన సరులును గలిగి చేతులు పిసికి కొనుచు మాట డగ్గుత్తికపడుచు, నింక నెట్లమ్మ యమ్మా యింకెట్టులే యేమిచేయుదమే, యెందుఁ జొత్తమే, యని కళవళపడుచుండఁ గొందఱయ్యో యెంత మంచివాఁడమ్మ. ఒకరినైనఁ గసరెడివాఁడు కాఁడమ్మ, ముద్దుల బిడ్డఁడమ్మ, ముంగిటి నిధానమమ్మయని కొందఱతని గుణంబులెన్నఁ గొందఱు జగన్నాథుఁడైన కృష్ణునీట కొదవమాట పుట్టెనమ్మ. తండ్రిచాలే కొడుకునకు వచ్చెనమ్మ, ప్రద్యుమ్న పరాక్రమమే నగుపాట్ల పాలాయెనమ్మ,యాదవులు ప్రమత్తులను వారి మాటయే నిజమయ్యెనమ్మయని కురరీవితానంబుతీరున వాపోవుటయు యాదవులిదియేమి యనిరుద్ధుగేహంబున నేమి విపరీతంబు పుట్టెనని గుంపులై పోనికరిగి యావద్వృత్తం బెఱింగి శ్రీ కృష్ణాదుల కెఱింగించిరి.

అంత రుక్మిణీకాంతుండు సకల యదు ప్రముఖులతో సభామందిరంబున కరిగి యాలోచించుచుఁ గుమారు వెదక శీఘ్రజంఘాలుర నానాదిఙ్ముఖంబులకుఁ బంచె. వారును గొన్ని దినంబులు పల్లెపల్లె గుట్టగుట్ట మిట్టమిట్ట చెట్టుచెట్టు పుట్టపుట్ట వంకలుడొంకలు మిఱ్ఱులు

పల్లములు క్రంతలు గుంతలు చెఱువులు దొరువులు తోటలు దొడ్డులు నూళ్లునాళ్లు నన్నియు వెదకి కానంబనను ననిరుద్ధుఁ గానక యరుదెంచి యీ విధంబు యదువర్యునకుఁ దెలిపిరి. ఇట్లు నాలుగు నెల లరిగె. అప్పు డందఱు నేమిచేయుటకుఁ దోఁపక యాలోచించు చుండ సూర్యుండు భూలోకగతుం డయ్యెడునోయని చూపఱు భ్రమ గొనుచుండ నారదుం డరుదెంచి చిత్రరేఖ పోకలాదిగ ననిరుద్ధుండు కారాగృహంబున నిరుద్ధుం డగుట యంతంబుగా సర్వంబు వినిచి యూహ యీ కుమారు ధైర్యశౌర్య పరాక్రమంబు లేమని చెప్పుదు. అంతటి బలియుండయ్యు నద్దనుజవరుం డెదురెదురై నిలిచి బాలు క్రేలి వంపఁజాలక నొంపఁజాలక జాలంబుచేసి బంధించె. శోణపురం బిచ్చటికిఁ బదునొకండు వేల యోజనంబుల దవ్వగలదు. మనుష్యుల కందుఁ బోవ సాధ్యంబుగాదు. గరుత్మంతునిఁ దలచి యతనిపైఁ బయ నింపు మని బోధించి చనియె.

అంత గృష్ణుండు గరుత్మంతుని స్మరించుటయు నాయన పాద మంపి నిలిచి యేమి యానతి యనిన వాసుదేవుం డిట్లనియె. వైన తేయూ! బాణాధైతేయుండు మా యనిరుద్ధు బందిమందిరంబునఁద్రోచి యున్నవాఁడు. ఆ శోణపురంబు మానవులకు దుర్గమంబు. మేమందుఁ బోవలసి యున్నదనిన నట్ల కానిండనియె. యుద్ధసన్నద్ధులై బలరామ కృష్ణ ప్రద్యుమ్నులు గరుడు నధిరోహించిరి. ఆయనయు వాయువేగ మనోవేగంబుల నుప్పరవీధిం బఱచె.

ఇట్లు పోవంబోవం వారి దేహంబులు బంగరురంగునఁ జెలంగు టయు రాముండు కృష్ణుగని మనదేహంబులు పసిమి మిసిమి నెస లారుచున్నవి. మేరునగంబు డాసితిమోయనఁ గాదుకాదు శోణ పురంబును రుద్రాజ్ఞచే నగ్నులు చుట్టి కాచుచుండు. అందు నాహవ నీయుంబను నగ్ని మన కెదురై వచ్చుచున్నది. దీనికిఁ బ్రతివిధానంబు వినతాతనయుండు ఘటింపఁగలవాఁడనిన వైనతేయుండును వివివిగల వేనోళ్ళ ధరించి యాకాశవాహినీజలంబు పుక్కిలించి యా యగ్నిపైఁ జిలుపలేకుండఁ జల్లుటయు నది యడపొడలేకుండ నడఁగె. కృష్ణ

డులు గరుత్మంతుఁ బ్రశంసించిరి. ఆయనయు నావల దాఁటి పోవం బోవ రుద్రానువర్తులైన యగ్నులు బ్రహ్మపుత్రులు గుల్మాషుండును. గుసుముండును దహనుండును శోషణుండును దపనుండునను వారేపు రును బితరుండును, బతంగుండును, స్వర్ణుండును, నాపుఁడును భ్రాజుఁ డునునన నేవురును రెండుమొత్తంబులై వీరెవ్వరో గరుడారూఢులై యుద్ధసన్నద్ధులై మువ్వురిందు వచ్చుచున్నారని యెదిర్చి సింహగర్జ నంబులంబోని రవంబు లెసఁగించుటయు బాణుం డారవంబు విని కతంబారసి సైన్యంబులెల్ల సిద్ధపఱిచె.

ఈలో జ్యోతిష్టోముఁడు విభావసుఁడను నగ్నులిరువురు తన్ను నిరువంకలఁ గొలిచిరాఁగ దగద్ధగాయమానంబగు రథంబెక్కి స్రువా యుధంబుఁ దాలిచి యంగిరసుండు సర్వాస్త్రశస్త్రభరితంబైన యర దంబెక్కి స్వాహావషట్కార విభులగు దశాగ్నులతోడరాఁ గృష్ణు పైఁ గవసినఁ గృష్ణుండును మునీంద్రా! నీవేల నాపై నురవణించితివి. బ్రాహ్మణుండవు. యజ్ఞాదులఁ గడుపార మెసవి యూరకుండరాదయ్యె నే యనిన నతండు కోపించి చేతి శూలంబునఁ జచ్చితివి పొమ్మని ముకుందు వైచె. కృష్ణుండును దాని రెండు ఖండంబులు గావించి యొక్క కఱకుములికి వైచిన నది యతని ఱొమ్మున నాటి వీఁపున వెడలినఁ జచ్చినట్లు రథంబుపై మూర్ఛ ముచ్చమునిఁగి పడియె. సారథియు రథంబుఁ దలఁగం దోలె. శోణపురంబును లోచన గోచరంబయ్యె. కృష్ణుండు పాంచజన్యంబుఁ బూరించె. ఆ రవంబున శోణపురంబు సంక్షోభించె. అంత బాణాగ్ని కింకర సైన్యంబు లసంఖ్యంబులు వారి కడ్డమై తాఁకి బహుళాస్త్రశస్త్రపరంపరలు పరఁగించిన నిరువురును గాయపడిరి. కృష్ణుం డేసరేఁగి యాగ్నేయ వాయవ్యాది దివ్యాస్త్రంబులు వారిపైఁ బ్రయోగించిన నా సైన్యం బులు మాపుమాసి విచ్చె. అంత నమ్మువ్వురు వీరులు పురప్రవేశంబు గావింప రథగజతురగపదాతి యుక్తంబైన సైన్యంబుతో సేనానాయ కు లాఁగిన రణోత్సుకులై బలరామ ప్రద్యుమ్నులు దక్షిణ వామ భాగంబు లలంకరింప గోవిందుండు వారితో దురంబొనరించె. గఁ

డుండుమను దన ఖర నఖరశిఖరంబులఁ జించుచుఁ ద్రోటి నొంచుచుఁ బక్షివిశేషజాతవాతంబుల నరాతిసైనికుల వగుల్కుచున్నట్లు తూల నడఁచుచు విజృంభించె.

ఇట్లు బాణసైన్యంబు దైన్యంబు నొందుట గని బాణుని నిజ పుత్ర నిర్విశేష వాత్సల్యంబున నాదరించు శూలపాణి కుమార ప్రమథ గణసమేతుండై కృష్ణుం దాఁకి బాణజాలంబులు పఱపిన వాని నన్నిటిని గోవర్ధనధరుండు నడుమన నఱకివైచె. దానిఁ గనలి రుద్రుండు బ్రహ్మాస్త్రంబు వైచిన గుక్షిణీధవుండు బ్రహ్మాస్త్రంబునన మరల్చె. వాయవ్యాస్త్రంబు వైచిన శైలాస్త్రంబున మాపుమాపె. ఆగ్నేయాస్త్రంబు వైచిన నైంద్రాస్త్రంబునఁ జెఱచె. దీనంగాని తెగఁడని భవుండు వసుదేవ సంభవునిపై బాశుపతాస్త్రంబు వైచిన నాయన నారాయణాస్త్రంబున భంగించె. అంత నిటలాక్షుండు నతిక్రోధకోపంబున జ్వరంబు ప్రయోగించె. ఇట్లు తనపై వచ్చు శైవజ్వరంబుపై నారాయణుండు వైష్ణవ జ్వరంబుఁ బనిచిన నవి రెండును నొండొంటిఁ దార్కొని ఘోరంబుగఁ బోరియుఁ దుదకు తన్నుఁ జంపఁ దెంపున వైష్ణవజ్వరంబు తెలిసికొని తా శైవజ్వరంబు పరువెత్తి యసంపూను రక్షకుఁ గానక మురలి ముచుకుందవరదు పదారవిందములపై వ్రాలి నానావిధంబుల స్తుతియించిన సదయ హృదయుండగు నందనందనుండు దానిం గరుణించి విడిచి యెవ్వరేని మీ పోరు వినుపువారు వారిని బాధింపకుమని విడిచి పుచ్చె.

అంతకు సంగ్రామంబు మానక తనపైఁ గవియుపినాకపాణిపై శార్ఙ్గపాణి జృంభకాస్త్రంబు ప్రయోగించిన శివుం డావులించుచుఁ బరవశుండై వ్రాలె.

అంతఁ గుమారుం డెదిరించి వసుదేవకుమారునిపై బరాక్రమించి బ్రహ్మశిరంబను మహాస్త్రంబు వైచినఁ గృష్ణుండు చక్రంబున దాని నుపసంహరించె. షణ్ముఖుండు కృష్ణుం జంపుతలంపున నిజమహాశక్తి వైచినఁ బాపలు వచ్చెఁజచ్చెఁ గృష్ణుండని యెలుంగిడ నూరకుండి

యది చేరరా హుంకారమాత్రంబున దాని బీరంబు చెఱచి మయూరవాహను వధింపఁ జక్రంబెత్తిన నత్తఱిఁ దత్తరంబున మహాదేవు పనుపునఁ బార్వతీ చైతన్యభాగమైన లంబాభిధాన దిసమొలతో వచ్చి కుమారునకు నడ్డమై కృష్ణున కభిముఖంబుగ నిలిచినఁ జూచి కృష్ణుఁడు రోసి దృష్టి క్రమ్మరించి నీవేల యిట్లు వచ్చితివన నాయమ యిట్లనియె. దేవా! నాకుఁ బుత్రభిక్షనిమ్ము. సుదర్శనం బుపసంహరింపు మనిన నీవు నీ కుమారుఁ దొలఁగఁ దీసికొనుమనిన ముకుందుఁ డానతీయ నామె యట్లచేసి పుత్రప్రాణములు దక్కించుకొనియె. ఇట్లు శక్తిధరుతోడఁ బోరి పురివిచ్చిన హరుసమూహసమూహంబుఁ గాంచి బాణుండు కృష్ణుపై నడరి రణంబొనర్ప నాయనయు నేనుంగునకు సిల్లుచూపినట్లై వేఁగి రోషంబులతోడి చాపంబుల నేనూటి నొక్కమాఱు దునిమి సుదర్శనంబుఁ గేలఁగొనుటయుఁ జచ్చెనుతుండని వెఱచి బాణునితల్లి కోటర యుచ్చమల్లిదై తన యెదుట నిలిచిన దిసమొల దానిం జూడ లజ్జించి కృష్ణుండు కన్నులు మూసికొని రెండుచేతులుఁ దక్కఁ దక్కిన వెల్ల ఖండింపుమని చక్రంబు బాణుపైఁ బంచె. అదియును దోఁటవాఁ డరఁటిచెట్ల నఱకునట్లు బాణుకరంబుల నఱకుచుండఁ బుత్రవాత్సల్యంబున గంగాధరుండు బాణుఁ గావఁగోరి గరుడధ్వజు డాయ వచ్చి పురుషసూక్తంబు పఠించి స్తుతించి బాణుఁ గావఁ గోరుటయు వాసుదేవుండును నాయన వాక్యంబు బహూకరించి రెండుచేతులతోడి బాణు సప్రాణు విడిచిపుచ్చి మఱియు నిట్లనియె. శంకరా! ప్రహ్లాద వంశ్యుల వధింప నని మున్న బాసయిచ్చినవాఁడ. వీఁడు మదబల గర్విష్ఠుండగుట యింతమాత్రము చేయవలసి వచ్చెనని చెప్పిన బాణుండును గంఠగతప్రాణుండై నారాయణునకు నమస్కరించి నుతించి సాలంకృతుల యుషానిరుద్ధులం దెచ్చి యప్పగించె. కుమారస్వామి యూవధూవరులకు దివ్యమయూరవాహనంబుఁ గానుక నొసంగె.

పదపడి కుంభాండుం డరుదెంచి దేవా! బాణుగోవులు వరుణుపాలనున్నవి. వానిపాలు గ్రోలినవారికి బలాయురారోగ్యసత్త్వంబులు వర్ధిల్లుచుండు. వానిని నీవు గొనితెనుమనిన నట్లేయని మయూర

వాహనులై యుషానిరుద్ధులు తోడరా గరుడవాహనా రూఢుండై పుత్రభ్రాతృయుతుండై పీతాంబరుండు కదలి వరుణనగరంబునకుఁ బోయి యతని జయించి యాగోవ్రల నళపఱిచికొని ద్వారకాపురాభిముఖుండై పయనించె.

విజయులై వచ్చునతనిరాక యింద్రాదులు మునుమున్న యాదవులకుం దెలిపి పురం బలంకరింపించిరి. యాదవులును దేవతలును మహావైభవంబుతోఁ గృష్ణాదుల నెదుర్కొనిరి. కృష్ణుండు స్వపుర ప్రవేశంబుఁ గావించి సకలబంధు జనానుమతంబున నుషానిరుద్ధులకు వివాహంబు ప్రవర్తింపఁ జేసె.

## —♦ సాంబోపాఖ్యానము. ♦—

ఒక్కనాఁడు దుర్యోధనుండు తనకూఁతురు సర్వశుభలక్షణ లక్షణ యనుకన్యకకు వివాహంబుఁ బ్రవర్తింపఁజేయ జాంబవతీ సుతుండు సాంబుం డందేగి యాకన్నియ నపహరించి రథంబుపై నుంచుకొని కురువీరుల సడ్డసేయక మరలి యరుగుచుండఁ గర్ణదుర్యోధనాదులు కురుకుమారవర్గంబుతో ననర్గళవేగంబునఁబోయి యతనిఁ దాఁకి మహాయుద్ధం బొనరించిరి. యదుకుమారుండును వారి నొకపోకకుఁ గైకొనక వారినెల్ల నుక్కడఁచుటయుఁ గురుకుమారులు చిన్నపోయి గుంపులై యొక్కచోఁజేరి యిట్టిబాలుని జయింపమేని మన పౌరుషంబులు గాల్పనేయని యొండొరు పురికొల్పికొని యొక్కమొగి నతనిపైఁబడి యందఱుఁ జుట్టుముట్టి కొందఱు చాపంబును గొందఱు రథంబును గొంద ఱశ్వంబులను గొందఱు ధ్వజంబును గొందఱు సారథి ఛేదించి భేదించి బాధించి వేధించుటయు నతఁడు వికలితాయుధుండై పట్టుబడియె. అప్పు డతనిని దుర్యోధనుండు కారాగారంబునఁ ద్రోయించె. ఈ దుర్వార్త కర్ణతాడితంబగుడు యాదవులు భీషణరోషావేశంబున యుద్ధసన్నద్ధులై కౌరవులనెల్ల రూపుమాప నమకట్టి దండయాత్ర చాటించుటయు దుర్యోధనపక్షపాతి యగు

బలరాముఁడు వారినెల్ల శాంతులఁజేసి యింతటి యల్పనేరంబునకుఁ బోరాని చుట్టములపైఁ గట్టలుకవహింతురే! నేను గార్యంబుఁ జక్కఁ బఱిచెదనని మంత్రిముఖ్యులతో మితజనసమేతుఁడై హస్తినాపురంబునకుఁ బయనించి యూరి వెలితోఁటలో విడిసి తనరాక కౌరవులకుఁ దెలుప నుద్ధవుం బనిచె.

అతండును బోయి భీష్మద్రోణ కృపకర్ణకుమార సహితుండైన ధృతరాష్ట్రుని బలరాముని రాక యెఱింగించిన నాఁడునను సత్కరించి సబహుమానంబుగ నగరంబులోనికిఁ దోడితేఁ గురువృద్ధులనెల్లఁ బనిచె. భీష్మాదులు సుయోధనాదులతోఁడఁ జని సత్కరించిరి. ఉభయకుశలప్రశ్నానంతరము బలరాముండు సాంబుచరిత్రము ప్రస్తావించి మీరందఱుగూడి యొక్క బాలుని నాలమున వంచించి జయంబుగొనుట పౌరుషలక్షణంబు గాదు. అయినను బంధుభావం బాలోచించి మా రాజు మిమ్ము క్షమించె. కన్యాయుక్తు సాంబుని మరల నప్పగింపుఁ డని బోధించె. ఆ మాటలువిని దుర్యోధనుం డేమీ! కౌరవులకు వశపడినవానిని విడిపించికొనిపోవ మూఁడుకన్నులుగలవానికిని సాధ్యంబుగాదన యాదవు లెంతవారు. ఏ మొడనో రూపనామక్రియలు లేక మూల నణఁగిపడియుండి మా బాంధవమున నలువురినడుమ నిలువ యోగ్యత ప్రాప్తించినఁ దమ తొల్లిటి స్థితిగతు లాలోచింపక తమరాజఁట, మమ్ము క్షమించెనఁట. ఏమి యీధూర్తవాక్యములు. శ్వేతచ్ఛత్రాది రాజ్యచిహ్నంబు లేనాఁడు వీరికుండెనో. మన ముపేక్షించుటచే నిప్పుడివియన్నియు ధరింపఁ గలిగియు నది మఱచి మనకు నీతులు గఱపుచున్నవారు. మన సహనముచేఁ గాలఁద్రొడుగు పాదుకలు తలకెక్కుచున్నవి. ఛీ! యిట్టివారితోడి బాంధవ మేల. నెయ్య మేల. వీరిని సరిచేసికొని మాట్లాడుటచేతనే వీరింత గర్వించిరని నానా దుర్భాషలాడుచు సోదరసహితుండై యతండు సభవిడిచి పురంబున కరిగె. వానితోడఁ దక్కిన కౌరవులు నరిగిరి.

ఇట్లు పల్లఱపు లఱచి కురుశ్రేష్ఠుండు పోవుటయు బలరాముండు తోడివారితో ని ట్లనియె. వింటిరా కౌరవులాడిన దుర్భాషణములు. దేవాదిదేవుండైన భగవంతుఁడు శ్రీకృష్ణుం డొసఁగిన రాజ్యలక్ష్మి మనకుఁ దా మిచ్చిన దఁట. తాము తలలఁట; మనము పాదుకలమఁట. కౌరవులు పట్టినవానిని బురహరుఁడైన విడిపింపలేఁడఁట. ఆహా యేమి వీనిరాజ్య మదాంధత్వము. ఇట్టి మనుజాధముని నెట్లు సహింపవచ్చు. వీని దుర్వృత్తి యెఱింగియే కృష్ణాదులు దాడివెట్టిన బాంధవ సౌహృదములు పాటించి నేను వారిని వలదని వారించి సామంబునఁ గార్యంబు చక్కఁబఱచికొందమని వచ్చితిని. ఈ దుర్మార్గుఁడు సామంబునకు లోఁబడువాఁడు కాఁడు; దండైకసాధ్యుఁడు. అని సరోషభాషణంబులాడి హలాయుధుండు భీకరోదగ్రమూర్తియై ప్రళయాంతకుని పగిది మండుచుఁ గన్నుల నిప్పులురాల హలంబు కేలఁబూని హస్తినగరంబు సమస్తంబు గంగాప్రవాహంబునఁ గలిపెదనని హుంకరించి నాఁగటి నాగడ్డ పెకలింపఁ బూనుటయుఁ బురంబంతయు భూకంపంబునంబోలె నల్లలనాడఁ జొచ్చె. మిద్దెలు మేడలు దొరలిపడియె. గోపుర ప్రాకారంబులు నేలఁగూలె. జనులు చీకాకుపడిరి. లోకం బాకులత వహించె. నగరంబునందంతయు జనకోలాహలం బొక్కటియై దిక్కులఁ బిక్కటిల్లె. నేల యొడ్డగెడవయ్యె. ప్రజలు తడఁబడునడల గుంపులుగుంపులై హాహాకారంబుల దుర్యోధనునగరుఁ డాసి మొఱలుపెట్టసాగిరి. అప్పుడు పౌరవృద్ధులు క్రుద్ధుండైన బలరాముచేత సర్వంబు దుర్యోధనున కెఱింగించి ప్రజావినాశమునకు నీ రోషపౌరుషంబులుఁ గారణంబుఁ గానీయకుము. నీ కతంబున నగరంబంతయు నేటిపాలు కానున్నది. ఈగోల నీకుఁ దప్పదు. పుత్రికతోడ సాంబుం గొనిపోయి ముసలికి నర్పింపుము. పూజింపుము; ప్రజల బ్రదికింపుము. కౌరవనాథా! దీన నీకుఁగల గౌరవహాని యేమియు లేదు అని ప్రార్థించిరి. అప్పుడు సుయోధనుండు హలి కృతికిఁ బ్రతికృతి చేయనేరక సాలంకృతయగు లక్షణతోడ సాంబుఁ గొనివచ్చి ముసలి కర్పించె. బలరాముఁడును వధూవరులఁ దోడ్కొని ద్వారవతి కరిగి యావద్వృత్తాంతంబు కృష్ణాదుల కెఱిఁగించె.

## — వజ్రనాభ వధ —

వజ్రపురీనాథుండైన వజ్రనాభుండను దైత్యుండొకండు బ్రహ్మం గూర్చి ఘోరతపంబుఁ గావించినఁ బరమేష్ఠి యతనికిఁ బ్రత్యక్షంబై వరంబెయ్యది వేఁడెదవనిన నా దైత్యేశ్వరుండు దేవతలచే నవధ్యత్వంబును, దన పురంబునఁ దన యనుమతిలేక గాలియైనను జొరరాకుండునట్లును, వరంబులు గోరె. ఆ వరంబులొసంగి బ్రహ్మ యంతర్ధానంబందెను. వజ్రనాభుం డిట్లు వరంబులుగోరి స్వపురంబు ప్రవేశించె. అతని ప్రాపున ననేక దైతేయులు వజ్రపురి నావాసంబుగఁ జేసికొనిరి. అంత వజ్రనాభుండు వరగర్వంబున నుత్తుండై ప్రజల బాధింపసాగి, యొకనాఁ డింద్రునిం జూసి మనమిరువుర మొక్క తండ్రి బిడ్డలము; మన మిరువురము లోకపాలనంబుచేఁ దగ సమ్మతము. ఇన్ని దినంబులు నీవొకఁడవ యేకాధిపత్యంబు వహించి పాలించితివి. ఇఁక నన్నుఁ బాలింపనిమ్ము లేదేని సంగరంబునకు రమ్ము. అనిన నింద్రుండు బృహస్పతితో మంతనంబుండి యిట్లనియె. దైత్యేంద్రా నీవు సత్యము చెప్పితివి. మన మిరువురము మన తండ్రి యాజ్ఞ చొప్పున వర్తించు టురవుగదా. జనకు నడిగిరమ్ము. ఆయన యెట్లు చెప్పిన నట్లు వర్తింపఁగలవాఁడను. అనిన శక్రు వచనంబులువిని యా వక్రచరిత్రుండు తండ్రికడకుం జని తనకు నింద్రునకు జరిగిన సంభాషణంబు తెలంగఁజేయంగించిన నమ్మహాత్ముండిట్లనియె. ఇప్పుడు నేను యజ్ఞదీక్ష వహించియున్నవాఁడను. ఈయజ్ఞంబు ముగియుడు నేను మీ దాయభాగంబు పరిష్కరించెద. అంతవరకు నీ పురంబున సుఖంబుండుమనిన నతండును వల్లె యని చనియె.

అంత బలాంతకుండు కంసాంతకు నంతికంబునకు, జని వజ్రనాభు దుండగంబు నెఱింగించె. కృష్ణుండును మాతండ్రి వసుదేవుండిప్పు డశ్వమేధంబు గావించుచున్నవాఁడు. వీనిని విడిచి నేను రా రాదు. ఈ క్రతువు సాంతమైన నతని మట్టుపెట్టెద. అంతవఱకు నతని పురంబు ప్రవేశించుమార్గము విచారించుచుండుము. అతని యను

మతిలేక యాపురంబు చొరరాదుకదా యనినఁ బురుహూతుండును హవిర్భాగంబులఁ గొనిచనిరి.

వసుదేవు యజ్ఞకాలంబున భద్రుడను నటుఁ డొకఁడు తన చిత్రచాతుర్యంబుఁ జూపిన మునులెల్ల సంతసించి వరంబుఁ గోరుమనిరి. ఇంద్ర కృష్ణ ప్రేరితుండునునై యతఁడు వాగ్దేవి జిహ్వాగ్రంబున వర్తింప నిట్లు కోరెను.

మహాత్ములారా! నాయందు మీకుఁ బ్రీతిగలదేని నా కోరిన వరంబులిండు. నేను ద్విజులకెల్ల భోజ్యుఁడ నగుదునుగాక. సప్తద్వీపంబులందు నాకప్రతిహతసంచారశక్తి గలుగుఁగాక. ఆకాశగమనంబు నాకనివార్యంబగుఁగాక. చరాచరంబులకు నే నవధ్యుండ నగుదునుగాక. సద్యోజితుఁడు జీవితుఁడు మృతుఁడు వీరిలో నెవరి వేషంబైనఁ దలంచినంతమాత్రన ధరించు శక్తి కలుగుంగాక. జరారోగభయము నాకు లేకుండుఁగాక యనిన మునీంద్రు లట్లగాకయని వరంబు లిచ్చిరి.

ఆవరంబులంగొని యా నటుండు భద్రాశ్వకేతుమాలకాలాంప్రమద్వీపంబులందును దక్కుఁజోటులను నిచ్ఛావిహారంబుఁగావించుచు ద్వారకకుఁ బర్వదినంబుల వచ్చుచు బోవుచునుండు. అంతట నింద్రుం డొకనాఁడు స్వర్గలోకనివాసముచేయు ధార్తరాష్ట్రజాతిహంసలఁగని యిట్లనిరి. ఖగోత్తములారా! మీరును మేమును గశ్యపసంతతివారమగుట సోదరులము. మీరు విమానసాధువాహములగుట కీర్తికరమేగాని దాన మీకేకొఱంతయులేదు. మనము సమాన సుఖదుఃఖులము. ఇప్పుడు మీరు శత్రువధరూపకమైన యుపకారమును దేవతలకుఁ జేయవలయును. ఇది రహస్యముగ నుంచవలయును. ఈ యాలోచన వెలిపుచ్చెదరేని తీక్ష్ణదండమునకుఁ బాలుపడుదురు. ఓహంససత్తములారా! లోకమున మీకుఁ జొరరాని చోటులులేవు. వజ్రనాభపుర మన్యులకు దుష్ప్రవేశము. బ్రహ్మవరంబుబలంబున దాని నెవ్వరు చొరఁజాలరు కావున మీరు వాడుక చొప్పున నప్పురంబుఁజొచ్చి యంతఃపురసరోవరంబులఁ గ్రీడించుచు

చూపఱుకన్నుల కుల్లాసంబుఁ గల్పింపుఁడు. వజ్రనాభునకుఁ బ్రభావతి యను నొక కూఁతురు గలదు. ఆచంద్రవదన కిపుడు పరిణయ సమయము. దాని యిష్టము వచ్చినవరుని వరింపవచ్చునని బంధువులెల్ల సమ్మతించి యున్నవారు. మీ తియ్యఁదనంబు పేరిమి నేరిమి మెఱసి దానితోడి నెయ్యంబు సంపాదించికొని ప్రద్యుమ్నుని గుణంబులు దానికి వర్ణించిచెప్పి యది యాకృష్ణనందనునందు బద్ధానురాగ యగునట్లు చేయుఁడు. అట్లయిన యమ్మత్తకాశిని చిత్తవృత్తివృత్తాంతంబుఁ జిత్తజాతుని కెఱిఁగించి యాయన కానారిపైఁ గోరిక లిరికలెత్తఁ జేయుఁడు. వజ్రనాభుఁడు దేవతల కవధ్యుఁడు. కావునఁ దదంశసంభూతులకు వధ్యుఁడగు. దినదినవృత్తాంతంబు రుక్మిణీకాంతునకు నాకు ననుదినం బెఱిఁగించుచుండుఁడు. రహస్యంబు వెలిఁబుచ్చకుఁడని యనిపెను. అవి యప్పటియట్ల వజ్రనాభపురంబుఁ జొచ్చి యంతఃపురంబునఁగల కాసారంబులఁ గేళాకూళులఁ గేళీలోలంబులై విహరించుచు శ్రవ్యనాదంబుల నెసఁగించుచుఁ గంటికింపుగ నెగయుచు నానావిధంబులఁ జరియింప వజ్రనాభుండు వానిఁగని మీరు స్వర్గలోకనివాసులరు గాన మీకు మనుజాలాపంబులు సుందరరూపంబులు దొరకించె. మీ రిఁకఁ బ్రతిదినము నిందువచ్చి యానందంబు మాకుఁ గలిగించుచుండుఁడు. అనుజ్ఞ యిచ్చితినని ననిన నవి సమ్మోదమందిన యట్ల కావించుచుండెను. అవి వచ్చునపుడెల్ల నంతఃపుర కాంతలు వానితో విలాసంబుగఁ గ్రీడించుచుండిరి.

ఒకనాఁడు శుచిముఖి యను హంసంబు ప్రభావతి చేరికి జక్కి యామె తనతో వినోదించుచుండ నేకాంతంబున నిట్లనియె. కుమారీ! మేము పక్షులము. ఏలోకమందైనను మాగమనంబున కడ్డు లేదు. కావున ముల్లోకంబుల మేము చూడని కన్యామతల్లులు లేరు. ఎందఱఁ జూచినను నిన్నుఁ జూచిన యానందము కలుగదు. కావుననే పలుమాఱు నే మిచ్చటికి వచ్చుట. నీ సౌందర్యచాతుర్యభాగ్య సౌభాగ్యాది విభవంబుల నేనేమని కొనియాడుదు. పరిచయ మైన పిమ్మట పొగడుట కైతవమందు వేమో. అట్టిచింత మానుము.

అసత్యమాడిన మాకు రాఁగల లాభమేమి? చకోరాక్షీ! చంద్రుని జూచి చకోరంబు లెట్లు తనియుచుండు నట్లు నిన్నుఁ జూచు మాకుఁ దనివి దీరుటలేదు. చంద్రప్రభావతీ! చంద్రప్రభకుఁ దగిన చంద్రుఁడు దొరకినఁగదా దానిజన్మము సార్థకము. అట్లైతే యంకురితయౌవన వగు నీకును నవమన్మథాకారుఁడు లభింపఁడేని నీగుణములన్నియు నడవి కాచిన వెన్నెలయగు. ఏల నీ వింకను దగినవరుని వరింపకున్న దానవో నేనెఱుఁగను. వయస్సు ప్రవాహమువంటిది. పోవుచుండునే కాని మరలి వెనుకకురాదు. వెన్నెలకాలమున నల్లోనేరేళ్లుగాక యావలఁగలుగునా? జీవితమా క్షణభంగురము. యౌవనమా బుద్బుదప్రాయము. ఆ యల్పకాలమును నాలోచనతోఁ వెడలఁబుచ్చిన సుఖించుటెప్పుడు? సార్థకజీవితమగు టెప్పుడు? నీమనస్సెవ్వనిమీఁదనైన లగ్నమయ్యెనో లేదో నే నెఱుంగఁగాని నేను జూచినంతలో నీ కీడు జోడు సరిసాటిగ నన్నివిధములఁ జెప్పఁదగిన వాఁడొక్కఁడు మాత్రము కానవచ్చుచున్నాఁడు. వానిని నీవు వింటివో లేదో. నీ మనస్సింకను వరాన్వేషణమునకు ప్రాలుకుండునపుడు నే నావిషయము ప్రస్తావించరాదు. అనినఁ బ్రభావతి యిట్లనియె. ఖేచరేశ్వరా! నీ రూపమెంత నిర్మలమో నీమనస్సంత నిర్మలము; నీరూపము నా నేత్రంబుల నెట్లానందింపఁ జేయుచున్నదో నీపలుకులు నా హృదయంబు నట్లానందింపఁ జేయుచున్నది. నా తండ్రియు బంధువులు స్వయంవరస్వాతంత్ర్యము నాకిచ్చినను దేవదానవదైత్యనిర్జర కుమారులెందఱో వచ్చుచుఁ బోవుచుండినను నొకరైన నా కానందమును గలిగించు రూపరేఖావిలాసప్రముఖ్యమ్నాదులు గల వారుగారు మనస్సొల్లనివారిని వరించి ఫలమేమి యని యూరకున్న దానను గాని పరిణయమునకు విముఖను గాను. అన్నిట నాకుఁదగిన పురుషుండు లోకంబునఁ గలిగెనేని చెప్పుము. నీమాట చొప్పున నడచుకొనెద. నీవు నా హితము కోరువాఁడవని యెఱుఁగుదును. అనిన శుచిముఖి యిట్లనియె. బాలా! నీకుఁ దగినవాని నామధేయంబు నీవే వచించితివి. వానికి నీవు సతివగునట్లు బ్రహ్మసంకల్పము

కాంబోలు. త్రిజగన్మోహన రూపదీపితుండగు సాక్షాన్నారాయణుండు లక్ష్మీవల్లభుండు కృష్ణుండు ద్వారకానగరంబున నున్నవాఁడు. లక్ష్మీదేవియే రుక్మిణియనుపేర జనించి యాయనకు మహిషియయ్యె. యీనయవతిమన్మథుం డగుమన్మథుండు వారికిఁ గుమారుండై జనించె. అట్టి దంపతులకు సుతుండైన యీ మారకుమారుండు రూపసౌందర్యధైర్యస్థైర్యపరాక్రమ కలగుణశీలంబుల నెట్టివాఁడై యుండునో నీవే యూహింపుము. అతండు దేవతలలో దేవత. దానవులలో దానవుఁడు. మనుష్యులలో మనుష్యుఁడు. పుట్టినంతఁ దన్ను నేడవ నాఁడె శంబరుఁడు ముచ్చిలించి కొనిపోయి సముద్రంబున వైచిన లబ్ధజీవుండై పెరిగి తుదకు వానిమాయలనెల్ల నేర్చి వాఁడెఱుంగని మహామాయయు గ్రహించి యతనిని మట్టుపెట్టె. అట్టివానికి దేవదానవమర్త్యు లేటి లెక్క.. అనిన ప్రభావతి యిట్లనియె.

శుచిముఖీ! నా మనోగతంబు వినుము. విష్ణుండు దైత్యలోకాంతకుండు. అతండు మానుషవేషంబున భూమియం దిప్పుడున్నవాఁడని నారదుండు మాతండ్రితోఁ జెప్పుచుండ వింటిని. శంబరవధాదికము వినియున్నదానను. ప్రద్యుమ్నజన్మచరిత్రము తద్బలపరాక్రమరూపసౌందర్యాదులు విన్నదానను. కాని యసురకులంబునకు నాగర్భశత్రువగు వాని నేను వరించుటెట్లు? వరించితి నేనియుఁ దమకెల్ల వేఱు విత్తగువానిఁ దల్లిదండ్రులు బంధువులెట్లు సమ్మతింతురు? వారుసమ్మతించిరిపో శత్రువుకన్యను నన్నా నవమన్మథుండేల వలచు? వలచినను తద్బంధువులు సమ్మతింతురా? ఇట్టి సందేహములకుఁ బాలుపడి యుయ్యేలలూఁగు మనంబుతోఁ దత్తరించుచున్నదానను. కామము కాలుని దెసకు లాగుచున్నది. బంధుభీతి వెనుకంజవేయఁ ప్రేరించుచున్నది. అంతకు నుత్తముఁడననేల తుల్యుండును దేవదానవాదులందు నెందును గనరాడు. బంధుప్రీతికై మణిని బాఱవైచి గాజుపెంకు నెట్లు స్వీకరింతు? బంధుభీతినంతఃకరణమునకు విరోధముగ వర్తించి యీ జన్మాంతంబు దుఃఖంబున నెట్లు మునుఁగుదు! నన్నాసుందరుండు వలచినను వలవకున్నను నే నాయనను వలచియున్న

దానను. నా భావం బాయకకు నెఱింగించు వెరవుగానరాక పరిత పించుచున్న దానను. భారతీవాహనమా! నీవు నాసఖివి. హితకాంక్ష గలదానవు. చతురమతివి. ప్రియభాషిణివి. ఉపాయశాలినివి. కావున నిన్ను నావిషయమున దూతంగఁ బంపుచున్న దానను. నాయందుమనికర మగు కనికరము గలదేని యరిగి యాయనకు నాచిత్తవృత్తి నెఱింగించి నాయందు ప్రేమ యంకురింపఁజేయుము. అనిన శుచిముఖి యిట్లనియె. చారుహాసినీ! చింతింపకుము. నీగుణంబులు నుదారభావంబు రతీ కాంతున కెఱింగించి నీయంతికంబునకు నతనిఁ దోడితెచ్చెద. కార్యంబు సఫలంబు గాఁ గోరెద వేని నేను గథాకుశలనని నీతండ్రితో నావిషయమై ముచ్చటింపుము. అనిన నయయు మెచ్చుకొని యామెయు నట్లు కావించె. అంత వజ్రనాభుండు హంసాంగనం గని మరాళీమ తల్లికా! నీవు నింతకథలు వార్తలు చెప్పుటయందుఁ గడు ప్రోడవని మాప్రభావతి యెఱింగించె. ఏమేమి వింతలు కంటివి చెప్పు మనిన నదియు నిట్లనియె.

అసురసత్తమా! సర్వదా లోకసంచారము చేయు నేను జూచిన వింత లెన్నియో కలవు. అందొకటి రెండు వాక్రుచ్చెద. సుమేరు పర్వత ప్రాంతమున శాండిలియను సాధ్వీమణి యత్యాశ్చర్య కార్యంబులఁ జేయుచుండఁ గంటిని. మఱియు నామె యుమకు సఖియై లోకహితకారిణియై వర్తించుచున్నది. మునిదత్తవరుండైన యొక నటుం డుత్తర కురుభూములందును భద్రాశ్వ కేతుమాలాది ద్వీపంబు లందును నిట్టిదట్టిదని వాక్రువరాని చిత్రంబులఁ జూపుచుండఁ గంటిని. అతండాకాశంబునసంచరించుచు ముల్లోకంబుల కాహారంబు గల్పించు. కామరూపియై యథేచ్ఛము విహరించు. దేవగంధర్వ నృత్యంబులు గానంబులతండెఱుంగు. నృత్యప్రభావంబున దేవతల నతిశయించు ననిన వజ్రనాభుం డిట్లనియె.

హంసీ! నీవు చెప్పినవార్త చారణ గంధర్వులు చెప్ప నేనును వినినవాఁడన. వానిని జూడఁ గుతూహలమగుచున్నది. వాఁడిందేల రాఁడో యనిన హంస కులావతంసమిట్లనియె.

చిన పురుషుండు ముల్లోకంబుల నెట్టివాఁడైనను నాకు వశుఁడగును. ఆ వరప్రభావంబున నాకోరిన వరుఁడు లభించె. అతండు దేవతామూర్తిగాని రక్కసుండుగాఁడు. దేవతలు ధర్మానురక్తులు. రాక్షసు లధర్మాసక్తులు. అధర్మంబు కొంతకాలం బభ్యుదయంబు గనిననుఁ జియుంపకపోదు. ధర్మం బుత్తరోత్తరాభివృద్ధిఁ గను. ధర్మంబు జయించునుగాని యధర్మంబు జయింపదు. అదియునుగాక యిట్టి దివ్యసుందరుండు మన యసురవిసరంబులం దెందును లేఁడు. అని వివరించిన నా యువతులను సప్పా! యట్లైన నీవు మా కామంత్రం బుపదేశింపుము. ఇట్టి సుందరులు మఱియుఁ గలరేని నీ ప్రియునడిగి చెప్పుమనినఁ బ్రభావతియు వల్లెయని ప్రద్యుమ్నుతోడ నాలోచించి గదసాంబుల పేర్లు సోదరుల కెఱింగించి మంత్రముపదేశించె. ప్రద్యుమ్నుండును దన మాయాబలంబున గదసాంబులఁ జంద్రవతి గుణవతుల సౌధంబులఁ జేర్చె. అంతఁ జంద్రవతి గదుని గుణవతి సాంబుని వరించి వినోదక్రీడలఁ దేలి యాడుచుండిరి. ప్రభావతి తండ్రిం బోలు కుమారుఁ గనియె. మాసాంతరము చంద్రవతి చంద్రప్రభుఁడను కుమారుని గుణవతి గుణవంతుఁడను పుత్రునిఁ బ్రసవించిరి.

ఆ బాలురు దినదిన ప్రవర్ధమానులై కొన్ని హాయనంబులకు సౌధోపరిభాగంబులను బురంబునను సంచరింప నుపక్రమించి మీ రెవ్వరని పౌరు లడిగినఁ దమ తల్లిదండ్రుల నామధేయంబులఁ బేర్కొనుచుండిరి. ఆ వార్త వజ్రనాభుండు విని యాగ్రహోదగ్రుఁడై యుగ్రునవలె మండిపడి యాదవుల నిగ్రహింప విగ్రహంబునకుం దొడరి యంతఃపురంబుల మూఁటిని ససైన్యుండయి ముట్టడించె. అప్పుడు ప్రద్యుమ్నుండు ప్రేయసిం గదసి కాంతారత్నమా! నా కిప్పుడు విషమకాలంబు ప్రాప్తించె. ఇప్పుడు మన యంతఃపురంబుల నరికట్టి మమ్ము నుక్కుపెట్ట సమకట్టినవాఁడు తండ్రి. రణంబున వాని మరణంబు నిశ్చయంబు అది నీకు శోకకారణంబగు. కయ్యంబునకుఁ దొడరకున్న మాకును మీకును బాలురకును ముప్పు తప్పదు. ఏమి చెప్పెదవు. మామగారని మన్నింతునా? పగతుఁడని మన్నికొందునా? యనిన నయ్యశస్విని యిట్లనియె.

ఇందు సందేహింపఁ గారణంబు లేదు. జనకస్నేహంబుకంటె భామలకుఁ బతిస్నేహంబు మెండు. ఇరువురకుఁ బోరుగలిగినపుడు సాధ్వి మగనిపక్షమున నిలుచునుగాని జనకపక్షమున నుండదు. ఇది సత్యము. ఉషా చరిత్రంబు స్మరింపుము. రణంబున నీకు జయంబు సిద్ధంబు. నా కుమారుం డీ రాజ్యమునకుఁ బ్రభువగుటయు భవితవ్యము. ఇది దైవనియతమని మున్నె యెఱుంగుదుముఁ గావున నీవును జంకుకొంకుకొనక నిశ్శంకంబుగ సంకంబునకు నుంకింపుము. ఇదె నే నాశీర్వచనపూర్వకంబుగ నొసంగు కరవాలము. దీన నరాతులఁ బోరిపుచ్చుము. అని జయంబు గలుగ దీవించి యనిపె. చంద్రమతి గుణవతులును నట్లె వచించి ప్రాణంబులంబోలు తమ భర్తలకు గృపాణంబు లొసంగిరి.

అంతఁ బ్రద్యుమ్నుండు యుద్ధసన్నద్ధుండై సాంబసహితుండైన హంసకేతుం గని మీ రీయంతఃపురంబుల ముట్టడించిన కట్టిడి రక్కసులతోఁ బోరుచు స్త్రీజనంబులను బాలురం గావుఁడు. నే నంతరిక్షగామినై రాక్షసులతోఁ బోరెదనని నిజమాయాకల్పితంబును ననంతనాగసారథికంబునగు రథంబెక్కి ప్రభావతీ చిత్తంబు ప్రమోదాయత్తంబుగ రణరంగమధ్యంబుఁ జొరంబాఱి శత్రువుల నేలకుం గోలకుం దెచ్చుచుండె. ఈ సమరకోలాహలం బెఱింగి యింద్రుండు మాతలిపుత్రుండు సువర్చుండు సారథిగాఁ దన రథంబు గదునకును ప్రవరచోదితంబైన యైరావతంబును సాంబునకును బనిచి ప్రద్యుమ్నునకు బాసటై నిలువ నిజకుమారు జయంతు ననిచె.

యదుకుమారులకు వజ్రనాభప్రముఖులకు మహాహవంబు సంఘటిల్లుట విని గరుడవాహనారూఢుండయి శక్రసమేతుండయి కృష్ణుండు జన్యతలంబున కరిగి పాంచజన్యంబు రిపుసైన్యంబు దైన్యంబు నొందఁ బూరించిన, దన తండ్రి రాక యెఱింగి ప్రద్యుమ్నుండు చని నమస్కరించి నిలిచె. కృష్ణుండును రౌక్మిణేయుం గని నీవు కార్ష్ణ్యారూఢుండవై యరాతిఁ బోరిగొనుమనిన నతం డింద్రోపేంద్రులకుఁ బ్రణమిల్లి గరుడు నెక్కి యుక్కుమిక్కుటంబుగ వజ్రనాభుపై గవిసె.

ఆ యిరువురకు రోమహర్షణంబైన యుద్ధంబు సంఘటిల్ల నందుఁ బిత్రుదత్తసుదర్శనాయుధంబునఁ బ్రద్యుమ్నుండు పగతు మస్తకంబుఁ దునిమె. వజ్రనాభు సోదరుండు కృష్ణునిచేఁ గవిసి హతుండై పోయె. అంత శక్రచక్రులు వజ్రనాభ రాజ్యంబు జయంతు సుతుండు విజయు నకును, ప్రద్యుమ్న సాంబ గద కుమారులకును నాలుగు సమభాగ ములుగఁ బంచియిచ్చి యభిషేకమొనర్చిరి. ఇంద్రుండు జయంతుతోడ దివంబున కరిగె. కృష్ణుండు ప్రద్యుమ్నాది కుమారులతోడను ప్రభావతిమొదలగు కోడండ్రతోడను మహోత్సవంబున ద్వారకకుఁ జనియె.

ఒకనాఁడు యాదవులెల్ల జలక్రీడా వినోదంబులఁ దవిలి మత్తులై వర్తిల్లుతఱి నిదియు సమయంబని వజ్రనాభు సోదరుండు సునాభుండు తనయన్న పగదీర్ప ద్వారకఁజొచ్చి భానుపుత్రి భాను మతియను కన్యకను హరించి కొనిపోయె. అంతఃపురకాంత లెల్ల హాహాకారంబుల నయ్యుదంతంబు రుక్మిణీకాంతున కెఱింగించిరి. వాసుదేవుండును బ్రద్యుమ్నార్జున సహాయుండై యతండు పుర రంబుఁ జేరులోన ముట్టి యచ్చోటరక్కసుతోఁ బోరిరి. అతండును బాలికను విడువక నానావిధంబుల నానా మాయలు పన్ని నానా దేశంబులు దిరిగి శ్రమపడియెను గాని తుదకుఁ గృష్ణునిచే హతుండై మడిసె. అనల భానుమతిని సుఖంబుగ ద్వారకకుంగొనివచ్చి కృష్ణుండు భానున కర్పించె. ఈ భానుమతియే సహదేవు భార్యయయ్యె.

---

## మాహాత్మ్య లీల.

ఒకనాఁడు ప్రద్యుమ్నసాంబ చారుభాను గదాది యదుకుమా రులు విహారేచ్ఛం దవిలి యొక వనంబున ముదంబునఁ జాలఁ గాలము కేళీలోలురై సంచరించి దప్పిగొని నూతులు వెదకుచుంబోవ నొక పాడు బావియందుఁ బర్వతాకారముగల యూసరవెల్లింగని యుల్లం బున వెల్లిగొను కనికరంబు వెల్లున దాని వెడలఁదీయ సమకట్టి

యా జెట్టులు తమ సత్త్వంబంతయుఁ జూపి లాగిన సమ్మోహనసత్త్వంబు గదలకున్న నచ్చెరువున రిచ్చపడి యా ముచ్చట నమద్వి యచ్చరుం డగు శ్రీకృష్ణునకుం దెలిపిరి. ఆ సర్వజ్ఞుఁడును నచ్చోటికిఁ జెచ్చెర విచ్చేసి దాని నెడమకేల దిగిచి వెలుపలవైచిన నప్పుణ్యశ్లోకు కరస్పర్శంబున నది దివ్యాభరణ దివ్యవస్త్ర మాల్యాదుల ధరించి సూర్యతేజంబున రాజిల్లుచు దివ్యపురుషుండై నిలిచినఁ దద్వృత్తాంతంబు నంతయుఁ దా నెఱింగియు నతనిమహిమ దక్కినవారి కెఱిఁగింపఁ గోరి యాయనతో నిట్లనియె.

మహానుభావా! నీవెవ్వరు? దివ్యపురుష భవ్యాకారంబు ధరించియుండియు నా హేయపు రూపునఁ గుందుచుండిన కారణ మేమి? వినిపింపుమనిన నప్పురుషుం డప్పరమపురుషునకు నమస్కరించి యిట్లనియె.

విజ్ఞానమయా! సర్వజ్ఞుండవయ్యు నజ్ఞునివలె నన్నడుగుట నా చరిత్రంబు నానోరఁ జెప్పించు తలంపున నేకదా. నీ యనుగ్రహమునకుఁ బాత్రుఁడనై పవిత్రుఁడనై ధన్యుఁడనై లోకంబున మాన్యుఁడ నైతి నా దానంబు నేను జెప్పుట యాత్మశ్లాఘయగుఁ గావునఁ జెప్పరాదు. నీ యానతి యలంఘనీయము కావునఁ జెప్పెద.

జగత్పతీ! క్షితిపతినై నేను గ్రహపతి వంశంబున జనించితి. నా పేరు నృగుడందురు. ప్రఖ్యాతదాతల నామంబులందు నా నామధేయంబును నీకుఁ గర్ణగోచరమగునంతటి భాగధేయము కలదయియే యుండు. సర్వభూతాత్మసాక్షివై జగన్నాథుండవైన నీకుఁ దెలియరాని దేదిగలదు? అయినను నీ యాజ్ఞ శిరసావహించి నేనొనర్చిన కార్యంబుల విన్నవించుకొనెద. లోకంబున నిసుకరేణువు లెన్నియో యాకాశంబునఁ జుక్కలెన్నియో వర్షధార లెన్నియో యన్ని పాఁడి కపిలజాతి యావులను బంగరుకొమ్ములు వెండిగిట్టలు, గలిగి శీలరూపగుణోపపన్నంబులగు వానిని, ప్రాయంపు వానిని, దూడలతోడ గుణశీలవంతులును, కుటుంబభారపీడితులును సత్యవ్రతులునై తపము వేదము బ్రహ్మతేజము నౌదార్యముగల యువద్విజులకు దానమిచ్చి

తిని. అంతియగాక భూదానము, హిరణ్యదానము, గృహదానము, నశ్వదానము, గజదానము, శయ్యాదానము, కన్యాదానము, తిలదానము, రూప్యదానము, వస్త్ర రత్న రథ దానములు గావించి యిష్టాపూర్తంబులును గావించితిని.

ఇట్లు చేయుచుండ నొకపరి మున్ను నేను బ్రాహ్మణునకు దానమిచ్చిన యొక యావు మందనుండి తప్పించుకొనివచ్చి నా మందలోఁ గలసెను. మందమతినై దానిం గనిపెట్టక దానిని మఱియొక బ్రాహ్మణునికి దానమిచ్చితిని. ఆ ధేనువును దోలుకొని దానము గొన్న విప్రుండు తన యావును వెదకుచు వచ్చి యది తనయావని గుర్తించి దానిం గొనిపోవుచున్న బ్రాహ్మణునిం గని యిది నా యావు దీని నీవేల దొంగవై హరించికొని పోవుచున్నాఁడవు. ఈ గోవును నాకు రాజు దానమిచ్చెనని చెప్పెను. నన్ను దూషించెదవేల? దీనిని నృపాలుఁడు నాకీవి యొసఁగఁ గొనిపోవుచున్నాఁడను. ఇది నీయది యని మొండికలహమునకుఁ గడఁగితివేల? యని రెండవ బ్రాహ్మణుం డనెను. ఈ విధముగ వారి కిరువురకుఁ బ్రబలకలహ మయ్యెను. వా రిరువు రా యావును దోలుకొని నాయొద్దకు వచ్చిరి. అందు మొదటి భూసురుం డేమయ్యా రాజా! యీ యావును నీవు నాకు దానమిచ్చితివా లేదా? దీనిని వీఁడు దొంగతనముగాఁ దోలుకొని పోవుచు నేనిది యేమి యనఁగ నడుగ నీవు దుడుకు నాకు దానమిచ్చెనను చున్నాఁడనెను. రెండవ ధరామరుండు రాజా! యిప్పుడు నీవు నాకు దీనిని దానమిచ్చితివా లేదా? నీవు నాకు నిచ్చిన దానిని వీఁడు తనది యనుచున్నాఁడనెను. నేను బొరపడుట తెలిసికొని నా ప్రమాదము వారి కెఱింగించి యయ్యా నేను నీకిచ్చిన యావు నా మందలోఁ గలియుట తెలియక యీయనకు మరల దానమిచ్చినమాట సత్యము. నీకొక లక్షధేనువుల నిచ్చెద దీనిని విడుమనియు నన్ను దత్తాపహార కారణంబున నరకంబునఁ ద్రోయకుమనియు మొదటి బ్రాహ్మణుని బ్రార్థించితిని. నాకు న్యాయముగ దానమిచ్చిన దిది యొకటి చాలును. లక్షధేనువులు నాకేల? ఇచ్చిన

దీని నిమ్ము. ఇయ్యకుండిన లేదు పొమ్మని నరకముపాలై పొమ్మనెను. రెండవ విప్రుండు నట్లే యనెను. ఇట్లు వారిరువురు చిత్తంబుల మెత్త వడక హత్తిన కోపంబున నాయావు నందే విడిచిపోయిరి. ఆవలఁ గాలాంతరమున నేను గాలాంతికమునకు బోయితిని. అప్పుడు యముఁడు నన్నుఁగని రాజేంద్రా! నీవెంతయుఁ బుణ్యముచేసిన వాఁడవు, దత్తాపహరణదోష మొండుమాత్రము నీయందుఁగలదు. ఆ పాపఫలము స్వల్పమగుట దానిఁ దొలుత ననుభవించి పిదపదీర్ఘ కాల స్వర్గసుఖము ననుభవింపుము. నీ వీపాపంబున నధోలోకం బునఁ బడుమని నన్నుఁ ద్రోచె. నే నధోలోకమునఁ బడుచు ను నర వెల్లిరూపుఁ గైకొంటి. నాఁడుమొదలిందుఁ బడియున్నవాఁడ. నేఁడు నీ కృపాకటాక్షమునకుఁ బాత్రుఁడ నగుట నా నీచజన్మము పాసిచనె. బ్రాహ్మణకులమందు సాధువర్తనుఁడను, దాతను, నీ దాసుఁడను, నీదర్శనము గోరుచుండువాఁడనునగు నాకుఁ బూర్వజన్మస్మృతి యిప్ప టికిఁ జెడకున్నది. యోగీశ్వరు లుపనిషల్లోచనముల నిజ హృద యాంతరాళముల వీక్షించు నధోక్షజా! నీవు నాయట్టివాని కట్టులు లోచనగోచరుఁడ వైతివోకదా. ఆహా! యేమి నాదుర్లభలాభము. అవును. నీ వెవరికి సంసారనాశం బొనర్చి యుద్ధరింపఁ గోరెదవో! వారికి గోచరింతువు. దేవదేవ! జగన్నాథ! గోవింద! పురుషోత్తమ నారాయణ! హృషీకేశ! పుణ్యశ్లోక! యచ్యుత! యవ్యయ! కృష్ణా! దేవమార్గంబునఁ బోవ నన్నుజ్ఞ నిమ్ము. నే నెందున్నను నా డెందంబు ముకుందా! నీ పాదారవిందంబులనే మందిరంబుగఁ దిరంబుగఁ గొన ననుగ్రహింపుము. సర్వభావుండవును బ్రహ్మమును ననంత శక్తియుఁ గృష్ణుండును, వాసుదేవుండును యోగిపతియునగు నీకు నమస్కారంబులు. అని పలికి నృగుండు శ్రీకృష్ణునకు వలగొని యాయన చరణంబులఁ దన శిరంబు మోపి నమస్కరించి యానతి గొని విమానమెక్కి యందఱు చూచుచుండఁ జనియె.

బ్రహ్మణ్యదేవుండగు దేవకీ నందనుండు రాజ హితబోధా ర్థంబు తన్నుఁ జుట్టియున్న పరిజనంబుల కిట్లు హిత ముపదేశించె,

సీ. నరనాథకుల కాననము దహించుటకును
నవీనసురులవిత్త మగ్నికీల
జననాయకుల నిజైశ్వర్యాబ్ధి నింకింప
బ్రాహ్మణక్షేత్రంబు బాడబంబు
పార్థివోత్తముల సంపచ్ఛైలములఁ గూల్ప
భూసురధనము దంభోళిధార
జగతీవరులకీర్తి చంద్రిక మాప వి
ప్రోత్తముధనము సూర్యోదయంబు

తే. విప్రతతి సొమ్ము కంటెను విషము మేలు
గరళమునకును బ్రతికృతి గలదు గాని
దాని మాన్పంగ భువి నౌషధములు లేవు,
గాన బ్రహ్మస్వమును గొంట గాదు పతికి.

కం. ఎఱుఁగమిన్నైనను భూసుర
వరుల ధనంబపహరింప వలవదు పతికిన్
మఱపున ననలము ముట్టిన
దరికొని వెసకాల్పకున్నె తనువెరియంగన్, భాగ.

అని యుపదేశించి యందఱుఁ దోడ్కొని గృహంబున కరిగె,

## సూర్యగ్రహణసమయంబున శ్రీకృష్ణుండు బంధువులతోఁ గురుక్షేత్రమునకుఁ బోవుట.

రామకృష్ణులు ద్వారకయందుండు సమయమునఁ బ్రలయకాలమందువలె సూర్యుఁడు గానరాకుండునట్టు సర్వగ్రాససూర్యగ్రహణంబు సమీపించె. దానిరాక గని వారు సకలబంధుపరివృతులై స్యమంతపంచకమునకు లోకమును బ్రవర్తింపఁజేయ స్నానార్థులై యరిగిరి. పరశురాముండు క్షత్రియుల నెల్లర వధించి రాజరక్తంబున నైదుమడుఁగు లిందే కదా ముందు కల్పించె. క్షత్రవధనైన పాపంబు తన్నంటకున్నను భగవంతుండగు భార్గవరాముఁడు లోక

శిక్షణార్థంబు నితరపాపహరణార్థం బన్యజీవులవలె నింను యజ్ఞంబు గావించె. ఈ మహాతీర్థయాత్ర సలుపుటకై రామకృష్ణులతోడ యాదవు లక్రూర వసుదేవోగ్రసేనాదులు తమతమపాపముఁ బాపు కొనఁ గురుక్షేత్రంబునకుఁ బయనించిరి. అట్లులే భరతఖండమం దలి యనేక పుణ్యస్థలంబులకు నానారాజులు పోయిరి. గదప్రద్యుమ్న సుచంద్రశుక సారణ సాంబానిరుద్ధసహితుండై యూథపతియగు కృత వర్మ ద్వారకాపుర రక్షణార్థంబు నిలిచె. యాదవులెల్లరు వస్త్ర భూషణాలంకృతలైన సతులతోడ రథనాగాశ్వ శకటాది యానంబుల దిక్కులు వెలుఁగఁ బయనించిరి. ఇట్లు సని గ్రహణకాలంబున స్నాన మొనర్చి విప్రులకు ధేను దానాదు లొసఁగి యెల్లరుపవసించిరి. ఆవల నెల్లవారు మరల మోక్షస్నానం బాచరించి కృష్ణభక్తిమాకు స్థిరపడుఁగాక యని తలంచుచు మరల దానంబు లొసంగి కృష్ణదేవ తాకులైన కృష్ణవంశజులు తదనుజ్ఞగొని భుజించి చల్లని చెట్టునీడల హాయిగఁ గూర్చుండిరి.

వారు దానంబు నిదానంబుగ నరుదెంచిన నందాది మిత్రులను, బంధువులనుసంబంధులను జిగోత్కంఠితలైన గోపికలనుగోబాలురను మత్స్య కేకయకౌసల్యవిదర్భకురుసృంజయ భూపాలురను, గం భోజ మద్రకుంతి రాజులను నానర్తక కేరళభూభుజులు లోనగు వారిని స్వపక్షులపరపక్షులఁ గాంచిరి. పరస్పరసందర్శన జనితహర్ష వేగంబున వికసితవదనారవిందులై నేత్రంబులఁ బ్రమదాశ్రువులు గాఱ మేనులు పులకరింప సంతోషంబున నన్యోన్యంబు కౌఁగిలించుకొని కుశల ప్రశ్నాదుల సంతసిల్లిరి. మదవతులును ముదిత హృదయలై యతి సౌహృదంబున నొండొరు చూచి కుంకుమపంక సంకలితంబులైన చనుగుత్తు లొండొంటి నొత్తుకొన గాఢాలింగనంబుఁ గావించి చిఱునవ్వ కడగంటఁ దొలంకుచుండఁ బ్రమదాశ్రువులు కార్చిరి. పెద్దవారికి నమస్కరించి పిన్నవారిని నాశీర్వదించి స్వాగతంబు ప్రశ్నించి కుశలం బడిగి యావలఁ గృష్ణచరిత్రము లొకరికొకరు చెప్పుచుండిరి.

అంతఁ గుంతియు సోదరులను వారిబిడ్డలను భగినులను దల్లిదండ్రులను వదినె మఱఁదండ్రను ముకుందునిఁ గాంచి పరస్పర సల్లాపంబుల శోకంబు విడిచి యన్నయగు వసుదేవుం గని యిట్లనియె.

అన్నా! పురుషసత్తములైన మీరు విపత్సంతోత్తరువుల నలజడిఁబడు నాఁగతి మఱిన్నైన స్మరింపమిని నేను కృతఘ్నురాలఁ గానని తలంచెద. అది మీదోషమును గాదు. పుత్రమిత్రభ్రాతృలును దైవోపహతులైన పుత్రమిత్రభ్రాతృలను దలిదండ్రులను స్మరింప కుంచుట వింతగాదు. అనిన వసుదేవుం డిట్లనియె.

అమ్మా! భగవంతునిచేతి కీలుబొమ్మలవంటి మాపై నేల కోపించెదవు? ఈ లోకమంతయు నీశ్వరవశంబై కార్యములుచేయును; మఱి చేయించును. కంసుని హింసలఁ దాళలేక మే మందఱము దేశభ్రష్టులమై దిక్కులవెంటఁ బాఱిపోయి యిప్పుడిప్పుడె మరల నిల్లు వాకిలి చక్కఁ గూర్చుకొనుచున్నారము. అట్టి చెట్టదశయందు నిక్కట్టులుపడు మేము నిన్నెట్లు విచారింపఁగలము? అని చెల్లెలి నూరార్చె. వసుదేవోగ్రసేనాది యదుప్రముఖులు కృష్ణసందర్శనార్థులైవచ్చి తల్లాభంబునఁ బరమానందం బనుభవించు రాజులనెల్ల నుల్లమలరఁ బూజించిరి. భీష్ముఁడు, ద్రోణుఁడు, ధృతరాష్ట్రుఁడు, పుత్రయుక్తయగు గాంధారియు, సభార్యులైన పాండవులు, కుంతి, సంజయుఁడు, విదురుఁడు, కృపుఁడు, కుంతిభోజుఁడు, భీష్మకుఁడు, నగ్నజిత్తు, పురుజిత్తు, ద్రుపదుఁడు, శైబ్యుఁడు, ధృష్టకేతుఁడు, కాశిరాజు, దమఘోషుఁడు, విశాలాక్షుఁడు, మైథిలుఁడు, మద్రకేకయులు, యుధామన్యుఁడు, సుశర్మ, పుత్రసహితుండైన బాహ్లికుఁడు లోనగువారును ధర్మరాజు ననుసరించిన యితర రాజులును, సస్త్రీకులై శ్రీధామంబైన దామోదరు దేహలక్ష్మిం గాంచి యబ్బురపోయిరి. వీరందఱు రామకృష్ణులచేఁ బూజితులై హర్షమగ్నులై వారి నాశ్రయించియుండు యాదవుల నిట్లు ప్రశంసించిరి.

ఆహా భోజరాజా! ఏమి మీ యదృష్టము. మనుష్యులందు మీజన్మమే ధన్యము. యోగులకును వశపడని దుస్సాధ్యుని సర్వ

కాలములందుఁ గన్నులకఱవుదీఱఁ గాంచుచున్నారు. ఎవని కీర్తిని నుతించు వేదంబులును, నెవ్వని పాదప్రక్షాళన జలంబైన గంగయు శాస్త్రరూపంబైన యెవ్వని వాక్కులు లోకంబులఁ బవిత్రంబులు సేయుచుండఁ గాలక్రమంబున దగ్ధసారంబైన భూమియు నెవ్వని పాదపద్మంబుల సోఁకున మరల శక్తిమంతమై మీ యభీష్టంబులెల్ల వర్షించుచుండు నట్టి విష్ణుండు సంసారమార్గంబునఁ బడి చరించుచు మీకు బంధువై మీ యింటఁబుట్టి, సదా మీకు దర్శనమిచ్చుచు, మీలోఁ గలసి మెలసి తిరుగుచు, శయనించుచు, భుజించుచుఁ, దాఁకుచు, మీ కన్నివిధముల సుఖములు గలిగించు చున్నవాఁడు, ఇంతకంటె శ్రేయస్కరం బెద్దిగలదు? అని యిట్లు ప్రశంసించుచుండు సమయంబునఁ గృష్ణాదు లచ్చటి కరుదెంచిన వార్తవిని నందగోపుఁడు గోపాలక సమేతుఁడై శకటంబులపై నెక్కి యచ్చటికి వచ్చె. ఇట్లరుదెంచిన నందుం గని యానందంబున యాదవబృందంబు లెల్ల బోఁయిన ప్రాణంబులు మరలవచ్చిన దేహంబులవలెనై చిరకాలమునకుఁ జూచిన వారగుటఁ దొట్రుపాటునలేచి గాఢంబుగ నాయనను గౌఁగిలించిరి.

వసుదేవుండును దాను గంసునిచే పడిన పాటులెల్లను, గంస భయంబునఁ బుత్రుల గోకులంబున నందునొద్ద నిల్లడ యుంచుటయు స్మరించి యాపత్కాల బాంధవుఁడైన నందునిఁ బ్రేమవివ్వలుఁడై బిగ్గ నాలింగనంబు గావించె. రామకృష్ణులును దల్లిదండ్రులకు నమస్కరించి వారిని గౌఁగిలించికొని బాష్పంబులు కంఠంబు నడ్డగింప డగ్గుత్తికపడి నేమియుఁ బలుకఁ జాలరైరి. మహాభాగయగు యశోదాదేవియు నందుండును నా కుమారులఁ దొడపైఁ గూర్చుండఁ బెట్టుకొని యిరుగేల నాశ్లేషించిరి.

ఇట్లు సుతులఁ బరిరంభించి యశోద చిరకాల పుత్రి విరహ తాపంబుఁ బాసె. రోహిణియు దేవకియు వ్రజేశ్వరియైన యశోదను గౌఁగిలించి యామె చూపిన మైత్రియుఁ జేసిన యుపకారంబును స్మరించి స్నేహబాష్పములు జాలుగఁ గార్చి యిట్లనిరి.

వ్రజనాయకీ! దీర్ఘకాలంబైనను గొంచెమైనను గొలుతవోని మీ మైత్రిని నెవ్వతె మఱచును? మీ రొనర్చిన మహోపకారమునకు మీ కింద్రలోక మిచ్చినను మాఋణ గాఁజాలదు. తమ తల్లి దండ్రుల నెఱుఁగని యీ బాలురు మీయొద్ద నిల్లడ యుండిన కాలములో మీరే తల్లిదండ్రులగై పెట్టి పోసి కాచి లాలించి పెంచి పెద్దచేసి కన్నులకు ఱెప్పలవలెనై భయమెట్టిదో యెఱుఁగనీక స్వపర తారతమ్యములేక రక్షించితిరి. మీ యుపకృతికి మేమేమి ప్రతికృతి చేయఁగలము. మీవలనకదా మేము పుత్రవతుల మైతిమి. అని ప్రేమరసం బుట్టిపడఁ బలికెను.

గోపికలు తమకుఁ బ్రియతముఁడైన కృష్ణునిఁ జిరకాలమునకుఁ జూచి నిరంతర నిరంతరాయ దర్శనంబునకు విఘ్నముగఁ గన్ను ఱెప్పల సృజించిన బ్రహ్మను నిందించుచుఁ జూపులచే హృదయస్థుఁ డుగఁ జేయఁబడిన హరిని గాఢముగఁ బరిరంభించి యందఱును నిత్యయోగయుక్తు లగువారికిని దుస్సాధ్యమగు తాదాత్మ్యమును బొందిరి. అట్లు ప్రేమచేఁ బరవశలైన గోపవనితాగమనలఁ గృష్ణుం డేకాంతమునఁ జేరి కౌఁగిలించి కుశలమడిగి చిఱునవ్వు తొలఁకాడ నిట్లనియె. సఖులారా! స్వజనకార్యము సాధింపఁ జని శత్రుపక్ష క్షయంబుఁ జేయఁ దలపెట్టి చిరకాలము తడసిన మమ్ము నెన్నఁడైన స్మరింతురా? ఇదె వచ్చెదమని చెప్పిపోయి మరల రారైరి. వీరెంతటి కృతఘ్నులని శంకించి మమ్ము గోపించుచున్నారా? మేఘములను, తృణములను, దూదిపోగులను, ధూళిని వాయు వొక్కెడఁగూడ వీడఁజేయునట్లు దైవమును భూతముల గూయఁబాయఁ జేయుచుం డుట సత్యము. ప్రాణికోటికి నాయందలి భక్తియే ముక్తికారణము. నన్నుఁ బొందింపఁ జాలుభక్తి మీ యదృష్టమున మీకు నాయందు దృఢముగఁ బొందుపడియె. భూత శరీరములకు భూజలాగ్ని వాయ్వా కాశంబులవలె సమస్త భూతములకుఁ దుద మొదలు నేనయై లోపల వెలుపల వర్తింతు. అంగనలారా! యీ విధముగనే దేవాది శరీరాత్మకమైన యాకాశాది భూతములందును, జీవాత్మనం

దును నేను లోపల వెలుపల వ్యాపించియుందు. చేతనము లచేతనములను రెండును జడ చిద్విలక్షణుండ్డైన యక్షరుండ్డైన నాయందుండుట గనుఁగొనుఁడు. ఈ విధముగ గోపిక లధ్యాత్మ విద్యయందుఁ గృష్ణ శిక్షితలై యాపుండరీకాక్షు స్మరించుచుఁ గోశమువలె నాదరించియుండు కర్మమూలమైన యజ్ఞానమును విడిచి క్రమమున ముక్తిం బొందిరి.

స్వాత్మపరమాత్మలయాథాత్మ్యవిషయజ్ఞాన ముపదేశము గొని గోపికలు కృష్ణుంజూచి పద్మనాభా! తమ హృదయంబుల నగాధబోధులైన యోగీశ్వరులు ధ్యానించునవియు సంసార కూపంబునఁ గూలినవారొడ్డు చేర నిచ్చెన యగునవియు నగు నీ పాదారవిందంబుల స్మరణం బామరణాంతము మేము సంసారులమై గృహంబుల వర్తించుచున్నను మా మానసంబుల నిలువఁజేయుమని కోరిరి.

ఇట్లు నిజ పాదారవిందాను సంధానంబు తమ డెందంబులఁ బొందుపడఁ జేయఁగోరిన యా సుందరాంగుల ననుగ్రహించి యావలఁ జని ముకుందుండు కుంతీనందనుని సర్వమిత్రులను గుశలంబు ప్రశ్నించె. ఇట్లు లోకనాథుండైన రుక్మిణీనాథుండు తమ్ముఁ బ్రశ్నించి గౌరవింప వారెల్లరు హృష్ట మనస్కులై తచ్చరణారవిందావలోకంబున నిహతపాపులై యిట్లనిరి.

అజ్ఞాన హారంబును, సజ్జనముఖ నిర్వృతంబును; నగు భవత్పాదాంబుజామృతంబును నెప్పుడే నించుక క్రోలు దేహధారులకే యశుభం బభావమనిన భవత్పదకోకనదంబులఁ బ్రత్యక్షంబుగ దర్శించిన మాకు నశుభం బెట్లు కలుగఁగలదు.

పరులకై స్వకృతంబైన సృష్టిస్థితిలయములను మూఁడవస్థలను స్వతేజంబునఁ బోనణఁచి నిరతిశయానంద సంయుక్తుఁడవై పరిపూర్ణుఁడవై సర్వజ్ఞుఁడవై కాలక్రమంబునఁ జెడిన వైదిక ధర్మంబును బునరుద్ధారంబుసేయ సంకల్పమాత్రంబున సమర్థుండవయ్యు భక్తవాత్సల్యంబున సౌశీల్యంబున యోగమాయను నాశ్రయించి మనుష్యాకారంబునఁ దోఁచుచుఁ బరమహంసగతియైన నీకు నమస్కారంబులు.

అని యిట్లుత్తమశ్లోక లోకశిరోమణియగు యదుకులమణి నంతయుఁ బ్రశంసించుచుండ యాదవ కౌరవ నారీమణులు గుమిగూడి యొకరికొకరు గోవిందు కథలు చెప్పుచుండిరి. అందుఁ బాంచాలి కృష్ణపత్నులను గని యిట్లనియె. ఓ వనితలారా! యో రుక్మిణీ! యో భద్రా! యో జాంబవతీ! యో సత్యా! యో మిత్రవిందా! యో రోహిణీ! యో సత్యభామా! యో కాళిందీ! యో లక్ష్మణా! యో కృష్ణభార్యలారా! తన మాయచే లోకమువారి విడంబించు నించువిలుకాని జనకుండు మిమ్మెట్లు పాణిగ్రహణం బొనర్చె, దాని వినవలతును వినిపింపుఁ డనిన రుక్మిణి యిట్లనియె.

పాంచాలీ! శిశుపాల జరాసంధాదులు చాపబాణపాణులై శ్రేణులై నన్నుఁ గాచుచుండ వాసుదేవుండు వారి తలలఁ దన పాదతల రేణువులు నిలువఁజేసి నిజభాగంబు హరింపనెంచిన యజంబుల గజవైరివలె నలవోకగాఁ దోలి తన సొమ్మయిన నన్నుఁ బరిణయం బయ్యె. అట్టి శ్రీనివాసునందునా హృదయం బనయంబు స్థిరంబై యుండుఁగాక యనిన సత్యభామ యిట్లనియె.

ద్రౌపదీ! సోదరవధకై తపించు మా తండ్రి మణినిమిత్తమై తన యనుజుని రామానుజుండు పొరిగొనెనని దూఱిన నా యపవాదంబు నివారింప వారిజనాభుండు జాంబవంతుని గెల్చి మణి తెచ్చి మరల మా తండ్రికిచ్చె. పదపడి సత్యం బంతయు నెఱిఁగి యస్మజ్జనకుండు భీతుండై నన్నితరుల కిచ్చునట్లు మాట చెప్పియుండియు శ్రీకృష్ణునకిచ్చి వివాహంబు గావించె. అనిన జాంబవతి యిట్లనియె.

కృష్ణా! తన్నేలిన సీతాపతియే యీ యాకృతిఁ దాల్చివచ్చె నని యెఱుఁగక నా జనకుండు జాంబవంతుఁ డిరువదియేడు దినంబులు కదనంబొనర్చి జితుండై యెఱిఁగి కానుకగ నన్నును స్యమంతకరత్నంబును వాసుదేవునకు నొసఁగె. దానంజేసి నే నాయనకు దాస్యం బొనర్చు భాగ్యంబుగలిగె. అనినఁ గాళింది యిట్లనియె. కళ్యాణీ! నిజచరణసేవాకాంక్ష నేను దపంబుసేయుచుండుట యెఱిఁగి యర్జున సహితుండై యర్జునభంజనుం డచ్చటికివచ్చి నన్నంగీకరించుటంజేసి

యాయనగృహము సమ్మార్జనము చేయుచుండుము. అనిన భద్ర యిట్లనియె.

ద్రౌపదీ! నాస్వయంవరవార్త విని మాపురంబునకు వచ్చి తన భాగంబైన బలిని నాశించు గ్రామసింహంబున సింహంబువలె నన్నుఁ గైకొన గుమిగూడిన భూపతులనెల్లర జయించి శ్రీపతి నన్నుం ద్వారకకుఁ గొనిపోయె. తదీయ పాదకమల ప్రక్షాళనభాగ్యంబు నాకు జన్మజన్మంబున లభించుఁగాక యనిన సత్య యిట్లనియె.

రాజుల బలంబుఁ బరీక్షింప నస్మజ్జనకుండు బలిష్ఠంబులైన బలీవర్దంబుల నేడిటి జయించినవానికి నాకన్యక నిత్తునని చాటింపించె. వీరగర్వనిర్వాపణసమర్థంబులైన యా కోడెలను బాలుఁడు మేఁకపిల్లల నీడ్చునట్లులీడ్చి యీ మహానుభావుండు క్రీడయవోలె వానిని వధించె. ఇట్లు వీర్యశుల్క యగునన్ను దాసికలతోడను జతురంగసేనలతోడను మార్గమధ్యంబున నరికట్టిన శాత్రవుల నిర్జించి కొనిపోయె. అట్టి యీ పురుషోత్తముదాస్యంబు నాకు నెడతెగకుండుఁగాక. అనిన మిత్రవింద యిట్లనియె.

పాండవపత్నీ! మాతండ్రి తన మేనమామ కుమారుఁడైన వాసుదేవునకు నన్ను దాసీజనముతోడను, నక్షౌహిణీసేనతోడను నేను గృష్ణాయత్త చిత్తనగుట నెఱిఁగి యర్పించె. పుణ్యపాపకర్మంబులచే సంసారసాగరంబున దపించు నాకు శ్రేయస్కరంబైన యాయన పాదదాస్యంబు జన్మజన్మంబున సమకూరుఁగాక. అనిన లక్ష్మణ యిట్లనియె.

నారదుఁడు కృష్ణగీతంబులు పాడ విని మిత్రవిందవలెనే నేనును నాచిత్తంబుఁ గృష్ణాయత్తంబుఁ జేసితిని. లోకపాలకుల నెల్ల ధిక్కరించి శ్రీమహాలక్ష్మి యెవ్వని చెట్టపట్టెనో యట్టి మహాపురుషు నేను వరించట యేమివింత. సాధ్వీ! నాయభిప్రాయం బెఱింగి దుహితృవత్సలుండగు నాతండ్రి బృహత్సేనుం డొకయుపాయంబు పన్నె. నీకై పార్థుని రప్పింప మీజనకుం డెట్లు కల్పించె నట్లు మాతండ్రియు మత్స్యయంత్రంబు నాకాశంబుగ వేలుదానిఁ గల్పించె. మీ

తండ్రికల్పించిన మత్స్యయంత్రంబు వెలుపలికి గానవచ్చుచుండె. ఇది వెలుపల లోపలం గూడం గానరాదు. దాని ప్రతిబింబము మాత్రము స్తంభమూలముననుండు నీటం గానవచ్చును. ఆ ఛాయను జూచి యంత్రంబును పడగవేయవలయు. ఆ స్వయంవరమునకు ననేక రాజు లస్త్రశస్త్రధరులై వచ్చిరి. మాతండ్రియందఱం దగురీతి గౌరవించె. స్వయంవర దినంబున రాజులు కొందఱు యంత్రముం పడగవేయ నుంకించిరిగాని కొందఱెత్తనే లేరైరి. ఎత్తినవారు నారి లాగ లేరైరి. లాగినవా రెక్కుపెట్ట లేరైరి. ఎక్కుపెట్టినవారు శర సంధానంబుం జేయంజాలరైరి. మగధాంబష్ఠ చేదిరాజులును భీమకర్ణ దుర్యోధనులును విల్లెక్కుపెట్టిరిగాని లక్ష్యముం బరికింపలేరైరి. అర్జునుఁడు మాత్రము మత్స్యచ్ఛాయం జూచి లక్ష్యము గ్రహించి బాణ ప్రయోగంబుం గావించెంగాని యది యంత్రమును భేదింపలేక మిట్టి పడియె. ఇట్లు లందఱు భగ్నాశులై మరలిపోవం గృష్ణుండు చాపం బెక్కిడి యొక్కసారి యటం జూచి యవలీల యంత్రంబును నభిజిల్లగ్నంబున నరలం ద్రోచె. అప్పుడు దేవదుందుభులు మొరసె. పుష్పవృష్టి నెరసె. జనుల కోలాహలంబు బెరసె. అంతట నేను నూతన దుకూలంబుం గట్టి తోఱుమునం బువ్వులు దుఱిమి యరాళ కుంతలంబులు ముఖంబున వ్రేలం గెంపుల కాంతులు గండ ఫలకంబులం దళుక్కునం గేలం గనకోజ్జ్వలమాలిక ధరించి చరణ నూపురంబులు రవళింప, వదనకమలంబున దరహాసంబు భాసింప రాజులు నిలువు చూపుల వెల్లనిమోములం జూడ మందయానంబునం బోయి ముకుందు కంఠంబుఁ గేలిమాలిక నలంకరించితి. ఆ వీరోత్తముఁడును దారుకుండు తెచ్చిన తేరిపై నన్నెక్కించికొని ద్వారకాభిముఖుండై పయనించె. భగ్నాశులైన రాజులు రోషరసనిమగ్నులై యాయనను దాఁకినవారి నెల్ల నిమిషంబున ననిమిషవంశ్యులఁ భంగించె. మాతండ్రియు ననేక దాసికలతోడను సేనలతోడను నన్ను నాయప్రతిహతదర్పున కర్పించి వివాహంబు గావించె. ఇట్లు మేము నందనందనునంద మనంబు నిల్పి సర్వసంగపరిత్యాగంబు గావించి తపంబు

సల్పి యాత్మారాముఁడైన శ్రీ ధామునకు గృహదాసికల మైతిమి. అనిన షోడశ సహస్రభార్య లిట్లనిరి.

నఱకుండైన నరకుండు దుర్విచారుండై క్రూరంబుగఁ గారా గృహబద్ధలఁ గావించిన మమ్మీ చతుర్భుజుం డాదురాత్ము ససైన్యంబుగ వధించి ముక్తలం గావించె. ఘోరసంసార కారాగార మోక్షంబుఁ గోరితచ్చరణ స్మరణంబు గావించు మమ్మాయవాప్త కాముండువరించె.

సతీతిలకమా! మేము సామ్రాజ్యమైనను స్వారాజ్యమైనను దైవరాజ్యమైనను, బ్రహ్మపదమైనను కైవల్యమైనను గోరువారము గాము. లక్ష్మీకుచలికుచ కుంకుమపంక పరిమళ భరితంబైన విందు త్మాను పాదపద్మ రేణువుల శిరంబున ధరించువారము. గోపికలును బృందావనంబునందలి లతలు, తృణములు గోవులు గోపాలకులు నే మహాత్ముని పాదస్పర్శంబును గోరుచుందురో దానినే మేమును సహో రాత్రము కోరువారము.

అని వారలు వచించుటయు వారి భక్తిరస పూర్ణవాక్యములు విని గాంధారియు ద్రౌపదియు సుభద్రయుఁ గృష్ణభక్తులైన గోపిక లును, రాజభార్యలును, భగవంతునందు వారికిఁగల భక్త్యతిశయముఁ గాంచి యానందకందళిత బాష్పబిందు సందోహలై యచ్చెరువున డెందంబులు మఱచిరి.

ఇట్లు మగవారు మగవారితోడను, మగువలు మగువలతో డను, సంభాషించుచుండ రామకృష్ణ సందర్శనోత్సుకులై వ్యాస నారద చ్యవన దేవలాసితులును, విశ్వామిత్ర శతానంద భరద్వాజ గౌతములును, సశిష్యుఁడైన పరశురాముఁడును వసిష్ఠుండును గాలవ భృగులును బులస్త్యకశ్యపాత్రి మార్కండేయ బృహస్పతులును, ద్వితత్రితైకతులును, బ్రహ్మపుత్రుండగు సంగీరసుండును, నగస్త్య యాజ్ఞవల్క్య వామదేవాదులును నరుదెంచిరి.

లోకవందితులైన వారిరాకఁ గని కూర్చుండియుండిన నృపా లురును బాండవ రామకృష్ణులును లేచి నమస్కరించిరి.

రాను సహాయుండైన కృష్ణుండు వారినెల్ల సముచితసపర్యలం బూజించి కుశలంబడిగి యర్ఘ్యపాద్య ధూప మాల్యానులేపనంబు లొసంగి యర్హాసనాసీనులం గావించి సుఖోపవిష్టులైన వారిం గాంచి సభ్యులెల్లవారు విన నిట్లనియె. దేవతలకు దుర్లభంబగు యోగీశ్వర దర్శనంబు కతంబున మేము నరజన్మమెత్తినఫల మంతయుం గంటిమి. అవాప్తకాంక్షులమైమంటిమి. ధన్యులమని యంటిమి. జన్మమనిన మాదే జన్మము. ఏలయందురేని యర్చారూపంబులు దేవతలని తలంచు నల్ప తపస్కులమైన మాకు మీ దర్శనస్పర్శన పాదవందన కుశలప్రశ్నాది లాభంబు ఘటిల్లె. జలమయంబులైన తీర్థంబులును, మృచ్ఛిలామయంబులైన దేవతా రూపంబులును, మీవలె ముఖ్యంబులుగావు. ఏలన నవి దీర్ఘకాలంబునకుం గాని ఫలంబొసంగవు. సాధువుల దర్శనంబు సద్యః ఫలప్రదంబు.

సూర్యచంద్రులైనను భూజలాకాశ వాయువనంబుల యధిష్ఠాన దేవతలైనను, చిరకాలముపాసించినం గాని పాపము లణపంజాలరు. సాధువులో ముహూర్తమాత్రంబున నణప సమర్థులై యుందురు.

వాతపిత్త శ్లేష్మాత్మకంబై శవప్రాయంబైన శరీరంబునందు నేనను బుద్ధియు, భార్యాదులందు నావారను బుద్ధియు, మృణ్మయాది విగ్రహంబులందు దేవతాబుద్ధియు, జలంబులందుం దీర్థబుద్ధియు నుంచి సాధువులయెడ నట్టిబుద్ధియుంచనివాఁ డెద్దో గాడిదయో యగుననిన నకుంఠబుద్ధియగు వైకుంఠువాక్యంబులు విని యీయన యేమి యిట్లు విపరీతంబులు పలుకుచున్నవాఁడని భ్రమసి యేమియుం బలుకంజాలక కొంతవడి యూరకుండి మరల నాలోచించి మునులు లోకంబునకు సాధుపూజా శ్రేష్ఠత్వంబు నహినిందాన్యాయంబున బోధింప నిట్లు పలికెడినని గ్రహించి చిఱునవ్వుతోడ నా జగద్గురున కిట్లనిరి.

విశ్వస్రష్టలైన బ్రహ్మాదులకు నధీశుండవైన మహానుభావా! తత్త్వమెఱింగినవారిలో మేము శ్రేష్ఠులమయ్యు భవన్మాయామోహితులమై లోకసంగ్రహార్థంబు పలుకుచున్నావని యెఱుంగ లేమైతిమి.

స్వేచ్ఛమై గూఢంబుగ మానుషవేషంబు ధరించిన నిన్నుఁ దెలియఁ జాలమైతిమి. ఆహా! భగవచ్చేష్టితం బెంత చిత్రంబు. ఈశ్వరా! యొక్కండవును కర్మాయత్తచేష్టారహితుండవును నయ్యు మన్నొక్కటియు కుండ, మూకుడు, చట్టి, బాన, గాబు, యని యనేక నామంబుల ననేక రూపంబుల నొప్పునట్లు నీవు వేఱు సాహాయ్య మపేక్షింపక యీ విశ్వంబును సృజింతువు, పాలింతువు, పొలియింతువు కాని యందు బంధంబులం దగుల్కొనవు. ఆహా! నీ మనుష్యచేష్టానుకరణం బతివిస్మయావహంబు. అట్లుండియుఁ బరమపురుషుండవగు నీవు సాధువులను భక్తులను రక్షించుకొఱకును, దుష్టుల శిక్షించుకొఱకును, శుద్ధసత్త్వమయంబైన రూపంబు ధరింతువు. స్వాచారంబైన సనాతన వేదమార్గంబు బ్రోతువు. ఆ కారణంబున వర్ణాశ్రమాచార యుక్తంబైన దేహంబుగలవాఁడ వగుదువు. వేదంబు నీ పరిశుద్ధాంతరంగంబు. అవ్వేదంబువలనఁ గదా తపోధ్యయన వర్ణాశ్రమానురూపధర్మంబులను సాధనంబులచేఁ గార్య కారణములకును, శరీరాత్మలకును బరంబైన బ్రహ్మంబు తెలియఁబడు. కావున శాస్త్రప్రమాణకుండవైన నీకు శేషభూతంబును, నుత్తమ స్థానంబును, వేదంబుల కాధారంబునగు బ్రాహ్మణ కులంబును గారవింతువు. ఆ కారణంబుననే నీవు బ్రహ్మణ్యులం దగ్రగణ్యుఁడవు. కావున నీకీ చర్య జనసంగ్రహార్థంబు.

సాధువులకు గతివగు నిన్నుఁ గనుగొనుటచే మా జన్మంబులు విద్యయుఁ దపస్సు నేత్రంబులు సఫలంబులయ్యె. నీ సంగమంబె కదా శ్రేయస్సులందెల్ల నుత్కృష్టంబు. భగవంతుఁడవును గృష్ణుఁడవును, నకుంఠమేధయు, నిజయోగ మాయాచ్ఛన్నమహితుఁడవు పరమాత్మవునగు నీకు నమస్కారంబు. ఈ రాజులును సహవాసులైన యాదవులును, గాలాత్ముఁడవగు నీశ్వరు, మాయయను తెఱచాటున నున్నవానిని, నిన్నుఁ దెలియఁజాలరు. దేహమే తన్నుఁగా నెంచువాఁడు నిద్రించుసమయంబున స్వప్నంబునఁ దన్నుఁ బొందిన రూపంబులఁ గని తన్ను నామరూపసహితుంగాఁ దలంచుఁగాని నామాది

రహితుండగాఁ దలంపఁ జాలఁడు. అట్టులే మేలుకొన్నవాఁడును, నింద్రియ వ్యాపార లోలుఁడై నీ మాయచే భ్రమగొన్న చిత్తము గలవాఁడై యాత్మజ్ఞాన స్మృతి చెడి నిన్నుఁ గనఁజాలఁడు. ఎందు జనించిన గంగాతీర్థంబు పాపంబుల హరించు, నవని భక్తియోగంబునఁ బక్వంబైన మనస్సుగలవారికి హృదయంబుల సాక్షాత్కారంబగు నట్టి నీ పాదంబుల నేఁడు గంటిమి. భక్త్యతిశయంబుచేత వాసన లను జీవకోశంబులను బాసి పూర్వులు నీ పరమపదంబుఁ బ్రాపించిరి. కావున భక్తుల మగుమమ్ము ననుగ్రహింపుము.

అని యిట్లు కృష్ణు నభినందించి ధృతరాష్ట్ర ధర్మజాదులవలన వీడు కోలు వడసి పోనున్న సమయంబున వసుదేవుండు వారిచే బోధితుండై వారినే ఋత్విజులంగా వరియించి యొక యాగంబు యథావిధి గావించె. అందు దానమానస బహుమానాదుల నెల్లరుఁ దృప్తులై యెవరి గృహంబులకు వారు పోయిరి. నందాదులు దిన ప్రయాణములు సేయ రేపు పోదు మాపు పోదుమని వసుదేవాదులు జరప మఱి మూఁడునెల లందుండి యావల గోపికా గోపాలురతోడ మథురకుం బోయిరి. కృష్ణాదులు ద్వారక కరిగిరి.

## రామకృష్ణులు తల్లి పనుపున నామె మృత పుత్రులం దెచ్చి చూపుట.

దేవకీదేవి పూర్వము తమ పడిన పాటులును గంసుండు తమ్ము బాధించిన తెఱఁగు తలపోయు సమయంబున నతఁడు వధించిన తన చిన్నికుమారులు స్మరణమునకు వచ్చుటయు వెచ్చని కన్నీరు గార్చి శోకహతచిత్త యయ్యె. తల్లి యాకులపాటు రామకృష్ణులు విని యామెఁ జేర నరిగి తల్లీ! యేమిటికి దుఃఖించెదు ? మేము నీకుఁ గుమారులమైయుండ నీ కెట్టి కొఱంతయుఁ గలుగునే ? ఎట్టివాఁడైనను దల్లిదండ్రుల కోరిక దీర్పఁ గలిగియుఁ దీర్పక వారు దుఃఖించుచుండ మిన్నక చూచువాఁడు మనుష్యుఁ డెట్లగు ? నీ కొఱంత యెట్టిది తెలుపుము. మమ్ముఁ బని గొమ్మనిన నాయమ్మ యిట్లని

కమ్మున నిట్లనియె. నాయనలారా ! మీయట్టి మహానుభావులు పితృభక్తిరతులు సాధుగతులు నుతచరితులు సుతులై యుండ మాకంద ఱాని కోర్కు లుండునే. హింసారిరంసుండు కంసుండు నృశంసుండై వినసించిన మీ యన్నలఁ దలంచి పలవరించెద. ఆ మాంసాద కల్పుండు వారిని బురిటింటనే పొరిగొనె. వారి ముద్దుమోములు నేఁటికిని గన్నులఁ గట్టినట్లున్నవి. ఒకసారి వారిచిన్ని మోములు విలోకింప నాశయయ్యెడి. ఇది దుష్కరంబని యెఱుంగుదు. అయినను గురుపుత్రునిం దెచ్చిన మీకిది యొక గొప్ప కార్యము గాదు. అని ప్రథమ పుత్రస్నేహ మెఱుకపడఁ బలికిన తల్లి పలుకులు విని యా యున్నదమ్ము లీమాత్రమ్మునకా శోకించెదవని యూరడించి తరలి చని వారు సుతలంబున నుండుట యెఱింగి యోగమాయ నాశ్రయించి యచ్చటి కరిగిరి. ఇట్లరుదెంచిన రామకృష్ణులంగాంచి బలి వారు తన దైవతములగుట యెఱిఁగి యెదురేగి వినయంబున నర్ఘ్యపాద్యాదు లొసఁగి వారి పాదవారి శిరస్సునఁ బ్రోక్షించుకొని తోడితెచ్చి యుచితాసనాసీనులం జేసి తన సర్వస్వము నివేదించి సంతోషపరవశుండై వారల ననేకవిధంబుల స్తుతించి దేవా ! మీ దర్శనంబు స్వసామర్థ్యంబునఁ జూతు మనువారికి దుర్లభంబు గాని మీ కృపకుఁ బాత్రులగువారికిఁ గాదు. భవదీయ కృపాకటాక్షవీక్షణంబు నాపైఁ బ్రసరింపఁజేసి యాగమనకార్యం బెఱిఁగించి యా కార్యంబు నాచేఁ జేయించుకొని నన్నుఁ గృతార్థుం జేయుఁడని వేఁడినఁ గృష్ణుఁ డిట్లనియె.

స్వాయంభువ మన్వంతరంబున మరీచికి నూర్ణయందు నార్గురు పుత్రులు గలిగిరి. వారు నలు మోముల వేల్పుంజూచి పరిహసింప మీ రసురులై జనింపుఁడని యాయన వారల శపించె. వారు తొలుత హిరణ్యకశిపు పుత్రులై జనించిరి. తరువాత వారిని యోగమాయ దెచ్చి దేవకీదేవి యుదరంబున నుంచె. వారు భూమిపై జనించి కంసుచే హింసింపఁబడిరి. వారిని జూడఁగోరి మా తల్లి విషాదపడుచున్నది. ఆమె దుఃఖము మాపుకొఱకు మేము వారిని గొంపోవ వచ్చితిమి... 

గోడ్కొని పోయెదము.

ఆవల వారు పాపముక్తులై పుణ్యలోకముల కరుగుదురు. వారు స్మరుఁడు, ఉద్గీథుఁడు, పరిష్వంగుఁడు, పతంగుఁడు, క్షుద్రభుక్కు, ఘృణి యను నీయార్వురు నా యనుగ్రహముచే నాలోకంబున కేగువారు. ఇందు స్మరుఁడు మాకు జ్యేష్ఠభ్రాతయై కీర్తిమంతుఁ డను పేర జనించెను. అని పలికిన నింద్రసేనుఁడును వారిని దెచ్చి రామకృష్ణుల కప్పగించె. రామకృష్ణులు వారింగొని ద్వారావతి కరుదెంచి తల్లికి కొసంగుటయు నామె వారల వాత్సల్యాతిశయంబునఁ గౌఁగిలించె. ఇట్లాశ్లేషించిన యామెకుఁ జన్నులు చేఁపుటయుఁ బాలు గురిసె. ఆమె యాబాలురఁ దొడలపై నిడుకొని శిరంబులు మూర్కొని వారికిఁ జన్నిచ్చి విష్ణుమాయకులోనై మోహవశంబున సంతసించె. కృష్ణుండు త్రావ మిగిలిన స్తన్యామృతంబులను గ్రోలుటను, నారాయణదేహసంస్పర్శంబునను నాత్మపరమాత్మయాథార్థ్యజ్ఞానంబుఁ బడసినవారై దేవకీవసుదేవులకు రామకృష్ణులకు నమస్కరించి సర్వజనంబులు చూచుచుండ నాకాశమార్గంబునఁ బోయిరి. దేవకీదేవియు మృతసుతుల రాకపోకలు చూచి యాశ్చర్యపడి యిది కృష్ణమాయ యని తలఁచె.

### —♦ కృష్ణుండు మైథిలశ్రుతదేవుల నేకకాలంబున నాదరించుట. ♦—

మిథిలానగరంబున శ్రుతదేవుండను బ్రాహ్మణుండు కలఁడు. అతండు కృష్ణభక్తిపరాయణుండై శాంతుండై నిరీహుండై విద్యావంతుండై యదృచ్ఛాలాభసంతుష్టుండై గృహకృత్యంబులు నిర్వర్తించుచుండె. ఆ యూరిరాజు బహులాశ్వుఁడను నాతఁడును విష్ణుభక్తుఁడై యహంకారరహితుఁడై యుండె. తనకుఁ బ్రియులై యేకనగరవాసులైన యిరువుర నాదరింపఁగోరి కృష్ణుండు దారుకుండు తెచ్చిన తేరెక్కి నారదవామదేవాత్రి రాములును, నసితారుణ బృహస్పతులును, నేనును వ్యాసులును, గణ్వమైత్రేయ చ్యవనాదులును, వెంటరాఁ బయనమై యానర్తకురుజాంగలవంగ మాత్స్యపాంచాలకుంతిమధు కేకయకోసలార్ణవంబులును దక్కిన దేశంబులును గడచి యందలి

జనంబులు తనకునోసంగు నర్ఘ్యాదుల నాదరించుచు వారితోడం గుశలప్రశ్నంబు గావించుచుం జనిచని మిథిలంజొచ్చె. ఆయన రాక విని మిథిలాజనంబు లర్ఘ్యంబులంగొని యెదురేగి మునిజనసమేతుండైన పుణ్యశ్లోకుం గృష్ణుం బూజించిరి. బహులాశ్వశ్రుతదేవులును, దమ్ము ధన్యులం జేయ శ్రీకృష్ణుం డరుదెంచుట విని పూజాద్రవ్యంబులంగొని బహుమాన పురస్సరంబుగం జని యా మహామహు పాదంబులపై వ్రాలి నమస్కరించిరి. అంతం దక్కినమునుల నర్చించి పూజించి యిరువురును దనతన యింటికి నాతిథ్య మంగీకరింపం విచ్చేయ నెల్లరం గోరిరి. వారి యభిప్రాయ మెఱింగి యోగేశ్వరుండైన రమేశ్వరుండు వల్లెయని యంగీకరించి యిదె వచ్చెదం బొండని వారిని బంపి యావల నేకకాలంబున నిరువుర యిండ్లకు మునివృతుండై చనియె.

తన మందిరంబునకు విందై యరుదెంచు గోవిందుం గాంచి బహులాశ్వుండు హర్షబాష్పంబులు జడిగొని స్రవింప నందఱకు మేలైన యాసనంబు లర్పించి కూర్చుండంజేసి వారిపాదంబులు కడిగి భువనంబులం బావనంబులు చేయు నాతీర్థంబును దాను భార్యాసమేతుండై శిరంబులం జల్లుకొని గంధమాల్యాదుల నలంకరించి రసవంతంబులైన భోజ్యంబుల నాప్యాయనంబుగ భుజింప నిడియె. ఇట్లందఱు భుజించి లేచిన యనంతరంబు మిథిలేశుండు కృష్ణుని పాదంబుల కడంజేరి మెల్లన నొత్తుచు నిట్లనియె.

సర్వభూతంబులకు నాత్ముండవై సర్వసాక్షివై నిజప్రకాశంబున వెలుంగుచుండు నీకేకాంతభక్తులకంటె బ్రహ్మయు లక్ష్మీదేవియు నాదిశేషుండును నెక్కువగారనుట లోకంబునకుం దెలుప నావీటి కరుదెంచితివిగాని యన్యముగాదు.

ఈ మర్మమెఱింగినవాం డెట్టివాండైనను నీ చరణకమలంబుల నేల పోవిడుచు. సంసారమున మునింగి తాపత్రయంబుల నలయు వారి తాపంబునుబోంగొట్టు కీర్తిని లోకంబున వ్యాపింపంజేసిన కృష్ణా నీకు నమస్కారంబు. నీవే కదా నారాయణఋషి యన వెలుంగు

చుందువు. నా ప్రార్థన మంగీకరించి మీరందఱు నాయింటఁ గొన్ని నాళ్లు వసింపవలయునని వేఁడిన నట్లె కానిమ్మని కృష్ణుఁ డియ్యకొనియె.

శ్రుతదేవుఁడును ఋషివర్యులతోఁ దనగేహంబునకు విచ్చేసిన యమ్మహాపురుషునకుఁ దనశక్తికొలఁది తృణాసనములు దర్భాసనములు, పీఁటలు, సమర్పించి స్వాగతంబు ప్రశ్నించి భార్యాయుక్తుండై యెల్లరకు మ్రొక్కి వారిచరణంబులు కడిగి యాపవిత్రవారి శిరంబునఁ జల్లుకొనియె. ఆవలఁ దనకుఁగల శక్తికొలఁది ఫలములు పరిమళ పదార్థములు సమర్పించి పూజించె. పదపడి సాత్త్వికాహారంబున నెల్లరఁ దృప్తులఁగావించి నా పూర్వపుణ్యంబునఁ గాకున్న వీరందఱు నావంటి యల్పునింటి కేలవత్తురని తన ధన్యత్వమునకు నుప్పొంగుచు భోజనానంతరము వారు విశ్రమించియుండ నాశుద్ధాంతఃకరణుండు కారణపురుషుండైన పుండరీకాక్షు చరణకమలంబుల నొత్తుచు నిట్లనియె.

పురుషోత్తమా! నీ దర్శనంబునఁ గృతార్థుండనైతి. నీ పవిత్ర చరిత్రములు దురితలతాలవిత్రములు. వినువారు, వినిపించువారు, ధ్యానముచేయువారు, గానముచేయువారు, నుతించువారు, వాదించు వారు, నగు నందఱహృదయంబులలోన నీవు సర్వదా వెలుఁగు చుందువు. నీవు సర్వాంతర్యామివై సర్వజనహృదయంబుల నుండు వాఁడవయ్యును గర్మాసక్తులకు దూరంగతుఁడవగుదువు. అహంకార విదూరుఁడ వయ్యు నిన్నుఁ దలఁచు తెలచు కొలుచువారికి నత్యంత సమీపమున నుందువు. దేవా! తావకీన కింకరులము. దేహగత క్లేశములు నీ దర్శనప్రాప్తివలకేకాని యావల నెక్కడివి? అని ప్రార్థించిన దేవదేవుండు వసుదేవసుతుండు శ్రుతదేవు హస్తంబు తన హస్తంబునఁ బట్టుకొని యిట్లనియె. ఓయి విప్రా! యీ ముని రాకాచంద్రుల రాకకు నిన్ననుగ్రహించుటే కారణమని తెలియుఁ గుము. శ్రేయస్కరులగు నీ మస్కరులు తమ పాదరేణువులచే లోకంబును బవిత్రంబుగఁ జేయుచు నాతోఁ దిరుగుచుందురు. మృచ్ఛిలామయంబులైన దేవతావిగ్రహంబులునుబుణ్యక్షేత్రంబులును

గంగాది పుణ్యతీర్థంబులును గాలక్రమంబున దీర్ఘకాలంబునకుం దమ్ము సేవించువారి పాపంబులఁ బాప నోపుఁగాని తత్క్షణము పోఁగ్రోఁపువెట్టఁజాలవు. అంతియగాక యాంశక్తియుమద్భక్తులైన మహాత్ముల దర్శనంబున నే కలుగునుగాని వేఱువిధమునఁ గలుగదు. సర్వప్రాణులలో బ్రాహ్మణుండు జన్మంబుచేతనే శ్రేష్ఠుండు. అట్టివాఁడు తపస్సు, విద్యతుష్టి నాయందుభక్తి గలవాఁడతయ్యేనేని యేమి చెప్పవలయు? బ్రాహ్మణులకంటె నాకీచతుర్భుజంబులు ప్రియంబులు గావు. బ్రాహ్మణుండు సర్వవేదమయుండు. నేను సర్వదేవ మయుఁడను. ప్రతిమలఁబూజించుచుఁ కొందఱు దురహంకారులై విషయంబెఱుంగక బ్రాహ్మణస్వరూపంబున నుండు నన్ను నవమానింతురు.

జంగమస్థావర రూపంబైన విశ్వంబును, దానికి హేతుభూతంబైన మహదాదులును, మదాత్మకంబులగుట నారూపంబులని బ్రాహ్మణుండు చూచుచుండుఁ గావున నీవీ బ్రాహ్మణుల శ్రద్ధాళువై పూజింపుము. అట్లైన నన్నర్చించినవాఁడవగుదువు, అట్లుగాక నా వారలఁ దిరస్కరించి నన్నెంత పుష్కలంబుగ నీవర్చించినను నన్నర్చింపనివాఁడవే యగుదువు. అని యిట్లు కృష్ణబోధితుండై యావిప్రుండు కృష్ణుని ఋషులను నేకభావంబున నర్చించి సద్గతిఁ బడసె. వాసుదేవుండును వారికిట్లు సన్మార్గంబు బోధించి మరల ద్వారక కరుదెంచె.

## కుచేలోపాఖ్యానము.

ఇఁక గుచేలోపాఖ్యానంబుఁ జెప్పెద వినుము. ఇట్టిదట్టిదని తెలియరానట్టి మహిమగల శ్రీ పుండరీకనేత్రు చిత్రచారిత్రంబు వన వన మనమునఁ దనివిలేదు. కామబాణపీడితహృదయుం డయ్యుఁ బరజ్ఞుఁడగువాఁడెవఁడు పుణ్యశ్లోకుండైన హరికథలు పలుమాఱు చెప్పిచెప్పియు వినివినియు నిఁకఁ జాలుననును? హరిగుణ వర్ణన భాష్యకగు వాక్కే వాక్కు; తదీయ పరిచర్యాకరములగు కరములే కరములు; జంగమస్థావరాంతర్వర్తియగు పరమేశు పాదాంబుజములం గూర్చి గమనంబుగలదియే మనంబు. తదీయ పుణ్యకథాశ్రవణం

బులై రవణంబులగు నవియే శ్రవణంబులు. కార్య కరణంబులఁ జరాచరాత్మక ప్రపంచంబు భగవచ్ఛరీరంబని నమస్కారణంబు గావించు ప్రధానాంగంబే ప్రధానాంగంబు; అన్నిట భగవంతుఁగను నవియే కనులు, విష్ణుపురోండెఁ దద్భక్తులనొండె సేవించి వారి పాదవారి నిత్యంబు మీఁదఁజల్లుకొను సంగంబులుగలవియే యంగంబులు

బ్రహ్మవిదుత్తముండు బ్రాహ్మణసత్తముండు కృష్ణసుహృత్తముం డొకఁడు గలఁడు. అతఁడు భగవచ్ఛ్రవాసక్తుఁడై యింద్రియార్థంబులందు విరక్తుఁడై శాంతాత్ముఁడై విజితేంద్రియుఁడై, యదృచ్ఛాలాభసంతుష్టుఁడయ్యు గృహస్థుఁడై యుండెను. ఆయనకు సువ్రతరత పరమపతివ్రత భార్యగలదు. వారికిఁ బెక్కురు పుత్రులు గలరు. దరిద్రునకే కదా భగవంతుఁడు పెక్కుర సుతుల నిచ్చును. ఆ కుచేలుండయాచనాశీలుండు గానఁ గానలకేఁగి దినదినము నేల రాలిన నివ్వరిధాన్యము లోనైన వేఱితెచ్చి భార్యచేతికిచ్చును. ఆ యిల్లాలు వండి పెనిమిటికి బిడ్డలకుఁ బెట్టి శేషముండెనా తాను భుజించును. లేకుండెనా కృష్ణాయని పస్తుండును. అతిథు లేతెంచిననాఁడు బిడ్డలకే కడుపారఁబెట్ట నన్నము చాలకుండును. నోరెఱుఁగని బిడ్డలరకడుపు కుడుపు దిని విస్తరివిడిచి లేవక పోరుపెట్ట నప్పచ్చుల యాశపెట్టియో, కొట్టియో, తిట్టియో, లేవఁదీయుచు దినములు గడపుచుండెను. ఇట్లు దల్లిపడెడు బాధ యా పరమేశ్వరునకే యెఱుక. వీథులవెంట ఫలము లమ్మవచ్చిరా బిడ్డల చెవులు మూయును. నేతికై పోరిడిన సలసలఁ గ్రాఁగు నీరు వేఁడివేఁడి చేయి పట్టకుఁడని వడ్డించును. వ్యంజనము రుచిగనుండిన నెక్కువ తెమ్మనుదురని యుప్పో కారమో యెక్కువ వేయును. వారి యిరుగుపొరుగువారు భాగ్యవంతులు. వారు వారి బిడ్డలకుఁ బట్టువస్త్రములు గట్టి బంగరుసొమ్ములు పెట్టి పప్పు లొడిగట్టి యాడుకో విడుతురు. వారినిజూచి కుచేలు బాలురును దమ కట్టివి తెమ్మని తల్లిని బాధింతురు.

సీ. సన్నంపుఁజీర లాచ్ఛాదించుటయెకాని
తొడుగఁ గోకలులేవు బుడుతలకును

బసినాఁడుకట్టిన పాలపూసలె కాని
పెట్ట సొమ్ములు లేవు బిడ్డలకును
బిడికెఁడుబియ్యంబు పేదగంజియె కాని
త్రాగఁ బాలును లేవు తనయులకును
దట్టంబులైన పత్రపుటంబులే కాని
కుడువ గిన్నెలు లేవు కొడుకులకును

గీ. ఇరుగుపొరుగుననున్న వా రిండ్ల నెల్ల
వివిధమార్గంబులను సిరుల్ విఱ్ఱవీఁగఁ
గుడిచి కట్టెడు శిశువుల గోము లరసి
తల్లి యెట్లోర్చు తనపేదతనమునకును.

సీ. పొరుగుపిల్లలతోడి పురుడున కేమైన
నాటల కిమ్మన్న నాలసించుఁ
బప్పుబెల్లములకై బతిమాలి యేడ్చుచుఁ
గొంగు వా రీడ్చినఁ గుస్తరించు
పాలువెన్నలకుఁగాఁ బ్రామిడి వడిఁ బోరఁ
జన్నిచ్చి కౌఁగిట సంగ్రహించుఁ
బోగు లుంగరము లీపూఁటఁ గావలెనన్న
మాపు తేపని పలుమాఱు బొంకుఁ

గీ. కలిమిలేమి తెలియంగక గడుసువగల
బిడ్డ లింపైన వస్తువుల్ వేడుకొనినఁ
గొంటెతనమునఁ దెమ్మంచు గోరగింపఁ
దల్లి యేమియు ననలేక తల్లడించు. (కుచేలోపాఖ్యా.)

ఈవిధముగ దారిద్ర్యభరంబునఁ దినఁ గూడును గట్ట కోకలును లేక యాఁకట నలయుచు వేదన సొలయుచు, శీలవతి కావున నా సతి గుట్టుగ మలయుచు నేది యడిగిన భర్తమనంబు నొచ్చునోయని జంకుచు, నితరుల నడుగఁగొంకుచుఁ, జింతాసాగరంబునఁ గ్రుంకుచుఁ గాలము గడుపుచుండి యెట్టకేల కొకనాఁడు కూఁసల పోరాటంబు

పడఁజాల కారాటపడి విశ్రాంతిమై యేకాంతంబునఁ గూర్చుండిన నిజకాంతు నుపాంతంబుఁ జేరి బాష్పాక్రాంత నేత్రాంతయై యక్కాంత మెల్లన సవినయంబుగ నిట్లనియె.

ప్రాణేశ్వరా! యొక మనవి. నా సాహసంబు క్షమించెదనని వాగ్దానంబుఁ జేసిన విన్నవించెద. భార్య తనయార్తి భర్తతోఁగాక మఱి యెవ్వరితోడ మనసువిచ్చి విన్నవించుకోఁగలదు. మీరు విరక్తుల రగుటయు సర్వదా భగవద్విషయంబునందె యింద్రియంబుల వర్తింపఁ జేయుటయు నెఱుంగనిదానఁగాను. ఇట్టి మీ రాలుబిడ్డల జంజాటంబు గాటంబుగఁ బాటింపమియు నెఱుంగుదు. అయినను మీరు భర్తగ నేను భార్యగ నగుట నా సుఖదుఃఖంబుల మీతోఁ దెలుప సాహసించితి. నాకుఁగా మిమ్మొకటియు యాచింపను. నాకు విలువ గల వలువలు గాని యిమ్మైన సొమ్ములుగాని కొమ్మని పీడింపను. మీ మనఃపరీక్షకో నాకు శిక్షకో మీకిందఱు బిడ్డలు జనించిరి, వీరికి భోగమ్ములు కుడువ ముడువ లేకున్నను వేళకుఁ గడుపారఁ బిడికెడు కూడు, కట్ట బట్ట, నిచ్చుటకు లేక యెంత వంతపడుచున్నదాననో మీ రెఱుంగనివారు కారు. అట్లుండియుఁ బరులవలె మీరు పేక్షించి యూరక వేడుకచూచుచున్న నా గతియేమి? వీరి నెట్లు భరింతును? దుఃఖమెట్లు హరింతును? ఎన్నాళ్లని పస్తులు పెట్టుదును. ఆఁకట మల మల మాఁడుచు శోషిల్లు బిడ్డలఁజూచిన నా కడుపులో నెట్లుండును? కావున నోరులేని బిడ్డలయందును, నుండియుఁ బ్రయోజనము లేని నాయందును గనికరించి గ్రాసవాసములకైన సహాధ్యాయు లగుట బాల్యస్నేహితుఁడైన వాసుదేవుని యాచించి సంసారంబు భారంబని తో పనిక చేయుఁడు. మనకాయన మఱేమియు నీయ కున్నఁ గడుపారఁ దిననిచ్చినఁ జాలును. కూటికన్నఁ గోటికన్నట్లు. దయాళుండగు భగవంతుండు మిమ్ముఁ దప్పక యాదరించు. అతండు భక్తవత్సలుండుగదా. మిమ్మెల తిరస్కరించు. ఎఱుకపెడికేఁడుధనము. మీరు పూర్వపరిచితులరు. ఎట్టివారినైన వేఁడుట కష్టమని యెఱుం గుదు. గౌరవము యాచనాంతము. అయినను నది క్షుద్ర మానవ

విషయంబుగాని భగవద్విషయంబుగాదు. సంసారసాగరంబున హాల్లోహలంబులయిన జీవి సముదాయంబులు తమ మేలుగీళ్లు పరమేశ్వరుతోఁగాక మఱి యెవ్వనితో విన్నవించుకోఁగలవు. మన మనోగతంబు నివేదించినఁ బదపడి యాయన యియ్యనిండు, ఈయక పోనిండు. సర్వాంతర్యామియు సర్వజ్ఞుండునైన పరమేశ్వరునకు మన కష్టము తెలియదా? మనము చెప్పుకొనవలయునా? ఈ శిశువు లిట్టి చెట్ట లనుభవింపవలసిన విధి యుండుటచేఁ బూర్వకర్మవశమున మనకుఁ బుట్టిరి కాఁబోలు నని యనకుఁడు. అమ్మాయయిన నడుగక పెట్టదు. దేహంబు దృఢంబుగ నుండినఁగదా భగవత్సేవయైన సాగు. తరణోపాయంబుగ భగవంతుఁ డిచ్చిన కరణకళేబరంబు నుపేక్షించుట ప్రత్యవాయంబగు. సంసారసాగర తరణంబునకు నీ దేహంబు తరణి. తరణి సుష్ఠువుగ నుండదేని నావికుం డెట్లు తీరంబుఁ జేరు. శరీరమాద్యంఖలు ధర్మసాధనమ్మని కలదుగదా? అతి సంచయంబకర్తవ్యంబు గాని శరీర ధారణంబునకు వలసినంత సేకరించుట దోషంబుగాదు. శారీరం కేవలం కర్మ కుర్వన్నాప్నోతి కిల్బిషమ్మని కలదుగదా? ఆశ్రితులఁ బోషింపమి దోషంబని దోషజ్ఞులు వాకొనుచుండఁ గడుపునఁ బుట్టిన బిడ్డల నుపేక్షించుట యెట్టిదో మీరే యరయుఁడు. వారికి తెక్కలు వచ్చువఱకు వారిని రక్షించు భారము మనయందు భగవంతుఁడే వైచెను. అది పరిహరింపఁ బోవునదికాదు. కర్తవ్యము. కర్తవ్యత్యాగము దోషావహము. ఐశ్వర్యంబు చేకూరిన మనస్సు భోగంబుల మరగునని భయపడకుఁడు. స్మరజనకు స్మరింపనీయని యైశ్వర్యంబు మన పగతులకును వలదు. అన్నమునకు దేహమునకు లంకె; కావునఁ బ్రాణముపోకుండుటకుఁ బూఁటపూఁట కింత యన్నము కడుపారఁ దినఁగలిగినఁ జాలు. వినా దైన్యేన జీవనమ్మనుట నేఁటిమాట కాదుగదా.

సీ. రూపింప నిర్మలరూపంబు లెడలించు
రక్తమాంసముల భారము లడంచు

నుద్యోగములకునై యూహ చేరఁగ నీదు
మగల కింతులకును బగలుచేయు
బహుళళంబులైన లోభంబు లుత్పాదించు
సూనృతవాక్యంబుఁ జూఱపుచ్చుఁ
జాల దురాశావిచారంబుఁ గల్పించు
మానంబు చెడి బతిమాలిపించు
గీ. నసదృశానంద వసమున కగ్నికీల
యతిశయాశ్రాంత చింతావిహార భూమి
భూరిదుఃఖంబులకు నెల్లఁ బుట్టినిల్లు
బ్రజలకును లేమికంటెఁ బాపంబు గలదె'' కుచేలో.

అన్నట్టు దారిద్ర్యంబు మహాపాపకారణంబైనను దేనియందు భగవచ్చింత కలుగునో యట్టి పేదఱికంబు దూష్యంబుగాదుగాని కేవల దినదినోపవాసంబుల నర్ధపాద గ్రాసంబుల నాయాసపడువారికి భగవచ్చింతకు వలయుమనోదార్ఢ్యంబును గలుగదు. కావున మీరు శ్రీకృష్ణుకడకేగి దేహయాత్ర సాగుమాత్రమైనఁ గొనితెండు. నేను మీ కీవిషయంబు స్మరణంబునకుఁ దెచ్చితిఁగాని యుపదేశించితినని తలఁపకుఁడు. అనిన భక్తాగ్రేసరుఁ డిట్లనియె.

సుశీలా! పండితురాలివలెఁ దర్కించియుఁ బామరురాలివలె బోధించితివి. బిడ్డల భరించు భారము నీయందు నాయందున్నట్లు పలికితివి. అట్లైన భగవంతునితోడ నేమిపని? భగవంతుఁడు మున్నుగ నాహారము సృజించియే పిదప భూతముల సృజించెనన్న వాక్యము వినవా? రాతిలోని కప్పకాహార మెవ్వఁడిచ్చెను? బిడ్డలకుఁగాఁ దల్లులందు స్తన్యముత్పత్తిచేసిన వాఁడెవఁడు? గర్భములోని శిశువునకుఁ బ్రాణరక్షణము నీవా కావించితివి? నీ ప్రయత్నముచేతనా శిశువు గర్భమున బ్రదికి ప్రాణముతో వెడలివచ్చెను. ఆయురన్నం ప్రయచ్ఛతి యనఁగా వినమా? పూర్వజన్మమునఁ దానొరుల కెంత యిచ్చెనో యామాత్రమ దైవము తా నడిగిన నడుగకుండినఁ బ్రయత్నించినఁ బ్రయత్నింపకుండిన నూరకుండిన నడవినుండినఁ

దనకుఁ దత్తత్సమయంబున లభింపఁజేయు. కావున ధనము లేదని వగచువాఁడు వెఱ్ఱివాఁడు. పెట్టిన వారికిఁ బుట్టుచేసాక్షి. నీబిడ్డలు పూర్వమునఁ బెట్టియుండి పుట్టిరా వారికిప్పుడు లేమిబాధ యేల గలుగు? వారిబత్తెము మనకు దొరకునుపాయము భగవంతుఁడే చేయును. కృష్ణుఁడు స్నేహితుఁడని యాచింపుమంటివా ధనము యాచింపకుండువఱకే లోకమునఁ బ్రాయికముగా స్నేహము నిలుచును. కృష్ణుఁడు భగవంతుఁడు గావున యాచింపుమంటివా కల్పవృక్షము నొద్దకుఁబోయి కసుగాయయడిగినట్టు ముక్తిప్రదుండగు నమ్మహాత్ముని నశ్వరమగు నైశ్వర్యమేమని యాచింతును? ఎటుచూచినను నీబోధ సాధువుగాదు. కాని యొకటి యంగీకార్యమై యున్నది. భగవద్దర్శనమునకై పొమ్మనిన నీమాట శ్లాఘ్యమై పాటింపఁదగి యున్నది. ఆకార్య మొనర్చెదను. రాజులయొద్దకు, దైవమునొద్దకు గురువునొద్దకు, గర్భిణీస్త్రీలయొద్దకు బాలురయొద్దకు రిత్తచేతులఁ బోరాదు. కృష్ణుఁడు రాజు దైవము గురువు కావున రిక్తహస్తముల నేమని పోదును? అనిన నమ్మహాభాగ మహాత్ముల దర్శనంబు వృథా పోదు. భగవంతుఁడు మోక్షకాములకును భుక్తిముక్తులు రెండు నొసంగునని పెద్దలు చెప్పుదురు. భగవద్దర్శన మేల వృథపోవుననుచుఁ దాను సేకరించియుండిన యడుకులు కొంచెము తెచ్చి శతచ్ఛిద్రమైన యాయన వస్త్రపుఁగొంగునఁ గట్టిగ మూటగట్టెను.

కుచేలుఁడును సంతోషముతో బయలుదేఱి నిరంతర శ్రీకాంత చింతాపరుండై నానాగ్రామ పట్టన పక్కణంబులు గడచి చనిచని ద్వారకఁజేరి కృష్ణమందిరద్వారంబు దర్శించి మహాజన సంకులంబైన యీ నగరెట్లు చొరగలుగు? నీ వెవ్వరవని ప్రశ్నించువారి కేమి బదులిడుదు? కృష్ణమిత్రుఁడ నన నన్నెవ్వరు విశ్వసింతురు? నాయట్టి దరిద్రుని లోపల నెవ్వరు విడుతురు? అంతఃపురంబున నున్న భగవంతుని దర్శనంబు నాకెట్లు లభించును? కృష్ణదర్శనలాలసుండనై యరుదెంచితిఁగాని యిందలి కష్టంబు లాలోచింపనైతి నని విచారగ్రస్తుండై నడువీథి నిలువఁబడియుండె. సర్వజ్ఞుండైన హరి యాయన రాక నె

జేంగి సౌధాంతరంబున హంసతూలికాతల్పంబున రుక్మిణీదేవితోడి సల్లాపంబులు చాలించి తటాలునఁ బానుపు దిగనుఱికి శీఘ్రగమనం బునఁ బాదచారియై పాదుకలైన ధరింపక పైవలువ జాఱుచుండ సిగ ముడివీడుచుండ నడివీథికిఁ బాఱుదెంచి యందు దీనవదనుండై నిలు వంబడియుండు సుశీలుఁ గుచేలుఁగాంచి యన్నా కుచేలా! యని బిగ్గకౌఁగిలించి యానందాశ్రువుల నతనిమేనిఁ గడుగుచుఁ గేలు పట్టుకొని మెల్లగ లోనికిఁ దోడితెచ్చి యాధూళిధూసరితగాత్రుని నట్టె రుక్మిణీతల్పంబునఁ గూర్చుండఁబెట్టి తానే యర్ఘ్యంబు పాద్యంబు దెచ్చి సమర్పించి చరణంబులు కడిగి యాంనీరంబు తనశిరంబునఁ బ్రోక్షించికొని పచ్చకప్పురము లోనగుపరిమళవస్తువుల మెదపిన చం దనం బలంది మాల్యంబు లర్పించి ధూపదీపంబులొసఁగి యిట్లు దేవోపచారంబు లాచరించి ప్రక్కన కుశలప్రశ్నంబు గావించుచుండఁ బతిహృదయం బెఱింగిన రుక్మిణియుఁ గేల వింజామర ముగొని కంకణములు ఘలుఘల్లుమనుచుండఁ జర్మముగప్పిన దేహము కలగూడఁగు నా బక్కపేదబాఁపనికి వీచుచుండె. బలుపు గౌర వము పసులకేకాని బాఁపలకుఁగాదు. మాంసలులై మదించిన కుక్షింభరి బ్రాహ్మణులకంటె జపతపోవ్రతానుష్ఠానపరులై మితా హారులై కృశులైన బ్రాహ్మణులే యెక్కువ పూజ్యులు.

బక్కచిక్కి తెల్లపాటి యెమ్ములు బయటఁబడి కట్ట వస్త్రము లేక తలమాసి యొడలు మాసియుండు నా దరిద్రుని కిట్లు కృష్ణుం డుపచరించుటగాంచి యంతఃపురమదిరాక్షు లెల్లరు నబ్బురపోయి యిదియేమి వింతయని ముక్కున వ్రేలిడి చూచుచు నిట్లనిరి. ఆహా! యీ బికారి బాఁపఁ డెంత పుణ్యాత్ముఁడో, యెంత భక్తుఁడో, సాక్షా ల్లక్ష్మియగు రుక్మిణీదేవితో సరససల్లాపము లాడుచుండిన యీకృష్ణుఁ డెదురేగి వీథిలోనికిఁబోయి నమస్కరించి జ్యేష్ఠ భ్రాతనుబోలెఁ గౌఁగిలించి యాదరించి తోడితెచ్చి దేవోపచారంబులఁ బూజించు చున్నవాఁడు. దీనివలన బ్రాహ్మణుని భక్త్యతిశయము శ్రీకృష్ణుని భక్తవాత్సల్యాతిశయము స్పష్టమయ్యె. భగవంతుఁడు మనః పారి

శుద్ధ్యమును సచంచల భక్తిని మెచ్చునుగాని విలువగల వలువలను శామరతోషకరంబులగు వేషంబులను బెదవులనుండి వెడలు భాష ణములను గుబురులఁ దళుకుల బెళుకులను శుష్కోపచారములను మెచ్చువాఁడు గాఁడు. అని యనేకవిధముల వారు వారి నిరువురఁ బ్రశంసించుచుండిరి.

ఇట్లుత్తమోత్తమ మార్గంబున హాటకచేలుండు కుచేలుఁ బూజించి యాయన కేలు తన కేలం బట్టుకొని తమ గురుకులవాసమ యంబున జరిగిన వృత్తాంతంబు ప్రస్తావించుచు భక్తప్రవరుం డగు నవ్విప్రవరుతో నిట్లనియె.

ధరణీసురావతంసమా! గురునికాంతవాసంబు సాంతంబు చేసి తివి. యథాశక్తి గురుదక్షిణయు నర్పించితివి. ఆవల నీవు గృహస్థా శ్రమంబు నంగీకరించితివా? విద్యాభ్యాససమయమందే నీ చిత్తంబు కామాయత్తంబు గాదనియు గృహారామక్షేత్రాదులందు నీకుఁ బ్రీతి లేదనియు నెఱుంగుదు. అయినను గృహస్థాశ్రమం బంగీకరింప నర్హముగదా! జితేంద్రియులగువారు గృహస్థులైయుండియుఁ గామా సక్తులుగాక విషయములకు లోపడక నావలె లోకంబునఁ బ్రవర్తింపఁ జేయ గృహస్థులవలెఁ గర్మములఁ జరింతురు. దానివలన వారి కే హానియు లేదు. అదియే నిరపాయంబైన యుపాయంబు.

కావున సత్కులప్రసూతయు, గుణవతియు, గురుజన శిక్షితయు నగు కాంతను వివాహమాడితివా? అన్నా నీ కెందఱు బిడ్డలు? బిడ్డల జంజాటంబున మా వదినె నిన్నరయకుండదుగదా? నీ జప తపంబులకుఁ గొఱంతలేకుండ నింట నన్నియు వేళకు సమకూర్చుఁ గదా. అతిథి నభ్యాగతుల నాదరించునా? నా వదినె కెన్నఁడైన నా ముచ్చటలు ముచ్చటింతువా? నా కుశలం బరయు నిన్నెప్పుడైన నా వదినె బోధించునా? అన్నా! గురుకులవాసంబునఁ గాదే తెలుంగ దగిన వెల్ల ద్విజుఁ డెఱుఁగు. దానివలనఁగదా సంసారమునుండితఱించు. అట్టి మన గురుకులవాసంబు నింకను స్మరింతువా? పురుషునకు గురు వులు ముగ్గురు. కరణకళేబర దాతయగు తండ్రియు, వేదాధ్యాపకుఁ

డగు నుపాధ్యాయుఁడును, బ్రహ్మజ్ఞానోపదేశకుండగు నాచార్యుండు, ఈ ముగ్గురిలో మొదటివానికంటె రెండవవాఁడును, రెండవవానికంటె మూఁడవవాఁడును శ్రేష్ఠుఁడు. మూఁడవవాని నన్నుఁ గాఁ దలంపుము. బ్రాహ్మణోత్తమా ?

వర్ణాశ్రమముల నుండు వారికి లోకంబున గురుఁడే యగు నాచే నుపదేశంబుఁ బొంది సంసారసాగరంబును సుఖంబుగఁ దరించు వారే బుద్ధిమంతులు. గురుపూజచే నేను సంతోషించునట్లు యజ్ఞాచరణములచేతను నుత్తమకులీనతచేతను నుపవాసాదివ్రతములచేతను, నింద్రియ నిగ్రహముచేతను సంతోషింపను. నన్ను సంతోషింపఁజేయు గురుశుశ్రూషకంటె మేలగుధర్మంబు లేదు. ధరామరోత్తమా ! గురుభార్య యాజ్ఞాపింప మనమిరువురము కట్టెలకై యొకకాలమున నడవికిఁ బోవుటయు, సంజ నుఱుముల మెఱుములతోడి పెద్దగాలి వానలోఁ జిక్కికొనుటయు, సూర్యుఁడస్తమింపఁ జీకట్లు గ్రమ్ముటయు భూమియంతయు మిట్టపల్లము లెఱుఁగరాకుండ జలమయమై యుండుటయుఁ జీకటిచేతను గాలిమబ్బులు గ్రమ్ముటచేతను దిక్కుతెలియక యొకరిచేతు లొకరు పట్టుకొని జడివానలోఁ దడియుచు దోవ డొంక వాఁగువంక మిట్టగుట్ట ముండ్లగండ్లు మిన్నుమన్ను తెలియక తిరుగుచుండ సూర్యోదయమగుటయు మనగురువు సాందీపనియెఱింగి మనల వెదకికొనుచు శిష్యులారా శిష్యులారా యోరికృష్ణా యోరీ కుచేలాయని పిలుచుచువచ్చి చలిచే నలిఁబడి గజగజ వడఁకు మనలఁ జూచి జాలిగొని బిడ్డలారా ! మాకై మీరెంత కష్టపడితిరి. సర్వప్రాణులకు నన్నిటికంటెఁ దమప్రాణము శ్రేష్ఠము. అట్టి దానిని నాయందుల భక్తిచే ననాదరించితిరి. సచ్ఛిష్యులు గురువునకుఁ బరిశుద్ధమనంబుల నాత్మార్పణముచేయుటే కర్తవ్యము. ద్విజోత్తములారా! మీయెడ సంతుష్టుండ నైతిని. మీమనోరథములన్నియు సఫలములగుఁగాక. నావలన మీరు గ్రహించిన వేదములు మీ కుభయలోకములందును సారవంతములై ఫలించునుగాక యని పలికెనుగదా

గురువునింట మనమున్నప్పు డిట్టికార్యము లనేకములుచేసి యిహపర తారకంబైన గుర్వనుగ్రహంబు పడయుట స్మరింతువా? అనినఁ గుచేలుం డిట్లనియె.

జగద్గురూ! దేవాదిదేవా! సత్యసంకల్పుఁడవైన నీతోడ గురుకులవాసంబుచేసిన మాబోంట్లకుఁ గొఱంత యేదిగలదు? వేదమయరూపివై పురుషార్థముల కుత్పత్తిసాధనమై యుండు నీకు గురుమందిరవాసం బభినయమాత్రంబు అదియును మాపాటివారల కోరికలఁ బూరించుటకే యనిన సర్వభూతమనోజ్ఞాతయగు యదునేతకృష్ణుండు సంతసిల్లి నవ్వుచు సరససల్లాపంబులు గావించి యిట్లనియె.

అన్నా! రాక రాక యిన్నాళ్ళకు నన్నుఁజూడ భ్రాతృవాత్సల్యంబున వచ్చితివికదా. పెద్దలు పిన్నలయొద్దకు రిత్తచేతుల నత్తురా! నీవింటనుండి వచ్చునపుడు నాకేమి తెచ్చితివి. నాయందుఁ బ్రీతిగల మా వదినె నిన్నూరక పంపియుండదుగదా? ఏమి తెచ్చితివి? తెమ్ము నాకిమ్ము. పత్రమో, పుష్పమో, ఫలమో, జలమో, యేదియో తమకుఁ గలిగినది భక్తితో నిచ్చినదే నాకు సంతోషకరముగాని యహంకారయుక్తులై పదికోట్లిచ్చినను దాన నామానసంబు రంజింపదు. అని యడిగిన శ్రియఃపతికి పిడికెఁడడుకు లే నేమని యిత్తునని సిగ్గుపడి తలవాంచి కుచేలుఁ డూరకుండె.

సర్వభూతాత్ముఁడై సర్వసాక్షియైన భగవంతుఁ డాయన రాకకుఁ గారణం బెఱిఁగి యితఁడు పూర్వంబున మోక్షార్థియైనన్ను భజించెఁ గాని యైశ్వర్యంబు గోరి భజించినవాఁడుగాఁడు. అయినను భార్యపనుపున నీతఁడు నన్నుఁ జేరవచ్చెను. అమ్మహాపతివ్రత తలంపు వ్యర్థపఱుపరాదు. దేవతాదుర్లభంబైన మహైశ్వర్యంబు వీరికిఁ బ్రసాదించెదను గాక యని సంకల్పించి యన్నా! నాకేమి తెచ్చితివన్న మిన్నకున్నాఁడవేమి? యని నయములు పలుకుచుఁ బ్రియమున నాయన కట్టిన చేలంబు శోధించి కొంగున గట్టిగ ముడివేయఁబడిన యడుకులం గొని యన్నా! యడుకు లనిన నాకెంత ప్రీతి యనుకొంటివి నాకుఁ బ్రీతికరమైన పదార్థమే తెచ్చితివి మెచ్చితినని చెప్పుచు

నొక పిడికెఁడెత్తి నోరఁ బోసికొని నములి మ్రింగి బలేబలే యెంత రుచ్యమెంత రుచ్యమని రెండవసారి యింకఁ గొన్ని చేతనెత్తికొనెను. ఇంతలో సాక్షాల్లక్ష్మియగు రుక్మిణీదేవి వానిని దిననీయక విభుని హస్తమ్ముఁ బట్టుకొని పరబ్రహ్మమూర్తీ! యీయనకు సకలైశ్వర్యములీయ నీవిప్పుడు తినిన పిడికెఁడటుకులే చాలును. అవి నీకు సంతోషము గలిగించుటచే నీయన కైహికాముష్మికములు ఫలించెను. అని యా దేవి యటుకులు తిననీయదయ్యె. ఆ బ్రాహ్మణుఁడును నా రాత్రియంతయుఁ గృష్ణునింటనే భోజనపానాదు లొనర్చి సుఖించి తన్ను స్వర్గలోకస్థునిగా భావించుకొనుచుండెను.

ఉదయంబగుటయుఁ గృష్ణుం డా బ్రాహ్మణు వినయవాక్యంబుల సంతోషపఱిచి పయనింపఁజేసి కొంత దవ్వు తోడవచ్చి సాగనంపె. కుచేలుండును దన సఖుచే ననుజ్ఞాతుఁడసి, స్వగృహంబునకై మరలె. తన మిత్రుఁడు తనకేమాత్రము ధనమీయక యూరక పంపినను గుచేలుండు సిగ్గుచే యాచింప నొల్లఁడయ్యె. స్నేహితుని దర్శనము కలిగెఁగదా యదియే చాలునని సంతోషించుచుఁ దనలో నిట్లు తలపోసె.

ఆహా! బ్రహ్మణ్యదేవుఁడైన శ్రీకృష్ణుని బ్రాహ్మణపక్షపాతంబు నేను గనులారఁ గనఁగలిగె. లక్ష్మీ సమాశ్లిష్టుఁడగు నమ్మహానుభావుఁడు శుష్క దరిద్రుఁడు. ధూళిధూసరితగాత్రుఁడునగు నన్ను శంకింపక గాఢంబుగఁ గౌగిలించెఁగదా! శ్రీవిముఖుఁడు పాపీయుఁడునగు నేనెక్కడ శ్రీనివాసుఁడు నపహతపాప్ముఁడునగు కృష్ణుఁడెక్కడ? ఆయన బ్రాహ్మణవంశసంభవుఁడ నని యిరుచేతులఁ గౌగిలించెఁగదా. అంతియకాదు. నిజాగ్రజు నాదరించినట్లు నన్ను నాదరించుటేకాక తన మహిషియగు రుక్మిణీదేవి పాన్పుపై నన్నుఁ గూర్చుండఁబెట్టి గాసివడిన నాకు నేదదీఱ నామె చేతనే వింజామరలు వీచించెను. అంతియకాదు. ఆ దేవదేవుండు నా పాదంబులు పిసుకుట లోనగు కార్యములచేఁ బరమ శుశ్రూష గావించి దేవోపచారంబుల నన్నుఁ బూజించెను. ఇహలోక సంపదలకును, స్వర్గాపవర్గములకును,

సర్వయోగసిద్ధులకును దదీయ చరణార్చనంబె మూలము. దరిద్రుఁ నకు సంపద లొసంగిన విషయసుఖంబుల మరగి తన్నుఁ మఱచునని తలఁచి యీ సర్వలోకశరణ్యుఁడు కనికరంబున నాకైశ్వర్యమొసంగఁ డయ్యె అని యిట్లాలోచించుచు నా బాడబుండు సూర్యచంద్రాగ్ని తేజంబున విరాజిల్లు తన యిల్లు డాయుచనెగ. కుచేలునకు శ్రీకృష్ణుండు చేయు మహోపచారములంగాంచి యీ నిఱుపేద పాఱున కెంత ధనమిచ్చునోయని వేచి యున్న శుద్ధాంతకాంతా సంతానంబు రిత్త చేతులఁబోవు నాయనను జూచి ఛీఛీ కృష్ణుఁడుత్త మోసగాఁడు. సుహృల్లాపములు శూన్యహస్తములు, కాపురుషులుపోవఁ బద్ధి దినాలపాటింటనుంచుకొనినవాఁడు గాఁడు. ఆయనకుఁ బదికాసు లిచ్చిన నీయనకేమి దారిద్ర్యము వచ్చునో యేమియు నిచ్చిపంపిన వాఁడు కాఁడని పలుకుచుండిరి.

విచిత్రోపవనోద్యానములచేతను, మనోహరారావంబులు దిగంతంబులంటఁ గూయు శకుంతంబులచేతను, వికసితకువలయ కమలకహ్లారోత్పలవారంబులగు కాసారంబులచేతను, నానావిధ భూషణ భూషితులగు యోషాపురుషులచేతను, నుల్లసిల్లు తన పల్లెం దిలకించి కుచేలుండిదియేమి యిది యేసగరము; దారి దప్పితినా? యిది యిట్లగుటకుఁ గారణమేమని గవని వాకిట నిలిచి యాలోచించుచుండ. దేవతుల్య నరనారీసంఘం బాయనను గీతవాద్యంబుల తోడఁ బురంబులోనికిఁ దోడి తెచ్చిరి. పరిరాక విని మహా పతివ్రత యగు నాయనసతి సాక్షాల్లక్ష్మియాయన గృహంబునుండి శీఘ్రం బుగ బయలుదేఱి యాయన కెదురుగవచ్చి చూచి ప్రేమాతిశయం బున నానందాశ్రువులు రాలఁ గన్నుఁ దమ్ములు మోడ్చి బుద్ధిచే నమస్కరించి మనస్సుచేఁ గౌఁగిలించె. వివూనాభూష నిర్జరసతి శోభించుచు నానా పరిష్కార హాటకశరీరలగు దాసికలు సేవింప వారి నడుమ వెలుంగు తనభార్యను జూచి కుచేలుండు విస్మితుఁడాయె. ఆయమ వాకొనిన యుదంతం బంతయు విని యిది శ్రీకాంతు కరుణా ప్రభావం బని తలఁచి యాయన యామెతోడ నింద్రభవనంబుం బోలి

యనేక రత్న స్తంభముల నొప్పారు నిజగృహంబును మనోవికార రహితుండై ప్రవేశించె.

ఇట్లు ప్రవేశించి పాలమీఁగడలఁబోలు శయ్యలును, దంతంబు పొదిగిన బంగారు పరికరంబులును, స్ఫటిక స్తంభంబుల పర్యంకంబులును, జాళువాపిడుల వింజామరలును, బైఁడిపీఁటలును, మెత్తని పట్టు తలగడలును, మంచి ముత్తియపు జాలరుల మేలు కట్టులును, స్వచ్ఛ స్ఫటిక కుడ్యంబులందును మరకత స్తంభంబులందును వెలుంగు రత్న దీపంబులును గీలుబొమ్మలును, మఱియు సమస్తసంపదల దీపించు గృహంబును జూచి యచంచలుఁడై యాకస్మికముగ వచ్చిన సమృద్ధిం గూర్చి యా బ్రాహ్మణుం డిట్లు వితర్కించెను.

సత్యము సత్యము. నిర్భాగ్యుఁడును నిత్య దరిద్రుఁడును నగు నాకీ మహైశ్వర్యము కలుగుటకుఁ గృష్ణదర్శనంబు తక్క వేఱొక్కటి కారణము కాదు. జనులు నిద్రించు సమయంబున భూరివృష్టిఁ గురియించు పర్జన్యునివలె భగవంతుఁడును యాచకులకు సమక్షమున నేమియుఁ జెప్పక మహైశ్వర్యంబు లొసంగు. భక్తుఁడు తనకిచ్చినది కొంచెమైనను గొప్పయనియు దాను వారికి దండిగనిచ్చినను గొంచెమనియు భగవంతుఁడు తలంచుచుండు. ఆ కారణంబునఁగదా యొక పిడికెఁ డటుకులు నావలన గ్రహించి యింతటి యైశ్వర్యంబు నొసంగె. నాకీక జన్మజన్మమందును నాయనయందే ప్రీతియు నాయన దాస్యంబును నాయనతోడి మైత్రియు మహానుభావుఁడై సర్వసద్గుణాలయుఁడైన యాయన భక్తులతోడి సాంగత్యమును గలుగును గాక. ధనవంతులు మదోన్మత్తులగుట చూచి భక్తులకు శ్రీపతి యైశ్వర్య రాజ్యభోగంబులొసంగఁడు. తనయందు నాకింతటి భక్తి కుదురమిచేఁ గాబోలు నాకీ యైశ్వర్యంబు నొసంగె. నా కాతీర్థపాదు పాద భక్తియే కలుగునుగాక. ఐశ్వర్యంబు నన్ను మత్తునిఁ గావింప కుండును గాక. అని తలఁచుచు విషయాసక్తుఁడుగాక మనంబు హరిపై నిలిపి సంపద లనుభవించె. దేవదేవుండును యజ్ఞపతియుఁ బ్రభువునగు శ్రీహరికి బ్రాహ్మణులే దైవము ప్రభువులు గాని

తదంతరముగాను. అపరాజితుండగు నారాయణుండు భక్తపరాజితుండగుట గాంచి యా బ్రాహ్మణుండు భగవంతునియందు మనంబు నిలిపి తద్ధ్యాన వేగంబున బంధము లూడందన్ను పరమ పదంబుఁ బ్రాపించె. బ్రహ్మణ్యదేవుండైన భగవంతుని బ్రాహ్మణ వాత్సల్యంబుఁ దెలిపెడి యీ చరిత్రంబు పఠించువారికి భగవద్భక్తి కుదురును. కర్మ బంధములు వదలును.

## శ్రీకృష్ణార్జునులు మృతబ్రాహ్మణ శిశువులఁ దెచ్చుట.

ద్వారవతీపురంబునందు నొక బ్రాహ్మణ స్త్రీ కుమారునిం బ్రసవించె. ఆశిశువు నేలమీఁదం బడినమాత్రమున మరణించె. ఇట్లు విగతాసువైన యా సిసువు గొనివచ్చి యా బ్రాహ్మణుండు రాజగు నుగ్రసేను గృహద్వారంబుమోసల వైచి యయ్యో బ్రహ్మద్వేషియు శఠుండు లుబ్ధుండు నజితేంద్రియుండు నగు రాజాధముని దోషంబున నా కుమారుండు మరణించె * హింసావిహారుండు, దుశ్శీలుండు, నజితేంద్రియుండు నగురాజును గొలుచు ప్రజలు దరిద్రులు నిత్యదుఃఖితులునై నశింతురని విలపించి యింటికిఁ జనియె. ఈవిధముగ నెనమండ్రు బిడ్డలను దెచ్చి రాజ ద్వారంబున వైచి మీఁదఁ జెప్పిన వాక్యములే చెప్పుచు నేడ్చుచుఁ బోవుచుండె. తొమ్మిదవసారియు మునుపటియట్లులే మరణించిన శిసువును దెచ్చి కృష్ణుసమీపంబుననుండు నర్జునుండు వినుచుండఁ బూర్వగాథలనే పలికి యా ప్రేతమునందు వైచి విలపించె.

అదివిని పాండవేయుండు బ్రాహ్మణుతో నిట్లనియె. బ్రాహ్మణోత్తమా! యేల వాపోయెదవు? నీవు వసించు నీపురంబున విల్లు పట్టెడు మగవాఁడు లేఁడా? వీరందఱు రాజబంధువులు. సత్రపుఁ

* ప్రభువులు చేయుపాపమువలననే రాష్ట్రమున శిశువులు మరణింతురని శాస్త్రము. రామాయణమునందును "రామస్య దుష్కృతం కించి। న్మహదస్తి నసంశయః। యథాహి విషయస్థానాం। బాలానాం మృత్యురాగతః॥" రాజు లేపాపము చేసినఁ బ్రజలశిశువులు మరణింతురో యని యిందుఁ జెప్పఁబడెను.

గూటికై గుంపుగూడిన బ్రాహ్మణులు, ధరామరా! భార్యాపుత్త్రధన యుక్తులై బ్రాహ్మణులు లేక యీ రాజ్యంబున దుఃఖింతురా? వారు రాజులుగారు. పొట్టకూటికై నటులవలె రాజవేషములు ధరించి చరించువారు. * బ్రాహ్మణ! కడచినదేమో కడచెను. ఇక నీకు జనించు శిశువును నేను రక్షించెదను. రక్షింపనైతినేని ప్రతిజ్ఞాభంగమున నైన పాపంబునోవ నే నగ్నిం బ్రవేశించెద. సంతాపింపకు మనిన బ్రాహ్మణుం డిట్లనియె. అయ్యా! నీవెవఁడవు? బలరామకృష్ణ ప్రద్యుమ్నులు ననిరుద్ధుఁడు లోనగు నప్రతిహత రథులు మహా ధనుర్ధరులు కాపాడఁజాలరు వారిని నీవేమి రక్షింపఁగలవు? జగదీశ్వరుల కసాధ్యమైనదాని నేను జేసెదనని మూర్ఖత్వముననో యజ్ఞానముననో పలికితివి. ఇట్టి బాలిశవాక్యములు మేము నమ్మఁజాల మనిన నర్జునుం డిట్లనియె.

బ్రాహ్మణా! నేను బలరాముఁడనుగాను, కృష్ణుఁడనుగాను, ప్రద్యుమ్నుఁడనుగాను, అనిరుద్ధుఁడనుగాను. దర్శనమాత్త్రంబున గండుమీఱిన దంతిపగతుర గుండెలు ఖండంబులు గావించు గాండీవంబను కోదండంబు ధరించు నర్జునుండను. మూఁడుకన్నులవాని మెప్పించిన నా బలపరాక్రమంబు లనునగఁ జూచి యవమానింపకుము. దుర్భరంబగు యుద్ధంబున మృత్యువును జయించి నీయర్భకులఁ గొనివచ్చెద నమ్ముము. అని నమ్మ బలికిన నమ్మహీసురుం డాతని మాటలు విని విశ్వసించి విశేషసంతోషంబున స్వగృహంబున కరిగె. ఆవలనొక యేఁ డరుగ మరల నాద్విజోత్తముని పత్నికిఁ బ్రసవకాలంబయ్యె. అది దెలిసికొని బ్రాహ్మణుం డర్జును కడకేగి యర్జునా! యర్జునా! నా భార్యకు మరలఁ బ్రసూతికాలం బాసన్నంబయ్యె. రమ్ము రమ్ము. రక్షింపుము రక్షింపుము.

---

* కృష్ణుఁడు రక్షింపఁడయ్యెనని యాయనను నుదాసీనపఱిచి పలికిన వాక్యమిది. కృష్ణుఁడు రక్షింపకుండుటకుఁ గారణము ముందుఁ జెప్పఁబోవు భగవద్ద్వేషము నెఱవేర్చు తలంపుతోడనే.

అనిన నమ్మాట లాలించి గాండీవకరుండై కృష్ణసహితుండై యాఖండలనందనుం డా ధరణీబృందారకు మందిరంబునకు ముదగతిం జని యాచమించి శుచియై మహేశ్వరు నుద్దేశించి నమస్కరించి * గాండీవంబు సజ్యంబుగావించి దివ్యాస్త్రముల స్మరించి పురిటింటికిం బదివైపులఁ గ్రిందమీఁద నన్నివైపుల శరపరంపరలచే నానాస్త్రములచేఁ బంజరము గూఁటివలెఁ గట్టెను. అంత నా బ్రాహ్మణి కుమారుఁ బ్రసవించె. శిశువు నేలఁబడి విలపించె. మరణించె. దేహంబైనఁ గానరాకపోయెను.

అంత నా బ్రాహ్మణుండు కృష్ణుండు వినుచుండ నర్జును నుద్దేశించి యిట్లు వచించె. అయ్యో యేమి నా యవివేకము. షండుని బ్రగల్భోక్తులను నేనును నమ్మితినిగదా. ఎవఁడు వీఁడు? రాముఁడా కృష్ణుఁడా ప్రద్యుమ్నుఁడా యనిరుద్ధుఁడా? అట్టివారు రక్షింపఁజాలని వానిని వీఁడా రక్షింపఁగలఁడు. ఛీ యర్జునా! మృషావాదీ! ఛీ యాత్మశ్లాఘీ. నీకఁట ధనువఁట దాని నెంతైనఁ దగులఁబెట్టరాదా? భారమాత్రప్రయోజనంబైన యా కట్టెమోపు నొంతచేతుల మోసికొని తిరిగెదవు? ఛీ ఛీ వీఁడట దైవోపహతులై మృతులైన వారినఁట మరలఁ దెచ్చునఁట. అని నిందించు నతని వాక్యంబులు వీనుల సూదులవలె నాటిన నర్జునుండు యోగవిద్య నాశ్రయించి సంయమనీపురంబున కరిగి యందు విప్రబాలుఁ గానక యీశాన్యంబు మాని† వరుణాది దిక్పాలక లోకంబులకుఁ బాతాళంబునకుఁ జని యెందును గనుఁగొనక కుందుచు ద్వారకకరుదెంచి ముకుందుఁగని ప్రతిజ్ఞా

---

శిశువుల రక్షింపఁ గృష్ణునకు శక్తి చాలదనియు నారాయణను స్మరించి ప్రయోజనము లేదనియుఁ బాశుపతాస్త్రము దనకిచ్చి తనయందుఁ బ్రీతిగల శంకరుండే వంద్యుఁడనియు నర్జునుఁడు దలఁచెను. ఆ కారణముచేతనే లోకపాలకుల లోకములకుఁ బోవునపుడును గృష్ణుతో నాలోచించినవాఁడు కాఁడు. పురుషకారగర్వ ముడుగ నిమ్మని కృష్ణుఁ డూరక చూచుచుండెను.

† తనయందుఁ బ్రీతిగల శివుఁడు తన కహితమైన కార్యము చేసియుండఁడను తలంపున నచ్చటికిఁ బోలేదు.

భంగంబఱచెన్. ఇఁక జీవింపనొల్ల. అగ్నిప్రవేశంబు గావించెదనని తత్ప్రయత్నంబుననున్న యతని నివారించి కమలాక్షుండు నాతోడ రమ్ము. నీకు విప్రకుమారు నిప్పించెద. అగ్నిని బ్రవేశించిన నిన్ను దూషించు జనులే మనకీర్తి శాశ్వతంబుగఁ గొనియాడుదురు. అని బోధించి మహేశ్వరుండైన కృష్ణుండు దివ్యంబులైన శైబ్యసుగ్రీవ మేఘపుష్పవలాహకంబులను నశ్వంబులు పూన్చిన రథంబెక్కి పడమటి దిశగానరిగి సప్తసప్తగిరులుగల సప్తద్వీపముల సప్తసింధువుల లోకాలోక పర్వతమును దాఁటి చని మహాతమంబునఁ బ్రవేశించె. †

ఇట్లు గాఢాంధకారమునఁ బ్రవేశింప నా యశ్వంబులు మార్గంబు తెలియక యూరక నిలఁబడుటయు మహాయోగేశ్వరేశ్వరుండగు కృష్ణుండు సహస్రాదిత్యసంకాశంబైన తన చక్రంబును మున్ను పనిచె. ప్రవేశింపరానిదియు భయంకరమైనదియు, మిక్కిలి యపారమైనదియు భగవత్కల్పితమైనదియు నగు తమస్సునందు* శ్రీరఘురామ శరంబులు నాశరసమూహంబులఁ జొచ్చి నట్లాసుదర్శనంబు చీఁకట్లు విరియింప నాచక్రంబు చనుమార్గంబున గుఱ్ఱంబులు నడిచె. అర్జుననకుఁ జీఁకటియందు వ్యర్థములైన కన్నులామహాతేజంబును జూడఁజాలమి వెలుఁగునందును వ్యర్థంబులగుటయు నతండు రెండు కన్నులను మూసికొనియె. ఆవల నయ్యశ్వంబులు బలిష్ఠమహావాయు తాడితంబులై రేఁగు పెద్ద పెద్దయలలచే నలంకరింపఁబడిన జలంబులఁ జొచ్చి యవలఁ జనుటయు నందు మణిస్తంభసహస్రశోభితంబగు దివ్యభవనంబొండు గాననయ్యె. అందు వారు మిగులభయంకరుఁడు ననంతుఁడు నద్భు

† సంకల్పమాత్రముచేతనే బ్రాహ్మణపుత్రుఁ దెప్పింపఁ గలిగియుఁ దన్నశక్తుఁడని తలఁచి యుదాసీనభావంబు వహించిన యర్జునునకు యోగేశ్వరేశ్వరుండైన కృష్ణుండు నిజ మహిమాదులఁ బ్రకటించి యతని మనోమాలిన్యంబు పోఁగొట్ట నిట్టి పోకలఁ బోవుచున్నాఁడు.

* ఈ లీలయందు బుద్ధిమంతులు ఆదిత్యవర్ణంతమసస్తుపారే।తమసఃపరస్తాత్ ఇత్యాదుల ననుసంధించి విశేషార్థంబు తత్త్వంబు చాల గ్రహింపఁ దగియుండును. ఇందలి విశేషణములను సార్థకముగ నన్వయించుకొనవలయును.

తుండు సహస్రశిరఃఫణామణిమరీచిరింఛోళీవిభ్రాజమానుండు, ద్విసహస్రలోచన భయంకరుండు శ్వేతపర్వతనిభుండు నీలకంఠజిహ్వాభిశోభితుండు నగు శేషుని భోగంబను సుఖాసీనంబున నాసీనుండైన విభు, మహానుభావు, పురుషోత్తమోత్తము, ♦ సాంద్రాంబుదాభు, పీతవాసుఁ, ప్రసన్నవదను, రుచిరాయతేక్షణు, మహామణివ్రాత కిరీటకుండల ప్రభాపరిక్షిప్తసహస్రకుంతలుఁ, బ్రలంబచార్వష్టభుజుఁ, కౌస్తుభ శ్రీవత్సలక్షణు, వనమాలావృతుండై నందసునందముఖపార్షదులును, మూర్తులు ధరించిన శంఖచక్రగదాఖడ్గ చర్మశరచాపపాశంబులును, హ్రీంశ్రీకీర్తి జయాదిశక్తులుఁ గొలువ ద్వాపరాద్యంతముల ముక్తులైన బ్రహ్మలు సేవింపనలరారు శ్రీమన్నారాయణుఁ గాంచి కృష్ణుండు నమస్కరించె‡. అర్జునుండు భయకంపితగాత్రుండై యంజలి జోడించె.* అంతఁ బరమేష్ఠులకుఁ బ్రభుండైన భగవంతుండు గంభీర భాషణంబుల వారితో నిట్లనియె.

మిమ్ముఁ జూడఁగోరి బ్రాహ్మణకుమారుల నిందు రప్పించితి. మీరు † భూభారంబులైన యసురవారంబుల రూపుమాపి ధర్మస్థాపనంబు గావింపఁ గళావతీర్ణులరైతిరి. మీరు కార్యంబు శీఘ్రంబుగ నెఱవేర్చి మదంతికంబునకు రండు. మీరు పూర్వము పరిపూర్ణకాములైన నరనారాయణ ఋషులరై యిప్పుడు ధర్మరక్షణార్థంబు లోకసంగ్రహార్థంబు కృష్ణార్జునులరైతిరి. అని యాదేశించిన వల్లెయని వారు బ్రాహ్మణకుమారుల గ్రహించి పోయిన త్రోవఁబట్టి మరలి స్వధామంబుఁ జేరి బ్రాహ్మణున కాకుమారుల నొసఁగిరి. పార్థుండును విష్ణుధామంబు నవలోకించి పరమవిస్మితుండై పురుషుల ప్రయత్నంబెంత గొంచెమైనను కృష్ణానుగ్రహంబు లేక సాగదని తలంచె.

---

♦ పురుషోత్తములు = బ్రహ్మాదులు, వారికంటె నుత్తముఁడు పురుషోత్తమోత్తముఁడు.

‡ గోవర్ధనగిరి నెత్తిన సమయంబునఁ దనకుఁ దాను నమస్కరించినట్లు.

* కృష్ణుండు సాక్షాద్భగవంతుఁడు. నారాయణాంశావతారము నరుఁడు.

† ఇది ఛత్రిన్యాయమునఁ జెప్పఁబడెనని కాని కళయనఁగా శక్తి గావునసకల శక్తులతో నుద్భవించితిరని కాని గ్రహింపనగు.

## — శ్రీకృష్ణుండు కైలాసయాత్ర సేయుట —

ఒకనాఁడు రుక్మిణీదేవి శ్రీకృష్ణుంగని ప్రాణేశ్వరా! నాకుఁ బ్రద్యుమ్నాదులు పుత్రులుండియు సంతానచింత మానకున్నది. రూపధైర్యస్థైర్యబలపరాక్రమంబుల నిన్నుఁబోలు పుత్రు నింకొకని ననుగ్రహింపుము. బిడ్డలిడఁ జాలునను లీలావతికలదా? అని వేఁడిన వేదండవరదుం డట్లకానిమ్ము. కైలాసంబున కేగి తపంబు సలిపి శంకరుచే వరంబు పడసి వచ్చెదనని బంధువులకెల్ల నెఱింగించి గరుడారూఢుండై దక్క హిమవంతంబున కేగి బదరికాశ్రమంబున డిగి యందుఁ దపమొనరించు ఋషీశ్వరులఁగాంచి వారియోగక్షేమంబు లరసి మూరాత్రియం దొక విజనస్థలంబున విడిసి తపంబు సలుపుచుండె. ఆ యర్ధరాత్రసమయంబున వికారముఖములు వాఁడికోఱలు బొక్కనోళ్ళులు లోఁతుకొట్టలు మిడిగ్రుడ్లు పల్లవెంట్రుకలు గూనివీఁపులు గోలుమూఁపులుఁ బూరకాళ్లు కొంకివేళ్లు గుదివడిన తొడలు నిక్కమెడలు ముష్టాలముక్కులు గుంతచెక్కులు నీచచేతులు నెత్తురోడియు వాతులు గలిగి కహకహారావములు గావించుచుఁ గాలిన తాటిచెట్లనిలువున పిశాచద్వయంబు కృష్ణునమీపంబునకు వచ్చి తాము చంపితెచ్చిన జంతువులనెత్తురు మాంస మచ్చటనుంచి శ్రీకృష్ణార్పణమని నివేదించి హరినుద్దేశించి సహస్రనామంబులు పఠించి.

శా. "ఓ నారాయణ యోమురాసురహరా యోభక్తచింతామణీ
యో నీలాంబుదవర్ణ యోగుణనిధీ యోలోకరక్షామణీ
యో నీరేరుహపత్రనేత్ర కృప నాయుల్లంబులో నుండవే
యో నావేభవబంధముల్ చెఱుపవే యో దేవకీనందనా!

శా. గోవిందాయ నమోనమో భవజితే గోపాలభర్త్రే నమో
దేవేశాయ నమోనమో మురభిదే దిక్పాలకర్త్రే నమో
భావజ్ఞాయ నమోనమో మదహృతే పాపప్రహర్త్రే నమో
జీవస్థాయ నమోయనంగ శుభముల్ చేకూరు మాకెప్పుడున్"

నాచన సోముని హరివంశము.

అని నమస్కరించి భగవంతుండు ప్రీతింగైకొనెనని సంతసించి పదపడి యాపిశాచంబులు మాంసంబు భుజించి నెత్తురుద్రావి యున్నను తిరుగుచు నంగారకచోనుండిన కృష్ణుం జేరఁజని యం దగ్రజుం డాయనతో నిట్లనియె.

ఓమానవా ! నీవెవండవు ! పిశాచంబులు సంచరించు నీ నడిరేయి యిం దొంటిగ నేమి చేసెదవు ? నీవు చూడ మిగుల సుకుమారుండవు. సుందరుఁడవు ? నూరుండవు నీవు నేవరునవారో యని యడిగినఁ గృష్ణుం డిట్లనియె.

నేను క్షత్రియుఁడను. యదువంశ సంభూతుఁడను. శివుం గూర్చి తపంబుసేయ నిటవచ్చితి. తపోధనులైన మునులు నియతి జరించు నిచ్చోట మీ కేకార్యంబు గలదు ? వారితపస్సులకు మీరు భంగంబు కలిగింపక తొలంగిపొండు. ఇది పిశాచావాసంబుగాదు. మీ కుక్కలమొఱుగులు మృగహింసలు నహింసారహితులైన యతులు వినికని యెట్లు సహింతురనిన నతం డిట్లనియె.

ఓయీ! మేమిరువురము నొకేరు ననుచరులము. అన్నదమ్ములము. నా పేరు ఘంటాకర్ణుఁడు. వీని పేరు కాలాంతకుఁడు. నేను తొలుత నత్యంత శివభక్తుఁడనై విష్ణుద్వేషినై యుండితి. విష్ణునామం బెంతైన నెప్పుడైనఁ జెవిని బడునేమోయని నెఱది చెవులకు ఘంటలు కట్టుకొని తిరుగుచుండితి. అట్టి నేను కైలాసవాసు శివు వృషభధ్వజు నారాధించి స్తుతించితి, నాయందుఁ గరుణించి హరుండు ప్రసన్నుండై వరంబుఁ గోరుమనియె. నేనును ముక్తిఁ గాంక్షించితి. ఇట్లు మోక్షంబుఁ బ్రార్థించు నన్నుఁ గని త్రిలోచనుం డారీ యందఱకు ముక్తిప్రదాత విష్ణువేకాని యితరులు గారు. దీనసందియంబులేదు. కావున బదరికాశ్రమం బరిగి జనార్దను నారాధింపుము. నరనారాయణాశ్రమంబున గోవిందుండు నీకుఁ గైవల్యం బొసంగుననియె. ఆ శూలి వాక్యంబులు పాటించి యదిమొదలు పరదైవతము విష్ణువేయని విశ్వసించి పెఱదేవతల నర్చింపక విష్ణ్వారాధనంబు గావించుచుం

డుదు. ఈ క్షేత్రంబు ముక్తిప్రదంబని యిందరు దెంచితి. ఇప్పుడు పశ్చిమ సముద్రతీరంబున ద్వారావతీపురంబున యదువంశంబున విష్ణుండు కృష్ణుండను నవతరించియున్నవాడు. ఆయనను దర్శింపఁ బోవుద. జగత్కర్త భర్త హర్త విష్ణువే. సర్వేశ్వరుడు విష్ణువే, ఆయన నుండియే జగము లుదయించు. ఆయనయందే లయించు. నారాయణ వాసుదేవ విష్ణుశబ్ద వాచ్యుండతండే. ఆయనను దర్శింపఁ గాక్షించెదనని తక్కిన వంజుల్లో దిని సల్లద్రావి యాసనంబు గల్పించుకొని యందు నచలుండై కూర్చుండి చిత్తంబేకాగ్రంబుగ గావించి భగవత్స్వరూపంబు నెదురనున్నట్టుల సంకల్పించి భక్తిమై నిట్లు ధ్యానించె.

నారాయణ గోవింద ముకుందా! నమస్కారము నమస్కారము నమస్కారము, నారాయణ మాధవ కేశవ భూయోభూయో నమస్కారములు, వైకుంఠవాసా! జనార్దనా! పాహిపాహిపాహి. దీన శరణ్యా! భక్తవత్సలా! ఆర్తజనబంధూ! శరణు శరణు శరణు. మధుసూదన కృష్ణ మురారీ! భవన్నామ కీర్తనంబున నా మనంబు పరిశుద్ధంబగుఁగాక. పాపభూయిష్ఠంబైన యిట్టి జన్మంబు నాకెన్నఁడు గలిగింపకుందువుగాక. నీ నామసంకీర్తన బలంబున నాకు మరల జన్మంబు కలుగకుండుఁగాక. స్వామీ యిదే నా ప్రార్థనంబు. దేవా నీవర్థిజన కల్పవృక్షమవు. సమస్త జనులకు సర్వదా సర్వదుండవు. నాకు జన్మంబులు కలిగింప నీ కిష్టమేని యెందైన నరియు యే రూపంబున నైన నరియజన్మింపఁజేయుము; వలదనుగాని నీవుమాత్ర మచ్యుతా! వదలక నా స్మృతియందు సదా నిలిచియుండుము. నాప్రార్థన యిదియే. స్వామీ! భవదర్చనంబు నిర్విఘ్నంబుగఁ గొనసాగనిమ్ము. నిన్ను ధ్యానించు నా మనంబునకు నిలుకడ ప్రసాదింపుము.

మరణకాలంబున స్మృతిభ్రంశంబు కలుగనీకుము. దినదినము కొంచెముకాలమైన నీయందు నా చిత్తంబు స్థిరంబుగ నిలువనిమ్ము. పిశాచరూపము ధరించిన వీనియందు దయ యెట్లు నిలుచును? వీఁడు నా భృత్యుఁడు. కావున జన్మముచే వచ్చినదయాహీనత క్రూరత

యివి క్షమింపనగునని తలంచుము. ఈ శరీరము నీవిచ్చినదే కదా! ఈ శరీరమున కీగుణములు స్వభావసిద్ధములే కదా. ప్రేరకుఁడవు నీవే కదా. ఇఁక నా దోషమేదికలదు? జీవించియుండునప్పుడు కాని మరణదశయందుఁ గాని యింద్రియములు విషయములవెంటఁ బరుప్రాఱకుండఁ జేయుము. నీ పాదారవిందంబులందే వర్తింప శాసింపుము. ఇంద్రియములు నీ స్వాధీనమైయుండ నవి నాకెల్ల లోపడి వర్తించును. పగ్గములు పట్టుకొనినవాఁడు కోరినట్లుగదా గుఱ్ఱములు నడచును. ఈ దేహంబునందలి పంచభూతంబులు మరణకాలంబునఁ బంచమహాభూతంబుల లయించునుగాక. నేను నీ కైకాంతిక నిత్యకింకరుండ నగుదునుగాక. మనస్సు నిర్మలముగాదేని స్నానాదిబాహ్యశౌచంబుల నేమి ఫలము? మలభాండమును పైఁద నెంత కడిగిన నేమి ప్రయోజనము? దేహశుద్ధికై పడుపాటులెల్ల వ్యర్థము. కావున హృషీకేశా! నా మనస్సును లోలోత నిర్మలముగఁ జేయుము. దేహ మెట్లున్నను విషాదపడను. ఇంద్రియములు బలిష్ఠములు. వారినివారింపుము. దేవాదిదేవా! మహానుభావా! సర్వభూతరక్తియు భవచ్చరణకమలభక్తియు నా కనుగ్రహింపుము. జనార్దనా! వేయి మాటలతో నేమిపని. నేను మేలుకొని యుండినను నిద్రించుచుండినను భుజించుచుండినను నడచుచుండినను నెట్టికార్యము చేయుచుండినను సుఖమందినను దుఃఖమందినను, రోగమందినను ద్వేషమందినను సర్వత్ర సర్వకాల సర్వావస్థలయందును నా మనంబు నీయందే రమించుచుండఁ జేయుము. జగదీశ్వరా! నమస్కారములు. భక్తరక్షాదక్షా! యంజలి. దీనావనదీక్షా! మ్రొక్కులు. సర్వభూతమయా! దండములు. కష్టనివారణసమర్థా! సాష్టాంగములు. హరిహరీ! నేటికోళ్లు. గోవిందగోవిందా! చిన్నపూలు. లక్ష్మీవల్లభా! కైమోడ్పులు. శ్రీసతీపతీ! నీవేగతి. అని ధ్యానించి ధ్యానించి యదియు నుడిగి గాలిలేనిచోటి దీపమువలె మనస్సు నిశ్చంచలముగ హృదయ పుండరీకమున దళంబుల నడుమ భగవంతు నావేశింపఁజేసి లోచూపునఁ జూడఁజూడ వృక్షమూలంబున నున్న కృష్ణస్వరూపంబె హృదయపద్మంబునఁ గానవచ్చె. ఆ రూపసందర్శ

నంబునఁ గొంతవడి యుపశమించి యావలఁ గన్నులువిచ్చి నలుదెసలు చూచుటయు నొక్కెడ దాను హృదయంబునఁగన్న దివ్య స్వరూపంబునఁ గృష్ణుండు కానవచ్చుటయు నితండె భగవంతుండని నిశ్చయించి పెక్కువిధముల స్తుతించి యా పిశాచభర్త యిట్లనియె.

మహాపురుషా! మున్ను నిన్నెఱుంగని నా దోషము మన్నింపుము. నీవె నాపాలి దైవంబు. వెదకఁబోయిన తీఁగె పదములకుఁ జుట్టుకొనినట్లు నన్ననుగ్రహింపఁ నీవె యిటకు విందవై యిచ్చోటికి వచ్చితివి. నాచేయు నుపచారంబు గ్రహింపుము. జాతులలోనెల్ల బ్రాహ్మణుండు శ్రేష్ఠుండు. అట్టి బ్రాహ్మణుని కళేబరమిది పచ్చిది. వెచ్చని నెత్తురు గలది. ఆరగింపుము. పురుషున కేది యిష్టమో వాని దైవమున కదియే కదా యన్నము. అనినఁ గృష్ణుండు నవ్వుచు నిట్లనియె.

ఓయీ నీభక్తికి మెచ్చితి. మేము దీనిని భుజింపరాదు. నీ సంకల్పప్రకారంబు నీకు మోక్షం బొసంగెద. ఇప్పటి యింద్రుండింద్ర పదవి నలంకరించువరకు నీవు నాకలోకసుఖంబు లనుభవించుచుండుము. ఆవల నా సన్నిధికి రాఁగలవు. ఇట్టిది దేవతలకైన దుర్లభంబు. మఱి యేమి కోరెదవు కోరుమనిన సర్వవేళల నా మనస్సు నీయందు రమింప జేయుమని యతండు కోరఁ గృష్ణుండును నట్లకాకయని యతని దేహంబు తన పాణిపద్మంబున నంటుటయుఁ బిశాచశరీరంబు నొరఁగి దివ్య తేజంబున వెలుంగు శరీరంబు ధరించె. ఇంద్రుండును నతని స్వర్గంబునకుఁ గొనిపోయె. ఆవలఁ గృష్ణుండు పండ్రెండు వర్షంబులు శివునుద్దేశించి తపంబు గావింప హరుండు ప్రత్యక్షుండై యిట్లనియె.

జగన్నాయకా! నీవిట్లు తపంబు సేయుదువని మున్నే యెఱుంగుదుఁ గావున నీకు మన్మథుండు పుత్రుండై జన్మింపఁజేసితి. అతండు నా తపంబునకు విఘ్నమాపాదింపఁ గ్రోధించి యతని దగ్ధుఁగావించి యావల నది విరించి పనుపగుటయు నతండు నిర్దోషియగుటయు నెఱింగి నీకుఁ బుత్రుండుగా ననుగ్రహించితినని వచించె. హరిహర

సమాగమంబున కమరులెల్ల హర్షించిరి. అవలఁ గృష్ణుండు గరుడ వాహనుండై ద్వారక కరిగె. *

---

## క్రతురక్షాలీల.

### జరాసంధునిచేఁ జెఱఁబట్టఁబడిన రాజులు శ్రీకృష్ణునకు సందేశ మంపుట.

ఒక్కనాఁడు దేవకీసుతుండు యాదవవరపరివృతుండై పేరోలగంబున సభామంటపమున నుండు సమయంబున నొక్క నూతన పురుషుం డరుదెంచి నమస్కరించి విరించిజనకునితో నిట్లనియె.

దేవా! నేను రాజదూతను. జరాసంధుఁడు దిగ్విజయవేళఁ దనకు లోఁబడక క్షత్రధర్మంబు నెఱపిన యిరువదివేవురు క్షత్రియప్రవరుల గిరివ్రజపురంబునఁ గారాగారంబున నుంచినవాఁడు, వారు నీతోఁ గొన్నివాక్యంబులు జెప్ప నన్నుఁ బుత్తెంచిరి. నమయు మగు నేని యనుగ్రహించి వారి వాక్యములు వినుము.

కృష్ణకృష్ణా! యప్రమేయాత్మా! యాపన్నభయనివారకా! సంసారజననమరణములకు వెఱచువారమును, భిన్నాభిప్రాయులము నగు మేమెల్ల నీ శరణు చొచ్చితిమి. నీ మహిమ దెలియంగనివారము గాము. విషయసుఖాసక్తులై నానావిధనిషిద్ధకామ్యకర్మము లాచ

---

* కొన్ని కారణములచే నిది ప్రక్షిప్తమని తోఁచెడి. ఈ చరిత్రము పెక్కు ముద్రిత సంస్కృతగ్రంథముల గానరాదు. పదుగురుబిడ్డలతల్లి రుక్మిణి బిడ్డలఁగోరుట యానిమిత్తంబుగఁ గృష్ణుఁడు కైలాసమునకుఁ బోవుట పండ్రెండుసంవత్సరముల తపస్సు చేసినపిమ్మట శివుఁడు ప్రత్యక్షమై యిప్పుడు నీవు చేయుతపస్సునకు ఫలము ముందుగానే యిచ్చితినని చెప్పుట యివన్నియు సందేహమునకుఁ గారణములు. తనకుఁ బ్రద్యుమ్నుఁడు కొడుకుండుట తెలియక యా రుక్మిణి యొక్కవబిడ్డలఁ గోరెను. కృష్ణుఁ డామె కోరిక నేమి నెఱవేర్చినట్లు? ఆంధ్రహరివంశంబుల గెంటను ఘంటాకర్ణున కాపేరు వచ్చినవిధముగాని విష్ణుద్వేషి యత్యంత విష్ణుభక్తుఁ డగుటకుఁ గారణముగాని మూలమునం దున్నను జెప్పఁబడ లేదు.

రించుచు నీవుపదేశించిన భవత్స్వాజ్ఞాప్రకారము కుశలమార్గంబయ్యె దానియందుఁ బ్రమత్తులై చరించువారి జీవితాశను ఛేదించు కాలంబవైన దేవదేవోత్తమా! నీకు నమస్కారంబు. శిష్టానుగ్రహంబునకునై జగదీశ్వరా! నీవంశయుతుఁడవై జన్మించితివి. ఒకఁడు నీయాజ్ఞనుల్లంఘించి వర్తించుచు సుఖజీవి యగు ఒకఁడు నీయాజ్ఞకు లోఁబడి వర్తించియుఁ గర్మఫలంబులైన దుఃఖముల ననుభవించును. ఈ రెంటికి గారణమేమో మే మెఱుఁగము. ఈశ్వరా! రాజుల సుఖంబు స్వప్నగతసుఖంబు తుల్యంబు. అదియుఁ గర్మాయత్తంబు క్షుద్రవిషయసాధ్యంబు. కావున సర్వదా భయమును, మృతప్రాయమునగు శరీరమునఁ గళత్రపుత్ర పోషణచింత యను భరంబు వహింతుము. నీ యనుగ్రహమున నిష్కాములగు వారికి నీ విషయచింతనచేఁ గలుగు నానందమును విడిచినవారమై నీ మాయవలనఁ గృపణులమై యిట్లు దుఃఖ మనుభవించుచున్నారము. కానఁ బ్రణతశోకహరణ చణచరణా! జరాసంధుఁ డను కర్మపాశమున బద్ధులమైన మమ్ము నీవు విముక్తులఁ జేయుము. పదివేలయేనుఁగుల బలముగల మాగధుఁడు మమ్ము సింహము మేకలవలెఁ జెఱసాల నిరోధించి యున్నవాఁడు. చక్రహస్తా! పదునేడుమార్లు వీఁడు నీచేఁ బరాజితుఁడై పరిభవింపఁబడియు మనుష్యచేష్టల ననువర్తించుచుఁ గారణాంతరమున మథుర విడిచిన నిన్నుఁ బదునెనిమిదవమాఱు జయించితినని తలంచి గర్వించి నీవారమైన మమ్ము బాధించు వీని గర్వంబు విసర్జింపుము. మహానుభావా! జరాసంధబద్ధు లగురాజు లెల్ల నీ చరణమూలంబు శరణంబు చొచ్చి నీ దర్శనం బపేక్షించి యున్నవారు. వారికి దుఃఖశాంతి గావింపుము.

రాజదూత యిట్లు వాకొనుచుండఁ దన తేజంబున దిక్కులఁ వెలిఁగించుచుఁ బింగజటాభారంబు వెలయ నారదుం డచ్చటి కరుదెంచి కృష్ణాదులచేఁ బూజితుఁడై యుచితాసనంబునఁ గూర్చుండె. అంత రుక్మిణీకాంతుండు నమ్మునివరుంగని వేలుపుఁ దపసీ! మీ రెందుండిరాక? ఏమివిశేషవార్త? మహాత్ము లూరకరారుగదా. మీరు

ముల్లోకములు సంచరించుటచే లోకవృత్తాంతములు మేము కనులఁ జూచుచున్నారము. పాండవు లిప్పు డెందున్నవారు? ఏమి చేయు చున్నవారు? ఎఱిగింపుమా యనిన దేవముని యిట్లనియె.

అంతరాత్మవై మెలఁగు నీమూఁడును నేను గనులారఁ జూచిన వాఁడనగుట నీవిట్టి వ్యామోహకరవాక్యంబు లుగ్గడించుట నాకుఁ జిత్రంబుగఁ దోఁచును. సర్వాంతర్వ్యామివైన నీ వెఱుంగని దేదిగలదు? అయినను నరలోకవిడంబనార్థంబు నీవు ప్రశ్నించుటంజేసి నీమేనత్త కొడుకుల తెఱం గెఱింగించెదను. యుధిష్ఠిరుఁడు రాజసూయ యాగంబున నిన్నారాధింపఁ గోరెడు. ఆయన కోరిక నెఱవేర్చు భారము నీయందున్నది. అందు గుమిగూడు రాజబృందంబులును భవద్దర్శనలాభంబునఁ గృతార్థులు కాఁగలరు. చండాలురును నీ పేరు స్మరించినంతమాత్రమునఁ బవిత్రులగుచుండఁ బ్రత్యక్షంబుగ నిన్ను దర్శించు భాగ్యవంతులు తరించు టేమివింత? భువనమంగళ స్వరూపా! నీయశస్సు లోకపావనంబై ముల్లోకముల వ్యాపించియుండునట్లు నీపాదజలంబు దేవలోకంబున మందాకినిని యనియుఁ బాతాళంబున భోగవతియనియు, భూలోకంబున గంగయనియు పేర్లు వహించి ప్రవహించుచున్నది.

అని యిట్లు నారదుండు వచించిన జరాసంధవధాభిలాషులై సభ్యులందఱు దండయాత్ర కుద్యుక్తులగుట చూచి కృష్ణుఁ డుద్ధవున కిట్లనియె.

మంత్రివరా! నీవు మాకుఁ బరమాప్తుఁడవు. మంత్రార్థతత్త్వ విదుండవు. మాకు లోచనములవంటి వాఁడవు. కావునఁ గర్తవ్యం బెద్ది యెఱిఁగింపుమనిన యుద్ధవుండు కృష్ణాభిప్రాయమును యుద్ధాసక్తులైన సభ్యులయభిప్రాయము గ్రహించి యిట్లనియె.

దేవా! నామతమున నారదమహర్షి వచించినట్లు స్వపక్షీయులు, బంధువులు, నిన్నే నమ్మియుండువారు, నిన్నుఁ బూజింపఁ గోరువారు నగుపాండవులయొద్దకు మనమెల్లఁబోయి క్రతుకార్యము దీర్చుటమేలు. ఏలన రాజసూయము శత్రుకోటినెల్ల జయింపక

కాఁజాలఁడుకదా. ఆ నిమిత్తమునఁ బాండవులు జరాసంధు వధింప వలసియుండును. మాగధుఁడు భీముచేఁ దప్ప నితరులచేఁ జచ్చు వాఁడుకాఁడు. శస్త్రాస్త్రమరణ మతనికి లేదు. భుజబలంబున నతని సాధింపఁగలవాఁడు వృకోదరుఁడు తప్ప నితరుండు లేఁడు. కావున బ్రాహ్మణవేషధరుండవై భీముండు చని మల్లయుద్ధంబునకుఁ బిలిచిన వాఁడు తప్పకచచ్చు. తడయక చచ్చు. నీ వాయనకు బాసటై నిలిచి యాయన కార్యంబు సాధించి రాజులను జెఱనుండి విడి పింపుము. కాల శరీరకుండవు ప్రాకృతమానవరూపుండవు నగు నీవు జగత్సృష్టిసంహారంబులు బ్రహ్మరుద్రుల నిమిత్తముగఁ గొనిగదా చేయుచుందువు. ఇప్పుడు భీము నిమిత్తమాత్రు నొనర్చి నీ వీ కార్యం బు సాధింపుము. బందిమందిరమునుండి విముక్తులైన రాజుల వీర జాతులు నిజభర్తృవియోగమోక్షణంబులను దమబాలురకు జోల పాటలుఁగ బాడుచుండఁగలరు. శంఖచూడాదివధంబున గోపికలను, మకరమువలనఁ గరిపతిని, రావణునిచెఱనుండి సీతాదేవిని, గంసాదుల వలనఁ దల్లిదండ్రులను రక్షించుట మునులును మేమును గీర్తించు చున్నారముగదా.

అంతియకాక రాజులకెల్లఁ గర్మపాశమగు నీ రాజసూయంబు తలపెట్టఁబడియెను. అది నిర్వహించిన ననేకార్థంబులు సాధింపఁబడును విని నారదరామ యుద్ధవృద్ధు లందఱు సరిసరి యని యంగీకరించిరి.

కృష్ణుండును రాజదూతంజూచి "రాజులారా! భయపడకుఁడు శీఘ్రకాలముననే జరాసంధుఁడు హతుఁడయ్యెడు" నని మీరా రాజు లకుఁ జెప్పుమని పనిచె. ఇట్లు రాజదూతం బనిచి శ్రీకృష్ణుండు పెద్దలయనుజ్ఞఁగొని దారుకజైత్రాదిభృత్యులనెల్లఁ బ్రయాణసన్నా హంబు సేయ నానతిచ్చె. వారును జతుర్విధ బలంబులతోడ సర్వంబు నాయత్తపఱుప శ్రీకృష్ణుండు రామయదురాజులచే ననుజ్ఞ గొని సపరిచారికలగు నంతఃపురస్త్రీలతోడఁ బయనమై దారుకుండు సగరుడధ్వజంబుగఁ దెచ్చిన తేరెక్కి శుభముహూర్తంబునఁ బయ

నించె. నారదుండును గృష్ణుచే ననుజ్ఞాతుండై గోవిందకీర్తనంబు చేయుచు నాకాశమార్గంబునఁ జనియె.

శ్రీహరియు నానర్తసౌవీరమరుదేశంబులును, గురుక్షేత్రంబును, గిరినది* కానన పట్టన గ్రామపక్కణంబులను గడచి దృషద్వతీ సరస్వతులం దరించి పంచాలమత్స్యదేశంబులు దాటి యింద్రప్రస్థపురంబుఁ జేరఁ జనియె. ఆయనరాక విని యజాతశత్రుండు మిత్రోపాధ్యాయసమేతుండై గీతవాదిత్రఘోషంబులు బ్రాహ్మఘోషంబులును బోరుకొనఁ బ్రాణయుతంబైన యింద్రియజాలంబుకరణి నైస్నేహవశంబునఁ గరఁగిన హృదయంబుతోఁ జిరకాలంబునఁ జూచిన ప్రియతము శ్రీకృష్ణు నెదుర్కొని కౌఁగిలించె. తన దీర్ఘబాహువుల రమాలయంబునగు ముకుందగాత్రంబు గాఢంబుగ నాలింగనంబుఁ గావించి యసుభరహితుండై యానందబాష్పంబులు వెల్లిగాఁ బాఱఁ బులకితకాయుండై లోకవ్యాపారంబు మఱచి ధర్మజుండు పరమసుఖ మనుభవించె. కృష్ణుండును మేనత్తకొడుకులగు ధర్మజభీమసేనులకు నమస్కరించి సమానవయస్కుండగు నర్జునుఁ గౌఁగిలించి తనకు మ్రొక్కిన నకులసహదేవుల నాదరించి బ్రాహ్మణులను వృద్ధులను దక్కినవారిని వారివారి యోగ్యతానుసారంబుగ నమస్కారాదుల గౌరవించి రేయియగుచుఁ జక్కని యలంకారంబుల మనోహరంబగు పురంబుఁ బ్రవేశించె.

పురమనేత్రపానపాత్రంబగు శ్రీకృష్ణుండు మహోత్సవంబుగ వీథుల రాకవిని పురకాంతాచంద్రవదనలు గృహకర్మములు చేయువారు వానిని జాలించియుఁ, బతులతోడ నుండువారు వారిని దల్పంబునందె వదలియుఁ జనుఁబాలుద్రావుబిడ్డల నందంద వీడియు, వీడని పతుల వేఁడియుఁ, గొప్పులు చీరలు జాఱ, విసవిస రాజమార్గంబునకుఁ బోయి మిద్దెలమేడల నెక్కి తెప్పార్పక చూచుచుఁ బూవులు దోయిలించి చల్లుచు మనస్సుచే నాయనను గౌఁగిలించి

---

*నది=ద్వంద్వంబున హ్రస్వాంతంబునగు; ఉ. నదిసుతగురుకర్ణ శల్యనాగపురీశుల్. భార. వరనది తటాకముల చేరువను వసింప. విజ్ఞానేశ్వరీయము.

పరవశలైరి. సుధాకరుంగూడిన తారలంబోలు శ్రీకృష్ణలోలలోచనలం గాంచి వీరెంత పుణ్యాత్మికలోకదా సదా! యుదారహాస లీలావలోకనంబుల ముకుందుఁడీ మందయానల కమందానందంబు కలిగించుచుండునని తలపోయుచుండిరి.

శ్రేణిముఖ్యులు మార్గంబున మంగళపదార్థపాణులై యెదురుకొని కృష్ణునకు సపర్యఁ గావించి హతపాపులైరి. అంతఃపుర జనంబులును గృష్ణు నెదుర్కొని గౌరవించిరి. అంతఁ గృష్ణుం డంతఃపురంబుఁ బ్రవేశింపఁ గుంతియుఁ బర్యంకంబు డిగి కోడండ్రతోడ మేనల్లునిఁ గౌఁగిలించె. కృష్ణుండును మేనత్తకు గురుస్త్రీలకు మ్రొక్కి తనకు మ్రొక్కిన ద్రౌపదీ సుభద్రల నాదరించె. కుంతీ నిదేశంబున ద్రౌపదియుఁ గృష్ణుని యష్టమహిషుల రుక్మిణీ, సత్యా, భద్రా, జాంబవతీ, కాళిందీ, మిత్రవిందా, శైబ్యా, నాగ్నజితులఁ దగురీతి గౌరవించె. సకలవిధంబుల దానమానాదుల నాదరింపఁబడుచు ససైన్యుండై కృష్ణుండు కొన్ని మాసంబు లింద్రప్రస్థంబున సుఖంబుండె.

## —♦ జరాసంధ వధ ఘట్టము. ♦—

అంత యుధిష్ఠిరుండు మునీంద్రులును బ్రాహ్మణ క్షత్రియ వైశ్య ముఖ్యులును సోదరులును నాచార్యజ్ఞాతి కులవృద్ధబాంధవులును బరివేష్టింప సభామధ్యమున నాసీనుండై యెల్లరు విన గోవిందున కిట్లనియె.

క్రతురాజంబైన రాజసూయంబున భవదంశభూతులగు దేవతల యజింపఁ గోర్కియయ్యెడు. అది కొనసాగువిధం బనుగ్రహింపుము. అమంగళంబుల నణంచు భవత్పాదుకలకుఁ బరిచర్య సేయువారును, ధ్యానించువారును, స్తుతించువారును, కమలనాభా! మోక్షమును సర్వవాంఛల నొందుదురుగాని యన్యు లొందఁజాలరు. దేవాది దేవా! భవదీయ చరణారవింద సేవామహిమంబు లోకంబనలోకించుఁగాక. కౌరవ సృంజయులందు నిన్ను భజించువారలయు భజింపని వారలయు గతి భేదంబు కానఁజేయుము. నీకు నొకరి

యందు దయయు స్నేహంబును, మఱియొకరియందు నిర్దయత్వము విషమబుద్ధియుఁ గలవని చెప్పను. సర్వాత్ముఁడవును, సమదర్శనుఁడవును, రాగాది యుక్తుండవుగాక కేవలానంద సమేతుండవును నగు నీయందుఁ బక్షపాతంబు గలదని యెట్లు నుడువుదు? అయినను గోరిన వారి కోరికలుదీర్చు కల్పవృక్షము భంగి నిన్ను సేవించువారికి సేవానురూపం బగు ఫలంబు ప్రసాదించుచుందువు. అనిన శ్రీకృష్ణుం డిట్లనియె.

నీవు చక్కఁగ నిశ్చయించితివి. ఈ శుభకార్య కారణంబున నీకీర్తి లోకంబున శాశ్వతంబగు. ఈ క్రతురాజంబు ఋషులకుఁ బితరులకు సర్వభూతములకుఁ బ్రీతికరంబు. నృపతుల నెల్ల జయించి దిగ్విజయంబు గావించి సమస్త సంభారంబులు సంతరించి యాగంబు సాగింపుము. నీయనుజాతులు లోకపాలాంశజాతులు. ఇంద్రియ జయంబు లేనివారికి దుస్సాధుఁడనైన నేను కృతాత్ముఁడనైన నీకు వశుఁడనై యున్నవాఁడ. నేనే తమకు దిక్కని నమ్మియుండువారిని దేవతలైనను శ్రీని, దేశమునను, యశస్సునను, సైన్యాదిసమృద్ధిని బరిభవింపఁజాలరు. అనిన ధర్మనందనుండు ప్రహృష్టవదనుండై విష్ణుతేజమున సంవర్ధిత బలులైన తమ్ముల దిగ్విజయార్థంబు నియోగించె. సహదేవుండు దక్షిణంబును, బడమర నకులుండును, నుత్తర మర్జునుండును దూర్పు భీముండును నరిగి భూపతులనెల్ల జయించి వారలొసఁగిన విస్తార ధనంబును గొని యరుదెంచిరి. ధర్మరాజు తత్కార్యంబునకు సంతుష్టుండయ్యు జరాసంధుండు జితుండు గామి యాగంబు సాగింప ననువుపడమి కాలోచించుచుండఁ గృష్ణుండు యుద్ధవుండు చెప్పిన యుపాయంబుఁ దలఁచి యాకార్యంబు నేను నెఱవేర్తునని నమ్మఁబలికె.

## భీముఁడు జరాసంధు వధించుట

కృష్ణ భీమార్జునులు బ్రాహ్మణ వేషధారులై జరాసంధుం డుండుగిరివ్రజపురంబునకుఁ బోయి యతండు బ్రాహ్మణపూజ సేయు సమయంబెఱింగి డాసి, రాజా! మేముదూరాగతులము. అతిథులము,

నీగృహంబున కరుదెంచితిమి. మాకోర్కి దీర్పుము. నీకు మేలయ్యెడు. శాంతచిత్తులకు సహింపరానిదెయ్యది ? సమదర్శులకుఁ బరులెవ్వరు ? సజ్జనగేయంబై శాశ్వతంబగు కీర్తిని సమర్థుఁడయ్యు నెవ్వఁడు సంపాదింపఁడో వాఁడు నింద్యుఁడు. వాఁ డొక్కఁడే శోచ్యుఁడు, హరిశ్చంద్ర, రంతిదేవ, ముద్గల, శిబి, బలి, కపోత, వ్యాధులులోనగువారనేకు లధ్రువంబగు శరీరంబుచే ధ్రువంబైన యశస్సు సంపాదింపరే యనిన జరాసంధుండు స్వరమును, నాకృతులను, నల్లెత్రాటి రాపిడులఁ గాయలు కాచిన ముంజేతులను జూచి వీరు రాజన్యులనియుఁ బూర్వము తానుజూచినవారనియు, క్షత్రియులయ్యు బ్రాహ్మణవేషధారులనియుఁ దలంచి కానిమ్ము. వీరే నన్ను యాచించిరట. వినుమరాని ప్రాణమైన వీరికై యిచ్చెదను. బ్రాహ్మణ రూపంబున వచ్చిన విష్ణువు వాంఛితంబు తన కనర్థకరమని తెలిసి తెలిసి హేతువు వారించుచున్నను వినక తీర్చి సకలైశ్వర్యంబు గోలుపోయియు బలిశాశ్వతకీర్తి గడింపఁడే. కీర్తికాంక్షగల క్షత్రియుం డశాశ్వత శరీరంబున నభిమానముంచి బ్రాహ్మణుల కోర్కి దీర్పక యపయశస్సు పాలగునేయని నిశ్చయించి వారింజూచి విప్రులారా ! మీకోరిక దెలుపుఁడు ; నా శిరంబైన మీ కొసఁగెదననిన శ్రీకృష్ణుం డిట్లనియె.

రాజేంద్రా ! మా కోరికదీర్చు తలఁపుగలదేని మాలో నొకనితో ద్వంద్వయుద్ధ మొనర్పుము. రాజన్యా ! జన్యకాంక్ష వచ్చితిమి గాని యన్యకాంక్ష వచ్చినవారము గాము. ఈతండు వృకోదరుండు. ఈతం డాతనితమ్ముఁ డర్జునుండు. వీరు నాకు మేనత్త కొడుకులు. నీకు శత్రువగు కృష్ణుఁగా నన్నెఱుఁగుము.

అని గదాధరుండు పలికిన మాగధుండు బిగ్గ నవ్వి కనలున మందులారా! యుద్ధభిక్ష నొసఁగెదను, నెఱసరివిగాక పిఱికివై స్వపురంబు మథురానగరంబు వీడి వెన్నిచ్చి పఱచి సముద్రమున డాఁగిన నీతోఁ బోరుట పౌరుషహాని. ఈ యర్జునుండు నాకంటె వయస్సునఁ బిన్నవాఁడు. అతిబలవంతుఁడును గాఁడు. నాకు సముండును గాఁడు. కావున బలమున నాతోఁ దుల్యుఁడగు భీమునితో యుద్ధ మొనర్చెద.

అని యనిలతనయునకు మహాగదయొండొసఁగి యట్టిది రెండవది తాను గైకొని పురబాహ్య ప్రదేశంబునకు వారిని దోడ్కొని చనిరి. అందు సమతలంబున సమర గుర్కురులగు మాగధ వృకోదరులు వజ్రకల్పంబులైన గదలతోఁ బోరఁ దొడఁగి నాట్యరంగంబునందలి నటులన మండలాకారంబులుగను, కుడి యెడమలుగను, నెడమకుడులుగను, నొండొరు చుట్టుచు గదల నొకరినొకరు నడువ వాని తాఁకునఁ బుట్టిన ఛటచ్ఛటాశబ్దంబులు పిడుగువడుటలఁ దలపించుచుండె. పరస్పరఘర్షణంబునఁ బుట్టిన మిణుఁగురులు మిఱుమిట్లు గొలుపుచుండె. అంతఁ గొంతవడికి నా గదలు తునకలై రాలిన నా యిరువురు జోదులు మల్లయుద్ధంబునకుఁ గడఁగి పిడుగులఁబోని పిడికిళ్ళ నొకరికొకరు ఘట్టనాకారంబులు ఘోరంబులుగ నొప్పించుచు నెనుటిపోటు తప్పించుచుఁ జవాలునఁ గుప్పించుచు సమబలులై పృష్ఠభాగము సంపూర్ణమూర్ఛ పూర్ణకుంభము లోనగు చమత్కారంబులు నెఱపుచు నీడఁబోవక హెచ్చుతగ్గులు లేక పెఱుదివియక వెన్నియక పోరుచుండ జరాసంధుండు రెండు తునకలుగ జన్మించి జరయను రాక్షసిచే సంధింపఁ బడి జీవితుండగుటయు వాని మృతివిధంబు నెఱింగిన కృష్ణుండు నిజతేజంబున భీమునకు బలాభివృద్ధి గావించి యరిననోపాయంబుఁ జింతించి యప్రమేయాత్మకల్పుండు భీముండు చూచుచుండ శత్రు నిట్లు చీల్పుమని యర్థమగునట్లు లోక రెమ్మను రెండుగాఁ జీల్చిచూపె. వాయుతనయుం డాసన్న యెఱింగి యాసన్నమరణుండగు వగతునిఁ జరణంబులంబట్టి ధరణిం బడవైచి యతని యొకపాదంబు తనపాదంబునం ద్రొక్కిపట్టి రెండవ పాదంబును గేలఁగొని యేనుఁగు పెనుఁగొమ్మలఁ జీల్చునట్లు గుదమునుండి రెండుగఁ జీల్చె. ఒక్కొక్క కాలితోడఁ బెఱుఁగు చన్ను చేయి కన్ను కనుబొమ్మగల రెండుఖండంబులఁ జూచి ప్రజలు మాగధుండు హతుండయ్యెనని హాహాకారంబులు గావించిరి. కార్తికశుద్ధ ప్రతిపత్తునందు యుద్ధమారంభమై పున్నమనాఁడు జరాసంధుఁ డీల్గె.

విజయుండగు విజయాగ్రజు విజయాచ్యుతులు కౌఁగిలించి ప్రశంసించిరి. కృష్ణగాత్ర సంస్పర్శంబున వాయుజుండు వీతరుజుండయ్యె. అంత వాసుదేవుండు జరాసంధ తనయుండైన సహదేవునకుఁ బట్టాభిషేకంబుఁ గావించి చెఱఁబడిన పుడమి ఱేఁడుల నెల్ల బంధముక్తులఁ గావించె.

జరాసంధునిచే గిరిద్రోణియందు బద్ధులైనరాజు లిరువదివేల యెనిమిది నూర్లమంది బంధముక్తులై యాఁకలి దప్పుల వాడిన మోములతోఁ, జిక్కిన మేనులతోఁ, మాసిన చేలలతోఁ, మలినగాత్రములతో వచ్చి నీలమేఘశ్యాముండును, సౌందర్యధాముండును, బీతకౌశేయవాసుండును శాలితగాసుండును, శ్రీవత్స లక్షితుండును, యశోదాశిక్షితుండును, జతుర్భుజుండును, సేవితసకలభూభుజుండును, కమలదళవిశాలనయనుండును జతుశ్శ్రీవక్షయనుండును, చారుప్రసన్న వదనుండును, లక్ష్మీసదనుండును, జలన్మకరకుండలుండును రక్షితత్రిజగన్మండలుండును, బద్ధాహస్తుండును భువనప్రశస్తుండును, వనమాలాహారుండును, గరుడోదారుండును భ్రాజద్వరమణిగ్రీవుండును మహానుభావుండును, నగు దామోదరు నేత్రపుటంబులఁ గ్రోలునట్టును, జిహ్వాకలఁ జవిగొనునట్టును, నాసాపుటంబుల మూర్కొనునట్టును, బాహువులఁ గౌఁగిలించినట్టును గాంచి నిరస్తసమస్తకల్మషులై తమశిరంబులు హరిచరణంబులు సోఁక వ్రాలి నమస్కరించిరి. కృష్ణసందర్శన మాత్రజనిత సంతోషంబునఁ దమపడినపాట్లు మఱచి కేలు ముకుళించి యిట్లని ప్రశంసించిరి. దేవాదిదేవా మహానుభావా! ప్రసన్నార్తిహరా! కమలామనోహరా! యవ్యయా! నతజనదురితవ్యయా! నమస్కారంబులు. ఘోరసంసారకూపారంబున మునిఁగి పారంబు గననేరని యీ విపన్నులఁ బ్రపన్నులఁ బ్రసన్నుండవై కృష్ణా! యుద్ధరింపుము, మధుసూదనా! మాగధుండు మమ్ము రాజ్యశ్రీ భ్రష్టులఁజేసి కష్టపెట్టె నని యాతనిఁబై నీకుఁ గినియము. భవదీయపాదారవింద సందర్శన మహాలాభంబు చేకూరుటంజేసి మేమది యనుగ్రహంబకా భావించెదము. మఱి యతని సంభావించెదము. రాజ్యలక్ష్మీమత్తుండుద్ధతచిత్తుండై శ్రేయస్కరంబగు మార్గంబు గానలేక నీ మాయకు

లోనైన నశ్వరంబగు నైశ్వర్యంబు స్థిరంబని సర్వదా తలంచుచుండుఁ గాని సర్వదాతవగు నిన్ను సేవింపము. మందబుద్ధు లెండమావుల నీటిపట్టులుగఁ దలంచునట్లు లవివేకులగు రాజులు ప్రస్పందనాది వికారాత్మికయగు ప్రకృతిని నయథార్థంబగు దానియథార్థ వస్తువుఁగా విశ్వసింతురు. పూర్వము శ్రీమదాంధులమై కన్నుఁగానక మిన్ను మన్నెఱుంగక స్పర్ధాళులమై యీ పుడమినిమిత్తమై యొండొరుల జయింపఁగోరి నిర్దయులమై మున్ముందు మృత్యువు నిన్ను గణింపక స్వప్రజలఁ జంపియుఁ జంపించియు గర్వితులమై చరించితిమి. అట్టి మేము గంభీరవేగంబును దురంతవీర్యంబును, భవచ్ఛరీరంబును నగు కాలంబు మహిమచే భవత్కృపాతిశయంబున భ్రష్టశ్రీకులము, వినష్టదర్పులమునై నీ పాదారవింద భజనానందమునఁ దేలఁగోరెదము. సదారోగముల కుత్పత్తిస్థానభూతమై నశించు శరీరముచే భోగింపఁదగు మృగతృష్ణారూపసంపదను నైహికవిషయ సుఖంబును గోరము. శ్రవణరుచిజనక మాత్రంబైన స్వర్గాదిభోగ రూపక్రియా ఫలంబులను నభిలషింపము. మేము సంసారమార్గ సంచారంబు గావించుచుండినను దేవా! తావకీనచరణారవిందంబులందు నెడతెగని స్మృతి యేయుపాయంబునఁ గలుగు దాని నానతీవే. కృష్ణా! వాసుదేవా! హరీ! పరమాత్మస్వరూపా! ప్రణతార్తిహరా! గోవిందా! నమస్కారంబులు. అని యిట్లు తన్ను వినుతించు భూపతులం గాంచి కరుణాఖండుఁడైన ముకుందుండు మృదుమధుర వాక్యంబుల నిట్లనియె.

నృపాలకులారా! మీ రభిలషించినట్లు సకలేశ్వరుండనైన నా యందుల భక్తి మీకు స్థిరంబగును. శ్రీమదైశ్వర్యమదంబు నరుల నున్మాదులఁ జేయునని మీ వాక్యంబు సత్యంబు. కార్తవీర్యార్జునుండును, నహుషుండును, వేనుండును, రావణుండును, నరకుండును లోనుగ దేవదైత్య నరేశ్వరు లైశ్వర్య మదంబునంగాదె స్థానభ్రష్టులైరి. పుట్టినదియెల్ల గిట్టుననునిశ్చయముగలవారై యజ్ఞంబుల నన్నుఁ బూజించుచు ధర్మపథంబునఁ బ్రజల రక్షింపుఁడు. సంతాన తంతువుల విస్తరింపఁజేయుచు జననమరణములకు సుఖదుఃఖములకుఁ బొంగక క్రుంగక నామీఁద మనస్సు నిలిపి ప్రాప్తంబు సేవించుచుఁ

జరింపుఁడు. దేహాదులయం దుదాసీనులరై యాత్మారాములరై దృఢవ్రతులరై నాయందుఁ జక్కఁగ మనంబు నిల్పితిరేని కడపట నన్నుఁ బొందఁగలరు.

అని యుపదేశించి యా దేశిక దేశికుండు వినుమజ్జనులైన యజ్జనపాలురకు మజ్జనాదులఁ గావింపఁ గజ్జలవతుల నియమించి జరాసంధతనయుండైన సహదేవునకుం జెప్పి వారికి రాజోచితంబులైన వాసోభూషణమాల్యలేపనాదుల నిప్పించి మజ్జన భోజన భోగాదుల సపర్యఁ గావింపఁ జేసె. క్షితిపతులును యదుపతి పూజితులై కష్టములకుం బాసి వర్షాంతంబున గ్రహములవలెఁ బ్రకాశించిరి. అంత వారు కనకరత్నభూషితంబులైన రథంబులెక్కి యుక్కపట నాటక సూత్రధారుండైన జగదాధారుఁ గృష్ణుని జిష్ణుని భీమసేనుని మేలి వాక్యంబుల శ్లాఘించి తమతమ దేశంబులకు నాగదాగ్రజు స్మరించుచుఁ దత్కృత్యంబుల మెచ్చుచుఁ బోయి తను మంత్రులు లోనగువారికెల్ల నల్లన నల్లనయ్య తంత్రంబులు దెలిపి సముచితరీతి నడచుకొనుచుండిరి. వసుదేవసుతుండు సహదేవ పూజితుండై భీమార్జున యుతుండై యింద్రప్రస్థంబున కరిగి విజయవార్త దెలిపి సుహృజ్జనులనెల్ల సంతోషపఱుప యుధిష్ఠిరుం డానంద బాష్పంబులు విడుచుచు నేమియుఁ బలుకఁ జాలకుండె.

అంతఁ గొంతవడికిఁ బ్రకృతిస్థుండై ధర్మరాజు శ్రీకృష్ణుం గని సకల లోకేశ్వరులు నీ శాసనంబుఁ బూలసరంబులవలె శిరంబులఁ దాల్తురు. అట్టి నీవు దీనులు మానముక్తులునైన మా శాసనంబు చొప్పున వర్తింతువనుట వంచనంబకాని యితరంబుకాదు. సూర్యాస్తమయముల సూర్యునకుంబోలె సద్యోతీయుండవును బరబ్రహ్మంబవు నగు నీకును గర్మములచేఁ దేజోభివృద్ధి యొండె హాని యొండెఁ గలుగ నేరదు. నేను నాయది నీవు నీయది యనుభేదబుద్ధి పశుప్రాయులగు నజ్ఞానులకుంబోలె నీభక్తులకుఁ గలుగ నేరదు.

అని ప్రశంసించి సమర్థసమయంబునకు వేచి కృష్ణానుమతిని రాజసూయయాగం బొనర్పఁ బ్రారంభించె. వ్యాస భరద్వాజ

సుమంతులు పరశురాముఁడు లోనగు బ్రహ్మవాదులగు బ్రాహ్మణులను ఋత్విజులుంగా గ్రహించె. భీష్ముని, సపుత్రు ధృతరాష్ట్రుని, ద్రోణ కృప విదురాదులను బిలిపించె. మఱియు ననేక రాజులు సకళత్ర పుత్రమిత్ర బంధువర్గులై చనుదెంచిరి. సర్వజన జేగీయమానంబై యధ్వరంబు సాగె.

అంత నభిషేకదినంబున నాసమూఁగిన లోకంబునఁ బ్రథమ పూజ కెవ్వం డర్హుం డను సందేహంబు పొడమి యుధిష్ఠిరుం డాలోచించుచుండ భీష్ముం డిట్లనియె.

## —♦ శిశుపాల వధ ఘట్టము. ♦—

ధర్మనందనా! యాలోచించెద వేల? యథార్హంబుగ రాజుల నెల్ల నర్చింపుము. ఆచార్యుఁడు ఋత్విజుఁడు బంధువు స్నాతకుఁడు మిత్రుఁడు రాజు ననువారాఱుగురు పూజార్హులు. వీరిలో సంవత్సర కాలము తనతోడ నెవ్వరు వసింతురో వారు పూజ కర్హులని పెద్దలు వక్కాణింతురు. ఇచ్చటఁ జేరిన వారందఱు జాలఁగాలముగ నిం దున్నవారు. కావున నందఱుఁ బూజార్హులే. కావున వీరిలో శ్రేష్ఠుఁ డగువానిఁ దొలుత నర్చింపుము. అనిన యుధిష్ఠిరుండు ధర్మవిధి నెవ్వ రగ్రపూజ కర్హులో నీవే నిశ్చయించి చెప్పుమనిన భీష్ముఁ డాలోచించి యిందు మూఁగినవారిలో గ్రహము లందు సూర్యునివలెఁ దేజోబల పరాక్రమంబులఁ గృష్ణుండు శ్రేష్ఠుండు. చీఁకటితలంబు సూర్యుని చేతను, నిర్వాత ప్రదేశంబు గంధవహునిచేతను, బ్రకాశమానము హ్లాదితమునగు నట్లు మన సభ కృష్ణునిచే రాజిల్లుచున్నది. అనిన భీష్మానుజ్ఞాతుండై సహదేవుం డర్ఘ్యంబు కృష్ణున కిచ్చె. శ్రీ కృష్ణుం డును సంప్రీతి దానిం బరిగ్రహించె.

తనకుఁ జిరకాల శత్రువైన కృష్ణునకుఁ దొలుత నర్ఘ్యమిచ్చు టయు నాయన పరిగ్రహించుటయు, జూపోపక చేదిపాలుండగు శిశు పాలుండు కోపతామ్రాతుండై సభామధ్యంబున నిట్లనియె.

ధర్మనందనా! మహాత్ములయిన భూపాలుర మధ్యంబునం దా నొక రాజువోలెం గూర్చుండి యీకృష్ణుం డర్ఘ్యంబుగొన నర్హుండు గాఁడు. పాండవేయా! దేవకీ పుత్రునిఁ దమ యిష్టముచొప్పున నర్చించుట మహాత్ములగు పాండవులకు యుక్తంబు గాదు. పాండవులారా! మీరు బాలురు. ధర్మసూక్ష్మత నెఱుంగరు. అల్పజ్ఞానియగు నీ నదీపుత్రుండును ధర్మ మతిక్రమించి వర్తించె. ఓయి భీష్మా! నీవలె ధర్మమెఱింగినవాఁ డిచ్ఛాకాలమూరి యుద్యోనేని సజ్జనులు ప్రాజ్ఞులతని నిందింపక మానరు. యుద్ధాపాయంబునఁ బుట్టుటచే రాజుగాని దాశార్హుం డు సర్వరాజమధ్యంబునఁ బూజార్హుం డెట్లయ్యె? ధర్మజా! కృష్ణుఁడు వృద్ధుఁడని పూజించితివందువా యతని తండ్రి వసుదేవుం డిండ యుండ నతని సుతుఁ డెట్లు పూజ్యుండయ్యె? మాకిష్టుండు గావునఁ గృష్ణుండు పూజ్యుండందువా మీమామ ద్రుపదుం డిండ యుండఁ గృష్ణుం డెట్లు పూజార్హుం డయ్యె? కృష్ణుఁడు మాకాచార్యుఁ డంటివా ద్రోణుండుండఁ గృష్ణుం డెట్లు పూజ్యుండయ్యె? ఋత్విజుఁ డని పూజించితి నందువా వ్యాసమహర్షి యుండఁ గృష్ణుఁ డెట్లు పూజార్హుం డయ్యె? కులవృద్ధుండంటివా వశీకృత మృత్యువు భీష్ముం డుండఁ గృష్ణు నేల పూజించితివి? వీరుఁడని యంటివా, సర్వశస్త్రవిదుం డగు నశ్వత్థామ గదా పూజ్యుండు? కృష్ణుం డెట్లయ్యె? రాజేంద్రుం డగు దుర్యోధనుఁడు, నాచార్యుఁడగు కృపుఁడు, కింపురుషాచార్యుం డగు ద్రుముఁడు, మీకుఁ దండ్రి యట్టివాఁడు భీష్మకుఁడు, నేకలవ్య రుక్మిశల్యులును, మహాబలుఁడును బరశురామప్రియశిష్యుఁడును, ననేక రాజన్యజేతయునగు కర్ణుఁ డుండఁ గృష్ణు నేమని పూజించితివి? కృష్ణుఁడు ఋత్విక్కు గాఁడు. ఆచార్యుఁడు గాఁడు. రాజును గాఁడు. వృద్ధును గాఁడు. అట్టివానిని నిచ్ఛకములకై ప్రియము సేయఁగోరి యర్చించితివి. పోనీ. మధుసూదనుఁడు మీకు నర్చనీయుఁడగునేని యీ రాజుల నెల్లఁ బిలిపింపనేల? ఇట్లు లవమానింపనేల? నీకు మేమెల్లఁ గప్పము గట్టుటకుఁ గారణము భయము లోభము సాంత్వమని తలఁచితివా? నీవు మహాత్ముఁడవని ధర్మమార్గవర్తివి పార్థివత్వము కోరువాఁడవని

తలఁచి యిచ్చితిమి. ఇట్టి మమ్ము నీవే యవమానించితివి. ఇట్టి రాజసభలో రాజలక్షణహీనుఁడగు కృష్ణునిఁ బూజించుటకంటె నవమానకర మింకేది గలదు ? ఆహా ! ధర్మపుత్రుఁడు ధర్మాత్ముఁడను కీర్తి నిమిషమున మాసెఁగదా. ఇట్టి యధర్మకార్యము చేయు నీకు ధర్మరాజను పేరెట్లు సార్థకము ? వృష్ణికులమునఁ బుట్టిన యీదురాత్ముఁడు మహాత్ముఁడగు జరాసంధు నన్యాయమార్గంబున వధించె. యుధిష్ఠిరుఁడు తన ధర్మాత్మత్వము పోనాడి కృపణత్వమును బ్రకటించెను. ఓయి కృష్ణా ! తపస్వులగు పాండవులు కృపణత్వము చేతనో భీతి చేతనో నీకు నర్ఘ్యమీయ నేవేల వారింపనైతివి ? నీ యోగ్యత నీమాత్రమో నీవెఱుఁగవా ? పూజానర్హుఁడవయ్యుఁ బూజ నేల యంగీకరించితివి ? కుక్క పురోడాశమును గ్రహించినట్లు నీ యోగ్యతకుఁ దగని పూజను నీ నీచబుద్ధు లిచ్చినను నీవెట్లు గ్రహించితివి ? ఈ యకార్యముచే రాజుల నవమానించినవాఁడవు నీవు కాని పాండవులు గారు. షండునకు భార్యయు, గ్రుడ్డికి సుందరపదార్థదర్శన, మెట్టిదో రాజుగాని నీకీపూజయు నట్టిద, ధర్మరాజెట్టివాఁడో, భీష్ముఁడెట్టివాఁడో, వాసుదేవుఁ డెంతటివాఁడో, వారిగుట్టు రట్టయ్యెను. అడిగినవాఁడు వియోనిజుఁడు. ప్రత్యుత్తరమిచ్చినవాఁడు నదీసుతుఁడు. అర్ఘ్యము గ్రైకొనినవాఁడు గోపాలుఁడు. ఇచ్చినవాఁడును వియోనిజుఁడె. ఇక్కడఁ జేరిన సభ్యులందఱు నోరులేని మూఁగలు. ఇట్టి సభలో నుండుట మానహానికిఁ గారణమని లేచి శిశుపాలుఁడు తనతోడి రాజులతోడ సభ విడిచిపోయెను.

ధర్మరాజతని వెంటఁబోయి పెద్దవారి నిట్లు మాటలాడుట తగదని సమాధానపఱచుచుండ భీష్ముఁ డిట్లనియె. కౌంతేయా ! లోకవృద్ధులందెల్ల వృద్ధుఁడగు కృష్ణునిఁ దిరస్కరించి పలుకువాఁడు దానమానసాంత్వనముల కర్హుఁడుగాఁడు. ఏక్షత్రియుఁడు రణమున క్షత్రియుని జయించి విడుచునో యట్టివాని కాజేత గురువగుచున్నాఁడు. ఇక్కడ గుమిగూడిన పుడమిఱేఁడులలోఁ గృష్ణునిచే జయింపఁబడనివాఁ డెవ్వఁడున్నవాఁడు ? ఈ మహానుభావుఁడు మాకు

మాత్రముగాక మూఁడులోకములకు నర్చనీయుండే. ఈ కృష్ణుడు పెక్కురు రాజుల జయించుటచేతను సమస్తజగ మీయనయందే ప్రతిష్ఠితమగుటను మే మీయన నర్చించితిమి. శిశుపాలా! నీవిట్లు పలుకుట తగదు. జ్ఞానవృద్ధుల ననేకుల నుపాసించి తత్త్వమెఱిఁగితిని. వారెల్లఁ గృష్ణుని గుణములను నాకుఁ దెలియఁబలికిరి. ఈయన జన్మప్రభృతి యొనరించిన మహాకార్యంబుల నెల్ల బుద్ధిమంతులు పొగడుచుండ వింటిని. ఓయి చేదిరాజా! మేము కేవలము కామముచేఁగాని బాంధవముఁ దలఁచిగాని యీతఁడు సలిపిన లాభ మాశించిగాని జనార్దనుఁ బూజించినవారము గాము. సర్వభూతసుఖావహుఁడై సజ్జనార్చితుఁ డగుట నర్చించితిమి. ఇక్కడ నుండువారిలోఁ గేవల బాలునిఁగూడ మేము విమర్శింపక విడచినవారముగాము, కావునఁ దక్కిన గుణవృద్ధుల నెల్ల వదలి కృష్ణు నర్చించితిమి. బ్రాహ్మణులందు జ్ఞానవృద్ధుఁ డగువాఁడు బాలుఁడైనను బూజ్యుండు. అట్లులే క్షత్రియులందు బలాధికుండును, వైశ్యులందు ధనధాన్యవంతుఁడును, బూజ్యులు. శూద్రులందు వయోవృద్ధుఁడు పూజ్యుఁడు. వేదవేదాంగవిజ్ఞానము, బలాధికత యను రెండుకారణంబులచే శ్రీగోవిందుఁ బూజించితిమి. నరలోకమునఁ గృష్ణునికంటె నీ రెంట నధికుఁ డెవ్వఁడు? దానము, దాక్ష్యము, శ్రుతము, శౌర్యము, హ్రీ, కీర్తి, యుత్తమబుద్ధి, వినయము, శ్రీ, ధృతి, తుష్టి, పుష్టి యివి కృష్ణునందు నిత్యములైయున్నవి. ఇట్టి లోకసంపన్నుని, నాచార్యుని, బితరుని, దండ్రిని, గురువును, బూజ్యుని నర్ఘ్యమిచ్చి యర్చించితిమి. అందరు మమ్ము క్షమింపుఁడు. ఋత్విజుఁడు, గురువు, పిలిచి బిడ్డనీయఁ దగినవాఁడు, స్నాతకుఁడు, నృపతి, ప్రియుఁడు, నగుకృష్ణు నర్చించితిమి. లోకముల యుత్పత్తిలయములకుఁ గృష్ణుఁడే కారణము. ఈ చరాచర రూపకప్రపంచము కృష్ణోద్భవము. ఇతఁడే యవ్యక్తప్రకృతియుఁ గర్తయు, సనాతనుడు, సర్వ భూతములకు బరుఁడు. కావున నీయనను నర్చించితిమి. మనోబుద్ధ్యహంకారములు పంచభూతములు. జరాయుజాది చతుర్విధభూతము లీయనయందే ప్రతిష్ఠగొనియున్నవి. సూర్యచంద్రగ్రహ నక్షత్రములు, దిక్కులు,

విదిక్కులు, సర్వము కృష్ణునందే ప్రతిష్ఠ గొనినవి. వేదములకు నగ్నిహోత్రము ముఖము, ఛందస్సులకు గాయత్రి ముఖము మనుష్యులకు రాజు ముఖము. నదులకు సముద్రము ముఖము. నక్షత్రములకుఁ జంద్రుఁడు ముఖము. తేజోవంతులకు సూర్యుఁడు ముఖము. అడ్డము, క్రిందుమీఁదు గమనముగల ప్రపంచముండువఱకు సదేవకమైన లోకములందుఁ గేశవుఁడే ముఖము. నృపాలురారా! యీ శిశుపాలుఁడు బాలుఁడు. తెలిసినవాఁడుగాఁడు. సర్వకాల సర్వావస్థలఁ గృష్ణునిట్లు నిందించుటే యితనికిఁ గార్యము. మతిమంతుఁడగు నరుఁడే ధర్మము విమర్శించి తెలిసికొనునో దాని నీతఁ డెఱుఁగఁడు. వృద్ధులొండె బాలురొండె రాజులొండెఁ గృష్ణునర్చింప నొల్లని వారెవ్వరు? ఇతఁడు మే మకార్యము నొనర్చితిమని నిశ్చయించెనేని నేది న్యాయమో యది యాతఁ డొనర్చునుగాక.

అని భీష్ముఁ డిట్లు పలికిన శిశుపాలుఁడు వికటభ్రూకుటిఫాలుఁడు కోపరక్తనయనుఁడు నయ్యె. దానిం గని సహదేవుండు సభామధ్యంబున లేచి చేదిరాజా! యీకార్యము నేను బుద్ధిపూర్వకముగఁ జేసినవాఁడను. కారణము వినుము. రాజుల కెల్లఁ గృష్ణుఁడే గురువు. కృష్ణునికంటె శ్రేష్ఠుండగు వేఱొకరుండు లేఁడు. రాజు లందఱు మమ్ము క్షమింపుఁడు. అటుగాక యెవ్వఁడైన సహాయపడి సైన్యసమేతుఁడై జన్యమునకుం దొడరెనా వానితలపై నాపాద ముంచెదను. అని సభలోఁ జరణమును జూపెను. అంత సహదేవుని శిరంబుపైఁ బుష్పవర్షంబు గురిసె. ఆకాశవాణియు మేలుమేలని ప్రశంసించె. అంతఁ ద్రికాలజ్ఞుండైన నారదుండు లేచి కృష్ణాజినంబు జాడించి యెల్లరు విన నిట్లనియె. కమలపత్రాక్షుఁ గృష్ణు నెవ్వఁ డర్చింపఁడో వాఁడు జీవన్మృతుఁడు. సంభాషింప నర్హుఁడుగాఁడు. అంతసహదేవుండు పూజనీయుల బ్రహ్మక్షత్రాదుల నెల్ల సొరిదిఁ బూజించి యాకార్యంబు సమాప్తంబు గావించె. అట్లు కృష్ణుండు పూజింపఁబడుట గాంచి సునీథుండైన శిశుపాలుండు రాజసమూహంబు వంకఁగని క్షత్రియోత్తములారా! నేను సేనాపతిగ నుండెద. మన మందఱము

వృష్ణిపాండుతనూజులఁ జాఁకి యజ్ఞమునకు విఘ్న మాపాదింతును. అనిన వారందఱు నట్లగుఁ గాక యని గుములుగూడి సేనలఁ బన్ని జన్నమునకు విఘ్నము గావింపఁ బన్నాగము పన్నుచుండిరి. ప్రళయమారుతాభిహతంబైన సాగరంబునఁ బోలె సంక్షోభించు రోషచలిత రాజమండలంబు గని యుధిష్ఠిరుండు భీష్మునితో నిట్లనియె.

పితామహా! రాజులందఱు నాక్రుద్ధులై మనపైఁ గవియ నుంకించుచున్నారు. అధ్వరంబు ప్రధ్వంసితమై ప్రజలు నశింతురో యని భీతిల్లెద. దీనిని వారింప సహాయ మేమనిన గంగానందనుం డిట్లనియె. ధర్మజా! వెఱవకుము. క్షుద్రమృగములు నిద్రించు సింహమును లేప యత్నించునట్లు వీరందఱుఁ గృష్ణునిఁ జెనకి లేపయత్నించుచున్నారు. ఆయన లేచువఱకు వీరిట్లు వదరుచుందురు. అని కృష్ణుండు బాల్యమునఁ జేసిన మహాకార్యము లెల్లఁ దెలిపి సమాధానపఱచిన నవ్వాక్యంబులు విని కుపితుండై శిశుపాలుండు గాంగేయునితో నిట్లనియె.

ఓరి కులపాంసనుఁడగు ముదుకా! బిభీషికోక్తుల రాజమండలము బెదరింప నీకేల సిగ్గులేదు. నపుంసకుఁడ వగు నీకిట్టివర్తనము తగియున్నది. అంధు ననుసరించు నంధులవలె నావఁ గట్టఁబడిన నావవలె నిన్నొక పెద్దగ నెంచిన కౌరవులు వినాశము గాఁగలవారు. కృష్ణుని పూతనావధలోనగునవి గొప్ప కార్యములుగఁ గీర్తించితివి. అది వినవిన మనమునకుఁ జాలఁ బరితాపమయ్యెడి. గర్వివి, మూర్ఖుఁడవునై కృష్ణునిఁ బ్రశంసించు నీజిహ్వ యేల శతధా ఖండములు గాకున్నదో? పసిబాలురకును నింద్యుండగు నీ గొల్లని జ్ఞానవృద్ధుండ వగు నీవెట్లు పొగడ నిచ్ఛగించితివి? కృష్ణుండు బాల్యమందొక పక్షిని జంపిన నందేమి చిత్రము గలదు? యుద్ధసామర్థ్యములేని గుఱ్ఱమును నెద్దును జంపుటేమి గొప్ప కార్యములు? ప్రాణములేని కట్టెబండిని గాల విఱుగఁ దన్నుట మహాద్భుతమా? పుట్టపెరిఁగి కొండవలెనున్న గోవర్ధనము నేడు నాళ్లెత్తుట ఘనకార్యముగ నాకుఁ దోఁచదు. కొండమీఁద నాడుచు విశేషాన్నము భుజించెనని చెప్పితివి. ఇట్లు

నీవు చెప్పుట వినువారికి వింత గొలుపుచున్నది. కంసవధ ప్రస్తావించితివి. ఆయన యన్నము దిని యాయనను వధించుటను నీవు ప్రశంసించుటే వింత. ఓకీ కురుకులాధమా! స్త్రీలను గోవులను బ్రాహ్మణునిఁ దన కన్నము పెట్టినవానిని శరణాగతుని వధింపరా దను నీతి నీవు విననివాఁడవు కావు. తల్లి పుట్టినిల్లు మేనమామదగ్గఱ బొగడినట్లు కృష్ణుని స్థితి నాకుఁ దెలియనట్లు జ్ఞానవృద్ధుఁడని వృద్ధుఁడని నాయకుటనే స్తుతించితివి. నీ వాక్యముల బలమున గోవధ స్త్రీవధ చేసినవాఁడు పూజ్యుఁడగు నేని యిఁక శాస్త్రవాక్యములతోఁ బని యేమి? ఇతఁడు బుద్ధిమంతులలో శ్రేష్ఠుఁడు. ఇతఁడు జగత్ప్రభు వని నీవు బట్టువలెఁ బొగడెడి మాటలు విని తాను నిక్కముగ నట్టివాఁడుగాఁ గృష్ణుఁడు తలంచుచున్నాఁడు. అయినను నివియన్నియు వ్యర్థప్రలాపములే. పాడినపాట పలుమాఱు పాడెనేని పాడువానికిని నా పాట మనస్సున కెక్కజాలదు. కుళింగపక్షివలె సర్వభూతములు తమతమ ప్రకృతి ననుసరించి పోవుచుండును. నిశ్చయముగ నీది నీచప్రకృతి. నీవు నదీసుతుఁడవు గనుక నీవు చంచల చిత్తుఁడవగుట యేమి చిత్రము. ఎవరికి నీవు ప్రదర్శకుఁడవైతివో యెవరు కృష్ణునర్చించిరో యట్టి పాండవులును బాపులే. నీవు ధర్మమెఱిఁగియు నధర్మజ్ఞునివలె సజ్జనమార్గమునుండి భ్రష్టుఁడవైతివి. తాను జ్ఞానవంతుఁడు జ్ఞానులయందు శ్రేష్ఠుఁడునని యనుకొనువాఁడు ధర్మేచ్ఛగలవాఁడైనచో నీవలె నెవ్వఁడు నడచుకొనును? ధర్మమెఱిఁగినదియు వేఱొకని వలచియుండుననదియుఁ గన్యకయు నగు నంబను బ్రాజ్ఞమానివై యెట్లు హరించితివి? నీవు హరించినను ధర్మజ్ఞుఁడైన నీ తమ్ముఁడు విచిత్రవీర్యుఁడు దానిని బరిగ్రహింప నొల్లడయ్యె. ప్రాజ్ఞమానివగు నీ కనుల యెదుటనే యొరుండు నీ సోదరు భార్యయందు సజ్జనాచరితమార్గంబునఁ బుత్రోత్పాదనంబు గావించెఁగదా. ఇట్టి నీయందు ధర్మమెందున్నది? తెలివిలేమినో పుంస్త్వములేమినో యట్టి యకార్యమును నీ వాఁపకుండుటచే నీ బ్రహ్మచర్యము వృథాకదా. ఓయి ధర్మజ్ఞుఁడా! నీకును లగ్గుగానను. ఇట్టి ధర్మము లుపదేశించు నీవు

వృద్ధోపసేవివిగావు. ఇష్టాపూర్తములు దానములు వేదాధ్యయనము యజ్ఞము లివి కుమారుని పదునాఱవ భాగమునకు సరిరావు. అనపత్యుఁడు చేయు వ్రతోపవాసాదులు వ్యర్థములు. బిడ్డలులేని వాఁడవును, వృద్ధుఁడవు మిథ్యాధర్మ బోధకుఁడవు నగు నీవు పక్షులకు నహింస పరమ ధర్మమని యుపదేశించి వాని గ్రుడ్లనే మ్రింగి వానిచేఁ దుదకు హింసింపఁబడిన హంసవలె బంధువులచే హతుఁడవు కాఁగలవు.

వీఁడు నాదాసుఁడు. వీనితో నే యుద్ధమొనర్పనని కేశవు నిరాకరించిన మానధనుఁడు జరాసంధుఁడే నాకు శ్లాఘ్యుఁడు. జరాసంధ వధయందుఁ గృష్ణచర్యయు భీమార్జునుల నడవడియు నెవ్వఁడు సాధువనును? బ్రాహ్మణవేషధారులై యపద్వారమున మాయోపాయంబున నగరము ప్రవేశించి కృష్ణుఁడు జరాసంధుని బలమెఱిఁగెను. బ్రాహ్మణుఁడను నభిప్రాయమున నే జరాసంధుఁడీ దురాత్మునకు నర్ఘ్యము పాద్యము నిచ్చెను. ఈకృష్ణుని నికృతిచేష్టితమునఁ గదా యతఁడు వీరికొసంగిన భోజనమును భీమార్జునులు భుజింపరైరి. ఈ మూర్ఖుఁడు తలంచునట్లు కృష్ణుఁడు జగత్కర్తయగునేని తన్నేల బ్రాహ్మణుఁగాఁ దలంపఁ డయ్యెను. నీవు వీరిని సధర్మమార్గమున వర్తింపఁజేయుచున్నను వీరు నిన్నుఁ బెద్దగా భావించుట చిత్రము. లేదులేదు. స్త్రీతుల్యుఁడవు వృద్ధుఁడవు నగు నిన్ను సర్వార్థములఁ బ్రదర్శకుఁడుగ గ్రహించు వీరియందుఁ జిత్ర మేదియు లేదు.

కఠోరములు రూక్షాక్షరములు నగు శిశుపాలు నిందా వాక్యములు విని భీమసేనుండు కోపరక్తలోచనుండై పటపట పండ్లుగొఱుకుచుఁ గటములదరఁ బెదవులు చలింప బొమలు ముడివడ నీదురాత్ము నిప్పుడ వధించెదనని దిగ్గనలేచి యతనిపైఁ బోనున్నఁ జూచి శంకరుండు కుమారస్వామిఁబోలె భీష్ముండు గ్రక్కునఁ బట్టుకొని కోపశమనవాక్యంబు లాడుచుండ శిశుపాలుం డతని నొక పోకకుం గైకొనక క్షుద్రమృగంబు విలోకించు సింహముఁ బోలె భీముని జూచుచు భీష్మా విడుము విడుము. ఈతండు మదీయదోఃప్రతాపాగ్నికి శలభమగుంగాక యనినవిని భీష్ముండు భీమసేనున కిట్లనియె. కుమారా!

నిన్ను రణమునకుం జీరు నీతని జన్మవృత్తాంతము వినుము. ఈతండు చేదిరాజకులంబున మూండు కన్నులతో నాలుగుచేతులతో జనించి గార్దభస్వరంబున ఘోషించె. అది కని విని యీతని జననీజనకులు తనూకుం గీడు మూండునని జడిసి యితని నెందేని పాఱవైవ నాలోచించుచుండ వారి కశరీరవాణి యిట్లనియె.

రాజా! మీరేల సంతాపించెదరు. ఈ మీ పుత్రుండు శ్రీమంతుండు బలాధికుండై లోకమున వెలయు. మీరు హింసింపనెంచిన యీతండిప్పుడు మరణించువాండుగాండు. వీనివలన మీకు భయములేదు. శిశువును బాలింపుండు. వీని శస్త్రమున వధించునాతండును జనించియే యున్నవాండు. అని యాకాశవాణి పలికిన విని పుత్రస్నేహాభిసంతప్తయగు నితని జనని యాకసము వంకఁజూచి కేలుమోడ్చి నా తనయుని విషయమై పలికిన యోభూతమా! నీవు దేవతవో మఱియెవ్వరవో నేనెఱుంగను. నీకు నమస్కారము. నా పుత్రుం గుఱించి యింకొక ప్రశ్నమడిగెదను. దయయుంచి ప్రత్యుత్తర మిమ్ము. ఇతని వధించువాం డెట్టివాండు? అనిన నశరీర భూతం బిట్లనియె.

ఎవండు వీని నెత్తుకొనిన నెక్కువకన్ను మాయమై యెక్కువ చేతు లైదుతలల పాములవలె నేలంబడునో యతండే యితని పాలిటి మృత్యువు.

త్రినేత్రుండు చతుర్బాహువుకుమారుండు చేదివంశమున జనించె నన్నవార్త విని రాజులు రాజకుమారు లతనిని జూడవచ్చిరి. వచ్చిన వేలకొలంది నృపాత్మజులకెల్ల వీనితల్లివీని నెత్తికొన నిచ్చుచుండె. ఎవరెత్తికొనినను మిక్కిలికన్ను మిక్కిలిచేతులు యథాప్రకారముండెం గాని కీడొందినవికావు. ఇట్లుండ నీవార్త ద్వారావతియందు యాదవులు వినిరి. రామకృష్ణులు తమ మేనత్తను జూడవచ్చిరి. కృష్ణునిచేత నీతనితల్లి నితని నిడంగానె యెక్కువచేతులు నేలరాలెను. ఎక్కువ కన్ను లోననే యణంగిపోయెను. అదిచూచి యితనితల్లి భయకంపితగాత్రయై మేనల్లునిం జూచి యార్తత్రాణపరాయణా! భయార్త

నైన నాకొక వరమిమ్ము. అని వేడిన భయపడకుము. నావలన నీకు భయములేదు. వరమెద్ది యభిలషించెదు కోరుము. అది నాకు శక్యమైనను నశక్యమైనను నొసంగెదను. అనిన నాయమ నీ శిశుపాలుఁడు నీయెడఁజేయు నపరాధంబుల సైఁపుమనిన యదునందనుఁడును వీఁడు నాయెడఁజేయు నపరాధశతంబును క్షమించెద. భీతిల్లకుమని మేనత్త కభయవాక్య మిచ్చె. దానంజేసికదా యితఁ డిట్లు ప్రేల్లిపడుచు నిన్ను రణమునకుఁ బిలుచుచున్నవాఁడు. వేయేకరుఁడైన నిన్నిమాటలు నన్నాడి మఱియింతకాలము కాలవశుఁడుగాక నిలువగలఁడా ? ఈతనియందు భగవత్కళావిశేష మున్నది. దానిని కృష్ణుఁడు నేఁడు మరల హరింపఁగలఁడు. అనిన శిశుపాలుండు రోషాభీలుండై నీవు బట్టువానివలెఁ బొగడఁగోరెదవేని కృష్ణునివిడిచి దుర్యోధనభగదత్త కర్ణరుక్ములులోనగు రాజవరుల నెల్లఁ బొగడుము. అనిన భీష్ముం డిట్లనియె. ఓరీ మాటలకు మాటలు ప్రత్యుత్తరములు గలవు. వానితోఁగాఁగల కార్యమేదికలదు? మేము కృష్ణుని బూజించితిమి. అది సరిగాదను వాఁడిమగఁడు కలఁడేని కృష్ణుని రణంబునకు జీరి చావనిమ్ము. అనిన శిశుపాలుఁడు కృష్ణునితో సంగరంబు చేయఁగోరి యాయనను జూచి యిట్లనియె.

జనార్దనా ! నిన్ను నే నిదె రణమున కాహ్వానించు చున్నవాఁడను. మగతనము గలదేని సంగ్రామమునకు రమ్ము. నిన్ను నీపాండవులను నేమిచేయుదునో చూడుము. మిమ్మెల్లఁ జంచి చెండాడెదను. రాజులనెల్ల విడిచి నిన్నుఁ బూజించుటచేఁ బాండవులు నాకువధ్యులే. దాసుఁడవు, నరాజవు, దుర్మతివి, మఱి యనర్హుఁడవు నగు నిన్ను బాల్యముచే నర్చించిన పాండవులు వధ్యులనియే మాఁటికి ముమ్మాటికి నామతము. అని బెబ్బులివలె రొప్పుచు శిశుపాలుండుపలికి చాలింప మధువైరి మృదుభాషణంబుల నిట్లనియె.

భూపాలకులారా ! నావచనంబుల వినుండు. సాత్వతకులంబున సాత్వతికి జన్మించిన వీఁడు మాయందు సదావైరమే పచరించుచుండును. మేము వీనికెన్నఁ డెట్టి కీడును చేయకుండినను వీఁడు

మాకు సర్వదా కీడే గావించుచుండును. మేము ప్రాగ్జ్యోతిషంబు నకుఁ బోవుటెఱింగి యీ నృశంసుండు మాతండ్రితోఁబుట్టినదాని కొడుకయ్యుఁ బైనెత్తివచ్చి ద్వారకను నిర్దహించెను. భోజరాజు రైవతగాద్రిఁ గ్రీడించుసమయంబునఁ బైపడి తదీయులఁ గొందఱ వధించియుఁ గొందఱ బంధించియు స్వపురంబునకు లాగికొనిపోయెను. మజ్జనకుం డశ్వమేధంబుసేయ సమకట్టి రక్షకులతోడ విడిచిన యజ్ఞయాశ్వంబును నీ పాపనిశ్చయుండు దుర్మదంబున హరించి యజ్ఞవిఘ్నం బాపాదించె. తపస్వియగు సక్రూరునిభార్య ద్వారక నుండి సౌవీరంబునకుఁ బోవునెడఁ గ్రోవదికట్టి తన్నెల్లపు యా యిల్లాలిని మోహవశుండై బలాత్కారంబున హరించె. మాతుల నృశంసకుండైన యీతండు కారూశరాజున కీయ నిశ్చయించిన విశాలరాజకన్యకను భద్రను గారూశరాజవేషంబుఁదాల్చి మోసగించి యపహరించె. ఇంతియకాక కుకురాంధకుల ననేకుల వధించె. వృష్ణిదారల విలపింపఁజేసె. జరాసంధునితోడఁ గూడి యితండు మా కొనరించిన ఱొగ్గులు లెక్కింపరాకున్నవి. అయినను మేనత్త కిచ్చిన బాసచేఁ గట్టుపడి శతాపరాధముల సహింపవలసి వచ్చెను. నేనిచ్చిన వరమును బూర్ణమయ్యె. యజ్ఞవిఘ్నకరుండును బాండవ దుర్హృదుండును నగు వీఁడిఁక వధ్యుఁడని నిశ్చయించితి. నా యదృష్టమున నీతఁడు మీ యెల్లర సమక్షమంద నాపై విరోధం బెట్లు సాధింపఁ గడఁగి నన్ను నిందించెఁ గంటిరికదా. నాపరోక్షంబున వీఁడొనర్చిన పాపకార్యంబులెల్లఁ దలఁపుఁడు. ఇట్టి గర్వి క్షంతవ్యుఁడు గాఁడు. నన్ను వలచిన రుక్మిణిని మరణకాంక్షితుండైన యీతఁ డపహరింపఁ దలపెట్టెఁగాని శూద్రునకు వేదశ్రుతివలె నీ మూఢునకా యింతి లభించినది కాదు.

అని వాసుదేవుండు వచించిన వాక్యంబులెల్ల విని రాజులెల్ల శిశుపాలుని ఛీఛీ యని గర్హించిరి. శిశుపాలుండును గృష్ణుని నుడుల విని కొలువులో బిగ్గహసించుచుఁ గృష్ణా! నాకుఁ బూర్వనిశ్చితయైన రుక్మిణివృత్తంబును సిగ్గైనలేక రాజసభలో నెట్లు ప్రశంసించితివి? మధు

సూదనా! మానవంతుఁ డెవఁడు తనభార్య యన్యపూర్వయని నీవు తప్ప నింకసభలోఁ జెప్పఁగోరును. కృష్ణా! నీవు నన్ను క్షమించిన క్షమింపుము క్షమింప నొల్లవేని క్షమింపకుము. క్రుద్ధుఁడ వైనను ప్రసన్నుఁడ వైనను నీవలన నాకుఁ గాఁగలదేదియు లేదు. అని యుద్ధసన్నద్ధుండై ప్రేలుచున్న శిశుపాలుం జూచి గోపాలుండు రాజులారా! వీని నింతకు క్షమించిన కారణంబు మున్నె వచించితి. ఇఁక మీరందఱుఁ జూడ వీనిఁ గాలుపీటికని చెద నని తన సుదర్శనంబుఁ దలఁచిన నది తత్క్షణము కేలలంకరించిన దానిఁగొని వానిపై వైచె. అదియును వాని శిరంబు ఖండించి నేలఁ దొరఁగించె. అంత నతని దేహంబునుండి యొక్క దివ్యతేజంబు సూర్యసన్నిభంబు వెలువడి కృష్ణునందుఁ జొచ్చె. చూపఱు విస్మితులై కృష్ణుఁ బ్రశంసించిరి. ధర్మపుత్రుండును దమఘోషనందను నుత్తరక్రియలు దీర్పఁ దమ్ముల కాజ్ఞాపింప వారట్లు గావించిరి. ఆవల యుధిష్ఠిరుండు చేదిరాజ్యంబునకు శిశుపాలనందను నభిషిక్తుఁ గావించె. అంత నిరంతరాయంబుగ యాగంబు కొనసాగె. పదపడి కుంతీ ధర్మజుల యనుమతిఁగొని కృష్ణుండు ద్వారకకుఁ బయనించె.

## సాల్వవధ.

దారుకసహితుండైన కృష్ణుఁ డిట్లు పయనించి కతిపయదినంబుల ద్వారక డాయం జని కాలినతోఁటలు, ప్రీలిన కోటలు దూలిన పేఁటలు గూలిన గోడలు వ్రాలినమేడలు గలిగి పురలక్ష్మి చెన్నుదఱిగి యుండుటగాంచి విస్మితుండై యిదయేమి నాలేనిసమయంబున నరాతులిట్లు గావించిరో యనుచుఁ బోవుచుండఁ గృష్ణునిరాక విని యదుకుమారులందఱెదుర్కొని శిశుపాలుభ్రాత సాల్వుఁడు సౌభకంబున దండెత్తివచ్చుటయుఁ గేశికంసవిరోధియగు దుష్టుండెక్కడ? యుద్ధమునకు రమ్మను డని దూషించుటయుఁ దాము వారితోఁ బోరుటయు నందతఁడు ప్రద్యుమ్నపీడితుఁడై మరలిపోవుటయు వినిపించినఁ బుండరీకాక్షుండు రోషకషాయితాక్షుండై సాల్వుం జంపిగాని పురంబుఁ జొరనొల్లనని ప్రతిజ్ఞపలికి యాదవసైన్యంబు తోడ వానిపై దాడి

వెడలె. ఇట్లు కృష్ణుండు సాల్వుని వెదకుచుం బోయిపోయి సముద్ర తీరంబుం జేరి మార్గరక్షావత దేశంబుంగాంచి సముద్రమధ్యంబున మార్తకంబను ద్వీపంబున సాల్వుం డున్నాడని తెలిసెంగె. సాల్వుండును గృష్ణునిరాక దూరంబునంద విని ససైన్యుండై కామగంబై సకలదివ్య రత్నజాజ్వల్యమానంబగుట సౌభకంబను పేరు గాంచిన విమానం బెక్కి యాకసంబున సంచరించుచుం గృష్ణు నెదుర్కొనియె. ఉభయ సైన్యంబులకు రోమహర్షణంబైన ఘోరాతిఘోరయుద్ధంబు ఘటిల్లె. సౌభకవిమానగతులైన దానవులు యదుసైన్యంబుపై నానావిధ శస్త్రంబులు గుప్పించి నొప్పించిరి. యదుసైన్యంబులును మింట సంచరించు విమానంబుపై బాణవర్షంబుం గురియించెంగాని యది యాకాశంబునం గ్రోశదూరంబుంటచే దానియునికియే వారికి నగోచరం బయ్యె. అంత వారేమియుం జేయంజాలక కేవలప్రేక్షకులై నిలిచిరి. కృష్ణుం డదిగాంచి పాంచజన్యంబు పూరించి శార్ఙ్గంబున వేలకొలంది బాణంబుల సంధించి విమానంబుపై విడిచె. దాని తాంకున విమానగత దానవులు తలలు మొలలు చేతులు వాతులు కాళ్లు వేళ్లు నడుములు తెగి కుప్పం గూరలుగ మహాధ్వనితో సముద్రంబునం గూలిరి. అంతే నీడంబోక సాల్వుండును గృష్ణునితో మాయాయుద్ధంబు గావింపందొడంగి శరపరిఘాసిభిండివాలపట్టిసాదుల గుములుగుములుగ నీరంధ్రంబుగ వర్షించిన హరియు వానిని బ్రతిమాయ నడంచె. వాండంతటంబోక దుర్దినసుదినంబులను శీతోష్ణములను సంధకారతేజంబులను నంగారపాంసువర్షంబులను శస్త్రసారంబులను గల్పించి విజృంభించిన వానినెల్ల వాసుదేవుండు మాయాప్రయోగంబునం బోకార్చె.

ఇట్లుతండు తన మాయలు వ్యర్థములగుటయు బెండుపడక మతిమోహినియగు మాయం బ్రయోగించె. దాని మహిమంజేసి సూర్వురు సూర్యులు నూగ్వురు చంద్రులు వేలకొలది నక్షత్రంబులు నేకకాలంబునం బ్రకాశించినట్లు లయ్యె. అప్పు డిది రాత్రి యిది పగలు నిదిదిక్కులు నివి విదిక్కులని యేర్పరింపరాకయుండె. అంతం

కృష్ణుండు మోహపడక తెప్పరిల్లి ప్రజ్ఞాస్త్రంబు ప్రయోగించె. ఆయస్త్రంబు వానియస్త్రంబును మహావాయువు తూలికనలె విధ్వంసంబుగావించె. ఈ యుద్ధము జగద్భయంకరంబై వర్తిల్లె. అంత సాల్వుండు విమానంబుతోడ మింటికెగసి జయకాంక్షియై వాసుదేవుపై శతఘ్నులను గదలను దీప్తశూలముసలాసులను రోషంబుచేఁ గురియించె. గోవిందుండు వానినెల్ల శితశరపరంపరల గగనంబునంద చూర్ణితంబు గావించె. అంత నాతండు నారాచవారంబున దారుకు నొప్పించిన నతండు ధీరుఁడయ్యును డీలుపడి రథచోదనకర్మంబున నసమర్థుండై యారెలుంగునఁ గృష్ణునితో నిట్లనియె. దేవా! శరవేదన సహింపరాకున్నది. మేను వివశమగుచున్నది. మనస్సు భ్రమించెను. పగ్గంబులు చేజాఱిపడుచున్నవి. రథంబుపై నిలువ శక్తుండఁగాను. అనిన నతనివంకఁజూడ నతని కాయంబున బాణంబుల గాయపడనిచోటు వ్రేలెడైన లేకుండెను. శ్రీకాంతుడంత నతని మేనెల్ల నిమిరి స్వస్థుఁ గావించె.

ఆ సమయంబున నాకసంబుననుండి ద్వారకాపురవాసి యొకఁడు దిగివచ్చి గోపికామనఃపాటచ్చరుతో నిట్లనియె. వియచ్చరవందిత చరణారవిందా! వందనంబు. నేను నీ యంతికంబునకు నాహుకు పంపున వచ్చినవాఁడ. ఆయన పరిచారకులలో నొకరుండ. ఆయన నీతో నిట్లు వచింపుమని యానతిచ్చె. పటచ్చర ధరవరదా! నీవీపుటభేదనంబున లేని యదనుఁ గాంచి సాల్వుం డిందరుదెంచి యందఱరుదఁగఁజూడ నీ తండ్రి వసుదేవు దేవసమ్మతుఁ జెఱఁ గొనిపోయె. ఇంకను వచ్చపలుఁ డెట్టి దుష్కృత్యకోలుగలవాఁడో తెలియరాదు. ఇక్కడ సర్వంబు సర్వమంగళంబైన నీ యక్కడిగెలుపు మారెవరి తలఁపునకెక్కు. అక్కడి నీవిజయంబిక్కడి మాకువిలయంబు. కావున సమరంబు మాని నగరంబునకుఁ గరంబు తూర్ణం బరుదెమ్ము. అనిన నతని వచనంబు లాకర్ణించి యాకర్ణారిహితుండు మిక్కిలి విషణ్ణుండై యేమిచేయుటకుఁ దోఁపక దిగ్భ్రమగొని యేమి యాచిత్రము! బలదేవసాత్యకిప్రద్యుమ్నాదులందఱుండియు నా తండ్రిని

రక్షింపఁ జాలరైరా? ఇవీ వీరేమి పోటుబంటులు. ఇన్నీ యిదేమి యఘోర విచారము. బలరామ సాత్యకి ప్రద్యుమ్న చారుదేష్ణసాంబాదివీరులు జీవితులై యుండ నా జనకుం డెట్లు పరుల పాలగు? వసుదేవుఁడు హతుఁడనిన నందఱు హతులే. వారాకాశ సంచారులకైన దుర్జయులు, ఈమాట పాటింపరాకున్నది. అని యవ్విచారంబు దూరంబుచేసి యా దురాచారుతో మరల దురంబున కుపక్రమించె.

ఇట్లు కయ్యంబుచేయు సమయంబున విమానంబునుండి వీడి చెదరి వ్రేలాడు తలవెండ్రుకలతో సూడిన యుష్ణీషంబుతో జాఱు వస్త్రంబుతో క్షీణపుణ్యుండైన యమరాత్రి నేల వ్రాలినట్లు పడుచున్న వసుదేవుం గాంచి కృష్ణుండు ఖిన్నుండు నిశ్చేష్టుం డగుడు శార్ఙ్గకంబుచే జాఱి క్రిందఁబడియె. కృష్ణుండును మోహవశుండై రథంబునఁ గూలఁబడియె. నిశ్చేతను రీతినుండు పీతవసనుంగాంచి యాదవసేనలు మోదంబు లెడలి సంధులు సడలి హాహాకారంబులు గావించె. అట్లు పడుచుండు వసుదేవుని శూలాంసిపాణులై దానవులు సఱకుచుండిరి. అంతఁ గొంతవడికిఁ దెప్పతిల్లి ప్రకృతిస్థుండై మనస్సు కుదుటఁ బడఁ జేసి నలువంకలఁ గృష్ణుండు పరికింప సౌభము లేదు. శత్రుపు లేఁడు. వసుదేవుఁడును గానరాఁడు. అప్పుడది యమ్మాయావి మాయయని మహానుభావుండు నిశ్చయించుకొనియె. ఇట్లు నిర్ధారించుకొని తబ్బిబ్బు పడక యబ్బలసూదనసోదరుం డా రాకాసి గబ్బిపై రోషముబ్బ బెడిదంపు ములుకుల జడివాన గురియించె. దాన దానవుం డుబ్బుసెడి విమానంబుతోడ నగోచరుండయ్యె. ఆ పాలసుల కోలాహలధ్వను లొకసారి మింటను నొకపరి పార్శ్వంబులను నొకపారి ద్విగ్విదిక్కులను వినవచ్చినఁ గృష్ణుండు శబ్దవేధులగు బాణంబులఁ బరఁగించి శబ్దంబు వినిపించు నెడకు మహాస్త్రంబులు పఱపె. వాని తాఁకున సోఁకుల మూఁకలు తెగి కంఠంబులు మొండెంబులు కుప్పఁగూరలుగఁ గూపార మధ్యంబున నపారంబుగఁ గూలె. అంత నమ్మాయావి మందరధరుపై ధరనికరాసారంబు గురియించె. ఆ కొండల జడివడికి వడితఱఁగి సౌభరథంబుగఁ గృష్ణుండు పర్వతంబుల నడుమఁ జిక్కు

వడిరి. యాదవసైనికులు కృష్ణుండు హతుండయ్యెఁ గాఁబోలుఁ గానరాఁడని హాహా నినాదంబులు నించుచు దశదిశలఁబరువులిడిరి. ఆ యెడజడికి జడియక మధుసూదనుండు వజ్రాస్త్రంబున నప్పర్వతంబులనెల్ల ఛేదించి మేఘపటలంబు విరియించి పొడతెంచు ప్రభాకరుం బోలి వెలింగె. ఆతటి నేతరి సాల్వుండు సౌభకంబుతో నొక్కెడఁ బొడసూపి కాతరుండుగాని లోకాతురతాపకృన్మహా దివ్యశరంబులఁ బ్రయోగించుచుండ నతనిఁ జూచి దారుకుండు యశోదాదారకుతో నిట్లనియె.

మహానుభావా! శత్రువల్పుఁడైనను నుపేక్షింపరాదు. ఇఁక బలిష్ఠుండగువాని నేమి చెప్ప. ఈ క్రూరుండు మహావీరుండు. మాయావి. ప్రాణంబులకుం దెగి పోరుచున్నవాఁడు. ఇట్టివానిని వధింప జాగుసేయకుము. ఆలసించిన నమ్మోసము విషమగుటయుఁ గలదనిన విని కైటభారి లెస్స చెప్పితివని యతని మెచ్చి సుదర్శనంబుఁ గేలఁ గొని సౌభకంబు ఛేదింపఁ బంచిన నదియు జగద్భయంకర జ్వాలాజాలాభీలంబై వైళంబ చని ఝంపమున ప్రమాఁకోసు గోసినట్టు లవ్విమానంబును రెండుగ నఱికె. మరల నరకారికరం బలంకరించె. ఇట్లు వ్యోమయానంబూనంబైన దీనంబైన మోమునఁ దికమికగొను నా సాల్వుని శిరంబు ఛేదింపుమని మరల నయ్యదువరుండు చక్రంబుఁ బంచిన నది నిర్వక్రవేగంబునఁ జని యనక్రపరాక్రమంబున వాఁడు దేవహననోద్యమంబున మహాగద యెత్తియుండు సాల్వుని శిరంబు ఖండించె. కృష్ణుండు సాల్వపురంబు డాయం జని పాంచజన్యంబు మొరయించి విజయంబు ప్రకటించె.

## దంతవక్త్రవధ.

పౌండ్రక శిశుపాల సాల్వులు పరలోకగతులైనఁ దన్మిత్రుండు కారూశదేశాధీశుండు దంతవక్త్రుండు తత్పరోక్షసౌహృదంబుఁ జాటించి యొక్కనాఁడొక్కరుండ యుక్కు మిగిలి యుక్కుగదఁచేఁ బూని పాద ఘట్టనంబున గట్టులతోడి పుడమి గడగడ వడఁక తనపై నడ

తెంచుచున్నఁ జూచి రథాంగపాణియు శతాంగంబు దిగ్గనదిగ్గ నుఱికి మార్కొనియె. కారూశుండును దుర్మదంబునఁ బంకజాక్షు వదనంబు నిరీక్షించి యహాహా యేమి నా యదృష్టము. అదృష్టమనిన నాదే సుమీ! నేఁడు నీవు నా కనులఁ బడితివి. ఇఁక నెందుఁ బోఁగలవు. కృష్ణా! నీవు మాకు మేనమామ కొడుకువయ్యు మమ్ముఁ జంపఁ జూచెదవు. కావున వజ్రసన్నిభమ్మైన యీ గదచే నీ తల పగుల మొత్తెదు. దేహమునం బుట్టిన వ్యాధివలె బాంధవుఁడవై శత్రుఁడవైన నిన్ను వధించి నా మిత్రుల ఋణంబు పాచికొనెద. అని యంకుశప్రపోటుల నేనుంగును గినియఁజేసినట్లు నిష్ఠుర వాక్యంబుల దంతవక్త్రుఁడు కృష్ణు రేఁచి చేతి గదచే నాయన శిరంబు పైఁ గొట్టి సింహమువలె గర్జించె. ఇట్లు గదాతాడితుండయ్యు నచంచలుఁడై కృష్ణుండు కౌమోదకిచే నతని యురంబు భేదించె. ఆ వ్రేటున నా బోటరి హృదయంబు రెండు ఖండంబులగుచు నతండు కేశంబులు వ్రీల ధరణి వ్రాలె. హతుండైన యతని మేనినుండి సూక్ష్మజ్యోతి యొకండు వెడలి యందఱు చూచుచుండ శిశుపాల వధనాటివలెఁ గృష్ణునందుఁ జొచ్చె.

అమ్మణ్ణి—కన్నా! శిశుపాలుఁడు చచ్చినపుడు చెప్పితివి. దంతవక్త్రుఁడు చచ్చినపుడు చెప్పితివి. వారిలోనుండి తేజము వెలువడి కృష్ణునందుఁ జొచ్చెనని. ఆ విశేషమేమి ?

తండ్రి:—ఒకనాఁడు లక్ష్మీనారాయణ సందర్శనార్థము బ్రహ్మమానస పుత్రులు సనకసనందనాది మహర్షులు వైకుంఠమున కరిగిరి. జయ విజయులను ద్వారపాలు రిది సమయముగాదు. మీరు పోరాదని వారిని వారించిరి. ఇట్లు వారింపఁబడి యా మహాత్ములు కోపంబున మూఢులారా! భగవత్సేవకు సమయాసమయములు గలవా? భగవంతుండు సర్వసులభుండు, సర్వదా సేవ్యుండని మీ రేలరెఱుంగ రైతిరి. తామసంబున మీరు భగవత్సేవ కడ్డపడితిరి గావునఁ దమోగుణప్రధానులైన యాతుధానులై భూమి జన్మింపుఁడు. మీ రిందుండఁ దగరని శాపమిచ్చిరి. శ్రియఃపతి యా కోలాహల

మాలకించి మునుల సేతకు సమ్మతించియుఁ దన కత్యంత భక్తు లగువారు తనయందలి భక్త్యతిశయంబునఁ బ్రమాదవశులై చేసిన యల్పాపరాధంబునకు వారిని సర్వదా దూరగులఁ జేయ రాదని కరుణాళుండై నారాయణుండు జయవిజయులఁజూచి మీరు నా భక్తులై జనించి మరల దీర్ఘకాలంబునకు నింటఁ రాఁ గోరెదరా? కాదేని మూఁడు జన్మంబుల నాకు విరోధులై జనించి నాచేఁ జచ్చి యింటు రాఁ గోరెదరా యనిన వారును దీర్ఘకాల విరహము సహింపలేక నీతో విరోధించియో మూఁడు జన్మంబుల మరల నింటఁజేర వరమిమ్మని కోరిరి. లక్ష్మీవల్లభుండట్లయగుఁ గాక యని యనుగ్రహించె. ఆ జయవిజయులే తొలుత హిరణ్యాక్ష హిరణ్యకశిపులై జనించి రెండవ జన్మంబున రావణ కుంభకర్ణులై పుట్టి మూఁడవ పుట్టువున శిశుపాల దంతవక్త్రులైరి. ఇఁక వారికి జన్మము లేదు గావున వారి యాత్మతేజస్సులు భగవంతుఁడగు కృష్ణునందు లీనములయ్యె.

రుక్మిణి:—అప్పా! యంతటి మహర్షులుగూడఁ గ్రోధదాసులగుదురా?

తండ్రి:—మహర్షులు జితేంద్రియులు. వారేనాఁడును గ్రోధదాసులు గారు. ఇంద్రియ దాసులు మహాత్ము లెట్టులగుదురు? అట్టివారిని మహాత్ములనునపుడు మనకంటె గొప్పవారని గ్రహింపవలయునే కాని జితేంద్రియులగుటచే గొప్పవారైరని యెంచరాదు. క్రోధము వచ్చినంతమాత్రమునఁ గ్రోధదాసులని యనినచో భగవంతుఁడు నొక్కొక్కసారి క్రోధ దాసుఁడేకదా? జితేంద్రియులు వశులనఁగా నింద్రియముల జయించి వానికి వశపడక యవి తమకు లోపడియుండఁ జేసికొనినవారని యర్థముగాని వానిని స్వరూపనాశముచేసి చంపినారని యర్థముకాదు. వారికిఁ గామము క్రోధము రమ్మనిన వచ్చును. పొమ్మనిన దూరమున సేవకులవలె నుండును. దూరముననుండు వస్త్రములనుదీసి వలసి నపుడు మీఁద వేసికొని తరువాత వానిని దూరముగ వైచి నట్టులు లోకోపకారార్థమో యితరుని బాగుచేయుటకో కోప

ముతో నొకపని చేయవలసివచ్చినపుడు దానిని మీఁద నా వహింపఁ జేసికొని యాకార్యము ముగియుడు మరల దానిని దూరముగ నుండు మందురు. ఇట్టివారు జితేంద్రియులు. తన్ను శపించిన దక్షుని మరల శపింపకొల్లని నారదుఁడు నలకూబర మణిగ్రీవుల శపింపనేల ? శ్రీరాములు రాక్షసవధకై కోపము తెచ్చుకొనెననికదా వాల్మీకిమహర్షి పలికెను. మనము క్రోధ దాసులము. మన యత్నము లేకయే రారాని సమయములం దును నల్పకారణముననో నిష్కారణముగనో యితరులకు బాధా కరముగ మనకుఁ గోపము వచ్చును. వచ్చినపిమ్మటఁ దనంతటఁ దాను బోవలయునేకాని దాని నణఁచుకొను శక్తి మనకు లేదు. వారికి మనకు నిది భేదము. కామక్రోధాదుల నణఁచి వానిని వశపఱుచుకొమ్మని యోగశాస్త్రము చెప్పుచున్నది గాని వానిని మొదలు ముట్టఁ జంపుమని చెప్పలేదు. కామక్రోధాదులు సత్కార్యములఁ జేయుటయందును గావలసియుండును గావున వానిని జంపరాదు. సాధనములుగ నుంచుకొనవలయును. ఆవల కథ వినుఁడు.

రుక్మిణి:—ఇంకొకప్రశ్న. వైకుంఠ మప్రాకృతముగదా. వైకుంఠ వాసులు త్రిగుణాతీతులుగదా ? అట్టి జయవిజయులయందుఁ దమోగుణ మెట్లుండె ?

తండ్రి:—ఈవిషయమున నాకుఁ దోఁచినది చెప్పెద వినుఁడు. ఒక తరగతిలో జదువువిద్యార్థులలోఁ బరీక్షలందు నూటికి నలువది గుణకములు వచ్చినవారు పై తరగతికిఁ బోవ నర్హులని యేర్పాటు గలదని తలంపుఁడు. అట్టివారెల్లఁ బై తరగతికిఁ బోయిరనుకొండు. వారందఱు విద్యావివేకముల సములా ? కారుగదా. ఇప్పుడు పట్టభద్రులయిన వారందఱు సమానవివేకులా ? కారుగదా. అట్లులే యధ్యాత్మవిద్యయం దింతవఱకు సాధించినవా రీపదవికిఁ దగుదురని నియతి. అట్టివారియందుఁ దారతమ్యము లుండును. బ్రహ్మలోకమునఱకుఁ గలలోకములకుఁ బోయినవా రాయా

లోకములందుఁ గృషించి మరల భూలోకమునకు రాక యక్కడ నుండియే యూర్ధ్వలోకములకుఁ బోయి బ్రహ్మలోకము దాఁటి ముక్తులగుదురు. బ్రహ్మలోకమునకుఁ బోయినవారును మహాభిషుఁడు లోనగువారివలె మరల భూమిపై జన్మించుటగలదుగాని యాలోకమును దాఁటి పోయినవారు మరల నీలోకమునకు రారు. భక్తిబలముచే గోపికలు గోలోకమునకును భగవత్కార్యమునకై ప్రాణము లర్పించి జటాయువు లోనగువారును సేవామహిమ వానరులు సాంతానికాది లోకములకుఁ బోయిరి. స్వామిదర్శనమున శరభంగాదులు ముక్తులైరి. ఇట్టివారు భగవత్కృపచే వారి వారి యోగ్యతకుఁ దగిన లోకములకుఁ బోయి యచ్చటనుండి లోపాలోపముల సవరించుకొని కల్పాంతమున బ్రహ్మతోడఁ బరమపదముఁ జేరుదురు. ఇట్టివారందఱు ముక్తులు. పెక్కుపుటములఁ దీరిన బంగారమునందు కశ్మలములేనట్లు వీరియందు రజస్తమస్సు లుండవు. వీరుగాక వైకుంఠమున నిత్యసూరులు కొందఱుగలరు. వా రనంత గరుడ విష్వక్సేన సుదర్శనాదులు. కశ్చిత్కార్యనిర్వహణమునకై కాఁబోలు భగవత్సంకల్పముచే వీరియందు రజోలేశ మెప్పుడైనఁ బొడముటయు దానిని భగవంతుఁడు హరింపఁగా వారు మరల వివేకము గొనుటయుఁ గలట్లు పురాణముల వలనఁ దెలియుచున్నది. లక్ష్మీదేవి గర్వము హరింప విష్ణుండు నరనారాయణావతారమెత్తి బదరికాశ్రమంబున నుండెను. సుదర్శనచక్రగర్వభంజనమునకై యా దివ్యాయుధమును గార్తవీర్యార్జునుఁడుగఁ బుట్టఁజేసి పరశురాముఁడై సామాన్యపరశువుచేఁ దత్కరసహస్రంబు ఛేదించి వధించె. గజేంద్రరక్షణార్థము వైకుంఠమునుండి వచ్చుసమయంబున గరుడవేగము చాలక యాయనను గూడ భగవంతుఁ డీడ్చికొనివచ్చి యాయనకు గర్వభంగము గావించె. ఇట్టులే కార్యనిర్వహణమునకై భగవంతుఁడు నిత్యసూరులందును రజస్తమోగుణములు ప్రవర్తింపఁజేసి వారివలన లోకకార్యము నిర్వర్తించును. జయవిజయులు నిత్యసూరులలోనివారే. ఇంతకు

వారు చేసిన మహాపరాధ మేదియుఁగానరాదు. భగవంతుని వినోదక్రీడలకు భంగమగునేయని భక్త్యతిశయముచే మునులను వారించిరిగాని యధికారగర్వమునఁగాదు. తమోగుణమహిమ నుగాదు. భక్తవత్సలుఁడైన నారాయణుఁడట్టిదియు సహింపఁ డయ్యె. తనభక్తులకుఁ దనయందలిభక్తికంటె నెక్కువభక్తి తన భక్తులయందుండవలయుననియిచ్ఛ. భగవంతుఁడు చిత్రకూటమున నుండు శ్రీరాము దర్శింపవచ్చినపుడు లక్ష్మణుఁడు శ్రీరాముల కష్ట ములకు భరతుఁడు కారణమనియెంచి భరతునివధించెదనని శ్రీరా మునియందుఁ దనకుఁగల భక్త్యతిశయముచేఁ బలికెనుగాని తనకుఁ గష్టము వచ్చెననికాని సౌఖ్యము దొలఁగెననికాని యెంచి భరతుపై నాగ్రహించినవాఁడు కాఁడు. ఇది శ్రీరాములు నెఱిం గియు లక్ష్మణునిఁ జీవాట్లు పెట్టెను. మునుల రాకయు వారు వారించుటయు భగవత్సంకల్పముగాని యితరము గాదు.

సనకసనందనులు తాము జితేంద్రియులమని నమ్మియే యుం డిరిగాని తమయందుఁ గోప లేశముండుట యెఱుంగరు. భగవంతుఁ డెఱుఁగును. వారిలోపము వారికిఁ దెలియఁబఱిచి వారిని జక్కఁ బఱుపవలయునని భగవదిచ్ఛ. నిష్కారణమునన్నో యల్పకారణము నన్నో తిట్టిన మునులు సాత్త్వికులో, తిట్టఁబడియు బదులు దిట్టని ద్వా రపాలకులు సాత్త్వికులో యాలోచింపుము. ఆవల వినుము.

ఇట్లు దంతవక్త్రుండు * కృతాంతవక్త్రంబుఁ జొరఁ జొఱుట గాంచి యతని యనుజుండు విదూరథుండు సోదరశోకసంతప్తుఁడై నిట్టూ ర్పుచుఁ గత్తి కేడెముఁగొని కృష్ణు మార్కొని విక్రమించె. కృష్ణుం డును వాని శిరంబు సుదర్శనంబున ఛేదించె.

ఈరీతి వాసుదేవుండు సౌభంబును సానుబంధునైన సాల్వదంత వక్త్రవిదూరథులను జయించి విజయలక్ష్మిఁ గైకొని మెఱసె. మునులు

*ఒకగ్రంథమందు దంతవక్త్రుఁడని ముద్రింపఁబడియున్నను వెక్కుగ్రంథ ములందు దంతవక్త్రుడనియే యున్నది.

దేవతలు ప్రస్తుతించిరి. అరాతిభటజాతంబు భీతంబై పలాయమాన ప్రముఖంబయ్యె. కృష్ణుండు ససైన్యుండై ద్వారకఁ బ్రవేశించె.

కృష్ణుండు అట్లు సాల్వాదులతోఁ బోరాడునెడ నక్కడఁ బాండవులు మాయాద్యూతంబునఁ గౌరవులచే నోటువడి కాననవాసులైరి. ఆ సందర్భమునఁ గృష్ణమహిమ తెలుపఁగల చరితలు రెండుగలవు వినుఁడు.

---

## సతరక్షాలీల.

పంచపాండవులు జూదంబుననోడి దుర్యోధనునకు దాసులై తలలు వ్రేలవైచి దీనాస్యులై కూర్చుండియుండు సమయంబున దుర్యోధనుండు ద్రౌపదిం బరిభవింపఁ దలఁచి రజస్వలయు నేకవస్త్రయునగు దానిని సభలోని కీడ్చించి యామె చీరలు వలువ దుశ్శాసను నాజ్ఞాపించె. బలిష్ఠుండగు నా దుష్టుఁడును బలాత్కారంబున నామె కట్టిన పుట్టంబు వలువఁ దొడంగె. ద్రౌపదియుఁ జేనైనంత వఱకుఁ బట్టువిడక మానరక్షార్థినియై భర్తవంకను గురువృద్ధులైన భీష్మాదులవంకను దీనాస్యయై చూచి వేఁడెనుగాని యెవరును నా మహాః పతివ్రతకు మానరక్షణంబుసేయఁ బూనరైరి. మనుష్యసాహాయ్యాశావంతయు రామిఁగాంచి యీ కాంత స్వాంతంబున సోపాధిక బంధువుల నమ్మినవారి గతి యింతియేయని చింతించి యకారణబంధుండు నిర్దళిత సంసారబంధుం డాపద్బాంధవుండు కృష్ణుండేయని నమ్మి యా భక్తురాలు స్వప్రయత్నంబు విడిచి సర్వమునకుఁ దన్నే నమ్మి యావద్భారంబు దనపై వైచినఁగాని భగవంతుండు తోడుపడఁడని వసిష్ఠువలన నెఱింగినదగుట నితర చింతలెల్ల మాని నిజాంతరంగంబున శ్రీకాంతుని నిలిపి సర్వభారంబు నాయనపై వైచి చీరకొంగు పట్టు వదలక పెనుఁగులాడుట మాని గోవిందగోవింద కృష్ణా కృష్ణాయని కన్నులు మోడ్చి కేలెత్తి

శా. హాకృష్ణా యదునందనా నరహరీ యబ్జాక్ష దామోదరా
వైకుంఠాలయ ద్వారకాస్థిత గదాపాణీ రమానాథ! నే
నీ కష్టస్థితి నుంట నీ వెఱుఁగవే యెందేగితో కావవే
యీ కౌరవ్యమహాబ్ధిమగ్నఁ గరుణాదృష్టి న్నిరీక్షింపవే.

క. ఓనాథా వ్రజనాథా, శ్రీనాథా యార్తినాశ కృష్ణా కౌర
వ్యాసిక పరిభూతను, హీనస్థితి నుంట నెఱుఁగవే జగదీశా.

అని నుతించె. అంత దుశ్శాసనుండు ద్రౌపది పట్టు వదలుట గని తనపని సుకరంబయ్యె. ఈ మానిని మానంబు న్యూనంబు గావించి దీని పతుల కవమానంబు గలిగింతు నని యా వలువ వలువ లొలువ నారంభించె. నిజదోష పరిహారార్థమోయనఁ జీర యొలుచు నెపంబున నామెచుట్టు ప్రదక్షిణించుచుఁ జీర యూడఁదీయుకొలఁది నంతంబులేక యది పెరుఁగుచునే యుండెను. ఆ యధమాధముం డెంత ప్రయత్నించినను వస్త్రంబు తొడవిడిచి తొలఁగదయ్యె. చూపఱు తత్సతి పతివ్రతంబు మహిమంబున కబ్బురపడి యట్టి శీలవతిపట్ల ద్రోహమొంచిన క్రించులకుఁ గీడు తప్పదని నిశ్చయించిరి. దుశ్శాసనుండు చేతులు నొప్పులెత్తుదాఁక విచ్చివిచ్చి వేసారి యోటరి మొగంబు వ్రేలవైచుకొని చూచువారు పకపక నవ్వఁ దన పీఠంబునఁ జదికిలఁబడియె. దుర్యోధనుండు విన్నఁబోయె. ఇచ్చట లోకు లొక వింత చెప్పుట కలదు. సభామధ్యంబున గుట్టలుగఁ బడియుండు నమూల్య వస్త్రంబులఁ గని దుర్యోధనుండు వానినెల్లఁ గొనిపోయి సభావృత్తంబుఁ గిటికీలనుండి చూచుచున్న తన యంతఃపుర స్త్రీల కిమ్మని యాజ్ఞాపింపఁ బరిచారకు లట్లుగావించిరి. ఆ స్త్రీలును మహార్ఘంబులై దేదీప్యమానంబులయిన యా వస్త్రంబులఁ గని తమకట్టిన పుట్టంబులు విడిచి వానిని ధరించిరి. అది యెఱింగి ద్రౌపది యుస్సని చేతులు తట్ట నవ్వస్త్రంబులన్నియు సన్నని పులుఁగులై యెగిరిపోయె. చూచువారు చెఱుపకురా చెడెద వను నీతి సత్యమయ్యెనని నవ్వ నంతఃపుర కాంతలెల్ల దిసమొలల నుండిరి. ద్రౌపది వలువలనుపేరఁ గొన్ని

పులుఁగులుండుట మీరును జూచియుందురు. ఇట్లు వందనికూడు దేవతలకిచ్చిన మహానుభావుఁడు నేయనివస్త్రంబు లాద్రౌపది కిచ్చె.

ఉ. పొందవు దుఃఖముల్, భయముపొందదు పొందదు దైన్యమెమ్మెయిన్,
బొందవు తీవ్రదుర్దశలు, పొందుఁబ్రియంబులు, పొందుసంపదల్
పొందు సమగ్రసౌఖ్యములు, పొందు సమున్నతకీర్తి, లెందు గో
విందపదారవిందపదవీపరిణద్ధగరిష్ఠచిత్తులన్ నృసింహపురా.

## —♦ శ్రీకృష్ణాదులు వనవాసగతులైన పాండవులఁ జూడవచ్చుట ♦—

మున్ను త్రిపురంబుల దహించి మించిన పురారాతియుం బోలెఁ గంసారాతి సాల్వు సౌభకంబుతోడ భస్మీభూతుం గావించి యుతనివారల వధించి విజయంబుగాంచి దేవతాస్తవంబుల దిక్కులు నించి స్వపురంబున కరుదెంచి బలవద్ద్యూతంబునఁ బరిభవంబుఁ గాంచి యడవులం బాండవులు నివాసంబు గావించి యున్నవారని యాలకించి విషాదపరీతచేతస్కుండై యా యాపద్బాంధవుండు వృష్ణ్యంధకభోజాదులంగూడి చక్కఁ బాండవు లుండు నరణ్యంబు నకుం బోయె.

ఆ సమయంబునందు ధృష్టద్యుమ్నాది పాంచాలురును, చేదీశ్వరుండైన ధృష్టకేతుండు నైకేయుండునగు బాంధవులు నచ్చటి కరుదెంచి యుండిరి. ఆ యుత్తమచరిత్రులెల్లరుఁ గోపాయత్తచిత్తులై మత్తులైన ధృతరాష్ట్రపుత్రులు పాండవులకుం గావించిన కీడు దలంచి వారి నిందించి దీనికేమి మాఱుసేయఁ బోసంగునోయని యోజిం చుచుఁ గృష్ణుని బలసి ధర్మరాజుం గొలిచి యుండి రందు శ్రీగోవిం దుండు ధర్మనందనున కిట్లనియె.

కుంతీనందనా ! యిట్టి యిక్కట్టులు నీయట్టి నెట్టికసీలకు రాఁ దగినవి కావు. దుర్యోధనాది దుష్టచతుష్టయము మీ యెడాటంబునఁ గావించిన ద్రోహంబు మా మనంబులను దనువులను దహింపఁ జేయుచున్నవి. వారి రక్తంబును భూమి పానంబు చేసినంగాని మాకుఁ

గోపంబు తాపం బుపశమింపదు. వారినేకాక వారివారలను సహాయులను నెల్లవారల వధించి వారి నిష్కృతికిం దగిన యపకృతిఁ బరాక్రమంబునఁ గావించి నిన్ను హస్తినాపురంబున సింహాసనాసీనుం గావించెదము. సాదరబుద్ధివై సోదరయుతుఁడవై యియ్యకొనుము. ధరాభారవహన యోగ్యులగు మీరు దుఃఖభారంబు వహించి యనర్ఘవస్త్రాభరణంబుల మాఱు కృష్ణాజినంబులు ధరించి వీడులు వదలి కాడుల నల్లాడుచుండ మేమెట్లు కడుపార భుజించి కన్నులార నిద్రించి మనసార సుఖింతుము. అని ప్రజావ్రజంబు దహించుపోల్కి- క్రుద్ధుండై విజృంభించి పలుకు కేశవుంగని గుడాకేశుండు మెల్లని మాటలఁ గోపోపశమనంబుఁ గావించుచు నిట్లనియె. కృష్ణా! నీ మహిమంబు నే మెఱుంగనివారము కాము. మహాపురుషా! తొల్లి గంధమాదనంబున మునివై ప్రొద్దుగ్రుంకినచోటే యిల్లుగాఁ బది వేల వర్షంబులు చరించితివి. నీరం బాహారంబుగఁ గొని పదునా కొండువేల యేండ్లు పుష్కరంబున వసించితివి. వాయుభోజనుండవై బదరికాశ్రమంబున నేకపాదంబున నిలిచి నూఱుసంవత్సరము లుండితివి. ద్వాదశవార్షికంబైన సత్రంబు సాగునపుడు సరస్వతీ తీరంబునఁ గృష్ణాజినోత్తరీయుండవై నరములుమాత్రము మిగిలిన మేనితోఁ గృశుండవై తపించితివి. నీవు లోకప్రవృద్ధికై జనించితి వని వ్యాసమునీంద్రుండు నాతో మందలించె. సర్వభూతాంతరాత్మవును, నాద్యంతములు నీవ. దైత్యదానవుల వధించి శచీపతిని దేవతాధిపత్యంబున నిలిపినవాఁడవు నీవ. కారణాంతరంబున మనుష్యులందు జనించితివి గాని నారాయణుండవు హరివి నీవ! బ్రహ్మ సోమసూర్య ధర్మధాతృయమానల సమీర కుబేర రుద్రకాలాకాశ పృథివులను స్రష్టవు నీవకావే. అజుండవును జరాచరగురుండవును నీవ! మౌరవులు పాశులు నిశుంభ నరకులు నీచేత వీతాసులగుటఁ బ్రాగ్జ్యోతిష మార్గంబు సుగమంబయ్యె. జారుథ్యానగరంబున నాహుతిని శిశుపాలసహితుండైన క్రోధుని జరాసంధ శైబ్యశతధన్వులను జయించితివి. రుక్మిం గెలిచి రుక్మిణిని హరించితివి. ఇంద్రద్యుమ్నుని గశేరుమంతుం

డగు యవనుని వధియించితివి. కార్తవీర్యసముఁడైన భోజుని నిరాసతం బున గతప్రాణుఁ గావించితివి. గోపతి తాల కేతులు నీచే హతులైరి. ఇట్టి నీవు వలయునేని ధార్తరాష్ట్రుల నెల్ల బారి సమరులేమి వింత. అనృతక్రోధమాత్సర్యంబులు నీయందు లేవన నృశంసత్వం బెందుండి వచ్చు. యుగాదియందుఁ జరాచరగురుండైన బ్రహ్మ నీ నాభికమలంబున జనించె. తద్వధోద్యుక్తులై మధుకైటభులపైఁ గవియ వారి దార్ష్ట్యంబుఁ జూచి కోపించిన నీ లలాటంబున శూలపాణియుఁ ద్రిలోచనుండు నగు శంభుండు సంభవించె.

బాల్యప్రభృతి నీవు చేసిన మహాకార్యంబులును బూర్వావతారంబుల నీవొనర్చినక్రియలును దెలియనివారము గాము. జగజ్జాలములఁ బాలింపఁ దూలింపఁ జాలిన నీకుఁ దుచ్ఛులగు ధార్తరాష్ట్రులఁ బోరిగొను టెంతకార్యము. మాయందు నిక్కంబగు ప్రీతి నీకుఁ గలదేని ధార్తరాష్ట్రుల నిప్పుడ వధింప యత్నింపుము. పదుమూఁడేఁడుల గడువు ముగియుడు నీ సాయంబున రాధేయుతోడి గాంధారేయుల మేము యమాతిథేయంబు గానఁబనిచెదము. పౌరుషోపజీవులగు క్షత్రియులకుఁ బరదత్తంబు గ్రాహ్యంబుగాదు. కావున నీయభిమానధనుం డీకార్యంబున కీడుకొనఁజాలడు. అని తనకుఁ బ్రాణంబైన కౌంతేయుఁడు పలుక వాసుదేవుం డుహాసమిల్లి యిట్లనియె.

అర్జునా! నీవే నేను. నేనే నీవు. నాయది నీయదియ. నీయది నాయదియ. నీయందు ద్వేషించువాఁడు నాయందు ద్వేషించువాఁడే. నరుఁడవు నీవు. నారాయణుండను నేను. నరనారాయణ ఋషులగు మనమిరువుర మొకకారణంబున నిందు జన్మించితిమి. మన యిరువురందు భేదంబు లేదు. అనిన ద్రౌపది కృష్ణుంగని యిట్లనియె.

వాసుదేవా! పూర్వంబున జగత్సృష్టికాలంబున నీవొక్కండవే ప్రజాపతివని యసితుండును దేవలుండును వచించిరి. దుర్దమపరాక్రమా! యజ్ఞమూర్తియు యజింపయోగ్యుఁడవు నగు విష్ణువు

నీవయని పరశురాముండు పలికె. పురుషోత్తమా! సత్యయుక్తమంబు నీవయని ఋషులు భాషించిరి. సత్యాంగబువలనఁ గలిగిన యజ్ఞంబు నీవయని కశ్యపుఁడు చెప్పె. దేవసిద్ధసాధ్యశివాదులకు నీశ్వరేశ్వరుండవు. లోకభావనుండవు. లోకేశ్వరుండవని నారదుండు పేర్కొనె. బ్రహ్మశంకరశక్రాది దేవతాబృందంబులతో బాలుండు క్రీడపదార్థంబులతోడఁబోలెఁ గ్రీడింతువు. ఆకాశంబు శిరంబుచేతను, పృథివి పాదంబులచేతను, వ్యాప్తంబు. నీ యుదరంబు లోకపూర్ణంబు, విద్యాతపోభితప్తులునగు ఋషీశ్వరులకు నీవే సత్తముఁడవు. సమరంబున వెనుకంజ యిడని సుకృతాత్ములై సర్వధర్మోపపన్నులైన రాజర్షులకు నీవ గతివి. ప్రభుండవు విభుండవు భూతాత్ముండవునీవ. దశదిశలు లోకంబులు లోకపాలకులు గగనచంద్రసూర్యులు. నీయందుఁ బ్రతిష్ఠితులు. భూమిసంభవించిన జీవకోటికి మర్త్యత్వము దివౌకసులకు నమర్త్యత్వము నీయందే ప్రతిష్ఠితము.

ఇట్టివాఁడవని యెఱింగి నీవు రక్షింతువను విశ్వాసముతోడను జనవుతోడను నాదుఃఖము నీతో విన్నవించుకొనుచున్నదానను.

కృష్ణా! పాండవేయ పత్నినై నీకు సఖినై దృష్టద్యుమ్న సోదరినైన నాయట్టిస్త్రీ నిండుసభలోఁ బడరానిపాట్లు పడియె. రజస్వలనై రక్తమలినంబగు నొంటివస్త్రంబుఁదాల్చి గడగడవడఁకుచు నిలువఁబడిన నన్ను మగవారెల్లరుఁ జూచుచుండ సభలో నాదురాత్ములు పడనీడ్చిరి. రాజసభామధ్యంబున రజఃపరిప్లుతనైన నన్నుఁగని పాపాత్ములగు ధార్తరాష్ట్రులు పరిహసించిరి. పాండవులు పాంచాలురు యదువృష్ణిభోజాంధకులు నిందరు నూపిరితో నుండఁగనే నన్ను వారు దాసిగఁగొన యత్నించిరి. ధర్మపద్ధతి నాలోచింప భీష్మునకు ధృతరాష్ట్రునకు నేను గోడలనుగదా? అట్టి నన్ను బలాత్కారంబున వారు దాసిగఁజేసిరి. మురారీ! వారలననవేల? యుద్ధమందు మహాబలపరాక్రమసంపన్నులని పేరొందియుఁ దమధర్మపత్ని యశస్విని పరులచే సభలో నవమానింపబడుచుండ నూరక చూచుచుండిన యీ

పాండవులు నింద్యులు. పగఱచేఁ బరిభవింపఁబడు నన్నుఁ జూచుచు క్షమించి యూరకుండిన యాభీమునిబలం బా ధనంజయుగాండీవంబు ఛీ యేల కాల్పనా? భర్త యల్పబలుఁడైనను దనశక్తికొలఁది భార్యను రక్షింపవలయుననుట సజ్జనాచరితంబైన సనాతనధర్మపథంబు. రక్షింపఁబడు భార్యవలన భర్త సంతానంబుఁగాంచును. సంతానంబు రక్షితంబగుచుండ, దాను రక్షితుఁడగును. తానే తనభార్యయందు జనించును గావున భార్యకు జాయయనుపేరు ప్రసిద్ధమయ్యె. ఆ కారణంబున భార్యయే నాయుదరంబునఁ బుత్రుఁడై పుట్టునని తలఁచి భార్యయు భర్తను రక్షింపవలయును. ఇట్టిధర్మంబును ధర్మరాజాదులు రక్షింపరైరి. ఎట్టివాఁడైన నెన్నఁడైనఁ దన్ను శరణు జొచ్చిన వారిని ధర్మజుం డుపేక్షింపఁడు. అట్టులుండ నాఁడుదానను దుర్బలను దన శరణుజొచ్చిన యాపన్నను నగునన్ను నీపాండవేయుఁ డుపేక్షించె. ఇదియేఁటి శరణాగతత్రాణమో. ఏకభర్త భర్తచే రక్షితయగుచుండ నాకేవురు మగలుండియు నందొక్క మగవాఁడైన నాపత్సమయంబునఁ గింకమ్మను వాఁడులేఁడయ్యె. ఈయేవురకుఁ బరాక్రమవంతులైన యేవురుకుమారులు నాయం దుదయించిరి. వారినిమిత్తమైనను వీరు నన్ను రక్షింపవలసియుండెను. యుధిష్ఠిరునివలనఁ బ్రతివింధ్యుఁడును, వృకోదరు వలన సుతసోముఁడును, బార్థునివలన శ్రుతకీర్తియు, నకులువలన శతానీకుండును, సహదేవువలన శ్రుతకర్ముఁడును నాయం దుద్భవించిరి. వీరందఱు నీకుఁ బ్రద్యుమ్నునట్టివారు. వీరందఱు ధనుర్విద్యయందు సమర్థులు. శస్త్రనివారణ పరాయణులు. ఇట్టివారి ప్రాపుండియు దుర్బలీయులైన ధార్తరాష్ట్రుల నేల సహింపవలయు? రాజ్యమా యధర్మంబున నపహృతంబయ్యె. వీరందఱు దాసులుగ గ్రహింపఁబడిరి. రజస్వలయు నేకవస్త్రయునగు నేను సభకీడ్వఁబడితిని. భీమార్జునులు నీవును దప్ప నన్యుల కెక్కిడరాని గాండివంబను పెనుమోపుమోచికొనితిరుగు నీపార్థునిపౌరుషంబు ఛీఛీతలంపనసహ్యమయ్యెడి. భీమునిబలంబు నట్టిది. దుర్యోధనుండు వీరికిఁ గావించిన యెగ్గిది యొక్కటియకాదా యందమేని బాల్యంబున

భీమునకు విషాన్నంబు పెట్టి. పాములచేఁ గఱపించె. గంగలోఁ ద్రోయించె. లక్కయింటఁ జిచ్చుఁగొలిపె. అంతట వీరెల్ల నడవుల పాలైరి. దైవబలంబుకతన హిడింబ బకాది రాక్షసుల వాతఁబడక జఘన్యవృత్తి నేకచక్రాపురంబున జీవించి పదపడి నాస్వయంవరము నకు వచ్చిరి. అం దర్జునుండు నన్నోడిచె. ఇవన్నియు నీ వెఱుంగ నివికావుకదా. దేవతాస్త్రీవలె నయోనిజనై యుత్తమకులంబునఁ బుట్టితిని. పాండవులకు భార్యనైతిని. పాండురాజు నంతవానికిఁ గోడలనైతిని. మధుసూదనా! ధర్మాపదేశంబునఁ బౌరుషహీనులగు నీయేవురు మగలు చూచుచుండ సభలో వెండ్రుకలుబట్టి లాగఁబడి తిని. ఇట్టి యవమానమును నాయట్టి దిట్టగాక యింక నేమానవతి సహించి ప్రాణముల ధరించు. అని నేత్రపద్మములనుండి యుసిరిక కాయలంతలు కన్నీటిబొట్లు స్తనమండలముపైఁబడి పైటఁదడుపు చుండఁ గరపద్మముల ముఖపద్మముకప్పుచుఁ బాంచాలి కోపవేగంబున రోఁజుచుఁ గన్నీరుకంఠంబు నడ్డగింప డగ్గుత్తికతోని రోషంబున నిట్లు భాషించె.

ఎప్పుడు క్షుద్రులచే నేనవమానపడుచుండ మీరు విగత శోకులై రోషహీనులై త్యక్తమానులై మగవేషములు వేసికొని యల వోకవోలెఁ గానిదానివలెఁ గనులారఁగని సహింపఁగలిగితిరో విని యూరకుంటిరో యప్పుడే నాకుఁ బతులు లేరు. పుత్రులు లేరు. బంధువులు లేరు. సోదరులు లేరు. తండ్రియు లేఁడు. కృష్ణా! నీవును లేనిదాననే. అక్కఱ కాదుకొనని చుట్టము లుండిననేమి లేకుండిననేమి? సూతసుతుఁడు నన్నుపహసించిన దుఃఖము కారు చిచ్చువలె హృదయంబున మండుచున్నది. అది చల్లారునదికాదు. బాంధవము, గౌరవము, సఖ్యము, సామర్థ్య మను నీనాలుగు కారణ ములచేఁ గృష్ణా! నీచేత నేను సర్వదా రక్షణీయను. అనినఁ గృష్ణుండు కృష్ణ కిట్లనియె.

దేవీ! దుఃఖింపకుము. పర్జన్యతనయు శరధారాపాతంబున భూతలంబున విశీర్ణగాత్రులై కూలినపతులంగాంచి నీశాత్రవుల సతు

లశ్రుధారాపాతంబున స్నానంబుచేయుకాలము సమీపించుచున్నది. అర్జున ప్రయుక్తాస్త్రంబులు కౌరవ శుద్ధాంత కాంతా సంతానముపట్ల దుర్విటులంబోలి కుంకుమ ముడుపను, గాటుక నుడుపను, మకరికలఁ గన్నీటఁ దుడుపను, గోడు కుడుపను, సూత్రంబులఁ ద్రెంపను, మన స్సుల నొంపనుఁ గమ్మలఁదీయను, బాపటకలయఁ ద్రోయను వర్తించు నని యెఱుఁగుము. ఇఁక నీ సపత్నుల పత్నులకుఁ దడసినదైక లాఱు విరామములేదు. దీనికై యెట్టెట్టికార్యము పాండవులచేఁ జేయింప శక్యమో యంతయుఁ జేయించెదను. సఖి! యూఱడిల్లు మూఱడిల్లుము. సత్యముపైఁ బ్రమాణముచేసి చెప్పుచున్నవాఁడను. నీవు రాజురాణివి కాఁగలవు. ఆకాశము నేలఁగూలినను, హిమా చలము వ్రక్కలై వ్రీలినను, ధరణిచూర్ణమై తూలినను, సముద్రము లింకఁ బాఱినను నావచనము వ్యర్థముగాదు.

అని కృష్ణుండు పలికిన పలుకులువిని ద్రౌపది యర్జును నోర చూపులఁ జూచిన నామెభావంబు గ్రహించి ఫల్గునుం డిట్లనియె.

దేవీ! శోకింపకుము. మధుసూదనుఁడు చెప్పినంత కాఁగలదు తప్పదు. అనిన ధృష్టద్యుమ్నుం డిట్లనియె. అక్కా! నేను ద్రోణునిఁ జంపువాఁడను, శిఖండి భీష్ముని వధించును. దుర్యోధనుని భీముఁడును, గర్ణుని ధనంజయుఁడును. దుష్కృత్యవశిష్టులఁ జేయువారలు. రామకృష్ణులప్రాపు గలుగ మే మింద్రాదులకైన నజయ్యులము. ఇఁక ధార్తరాష్ట్రుల మాటయేల? అనినఁ బాంచాలి యూఱడిల్లి యూరకుండె.

అంతఁ గృష్ణుం డా వీరవర సముదాయ మధ్యంబుననుండి యుధిష్ఠిరుతో నిట్లనియె. ధర్మనందనా! నేను మీసమీపంబున లేనికా రణమున మీకిన్నిదుఃఖములు గలుగఁ గారణమయ్యె. నే నూరనుం టినేని ద్యూతవార్త విన్నవెంటనే వచ్చి భీష్మద్రోణకృపబాహ్లికులఁ గలుపుకొని జూదమువలనఁ గలుగుకీడుల నుగ్గడించి, నలుఁడు పడిన పాట్లు వాకొని, వెలది, జూదంబు, పానంబు, వేఁట, కామజంబు

లనియు వానివ్యసనంబునఁ దగులుకొనుట కీడునకు మూలమనియు నుపన్యసించి యెట్లైన యుక్షక్రీడ వారించి యుందును. ఇట్లు సామంబు సుయోధనుండు సద్దసేయఁడయ్యెనేని బలాత్కారమున నైన వానిని లోపఱిచియుంపుదును. నేను ద్వారకయందు లేక ప్రవాసినై నకతంబున మీకిన్ని కష్టములు ఘటిల్లె. నేను ద్వారావతికరుదెంచి మీకు మూఁడినకీడు యుయుధానుచే విని కడుపునఁ జేపెట్టి కలఁచి నట్లైన వెంటనే మిమ్ముఁ జూడవచ్చితిని. అనినఁ బాండవాగ్రజుండు గదాగ్రజుతో నిట్లనియె.

కృష్ణా! యింతకాలము ద్వారకయందు లేక యెందుఁబోయి యుంటివి? ఏల? యనినఁ గృష్ణుండు నేను రాజసూయయాగంబు నిమిత్తంబుగ మీయొద్దనుండు సమయంబున నాచేత హతుఁడైన శిశుపాలుని సోదరుండు సాల్వుఁ డనువాఁడు సౌభకవిమానంబుఁగొని ద్వారావతిపై దాడిపెట్టి యదుబాలురతోఁ గలహించి యూరంతయుఁ బాడుగావించె. ఇచ్చటనుండిపోయిన మఱియావార్తవిని వాఁ డుండు నగరంబుపైఁజని వానితోఁ బదిమాసంబులు పోరి యతని నిహతుఁ గావించితినని యావృత్తాంతమంతయు వినిచె.

ఇట్లు శ్రీకృష్ణమూర్తి పాండవుల నూరార్చి వారి సమ్మతి సుభద్రాభిమన్యులఁ దోడ్కొని ద్వారకకుఁ దరలె. ధృష్టద్యుమ్నుండు ద్రౌపదీపుత్రులం దోడ్కొని యరిగె. చేదిరాజగు ధృష్టకేతుండు నకులుని భార్యయు నిజసోదరియు నగు కరేణుమతితో శుక్తిమతికిం జనియె.

## కృష్ణుండు దుర్వాసుని శాపమువలననుండి పాండవుల రక్షించుట.

ఇట్లు పాండవులు వనవాసంబు చేయు సమయంబున దుర్వాసుండు పదివేవురు శిష్యులతోడ నికృతిప్రజ్ఞుండును నానోపాయంబులఁ గౌంతేయుల కపాయంబు రోయువాఁడును నగు దుర్యోధనుని యింటికరుదెంచిన నతండు సోదరులతోడ వినయవినమిత శిరస్కుండై

గర్వంబువిడిచి దమంబువహించి యమ్మహాత్మున కాతిథ్యంబు గావించి విధిప్రకారంబు స్వయముగఁ బూజించె. ఆ మునివరుం డందుఁగొన్ని దివసంబులు వసించె. ఇతండు ప్రచండకోపి. ఏమితప్పినఁ దెప్పున శపించునో యని దివారాత్రము లాయనను బరాకులేక సేవించె. ఆ మునిసత్తముఁ డాతని చిత్తవృత్తిఁ బరీక్షింపఁగోరి రాజా! యాఁకొన్న వాఁడను. నాకు శీఘ్రము మాహారము కల్పింపుము. స్నానమున కేగి యుదెవచ్చెదనని చిరకాలమునకుఁగాని రాక తడసివచ్చియు నా కాఁకలిలేదు. భుజింపనని యదృశ్యుఁడగును. ఒక్కొక్కనాఁడు సమయముకాని సమయమునవచ్చియుఁ దట్టుముట్టాడు నాఁకలిచేఁ బ్రాణములు కంఠగతములైనవి. ఇప్పుడ నా కాహారము కావలయుననును. ఒక్కొక్కనాఁ డర్ధరాత్రంబున లేచి యిప్పుడు నాకు భుజియింపఁ బెట్టుమనును. సర్వమూ సిద్ధముచేసి తెచ్చిన "ఛీ యిది తినరాని యవేళ నాకు వలదు పొమ్మనును. ఆ ఋషీశ్వరుఁ డెంత పీడించినను దుర్యోధనుఁడు మనమునందును మనసువేసట కోపము తాపము గల వాఁడుగాఁడయ్యె. దానికిమెచ్చి దుర్వాసుండు సుయోధనుం గని రాజా! నీపరిచర్యకు మెచ్చితి. వరంబే దేని కోరుము. ప్రీతుఁడనైన ధర్మయుతమైన నీకు నలభ్యము కాదనిన దుర్యోధనుండు సంతోషించి ముందే కర్ణశకునులతో నాలోచించియుండిన వాఁడగుటఁ జేతులు మోడ్చి నమస్కరించి సభక్తికంబుగ హర్షపులకితగాత్రుఁడై యిట్లనియె. బ్రాహ్మణోత్తమా! యెట్లు నీవు నాకు శిష్యసమేతుఁడవై యతిథివై నన్ననుగ్రహించితివో యట్టులే మాకులంబున జ్యేష్ఠుఁడు శ్రేష్ఠుఁడు మహారాజగు యుధిష్ఠిరునకును నతిథివై యాయనను నాదరింపుము. ఆయన సోదర సమేతుండై యిప్పుడు వనవాసంబుఁ గావించుచున్నవాఁడు. . ఆ ధర్మాత్ముండు గుణశీలసంపన్నుండు గావున నతని కతిథివై నన్నుఁ గృతార్థుఁజేయుము. ఆయనభార్య సుకుమారియు యశస్వినియునైన ద్రుపదరాజపుత్రి ద్రౌపది. ఆమె బ్రాహ్మణావళులకెల్లఁ గుడుపిడి భర్తలుభుజించిన పదపడి తాను భోజనము చేసి విశ్రాంతికై సుఖాసీనయైయున్న సమయంబున నశిష్యుఁడవై

నీవు పోవలయును. నాయందు మీకు నిక్కపుమక్కువ నెక్కొనె నేని యిక్కరణిగావింపుఁ డనిన నట్ల గావించెద నని పయనమైపోయె. సుయోధనుండును గృతార్థుండనైతినని సంతుష్టుండై కర్ణుని కేలుకేలఁ గదించి ముదించి మదించి యుప్పొంగుచుండె. కర్ణశకుని దుశ్శాసనులును మహారాజా! యదృష్టవంతుఁ డనిన నీవే యదృష్టవంతుఁడవు. అవురా భాగ్యము. నీయభీప్సితంబెంత సునాయాసంబుగ నెఱవేఱె. శత్రునాశమెంత సుకరమయ్యె. మేలుమేలు నీభాగ్యమే భాగ్యము. పాండవశలభంబులు దుర్వాసః కోపదవానలంబునఁ గూలె మఱికాలెఁబో. అని యిట్లు నికృతిప్రజ్ఞులైన యందుష్టులు సంతుష్టులై వారి వారి యిండ్లకుఁబోయిరి.

అనంతర మొకనాఁడు పాండవులును పాంచాలియు భుజించి సుఖాసనంబుల నుండుతఱింగి దుర్వాసుండు పదివేవురు శిష్యులు గొలువఁ బాండవు లుండు నరణ్యమునకుఁ బోయెను. ఆయన రాక విని విశిష్టవివేకుండు ధర్మనందనుం డెదురేగి పూజించి తోడ్తెచ్చె. దుర్వాసుండును రాజేంద్రా! నేను క్షుధార్తుండను. నాకు నాశిష్యులకు వేవురకు భోజనం బిప్పుడ కల్పింపుము. అనిన నట్ల యగుఁగాక స్నానమాడి విచ్చేయుఁ డనిన నప్పరమకోపనుండు స్నానార్థంబు నదికిం జనియె. దుర్వాసురాక తానమాడఁబోక విని చింతాక్రాంతయై పాంచాలి యన్నం బభావంబగుట మిగుల విచారపడఁ జొచ్చె. సూర్యదత్తదివ్యపాత్రంబు నా భోజనమగునంతక యన్నంబుఁ గల్పించుఁగాని యావల నొసంగదు. నేను భుజించియుఁ దడవాయె. ఏమిసేయుదునని విషణ్ణయై యాపన్నరక్షకుండు కృష్ణుండ యని యాయన నుద్దేశించి యిట్లు స్తుతించె.

కృష్ణా! దేవకీనందనా! వాసుదేవా! జగన్నాథ! ప్రణతార్తినాశన! విశ్వాత్మా! విశ్వజనక! విశ్వహర్తా! ప్రభూ! ప్రపన్నపాల! గోపాల! ప్రజాపాల! పరాత్పర! ఆకూతిచిత్త ప్రవర్తక! నమస్కారంబుః అనంత వరేణ్యావరద! యనాథనాథ! పురాణపురుష! ప్రాణమనోవృత్త్యాద్యగోచర! సర్వాధ్యక్ష! పరాధ్యక్ష! దేవా! నీశరణంబు

చొచ్చినదానను, శరణాగతవత్సలా! నన్నుఁ గృపచే రక్షింపుము. నీలోత్పలదలశ్యామ! పద్మగర్భారుణేక్షణ! పీతాంబరపరీధాన! కౌస్తుభ భూషణ! భూతముల కాదియు నంతంబు పరాయణమైనవాఁడా! పరం బునకుఁ బరంబైన జ్యోతీ! విశ్వాత్మా! సర్వతోముఖ! సర్వసంపదలకు నీవే పరబీజమవు నిధానంబవు. నిన్ను దిక్కుఁగాఁగలవారి కెట్టి భయంబును గలుగదు. మున్ను సభయందు దుశ్శాసనుబాధవలనఁ దప్పించితివి. ఇప్పుడు నన్నీసంకటంబుననుండి తరింపజేయుము.

అని వినుతించిన భక్తవత్సలుండైన కృష్ణుండు పాంచాలికి ఘటి ల్లిన యాపదనెఱింగి శయనంబునఁ బార్శ్వంబున వినోదాలాపం బులఁ దవిలిన రుక్మిణినివదలి చక్కఁగ నామెయున్నయెడ కరుదెంచె. ఇట్లు వచ్చిన కేశవుంగాంచి యావనితారత్నంబు నమస్కరించి పరమ ముదంబున మునిరాక లోనగుసర్వంబు వినిచె. అంతయు విని కృష్ణుఁ డాఁకటసోలువానివలె నటించుచు నమ్మా! నీకష్టమవల నా లోచించెదను. ఇప్పుడు నాకష్టముఁ బాపుము. నేనత్యాఁకట మాఁడు చున్నాఁడను. చెవులలోఁ బ్రాణములున్నవి. నిముసము గడియలు పడుట నీమాటయు వినరాకున్నది. వేగిరము నాకింత కవళము పెట్టి నీళ్లుపోసితివా ప్రాణదానపుణ్యము లభించు. ఆవల నీకార్యము చక్కఁజేసెదను. లేలెమ్ము. మూర్ఛవచ్చుచున్నది జాగుసేయకుమని తేలగన్నులువైచి చదికిలంబడియె.

ఆయనను జూచి యీ క్రొత్తసంకటంబునకు మఱింత కట కటంబడి యాపడఁతి యిట్లనియె.

అన్నా! భాస్కరదత్తంబైన దివ్యపాత్రంబు మద్భోజనావధి యన్నంబుకల్పించు. నేను భుజించితిని. పాత్రముకడిగి యావల నుంచి తిని. ఒకమెతుకైనలేదే యేమిచేయుదును. అనినఁ గృష్ణుండు మొగముప్రేలవైచుచు నుస్సురస్సురనుచు సఖీ! యిది పరిహాసమునకు సమయముగాదు. పాత్రంబున నొకమెతుకో యింతకూరబద్దో పులుసుగూరో యేదైన నేమాత్రమైననుండిన నీటికడ్డంబుగ నిడి యిన్నినీళ్లుపోయుము, ప్రాణము మరలివచ్చును. అనిన నేను గడిగి

యుంచినదానిలో మెతుకులు కూరలు కూడనుండునా! అంతటి పాత్రశుద్ధి యెఱుఁగనా! పనులయందు సోమరినా! పారిశుద్ధ్యమునకుఁ బెట్టినపేరుదాననే యనెను.

ఏది యా పాత్రమిటదెమ్ము అక్కా! నాతోఁ గోడిగమాడెదవా? యని కృష్ణుండనిన నన్నా! నేనట్లుచేయుదునా? నీవే చూడుమని యా పాత్ర తెచ్చి యాయనచేతికిచ్చె. ఆయనయు దానినిఁటునిటు పొర్లించి త్రిప్పి శోధించిచూచి పాత్రకంఠముక్రిందనున్న శాకాన్నలవమును జూపి యిదోనున్నది. బ్రతికితిని. లేదంటివే యక్కా! దీని నాదోసిట నుంచి యిన్ని మంచినీళ్లుపోయుము. అనిన నాలజ్జావతి భగ్నగర్వ యై యట్లకావించె. ఆయజ్ఞభోక్తయు దీనితో విశ్వాత్ముండు హరి ప్రీతుండగుఁగాక దేవతలందఱు సంతుష్టులగుదురుగాక యని యారగించె.

ఇట్లారగించి వికసితవదనారవిందుండై గోవిందుండు త్రేఁపుచుఁ గడుపు తడువుకొనుచు నిఁక నా ఋషీశ్వరులనందఱ భోజనమునకు రండనిపిలువనంపుమని చెప్పిన భీమసేనుండును శీఘ్రముగ మనంబున వారినెల్ల నాతిథ్యంబు గ్రహింపరండని పిలువఁబోయె.

అక్కడ ఋషీశ్వరులందఱు స్నానంబునకుఁబోయి నీటమునిఁగి లేవ వారికి నన్నంబు కంఠదఘ్నంబై త్రేఁపులమీఁదఁద్రేఁపులు వెడలుచుఁ గడుపుబ్బరించె. ఆ ఋషులందఱు దుర్వాసునిఁజూచి పదివేవురకన్నంబు సిద్ధంబుసేయఁ బాండవులకుఁజెప్పి వచ్చితిమి. మాకెల్లఁ గడుపులునిండియున్నవి. లవమైన నాఁకలిలేదు. అక్కడఁ బోయి భుజించుటెట్లు? వ్యర్థంబుగఁ బాకంబుఁ జేయించితిమి. వారే కష్టదశయందుండ మనము వారికి వృథానష్టకష్టములు గలిగించితిమి. అనిన దుర్వాసుం డిట్లనియె. మహాత్ములారా! మీరు చెప్పినది సత్యంబు. నాకును క్షుద్బాధ యావంతయులేదు. ఇందఱకు వృథా పాకంబుఁజేయించి పాపంబుచేసితిమి. అంతయన్నము భుజించువారును వారియొద్ద నితరులులేరు. అందరిగి వలదనిన వారిని నగౌరవించినట్లగును. పరాభవపఱుచు మనలను వారు క్రూరదృష్టులఁ

జూచుట సత్యము. రాజర్షియగు నంబరీషు మహానుభావం బెఱింగినది మొదలు హరిపాదాశ్రయులగు జనులంగనిన భయపడుచుందును. పాండవులందఱు మహాత్ములు, ధర్మపరాయణులు, శూరులు,సూరులు, కృతులు, వ్రతులు, తపస్వులు, మనస్వులు, సదాసదాచార సంపన్నులు వాసుదేవపరాయణులు. వారు కోపించిరా తూలరాశిని ననలము వలె మనల నిర్దహింతురు. కావున వారియొద్దకుంబోక శీఘ్రంబుగఁ బరువెత్తిపొండనిన వారందఱు నలుదిక్కులకుం బరువెత్తిరి. భీముండు పోయిచూడ నందొక్కమునియుఁ గానరాఁడయ్యె. పేరంబిలిచినం గిమ్మనుశబ్దంబు వినరాదయ్యె. ఏమిదియని యీనదికి నానదికి నీగుంట కాగుంటకుంబోయి యెంతవెదకిన నొక్కనిజాడయుఁ గనరాదు. అందులవారు వారెల్లఁ బలాయనపరాయణులగుట యెఱింగింప భీమసేనుఁ డావింత సోదరులకెల్ల నెఱింగించె. వారును నమ్మునివరుండు జాగుచేసివచ్చునో యర్ధరాత్రమునవచ్చునో యెప్పుడేమఱించివచ్చునో యని విచారపడుచుండిరి. అప్పుడు కృష్ణుండు దుర్యోధనుకొఱగామియు ద్రౌపది తన్ను వేఁడుటయుఁ దానొనర్చిన ప్రతిక్రియయు నెఱింగించి యిఁక నా మునులవలన భయంబువీడుఁడని బోధించె. ద్రౌపదీ పాండవులును గృష్ణా! నీవుమాకుదిక్కగుట బ్రతికితిమి. నీవు తెప్పగా విపత్సాగరంబుఁ దరించితిమి అని ప్రశంసించిరి. కృష్ణుండును వారిచే ననుజ్ఞాతుండై పురంబునకరిగె. పాండవులు హృష్టచిత్తులైరి.

## —♦ పాయసలేపనము ♦—

ఒకనాఁడు కృష్ణుండు ద్వారకానగరంబున స్వగృహంబున నుండునవసరంబున జటాజినధరుండును బిల్వదండియు దీర్ఘశ్మశ్రుండును నతికృశుండును, బొడువువారిలోఁ బొడవువాఁడును, త్రిలోకసంచారియునగు దుర్వాసుం డెల్లరువిన "నతికోపనుఁడును గొంచెమైన నపకారముగావించిన శపించువాఁడును నగు దుర్వాసుఁడను బ్రాహ్మణుని నింటనుంచుకొని సత్కారంబు గావించువాఁడెవఁడో"

యని రచ్చలందును రాచబాటలందును బరించుచువచ్చెఁగాని యొకఁడును నాయన కాతిథ్యమీయఁడయ్యె. కోటవిత్తోడ నెవఁడు తలగోఁకికొనును. కృష్ణుఁ డదిగని యాయనను దనయింట నిలుపుకొని పూజించుచుండె. దుర్వాసుఁడును నొకనాఁడు వేవురకుఁ జేసిన యున్నము దానొకఁడే తిని యింకను దెమ్మనును, అమితభోజిగదా యని పాకము మిక్కిలి సిద్ధముచేయించిన మిగులఁగొంచెము భుజించి పోవును. ఒకప్పుడున్నట్టుండి పకపకనవ్వును. ఒకప్పుడకస్మికముగ బిగ్గఅగ నేడ్చును. అప్పుడు తత్సమానవయస్కుఁడు భూమిని గానరాడయ్యె. అంతట నొకనాఁడు తనవిడిదికిఁబోయి యందలి మంచములు పఱుపులు లోనైనవెల్ల దహించి యిల్లువెడలిపోయెను. ఆవల మరలఁ గొంతకాలమున కరుదెంచి కృష్ణా! నాకిప్పుడు పాయసము కావలయునుజుమీ యనెను. ఆయన మనస్సు ముందే యెఱింగినవాఁడగుట కృష్ణుఁడు నానావిధాన్నపానభక్ష్యభోజ్యాదులు సిద్ధము చేయించియుంచెను. ఆయన పాయసమడుగఁగానే సిద్ధముగ నొక గంగాళము తెచ్చి ముందుంచెను. అందుఁగొంత దుర్వాసుఁ డారగించి కృష్ణా! యీ యెంగిలిపాయస మీక్షణమున నీ దేహమునకు బూసికొమ్మనెను. కృష్ణుండును వల్లెయని దానిని దనకాలిబొటనవ్రేలికిఁ దప్పఁ దక్కిన దేహమునకంతయుఁ బూసికొనెను. ఇంతలో రుక్మిణీదేవియు నచట ద్వారంబునఁ గానిపించె. ఆ ఋషీశ్వరుఁ డామెను బిలిచి మిగిలిన పాయసమామె దేహమునకంతయుఁ బూసెను. ఇట్లు పూసి యంతఁబోవక యామె నొకరథంబునకు గుఱ్ఱమునకు మాఱుగఁగట్టి తాను రథంబుపైఁ గూర్చుండి రథంబు నీడువుమని యిల్లు వెడలి వీధులవెంట నామెను దోలెను. కృష్ణుని కన్నుల యెదుటనే యామెను వేగవేగలాగుమని కోఱడాతో నదలింపసాగెను. ఇంతచేసినను గృష్ణునకు మనస్సున నీర్ష్యాసూయలు జనించినవి కావు. ఇట్లా తేరు రాజమార్గమునఁ బోవుచుండఁ గృష్ణుండును దానివెంటఁ బోవుచుండెను. ఈ యాగడంబు చూచి యాదవులందఱు కోపరక్తాక్షులై హాహాకారంబులుగావించి యొండొరులిట్లు సంభాషించిరి.

ఇఁకభూమిమీఁద బ్రాహ్మణులే పుట్టుదురుగాక. మఱియెవ్వరు పుట్టకుం దురుగాక. వీఁడు బ్రాహ్మణుఁడు కావున బ్రతికిపోయెఁగాని మఱి యొకరుఁ డిట్లుగావించి బ్రదుకఁగలఁడా ? సర్పవిషమే తీక్ష్ణవిషము. అహికంటెఁ దీక్ష్ణవిషజంతువు బ్రాహ్మణుఁడు. బ్రాహ్మణుఁడను సర్పము గఱచినవానిని బ్రదికింప వెజ్జులులేరు. మందులునులేవు. అని యిట్లు చూపఱాడుచుండ నారథము వీథులవెంటఁ బోవుచుండెను. అప్పు డొడ్డ గెడవుగ నుండిన యొకచోట బాలికయగు రుక్మిణి కాలు తడఁబడి నేలఁబడెను. దుర్వాసుండును గోపించి లేలెమ్మని చేతి చబుకుచే నామెను మోఁదెను. ఇట్లు తన్నియుఁ బరమక్రుద్ధుఁడై రథంబుడిగ్గ నుఱికి దక్షిణాభిముఖుఁడై కాల్నడ మనుష్యులకు దుర్గమంబైన త్రోవఁ బరువెత్తెను.

ఇట్లు శిలాకంటకసంకటంబై దుర్గంబగుమార్గంబునఁ బోవు చున్న నమ్మహాముని వెంటఁ గృష్ణుండును పాయసదిగ్ధగాత్రంబుతో మునీశ్వరా ! క్షమింపుము. ప్రసన్నుఁడవుకమ్మని వేఁడికోలుపలుకులతో వెంటఁబోయెను. కృష్ణుని వెంట రుక్మిణియుఁబోవఁ జొచ్చెను. ఇట్లుకొంత దవ్వరిగి దుర్వాసుండు నిలిచి తిరిగిచూచి కృష్ణునితో నిట్లనియె.

కృష్ణా ! నీవు స్వభావముననే కోపమును జయించితివి. నీయెడఁ బ్రసన్నుఁడనైతిని. సర్వవిధముల నభ్యుదయముఁ గాంచుము. మను ష్యుల కన్నమెట్లు ప్రీతికరమో నీవు వారికట్లే యగుదువుగాక. నీకు సర్వపుణ్యకీర్తులు లభించునుగాక. ముల్లోకములందు నీకంటె శ్రేష్ఠుఁడు లేకుండునుగాక. జనార్దనా ! నీవు సర్వలోకప్రియుఁడవగుదువు. నేను నీ యింట నేవేవి ఛిన్నము భిన్నము దగ్ధము గావించితినో యవి యెల్ల నెప్పటియట్ల యథాస్వరూపముల నీ గృహము నలంకరించును గాక. నీవైకోరువఱకు నీకు మృత్యుభయములేదు. నీవు పాయస మును పాదతలంబునఁ బూసికొనినవాఁడవుకావు. కావున నది నీకు మరణకారణమగు. అని యిట్లు సంతుష్టుఁడై కృష్ణుంబలికిన నా పురు షోత్తము దేహంబు మహాకాంతియుక్తంబై విరాజిల్లె. అంత నా ఋషిశ్వరుఁడు రుక్మిణీదేవింజూచి శోభనా ! నీవు సర్వస్త్రీలలో నుత్త

మోత్తమురాలవై నిరుపమాన యశఃకీర్తుల నొందఁగలవు. నీకు జరా, రోగ, వివర్ణములు గలుగవు. నీ దేహమునుండి సర్వదా దివ్య పరిమళము వెలువడుచుండును. నీవు కృష్ణు సదా యారాధింపఁ గలవు. శ్రీకృష్ణునకు షోడశసహస్రస్త్రీలయందు నీవే ముఖ్యురాలవు. కృష్ణసాలోక్యంబు నీకుఁ గలుగును. అని మరల నిట్లనియె. కృష్ణా సర్వకాలమిట్టి బ్రాహ్మణభక్తి కలవాఁడవగుమని యంతర్హితుఁడయ్యె. రుక్మిణీ వాసుదేవులు మరలి దివ్యతేజంబున వెలుఁగుచు గృహంబున కరుదెంచిరి. వారు వచ్చిచూడ దుర్వాసుఁడు నాశపఱిచిన సర్వ పదార్థము లెప్పటియట్ల గృహంబు నిండియుండె. అది చూచి యందఱబ్బురపోయిరి. కృష్ణుండు తన బ్రాహ్మణభక్తిం దెలుప నిన్ని పోకలఁ బోయెనుగాని కాకున్న దుర్వాసుఁడెంతమాత్రము.

## దూతకృష్ణలీల.

పాండవులు పండ్రెండు సంవత్సరములు వనవాసమును బదు మూఁడవసంవత్సరమున విరాటరాజ నగరంబున నజ్ఞాతవాసంబును గావించిరి. ఆ నియమితకాలానంతరము వారు బయలుమెఱసి యథా స్వరూపములతో గోచరించిన విరాటరాజు సంతసించి తన పుత్రిక నుత్తరనునర్జునకుమారుఁడగు నభిమన్యునకిచ్చి వివాహంబుఁ గావించె. అమ్మహోత్సవముఁజూడ ద్రుపదుఁడును బలరామకృష్ణ సాత్యకులు లోనగు యాదవప్రవరులు నరుదెంచిరి. పరిణయానంతరము రాజు లందఱు సభదీఱియుండఁ బాండవ యోగక్షేమ భారవాహకుఁడగు శ్రీకృష్ణమూర్తి యిట్లనియె.

మహీపాలకులారా! ద్యూత విద్యయందు నిపుణుఁడైన శకుని యసమర్థుఁడైన యుధిష్ఠిరుని జూదంబునకు బలాత్కరించుటయు నంతియగాక యాయన నోడించి రాజ్యభ్రష్టునిఁ గావించుటయు మీ రెఱుఁగుదురుగదా. నికృతిప్రకృతులైన యా దుష్కృతుల నం

దండ హతులఁజేయ శక్తులయ్యుఁ దాము సత్యమందు నిలిచి ద్వాదశ హాయనంబులు కాననంబులందును, నొక వర్షంబు మాఱువేషం బుల భార్యాసమేతులై యుండును, బడరానిపాట్లంబడి పాండవులు సమయభంగంబు కానీక వర్తించుటయు మీకు విదితము. ఇఁకఁ బాండవులకుఁ గౌరవులకు మేలగుకార్యము ధర్మమార్గము తప్పక మీరాలోచింపవలయును. అధర్మమునవచ్చు స్వారాజ్యమైన ధర్మ నందనుండొల్లఁడు. ధర్మవిధిని నొక్కగ్రామముతోనైన సంతసించును. ధృతరాష్ట్రసుతులిమ్మహాత్ముని పైతృకరాజ్యమెట్లు హరించిరో, యీ యన దుస్సహబాధలనెట్లు సహించెనో యిచ్చట మూఁగిన రాజ లోకంబునకెల్ల నెఱుకయే. ధార్తరాష్ట్రులందఱుసు గాండీవధన్విని రణరంగమునఁ జెనకఁజాలరు. అట్టులుండియు యుధిష్ఠిరుఁడు దుర్యో ధను కుశలంబ కోరుచున్నవాఁడు. పాండవులేవురు తొల్లి తాము రాజుల జయించి వశపఱిచికొనినదానిని గోరుచున్నవారు. పితృ పితామహార్జితంబంతయు నాతండ యనుభవించుఁగాక. స్వార్జితంబు వీరు కోరుట ధర్మయుక్తంబకదా. దుర్యోధనుఁడు పాండవుల బాల్య మునందె యెట్లు హింసింప యత్నించెనో యది జగద్విదితము. వారెంతటి లోభులో యుధిష్ఠిరుండెంత ధర్మాత్ముఁడో మీరాలోచింప వలయు. మీరెల్ల రీవిషయము వేఱువేఱుగాను నందఱొక్కటిగఁ గలసియు నాలోచింపవలయు. పాండవ ధార్తరాష్ట్రులకుఁగల బాంధ వమును మీరు దలంపవలయు. పాండవులు సర్వదా ధర్మనిష్ఠులు. కృతసమయమున నుత్తీర్ణులు. కావునఁ బైతృకరాజ్యసంపద మరలఁ గొననర్హులు. గాంధారీసుతులింకను దుర్మతులై నికృతిరతులై వీరి నన్యాయముగఁ గారింపఁజూచిరేని వీరు వారినెల్లర నొక్కటన యుక్కడఁగింతురు. వీరికి సంగరంబున బాసటగాఁగలవారు పెక్కుగు గలరు. ఇంతకు దుర్యోధను తలంపెట్టిదో యతఁడు చేయు కార్యవిధ మెట్టిదో మనమెఱుంగము ఎదిరియభిప్రాయం బెఱుంగ కానిసమయంబునఁ గర్తవ్యమెట్లు నిర్ణయింపనగు. కావునఁ గులీనుఁడు ధర్మశీలుఁడు శుచియు నప్రమత్తుఁడు, సమర్థుఁడునగు దూతను గౌర

వులకడకంపి సామవాక్యంబుల సాముురాజ్యము ధర్మజునకీయ దుర్యోధను నొడంబఱుచుట మేలని నా యభిప్రాయము. అనిచెప్పిన నంద అది యుక్తమార్గంబని ప్రశంసించిరి. అంత ద్రుపదుండు తన పురోహితునకుఁ జెప్పవలసినమాటలు చెప్పి ధృతరాష్ట్రుకడకుఁ బుచ్చె. కృష్ణుఁడును యాదవసహితుడై తక్కినరాజులఁ బిలిపించునపుడు మమ్ముఁ బిలిపింపుఁడని చెప్పి ద్వారకకరిగె.

పాండవకౌరవులు రణమునఁ దమకుఁ దోడుపడ వేఁడుచుఁ బుడమిఱేఁడులకడకుఁ దగిన మనుష్యులఁ బంపిరి. కృష్ణునిఁగోరు తలఁపున నర్జునుండు ద్వారకకరిగె. కృష్ణుఁడు ద్వారకకుఁబోవు వార్త విని దుర్యోధనుండును నచటికిఁ దరలి చనియె. కృష్ణుగృహంబునకు దుర్యోధనార్జునులిరువురు నేకకాలంబునఁ జనిరి ఆ సమయమున వాసుదేవుండు నిద్రించుచుండె. దుర్యోధనుండు ముందులోపలికిఁ జని రాజాభిమానంబునఁ దలవైపుననున్న యున్నతాసనంబునఁ గూర్చుండె. అర్జునుండును నతనితోడన చని కృష్ణుని పార్శ్వభాగంబునఁ గృతాంజలియై సవినయంబుగ నాసీనుండయ్యె.

కృష్ణుండును గొంతవడికి నిద్దురలేచి యెదురనున్న కిరీటి ముందు గాంచి పదపడి మరలి సింహాసనగతుండైన గాంధారీసుతుని వీక్షించి యిరువురకు స్వాగతంబువచించి వారిరాకకు హేతువుఁ బ్రశ్నించె. అప్పుడు సుయోధనుండు మధుసూదనుం జూచి చిఱునవ్వున నిట్లనియె.

రాఁగల మారణంబున నీవు నాకు సాహాయ్యం బొనర్పవలయు. సఖ్యబాంధవంబుల నీవు నాకును నర్జునునకును సమానుఁడవు. నేను ముందు నీకడకువచ్చితి. సజ్జనులు ముందువచ్చినవాని నాదరింతురు. నీవు సజ్జనశ్రేష్ఠుఁడవు. కావున సద్వృత్తంబు చిత్తంబున హత్తించి ప్రథమాగతుఁడనగు నాకుఁ దోడుపడుము. అనిన గోవిందుఁ డిట్లనియె.

నీవు తొలుతవచ్చినవాఁడవను విషయమున నాకేసందేహము లేదు. అయినను రాజా! నేను ముం దర్జునుఁ గంటిని. రాకయందు

నీవు మొదటివాఁడవు. దర్శనంబునఁ బార్థుండు ప్రథముఁడు. కావున మీ కిరువురకు నేను సాహాయ్యమాచరించెదను. చిన్నవాఁడు తొలుతఁ గోరవలయునని శ్రుతిగలదు. నాతో సమానబలులు నారాయణులను గోపాలు రొక యర్బుదసంఖ్యలు గలరు. వారు మహాయుద్ధ విశారదులు. దురాధర్షులు. వారొకయుద్ది. శస్త్రము కేలఁగొనక యుద్ధముచేయక యుండునే నొకయుద్ది. ఈ యిరువురఁ జెరి యొకనిఁ గోరికొనుఁడు. అర్జునుఁడు చిన్నవాఁడు కావున ముం దతనిఁ గోరికొన నిమ్ము. అనిన నర్జునుండు యుద్ధముచేయని శ్రీకృష్ణుఁ గోరికొనియె. దుర్యోధనుండు సంతోషంబున నారాయణులఁ గోరికొని యర్జునుండు కృష్ణుఁగోరుకొనెనని వ్యసనపడక సేనంగొని హస్తిపురంబునకుంజనియె.

దుర్యోధనుం డరిగిన పదపడి శ్వేతవాహనుం గని గరుడ వాహనుం డిట్లనియె.

కౌంతేయా! యుద్ధసాహ్య మపేక్షించునీవు యుద్ధవ్యాపార విముఖు నిరాయుధు నన్నేల కోరితివనిన ఫల్గునుం డిట్లనియె. పురుషోత్తమా! నీవొక్కఁడవే యసహాయుండవై యరాతులనెల్లఁ బొలియింప సమర్థుండవని నే నెఱుగుదు. ప్రతిపంథుల వధింప నేనును సమర్థుఁడనే. నీవింతకుమున్నే పరాక్రమసంపన్నఖ్యాతిఁ గన్నవాఁడవు. ఇప్పుడు వీరిని బొలిగొనిన నీ కీర్తియు నీదేయగు. నేనును యశంబును గాంక్షించువాఁడను. కావున నయుధ్యమానుఁడవగు నిన్నుఁ గోరితి. అదియునుగాక నిన్నెదిరించి జయంబుగొనరాదు. నీవు నాకు సారథ్య మొనరింపుము. ఇదియే నా ప్రార్థన. చిరకాల కాంక్షితంబు దీనిని నెఱవేర్చి నన్నుఁ గృతార్థుఁజేయుము.

యశోదానందనుం డా మాటలు విని యశంబున నాతోడ స్పర్థవహించుట నీకుఁ దగియున్నది. నీకు రథచోదకుండనై నీకోరిక తీర్చెద. అనినఁ గౌంతేయుండు సంతుష్టుండై కృష్ణుతోడ యుధిష్ఠిరు నొద్దకు మరలివచ్చి యావద్వృత్తాంతము వినిచె.

కౌరవులు సంధికి నొడంబడమి నిరువాగువారు యుద్ధసన్నద్ధులైరి. అప్పుడు ధర్మాత్ముండును లోకహితాభిలాషియు బంధువత్సలుం

డును రాజనీతికోవిదుఁడునగు ధర్మనందనుండు రాఁగలబంధుక్షయం బును ప్రజాక్షయంబునుగాంచి రణంబు మేలుగామిభావించి సంధియ మేలని తలంచి కృష్ణుం దిలకించి నీవు కౌరవుల పాలికింజని పెద్దవారి నెల్లరంగని యెల్లవారితోడఁ దగురీతి భాషించి సంధి కుదుర్పుమని ప్రార్థించె. కృష్ణభగవానుండును ధర్మజా! నీతలంపులెస్స. అట్లకావిం చెదఁగాని లోభదూషితచిత్తులు నైశ్వర్యమత్తులు నమద్దుష్ట భూభృ త్తులునగు ధృతరాష్ట్ర దుర్యోధనాదులు సంధికొడంబడుదురనుట కల్ల. అయినను నానేర్చువిధంబున నెల్లపోకలఁబోయి సంధిగావింప యత్నిం చెదనని శుభముహూర్తంబున హస్తినాపురంబునకుఁబోవ దారుక చోదితంబైన రథంబెక్కి ప్రయాణంబయ్యె. ఇట్లు పోవుచుండ మధ్యే మార్గంబున నారదుఁడు, సర్వమాలి, దేవలుఁడు, అర్వావసువు సుజానువు, మైత్రేయుఁడు, శునకుఁడు, బకదాల్భ్యుఁడు, స్థూల శిరుఁడు, కృష్ణద్వైపాయనుఁడు, ఆణిమాండవ్యుఁడు, కౌశికుఁడు, పర్ణాదుఁడు, ఘటజానకుఁడు, అకృతవ్రణుఁడు, శ్వేతకేతువు, కహో లుఁడు, పరశురాముఁడు లోనగు మహర్షులు ముంగలఁ గానవచ్చిన వాసుదేవుండును దటాలున నరదంబు డిగ్గి నమస్కరించి సవినయం బుగ నిట్లనియె.

మహాత్ములారా! మీరిందు విచ్చేయఁ గారణంబేమి? మీ తపంబులకు విఘ్నపాదకులు లేరుగదా? లోకులకెల్ల కుశలంబకదా? పితృదేవాతిథిపూజలు జరగెడినిగదా? ఇప్పుడు మీకు నావలనఁ గావలసిన కార్యమేదియన వారలిట్లనిరి.

జనార్దనా! కౌరవసభయందు సంధినిమిత్తమై నీవాడు మధుర భాషణంబులు వినఁ గుతూహలులమైతిమి. భీష్మద్రోణ కృపప్రముఖు లేమందురు. ధృతరాష్ట్రుఁడును దుర్యోధనుండును నేమి ప్రత్యుత్తర మిత్తురు. ఇవియన్నియు వీనులకానొతగ వినఁగోరెదము. నీవనుమ తించెదవేని సభకువచ్చి కర్ణరసాయనంబులగు నీ సుధామధురాలాపం బులు విని యానందింతుమన నట్లు కావింపుఁడని వారలం బనిచి మరల రథమెక్కి తరలె,

ఇట్లా నందనందనుండరుగుచుండ మబ్బులులేకయే మెఱుపుల తోడి యుఱుములు తఱచయ్యె. వెనుకభాగంబునఁ బలుచని మేఘంబులు జడివానఁగురిసె. తూర్పుముఖంబుగఁబాఱు సింధ్వాది నదులేడును బడమటిముఖంబుగఁ బాఱఁజొచ్చె. దిశలన్నియు విపరీతంబులై గుర్తింపరాకపోయె. భూకంపములు మెండయ్యె. ఎందుఁ జూచినను మంటలు మండఁజొచ్చె. నూర్లకొలఁదులు కుండలనుండి నూతులనుండి జలము పొరలిపోయె. ప్రపంచం బంధకారబంధురం బయ్యె. మిన్నుమన్నేకముగ ధూళులుగ్రమ్మ దిగ్విదిగ్భేదంబు పాటింపరాకుండె. భూతంబులు గానరాకయు మహారవంబులు పెలుచయ్యె. ఛాయాపురుష శరీరంబు గానఁబడదయె. ఈ విపరీతంబులు సర్వసామాన్యముగ సన్నిదేశంబుల గోచరించె. నైఋతిదిక్కునుండి మహావాయువు మహాపరుషధ్వనితో వీచి తరులనెల్ల నురలఁద్రోచిహస్తినాపురంబు బాముపడఁజేసె. వాసుదేవుఁ డెందెందుఁజనె నందందు సుఖవాయువులువీచె. సర్వము సుముఖంబయ్యె. ఆయనపైఁ బుష్పవర్షంబును గమలంబులును విశేషించి కురిసె. మార్గంబు నిష్కంటకంబై సమంబై సుఖదాయియై యుండె. అందందు బ్రాహ్మణులు గుంపులుచేరి స్తుతించి మధుపర్కాదులొసంగి యర్చించిరి. సర్వభూతహితరతుఁడైన శ్రీగోవిందుపై మందయానలానందంబున నందందు బృందంబులుగఁదీరి సుగంధులగు ప్రసూనజాలంబులఁ జల్లిరి. ఇట్లు పోయి కంసారి సర్వసస్యమనోహరంబైన శాలిభవనంబుఁ జేరె. శ్రీముకుందపదారవింద సందర్శనాభిలాషచే నుపప్లావ్యంబునుండి పురజనులందువచ్చి బాటలకిరువంకల బారులుదీఱి నిలిచియుండిరి. ఇట్లు గోపాలుండచ్చటి పైరులపచ్చలు నోడ్డులు గోదలనన్నిటినిజూచి హర్షించుచుఁ బోయిపోయి వృకస్థలంబుఁజేరె. అప్పటికి సూర్యాస్తమయసమయంబగుట నారేయందు వసించి యుదయంబునఁ గాల్యకృత్యంబులు దీర్చికొని మరలఁ బయనించె. వృకస్థలవాసులును గొంతదూరము శ్రీకృష్ణువెంటఁజని యాయనచే ననుజ్ఞాతులై మరలిరి.

అచ్చటఁ గౌరవులు కమలనాభుండు వృకస్థలంబునందు విడిసె ననియు మఱునాఁటి వేకువ కరినగరంబునకు వచ్చుననియు విని పురంబున రాజమార్గంబులెల్ల శృంగారించిరి. భీష్మద్రోణకృపాదులును, దుర్యోధనుఁడు దక్కఁదక్కిన కౌరవులును, గృష్ణు నెదుర్కొనఁ జనిరి. అనేకులు పౌరులు నానావిధ యానంబులను బాదచారులయ్యును జనిరి. ఇట్లందఱరిగి హరి నెదుర్కొని పురంబునకుఁ దోడి తెచ్చిరి. ఇసుకచల్లిన నేలరాలకుండునట్లు రాచబాటలు జనసమ్మర్దంబులై యుండె. బాటల కిరువంకలఁగల మిద్దెలుమేడలు లీలావతార మూర్తి దర్శనలాలసలై దుక్కిన లోలలోచనల ప్రేగున నేలఁ గూలునో యనునట్లుండె. వాయువేగంబులయిన తోయజాక్షు రథ్యంబులు రథచోదకప్రయత్నంబున నిరకటంబున మెల్లగఁ బోఁజొచ్చె. ఇట్లు చని చక్రధరుండు ధృతరాష్ట్రు మందిరంబుఁజొచ్చె. అంబికేయుండును గాంగేయ ద్రోణకృప బాహ్లికాది సమేతుఁడై లేచి కృష్ణుఁగౌరవించి యొక్క కనకాసనంబు సమర్పింప నందాయన యాసీనుండయ్యె. పురోహితు లర్ఘ్యపాద్యంబులు దెచ్చి సమర్పించిరి. కృష్ణుండును వారి వరుస నెన్నుచుఁ బరిహాసోక్తులాడుచుఁ గొంతసేపుండి విదురమందిరంబునకుం జనియె.

విదురుండును మహానుభావా! నీరాకవలనఁ గలిగిన యానందమేమని చెప్పుదునని నుతించి కుశలప్రశ్నంబులడిగి యావలఁ బాండవులక్షేమంబు విచారించె. విదురుండు పాండవులయెడ నభిమానము గలవాఁడనియుఁ బాండవుల కతనియెడ భక్తిగలదనియు నెఱుఁగుఁ గావునఁ గృష్ణుండును బాండవులవృత్తాంత మంతయు నాయనకు వినిచె.

అటనుండి తరలి జనార్దనుండు మధ్యాహ్నమున మేనత్తఁ గుంతిని జూడఁబోయె. ఆమెయుఁ జిరకాలాగతు నల్లునికంఠంబుఁ గౌఁగిలించి తగుపీఠంబున నాసీనుండైన కృష్ణునితోఁ దన పుత్రులం దలంచి కన్నీరుమున్నీరుగఁగాఱ వాడినముఖంబుతో నిట్లనియె.

కృష్ణా! బాల్యంబునుండియు గురుశుశ్రూషారతులు సత్యనిష్ఠితమతులు, సాధుగతులు, పరస్పరసుహృదులు సనులు నయ్యు మోసముచే రాజ్యము గోలుపోయి యవమానపాటు దుఃఖపాటు పాలయి సుఖము సంతోషము మిత్రసాంగత్యము నంతయు వదలి యడవులపాలైన నా కొడుకులు సుఖమున్నారా? నిజగుణగణమహిమచే ముల్లోకములఁ బాలింప యోగ్యుఁడైన యుధిష్ఠిరుఁడు వంది మాగధస్తుతులకు బృంహిత హేషారవంబులకు మంగళగానంబులకు మేలుకొనువాఁడు సింహవ్యాఘ్రసృగాలాది శ్వాపదసత్త్వ పరుషభైరవ ఘోషంబుల మేలుకొనుచు నెట్లు కాఅడవుల సుఖశయనోచిత సుకుమార శరీరంబును బరుషకంటక పాషాణవికట స్థండిలంబులఁ బడవైచియుండెనో, అవమానము సహింపనివాఁడు సార్థకభీమాభిఖ్యుండును, భ్రాతృప్రియుండును, కీచకబక హిడింబాది రాక్షస హంతయునగు వృకోదరుఁడు ధార్తరాష్ట్రులయెడ రోషంబునఁ బెను పాముఁబోలె రోఁజుచుఁ గష్టములెట్లనుభవించెనో. కృష్ణా! సహస్ర బాహుఁడు కార్తవీర్యునితో సముఁడును, నొక్కమ్మువోలె నేనూఱమ్ము లొక్కసారి విడువగలవాఁడును, నెదిరిన ప్రత్యర్థిని బ్రాణముతో విడువనివాఁడును, దేవతలకు నింద్రునివలెఁ బాండవులకుఁ బ్రాపైన వాఁడును నగు నర్జునునకు క్షేమమా?

అన్నా! నా కొడుకులకంటెఁ బ్రియులును, సుందరులును, సుకుమారులును, నగు నకుల సహదేవులు పడరానిపాట్లెట్లు సహించిరో.

అయ్యా! నా కొడుకులకై నేను దుఃఖింపను. నా పుత్రుల కంటె నాకుఁ బ్రియురాలు ద్రౌపది. దాని దురవస్థఁ దలఁచినఁ గడుపు భగ్గనుచున్నది. మహాకులంబునఁబుట్టి సర్వశుభలక్షణ సంపన్నయైన పాంచాలి నా పుత్రుల వివాహమాడిన కతంబునఁగదా లోకములో నేస్త్రీయును బడని యవమానము దుఃఖముపడెను. రజస్వలను నేక వస్త్రను సభలోనికిఁ బలుగాకు లీడ్చినపు డూరక యనడలువోలెఁ జూచుచుండిన పాండవులఁగాంచి ఛీ ఛీ వీరెక్కడికొడుకులు నా కడుపు

చెడబుట్టిరని వారిని గర్హించితిని. తన భార్య కట్టియవమానము గలిగించుచుండు వైరులను బురుషవిగ్రహములైన యీ యేవురు తప్పనాటి యే మగవాఁడు చూచి సహించును. అది తలఁచు కొలఁది నాకుఁ గడుపులోఁ జేయిపెట్టి కలఁచినట్లగుచున్నది. ఆమె సభలోఁ బడినమాటలు కులస్త్రీలు వినఁదగినవే కాకుండఁగఁ బడుటెట్లు? ఇట్టిదే కులాంగన యోర్చు? అప్పుడు కురువృద్ధులు భీష్మ బాహ్లీకసోమదత్తులు, నాచార్యులు ద్రోణకృపులు, నిర్విణ్ణులై యూరక చూచుచుండిరి కాని కౌరవుల వారింపరైరి. ఈ యింట నేనెన్ని యోదుఃఖములనుభవించితినిగాని రజస్వలయు నేకవస్త్రయునగు ద్రోవదిని మామల యెదుటికి నిండుసభకీడ్చి క్రూళులు పరిభవించిననాఁటి దుఃఖమువంటి దుఃఖ మెన్నఁ డనుభవించినదానఁగాను. అప్పుడు విదురుండు మాత్రము తత్కార్యము గర్హించె.

తండ్రీ! లోకమునఁ బాణ్యము గుణముగాని విద్యగాదు. ఐశ్వర్యమునుగాదు. కృష్ణా! దుర్యోధను దూఱనేల? వాని తండ్రి నెగ్గాడనేల? భీష్మద్రోణులఁ దప్పుపట్టనేల? నాచేతఁ బెంపఁబడు వయస్సున నే నా తండ్రి ధనికుఁ డల్పద్రవ్యము నొకరికిచ్చినట్లు నన్నుఁ గుంతిభోజునకిచ్చెను. ఈ కురుకులమున నన్నుఁ ద్రోచినయతఁడు నిందార్హుఁడు. నాయనా! నా కొడుకు లూపిరితోనున్నారుగదా? వారినిజూచి పదునాలుగేండ్లు నిండినవి. ఒక నిమిషమైన వారిని జూడకున్న సహింపలేనిదానను. వాసుదేవా! పూర్వపుదుష్టరాజు లభ్యసించిన జూదము వేఁట పాండవులకింపయ్యెఁగదా. దుఃఖానుభవంబునఁ బాపంబునశించు ననియు సుఖానుభవంబునఁ బుణ్యంబు నశించుననియు నందురు. అది యథార్థమేని దుఃఖమనుభవించిన మాఁకిఁకనైన సుఖము గలుగవలయుఁగదా? నేనెన్నఁడును ధార్తరాష్ట్రులయందుల ప్రీతికంటె విశేష ప్రీతి పాండవులయందుఁ గలదాననుగాను. ఇది సత్యమగునేని గోవిందా! మహారణమున భవత్సహాయులైన పాండవులు విజయులై వెలయుదురుగాక.

ముకుందా! నీవా యని నన్నాదరింప నావంకఁ దండ్రియులేని వాఁడే. ఈవంక మామయులేఁడు. ఇఁక నేను బ్రదికి ఫలమేమి ? అర్జునుఁడుపుట్టి పురిటింటిలోనుండఁగనే యూరాత్రి నీ కుమారుఁడు 'విశ్వవిశ్వంభరా చక్రంబు నిర్వక్రవిక్రమంబున జయించును. ఇతని కీర్తి స్వర్గమునంటను వ్యాపించును. ఇతఁడు దురమునఁ గౌరవుల వధించి ధనంజయుఁడై రాజ్యముఁ బ్రాపించి సోదరులతో మూఁడు యజ్ఞంబు లాచరించువాఁడగునని గగనవాణి పలికె. ఇంత యనుభ వించి యా పలుకులు నే నసత్యమందునా ? ధర్మమా ! నీకొక నమస్కా రము. బ్రహ్మదేవా! నీకొక సాష్టాంగము. మహాత్ముఁడవైన కృష్ణా! నీకుఁ బ్రణామము. ధర్మమేకదా ప్రజల భరించునది. కావున ధర్మ స్థాపనార్థంబు జనించిన నీ వాకాశవాణి వాక్కులు సత్యముగఁ జేయకుందువా ? అల్లుఁడా ! వైధవ్యమునకై నేను శోకింపను. ధన నష్టికై విలపింపను. కడుపునఁబుట్టిన బిడ్డలుండియు నొద్దలేనివారైరి కదాయని యేడ్చెదను. నందనందనా! "నీ ధర్మము దినదినమునకు క్షీణించుచున్నది. వ్యర్థపుబ్రదుకింకఁ బ్రతుకకుము" అని ధర్మరాజు నకుఁ జెప్పుము. పరులనాశ్రయించి జీవించువారి బ్రదుకు వ్యర్థము. నీచవిధముగ బ్రతుకుటకంటె మరణమే మేలు. రాజకన్య యేమి కార్యమునకై కొడుకులఁగోరునో యట్టికార్యము నొనర్చుకాలము వచ్చినది. మీరు తూఁగుఁబోతులై కాలము వ్యర్థపఱచితిరా యిప్పుడు మీరు లోకమున గౌరవింపఁబడినను మీఁద నిందింపఁబడుదురు. మీరు నిందకుఁ బాలుపడితిరా మీరు నా కొడుకులుగారు. మీ ముఖావలోకన మిఁకఁ గావింపను. సమయమువచ్చినపుడు ప్రాణ ములు పరిత్యజించియైన గౌరవము దక్కించుకొనుఁడు. అని భీమార్జు నుల కనుము.

క్షత్రధర్మరతులైన మాద్రీసుతుల కిట్లనుము. ప్రాణములకంటె నెక్కుడుగ విక్రమార్జిత భోగములఁ గోరుఁడు. క్షత్రధర్మోపజీవులకుఁ బరాక్రమసంపాదిత పదార్థములే యనుభవయోగ్యములు. అవియే మనఃప్రీతిదాయకములని చెప్పుము. కృష్ణా! నీవిచ్చటినుండిపోయి

సర్వాస్త్రశస్త్రవిశారదుండైన యర్జునునితో నీ వీ విషయమునఁ గర్తవ్యతామూఢుఁడవేని ద్రౌపదితోడ మంతనంబుండి యామె చెప్పినట్లు నడచుకొను మనుము.

రాజ్యాహరణమునకు ద్యూతపరాజయమునకుఁ బుత్రుల దేశభ్రష్టతకు నేను దుఃఖింపను. నడిమివయస్సు పడుచు దానేకవస్త్రయై యుండ సభలోనికీడ్చి పరులు పరుషవాక్యములాడ వినవలసివచ్చెఁగదాయని దుఃఖించుచున్నదానను.

ఏవురుమగ లుండియు ఋతుమతియు వరారోహయు క్షత్రధర్మరతయునైన నా కోడలు దిక్కులేనిదయ్యె. కృష్ణా! యామెకు నాకును నా కొడుకులకును నీవే దిక్కు. నీవు బలరాముఁడు ప్రద్యుమ్నుఁడు ప్రాపుగలిగి భీమార్జునులు బ్రదికియుండ నేనిట్టిదుఃఖము లనుభవించుచున్నదానను.

అనిన శ్రీకృష్ణుం డిట్లనియె. అత్తా! శూరుని యింటఁ బుట్టి యజామీఢుని యిల్లుమెట్టిన నీకంటె నుత్తమస్త్రీ యెవ్వతె లోకమునఁ గలదు? గొప్ప సరస్సునఁబుట్టి వేఱొక మహాసరోవరమున నాటఁబడిన కమలమువలె నీవు గొప్పవంశమునఁబుట్టి వేఱొక గొప్ప వంశముఁ జొచ్చితివి. నీవే యీశ్వరివి. కల్యాణివై భర్తచే గౌరవింపఁబడితివి. సర్వసద్గుణసంపన్నవగు నీవు వీరపత్నివి వీరమాతవు. ఇట్టి నీవు సుఖదుఃఖముల సహించుటొప్పుఁగాని పరితపింపఁదగునా? నీ పుత్రులు సుఖదుఃఖములు, క్రోధహర్షములు, క్షుత్పిపాసలు, శీతోష్ణములు వీనిని జయించి వీరపురుషసుఖముల రమించుచున్నారు. వారు వీరసుఖప్రియులేకాని గ్రామ్యసుఖప్రియులు గారు. మహోత్సాహులు మహాబలులు కావున స్వల్పమునకు సంతోషించువారు కారు. మధ్యములు గ్రామసుఖాసక్తిఁ జేయుదురుగాని ధీరులుత్తమసుఖమే సేవింతురు. ఉత్తములు కష్టించియైన నతిమానుషసుఖము లాశింతురు. ధీరు లంతమునే కోరుదురు. మధ్యమమార్గమును వారొల్లరు. అంతప్రాప్తియే సుఖముగాని నడిమిరకపు సుఖములు

దుఃఖములేయగు. ద్రౌపదీసహితులు పాండవుల నీకభివాదనంబుఁ గావించిరి. తారు నిరోగులై సుఖమున్నారమని చెప్పుమనిరి. సాధితార్థులై యారోగ్యసంపన్నులై సర్వలోకప్రభులై హతశత్రులైన పుత్రుల శీఘ్రమునఁ జూడఁగలవు. అనిన గుంతి పుత్రులకుశలవార్త విని శోక మణఁచుకొని యిట్లనియె.

నాయనా కృష్ణా! వారికేది క్షేమమో యది ధర్మలోపము వంచనలేకుండఁజేయుభారము నీది. నీ వంశము ప్రభావము సత్యము నేనెఱుఁగనిదానఁగాను. మిత్రకార్యమందలి నీ పూనిక తెలఁగు నెఱుఁగుదును. మన వంశమున నీవే ధర్మము. నీవే సత్యము. నీవే పరమతపము. నీవే త్రాతవు. మహాబ్రహ్మమువునీవే సర్వము నీయందే ప్రతిష్ఠితము. కావున నీ మాట యథార్థము కాఁగలదు. అనినఁ గుంతికిఁ బ్రదక్షిణించి యామెచే ననుజ్ఞాతుండై కృష్ణుండు దుర్యోధన గృహంబునకుఁ దగలె.

ఇట్లు చని పురందరమందిర సుందరంబై పరమశోభావిభాసితంబై విచిత్రాసనభాసమానంబైన దుర్యోధనగృహంబుఁ జొచ్చి కృష్ణుండు ద్వారపాలకులచే ననివారితుండై మూఁడుకక్ష్యలదాఁటి చని యభ్రసంకాశంబును, గిరికూటోన్నతంబును, నైన కాంతికాంత ప్రాసాదమధిరోహించి యందుఁ గురుకుమారసమావృతుండై దుశ్శాసన కర్ణ సౌబలసహితుండైయున్న దుర్యోధనుం జేరంజనఁదుడు నందున్నవారితోడ నవశుండై దిగ్గన * లేచి గౌరవపూర్వకముగ నాదరించి యాసనం బర్పించిన నందుఁ గృష్ణుం డాసీనుండై యందులవారిని వారివారి వయస్సుకొలఁదులెఱిగి తగురీతి నాదరించి కొందఱ గేలిగొని యిట్లు పలు తెరంగుల సమ్మానించె. ఆ సమయంబున మాటల సందర్భమున దుర్యోధనుండు శ్రీకృష్ణుని భోజనంబునకుఁ దనయింట నిలువఁగోరిన నాయన దాని కియ్యకొనఁడయ్యె.

---

*కృష్ణుఁడు వచ్చినపుడు లేవక యాయనను నవమానపఱుప వలయునని దుర్యోధనుఁడు నిశ్చయించుకొని యుండియుఁ గృష్ణునిఁ జూడఁగానే యాయన తేజంబున గొట్టుపడి యవశుండై దిగాలున లేచెను.

అంత సుయోధనుండు శశోదర్కంబుగఁ గన్నులవంకఁ గనుగీఁటుచు మృదుపూర్వకంబగు వాక్కుల శ్రీకృష్ణునితో నిట్లనియె.

యదునందనా! నీవు మాయింట విందవైతివను నానందంబున నీకై యన్నపానాసనాంబరముల నమూల్యములగు వానిని సేకరించి సిద్ధపఱిచియుండ నాయింట భుజింప ననుట యేమిన్యాయము? నీ వుభయపక్షములవారికి సముఁడవై యుభయులకు సాహాయ్యమొనర్చితివి. ధృతరాష్ట్రునకు నీవు ప్రియుండవు. సంబంధివి. ధర్మార్థంబులు నీవెఱుంగనివి లేవు. కావున నీవు మాయింట భుజింపమికిఁ గారణము వినఁగోరెద.

అనిన దుర్మదజనభీషణుండు మేఘగంభీర భాషణంబుల నిట్లనియె. రాజా! దూతలు తాము కృతార్థులైన పదపడి భుజింతురు సమ్మాన మంగీకరింతురు. కావున నావచ్చినకార్యంబు సఫలంబుసేసి నన్ను నామంత్రులు లోనగువారిని నర్చింపుము. అనినఁ గౌరవేంద్రుం డిట్లనియె.

నందనందనా! యివియేటిమాటలు? నీయుక్తి యుక్తియుక్తము గాదు. నీవు దూతవని యెంచి నిన్నుఁ బూజింపఁదలంచిన వారము కాము. నీవు కృతార్థుఁడవైనను నకృతార్థుఁడవైనను బంధుమర్యాద దలఁచి యర్చించెడి మాపూజ నీవు నిరాకరింపఁ గారణము నేనెఱుగను. నీకు మాకు విరోధములేదు. కలహములేదు. కావున నీ పలుకులు సమంజసములు గావనిన జనార్దనుం డిట్లనియె.

దుర్యోధనా! కామముచేఁగాని క్రోధముచేఁగాని ద్వేషముచేఁగాని ధనకారణముచేఁగాని లోభముచేఁగాని కపటముచేఁగాని వాదమునకైగాని యెన్నఁడైన ధర్మము విడుచువాఁడ నేఁగాను. పరాన్నము భోజ్యమగుట కది ప్రీతిదత్తమైనఁ గావలె నొండె నొండెఁ దాను గష్టదశయందైన నుండవలయు. రాజా! నీకు మాయందుఁ బ్రీతిలేదు. నీయెడ మాకుఁ బ్రీతి జనించు కార్యము లెవ్వియు నీవు చేసినవాఁడవుగావు. నేనాపద్దశయందును లేను. పగవాని

యింట భుజించుటయుఁ బగతునకుఁ గుడువఁబెట్టుటయుఁ గారాని కార్యములు. పాండవులకు నీవు విరోధివి. పాండవులు నాకుఁ బ్రాణములు. కారణములేక జన్మప్రభృతి పాండవులకుఁ గీడు చేయు చున్నవాఁడవు. వారు నీకుఁ బ్రియులు. సర్వసద్గుణసంపన్నులును అట్టివారితోడి నిష్కారణవిద్వేషము నీకుఁ దగదు. ధర్మమార్గనిరతు లగు పాండుసుతుల నెవ్వరేమిచేయఁగలరు? ధర్మాత్ముల ద్వేషించువారు నన్ను ద్వేషించువారు. వారిప్రియులు నాకును బ్రియులే. ధర్మిష్ఠు లగు పాండవులకు నాకు నాత్మ యొక్కటియ యని యెఱుంగుము. కామక్రోధవశుఁడై మోహంబున నెవఁడు గుణవంతుడో ద్వేషించు వాఁడెపో పురుషాధముఁడు. సద్గుణములుఁగలజ్ఞాతిని నెవఁడు మోహ లోభ కారణమున ద్వేషించు నట్టి యజితాత్మునకుఁ గ్రోధదాసునకు సంపదలు చిరముగ నిలువవు. తనకు విరోధియైనను గుణసంపన్నుఁ డగువాని నెవఁడు ప్రీతినాదరించి చేరఁదీయునో వాఁడు కీర్తిపరుఁ డగును. కావున దౌష్ట్యదూషితంబైన మీయందలియన్నము నాకు భుజింప యోగ్యముగాదు. విదురాన్నముమాత్రము భోజ్యమని నామతము.

## శ్రీకృష్ణుండు విదురునింటికిఁ బోవుట.

అని దురభిమానియగు కురుధరాజాని కిట్లు చెప్పి యా గృహంబువీడి కృష్ణుండు విదురగృహంబునకుఁ జనియె. కృష్ణుండు విదురు నింట నుండుటవిని ద్రోణభీష్మబాహ్లికు లచ్చటికివచ్చి తమతమగృహం బులకు రమ్మని పిలిచిరి. కృష్ణుండును మీపూజ లంగీకరించినట్ల యని సమాధానపఱిచి వారినెల్లఁ బనిచె. విదురుండు శుచిమంతములు రుచిమంతములు గుణవంతములు నగు నన్నపానాదుల సిద్ధము చేయించె. కృష్ణుండును ముందు బ్రాహ్మణభోజనంబు గావించి యవలఁ దానును దృప్తిగ భుజించె.

అమ్మణ్ణి:—కక్కా! కృష్ణుఁడు క్షత్రియుఁడు విదురుఁడు శూద్రుఁడు గదా? శూద్రునింట క్షత్రియుఁడు భుజింపవచ్చునా?

తండ్రి:—ఎట్టియన్నము నిషిద్ధమో యెట్టిదికాదో రుక్మాంగదచరిత్ర యందు వివరముగ మీకుఁ జెప్పితిని. జారులు చోరులు దురాచారులు దుర్నీతిపరులు లోనగువా రెంతసమీపబంధువులైనను వారిచేతియన్న మభోజ్యమగుటయేగాక వారిపదార్థము నుభోజ్యముగాదు. అట్లు తినువాఁడు వారిపాపమునుగూడఁ దినువాఁడుగ నగును. కాఁబట్టి యట్టి దుష్టుల యన్నముకంటె శిష్టులు సదాచారసంపన్నులు నత్యంతభక్తులు జితేంద్రియులు నగు సచ్ఛూద్రుల యన్నము శ్రేష్ఠము. ఇరువురు సమానులైనచోఁ గులశ్రేష్ఠుఁడే శ్రేష్ఠుఁడు. భిన్నగుణులైనచో గుణశ్రేష్ఠుఁడే శ్రేష్ఠుఁడు. కులశ్రేష్ఠుఁడుగాకున్నను గుణశ్రేష్ఠుఁడగువాని పదార్థము గ్రాహ్యము. దుర్యోధనుఁ డాతతాయి. విషము పెట్టెను. ఇంటికిఁ జిచ్చుపెట్టెను. పాములచే గఱపించెను. స్త్రీకి మానహాని గావించెను. ఇట్టివానికూడు దూష్యముగాక ప్రశస్తమగునా?

విదురునియన్నము శూద్రాన్నమందువా పాచకుఁడు విదురుఁడుకాఁడు, ఆయన గృహిణియుఁగాదు. బ్రాహ్మణభోజనానంతరము తచ్ఛేషము శ్రీకృష్ణుఁ డారగించె ననుటచే సూతకారులు బ్రాహ్మణులే. దుర్యోధనుఁడు మాత్రమట్లు చేయించి యుండఁడా యందువా? వానిపదార్థమే పాపపదార్థము. పాపార్జితము. మనస్సు సకలుషము. ప్రీతిలేదు. కావున వానిపదార్థము గ్రాహ్యముగాదు. ఇంతకు మహాయోగేశ్వరుండగు భగవంతునకు శూద్రాన్నమననేమి బ్రాహ్మణాన్నమననేమి? బంధువైనను బాపాత్మునింటికూడు దినరాదని లోకమునకు ధర్మప్రదర్శనార్థ మట్లు వర్తించెను.

అమ్మణ్ణి:—అట్లయిన భీష్మద్రోణులయన్న మెట్లు దుష్టమయ్యె? వారు ధర్మాత్ములేకదా?

తండ్రి:—విషముపెట్టువాఁడు, నింటికి నిప్పుపెట్టువాఁడు, బ్రహ్మహత్యచేసినవాఁడు, గురుభార్యనుగామించినవాఁడు, వీరితోసహవాసము చేసినవాఁడు వీరైదుగురు పంచమహాపాతకులు. దుర్యో

ధనుని దండించి చక్కఁబఱుప శక్తిసామర్థ్యములుగలిగియు భీష్మ ద్రోణులు వాఁడుచేయు పాపకార్యములనెల్ల సహించి యూరకుండినవారు. చేసినవాఁడు, చేయించినవాఁడు, ప్రేరించినవాఁడు నామోదించినవాఁడు నలుగురును బుణ్యమందును బాపమందును సమభాగముల కర్తలు. కావున భీష్మద్రోణులయన్నమును భగవంతుఁ డంగీకరింపలేదు. అదియునుగాక భీష్మద్రోణు లిరువురు రజోగుణభూయిష్ఠులుగాని విదురునివలె సత్త్వగుణభూయిష్ఠులుగారు. దుర్యోధనపక్ష మధర్మపక్షమని భీష్మద్రోణు లెఱుఁగుదురు. అట్లుండియు ధర్మరాజు తమసాహాయ్యముఁగోరినపుడాయనకుఁ దోడ్పడక దుర్యోధనుఁడు పిలిచినపుడు "సర్వజనులు ధనదాసులు. ధనమెవ్వరికిని దాస్యము చేయదు. ధనహేతువుచేత నీకు బద్ధులైనార"మని పామరులవోలెఁ బలికిరిగాని విదురునివలె మాధ్యస్థమునైన వహించినవారుకారు. అదియునుగాక పాండవపక్షులగు వారిలోఁ గొందఱపై వారు క్రోధముమానక తమ బలపరాక్రమములు లోకమునఁ బ్రకటించి వైరనిర్యాతనము చేయవలయుననియే వారి యభిలాష. ఇది రజోగుణప్రభావముగదా. భగవంతుఁడు పాండిత్యము పరాక్రమము ధనము లోనైనవి మెచ్చఁడు. చిత్తపారిశుద్ధ్యము, భక్తిమాత్రమే మెచ్చును. కావున విదురుఁడు పిలువకుండినను గృష్ణుఁ డాయనయింటికిఁ బోయెను.

కృష్ణుఁడు విదురునింటికిఁబోవుటకు వేఱొండు కారణము స్ఫురించెడిని. హస్తినాపురమందలి యనేకులు కౌరవపక్షపాతులు. భీష్మద్రోణాదు లల్పసంఖ్యాకులు మధ్యస్థులు, విదురుఁడొక్కఁడే మధ్యస్థుఁడు పాండవపక్షపాతి కావునఁ గౌరవులవృత్తము తెలియంగవలయునన్న నతని యొకనివలన నెఱుంగఁదగుఁగాని యన్యులవలన నెఱుంగ సాధ్యపడదు. దూతకార్యము నిర్వహించువానికి నెదుటివారి చిత్తవృత్తులు బలాబలములు రహస్యములు ముందుగఁ దెలిసికొనుట యావశ్యకముగదా. కావున నీతిశాస్త్రముచొప్పునను గృష్ణుఁడు విదురునింటికి బోవుటే సరియైన కార్యము.

## కృష్ణ విదుర సంభాషణము.

తరువాతికథ వినుడు. రాత్రివేళ భోజనముచేసి సుఖముగ శయనించియుండు కృష్ణుని సమీపించి విదురుం డిట్లనియె. కృష్ణా! నీ విచ్చటికిఁ జక్కఁగ నాలోచించి వచ్చినవాఁడవుకావని నాయభిప్రాయము. దుర్యోధనుఁడు ధర్మార్థముల నతిక్రమించిన మందుఁడు గర్వి. తన గౌరవముఁగోరుచు నితరులగౌరవము సహింపనివాఁడు. పెద్దలమాట నుల్లంఘించువాఁడు. ధర్మశాస్త్రముల నతిక్రమించిన మూఢుఁడు. దురాత్ముఁడు. అత్యంతాభినివేశముగలవాఁడు. మేలు చేయువారికిఁ గీడు వెదకుచుండువాఁడు. కామాత్ముఁడు. తెలివి లేకుండినను దెలివిగలవాఁడనని గర్వించువాఁడు. మిత్రద్రోహి. సర్వశంకితుఁడు. అకృతజ్ఞుఁడు. ఇంద్రియదాసుఁడు. స్వేచ్ఛానువర్తి. దేనియందును నిశ్చయబుద్ధిలేనివాఁడు. ఇట్టివి పెక్కు దుర్గుణములతనియందుఁ గలవు. కావున నీవతని మేలుపదేశించినను గర్వముచే వినువాఁడుగాఁడు. భీష్మద్రోణకృపులు, కర్ణాశ్వత్థామ సైంధవులు తనకుఁగలరని గర్వించి సంధిచేయనొల్లఁడు. పాండవులు భీష్మద్రోణప్రముఖుల నెదిరింపజాలరని ధార్తరాష్ట్రకర్ణుల నిశ్చయము. అంతియకాక సేనాసమూహమునంతయుఁ బ్రోగుచేసి తాను కృతార్థుఁడైనట్లతఁడు తలఁచుచున్నాఁడు. కర్ణుఁడొక్కరుఁడే తనకు జయమొసంగునని నిశ్చయించికొనియున్నాఁడు. ఇట్టివాఁ డెట్లు సంధి కీయకొనువాఁడు. సౌభ్రాత్రకాంక్ష గల నీవు సంధిచేయవచ్చితివి కాని పాండవుల కేమియు నీయరాదని కౌరవులందఱు నిశ్చయించుకొనియున్నారు. ఇట్టివారికి నీ వేమిచెప్పినను వ్యర్థముకాక సఫలమెట్లగు? ఎచ్చట సూక్తికి దురుక్తికి ఫలము సమానమో యచటఁ బ్రాజ్ఞుఁడు సంభాషించుట బధిరుని ముందఱ గానకళాచాతురి నెఱపుటయగు. జ్ఞానహీనత మూఢులై నిర్మర్యాదులైనవారికిఁ దత్త్వోపదేష్ట చండాలురయందలి ద్విజునివలె నింద్యుఁడు. వీరు బలగర్వితులు మూఢులు గావున నీ వాక్యము వినరు కావున నీవు చెప్పుట వ్యర్థము. అందు దుర్బుద్ధులు పాపమనస్కులు నీచులు ననేకులు గలరు. అట్టివారి

లోనికి నీవు పోవుట నాకు సమ్మతముగాదు. అట్టివారికి నీవు విరోధముగ మాటలాడుటయు సరిగాదు. పెద్దల సేవింపక యైశ్వర్యమత్తులై వయోదర్పగర్వితులై యుండువారు నీ హితవాక్యముల నెట్లు గ్రహింపఁగలరు? దుర్యోధనుం డపారసేనావారంబును సమకూర్చియున్నవాఁడు. నీయందును సందిగ్ధమనస్కుఁడగువాఁడు నీ మాటలు పాటిగఁ జెవి నెక్కనిచ్చునా? బృందారకబృందంబుతోడఁ బురందరుండు పైనెత్తిన దమ్ము జయింపఁజాలఁడని ధార్తరాష్ట్రుల నమ్మకము. ఇట్లు యుద్ధసన్నద్ధులై లోభగుణబద్ధులై దుర్బుద్ధులై కామక్రోధానువర్తులై దుష్టపురోవర్తులగు వారికి నీ వెట్టి కార్యసాధకవాక్యంబులు చెప్పినను నిరర్థకంబు. కరితురగ సేనామధ్యమున నిలుచుండి దానిని జూచి దుర్యోధనుండు నిర్భయుండై ప్రపంచమంతయు దనదే యని మూఢుండై తలఁచుచున్నాఁడు. నిష్కంటకంబుగఁ బుష్కలంబుగ నిర్వక్రంబగు భూచక్రమంతయుఁ దా నవక్రవిక్రమంబున నాక్రమించి పాలింప దుర్యోధనుఁడు సంకల్పించియున్నవాఁడు. ఇట్టివానితోడ సంధి యెట్లు సంధిల్లు? తన కక్కఁబడిన రాజ్యమంతయుఁ దనదే యని వాని యూహయును. తమకుఁ గాలము పరిపక్వమగుటచే విధిప్రేరితులై భూపతులు గాంధారీసుతునిమిత్తమై కౌంతేయులతోడఁ బోర గుమిగూడియున్నవారు. ఈ భూపతులు నీచే జితులగుచున్నను నిరుడు ద్రోహపరులై సమరోత్సాహులై యున్నారు. ప్రాణముల నొకపోకకైన గణింపక వీరందఱుఁ బాండవేయులతోడ నాయోధనం బొనర్ప నుత్సహించుచున్నవారు. వారు విజయమో విలయమో రెంట నొకటియని నిశ్చయకృతులై నిశ్చంచలులై నిశ్చింతులై యున్నవారు. అట్టివారినడుమ నీవు పోవుట నామతముగాదు. నీకు శత్రుత్వబద్ధులును సహజదుర్బుద్ధులునగు సందఱేకమై కూర్చుండియుండ నీవెట్లు వారిలోనికిఁ బోయెదవు? మహాబాహూ! నీ ప్రభావపౌరుషబుద్ధులు నే నెఱుంగుదు. నీవు దేవతలకైన నజయ్యుఁడవు. నాకుఁ బాండవులయం దెట్టిప్రీతియో నీయందట్టి ప్రీతి గలదు. కావునఁ బ్రేమచేతను గౌరవముచేతను మైత్రిచేతను

నాకుఁ దోఁచినది చెప్పితిని. కృష్ణా! నీదర్శనమువలనఁ గలిగిన సంతోషము నేనేమని చెప్పుదును. అని యిట్లు చెప్పినఁ బ్రేమావిధురమధుర వచస్కుండగు విదురవాక్యంబులు విని మధుహరుం డిట్లనియె.

అయ్యా! మహాబుద్ధిమంతుఁడును, విచక్షణుఁడును, నీయట్టి వాఁడును నగువాఁడు నాయట్టి మిత్రునకెట్లుచెప్పవలె నట్లు చెప్పితివి. నీవు నాహితము కోరి తల్లిదండ్రులవలె ధర్మార్థయుక్తముగను సత్యముగను నీ యోగ్యతకుఁ దగినట్లును భాషించితివి. నీవు చెప్పినది సత్యము. అనుసరణీయము. సకారణము. అయినను నా మాటలఁ బాటించి వినుము. దుర్యోధను దౌరాత్మ్యము క్షత్రియుల విరోధబుద్ధి సర్వము నే నెఱిఁగి యెఱిఁగియే కౌరవుల కడకు వచ్చితి. రథకుంజర తురగయుతంబుగ భూమియంతయు నాశముకానున్నది. ఇట్టి సంకట కాలమున నెవఁడు వాని నెల్ల మృత్యువునుండి తప్పించునో వాని కధిక పుణ్యము లభించు. ధర్మకార్యముచేయ యథాశక్తి యత్నించి యుండు విఫలుఁడైనను నది పుణ్యమైయుండునిసఁ గలుగుఫల మతనికిఁ దప్పక కలుగును. సందియము లేదు. ఒకఁడొక కార్యముఁ జేయ మనస్సునఁ దలపోసి యది చేతులారఁ జేయనేని వానికా ఫలము రాదని ధర్మవిదులు చెప్పుదురు. కావునఁ జావసిద్ధముగనుండు కురుసృంజయులకు మేలుగలుగ నిర్వంచకముగ యత్నించెదను. ఈ ఘోరమైన మహావిపత్తు కర్ణదుర్యోధనకృతంబై కౌరవులయందే పుట్టినది. తక్కిన రాజులందఱు వారి ననుసరించియున్నారు. ఆపదయందు మునిఁగి చెడిపోనుండు తన మిత్రుని నెవఁడు యథాశక్తి రక్షింప యత్నింపఁడో యట్టివానిని పెద్దలు నృశంసుం డందురు. కావున నకార్యముఁ జేయఁబూనిన మిత్రుని తలవెండ్రుకలు పట్టి లాగియైనను వాఁడాకార్యముచేసి చెడిపోకుండ యథాశక్తి చేయ వలయును. కావునఁ గార్యసాధకముగ ధర్మార్థయుక్తముగ శుభహితము లైన వాక్యములను మంత్రిసహితుండైన దుర్యోధనునకుఁ జెప్పెదను. విదురా! నేను నిర్వంచనముగఁ గౌరవులకుఁ బాండవులకు లోకమున

రాజులకు హితముగలుగ యత్నించెదను. నిజహితకృతప్రయత్నుఁడ నగు నన్ను దుర్యోధనుఁడు శంకించి నా మాటలు పెడచెవిఁబెట్టినా కృతకర్తవ్యుఁడనని నా యంతఃకరణము సంతసించును. మిత్రుల ఋణముదీర్చుకొనినవాఁడనగుదు. జ్ఞాతులలో వారిలో వారికిఁ బోరితము పుట్టినపుడు మాధ్యస్థముఁజేసి తగవుదీర్పని మిత్రుఁడు మిత్రుఁడనఁబడఁడు. శక్తికలిగియు నే నీ కుటుంబకలహము నివారింప యత్నింప నైతినని యధర్మాత్ములు మూఢులు నమిత్రులు నన్ను దూషింపకుండ వర్తించెదను. ధర్మార్థయుక్తము శుభమునగు నా వాక్యంబులను శాలుఁడై సుయోధనుఁ డాలకింపఁజేని విధివశమునఁ బోవును గాక. పాండవులు నష్టపడకుండ సంధికార్యముఁ గుదిర్చితినేని దాని వలన నాకుఁ బుణ్యములభించుటయే కాక కౌరవులును బాగుపడుదురు. వారు నన్నును గౌరవింతురు. అటుగాక యీ రాచవారు నాకుఁ గీడు రోయుదురేని క్రుద్ధుఁడనైన నాయెదుట సింహము నెదుట క్షుద్రమృగములవలె నిలువఁజాలరు. అని పలికి యవల సుఖనిద్ర గావించె.

వేకువయగుడు స్వరసంపన్నులగు సూతమాగధుల శంఖ దుందుభి నిర్ఘోషంబులఁ గృష్ణుండు మేలుకొని ప్రాతఃకాలకృత్యంబులఁ దీర్చి స్నానంబుగావించి యగ్నులవేల్చి సూర్యునుపాసించె. అంత దుర్యోధనుండు శకునిసహితుఁడై సంధ్యవార్చు కృష్ణుంగని ధృతరాష్ట్రుండు సర్వరాజలోకంబుతోడ సభాగతుఁడయ్యె. భీష్మప్రముఖులను కౌరవులును, సర్వరాజులును, దేవతలింద్రునకుంబోలె నీకై యెదురు చూచుచున్నవారు. అనిన వారల మృదువాక్యంబుల నాదరించి విప్రులకు గోదానాదు లాచరించి శైబ్యసుగ్రీవమేఘపుష్పవలాహకంబులు పూంచినరథంబు దారుకుండు సిద్ధముచేసి తేరఁ గృష్ణుండును నగ్నికి బ్రాహ్మణులకుఁ బ్రదక్షిణనమస్కారంబులు గావించి పరమ శోభాయుక్తంబైన కౌస్తుభంబు ధరించి వృష్ణికుల రక్షితుండై కౌరవులఁగూడి పయనించి రథంబెక్కె. సర్వధర్మవిదుండైన విదురుండును నాయన పిఱుంద రథంబెక్కి తరలె. వారివెనుక దుర్యోధన

శకునులు వారిరథంబులఁ బయనించిరి. సాత్యకికృతవర్మలు కృష్ణు వెనుప్రక్కనుండిరి. వారి రథంబుల ముందఱ నానావాద్యంబుల నాదంబులు బోరుకొనుచుండె. ఇట్లు తరలి రాజమార్గంబుఁ జొచ్చి చని ధృతరాష్ట్రు సభామందిరంబునొద్ద నందఱు నిలిచిరి. కృష్ణుండును గురుయాదవపరివృతుండై సభామందిరంబుఁ బ్రవేశించి తనకై యమర్పఁబడిన హేమపీఠంబున నాసీనుండయ్యె. సాత్యకియుఁ దనకు నిర్దేశింపఁబడిన కనకపీఠంబునఁ గృష్ణుకొద్దఁ గూర్చుండె. విదురుండును గృష్ణుపీఠంబు నొరయు తన పీఠంబున నుండె.

అంతఁ గృష్ణుండు మింటఁగోచరించు నారదాది మహామునులం జూచి లేచి భీష్ముంగని యల్లదె మహర్షులు మనసభఁజూచునుత్కర్ష సరుడెంచిరి. వారు నిలఁబడియుండి మనము కూర్చుండుట శ్రేయస్కరంబుగాదు. వారికిఁ దగునాసనంబు లేర్పఱుపుమన నాయనయు నట్లు కావించె. అందు మునిబృందం బాసీనంబైన పదంపడి యెల్ల వారుఁ గూర్చుండిరి. కృష్ణు పీఠంబున కనతిదూరంబునఁ గర్ణ దుర్యోధను లేకపీఠంబున నుండిరి. అంతఁ గృష్ణవాక్యాకర్ణన కౌతూహలమ్మున సభాస్తారులెల్ల సద్దుచప్పుడు లేక యుండిరి.

అప్పుడు దంతపటుత్వముగల శ్రీకృష్ణుం డెల్లవారువిన సజల జలద నినదంబున ధృతరాష్ట్రుం జూచి యిట్లనియె.

## —♦ శ్రీకృష్ణోపన్యాసము. ♦—

భరతకులోత్తమా! కురుపాండవులకు సంధియగుఁగాత, వీర లోకంబు వినాశంబు నొందకుండుఁగాక యని నేనిందు నిన్నుఁ బ్రార్థింపవచ్చితి. ఇంతకుమించి శ్రేయస్కరంబైనది నేను జెప్పవల సినదేదియు లేదు. ఎఱుంగవలసిన విషయములన్నియు నీవెఱిఁగియే యున్నవాఁడవు. క్షత్రియకులంబులందెల్ల నీ భరతవంశం బుత్తమంబు. ఇందుఁ బ్రభవించినవారందఱు శ్రుతవృత్తోపసంపన్నులు. గుణగణ నిలయులు. పరసుఖార్థము పాటుపడువారు. పరదుఃఖదర్శనమున

భీతులు. పరాసుఖాపాదనప్రీతులు. పరదుఃఖనివారణోత్సాహులు. పరదుఃఖానపాదకులు. క్షమాసత్యార్జవంబులు వీరియందు విశేషించి వెలుంగు. రాజేంద్రా! యిట్టి వంశమున వారిలో నెవ్వఁడైనను నొకయకార్యముఁ జేయుట యుక్తము కాదన నీవే చేయుట తగదని నేను జెప్పవలయునా? కురుసత్తమా! కౌరవవంశ గౌరవ భారంబు నీయందు యున్నది. అందెవ్వరైన బహిరంగముగ నొండె రహస్యంబుగ నొండెఁ దమవారి విషయమున నొండె నన్యులవిషయమున నొండె నక్రమప్రవర్తకులైరేని వారిని వారింపవలసిన వాఁడవు నీవ. ఇట్టిచోఁ గౌరవేంద్రా! నీపుత్రులు దుర్యోధనాదులే ధర్మార్థములఁ బోనాడి నృశంసులవలెఁ జరించుచున్నవారు. వారు తమ ముఖ్యబంధువులపట్ల నశిష్టులు మర్యాదాహీనులు, లోభహృతమానసులునై వర్తించుచున్నవారు. ఇట్టి మహాఘోరవిపత్తు కౌరవులందే పుట్టినది. ఇది యుపేక్షింపఁబడెనేని లోకమును నాశముచేయును. నీకిష్టము కలదేని నీవు దీనిని నణంపశక్తుఁడవు. శమమునకు దుష్కరము లేదని నామతము. నృపాలా! శమము మన యిరువురకధీనమై యున్నది. కావున నీవు నీపుత్రులవారింపుము. నేను బాండవుల వారించెద. నీవెయ్యది యాజ్ఞాపించినను నీపుత్రులు దానిని శిరసావహించుట కార్యము, నీయాజ్ఞాబద్ధులై వారుండుట వారికే శ్రేయస్కరము. నీయాజ్ఞానువర్తులై నీకొడుకులు నీవు కోరునట్లు సంధి గావించిరేని యది ముఖ్యముగ నీకును, నావలఁ బాండవులకును హితమగును. ధారుణీశ్వరా! యిది నీవే స్వయముగ నాలోచింపుము. పాండవులు నీకుసహాయులై యుందురు. పాండవరక్షితుండవై ధర్మార్థములందు నీయిచ్చవొప్పునఁ జరింపుము. నీవెంతశ్రమించినను, నట్టిమిత్రుల సంపాదింప శక్తుఁడవుకావు. అట్టివారిచే సురక్షితుఁడవైన నిన్ను సామరుఁడైన వజ్రధరుండును గన్నెత్తి చూడఁజాలఁడన నింకఁదక్కిన రాజులమాటయేల? భీష్మద్రోణకృపకర్ణులును నశ్వత్థామవివింశతివికర్ణసోమదత్తబాహ్లీకులును సైంధవకళింగకాంభోజసుదక్షిణులును, యుధిష్ఠిరభీమార్జున నకులసహదేవ సాత్యకి యుయు

తమ్ములును, నొక్కటిగఁ జేరిన నట్టివారితో నేవిపరీతాత్ముఁడు సంగరము చేయఁదలఁచును. కురుపాండవసహితుండవైతివేని లోకేశ్వరుఁడవై శత్రుసహస్రప్రధర్షుండవై నిరంతరసుఖము నొందఁగలవు. అట్లీకు నీ సమానులగు భూజానులు మైత్రి వాటించి శ్రేయస్సుఁ గూర్చుచుందురు. అప్పుడు నీవు పితృమాతృభ్రాతృపుత్రమిత్ర సహితుండవై సుఖముగి జీవింతువు. పూర్వమువలె నిప్పుడును వీరినెల్ల ముందుంచుకొని వారిని నాదరించితివేని విశ్వవిశ్వంభరారాజ్యంబు నీకు సుఖభోజ్యంబగు. స్వపుత్రపాండుపుత్ర సమేతుండవైతివేని శత్రువులనెల్ల మట్టుపెట్టఁగలవు. అంతకంటె వాంఛనీయార్థంబు నీకేదిగలదు? సమహాత్ములైన పుత్రులు సంపాదించినభూమియంతయు నీవే యనుభవింతువు. రాజేంద్రా! సంధివలన నీకుఁగలుగు లాభంబుల వినరించితి, అటుగాక యుద్ధాభిలాషివైతివేని నీకేమి మేలుకలుగఁగలదో నీవే యాలోచింపుము, కలహమునలన మహానర్థములు తప్పవు. ఉభయపక్షములవారు నశించుటయందు నీకేసుఖము గానవచ్చెడినో చెప్పుము, రణరంగమునందు నీయనుజాతనుజులే నిహతులైనను నీసుతులే మృతులైనను నేమిసుఖ మనుభవింపఁగలవు? పాండవులును కౌరవులును శూరులు కృతాస్త్రులునై యుద్ధాభిలాషులై యున్నవారు. వారీమహావిపత్సంగరంబున మునుఁగకుండ రక్షింపుము. యుద్ధానంతరమునఁ బాండవులనెల్లరఁగాని కౌరవులనందఱఁగాని చూడఁజాలము. రథికులు రథికులచే నిర్మూలితులై యుభయపక్షవీరులు నశింతురు. ధరిత్రింగల రాజులందఱుఁ గోపావిష్టమనస్కులై గుమిగూడి యున్నవారు. వీరుప్రజలనెల్ల నాశమొనర్తురు. కావున రాజేంద్రా యీలోకమును నీప్రజలను రక్షింపుము. నీవు సత్త్వగుణసంపన్నత వహించితివేని లోకము వినశింపక జీవించు. యుద్ధార్థులై చేరిన రాజులందఱుఁ గులీనులు, దాతలు, నకార్యములకు లజ్జించువారు, పుణ్యులు, పరస్పరబంధువులు; ఇట్టివారినెల్ల మృత్యుభయమునుండి యుద్ధరింపుము. ఈరాజులందఱు రోషంబుజ్జగించి విరోధంబు విడనాడి సువస్త్రమాల్యాభరణధారులై యాదరంబున సహో

నవపానభోజనాదులఁగావించి వారివారి గృహంబులకు వారివారి సుఖంబుగఁ బోనిమ్ము, పాండవులయెడ మున్నట్టిప్రీతి వహించియుంటి నట్టిప్రీతి యీ యవసానకాలంబునను నుంపుము. బాలురై పితృ వియోగంబునఁ గష్టపడువేళ నీవ వారలఁ బోషించితివి. అట్టివారు నీ పుత్రులేకదా ? ఆ కారణమున వారి నిపుడును రక్షించుట న్యాయ్య ముకదా. అందును వారు వ్యసనమగ్నులైయుండ రక్షించుటత్యం తావశ్యకముకదా ? భరతర్షభా ! నీవు ధర్మార్థములు నాశముచేసికొన కుము. పాండవులందఱు నీకు సాష్టాంగనమస్కారములఁ బ్రసన్నునిఁ గావించి యిట్లు చెప్పుమనిరి. వారివాక్యంబులను సావధానుండవై వినుము.

తండ్రీ! నీ యాజ్ఞ శిరసావహించి ద్వాదశవర్షంబు లనుచరుల తోడ ఘోరకాంతారంబులఁ గష్టంబుల సహించితిమి, ఆవలఁ బదు మూఁడవయేఁట నజ్ఞాతవాసంబుఁ జలిపితిమి. నీవు తండ్రివని నీ మాటమీఱరాదని సమయమునకు లోబడి నిర్వంచనముగఁ జరిం చితిమి. దీనికి బ్రాహ్మణులే సాక్షులు. ధర్మాభిలాష మేమెట్లు సమ యమున నిలిచితిమో నీవు నట్లే సమయమున నిలువుము. మేమింత నఱకుఁ గష్టపడినవారము కావున మా రాజ్యభాగము మాకిమ్ము. నీవు ధర్మార్థ సమ్యగ్జ్ఞుఁడవు. కావున మమ్ము రక్షింపుము. నీవు మాకు గురుఁడవను నభిప్రాయమున ననేక కష్టములు సహించితిమి. నీవు మాయందుఁ దలిదండ్రులవలె వర్తింపుము. గురువు శిష్యుల యెడ నెట్టి యుక్తవర్తనముకలవాఁడు కావలయు నీవును మాయెడ నట్టివాఁడవుకమ్ము. మేమును నీయెడ శిష్యులవలె వర్తింతుము. మేము వక్రమార్గచరిష్ణువులమైతిమేని మమ్ముఁ జక్కదిద్దఁ దండ్రి యర్హుఁడు కావున మాయందు దోషంబున్న నవరింపుము. నీవును ధర్మమార్గ మందు నిలుము. కౌరవేంద్రా! నీ పుత్రులు సభవారితో నిట్లు చెప్పఁగోరిరి.

సభ్యులు ధర్మజ్ఞులైరేని యన్యాయ్యకార్యంబుల సమ్మతింపఁ దగదు. ధర్మమధర్మముచేతను, సత్యమసత్యముచేతను, జెడెనేని సభ

యందుండి చూచుచుండువారు హేతు లగుదురు. అధర్మముచేఁ జెడుచు ధర్మము సభ్యుల నాశ్రయించినచో నప్పుడు దాని రక్షింపక యుపేక్షించు సభ్యులు నాశకులగుదురు. ఇట్టి సందర్భమున ధర్మమెఱింగియు నూరక ధ్యానమును పూనికొనుచుఁ గూర్చుండువారు నదీరయంబునఁగూలు వృక్షములవలె నశింతురు.

భరతకులవల్లభా! పాండవులు సత్యము ధర్మము న్యాయ్యము వచించిరి. అది కాదందువేని వారి భాగము వారికీయరాదనుటకు నీవేమి కారణములు చెప్పెదవో చెప్పుము. సభాస్తారులైన యీ రాజులైనఁ జెప్పఁగూడియుండినచోఁ జెప్పనిమ్ము. ధర్మార్థములను జక్కఁగ నాలోచించి నేను సత్యము భాషించితినని నీకుఁదోఁచినచో క్షత్రియులనెల్ల మృత్యుపాశంబులనుండి విడిపింపుము. భరతకులోత్తంసమా! శమింపుము. కురువంశమణీ! కోపమునకు వశపడకుము. భూపాలచంద్రా! యథోచితముగఁ బాండవుల పిత్ర్యాంశమును వారికిమ్ము. శాంతినిధీ! వారు పుత్రసమేతులై సుఖపడనిమ్ము. ఇంగితజ్ఞా! యజాతశత్రుఁడు సదా ధర్మమార్గైక నిరతుండని నీ వెఱుంగుదువు కదా? నీ విషయమందును నీ పుత్రుల విషయమందును నాయన నడవడి యెట్టిదో యదియు నీ వెఱుంగుదువు. ఊరు వెడలఁగొట్టినను, గొంపఁ దగులఁబెట్టినను, నురల నిన్నే యాశ్రయించుచున్నాఁడు. నీ వేకచం పుత్రునితోడ మంతనంబుననే యతని భ్రష్టునిఁ జేసి యింద్రప్రస్థంబునకుఁ బనుపనింపఁ జేసితివి. అందుండియు సర్వరాజుల వశపఱచికొని నిన్నతిక్రమింపక నీయందు లక్ష్యముంచెను. అట్టివాని రాజ్యమును ధనధాన్యములను శకుని మహా వంచనచే హరించెను. అట్టి యవస్థయందుండి క్షత్రధర్మ మనుసరించి మహామతిగావున సభకీడ్వఁబడిన పాంచాలిని నూరక చూచుచుండెను. నృపాలాగ్రణీ! నేను మీ యిరువుర శ్రేయస్సు కోరువాఁడను. చెప్పెదను. అధర్మము ధర్మమని ధర్మమధర్మమని విపరీతబుద్ధిగలవాఁడవై ధర్మార్థసుఖములతోఁ పాటు ప్రజలను నాశము చేయకుము. లోభోపహతుల నీ సుతుల నిగ్రహింపుము. నీ వనుగ్రహించితివేని పాండవులు నీకుఁ బాద

శుశ్రూషచేయను నిగ్రహించితివేని సంగరంబుసేయను సిద్ధపడి యున్నవారు. ఈ రెంటిలో నీ కేది మేలని తోఁచు నట్లు కావింపుము.

అని శ్రీకృష్ణభగవానుండు పలికిన విని రాజు లందఱు మేలు మేలని తమ మనస్సులఁ బ్రశంసించిరి కాని దుర్యోధను భీతిచే నెవరును మాఱుపలుకరైరి. మూఁగలవలె సభ్యు లందఱుండుట చూచి పరశురాముండు దుర్యోధనున కిట్లనియె.

దుర్యోధనా! నా వచనంబు సావధానంబుగ వినుము. తొల్లి దంభోద్భవుండను రాజు మహాబలపరాక్రమసంపన్నుండై ధరణీతలం బెల్ల జయించి వశపఱచుకొని దానఁదృప్తిఁగానక వేకువన లేచి బ్రహ్మక్షత్రియవైశ్యశూద్రుల నెల్ల రావించి మీలో నెవ్వఁడైన నాతోఁ బోరఁగలవాఁడుండిన రానిండని సగర్వముగఁ బ్రతిదినము పలుకుచుండెను. ఇట్లు పలుకుచు దేశాటనంబు గావించుచుండె. తత్త్వజ్ఞులగు బ్రాహ్మణులు తద్ధితాభిలాషులై నీ కిది యుచితముగాదని యుపదేశించినను బలమత్తుండగుటఁ జిత్తంబున దాని హత్తింపక యెప్పటియట్ల విప్రాదులఁ బలుకుచుండె.

అదిగని కొందఱు మహాత్ములు వానిగర్వ మణఁపఁగోరి యిట్లనిరి. రాజా! నీ వంతటి యుద్ధప్రియుఁడవేని బదరికాశ్రమంబున నరనారాయణు లను నాదిమునులున్నవారు. వారిని రణభిక్ష వేఁడుము. వారు నీ మదం బణంగించి మరలఁ బంపెదరు. పాపాత్ముండగు నతండు సంతసించి షడ్విధసేనావారముతో గంధమాదనంబునకుం జని నారాయణాశ్రమంబున రోసిరోసి తుదకొకపొదలోఁ దపస్సు చేసికొను నరునిం గాంచి సంగరంబున కాహ్వానించిన నాతఁడు నవ్వి యిది యేమి రాజా! బ్రాహ్మణులతోడఁ బోరవచ్చితివి. మేము నిరాయుధులము. పోరు టెట్లనిన నతండు వినక మీరు మహాబలసంపన్నులరని బ్రాహ్మణులు చెప్పిరి. కావునఁ బోరకతప్పదని బలాత్కరించిన నాయన యట్లయేని రారమ్ము రణమ్మునకని నా రాజాన్వయుండు సేనలఁ బురికొలిపె. వారెల్ల నాయనపై బాణవర్షంబుఁ గురియింపఁ దొడంగిరి. నరుం డం దఱుత మొలచియుండిన దర్భలయం దొకపిడికెడుదీసి

మంత్రించి యా సేనపైఁజల్లె. అవి మహాస్త్రంబు లయి వారి బాణంబులనెల్ల నణఁచి సేనపైఁగవిసి పగ్గము పాముగావించి దంభోద్భవుపై నఱిమిన నతండు భీతుండై శరణువేఁడె. నరుం డతని మన్నించి యింకమీఁద బ్రాహ్మణద్వేషంబు మానుమని హితము బోధించి పంచె. చూచితే బలగర్వం బెంత హానికరమో. ఆ నరుఁడే యీ నరుఁడై యానారాయణుఁడే యీకృష్ణుఁడై జనించిరి. అట్టి వీరి తోడ నీ వేమని పోరెదవు? నారాయణసహాయుండు నరుం డేరికి దుస్సాధ్యుఁడు. గాండీవంబున నస్త్రంబుఁ దొడుగక మున్న గాండీవిఁ జేరఁబోము. అభిమానమ్ము వదలుము కాకుదీకము-సుకము-నాకము-అక్షిసంతర్జనము-సంతానము-నర్తకము-ఘోరము ఆస్యమోదకమను నస్త్రంబు లతండెఱుంగు. ఆ యస్త్రంబుల మహిమంబున శాత్రవ సేనలు నిద్రించి దుమికి జలచేదేహము బఱికికొని మూత్రమువిడిచి యేడిచి నవ్వి వేఁదురెత్తి నష్టచేతస్కులై చచ్చు. కామక్రోధములు-లోభమోహములు - మదమానములు - మాత్సర్యాహంకారములా ఱనిమిది యస్త్రంబులకుఁ దుల్యంబులు. సర్వలోక నిర్మాతయు నీశ్వరుఁడును, సర్వకర్మ విదుండును నగు నారాయణుం డతనికి సహాయుండై యుండ నీ కెట్లు జయంబు సిద్ధించు? జిష్ణుండైన కపిధ్వజునకుఁ దుల్యుఁడు ముల్లోకంబుల లేఁడు. అర్జునునం దసంఖ్యేయగుణంబులు కలవు. వెన్నుం డాయనకు మిన్న. మునుపటి నరనారాయణులే యిప్పటి నరకృష్ణులని నమ్ముము. కావున వారితోడి విరోధంబు నీకు క్షేమకరంబుగాదు. నీ వంశంబు లోకంబున బహుమతంబు. కావున లోభదూషిత చిత్తుఁడవుగాక ధర్మపథంబున వర్తించి సంధి చేసికొనుము.

అనిన యనంతరము కణ్వుండును గర్వము సర్వానర్థకరమని గరుత్మంతుని చరిత్రముఁదెలిపి దుర్యోధనుతో నిట్లనియె. గాంధారీ నందనా! గరుత్మంతునివలె నీవును గర్విష్ఠ గరిష్ఠుఁడవైతి వేని పాండవుల వలనఁ జెడుదువు. మహాబలనందనుండు భీముఁడు ప్రహర్తల శ్రేష్ఠుండు. పురందరనందను విజయు జయించు వాఁడెవ్వఁడు? పాండ

వులు దేవాంశ సంభూతులు. వారితోడి విరోధంబు నీకు లగ్గు కాదు. కావున నీవు వారిని సంధికావింపుము. కులము రక్షింపుము. ఈరాజుల నింకఁ గొంతకాలము బ్రతుకనిమ్ము. కృష్ణుని మహిమకుఁ బ్రత్యక్షదర్శి నారదుండు. కృష్ణుండు చక్రగదాధరుండు విష్ణుండు గాని మానవ మాత్రుండు గాఁడు.

అనిన నమ్మునిమాటలు విని దుర్యోధనుండు రోషంబున భ్రూకుటి నటింప రాధేయుంగని పకపకనవ్వుచుఁ గణ్వవాక్యంబుల ధిక్కరించి కరికరాకారంబులైన యూరువుల నప్పళించుచు నిట్లనియె. భగవంతుఁడు నానొసటం దొలుత నెంత వ్రాసె నాగతి యంతియ కాఁగలదు. నే నట్లులే నడచుకొనెద. మహర్షీ! యూరకగోల ప్రలపించెదవు. అనినఁ గణ్వుండు కోపంబున మూర్ఖుండగు దుర్యోధనుం గని యోమిరా తొడలు తట్టుకొనెదవా? నీతొడలవలననే నీకు మరణ మగుఁగాక యని శపించె.

అంతట నారదుండు దుర్యోధనుం గని కుమారా! మేలుగోరి చెప్పు మిత్రుఁడు దుర్లభుఁడు. అట్టిదానిని విను మిత్రుఁడును దుర్లభుఁడు. హితము చెప్పువాఁ డుండవచ్చుంగాని విను వాఁడుండఁడు. హితవాక్య మవశ్యము వినఁదగు. మూర్ఖత కారాదు. దాని వలనఁ గీడుమూ... దీనికి దృష్టాంతములు వినుమని గాలవుని చరిత్రము యయాతిచరిత్రముఁ జెప్పి వెండియు నిట్లనియె. గాలవుఁడు మౌర్ఖ్యముచేతను యయాతి దురభిమానముచేతను జెడినవిధంబు వింటివికదా. కావున హితైషులమాట పాటింపవలయు. మూర్ఖత్వము వినాశ సూచకము. దురభిమాన క్రోధముల విడువుము. సంధి గావింపుము. హితవాక్యము నిరాకరించెదవా యాపత్సముద్రమున మునుఁగుదువు.

అన ధృతరాష్ట్రుం డిట్లనియె. మునీశ్వరా! నీవు సత్యము చెప్పితివి. ఆప్రకారమువర్తింప నిచ్చయుఁ గలదుగాని నాకొడుకు నాకు వశుఁడుగాఁడు నేనేమిచేయుదును. అని కృష్ణు వంకఁగని యిట్లనియె. తండ్రీ! నీవు స్వర్గఫలప్రదంబును లోకక్షేమకరంబును ధర్మ

యుక్తంబును న్యాయసహితంబును నగు వాక్యము లుపన్యసించితివి. నేనా స్వతంత్రుఁడఁగాను. పుత్రుఁడు నాకుఁ బ్రియమైనది చేయఁడు. నేనేమి చేయుదును? పురుషోత్తమా! మందుఁడును శాస్త్రాతిగుండును నగు దుర్యోధను ననునయింప యత్నింపుము. హృషీకేశా! గాంధారియు విదురుండును భీష్ముండును దక్కఁగల హితులును జెవి నిల్లు కట్టుకొని యెంత చెప్పినను చెవిటివానియెదుట శంఖమూఁదిన ట్లున్నది. అట్టి పాపాత్మునిఁ గ్రూరుని మతిహీనుని విచారవిదూరుని నీవైన బోధింపుము. అటు చేసితివేని మహాసుహృత్కార్యమాచరించిన వాఁడవగుదువు.

అనినఁ గృష్ణుండు కోపనుండైన దుర్యోధను సమీపించి మధురవాక్యంబుల నిట్లనియె.

కురుసత్తమా! దుర్యోధనా! నీకును నీ యనుచరులకును శివంకరమైన నా వాక్యములకు వీనులిమ్ము. నీవు మహాప్రాజ్ఞకులసంభూతుండవు. శ్రుతవృత్తోపసంపన్నుఁడవు. సర్వగుణ యుక్తుండవు. కావున నా మాటలు పాటింపఁదగుదువు. నాయనా! యిప్పుడు నీవుచేయు నాలోచన నీచకులజాతులు దురాత్ములు నృశంసులు లజ్జాహీనులు చేయఁదగినది. ఈ లోకంబున సజ్జనులనడవడి ధర్మార్థయుక్తంబై యుండు. దుర్జనులరీతి విపరీతంబై యుండు. ఇట్టి విపరీతవర్తనము నీ యందుఁ బలుమాఱు గానవచ్చుట శోచనీయము. అయ్యది యధర్మ్యము ఘోరము ప్రాణహరము. అవిష్టము అనిమిత్తము. దానిచేఁ గార్యము సాధింప శక్యమును గాదు. అట్టి యనర్థకమును వదలి భ్రాతలకు భృత్యులకు మిత్రులకు శ్రేయస్కరంబైన దానిఁ జేసితివేని యధర్మమునుండియు నపకీర్తినుండియు విడివడుదువు. పాండవులు ప్రాజ్ఞులు—శూరులు – సూరులు – మహోత్సాహులు – ఆత్మవంతులు, బహుశ్రుతులు. అట్టివారితోడ సంధికావించి కలసిమెలసి యుండుము. ఇది నీతండ్రి ధృతరాష్ట్రునకును, గాంగేయద్రోణ విదురకృపసోమదత్త బాహ్లిక కాశ్వత్థామవికర్ణ వివింశతి సంజయులకును సర్వజ్ఞాతి మిత్రులకును బ్రియంబైన కార్యంబు. లోకంబు మెచ్చుపని శమంబున,

సర్వజగంబునకు శర్మంబగు. కులీనుఁడవు. లజ్జాళువవు. శ్రుతసంపన్నుఁడవు. అనృశంసుండవు. ఇట్టి నీవు తల్లిదండ్రుల యాజ్ఞకు లోబడి వర్తించుట తగవు. అతిక్రమింపఁ దగవు. ఆపద మునింగినపుడు జనకు మాట వీటఁ బుచ్చితినిగదా యని తలంతువు. నీ జనకుండు సంధికోరుచున్నవాఁడు. సభాసదుల కదియ యభీష్టంబై యున్నది. పెద్దవారి కది సమ్మతము. ఈ సత్యవచస్కు లదియ కదా నీకు బోధించిరి. కావున నదియమే లని మంత్రిసహితుండవై నీవును గ్రహింపుము. నిజశ్రేయోభిలాషి భాషణంబుల ననువర్తింపనివాఁడు విపాకాంతమునఁ గింపాకఫలభక్షకునిబోలెఁ దపించును. ఎవఁ డలసుఁడై నిశ్శ్రేయసకరంబైన వాక్యంబును మోహముచేఁ జెవినిబెట్టఁడో వాఁడు పశ్చాత్తాపమున నుడుకును. తనయభిప్రాయము వదలి శివతాత్పర్యమగు హిత వాక్యము చొప్పున నడచువాఁడు లోకంబున సుఖించును. తనకు హితమైనదానిని బ్రతికూలబుద్ధిచే గణింపక ప్రతికూలుర వచనంబు వినువాఁడు శత్రువులపాలగును. సజ్జనాభిప్రాయంబుమాని దుర్జనాభిప్రాయంబుఁ బూని పాటించువాఁ డచిరకాలంబునఁ దన మిత్రుల శోకవార్ధిని ముంచును. గుణవంతులగు ముఖ్యామాత్యులవదలి హీనుల యాలోచన చొప్పునఁ బోవువాఁడు ఘోర విపత్సాగరంబున మునింగి దరిచేరలేఁడు. అసజ్జనసేవియు వృథాచారుండును సజ్జనసుహృద్వాక్యవిముఖుండును నై స్వజనులవిడిచి పరులకై ప్రాకులాడువానిని భూదేవి పరిత్యజించును. నీవుపాండవులతోడ విరోధించి యశిష్టులు, నసమర్థులు మూఢులునగువారి రక్షణముఁ గోరితివి. మహారథులు నింద్రతుల్యులు నగు వారి నతిక్రమించి భూమియందు నీవుతప్ప మఱియెవ్వఁ డన్యరక్షణముఁ గోరును. పుట్టి బుద్ధియెఱిగినది మొదలు నీవు నిత్యము పాండవుల కపకారమే కావించితివి. ధర్మాత్ములగుటఁ బాండవు లొకప్పుడును నీపైఁ గోపించినవారుకారు. జన్మప్రభృతి కౌంతేయులకు నీవు మిథ్యోపచారమే కావించినను యశస్వులగు నమ్మహామతులు నీయందుఁ బ్రసన్నులయి యే యున్నవారు. కావున నీవును వారియెడ బ్రసన్నుఁడవు కమ్ము. వారునీకు ముఖ్యబాంధవులు. కావున వారియెడ

నీవు కినుక వహింపఁ దగదు. ప్రాజ్ఞులగు వారు ధర్మార్థకామములు మూఁటిని నొంద యత్నింతురు. మూఁడును దుర్లభంబు లగునేని ధర్మార్థములనైన గ్రహింతురు. మూఁడును మూఁడుత్రోవలగునెడ నుత్తములు ధర్మమునే కోరుదురు. మధ్యములు కలహకారణమైన యర్థమును మూఢులు కామమును నభిలషింతురు. ఇంద్రియలోలుఁడై లోభము వలన నెవఁడు ధర్మమును విడనాడి యధర్మరీతి నర్థకామముల మాత్రము కాంక్ష సేయు నట్టి వాఁడు నశించును. అర్థకామాభిలాషి తొలుత ధర్మమునే యాధారముగఁ గొనవలయు. ధర్మము ననుసరించుటవలన నెన్నఁటికి నర్థకామహాని లేదు. త్రివర్గము ధర్మమూలము. ధర్మరక్షకుఁడు త్రివర్గమునందు శుష్కకాష్ఠముల యందలి యగ్నివలె వర్ధిల్లును. నాయనా! నీవధర్మమార్గమున శ్రీశోభితంబును సర్వరాజ ప్రసిద్ధంబును నగు నాధిరాజ్యంబును సంపాదింపఁ గోరుచున్నాఁడవు. సత్ప్రవర్తనము గల వారియెడల మిథ్యా ప్రవర్తనముగలవాఁడు గండ్రగొడ్డలిచే వనమును ఛేదించునట్లు తన్నుఁదానే నాశము చేసికొనుచున్నాఁడు. ఎవ్వఁడు బాగుపడఁగోరునో వాఁడు తన మనస్సును వక్రమార్గమునఁ బోనిచ్చి దానికి విచ్ఛిత్తి కలిగింపరాదు. అవిచ్ఛిన్న మతికి వాని మతియే శుభాపాదియగు. ఆత్మవంతుఁడు లోకములోని యెట్టి ప్రాకృతజనునైన నవమానింపఁడు. ఇంకఁ బెక్కుపలుమాటలఁ జెప్ప నేల? కోపవశుఁడు వివేకి కాఁజాలఁడు. అతిమాత్రము సర్వత్ర వర్జనీయము. దీని కిదియే ప్రమాణము చూడుము. నీవు దుర్జన సాంగత్యముకంటెఁ బాండవమైత్రి శ్రేయస్కరము. వారినిసంతోషింపఁ జేసితివేని నీవునుసర్వకాలము సుఖములనుభవింతువు. పాండవసంపాదిత రాజ్యంబు నీవనుభవించుచు వారిని గాదని యన్యుల ప్రాపుగోరెదవు. దుశ్శాసన దుర్విషహ కర్ణశకునులపై రక్షణభారంబుమోపి యైశ్వర్యంబు నాకాంక్షించెదవు. కానివీరందఱు జ్ఞానమందును, ధర్మార్థములందును, విక్రమంబునను బాండవులకు సరిరారనియు వారికంటె హీనులనియుఁ దలఁపుము. అదట్లుండనిమ్ము. వారును నీవును నీతోడి

రాజులందఱును గలిసియు యుద్ధరంగమునఁ బ్రసిద్ధులైన భీమసేను ముఖ్యులైనను గన్నెత్తి చూడఁజాలరు. తండ్రీ! రాజులందఱు నిన్ను గుఱి జూడియున్న వారు. ఈ భీష్ముఁడుగాని యీ ద్రోణుఁడుగాని యీ కర్ణుఁడుగాని యీ కృపుఁడుగాని భూరిశ్రవుఁడు సోమదత్తి యశ్వత్థామ జయద్రథుఁడుగాని ధనంజయునితో నెదిరించి పోరశక్తుఁడు గాఁడు. ప్రఘసంబునఁ బ్రధాపుత్రుండు నరసురాసుర గంధర్వుల కజయ్యుండు. ధరాధీశులందఱును ఆతని వెదకి యర్జునుతోడ సంగ్రామము నొనరించి మాన ప్రాణములతో మరలిపోవఁ జాలువాఁడు నీకుఁ గానవచ్చె నేని యుద్ధమునకుఁ గడంగుము. ఊరక ప్రజాక్షయమేల యొనర్చెదవు? దానివలన నీకు రాఁగల లాభమేమి? నీతోడఁ గూడిన యందఱు రాజులతో సురరాజనందను జయింపఁగలవాఁ డొక్కఁడైన నుండినఁ బంపుము. అతఁ డొక్క-యర్జునుని గెలిచిన సర్వరాజ్యంబు నీవే పరిగ్రహింపుము. దేవగంధర్వ యక్షాసుర పన్నగుల జయించి ఖాండవం బగ్నిహోత్రున కర్పించిన గాండీవితోడ డీకొన నెవఁడు సాహసించును. విరాటనగరంబున నొక్కఁడు పార్థుతోడఁ బెక్కురు పోరిరని వింటిని. చాలినంత నిదర్శన మిది కాదా? ఎక్కటికయ్యంబున ముక్కంటిని మెప్పించిన సవ్యసాచి పరాక్రమ విభవంబెఱిఁగియు విజయుతో సమరంబున కీయకొన నీవెట్టి వాఁడవో, జయించుటకును నాశయు నీకుఁ గలదా? అసహాయుఁ డయిన యుత్తరుఁడట్టి కార్యము లాచరించెను. ఇఁక నేను సహాయుఁ డనై యుండ నతని నెదిరించి గెలువఁగల మగవాఁ డెవ్వఁడో? సమరమున శత్రువుల జయించువాఁడు భూమిని దనచేతుల నెత్తువాఁడు. ప్రజలనెల్లఁ జూపులనే దహించువాఁడు. దేవతలను స్వర్గంబునుండి క్రిందికిఁ ద్రోయును. భరతసత్తమా! పుత్రులు భ్రాతలు, జ్ఞాతులు సంబంధులు వీరందఱు నీ దోషమునఁ జావ నున్నవారు. వీరినెల్లఁ బొలియఁజేయకుము. రాజా! కులము నిశ్శేషముగ నిర్మూలింపకుము. శేషముండనిమ్ము. కులఘ్నుఁడవను నపకీర్తికిఁ బాలుకాకుము. దుర్యోధనా! నీ తండ్రిని రాజుఁ జేసి నిన్ను మహారాజ్యమునకు యువరాజుఁ

జేయఁగలవారు సిరి రానేల మోఁకాలొడ్డెదవు? పాండవుల కర్థ రాజ్యమిమ్ము. సుహృత్తుల వాక్య మాదరించి పాండవులతోడ సంధి గావించి మిత్రుల సంతుష్టచిత్తుల నొనరించి చిరముగఁ గుశలివై యుండుము.

ఇట్లు దుర్యోధనునకు నీతి బోధించి కృష్ణుండు విరమించిన పదపడిభీష్మద్రోణులును గృష్ణువాక్యముల నాదరించి తదనుకూలముగ దుర్యోధనునకు బోధించిరి. ధృతరాష్ట్రుండును గృష్ణవాక్యంబుల నాదరింపవేని చెడుదువని పుత్రునకు నీతిగఱపెను. ఇట్లందఱు తనకప్రియముగ భాషించుటవిని దుర్యోధనుండు వాసుదేవుంజూచి యిట్లనియె.

## —♦ శ్రీకృష్ణ దుర్యోధన సంభాషణలు ♦—

కృష్ణా! సందర్భము లన్నియు నాలోచించి మాట్లాడుట నీ కర్హము. పాండవుల యిచ్చకపుమాటలకుఁ బ్రీతుఁడవగుటచే దోష మంతయు నా యొక్కనియందే యారోపించి నన్ను గర్హించితివి. నీవు సర్వదా నన్ను దూషించెదవుకాని యుభయుల బలాబలములు పరిశీలించితివా? నీవును విదుర భీష్మ ద్రోణాదులును రాజును నన్నే దూషించెదరుగాని పాండవులపై రెనఁ దలఁపరు. రాజతోడి మీ రందఱు నన్ను నిష్కారణముగ ద్వేషించెదరుగాని నాయందపరాధ లేశ మేదియుఁ గానరాదు. పాండవులు జూదమందలి ప్రీతిచే శకునితో నాడిరి. ఓడిరి అందు నాచేసిన దోషమేదిగలదు? అట్లు వా రోటఁబడిన కించిద్ద్రవ్యమును మరల నేను వారికే యిప్పించితిని గదా? మరల వారినెవరు జూదమాడుఁడనిరి? మరల వారు జితులై వనగతులగుట యందు నా దోషమేదిగలదు? కృష్ణా! వా స్తవమున దుర్బలులయ్యు బలవంతులుబోలె బలవంతులమగు మాతోడికయ్యము నకుఁ గాలు ద్రవ్వనేల? మాయందే దోషమారోపించి వారు మమ్ము శత్రువులుగ నెన్నెదరు. కలహమునఁ బ్రబాహుయమంటివి. వారు మాపై రానున్నారా మేము వారిపైఁ బోవనున్నారమా? కలహము నకు నగ్రేసరు లెవ్వరు? వారు సృంజయులతోఁ గలసి ధార్తరాష్ట్రుల

వధింప నెత్తికొనుటకు వారి కెన్నఁడైన నేదైన నపరాధ మే మొనర్చితిమా? వారి యుగ్రకర్మములకుఁ గాని బిభీషకలకుఁగాని వెఱచి భ్రష్టులమై వారికి నమస్కరించువారము మేము గాము. వారి మాటయేల? ఇంద్రునకైన నమస్కరింపము. ఆకార్యము వారే చేయనిమ్ము. క్షత్రధర్మమందు నిలిచి మాతో రణముచేసి గెలువఁ గలవాఁ డెందును గానరాఁడు. భీష్మద్రోణకృపకర్ణులు దేవతలకైన నజయ్యులనఁ గౌంతేయుల మాటయేల? సంగ్రామరంగమున స్వధర్మ మందు నిలిచితిమేని కాలముతీఱినపు డస్త్రనిహతులమైతిమేని స్వర్గము కరతలామలకమగు. జనార్దనా! క్షత్రియులమగు మాకు శరతల్ప శయనము ముఖ్యధర్మము. శత్రువులకు నమస్కరింపక కదనంబున శరతల్పగతుల మైతిమేని మేము దానికి విషాదపడము. ఉత్తమ కులోత్పన్నుఁడు క్షత్రధర్మావలంబి యగువాఁ డెన్నఁడైన నిజప్రాణ రక్షకై శత్రువునకు నమస్కరించునా? క్షత్రియుఁ డెల్లప్పుడు చక్కఁగ నిక్కియుండవలయుఁ గాని వంగరాదను మాతంగవాక్యమే యస్మ ద్ధితార్థుల కెల్ల శరణము. ఇతరుల నడ్డసేయక నా యట్టిఁడు యావజ్జీవము ధర్మముకొఱకు బ్రాహ్మణులకు మాత్రము నమస్క రించును. ఇది యే క్షత్రియధర్మము. మాతంగమతమే నా మతము. నా జనకుండు పూర్వము రాజ్యభాగము వారి కిచ్చెను గాని యిఁక నా గొంతు క్రోవిలో నూపిరియుండఁ గృష్ణా! యట్లు జరుగఁజాలదు. ధృతరాష్ట్రుఁడే రాజు. ఆయన జీవించియుండువఱకు న్యస్తశస్త్రులమై యాయన ననుసరించి వారు మేము జీవింపవలయును. ఈ రాని రాజ్యమును బూర్వము వారికి మాతండ్రి యిచ్చినపుడు నే నస్వతంత్రుఁడ బాలుఁడ నజ్ఞుఁడఁ గాన భయమున నూరకుండితి. ఇప్పుడా యాటలు సాగవు. మధుసూదనా! నా ముక్కున నూర్పు గలుగ సూది మొన మోపిన యంత నేలనైనఁ బాండవుల కిచ్చు వాఁడఁగాను.

అనినఁ గృష్ణుండు క్రోధపర్యాకులేక్షణుండయి నవ్వి సభవా రందఱు విన సుయోధనునితో నిట్లనియె.

దుర్యోధనా! యేమీ నీవు వీరశయనమా కోరెదు? తథాస్తు; స్థిరుఁడవై యుండుము. నీకోరిక రిత్తపోదు. అచిరకాలమునందె నీకు నీమంత్రుల కది లభింపఁగలదు. ఓరిమూఢా! నీవు పాండవుల కేదియు ద్రోహముచేయ లేదని యెట్లు తలంచెదవు? నీయందు దోషముకలదో లేదో వినిమ్మైనఁ దెలిసికొనుము. మహాత్ములయిన పాండవుల యైశ్వర్యంబునకుఁ జూపోపక యుత్తమక్షత్రియుండు ద్యూతంబునకు యుద్ధంబునకు నాహ్వానితుండై తిరస్కరింపఁడనియు, ధర్మజుండు ద్యూతంబున నసమర్థుండుగాన నాడు నోడుననియు శకునితో దురాలోచనముచేసి ద్యూతముకల్పించిన వాఁడవు నీవ కావా? అట్లుగాదేని శ్రేష్ఠులును సాధుసమ్మతులు బుజుప్రవర్తకులునగు పాండవులు కుటిలుఁడు నల్పుఁడైన శకునితో జూదమాడఁగోరిరా? అక్షద్యూతంబు సజ్జనులకు మతివినాశంబొనరించును. ఇఁక దుర్జనులంకో భేదములకు వ్యసనములకుఁ గారణమగు. పెద్దలతో నాలోచింపక పాపాత్ములఁగూడి ద్యూతమనుఘోరవ్యసనము కల్పించినవాఁడవు నీవు కావా? జూదంబున నోడ్డినధనమెవ్వరిది? నీది కాదా? ద్యూతనిషేధమునకుఁ బ్రతినిధి నియమనముకలదా? ద్యూతపణమొంచినవాఁడవు నీవేల యోడవైతివి? నీవుగాక మఱియెవ్వఁడు నిండుసభలోనికి భ్రాతృభార్యను నట్లు బహిరంగముగ నీడ్చి నీవుమాటలాడినట్టు మాటలాడఁ బూనుకొనును? కులీనయు, శీలసంపన్నయుఁ బాండవులకుఁ బ్రాణములకంటెఁ బ్రియురాలునగు పట్టమహిషిని నట్లుగావించినవాఁడవు నీవ కావా? ఆనాఁడు నీ వా గరితను బలికినపలుకులు సభలో నుచ్చరింపఁదగినవా? కౌంతేయులు కాననంబునకుఁ బోవుసమయంబున దుశ్శాసనుఁ డాడినమాటలు కురుసభలోని కౌరవులెవ్వరు విన్నవారుగారా? సద్వృత్తియై యుదారుఁడై సతతధర్మచారియై బంధువత్సలుఁడగు సాధువెవ్వఁ డట్లు నీచవర్తనుఁడగును? నృశంసులకు ననార్యులకు యోగ్యములగు పరుషభాషణములు నీవును దుశ్శాసనకర్ణులును బలుమాఱు పలుకరా? పాండవులు బాలురై యున్నప్పుడు వారణావతంబున జననీసహితుల దగ్ధులఁ గావింపఁ బరమప్రయత్నముచేసిన

వాఁడవు నీవుకావా? వారుప్రచ్ఛన్నులై జననీసహితులై యేక చక్రాపురంబున బ్రాహ్మణునింట దీర్ఘకాలంబుగడపుట నీద్రోహము చేయుదువను భీతినిగాదా? వారికిని విషాన్నము పెట్టినవాఁడవు నీవ కావా? పాములచేఁ గఱపించినవాఁడవు నీవ కావా? ఏటఁ ద్రోయించినవాఁడవు నీవుకావా? మఱియు నీవు వారిని నానో పాయముల హింసింప యత్నించితివి. కాని వారుదైవరక్షితు లగుట నీవ్యవసాయము వ్యర్థమయ్యె. పాండవులయం దిట్టిమిథ్యావర్తనుఁడ వయ్యు నేను వారి కేద్రోహము చేయు లేదనిచెప్ప నీనాలు కెట్లా డెను? ఇట్టి పాపశీలుఁడవు రాజ్యాధిపతిగా నెట్లర్హుఁడవు? మా తండ్రిభాగము మాకిమ్మని వారు యాచించుచుండ నీవీయనొల్ల కున్నాఁడవుగాని యైశ్వర్యభ్రష్టుఁడవై నేలఁగూలినప్పుడు పాపాత్మా! యియ్యఁగలవు. కులపాంసనా! నీవు రాజ్యమునుండియు సుఖము నుండియు భ్రష్టుఁడవు కాఁగలవు.

నృశంసునివలెఁ బాండవులపట్ల మిథ్యాచారుఁడవు ననార్యుఁ డవునై యనేకము లకార్యములుచేసియు నేమియు నెఱుఁగనివాని వలె నిప్పుడు నటించెదవు. తల్లిదండ్రులు భీష్మద్రోణవిదురులు శమిం పుమని యెంతచెప్పినను శమింపకున్నవాఁడవు. సంధివలన నీకును ధర్మరాజునకు నిరువురకు మేలుగలదు. అది నీకు రుచింపకుండుటకు నీబుద్ధిలాఘవము దప్ప వేఱొండు కారణమేదిగలదు? నీమేలుకోరు సుహృజ్జనుల వాక్యముల్లంఘించితి వేని నీకు సుఖము లేదు. రాజా! నీ వపకీర్తికరము నధర్మయుక్తము నగుపని చేయుచున్నవాఁడవు దాని ఫల మనుభవింపఁగలవు.

అని యిట్లు కృష్ణమూర్తి చెప్పుచుండుసమయంబున దుశ్శాస నుండు దిగాలునలేచి దుర్యోధనుతోడ నెల్లరువిన నిట్లనియె. "రాజా! నీవై యిష్టపడి సంధిగావింపవేని భీష్మద్రోణులు తండ్రికలసి కౌరవు లందఱు నిన్ను నన్నుఁ గర్ణుని బంధించి పాండవుల కప్పగించువారు సుమీ". అనినఁ దమ్మునివాక్యములువిని ముఖమ్మునఁ గంటువెట్టు కొని కనులు జేవుఱింప దుర్యోధనుండు క్రుద్ధుండై పెద్దవారి నెల్లర

ధిక్కరించి సభవిడిచి వెడలిపోయెను. వానితోడ వానితమ్ములు మంత్రులు దదాశ్రితరాజులును గొలువువిడిచి పోయిరి.

వారి దుండగమును జూచి భీష్ముఁడు వీరికెల్ల వినాశకాలము సమీపించెనని చెప్పుచుండ నందుఁ బోక నిలిచిన రాజవరులను భీష్మ ద్రోణప్రముఖులను జూచి వాసుదేవుం డిట్లనియె. ఐశ్వర్యమత్తుఁడైన యీ రాజకుమారునిబట్టి బంధింపక సహించి యూరకుండుట యను మహాదోషం బీ కురువృద్ధులయందుఁ గానవచ్చుచున్నది. ఇప్పుడు కాలయోగ్యమైన కర్తవ్యంబు చెప్పెద. దానిని మీరంగీకరించి యాచరించితిరేని శ్రేయస్సుగంతురు. మా యదుకులమందును నిట్టి దురాచారుఁడు ననాత్మవంతుఁడు నగు కంసుడు జనకు నతిక్రమించి యాయనను జెఱసాలనుంచెను. అప్పుడు బాంధవహితంబుఁ గోరి వారిని నేను శాసించి యుగ్రసేను రాజుఁ గావించితి. వంశము నిమిత్తమై యాదవులందఱుఁ గంసునిఁ బరిత్యజించిరి. దానిచే యాదవాంధకవృష్ణు లందఱు సుఖించిరి. ఇట్లేకదా భూతద్రోహులైన దైత్యదానవులను బరమేష్ఠివచనంబున దేవతలు బంధించి వరుణున కప్పగించిరి. అట్లే మీరును దుర్యోధన దుశ్శాసన కర్ణశకునుల బంధించి పాండవుల కప్పగింపుఁడు. వంశమునిమిత్తమై యొకపురుషుని, గ్రామమునిమిత్తమై యొకవంశమును, జనపదమునిమిత్త మొకగ్రామమును, నాత్మార్థము భూమినంతయు, వదలవచ్చును. కావునఁ గౌరవేంద్రా! దుర్యోధను బంధించి పాండవులతో సంధి గావించితివేని మీనిమిత్తమున రాజు లందఱు నశింపకుందురు.

ఆ పలుకులు విని ధృతరాష్ట్రుండు విదురుం బంచి గాంధారిం బిలిపించి యామెకుఁ గొడుకు నాగడంబు వినిపించి స్త్రీవైన నీకుమారునకు హిత ముపదేశింపు మనిన నప్పతివ్రత యిట్లనియె.

## గాంధారి దుర్యోధనునకు హితోపదేశము సేయుట.

రాజ్యకాముఁడును, నాతురుఁడునైన పుత్రుఁబిలిపింపుము. అశిష్టుఁడును, నధర్మార్థలోభియు నగువాఁడు రాజ్యమున కర్హుఁడుగాఁడు.

ఇట్టివాఁడైనను నాయవినీతుఁడు ప్రాప్తరాజ్యుఁడయ్యెను. రాజా! సుతప్రియుఁడవైన నీవే యీ విషయమున మిక్కిలి నింద్యుఁడవు. వాని పాపపుఁజేష్టలు తెలిసి తెలిసి నీవు వానియిష్టముచొప్పున వర్తించుచున్నవాఁడవు. వాఁడు కామక్రోధవశుఁడై మిక్కిలి లుబ్ధుఁడై మోహదాసుఁడై యున్నవాఁడు. అట్టి మతిహీనుని జక్కఁబెట్ట నీ కిప్పు డశక్యంబు. మూఢుఁడు, బాలిశుఁడు, దురాత్ముఁడు, దుష్టసహాయుఁడు లుబ్ధుఁడు, నగువానికి రాజ్యమిచ్చిన ఫలమిప్పు డనుభవించుచున్నవాఁడవు. రాజగువాఁడు స్వజనభేదంబెట్లు సహింపవచ్చు? స్వజనులతో బోరాటముగల నిన్ను శత్రువులు ప్రహరించుట సుకరము. మహారాజా! సామదానభేదములచేఁ దరింపఁదగు నాపద విషయమున దండ ముపయోగించువాఁ డెట్టి బుద్ధిమంతుఁడు?

అనిన ధృతరాష్ట్రు నాజ్ఞచొప్పున విదురుండు దుర్యోధను మరల సభలోనికి దోడితేర నతఁడును మాతృవచన శ్రవణంబునఁ గాంక్షగలిగి సర్పమువలె గోఁజుచు వచ్చెను. దుర్మార్గంబునఁ బ్రవర్తించునతనికి శమంబుగల్పింప గాంధారియు నతనితో నిట్లనియె. పుత్రా! నీకును నీయనుచరులకును సుఖకరమగుదాని వచించెద. శ్రద్ధావంతుండవై యాలకింపుము. నీకు నీదండ్రియు భీష్మద్రోణ కృపవిదురులు నేమి బోధించిరో దాని నుపేక్షింపకుము. నిర్భయముగఁ బథ్యము తథ్యము నగుదాని వచించువారు హితులగుదురుకాని నీకు ముఖప్రీతికై యిచ్చకములాడువారు ప్రియులగుదురుగాని హితులుగారు. ప్రియవాదులు సులభులు. హితవాదులు దుర్లభులు. వివేకమందును దురాలోచనమందును నీతియందును బూర్వాపరజ్ఞానమందును నాయెవ్వరకంటె మీరు నలువు రుత్తములు గాఁజాలరు. కావున నీవు పాండవులతోడ సంధిగావించితివేని భీష్ముని నీతండ్రిని నన్నును, ద్రోణప్రముఖులగు నీహితైషులను బూజించినవాఁడ వగుదువు. నాయనా! రాజ్యసంపాదనము, రక్షణము, భోగము కామముచే సాధ్య పడదు. ఇంద్రియవశుఁడు దీర్ఘకాలము రాజ్యభోగి గాఁజాలఁడు. విజితాత్ముఁడు మేధావియగువాఁడే రాజ్యరక్షాదక్షుఁడగు. కావు

క్రోధములు పురుషుని ధనభ్రష్టునిఁ జేయును. ఆ శత్రువులను జయించినవాఁడే భూవలయము జేత. లోకప్రభుత్వము చాలగొప్ప కార్యము. మహాత్ములకది లభింపదు. లభించినను దక్కదు. మహారాజ్యంబు గాంక్ష సేయువానికి ధర్మార్థంబులపట్ల నింద్రియనియమనంబు వలయు. ఇంద్రియములు నియమితములయ్యేనేని కాష్ఠంబులవహ్నియుంబోలె బుద్ధియు వర్ధిల్లు.

అవిధేయంబులైన యశ్వంబులు సారథింబోలె నవిధేయంబులగు నింద్రియంబులు పురుషుని హింసించు. వశ్యేంద్రియుఁడుగాక యమాత్యులవశపఱిచికొన యత్నించువాఁడును, నమాత్యులవశపఱిచికొనక శత్రువులవశపఱిచికొన యత్నించువాఁడును గీడొందును. శత్రువులవలె నెంచి యింద్రియములగుదించువాఁ డమాత్యులను, శత్రువులను గెలువఁజాలును. వశ్యేంద్రియుఁడై మంత్రుల లోపఱచికొని యక్రమవర్తనుల దండించుచుఁ జక్కఁగ నాలోచించి కార్యములు సేయుచు మిగుల ధీరుఁడగువానిని సంపద వరించు. సన్నకన్నులవలలోఁ జిక్కిన చేఁపలవలెఁ బ్రజ్ఞావంతుఁడగువాని దేహంబునందలి కామక్రోధంబులు దుర్బలంబులగు. సంగరహితుఁడై స్వర్గమునకుఁబోవ నభిలషించుచుఁ గామక్రోధవశుఁడయ్యేనేని వానికి స్వర్గద్వారంబులను దేవతలు మూసివేయుదురు. ధర్మయుద్ధమృతునకు స్వర్గముగాని కామక్రోధదాసుఁడై పదార్థకాంక్ష యుద్ధము కల్పించువాఁడు ప్రజాక్షయకారణుండై నరకముపాలగు. కామక్రోధలోభదంభదర్పంబుల జయించురాజు ధరణీమండలమంతయు జయించు. ఎల్లవేళ నింద్రియముల నిగ్రహించియుండువానికి ధర్మార్థంబులును శత్రుపరాభవంబును సమకూరు. కామక్రోధాభిభూతుండై స్వజనులపట్లఁగాని పరులపట్లఁగాని మిథ్యావర్తనుఁడగువాఁడు మిత్రులఁ బెక్కుర సంపాదింపలేఁడు. మిగులఁబ్రాజ్ఞులు శూరులు శత్రుజేతలు నగు పాండవులతోఁ గలసితండ్రీ! సుఖంబుగ రాజ్యంబనుభవింపుము.

కృష్ణపాండవులజయ్యులని భీష్మద్రోణులు చెప్పినపలుకు నాయనా! సత్యము. అక్లిష్టకారియగు కృష్ణు నాశ్రయింపుము. దాన

మీ యిరువురకు మేలుగలదు. ప్రాజ్ఞులు, విద్యావంతులు, సుహృత్తులు నగువారిశాసనమునకు లోపడఁడెవ్వఁడు వాఁడు శత్రుసంతోష దాయకుఁడు. తండ్రీ! యుద్ధంబునలన మేలు లేదు. ధర్మార్థంబులు లేవు. ఇఁక సుఖమెక్కడిది? విజయంబు నిత్యంబుగాదు. నీవే గెలుతువనుట నేటిమాట ? కావున యుద్ధముపై మనసు పోనీకుము. కుటుంబకలహభీతినిగదా భీష్మబాహ్లికులును పితండ్రియుఁ బాండుపుత్రకులకు భాగము పంచి యిచ్చిరి. అట్లు వారు చేసినదాని సత్ఫలము నీవనుభవించుచున్నవాఁడవు. ఇప్పుడు నీవనుభవించు రాజ్యమంతయుఁ బాండవులు ధరిత్రినిష్కంటకముఁగావించి సంపాదించినదే కదా. కావున వారికిఁ దగిన భాగము వారికిమ్ము. వారు మంత్రిసహితులై యనుభవింప నిమ్ము. తక్కిన యర్ధంబు నీకు నీమంత్రివర్గంబునకుఁ జాలును. సుహృత్తులమాట వింటివేని కీర్తియుఁ గందువు. శ్రీమంతులును, నాత్మవంతులును, బుద్ధిమంతులును, జితేంద్రియులు నగు పాండవులతోడి విరోధంబువలన నీవును సుఖభ్రష్టుఁడ వగుదువు. పాండుపుత్రులకు వారిభాగమిచ్చి సుహృజ్జనకోపంబు శమింపఁజేసి నీభాగంబు నీ వేలుకొనుము. అయ్యా ! వారిని బదుమూఁడు సంవత్సరములు బాధించుట చాలును. ఇంతటితోఁ గామక్రోధవహ్నిని జల్లార్పుము. నీకర్థంబు సంపాదించి యియ్యఁగోరు కర్ణదుశ్శాసనులు కౌంతేయుల గెలువ సమర్థులుగారు. భీష్మద్రోణకృపకర్ణులును, భీమార్జునధృష్టద్యుమ్నులును క్రోధవశులైరేని సర్వప్రజలు రూపుమాసిపోవుట ధ్రువము. క్రోధవశుఁడవై కౌరవకులనాశంబును, పృథివీజన నాశంబును గావింపకుము. ఓరిమూఢుఁడా ! భీష్మద్రోణకృపాదులు నీపక్షమునఁ దమ యావచ్ఛక్తినిఁ జూపి యుద్ధము చేయుదురని నమ్మకుము అది యెన్నటికిఁ బొసఁగదు. ఆవిదితాత్ములకు నీయందును బాండవులందును బ్రీతిసమంబు, అయినను బాండవుల యందు ధర్మంబు హెచ్చయున్నది. వారు ధర్మపక్షపాతులు. రాజపిండభక్షకులు గావున సోటికడిపోవుదను భీతిచేఁ బ్రాణములు పోఁగొట్టుకొన సమకట్టినను భీష్మాదులు ధర్మరాజును గోపదృష్టిఁ

జూడరు. లోభమువలన నర్థసంపత్తి గలుగుట లోకంబున లేదు; కావునఁ దండ్రీ! నరకద్వారంబు లోభంబు చాలును. శమింపుము.

## —♦ దుర్యోధనుండు కృష్ణుబంధింప నాలోచించుట. ♦—

అనినఁ దల్లివాక్యంబుల ననాదరించి దుర్యోధనుండు సభవిడిచి చని దుశ్శాసన కర్ణశకునులతోఁ గృష్ణుఁ బట్టికట్టితిమేని పాండవులు కోఱలు పెఱికిన పాములగుదురని యాలోచించి యా ప్రయత్నమున నుండెను.

పరేంగితజ్ఞుఁడైన సాత్యకి వారల రాకపోకలు మాఱిగివచ్చుటలు ముఖవికారములు కనుఁగిఱపులు. గుసగుసలు నుపలక్షించి కార్యముచెడెనని తలంచి సత్వరుఁడై కృతవర్మం దోడ్కొని సభామంటపంబు ద్వారంబున నతని నిలిపి యిట్లనియె. ఈ దురాత్మ లన్నకు ద్రోహ మెంచి యున్నవారు. నీవు సేనతో నిందు నిలుము. లోపలి వారికి నేను జాలియుండెద నని లోపలికివచ్చి కృష్ణునకు దుర్యోధనాదుల దుర్మంత్రం బెఱిఁగించి యాయన యనుమతి సభవారు వినుచుండఁ దద్వృత్తాంతం బంతయు వినిచె. అది విని విదురుండు ధృతరాష్ట్రుం గని

శా. తృష్ణాతంతునిబద్ధబుద్ధు లగు రాధేయాదుల న్నమ్మి శ్రీ
కృష్ణుం గేవలమర్త్యుఁగాఁ దలఁచి మర్దింపంగ నుత్సాహవ
ర్ధిష్ణుండయ్యె సుయోధనుం డకట ధాత్రీపాల! యూహింపుమా
యుష్ణీషంబునఁ గట్టవచ్చునె మదవ్యాఘ్రోగ్ర శుండాలమున్.

(అథర్వణభారతము.)

అని తెలియఁజెప్పె.

కృష్ణుండును ధృతరాష్ట్రుంగని చీఁకురాజా! వింటివిగదా నీ పుత్రులనడవడి. వీరఁట నన్నుఁట పట్టెదరఁట కట్టెదరట. మేలు మేలు; నామీఁద వీ రురవడించుట చిచ్చుపై మిడుతలు పరువిడుటగాఁ దలంపుము. వీరు తమ మొత్తికోలు నెఱవేర్పఁ బూని రేని ధర్మరాజునకుఁ

గార్యాంబుశ్రమముగ నిర్వహించుట సుకరంబగు. కోపులు పాపులు నగు వారికిఁగాని యిట్టి దుర్బుద్ధి పుట్టదు. అయినను వారి కార్యంబు నకుఁ గడంగుట నాకు సమ్మతమే. వీరిపీడ వీరితోనేపోయి యిందు మూఁగిన రాజలోకంబును లోకంబునఁ బ్రజలునుసుఖింతురు. కావుననే వీరిచేష్ట్యము సమ్మతమంటిని. వారియిష్టమువచ్చినట్లు ప్రవర్తింపనిమ్ము.

అనిన ధృతరాష్ట్రుఁ డదరిపడి సామాత్యసమిత్రుఁడు దుర్యోధను నింటికిఁ దోడితెమ్మని విదురుం బనిచె. అయనయు నతనిని సోదరుల తోడను రాజులతోడను సభలోనికిఁ దోడ్కొనివచ్చె. అంత ధృత రాష్ట్రుం డతనివంకకుఁ దిరిగి యోరినృశంసుఁడా! పాపభూయిష్ఠుఁడా! క్షుద్రకర్మసహాయుఁడా! పాపసహాయులఁగూడి మహాపాపమునకొడి గట్టుచున్నవాఁడవు. కులపాంసనుఁడా! మూఢుఁడా! యశక్యము నయశస్కరము నగుకార్యమును నీవుగాక మఱియెవ్వఁడురా తల పెట్టును? నీవు పాపాత్ములతోఁగూడి యప్రధృష్యుండును దురాస దుండు నగు కృష్ణునాకట్టదలంచితివి చెడుగా? దేవదానవ యక్ష సిద్ధసాధ్యులును బట్టరాని వానిని నీవెట్లురా పట్టదలఁచితివి? ఇంతకు నాయన నీకేద్రోహము చేసెరా? ఉభయపక్ష శ్రేయోభిలాషియై హిత ముపదేశింపఁ బూనినందున కిది ప్రతిఫలమా!

అనిన విదురుండును దుర్యోధనుంజూచి సౌభకంబున ద్వివిద వానరుండును, బ్రాగ్జ్యోతిషంబున నరకుండును, నిర్మోచనంబున నఱు వదివేల రాక్షసులును బట్టఁజాలనివాని నీవెట్లు పట్టదలఁచితివని చికాకుపెట్టె. అంత దుర్యోధనుంజూచి దానవాంతకుం డిట్లనియె.

## శ్రీకృష్ణుండు విశ్వరూపమును జూపుట

ఓరిదుర్బుద్ధీ! నే నొంటరివాఁడనని యంటరా నన్నుఁ బట్టఁ జూచెదవు. ఎవరినిబట్టెదరో కట్టెదరో కానిండు. వీరె పాండవులు. అంధకవృష్ణిభోజులు వీరె. వీరె రుద్రాదిత్యవసువులు మహర్షులు నని బిగ్గ నవ్వెను. వెంటనే బొటనవ్రేలెడేసి యాకారముగల దేవత లగ్నివలె వెలుంగుచు నాయుననుండి వెలువడిరి. లలాటంబున

బ్రహ్మయు వక్షంబున రుద్రుండును, భుజంబుల లోకపాలురును, ముఖంబున నగ్నియు మఱియు నాదిత్యసాధ్యవసువులు, మరుత్తులు, విశ్వేదేవతలు, యక్షగంధర్వోరగ రాక్షసులు జనించిరి. కుడిభుజంబున ధనంజయుండు జనించి గాండీవధరుండయ్యె. ఎడమభుజంబున బలరాముండు జనించి హలపాణియయ్యె. యుధిష్ఠిర భీమనకులసహదేవులు వెనుకను వృష్ణ్యంధక ప్రద్యుమ్నాదులు ముందును నుద్యతాయుధులై నిలిచిరి. శంఖచక్ర గదాశక్తి శార్ఙ్గలాంగలనందకంబులామహామూర్తి నానాభుజంబుల గానవచ్చె. కర్ణనేత్రనాసికా ద్వారంబులనుండి పొగలతోడ మంటలు వెలువడియె. రోమకూపంబుల సూర్యకిరణంబులవలెఁ గాంతులు నిగిడె. కేశవుఘోరాకారంబుఁ గాంచి భీష్మద్రోణవిదుర సంజయధృతరాష్ట్ర ఋషీశ్వరులు తప్పఁ దక్కిన రాజులందఱు భీతచిత్తులై కన్నులుమోడ్చిరి. వారికి మాత్రము భగవంతుఁడు దివ్యచక్షువు లొసంగె. ఆ యద్భుతంబుఁగాంచి దేవతలు పుష్పవర్షంబుఁ గురియించిరి. అంత ధృతరాష్ట్రుండు కృష్ణుం గని పుండరీకాక్ష నీవే సర్వలోకహితుండవు. నిన్ను దర్శించిన నేత్రంబుల నన్యంబు దర్శింపనొల్లఁ గావున దృష్టిహరింపుమనిన భగవంతుఁ డట్లయొనర్చె. చీఁకురాజునకుఁ గన్నులు వచ్చుటఁ గని చూపఱు ఆశ్చర్యమగ్నులైరి. ఋషులెల్లఁ గృష్ణు స్తుతించిరి. ధరావలయంబు వణఁకె. అంతఁ గృష్ణుం డారూపం బుపసంహరించి స్వరూపంబున నొప్పారె. పదపడి కృష్ణుండు సాత్యకి విదుర కేలను బట్టుకొని ఋషులయనుజ్ఞవడసి సభవిడిచి చనియె. ఋషులంతర్ధానమొందిరి. కృష్ణుని వెన్నడించి కౌరవులును జనిరి. కృష్ణుండు దారుకుండు తెచ్చిన రథమెక్క యత్నింప ధృతరాష్ట్రుం డిట్లనియె. నా పుత్రునందు నాకుఁగల బలము ప్రత్యక్షముగఁ గంటివిగదా. ఇందు రహస్యం బేమియు లేదు. కౌరవులపాండవులసంధి గోరువాఁడనని యెఱింగితివి! పాండవుల యెడాటమున నాకేఁ బాపాభిప్రాయంబు లేదు. సుయోధనునకు నా కావించిన హితబోధ మాలకించితివి. సంధికై నే నెంత యత్నించితినో రాజు లందఱును జూచిరి.

అనినఁ గృష్ణుండు ధృతరాష్ట్ర భీష్మద్రోణకృపవిదురబాహ్లికులం గాంచి. సభావృత్తాంతంబంతయు మీకు బ్రత్యక్షంబుగదా. ధృతరాష్ట్రుండు తాను స్వతంత్రుడఁగానని చెప్పుటయు వింటిరి. ఇఁక నాకింకేమి పనిగలదు? పాండవులఁ జూడఁబోయెద. మీరందఱు నాకు సెలవొసంగుఁడు. అని రథమెక్కి పయనించె. భీష్మద్రోణ కృపాశ్వత్థామ వికర్ణయుయుత్సువిదురులు లోనగుకౌరవప్రముఖులు కృష్ణు వెన్నంటిరి. కృష్ణుండు కుంతియింటికిఁ జని సభోదంతంబు సాంతంబుగ సవిస్తరంబుగ వినిచి యత్తా! యిఁక నేను బాండవులఁ జూడఁబోయెద వారికేమి చెప్పెదవనినఁ గుంతి యిట్లనియె.

## —♦ కుంతీ సందేశము. ♦—

కేశవా! నావచనంబులుగ యుధిష్ఠిరుతో నిట్లనుము. కుమారా! నీవు ధర్మమునుండి విశేషముగ భ్రష్టుఁడ వగుచున్నాఁడవు. కులధర్మమును వ్యర్థపఱుపకుము. అర్థజ్ఞానము లేక వేదశబ్దములమాత్ర మెఱింగి చెడిన శ్రోత్రియుఁడగు నపండితునివలె నీవును ఛాందసుఁడవై కేవలవైదికధర్మమందే బుద్ధినిలిపితివి. బ్రహ్మ నిన్నేకులమునఁ బుట్టించె నట్టికులధర్మమేదియో యాలోచింపుము. క్రూరకార్యరతులయినఁ బ్రజలఁ బాలింపవలసిన క్షత్రియులు బ్రహ్మబాహువులఁబుట్టిరి కావున బాహువీర్యంబుననే జీవింపవలయును. ఈవిషయమున నేను వినిన చరిత్రమొకటి యుపమానంబుగఁ జెప్పెద, తొల్లి వైశ్రవణుండు ముచుకుందునకుఁ బృథివియంతయు నీయఁ గడంగిన నారాజర్షి పరదత్తం బేనుగ్రహించువాఁడనుగాను. స్వభుజబలార్జితంబుమాత్రమె భుజించెదనని దానిని గైకొనకున్న వైశ్రవణుం డాశ్చర్యపడి మిగులఁ బ్రీతుఁడయ్యె. ఆవల నమ్ముచుకుందుండు క్షత్రధర్మమున వర్తించి భుజబలంబునన సర్వసర్వంసహాచక్రంబు జయించి వశపఱచుకొనియె. ఏరాజు ప్రజల ధర్మమార్గంబున రక్షించునో యారాజా ప్రజలపుణ్యంబున నాలవభాగంబుఁ గైకొనువాఁడగు. రాజు స్వధర్మభ్రష్టుఁడై నరకంబునఁబడు. రాజు స్వధర్మంబున

నిలిచి నాలుగువర్ణములవారిని దండనీతిచే వారివారి ధర్మంబులనిలిపి దండనీతితప్పక ప్రజల ధర్మంబున వర్తింపఁజేసెనేని యదియే కృతయుగంబు. రాజునకుఁ గాలము కారణమా; కాలమునకు రాజు కారణమాయని సంశయింపకు. రాజే కాలమునకుఁ గారణము. కృతత్రేతా ద్వాపరముల సృష్టించువాఁడు రాజే. కలియుగమునకు రాజే కారణము. కృతయుగంబు కలిగించురాజు స్వర్గగామియగు. త్రేతకుఁగారణమగురాజు స్వర్గఫలంబు విశేషం బనుభవింపఁడు. ద్వాపరము వర్తింపఁజేయురాజు యోగ్యతానుసారముగ సుఖమనుభవించు. కలియుగకర్త యగురాజు పాపభూయిష్ఠుఁడగు. కావున దీర్ఘకాలము నరకమున దుఃఖించురాజుపాపము ప్రజలను బ్రజల పాపము రాజును నంటును. కావునఁ బితృపైతామహోచితంబైన రాజధర్మంబున వర్తింపుము. నీ వుండఁదలఁచునది రాజధర్మముగాదు. దుర్బలుఁడై యత్యంత దయాపూరితుఁడై యుండువాఁడు ప్రజాపాలనమువలనఁ గలుగుపుణ్యంబును గొంచెమైన ననుభవింపఁడు. ఇప్పుడు నీ వే తెలివితో వర్తించుచున్నవాఁడవో యట్టి తెలివి నీకు రావలయునని పాండురాజుగాని నేనుగాని పితామహుఁడుగాని నిన్ను దీవింపలేదు. యజ్ఞము, దానము, తపము శౌర్యము, ప్రజ్ఞ, సంతానము, మాహాత్మ్యము, బలము, ఓజస్సు గలుగవలయునని కదా సదా నిన్నాశీర్వదించితిని. నరులు సురలు ప్రీతులై రేని దీర్ఘాయువు, ధనము, సంతానము, స్వాహా, స్వధయులభించు. క్షత్రియదంపతులు తమ బిడ్డలకు దానము, వేదపఠనము, యజ్ఞము, ప్రజాపాలనము, లభింప దేవతలఁ బ్రార్థించుచుందురు. ధర్మమైనఁగానీ యధర్మమైనఁగానీ జన్మమువలన లభించినది నీవవశ్యము జరుపవలయు. ధర్మ మిట్టి దయ్యుఁ బండితులు సత్కులజులునయ్యు నాపుత్రులు దేబెల కొట్లు దారిద్ర్యముచే దుఃఖించుచున్నారో చూడుము. ఆఁకొన్నవారు శూరుఁడును దానపతియు నగువానిఁజేరి తుష్టులై నిలుతురు. అంతకంటెధర్మమేదికలదు? రాజగువాఁడు ప్రాప్తరాజ్యుఁడై ధార్మికుఁడై దానమునఁ గొందఱను, బలమునఁగొందఱను, సత్యవాక్కులఁగొంద

జనువశపఱిచి కొనవలయును. బ్రాహ్మణులు భిక్షాటనము గావింపవలయును. క్షత్రియులకు భూపాలనంబు కర్తవ్యంబు. వైశ్యులకు ధనార్జనంబు కార్యంబు; శూద్రులు వారికిఁ బరిచర్య సలుపవలయు. భైక్షము నీకు నిషిద్ధము. కృషి నీకుచితముగాదు. క్షత్రియుఁడవు కావున బాహువీర్యంబున జీవింపుము. మునిఁగిపోయిన తండ్రిభాగము సామదానభేదనీతులఁగాని దండరీతిఁగాని యుద్ధరింపుము. మిత్రనందనా! నిన్నుఁగని దీనబాంధవనై పరపిండమును దిని బ్రతుకుటకంటె నాకుఁ జెడ్డదుఃఖ మేది రాఁగలదు? రాజధర్మానలంబివై యుద్ధమొనర్పుము. పితామహుల నపకీర్తిఁ ద్రోయకుము. క్షీణపుణ్యుండవై సోదరులతోడఁ బాపగతికిఁ బోకుము.

## —• విదులోపాఖ్యానము •—

ఈ విషయమున విదులాపుత్రసంవాదం బనునొకపురాతనేతిహాసంబు గలదు. దీనివలనఁ దెలియవచ్చు శ్రేయస్సుఁగాని యంతకు మేలైనదిగాని కృష్ణా! నీవు పాండవులకుఁ జెప్పుము.

యశస్వినియు దీనవదనయు సత్కులసంభూతయుఁ గుపితయు క్షత్రధర్మరతయు, దాంతయు, దీర్ఘదర్శినియు రాజసభలఁ బ్రసిద్ధికెక్కినదియుఁ, బండితయు, బహుశ్రుతయునగువిదులయను నొకక్షత్రియ స్త్రీ గలదు. ఆమె సింధురాజనిర్జితుఁడై గృహాగతుఁడై దైన్యంబు ముఖంబున వేల యెంతచెప్పినను యుద్ధమునకుఁ బురిగొనక నేలఁ బడియుండిన సంజయుండను తన కన్నకొడుకు నిట్లు సంబోధించెను.

ఓరీ శత్రుసంతోషకారీ! నీ వెక్కడి కొడుకవురా నాకు! నీవు నాకుఁ బుట్టినవాఁడవు కావు. నీ తండ్రికిని బుట్టినవాఁడవు కావు. ఎక్కడనుంచి దాపరించితివి? నీయట్టి రోషహీనునిగూడ మగవానిఁగా నెవ్వతెరా తలఁచును? నీ చిహ్నములు చూడ నీవు షండుఁడవు, యావజ్జీవ మిట్లులే నిరాశుఁడవై పడియుండెదవా షుగపందా? ఛీ లెమ్ము నీ మేలుకొఱకై నీ కార్యభారము నీవే వహింపుము. నీయాత్మను

నీ వవమానపెట్టకుము. అల్పముచే దానిని సంతోషపఱుపకుము. శ్రేయస్కాముఁడవై భయంబు త్యజింపుము. ఓరీ! లెమ్ము. ఓరీ నీచుఁడా! పగతురచే దెబ్బలుదిని శత్రువులకు సంతోషము బంధువులకు శోకము గలిగించుచువచ్చి యిచ్చట మానహీనుఁడా! పడి యున్నాఁడవా? లే లెమ్ము. చిఱుకాలువ కొంచెపునీటి నిండును. ఎలుకదోసిల యల్పపదార్థమున నిండును. అల్పపురుషుఁ డల్పలాభంబున సంతుష్టుఁడగు. పాములకోఱలైనఁ బెఱుకుముగాని కుక్కవలెఁ జావకుము. దీనవలె బ్రతికియుండుటకంటెఁ బ్రాణము పోవునట్లున్నను పరాక్రమమే కనఁ బఱుపుము. ఆకాశంబున నిరాఘాట సంచారంబుఁ గావించు డేగవలె నీవు నిచ్ఛావిహారంబు గావించుచు శత్రువుల ఛిద్రంబులు పరికించి సమయముగని మీఁద దుముకుము. పిడుగడిచిన వానివలెఁ బీనుఁగువలె నేల యట్లు నేలఁబడి యున్నాఁడవు? ఓరీ కాపురుషుఁడా! ఛీ లెమ్ము. పగవారిచేఁ బరిభవింపఁబడియుఁ బండుకొన నీకుఁ బిఱికిపందా! బుద్ధి యెట్లు పుట్టెను? ఇట్టి కృపణ దశయం దున్నవాఁడవని యెవరికిఁ దెలియనీకుము. నీ మహాకార్యములచే పలువురు నిన్నెఱుఁగునట్లు చేసికొనుము. మధ్యమ దశయందుఁగాని యధమదశయందుఁగాని యధమాధమ దశయందుఁ గాని యుండకుము. అగ్నిహోత్రునివలె సదా ప్రజ్వరిల్లుము. తుమ్మకికొఱవివలె నల్పకాలమైనను భగ్గని మండుముగాని ప్రాణాశచేఁ బొట్టునిప్పువలెఁ బొగరాఁజుచుండకుము. దీర్ఘకాలము పొగయుటకన్న నల్పకాలము మండుట మేలు. ఆఁడుగాడిదవలె నతిమృదు వగువాఁడు రాజకులంబున నెందును బుట్టకుండునుగాక. ధీరుండై శూర పురుషుండైన క్షత్రియుండు మనుష్య సాధ్యకార్యము లొనర్చి పోరి కులధర్మ ఋణముక్తుఁ డగుచున్నాఁడు. ఇట్టివాఁడు తన్నుఁదాను బరిభవించి కొనఁడు. జ్ఞానముగలవాఁడు కార్యము జయించినను నోడినను దుఃఖింపఁడు. అనంతరకార్య మేదియని యాలోచించి యథాశక్తి కార్యారంభుఁడగునుగాని ధనాభిలాషి కాఁడు. పరాక్రమమునైన నాశ్రయింపుము. చావనైనఁ జావుము. కులధర్మమును వదలి నేలకు

బరువుగ నేల జీవించెదవు? ఓరీ నపుంసకుఁడా! యిష్టాపూర్తములుకీర్తి సకలము హతమయ్యెను. భోగమూలము విచ్ఛిన్నమయ్యెను. ఇఁక నీవ్రాపిరితోనుండియు నేమిఫలము? ఎవరి నుద్ధరించెదవు? వీఁడు నా కొడుకని నలువురితో నెట్లు చెప్పుకొందును? సరి యాఁడువారిలోఁ దలయెత్తి యెట్లు తిరుగుదును? నీ కుత్తుకలో నూపిరి కొఱకొఱగొట గొఱలాడుచుండ నాకుఁ గొడుకు లేఁడని యెట్లు కల్లలాడుదును? తాను బహునష్టమున్నను శత్రువునకుము కలుచుకొని వానితోఁడఁ బడ వలయును. తనకు మూలచ్ఛేదమైనను విషాదపడరాదు. ఉత్తమజాతి గుఱ్ఱ మెంతబరువైన యథాశక్తి యీడువ యత్నించును. దానిని స్మరించియైన నీవును సత్త్వమానపౌరుషముల కొలఁదిఁ జరింపుము. నీ నిమిత్తమున మునిఁగినకులము నుద్ధరింపుము. కులాభిమానము దేశాభిమానము లేని నీవంటివి పందలు మనిన నేమి మందిన నేమి? అద్భుతంబని యెవనిచరిత్రమును లోకు లాడికొనరో వాఁడు జనసంఖ్య హెచ్చింపఁ బుట్టినవాఁడు. వాఁడు పురుషుఁడునుగాఁడు. స్త్రీలలోను జేరఁడు. దానము, తపస్సు, సత్యము, విద్య, యర్థలాభము, వీనియం దెవనికీర్తి వ్యాపింపదో వాఁడు తల్లికడుపులోనుండి వచ్చిన పురీషము. విద్య, తపస్సు, శ్రీ, విక్రమంబుల నితరజనుల నతిశయించువాఁడే నిక్కపు మగవాఁడు. సోమరి, భీరుకుఁడు, నృశంసుఁడు, నకీర్తిపరుఁడు నగు వాని కాపురుషోచిత వృత్తి నీకుఁదగదు. తినఁగూడును, గట్టఁ బుట్టము, నెక్క వాహనములేక లోకముచేఁ బరిభవింపఁబడుచుఁ గృశించి శత్రులకు సంతోషముగలిగించు హీనుని స్వల్పజీవి యగు నల్పునిఁ జేరి బంధువు లేమి సుఖింతురు? రాజ్యభ్రష్టులము, స్థాన భ్రష్టులము, దేశభ్రష్టులమై సకలభోగముల వదలి దరిద్రులమై పగతురకు దాసులమై మిగుల దుఃఖింపఁగలము. సాధువులయందు వక్రగామివి, సద్వంశనాశకుఁడ వగు నీవు సంజయా! పుత్రుఁడను నెపమున నా కడుపునఁబుట్టిన కలిపురుషుఁడవు. రోషహీనుఁడు నుత్సాహహీనుఁడు నిర్వీర్యుఁడు శత్రునందనుఁడు నగు నీవంటి కుమారుని నేతల్లియైనఁ గనకుండును గాక. నీవంటి కుమారుని గనుట

కంటెం దల్లి గొడ్రా లగుటమేలు. కడుపు దిగంబడుట శ్రేయస్కరము. కడుపులోనే బిడ్డ చచ్చుట లాభకరము. మృత శిశువు గనుట సంతోషదాయకము. పొగరాంజుచుం బడియుండకుము. ముహూర్తమైనను క్షణమైనను శత్రువుల నాక్రమించి వారి శిరంబులపై మండుము. ఇట్టివాండు మగవాండు. వానినింగన్నదే తల్లి. క్షమ మాత్రము గలిగిన రోషహీనుని స్త్రీయని యనరాదు; పురుషుండనియు ననరాదు. సంతుష్టియు, మెత్తందనము, ప్రయత్నము చేయకుండుట, భయము ననునవి శ్రీవినాశకరములు. యత్న హీనుండు గొప్పకార్యములు చేయంజాలండు. కావున నీవిట్టి పాపములకు వశుండవు గాకుము. హృదయమును రాయిచేసికొని నీయర్థమును నీవు సంపాదించుకొన జతనంబు గావింపుము. పరుల నణంచు గావుననే పురుషుండనంబడుచున్నాండు. మగువవలె జీవించు వానికి మగవాండను పేరేల? వ్యర్థము. శూరుండు బలసంపన్నుండు సింహపరాక్రముండు నగువాండు మరణించినను వాని రాష్ట్రమునం బ్రజలు సుఖముగ నుందురు. ఎవండు తన ప్రియసుఖముల విడనాడి శ్రీ నార్జించునో వాండమాత్యాదుల హర్షాంబుధిం దేల్చును. అనిన బుత్రుం డిట్లనియె.

తల్లీ! యెట్టి హితముబోధించెదవు? రణమునకుంబోయి మరణింపుమనియా నీబోధము. నేను మరణించిన పదపడి నీకీ సర్వ రాజ్యము సర్వాభరణములు సర్వభోగములు తుదకు నీ జీవితే ముండియు నేమి ప్రయోజనము? బ్రదికియుండిన నేదైన సుఖ మనుభవింపనగుంగాని చచ్చి సాధించునది యేమున్నది?

అనినం దల్లి యిట్లనియె. మరణ మనిన భయపడెదుపిఱికీ! శూరుం డొకసారి చచ్చును. భీరువు పలుమాఱు చచ్చును. ఈ భూమి నాది యనువానిం జూచి భూమి, యీధనము నాదియనను. వానింజూచి ధన, మీపుత్రులు నా పుత్రులని లాలించుకొను వానిం గని జారిణియగు భార్యయు, రణరంగమనిన వెఱచు క్షత్రియునింగని మృత్యువు నవ్వు నన వినవా? మానహీనుండవైన నీవు బ్రతుకుట.

కంటెఁ జచ్చుటే నాకు సంతోషకరము. రణజితుఁడు నాసుతుఁ డనుటకంటె రణాహతుఁడు నాసుతుఁడని చెప్పుకొనుట యశస్కరము. ప్రాణమైనవిడిచి మానము కాపాడుకొన వలయునని వినవా? ప్రాణము క్షణభంగురము. కీర్తి యాచంద్ర తారకము. రోష హీనులగు క్షుద్రులుపోవు లోకమునకు మన శత్రువులు పోవుదురు గాక. ఆత్మగౌరవము గలవారి లోకమునకు మన మిత్రులు పోవు దురుగాక. పరిచారహీనులై దుర్బలులు దరిద్రులునై పరపిండ ములఁ దినువారివృత్తిని నీవవలంబింపకుము. దేవత లింద్రుని, భూత ములు పర్జన్యుని, నాశ్రయించినట్లు బ్రాహ్మణులు మిత్రులు నిన్నా శ్రయించి జీవింతురుగాక. పండిన ఫలవృక్షము నాశ్రయించి పక్షులు బ్రతుకున ట్లేపురుషు నాశ్రయించి సర్వజనులు బ్రదుకుదురో సంజ యా! వాని బ్రతుకే సార్థకము. ఇంద్రు నాశ్రయించి బ్రతుకు దేవ తలవలె నేవాని నాశ్రయించి బంధువులు బ్రదుకుదురో వాని జీవి తమే యుత్తమమైనది. స్వబాహుబలంబున జీవించువాఁ డీలోకంబునఁ గీర్తియుఁ బరలోకంబున నుత్తమగతియుఁ బొందును. అని యనేక విధంబులఁ బరుషోక్తు లుల్లముచ్చిపో నాడిన సతండును రోషంబుఁ దెచ్చుకొని తల్లి చెప్పినట్లు కార్యమొనర్చెఁ గావున నీవు కృష్ణా! పాండవులను క్షత్రియోచితంబైన బ్రదుకు బ్రదుకుఁడనుము. అర్జునా! నీవు పుట్టినపు డాకాశవాణి కుంతీ! నీకొడుకు శక్రతుల్యుండై భూమి నెల్ల జయించి కౌరవులవధించి రాజ్యమార్జించి మూడుయజ్ఞంబులు గావించునని వచించె.

భీమసేనా! రాచకూఁతురు పుత్రుని నేలకోరునో యట్టికాల ము సమీపించినది. రోషము విడువకుము. మాద్రేయులారా! మీరు ప్రాణములకంటె విక్రమార్జితజీవితము నుత్తమముగఁ దలం పుఁడు. అని వారివారికి నామాటలుగఁ జెప్పుము. కృష్ణా! రాజ్యనాశము,పుత్రవియోగము,ద్యూతపరాజయము నాకంత దుఃఖ కారణములు గావుగాని మేముండఁటము వినుచుండఁ బాంచాలిననిన మాటలు సహరోర్తురు? అదియే నాకెక్కువ దుఃఖకారణము.

ద్రౌపదిమతమునఁ జరింపుమని యర్జునునకుఁ జెప్పుము. పాండవులఁ గుశల మడిగితి ననుము. నేను గుశలిని నని వారికిఁ జెప్పుము. నాయనా! సుఖముగఁ బోయిరమ్ము. పాండవులఁ బరిపాలింపుము.

అనినఁ గృష్ణుం డామెకుఁ బ్రదక్షిణించి యామె సెలవుగైకొని తరలె. ఇట్లు కృష్ణుండు పయనమైపోవఁ గౌరవు లాయనను సాగనంపఁ గొంతద వ్వరిగిరి. అప్పు డా యశోదానందనుండు రాధానందనుఁ జేరరమ్మని పిలిచి తన యరదమెక్కించుకొని రహస్యముగ నతనితోఁ దీక్ష్ణములు మృదువులు, ప్రియులు, ధర్మయుక్తములు, సత్యములు హితములు హృదయగ్రహణములునగు వాక్యముల నిట్లనియె.

## —♦శ్రీకృష్ణుఁడు కర్ణునితోఁ బాండవులఁ గలయుమని చెప్పుట.♦—

రాధేయా! నీవు వేదపారగులయిన బ్రాహ్మణుల నుపాసించితివి. నియతితప్పక యసూయలేక వారివలనఁ దత్త్వార్థ మెఱిఁగితివి. సనాతనములైన వేదవాదముల నీవెఱుఁగుదువు. నీవు సూక్ష్మధర్మములందును బరినిష్ఠితుఁడవు. కన్యాపుత్త్రులు కానీనుఁడనియు సహోఢుఁడనియు నిరుతెగలు. అందు వివాహానంతరము వరునకు జనించినవాఁడు సహోఢుఁడు. వీరిరువురకు వీరితల్లిని బరిణయమాడినవాఁడే తండ్రియని శాస్త్రవేత్తలు చెప్పుదురు. కర్ణా! నీవట్లు జనించినవాఁడవు కావున ధర్మవిధిని నీవు పాండుపుత్త్రుఁడవు. కావున రమ్ము. నీవు ధర్మశాస్త్రనిశ్చయముచొప్పున రాజవు కాఁగలవు. తండ్రిపక్షమునఁ బాండవులును, దల్లిపక్షమున యాదవులు నిన్నుఁ గొల్చియుందురు. తండ్రీ! నాతోడ నిప్పుడే నీవు పాండవులకడకు రమ్ము. నీవు యుధిష్ఠిరునకు జ్యేష్ఠుఁడవని యెఱిఁగి రా నీభ్రాతలు పంచపాండవులు నీచరణములకు నమస్కరింతురు. అట్లె ద్రౌపదేయసౌభద్రులును నిన్నుఁ బూజింతురు. ధర్మరాజునిమిత్తమై మూఁగిన రాజులు రాజపుత్త్రులు వృష్ణ్యంధకులు నీపదముల వ్రాలుదురు. కనక రజతకుంభంబుల నోషధులు సర్వబీజములు సర్వరత్నములునునిండి

రాణులు రాజకన్యలు నీయభిషేకంబునకై నీళ్ళు తెత్తురు. ద్రౌపదియు వంతుప్రకారం మాఱవవర్షంబున నిన్ను వరించును. బ్రాహ్మణో త్తముండైన ధౌమ్యుఁడగ్నులవేల్చును. చతుర్వేదపారగులగు బ్రాహ్మణులు నిన్నిపుడ యభిషేకింతురు. బ్రహ్మకర్మనిరతుండైన పాండవ పురోహితుండును బంచపాండవులును, ద్రౌపదీపుత్రులేవురును, పాంచాలచేదిరాజులును, నేనును నిన్ను సర్వసర్వంసహాధీశ్వరుఁగా నభిషేకింతుము. ధర్మపుత్రుండు నీకు యువరాజగును. ధర్మనందనుండు శ్వేతవ్యజనంబును, భీమసేనుండు శ్వేతచ్ఛత్రంబును, నీకుఁ బట్టఁ గలడు. పట్టాభిషిక్తుండవైన నీయరదం బర్జునుండు గడపును. అభి మన్యుండు నీపజ్జన నిలువఁగలఁడు. నకులసహదేవద్రౌపదేయపాంచాల శిఖండులు నీవెనుకవత్తురు. సర్వాంధకవృష్ణిసహితుండనై నేను నీ పిఱుఁదన నడిచెద. సోదరులైన పాండవులఁగూడి పూజ్యప్రాజ్య రాజ్యసుఖంబు లనుభవింపుము. జపహోమాది నానామంగళ కార్యంబు లొనర్పుము. ఆంధ్రద్రావిడ తాలచర చూచుప వేణు పాదులు నీముంగలనడుతురు. సూతమాగధులు నిన్ను స్తుతించువారు. పాండవులు నీవిజయంబు ఘోషింతురు. తారాయుక్త చంద్రునివలెఁ బాండవ సహితుండవై కుంతి సంతోషింప రాజ్యంబుఁ బాలింపుము. నీ మిత్రుల నానందంబునను, నీ శత్రుల ఖేదంబునను దేల్పుము. పాండవులందు సౌభ్రాత్రము మానకుము. అనినఁ గర్ణుఁ డిట్లనియె.

కృష్ణా !. నీవు సౌహృదంబుచేతను, ప్రేమచేతను, సఖ్యము చేతను, నా శ్రేయస్సు గోరియుఁ జెప్పితివని యెఱుంగుదును. ధర్మ శాస్త్రము చొప్పున నేను బాండుపుత్రుండననియు నెఱుంగుదు. సూర్యుని వరంబునఁ గుంతి కన్యాదశయందుఁగని దూయునవచనంబు చొప్పున నన్నువిసర్జించెను. నాక్షేమము గోరక నన్నుఁ గుంతి విడనా డఁగా నన్ను సూతుండగు నధిరథుండుగాంచి యింటికెత్తుకొనిపోయి తన భార్యయగు రాధకుఁ బ్రీతితో నొసఁగెను. నాయందుల ప్రేమచే రాధ కాతనంబు చన్నులు చేఁపెను. ఆమెయే తన చేతులార నా మూత్రపురీషమ్ము లెత్తిపోసెను. అట్టియామెకు ధర్మవేదినై ధర్మ

శాస్త్రంబులువిని ధర్మరతుండగు నాయట్టివాఁ డెట్లుత్తరక్రియలు పిండ ములు లోపింపఁ జేయవచ్చును? అధిరథుఁడు నేను దనపుత్రుఁడనని యే విశ్వసించి యున్నవాఁడు. సౌహృదబలంబున నేనాయనను జనకునిఁగా భావించినాఁడను. ఆయనయే నాకుఁ జాతకర్మాదిక్రియలు శాస్త్రవిధి ప్రకారము పుత్రప్రీతి నిర్వర్తించెను. ఆయనయే బ్రాహ్మణులచే నసుషేణుఁడని నామకరణము గావింపించె. నా యౌవనంబున సూత కులంబునందె యతఁడు నాకు వివాహంబుఁ గావించె. నా భార్యల యందు నాకుఁ బుత్రులుపౌత్రులు జనించిరి. కామబంధనంబు వలన వారియందు నాడెందంబు బద్ధమైయున్నది. విశ్వవిశ్వంభరా రాజ్యము నకైగాని సువర్ణరాసులకైగాని హర్షభయంబు వలనఁగాని గోవిందా! వారియందలిప్రీతి నదలి కల్లనడవడికి లోపడఁజాలను. దుర్యోధను నాశ్రయించుట బదుమూఁడు సంవత్సరము లకంటకరాజ్యంబు భోగించి తిని. సుతులతోడ ననేకయజ్ఞములు కోరినట్లు సలిపితిని. కులధర్మ ములు వివాహములు సుతులతోడఁ గావించితిని. నాబలంబునమ్మి దుర్యోధనుఁడు పాండవులతో నిగ్రహించె. జనుగఁగల కలహంబున నన్నర్జున కెదురుద్దిగ దుర్యోధనుఁ డెన్నుకొని యున్నవాఁడు. నన్నుఁ జంపినను జెఱపెట్టినను, వెఱవెట్టినను, నాశపెట్టినను నేను దుర్యో ధనుతోఁ గల్లలాడనేర. ఇప్పుడు నే నర్జునునితోఁ ద్వంద్వయుద్ధముఁ గావింపనేని యది నాకును బార్థునకును గూడ నకీర్తికరము. నా హితాభిలాషివై భాషించుటయుఁ బాండవులు నీమాటఁ బట్టి పోవుదురనుటయు నిస్సందేహము. అయినను మన యీ సంవా దము నీవు రహస్యముగనుంచుటే నాకు హితకరము. నియతవ్రతుం డైన యుధిష్ఠిరుండు నేను గౌంతేయులందు జ్యేష్ఠుఁడనని యెఱింగినా పిదప రాజ్యమాశింపఁడు. నాకు రాజ్యము సర్వము లభించినను నేను దానిని దుర్యోధనునకే యీయఁగల వాఁడను. ఇది సత్యము. నీవు నేతవై భీమార్జున నకుల సహదేవ ద్రౌపదేయులు యోధులై యుండు ధర్మాత్ముఁడు యుధిష్ఠురుఁడే శాశ్వతముగ విపుల విపులా భారంబు వహించునుగాక. సాత్యకి ధృష్టద్యుమ్నులు నుత్తమౌజుఁడు

యుధామన్యుఁడు లోనగు వారనేకశూరులు పాండవపక్షమున గుమిగూడి యున్నవారు. కావున రాజ్యము పాండవులకుఁ బ్రాప్తించినదియేయని తలఁచెద. దుర్యోధనుండు శస్త్రయజ్ఞంబు నెఱవేర్పఁ బూనినవాఁడు. అందు నీవే యుపద్రష్టవు. అధ్వర్యుండవు నీవే. హోత యర్జునుండు. గాండీవము స్రుక్కు. శూరుల శౌర్యం బాజ్యంబు. సవ్యసాచి ప్రయుక్తంబులగు నైంద్ర పాశుపత బ్రహ్మస్థూణా కర్ణంబులు మంత్రంబులు. జనకతుల్యుఁడో తదధికుఁడో యగు నభిమన్యుండు గీతము స్తోత్రమునగు. భీముఁ డుద్గాతయుఁ బ్రస్తోతయు జపహోమపరుండగు యుధిష్ఠిరుండు బ్రహ్మ. శంఖభేరీ మురజనినదంబులు సింహనాదంబులు సుబ్రహ్మణ్యంబు. మాద్రేయులు శామిత్రంబు. వారే మైత్రావరుణాగ్రీధ్నులు. రథపంక్తులు యూపంబులు. కర్ణి నాళీక నారాచంబు లుపబృంహణంబులు (మిళ్ళులు) తోమరంబులు సోమకలశంబులు. ధనువులు పవిత్రంబులు, అసులు కపాలంబులు, శిరంబులు పురోడాశంబు, హవిస్సు రుధిరము. పరిఘశక్తిగద లిధ్మంబులు. సదస్యులు ద్రోణశిష్యులు కృపుఁడు. పార్థద్రోణ ద్రౌణి ప్రముఖ ముక్త శరంబులు పరిస్తోమంబులు. సాత్యకి ప్రతిప్రాస్థానిక కర్మము గావింపఁగలవాఁడు. దుర్యోధనుండు దీక్షితుండు. అతని పత్నియే సేన. అతిరాత్రకర్మంబున ఘటోత్కచుండు శామిత్రంబు గావింపఁగలవాఁడు. ధృష్టద్యుమ్నుండు దక్షిణ.

కృష్ణా! దుర్యోధను ప్రీతికై నేను పాండవులనాడిన నిష్ఠుర వాక్యంబులు తలఁచితలఁచి యా దుష్టకర్మంబునకై పరితపించుచున్నాఁడను. సవ్యసాచి నిహతుండనైన నన్నెప్పుడు కందువో యదియె పునశ్చితి కారంభమని తలంపుము. భీముండెన్నఁడు దుశ్శాసను ఱొమ్ము వ్రచ్చి రుధిరంబుఁ బానంబుగావించు నదియే సూయుంబగు. పాంచాలురు భీష్మద్రోణుల నెన్నఁడు నడఁతురో యప్పుడే యజ్ఞావసానంబగు. భీముఁడు దుర్యోధనుని హతుఁజేయుటతో ధార్తరాష్ట్ర యజ్ఞము ముగియును. ధృతరాష్ట్రుని కోడండ్రు, వారల కోడండ్రు, భర్తలను బుత్రులను బోఁగొట్టుకొని దిక్కుమాలి శునకగృధ్ర కంకసమూహములం

బైనచోట గాంధారితోడఁ గన్నీట స్నానముచేయుటే యవభృథ స్నానంబు. విద్యావృద్ధులు వయోవృద్ధులునగు నీ క్షత్రియులందఱు నింట రోగాదులచే రిత్తచావు చచ్చుటకు నీవు కారణము కాకుము. ఈ రాజ సమూహమంతయుఁ బుణ్యక్షేత్రంబగు కురుక్షేత్రంబున శస్త్రములచే మరణించి పుణ్యలోకంబునకుఁ బోనిమ్ము. క్షత్రియు లందఱు వీరస్వర్గమునకుఁ బోవుమార్గమేకో యట్టి నీకోరిక నెఱవేర్చు కొనుము. లోకంబున నదులు పర్వతంబులు నుండువఱకు వీరకీర్తియు నుండును గాక. క్షత్రియ యశోధనంబు మహాభారత రణంబు శూరా చరణంబు వీరమరణంబు భూభారావతరణంబు బ్రాహ్మణులు సభలఁ జెప్పుకొందురుగాక. ధర్మజుని యుద్ధమునకుఁ దోడితెమ్ము. మన సంవాదము రహస్యముగ నుంచుము. అనినఁ గృష్ణుండు దరహాస భాసురాననుండై యిట్లనియె.

కర్ణా! రాజ్యలాభోపాయంబు నీకు రుచింపదయ్యెఁ గదా. నేను నీకుఁ బ్రాజ్యంబు పూజ్యంబు రాజ్యం బొసంగెద నన్నుఁ బాలింపనొల్లవుగదా అట్లైన మీకుఁ బ్రాణాపాయంబును మీదాయా దులకు రాజ్యదాయంబును సిద్ధమని నమ్ముము. విజయు కపిధ్వజంబు నిరాఘాటంబుగ నిరంకుశంబుగ నెగయుచున్నది. అది జయ సూచకము సుమ్మీ. ఎన్నఁ డాఖండలనందనుండు గాండీవకరుండై గుణంబు మీటుచు నేను దోలురథంబునందు నుండి మీకు రణ రంగంబునఁ గానవచ్చునో, యెప్పుడు జపహోమ తత్పరుండైన ధర్మ జుండు నిజసేనారక్షాదీక్ష వహించి దక్షుండై వీక్షణంబులవలన మీ క్షుద్రసేనను నాశుశుక్షణిపాలు సేయఁ బూనునో యెప్పుడు భీముఁడు దుశ్శాసనువక్షంబుఁ జీల్చి రక్తంబు పానంబుసేయునో యప్పుడే మీకుఁ గృతయుగము లేదు. త్రేతాయుగము లేదు. ద్వాప రము లేదు. కృతయుగంబున నందఱుఁ గృతకృత్యులు. కావున నర్థ కామంబులతోడ వారికిఁ బనియే లేదు. త్రేతయందు ధర్మంబు ప్రధా నంబు. కామార్థంబు లముఖ్యంబులు. ద్వాపరంబున నర్థకామంబుల ప్రధానంబులు. ధర్మం బముఖ్యంబు. మీరు చావ నున్నవార

కావునఁ గలియుగమందలి వారికివలె మీకు ధర్మార్థకామంబులు మూఁడును లేవు. ఇఁక మోక్షము మాటయేల? అనినఁ గర్ణు డిట్లనియె.

కృష్ణా! సమస్తమెఱింగియు నన్నేల నీవు మోహమున ముంపఁ జూచెదవు. భూలోకము నాశమగుకాలము సమీపించినది. దానికి నేను శకుని దుశ్శాసన దుర్యోధనులు కారణభూతులము. నిస్సందేహముగఁ గురుపాండవభండనంబు జరుగఁగలదు. నెత్తుట భూమి బురద గాఁగలదు. అందు రాజులు రాజపుత్రులు శస్త్రనిహతులై యమ లోకమునకుఁ బోవుదురు. చెడుకలలు పెక్కులు వచ్చుచున్నవి. అవ శకునములు మిక్కుటముగఁ గానవచ్చెడి. ధర్మరాజు జయించును. దుర్యోధనుండు పరాజయమొందును. ప్రాజాపత్య నక్షత్రంబైన రోహిణిని శనైశ్చరుఁడు పీడించుచున్నవాఁడు. కావునఁ బ్రజాక్షయంబు సిద్ధంబు. అంగారకుఁడు జ్యేష్ఠానక్షత్రంబునకై వక్రించి యనూరాధను సమీపించుటఁ జేసి మిత్రకోటి నశించు. కౌరవులకు మహావిపత్తు ప్రత్యాసన్నమైయున్నయది. రాహువు సూర్యునిఁ డాయుచున్నాఁడు. ఆకాశంబుననుండి మహాధ్వనితోఁ గంపసంయుక్తంబులై యుల్కలు రాలుచున్నవి. కరులు భయంకరధ్వనులు నించుచున్నవి. అశ్వంబులు మేపునీళ్ళు ముట్టక కన్నీరు కార్చుచున్నవి. ఈ శకునములు ప్రాణినాశక సూచకంబులు. భోజన మల్పంబైనను నరకరి తురగంబులు పురీషంబు మెండుగా విడిచెడి. ధార్తరాష్ట్ర సేనలయందుఁ గానవచ్చు నీలక్షణంబులఁగని బుద్ధిమంతులు కౌరవులకు నాశము నిశ్చయించుచున్నారు. పాండవసేనయందుఁ గరితురగాదులు ప్రహృష్టంబులై యున్నవి. మృగములు ప్రదక్షిణించుచున్నవి. కావునఁ బాండవులకు జయంబు సిద్ధంబు. మృగములు కౌరవసేన కప్రదక్షిణంబుగఁ బోవుచున్నవి, అశరీరి వాక్యంబులు కౌరవ పరాభవంబు దెలుపుచున్నవి. పుణ్యపక్షులైన నెమిళ్లు హంసలు బెగ్గురులు చాతకంబులు వెన్నెలపులుఁగులు పాండవసేన ననుగమించుచున్నవి. ఈఁగలు, గ్రద్దలు, రాబందులు, కొంగలు, డేగలు, రాక్షసులు, తోడేళ్లు

కౌరవుల వెంట వచ్చుచున్నవి. ధార్తరాష్ట్రసేన భేరులు వాయించినను జక్కఁగ మ్రోఁగవు. పాండవసేనయందలి తప్పెటలు వాయింపకయే మొరయుచున్నవి. కౌరవసేనాసముదయమందలి బావులందు నెద్దు అంకెలవంటినాదంబు లుద్భవించుచున్నవి. దేవతలు నెత్తురు మాంసము గురియించుచున్నారు. కౌరవసేనపైఁ బ్రాకారంబుతోడను, నగడ్తలతోడను వప్రతోరణంబులతోడను, గంధర్వనగరంబు కానవచ్చుచున్నది. ఆ గంధర్వనగరంబుపై సూర్యుని పరివేషంబు చుట్టియున్నది. ఉభయసంధ్యలందును నక్కలు ఘోరంబుగ వాపోవుచున్నవి. ఒంటికాలొంటిక న్నొంటిఱెక్కగల పక్షులు భయంకరారావంబులు నించుచున్నవి. నల్లనిమెడలు నెఱ్ఱనికాళ్లుగల పక్షులు సంధ్య కెదురు పోవుచున్నవి. ఇవన్నియుఁ బరాభవలక్షణములు. దుర్యోధనసేనాధిపులు తొలుత బ్రాహ్మణులను ద్వేషించుచున్నారు. పదపడి గురువులను నావల భక్తిమంతులయిన భృత్యులను ద్వేషించుచున్నారు. దుర్యోధనసేనా వారమందుఁ దూర్పు రక్తవర్ణముగను దక్షిణంబు శస్త్రవర్ణంబుగను, బడమర కాలని మంటిపాత్రము వర్ణంబుగను, నుత్తరము శంఖవర్ణముగను దిశలున్నవి. ధార్తరాష్ట్రులుండుచోట దిశలు మండుచున్నవి. ఈ యుత్పాతంబులవలన ధార్తరాష్ట్రులకు మహాభయంబు కలుగఁగలదు. ధర్మరాజు వేయి స్తంభముల మేడ సోదరులతో నెక్కినట్లు కలగంటిని. వారందఱు వెల్లపాగాలు, తెల్లవస్త్రములు ధరించి శ్వేతాసనము లలంకరించి యుండిరి. రక్తసిక్తంబైన భూమిని నీవు కృష్ణా! శస్త్రంబులఁ గప్పినట్లు కలగంటిని. యుధిష్ఠిరుండు నెముకలప్రోవుపై నెక్కి సువర్ణపాత్రంబున ఘృతపాయసంబు త్రావఁగంటిని. మఱియు నతండు భవద్దత్తంబైన భూమిని గ్రసించుచుండఁ గాంచితిని. దానిఫలమతండు భూచక్ర మేలఁగలఁడు. అట్టులే గదాపాణియై యున్నతపర్వతమధిరోహించి భీమకర్ముండైన భీమసేనుండు మహీతలంబు గ్రసింపఁ గంటిని. అతండు మమ్మునెల్లర వధింపఁగలండు. కృష్ణా! ధర్మమెచ్చట నచ్చట జయమని నేనెఱుంగుదును. తెల్లనిగజంబు నెక్కి సీతోడ

నర్జునుండు మహాకాంతితో వెలుంగుచుండెను. మీరు దుర్యోధనాది నృపాలురనెల్లరఁ బొరిపుచ్చఁగలరు. ఇందు సందియంబులేదు. నకుల సహదేవ సాత్యకులు శుక్లకేయూర కంఠత్రములను శుక్ల మాల్యాంబరములను ధరించి నరవాహనారూఢులై పాండురచ్ఛత్రధారులై యుండఁగంటిని.

దుర్యోధనుసేనయందుఁ గృపాశ్వత్థామ కృతవర్మలు మువ్వురు మాత్రము శ్వేతవసనచ్ఛత్రోష్ణీషంబులు ధరింపఁగంటిని. తక్కిన యందఱు రక్తోష్ణీషధారులు. భీష్మద్రోణులు ధార్తరాష్ట్రులు నేనును దక్షిణదిక్కుగ నొంటెలఁ గట్టిన వాహనంబులపైఁ బోవఁగంటిని. మేము శీఘ్రకాలమున కాలుమందిరంబున కరుగుట నిజము. నేనును దక్కిన రాజులు గాండీవాగ్నిని ప్రవేశింతుము. సంశయములేదు.

అనినఁ గృష్ణుం డిట్లనియె. కర్ణా! నామాటలు నీకు రుచింపనేరవయ్యెఁగదా. నీతివలెనుండు దుర్నీతి నీమనస్సునుండి తొలఁగకున్నది. మీరందఱు మ్రందుట నిస్సందేహము. అనినఁ గర్ణుఁ డిట్లనియె. రణమున మరణము కూరక యుంటినేని మరలనిన్నుఁ జూడఁగలను. ఇందుఁ గాకున్నఁ బురందరుమందిరంబుననైనఁ బునర్దర్శనంబు మనకుఁ గాఁగలదు. అని కృష్ణునిఁ గౌఁగిలించి యాయనచే సెలవు గొని రథంబు డిగి దీనమానసుండై మరలి తనవారలఁ గలసికొనియె. కృష్ణుండును సాత్యకితోడ శీఘ్రప్రయాణంబులఁ బాండవులఁజేర నుపప్లావ్యంబునకుఁ జని కౌరవసభయందు జరిగిన చరితంబంతయు సంక్షేపంబుగ వచించి తన నికేతనంబునకుఁ జనియె. ఆవల సూర్యుం డస్తమించుటయుఁ బాండవులు సంధ్యాది కృత్యంబులు నిర్వర్తించి యందఱు నేకసభ తీరి కృష్ణు రావించి రందు ధర్మనందనుండు వసుదేవ నందనుతో నిట్లనియె.

## కౌరవసభావృత్తాంతము శ్రీకృష్ణుండు పాండవులకు దెలుపుట.

కృష్ణా! కౌరవసభావృత్తాంతంబు సాంతంబుగ వినిపింపుము. సుయోధను పలికితివి? భీష్మద్రోణు లేమనిరి? మాతల్లిదండ్రులు గాం

ధారి ధృతరాష్ట్రులేమని భాషించిరి? పిన్నతండ్రి విదురుఁడేమ్మిపలికె? సభయందలి రాజులెట్లాడిరి? సవిస్తరంబుగఁ దెలుపుము. నీవే మాకు గురుఁడు, గతియు నర్థమును గావున నచ్చటి ముచ్చట లెల్లఁ దెలిపి మాకుఁ గర్తవ్యం బెద్ది పేర్కొను మనినఁ గృష్ణుం డిట్లనియె.

నేను తథ్యము పథ్యము హితమునైనపలుకులు పలికితినిగాని దురాత్ముండైన దుర్యోధనుం డవి గ్రహింపక పకపకనవ్వె. అంత భీష్ముండు కోపించి యతనితో నిట్లనియె.

ఓరీ దుర్యోధనా! కులక్షేమ మాలోచించి పలికెద. నామాటలువిని కులహితంబుఁ గావింపుమా. నా తండ్రియగు శంతనునకు నే నేకపుత్రుఁడను. ఏకపుత్రుం డపుత్రుం డను సుమతులవాక్యంబు పరిగ్రహించి యాయన వివాహమం దిచ్ఛగలవాఁడయ్యె. అది యెఱిఁగి నేనాయనకుఁ గాళియను పేరుగల సత్యవతిని దెచ్చి వివాహంబు గావించితి. ఆ సమయంబునఁ దండ్రినిమిత్తము కులనిమిత్తము నేను దుష్కర ప్రతిజ్ఞ కావించి యరాజును నూర్ధ్వరేతుఁడను నయి యిట్లు చరించుట నీ వెఱుంగుదువు. ఆయనపుత్రుండు విచిత్రవీర్యుండు నా సోదరుండు తండ్రి యనంతరము నే నాతని సింహాసనంబున నిలిపి యతని భృత్యుండనై చరించితి. అతనికిఁ గాశీరాజదుహితల స్వయంవరంబున హరించి తెచ్చి వివాహంబు గావించుట నీవు విన్నాఁడవకదా. తన్నిమిత్తంబున నాకుఁ బరశురామునకు ఘోర రణంబు వర్తిల్లె. పరశురామభీతిచే విచిత్రవీర్యుండు పౌరులచే విప్రవాసితుండయ్యె. ఈ కాలంబున నతండు నత్యంతదారాసక్తుం డగుట క్షయబాధచే మరణించె. రాష్ట్రం బరాజకం బయ్యె. దాన వఱపు ఘటిల్లె. ప్రజలు క్షుద్భయపీడితులై నన్ను జూచి యిట్లనిరి.

శంతనుకులవర్ధనా! ప్రజ లుపక్షీణించుచున్నవారు. మా కెల్ల నీవు రాజవై యీతిబాధ లణంపుము. మహాదారుణ వ్యాధులు ప్రజలఁ బీడించుచున్నవి. అనేకులు మరణించిరి. ప్రజ యల్పావశిష్ట మైనది. హతశేషంబగు దానినైన రక్షింపుము. ప్రజల ధర్మమునఁ

పాలించి రోగము లణంపుము. నీవు జీవించియుండ రాష్ట్రమిట్లు వినశింపఁదగదు. అని జను లాక్రోశించినను నాప్రతిజ్ఞఁ దలంచి మనస్సునఁ జలింపకుంటిని. అంత మాతల్లి కాళియుఁ బౌరులు పురోహితామాత్యులు నన్నే రాజవుకమ్మని బహువిధముల బోధించిరి. ప్రతీపవంశము నీవలన నశించుచున్నది. కావున మా మేలుకోరి పట్టాభిషిక్తుఁడవు కమ్ము. అని తల్లియుఁ బ్రాంజలియై వేఁడికొనెను గాని నాప్రతిజ్ఞవిధ మామెకు వినిచి నీనిమిత్తము నేనూర్ధ్వరేతస్కుఁడనై యరాజనై యున్నవాఁడను. కావున నన్నీభారము వహింప నియోగింపకుము. కౌరవవంశమున శంతనునందనుండనై జనించిన నేను నీకొఱకై కావించిన ప్రతిన నెట్లు వ్యర్థపఱుతును? సుతవత్సలా! నేను నీకు భృత్యుఁడను. దాసుఁడనుగాని భూంభర్తనుగాను. అని యామెను సమాధానపఱిచి భ్రాతృధారల యందుఁ గుమారుల నుత్పాదింప వ్యాసమహర్షుల వేఁడుకొంటిని. ఆయనయు వంశరక్షణార్థం బనుగ్రహించె. అప్పుడాయనవలన ముగ్వురుకుమారులు జనించిరి. నీతండ్రి యంధుఁడై కరణహీనుండగుటవలన రాజుగాఁడయ్యె. లోకశ్రుతుఁడు మహాత్ముఁడునగు పాండుఁడు రాజయ్యె. పాండుఁడు రాజగుటచే నాతని పుత్రులెట్లు రాజ్యార్హులు కాకుందురు? కావున న్యాయనా! కలహింపక వారితండ్రి యర్థరాజ్యము వారికిమ్ము. నేను జీవించియుండ మఱియొక్కఁడెవఁడు రాజ్యమేలఁగలఁడు? కావున నామాట నగౌరవింపకుము. మీ యిరువురసంధి కోరువాఁడను నేను. కుమారా! నీయందును పాండునందనులందునునాకుఁ దారతమ్యబుద్ధి లేదు. మీ యిరువురు నాకు సమానులు. జననీజనక విదురాభిప్రాయమిదియ. వృద్ధులగు మా పలుకులు వినుము. మా వచనంబుల శంకింపకుము. మిమ్మును సర్వపృథివిని నాశిల్లఁజేయకుము.

అనిన ద్రోణుం డిట్లనియె.

దుర్యోధనా! యథార్థము వచింతువినుము. పాండురాజు నరపతియు రాజునై యుండి యన్నయగు ధృతరాష్ట్రునకుఁ దమ్ముఁడగు విదురునకు రాజ్యమిచ్చి సింహాసనమునఁ గూర్చుండఁబెట్టి భార్యా

సహితుండయి వనములకేగెను. విదురుఁడు సణఁకవకలిగి భృత్యుని వలె వాలవ్యజనహస్తుఁడై ధృతరాష్ట్రుని సేవించుచుండె. ప్రజలును మున్ను పాండురాజును గొలుచునట్లు ధృతరాష్ట్రుఁ గొలువసాగిరి. ధృతరాష్ట్ర విదురులకు రాజ్యమును విడిచి పాండుఁడు సర్వధరాతలంబు చరించుచుండె. కోశవిచారణము దానభృత్యాన్వేక్షణ భరణాది సకలకార్యంబులు విదురుఁడే కావించుచుండె. అట్టి ధృతరాష్ట్రుని కుదయించిన నీవు కులభేదమేల కావింపనెత్తికొనెదవు? భ్రాతలతోడ రాజ్య మనుభవింపుము. నేను బిఱికినై కాని ధనాశచేఁగాని నీకీమాటలుచెప్పుచున్న వాఁడఁగాను. నాకు ధనంబొసంగినవాఁడు భీష్ముఁడు కాని నీవు గావు. నీవలన నాకు నర్థకాంక్షయు లేదు. జీవనోపాయము నీవలనఁ గోరువాఁడఁగాను. ఎచ్చట భీష్ముఁడో ద్రోణుఁడచ్చటనే యుండును. భీష్ముఁడు చెప్పినట్లు కావింపుము. పాండుపుత్రులకర్థరాజ్యమిమ్ము. మీకును వారికి నాచార్యకంబు సమంబుగఁ గావించితిని. నాకశ్వత్థామ యెట్టిఁడో యర్జునుఁ డట్టిఁడ. పెక్కు మాటలేల? ధర్మ మెందుఁగలదో జయమందేకలదు. భీష్మద్రోణుల వాక్యంబులువిని విదురుండు భీష్మమోముఁ జూచుచు నిట్లు భాషించె.

తండ్రీ! దేవవ్రతా! నావచనంబులు లెస్సవినుము. వినష్టమైన కురువంశమును నీవ మరల నుద్ధరించితివి. అట్టి నీవు నేనెంత విలపించినను నామాటలేల యుపేక్షించు చున్నాఁడవు. కులపాంసనుఁడైన దుర్యోధనుఁ డనువాఁ డీవంశమున నెవఁడు? అట్టివాని లోభబుద్ధిని నీవేల యనువర్తించెదవు? ఈ యనార్యుఁ, డకృతజ్ఞుఁడు, లోభోపహతచేతస్కుఁడు, ధర్మార్థదర్శియగు తండ్రివాక్యమును శాస్త్రమును నతిక్రమించుచున్నవాఁడు. దుర్యోధనుఁడు నిమిత్తముగఁ గౌరవులెల్ల నశింతురు. మహారాజా! వీరందఱు నశింపకుండఁజేయుము. చిత్రకారుఁడు చిత్రములవలె నీవు నన్ను ధృతరాష్ట్రునివలె స్థాపించితివి. తానువ్రాసిన చిత్రములఁ దానేచెఱుచు చిత్రకారునివలెఁ దాను సృష్టించిన భూతములఁ దానేసంహరించుప్రజాపతివలె మమ్మేల నశింప జేసెదవు? కులక్షయము నీకన్నులయెదుల నగుచుండ నుపేక్షింప

కుము. నాతోఁడను ధృతరాష్ట్రుతోఁడను వనములకుఁ గదలుము. అటు గాదేని మోసబుద్ధిగల యీ దుర్యోధనుబంధించి వధించి రాజ్యమును పాండవులకిమ్ము. రాజశార్దూలా! కులపాండవ క్షయమను మహానర్థకము దాపరించుచున్నది. అనుగ్రహింపుము. అని శోకబాష్పపరిప్లుత నేత్రుండై వెచ్చనూర్చుచు విదురుఁడు విరమించుటయుఁ గులనాశభీత యగు సుబలరాజసుత గాంధారి పాపమతియు నృశంసుఁడు నగు దుర్యోధనుని రాజసమక్షమునఁ గోపంబునఁ నిట్లనియె.

ఓరీ పాపామాత్య సహితుఁడా! యీ సభయందుండు రాజులు మహర్షులు తక్కటివారు విన నీకోపము వచించెద వినుము. కురువంశ రాజ్యము క్రమాగతభోజ్యము. ఇది మన వంశధర్మము. పాపబుద్ధివియు, నతినృశంసకర్ముఁడ వగు నీవు కౌరవరాజ్యంబు నాశము సేయ సమకట్టితివి. నీ తండ్రి ధృతరాష్ట్రుఁడు పినతండ్రి విదురుఁడు జీవించియుండ నీకెట్లు రాజ్యము లభించును? ఆ యిరువురైనను భీష్ముఁడు జీవించియుండువఱకు కాయునకుఁ బరతంత్రులే. అయినను ధర్మజ్ఞతచేత గాంగేయుఁడు రాజ్య మభిలషించినవాఁడు కాఁడు కావునఁ బాండురాజు రాజయ్యె. అతని రాజ్యమున కాతని పుత్రు లర్హులు గాని యితరులు గారు. రాజ్యము తక్కసమస్తము పైతామహంబు గావున వారి పుత్రులు వారి పౌత్రులు ననుభవింప నర్హులు. వంశధర్మానుపాలనమనస్కులగు మే మెల్లరము దేవవ్రతుండు చెప్పినట్లు వర్తించువారము కావున నాయనయానతిఁ బూని ధృతరాష్ట్ర విదురు లిది వచింతురు గాక. ఈ వంశక్షేమము గోరువారందఱు నిట్లు చెప్పవలయును. ధర్మంబుఁ బురస్కరించుకొని ధర్మతనూజుండు న్యాయాగతంబైన యీ రాజ్యమును గాంగేయ ధృతరాష్ట్ర చోదితుండై దీర్ఘకాలముఁ బాలించునుగాక.

అని గాంధారి వచించి విరమించిన ధృతరాష్ట్రుండు పుత్రు దిక్కు మొగంబై యిట్లనియె. మన వంశవృత్తంబు వచించెదవినుము. తండ్రి యను గౌరవంబు నాయెడ నీకుఁ గలుగునేని నావచనంబుఁ బాలింపుము. మన చంద్రవంశమున యయాతియను ధరాపతి జనించె.

ఆయన కేవురు పుత్రులు. పెద్దభార్య దేవయాని తనయుండు యదువు జ్యేష్ఠుఁడు. కనిష్ఠభార్య శర్మిష్ఠనందనుండు పూరువు కనిష్ఠుఁడు. ఈ పూరువే మనవంశమున కాదిపురుషుండు. పిత్రాజ్ఞ నుల్లంఘించుకతన దేవయాని తనూజాతులందఱు రాజ్యార్హులు గారైరి. జనకాజ్ఞఁ బాలించిన పూరువు ధరానాథుండై సింహాసనాసీనుఁడయ్యె. ఈ విధంబుగ జ్యేష్ఠపుత్రుండు రాజ్యపదభ్రష్టుండై కనిష్ఠుండు సింహాసన యోగ్యుడయ్యె. కావునఁ బెద్దవాఁడుండఁ జిన్నవాఁడు రాజగుటయుఁగలదు. అట్టులే మా ప్రపితామహుఁడు ప్రతీపుఁడు. ఆయనకు మువ్వురు కుమారులు. అందు దేవాపి జ్యేష్ఠుఁడు. బాహ్లికుఁడు రెండవవాఁడు. మా పితామహుండు శంతనుండు మూఁడవవాఁడు. దేవాపి కుష్ఠవ్యాధిపీడితుం డగుట నతఁడు నృపాలుఁ డగుటకుఁ బ్రజలు సమ్మతింపరైరి. హీనాంగుండు రాజ్యార్హుండుగాఁడు. కావున ధర్మాత్ముండును సుశీలుఁడును భ్రాతృవత్సలుఁడు నగు జ్యేష్ఠపుత్రునకు నభిషేకము లభింపమికి విషాదగ్రస్తుడై ప్రతీపుఁడు పుత్రశోకంబున మరణించె. దేవాపి వనంబులకుఁ జనియె. బాహ్లికుండు జనకుని సోదరులను విడిచి సంపత్సమృద్ధంబైన మేనమామయింటికిఁ జనియె. ఆయన యనుమతి శంతనుండు రాజయ్యె. అటులే నేనును హీనాంగుఁడనగుట జ్యేష్ఠుఁడనయ్యు రాజ్యమువలన భ్రంశితుండనైతిని. మతిమంతుండైన పాండుండు రాజయ్యె. ఈ విధంబునఁ బాండుఁడు కనిష్ఠుడయ్యుఁ బ్రాప్తరాజ్యుండయ్యె. ఆయన వెనుక నాయన పుత్రులు రాజ్యార్హులు. రాజ్యభాగము నాకే లేకుండ నీకెట్లు రాఁగలదు? అరాజపుత్రుఁడ వస్వామి వగునీవు పరస్వము హరింపఁ గోరెదవు. యుధిష్ఠిరుండు రాజపుత్రుండు మహాత్ముండు కావున న్యాయాగత రాజ్యం బతనిదియ. అతఁడే కురుకులభర్తయు శాస్తయు. అతండు సత్యసంధుండు. అప్రమత్తుండు. శాస్త్రనిష్ఠుండు. బంధుజనహితాభిలాషి, ప్రజాప్రియుఁడు. సుహృత్తు. అనుకంపి. క్షమాదమతితిక్షార్జవంబులు సత్యవ్రత మప్రమత్తత యిట్టి రాజగుణంబు లతనియందుఁ గలవు. నీవో యరాజపుత్రుఁడవు. అనార్యవృత్తుఁడవు. లుబ్ధుండవు బంధువుల పట్ల

పాపబుద్ధివి. పరులకుఁ గ్రమాగతంబైన రాజ్యంబు హరింపఁ జూచె డవు. కావున నర్ధరాజ్యంబు పాండవుల కిమ్ము.*

అని భీష్మద్రోణ విదుర గాంధారీ ధృతరాష్ట్రులు చెప్పిన నవ మతియగు దుర్యోధనుండు క్రోధరక్తలోచనుండై దిగ్గన సభవిడిచి పోయెను. క్షీణాయువులు రాజులు నతని వెంటఁజనిరి. వారింగని నేఁడు పుష్యము. మీరు యుద్ధసన్నద్ధులై కురుక్షేత్రంబున కరుఁగుఁడనియె. వారట్లు కావించిరి. నేను దొలుత సామవిధానంబున మంచిమాటల బోధించితి. ఆవల నతనితో నీ తండ్రియే రాజుగానుండనిమ్ము ఆయ నయు భీష్మవిదురులు చెప్పినట్లువిని పాండవులు భృత్యులట్లు వారలఁ గొలిచి యుండువారు. మనుగడకై యైదూళ్లిమ్ము. అనిన దానికినినతఁ డీయకొనడయ్యె. ఇట్లుదానోపాయంబును వ్యర్థంబగుటయు వారిలో వారికి భేదంబు పుట్టింపఁ బలుపోకలఁ బోయితి. అదియు మోఘ

* "రాజ్యస్వత్వవిషయమున నించుకేనియు హక్కు లేని పాండవులపక్షమున లోకము చేరియున్నది." అని యొకానొకరు పాండవు లర్ధరాజ్యమునుగోరుట యధర్మమని వ్రాసిరి. ఈ యధ్యాయములు వారివాదము సరిగాదని స్థాపించు చున్నవి. ధర్మనందనుఁడై ధర్మరాజని పేరు పెట్టుకొన్న ధర్మరాజే ధనాశచే నధర్మవాదము చేయఁబూనినను ధర్మసంస్థాపనార్థము పుట్టిన కృష్ణుఁడును ధర్మ మూర్తులైన భీష్మద్రోణ కృప విదురాదులును నారదాది మహర్షులును నధర్మపక్ష మేలపలికియుందురు! తుదకు గాంధారియు నీవే జయింపుమనక ధర్మమున్నచోట జయముండునని కొడుకునేల దీవించియుండును ?

కావున "భీష్మేణ రాజా కౌరవ్యో ధృతరాష్ట్రోభిషేచితః
అర్థధర్మ ప్రధానాసు విద్యాసు వివిధాసు చ
గతః పారం యథాపాండు స్తథా సేనాపతిః కృతః"

అను శ్లోకములు ప్రక్షిప్తములని మూలముననే కుండలీకరింపఁబడినవి.

శ్లో. ధృతరాష్ట్రస్త్వచక్షుత్వా, ద్రాజ్యం న ప్రత్యపద్యత
పారసవత్వాద్విదురో, రాజాపాండుర్బభూవహ"

అను శ్లోకము సప్రమాణమనియు లోకము పాండవపక్షము చేరుట న్యాయ మనియు నెఱుంగనగును.

మయ్యె. వారు సంగ్రామకౌతుకంబునఁ గురుక్షేత్రంబునకుఁ బయలు నించి గాంగేయు సేనానాయకుఁ గావించికొని యున్నవారు. ఆవల నీ యిష్టముచొప్పునఁ బ్రవర్తింపుము. అనిన ధర్మతనయుండు తమ్ములతో నాలోచించి యుద్ధము కర్తవ్యంబుగ నిశ్చయించి తనయేడక్షౌహిణులతోడఁ గురుక్షేత్రంబునకుఁ బయనించె.

---

## నూతకృష్ణలీల.

### భగవద్గీత ప్రథమాధ్యాయము.

### — అర్జునవిషాదయోగము. —

శ్రీకృష్ణుండు తాను సారథ్యముచేసెదనని యర్జునున కొసంగిన వాగ్దానము చొప్పున నర్జును దేరెక్కించుకొని రణరంగంబునకు వచ్చెను. అప్పుడు దుర్యోధనుపక్షమువా రొకప్రక్కను ధర్మరాజుపక్షమువా రొకప్రక్కను గురుక్షేత్రమందుఁ గట్టెదురుగఁ నిలఁబడి యుద్ధమున కుపక్రమించి యొకరిపై నొకరు బాణంబుల నైన నాయత్తపడుచుండ నర్జునుండు విల్లెక్కుపెట్టి కృష్ణుం జూచి యిట్లనియె.

అచ్యుతా! రెండుసేనలనడుమ నా రథంబు నిలుపుము. యుద్ధార్థులై వచ్చిన వారినెల్లఁ జూడవలయు. అంతియగాక దుర్బుద్ధియగు దుర్యోధనునకుఁ బ్రియంబు చేయఁగోరి యుద్ధమొనర్ప వచ్చిన వారిలో నెవ్వరితో నేను యుద్ధ మొనర్పవలయునో యదియును జూడఁదగును. అనినఁ గృష్ణుం డుభయసేనల నడుమ భీష్మద్రోణాదుల కెదురుగ రథంబు నిలిపి యర్జునా! యీకౌరవులనెల్లఁజూడుము. అనిన నతండు రెండుపక్షంబుల వారిని గాంచఁజూచెను. ఇట్లు చూచి రెంటియందుఁ దండ్రులను దాతలను గురువులను మేనమామలను సఖులను మామలను తనకు మేలొనర్చినవారిని జూచెను. ఇట్లు యుద్ధార్థమై గుమిగూడిన సర్వబంధువులనుజూచి మనంబునమిక్కిలి కనికరంబు పొడమ దుఃఖార్తుఁడై యర్జునుం డిట్లనియె.

రుక్మిణి—అప్పా నీవు చెప్పఁబోవునది భగవద్గీతకదా.

తండ్రి—అవును.

రుక్మిణి—ద్రౌపదగా నీవు చెప్పినదానికంటె సులభముగామాకర్థమగు నట్లు చెప్పెదనని నీవు చెప్పినమాట జ్ఞప్తియందున్నదా?

తండ్రి—ఉన్నది. అట్లే చెప్పెదనుగాని కొన్నిచోటుల పలుకులు సులభముగా నుండినను విషయము మీకు గ్రహింప కష్టముగా నుండును. అట్టి సందర్భముల మీరడిగెదరేని విశదముగఁ జెప్పెదను. తరువాత వినుఁడు.

అర్జునుఁడు కృష్ణా! యుద్ధముసేయఁ గోరివచ్చిన యీనాబంధువులు మొదలగువారిని జూచిన నాయవయవములు బిగువుచెడి శిథిలము లగుచున్నవి. ముఖ మెండిపోవుచున్నది. నా శరీరము వణఁకుచున్నది. పులకరింతయుఁ బుట్టుచున్నది. గాండీవము చేతినుండి జారిపోవుచున్నది. దేహమంతయు దహింపఁ బడుచున్నది. నా మనసు నిలుకడచెడి తిరుగుడుపడుచున్నది. రథముపై నిలుచుటకును నాకు సామర్థ్యము తప్పిపోవుచున్నది. కేశవా! నా కన్నియు నవశకునములే కానవచ్చుచున్నవి. యుద్ధరంగమున బంధులనెల్లఁజంపి పిమ్మట పొందెడి లాభమేదో నాకుఁ దెలియలేదు. కావునఁ గృష్ణా! నేను జయమును గోరను. రాజ్యమును గోరను. దానివలనఁ గలుగు సుఖములను గోరను. రాజ్యము లభించిన నేమి? భోగము లమరిన నేమి? గోవిందా! బ్రతికియు ఫలమేమి? చెప్పుమా. ఎవరినిమిత్తమై రాజ్యము భోగములు సుఖములు కోరుచుందుమో యట్టి యాచార్యులు తండ్రులు కొడుకులు తాతలు లోనగు వారెల్ల వీరే ప్రాణములను ధనమును వదలిపెట్టి యిచ్చట యుద్ధమునకై వచ్చియున్నారు. వీరు నన్నుఁ జంపినఁ జంపనిమ్ము. ముల్లోకముల ప్రభుత్వ మమరినను నేను వీరిని జంపను. ఇఁక పీరాజ్యము నిమిత్తమై చంపుదుననుట యేటిమాట. జనార్దనా! యీ ధార్తరాష్ట్రులను జంపిన మాకు రాఁగల సంతోష మేదిగలదు? వీరు మా యిండ్లకు నిప్పుపెట్టిన వారును

మాకు విషము పెట్టిన వారును, శస్త్రములచేఁ జంపఁజూచిన వారును, మా ధనము నపహరించిన వారును, మా యిల్లాలి మానము దీసిన వారును, నయిన నగుదురుగాక. వీరిని జంపుటవలన మాకుఁ బాపమే రాఁగలదు. కీడుచేసిన వారికి మాఱు కీడు చేయవలయునని ప్రమాణముకలదా ? కావున బంధుయుక్తులైన దుర్యోధనాదులఁ జంపఁజాలము. ఏలందువా మా వారిని జంపి మేమెట్లు సుఖింపఁగలము ? లోభముచే వికలమైన మనస్సులుగల వీరు కులనాశము చేయుట వలనను, మిత్రద్రోహము వలనను గలుగు పాపమును దెలిసికొన లేకుందురు గాక ! అటులని కులక్షయము చేయుట వలనఁ గలుగు పాప మిట్టిదని తెలిసిన మనము పాపము నెట్లు చేయవచ్చును ? కులక్షయమువలన సనాతనములైన కులధర్మములు నశించును. కులధర్మములు నశింపఁగా నా కులమంతయు నధర్మముపాలగుచున్నది. కుల మధర్మము పాలగుటచే కులస్త్రీలు శీలము విడిచి చెడుచున్నారు. స్త్రీలు చెడిపోవ వర్ణసంకరము కలుగుచున్నది. ఈసంకరము కులములను జెఱచిన వారిని, నట్లు చెడినకులముల వారిని, నరకములపాలొనర్చుచున్నది. అంతేకాక వీరికిఁ దిలోదకములను విడుచువారును పిండముల నిడువారును లేక యధోలోకములఁ బడుచున్నారు. కులఘ్నులు వర్ణసంకరము కావింపఁగా దానివలనఁ గలుగు దోషములు సనాతన వర్ణధర్మములను వంశధర్మములను నిర్మూలించుచున్నవి. కులధర్మములు నశించిన మనుష్యులు శాశ్వతముగా నరకమునందే వసింతురని పెద్దలు చెప్పుదురుగదా. అయ్యయ్యో యెంతచెడ్డమైన ముందాలోచన లేక రాజ్యమునందు సుఖమునందుఁ గల యాశచే బంధువధ యెంతటి పాపకార్యము చేయ యత్నించితిమి. వారు నన్ను బాణములఁ గొట్టినను నేను బదులుగొట్టను. శస్త్రమునుగూడ చేతఁ బట్టను. ఇట్టె నన్ను వారు చంపిరేని యదియే నాకు మిక్కిలి క్షేమము. అని శరచాపముల వదలిపెట్టి దుఃఖించుచు రథముమీఁద నర్జునుఁడు కూలఁబడెను.

అర్జున విషాదయోగము సంపూర్ణము.

## ద్వితీయాధ్యాయము.

### —♦ సాంఖ్యయోగము. ♦—

ఇట్లు బంధువులందలి కనికరముచే వారిని జంపవలసివచ్చెం గదా యను దుఃఖమువలనఁ గన్నీరు కార్చుచు శోకించుచున్న యర్జునుఁ జూచి శ్రీకృష్ణమూర్తి యిట్లనియె. ౧

అర్జునా! యార్యులగు వారికిఁ దగనిదియు, స్వర్గ సుఖమునుండి తొలఁగించునదియు, నీకపకీర్తి కరంబును, నగు నీమనోవ్యాకులత్వము సంకట సమయంబున నీకెట్లు కలిగెను? అధైర్యపడకుము. నీవట్టి వాని కిది తగినదికాదు. నీచమైన మనోదౌర్బల్యమును వదలి లెమ్ము. అనిన నర్జునుం డిట్లనియె. ౩

అయ్యా కృష్ణా! భీష్ముఁడు ద్రోణుఁడు లోనగు పెద్దలు పూలచేఁ బూజింపఁ దగినవారు. అట్టి వారిని గఱకు బాణములచే నెట్లు గొట్టుకును? మహానుభావులైన పెద్దలను జంపక లోకమున భిక్షమెత్తి జీవించుటైనను మేలుగాని ధనమునుగోరి గురువులఁ జంపి యీలోకమున నెత్తుటికూడును దిని యెట్లు నెమ్మదిగ నుండఁగలము? యుద్ధము చేసి రక్తాన్నము దినుట మేలో యుద్ధముచేయక భిక్షాన్నము తినుట మేలో దెలియదు. మేమే జయింతుమో వారే జయింతురో యెట్లు నిశ్చయింప వచ్చును. ఎవరిని జంపి పిదప నా దుఃఖమున బ్రతుకలేమో యట్టి దుర్యోధనాదులు భీష్మద్రోణాదులు వీ రే చావునకుఁ దెగించి యెదుట నిలిచి యున్నారు. ౬

కృష్ణా! లోభదోషముచేతఁ జెడిన మనస్సు కలవాఁడను, ధర్మ మిట్టిదని నిశ్చయింప శక్తిలేనివాడను, నగు నేను నిన్నుఁ బ్రార్థించు చున్నాను. ఇప్పుడు మేమెట్లు ప్రవర్తించుట శ్రేయస్కరమో చెప్పుము. నీకు నేను శిష్యుఁడను. నీ యాశ్రితుఁడనైన నన్ను శాసింపుము. ౭

నిష్కంటక రాజ్యమైనను, నింద్రపదవియైనను నింద్రియముల శోషింపఁజేయు నా దుఃఖమును బోఁగొట్టఁ గలదిగ నాకుఁ దోఁప

లేదు. కావున నేను యుద్ధమును జేయను. అని మాఱుమాటాడక యర్జునుఁ డూరక కూర్చుండెను. అప్పుడు రెండు సేనలనడుమ దుఃఖించు నతనిం జూచికృష్ణుఁడు పరిహసించు వానివలెనై యిట్లనెను.

అర్జునా! వేనినిమిత్తము నీ వేడువరాదో యట్టి వానికై యేడ్చుచున్నాఁడవు. మాటలుమాత్రము బుద్ధిమంతునివలెఁ జెప్పుచున్నావు. పండితులగు వారు ప్రాణములు పోయిన వారికైగాని ప్రాణములు పోనివారికైగాని శోకింపరు. నే నొకప్పుడైన లేని వాఁడను గాను. నీ వొకప్పుడును లేకుండినది లేదు. ఈ రాజులందఱును లేకుండిరను నదియు లేదు. మనమందఱ మిఁకమీఁద నెప్పుడేని లేకుందుమను నదియును లేదు. ఈ దేహమునం దాత్మకు బాల్యము యౌవనము ముసలితనమును ననునవియెట్లు కలుగునో యట్లే వేఱొక శరీరమును కలుగుచున్నది. (బాల్యము మొదలైన యవస్థలు దేహమునకే గాని యాత్మకు లేవు. బాల్యము వదలి యౌవనము వచ్చినప్పుడును నా యాత్మమాఱక యేకవిధముగ నెట్లుండునో యట్లే యీ దేహమువదలి వేఱొక దేహము ప్రాప్తించినప్పుడును నాత్మమాఱక యేకవిధముగనుండును) ఈ విషయమునబుద్ధిమంతులు మోహ పడరు. శబ్దము, స్పర్శము,రూపము, రసము, గంధము, అను విషయములును వానికి నాశ్రయములైన యాకాశము, వాయువు, అగ్ని, జలముఁ భూమి యనెడి పంచభూతములును జెవి, కన్ను, ముక్కు చర్మము, నాలుక యనెడి యింద్రియములతోఁ గలసి దేహమునకుఁ జలివేఁడి మొదలగు సుఖదుఃఖముల నిచ్చుచున్నవి. ఇవి వచ్చుచుండును బోవుచుండును గాని నిలుకడగ నుండునవి కావు. కావున నివి కలిగినపుడు పరితాపపడక యోర్చుకొని యుండుము.

చలి యొకని కొకవేళ సుఖమును మఱియొకవేళ దుఃఖమును గలిగించుచుండును. ఏకకాలమందే చలి యొకనికి సంతోషమును, మఱియొకనికి దుఃఖమును గలిగించును. కావున సుఖదుఃఖములఁ గలిగించు శక్తి చలి వేఁడిములందు లేదు. మనస్సు దేని నెప్పుడెట్లు

గ్రహించిన నట్లది తోఁచుచుండును. కావున సహనము గలవాని కవి సుఖదుఃఖములను గలిగింపవు. ౧౮

సుఖము దుఃఖము సమానములుగ గ్రహించుచు సుఖము వచ్చినప్పుడు పొంగక దుఃఖము వచ్చినపుడు కుంగక యుండుటచే నెవ్వాని నివి బాధపెట్టఁ జాలవో యట్టి ధీరుఁడు మోక్షమునకుఁ దగినవాఁడు. ౧౯

లేని దెప్పటికి లేని దేగాని కలుగుట యనునది దానికిఁ గలుగదు. కలదనునది యెప్పటికి నిలుకడ నుండునే కాని లేదనునది దానికిఁ గలుగదు. కావున సత్తయిన జీవున కొకప్పుడు లేకుండుట యనునది కలుగదు. అసత్తయిన దేహము సర్వదా మాఱుచుండునే కాని నిలుకడగ నుండదు. ఈ రెంటి తారతమ్యము యథార్థ జ్ఞానము కలవారెఱుఁగుదురు. ౧౬

ఏది యీసర్వమునందు వ్యాపించియున్నదో యట్టియాత్మ నాశములేనిదని యెఱుంగుము. యెట్టిమార్పును లేక యేకవిధముగ నుండు దీనిని నాశముచేయు శక్తిమంతుఁ డెవ్వఁడును లేఁడు. ఈ దేహములు నాశ మగునవి. ఈదేహములందు వసించు జీవుఁడు నాశములేనివాఁడు. సర్వదా నుండువాఁడు. నాశముకానివాఁడు. మనజ్ఞానముచేఁ దెలియఁబడనివాఁడు. కావున నర్జునా! యుద్ధమునకు లెమ్ము. ఈజీవుఁడు కొట్టునని తలఁచు వాఁడును, గొట్టఁబడునని తలచువాఁడును, వీరిరువురు తెలియనివారు. ఇతఁడు కొట్టను గొట్టఁడు, కొట్టఁబడను గొట్టబడఁడు. ఈ జీవాత్మ పుట్టువాఁడు కాఁడు. చచ్చువాఁడును గాఁడు. ఒకప్పుడు లేకుండి మఱి యొకప్పుడు కలిగెడివాఁడు కాఁడు. ఇతనికిఁ బుట్టువు లేదు. నాశము లేదు. ఎల్లప్పుడు నుండువాఁడు. పురాతనుఁడు. శరీరము నశించుచున్నను దాను నశింపక యుండువాఁడు. ౨౦

ఈజీవుఁడు నాశము లేనివాఁడనియుఁ, బుట్టువు లేనివాఁడనియు, క్షయము లేని వాఁడనియు, నిత్యుఁడనియుఁ, నెవ్వఁ డెఱుఁగునో యట్టి పురుషుఁ డెట్లు చంపును? ఎవ్వనిఁ జంపును? ఎవనిఁ జంపించును? ౨౧

చినుఁగుటచే ధరింప యోగ్యముగాని వస్త్రములను వదలి మనుష్యుఁడు వేఱు క్రొత్తవస్త్రముల ధరించునట్లు జీవుఁడు ముదిమి రోగములు మొదలైన కారణములచే జీర్ణములై వాసయోగ్యములు గాని దేహములను వదలి క్రొత్తశరీరములను ధరించుచున్నాఁడు.

ఆయుధము లీ జీవుని నఱుకఁజాలవు. అగ్ని దహింపలేఁడు. నీళ్లు వీనిని జివుకఁ జేయవు. వాయు విగిరింపదు. కాఁబట్టి యితఁడు ఛేదించుటకు, దహించుటకుఁ, జివికించుటకు, శోషింపించుటకు, సాధ్యపడనివాఁడు. ఇతఁడు పుట్టుట, కలిమి, పరిణామము, పెరుఁగుట, తగ్గుట, నశించుట యను నాఱువికారములు లేక యున్నికాలము లందు నేకవిధమున నుండువాఁడు. సనాతనుఁడు. ౨౪

ఈజీవుఁ డిట్టివాఁడని యింద్రియములచే నెఱుఁగరానివాఁడు. ఇట్టివాఁడని తలంపునకు రానివాఁడు. వికారములు లేనివాఁడు. కావున నీజీవుఁడిట్టివాఁడని తెలిసికొంటి వేని నీవుశోకింపఁగారణముకలుగదు. ౨౫

ఒకవేళ నీ వీ జీవుఁడు నిత్యముగాఁ బుట్టెడి వాఁడనియు, నిత్యముగాఁ జచ్చెడివాఁడనియుఁ, దలంచెద వేని నప్పుడును నీవు శోకింపఁ గారణము లేదు. ఏలన, ౨౬

పుట్టినవి చచ్చుట నిశ్చయము. చచ్చినవి పుట్టుట నిశ్చయము. కావున నివారింపరానిదాని విషయమున నీవు శోకింపరాదు. మను ష్యాది సమస్తభూతములు మొదలెట్టు లుండెనో తెలియరాదు. నడిమిస్థితియందుఁ దెలియవచ్చుచున్నవి. నాశమైన తరువాతను దెలియరావు. కాఁబట్టి నీవేల విలపించెదవు? ౨౮

ఒకానొకఁ డాత్మను నద్భుతవస్తువువలెఁ జూచును. అట్లులే మఱియొకఁ డద్భుతవస్తువుం గుఱించి చెప్పునట్లు చెప్పును. వేఱొక డాశ్చర్యవస్తువుం గుఱించి వినునట్లు వినునుగాని యొకఁడును వినియును దెలిసికొన లేఁడు. ౨౯

అన్నిటి దేహములు నాశము లగుచున్నను దేహమునందలి జీవుఁడుమాత్రము నిత్యముగాఁ జెడకయుండును. అట్టి భూతము లిట్టివిగా నెఱింగి నీవు దేనినిగూర్చియు శోకింపకుము. ౩౦

అంతియకాక స్వకీయమైన క్షత్రియధర్మమునుబట్టి యాలోచించినను నీమనస్సు చలింపఁ గారణములేదు. క్షత్రియునకు ధర్మయుద్ధమునకంటె మేలిచ్చునది వేఱొకటిలేదు. ౩౧

స్వప్రయత్నములేక తనంతటఁదానే లభించినదియు, స్వర్గద్వారములు తెఱవఁజేయునదియు, నగునిట్టి యుద్ధము పుణ్యము చేసిన క్షత్రియులకు లభించును. ౩౨

నీ వీ ధర్మయుద్ధము చేయకపోయెదవేని దాని వలన స్వధర్మమును గీర్తిని విడిచి పాపము పాలయ్యెదవు. ౩౩

నీ యపకీర్తిని లోకులు శాశ్వతముగఁ జెప్పుకొందురు. గౌరవముగలవానికి నపకీర్తికంటె మరణమే మేలు. నిన్నింతవఱకు నెంతో గౌరవదృష్టిఁ జూచుచుండిన యీ మహారథులందఱు నీవు భయపడి యుద్ధమునుండి పరుగెత్తితివని తలఁచి నిన్నుఁ జులకనగఁ జూచెదరు. అంతియకాదు. నీ శత్రువులు నీ సామర్థ్యమును నిందించుచు ననరాని మాటలనెల్ల నిన్ననెదరు. ఇంతకంటె దుఃఖకరమైనది వేఱొండు గలదా ? శత్రువులచేఁ జచ్చితివా స్వర్గముఁ బొందెదవు. గెలిచితివా రాజ్యము ననుభవించెదవు. కావున యుద్ధము చేయవలయునని నిశ్చయించుకొని లెమ్ము. (వీరినందఱి హింసించుటచేఁ బాపము వచ్చునని భయపడకుము.) సుఖదుఃఖములను లాభాలాభములను జయాపజయములను సమముగఁ జూచుచు గులధర్మము చేయఁదగినది కావునఁ జేసెద నను తలంపుతో యుద్ధము చేయుచుండుము. ఇట్లు చేసితివా నిన్నుఁ బాప మంటదు.

ఇంతవఱకు నీకు సాంఖ్య మనఁగా బుద్ధిచేఁ దెలిసికొనఁదగిన యాత్మతత్త్వజ్ఞానము చెప్పితిని. ఇఁక యోగమనఁగా నాత్మజ్ఞానపూర్వకంబగు మోక్షసాధక కర్మముల నాచరించు తెలివినిగూర్చి చెప్పెదను. ఈ తెలివితోఁగూడిన వాఁడవైతివేని నీవు కర్మబంధముల వలన విడివడుదువు. ఈయోగము నారంభించితివేని ఫలము కలుగకపోదు. కొంత చేసివిడిచినను దోషములేదు. ఈ ధర్మ మెంత కొంచె మాచరించినను సంసారభయమునుండి తొలఁగించును.

మోక్షేచ్ఛ గలవానికి నాత్మజ్ఞానవిషయమున నిశ్చయమైన బుద్ధి యొక్కవిధముగనే యుండును. మోక్షేచ్ఛ లేక కామ్యకర్మముల నాచరించు వారిబుద్ధు లనేకశాఖలు కలిగి యంతములేనివై యుండును. ౪౧

వివిధఫలములకు సాధనముంగూర్చి చెప్పెడి వేదవాక్యముల యందాసక్తిగలవారును, స్వర్గఫలమే కాని యంతకంటె నుత్తమఫలము లేదనువారును, గోరికలు గోరుటయే స్వభావముగాఁ గలవారును, స్వర్గమునందాసక్తులు నగు నల్పజ్ఞానులు జన్మమనెడి కర్మఫలము నిచ్చునదియు, భోగమును నైశ్వర్యమును గలిగించు కర్మవిశేషములు పెక్కులు గలదియుఁ, దరచిన నిలువక పైపై మెఱుఁగులు గలదియు నగు వాక్యమును జెప్పెదరు. ఆ మాటయందు శ్రద్ధగలిగి భోగైశ్వర్యములందాసక్తిగలవారికి నాత్మజ్ఞానమున నిశ్చయ స్వభావము గల బుద్ధి కలుగదు. ౪౪

వేదములు సత్త్వరజస్తమోగుణములు గలసి యుండువారికిఁ దగిన స్వర్గాది విషయములను జెప్పెను. నీ వొండొంటితోఁ గలసిన యీ మూఁడుగుణములను వృద్ధి పొందించుకొనక యెల్లప్పుడు సత్త్వగుణము మాత్రము వృద్ధి నొందించుకొనుము. మఱియుఁ జలివేఁడములు, లాభనష్టములు, లోనగు ద్వంద్వములచేఁ బీడింపఁబడని మనస్సు కలవాఁడవును, లేని పదార్థము సంపాదించుట, లభించిన దానిని గాపాడుట యను రెండు కార్యములు లేని వాఁడవును నాత్మజ్ఞానము కలవాఁడవు నగుము. ౪౫

నీటిచే నిండిన బావి పురుషున కెట్టి ప్రయోజనము కలిగించునో యాత్మజ్ఞానము గల పురుషునకు సమస్తవేదము లట్టి ప్రయోజనమే కలిగించును. [బావినీ రొక్కపురుషున కొక్కొక్కకార్యమునకై యుపయోగించును. అట్లే వేదములు మోక్షముఁ గోరువారికి మోక్షసాధకమగును. కార్యములఁ గోరు వారికి వానికిఁ దగిన సాధనముల బోధించును]. ౪౬

అర్జునా ! కర్మముఁ జేయుటయందుమాత్రమే నీ కధికారము గలదు. ఆ కర్మఫలములఁ గోరు నధికారము నీకు లేదు. కర్మమును జేయువాఁడను నే ననికాని యీ కర్మమువలన నాకీఫలము గలుగవల యుననికాని నీవు తలంపరాదు. “నా కాఫలమును వలదు నేనాకర్మమును జేయను” అని నీవు చెప్పరాదు. విహితకర్మము చేయక తప్పదు. ౪౭

ఫలమునందుఁ బ్రీతి లేక, ఫలము సిద్ధించుటయందు సిద్ధింపక పోవుటయందు సమానుఁడవై, యోగమందు నిలిచి కర్మములఁ జేయుము. మేలునందును గీడునందును నన్ని సందర్భములందును సమముగ మనస్సు నుంచుకొనుటే యోగ మనఁబడును. ౪౮

సమబుద్ధితోఁగూడిన కర్మముకంటె ఫలముఁగోరిచేయు కర్మము జననమరణాదులకుఁ గారణమగుటచే నికృష్టమైనది. కావున నట్టి సమబుద్ధియందే నిలువుము. కర్మఫలమును గోరువారు హీనులు. ౪౯

అట్టి బుద్ధితోఁగూడి కర్మములను జేయువానికిఁ బుణ్యపాపములు రెండును గలుగవు. కావున నట్టిబుద్ధి కలుగుటకొఱకుఁ బ్రయత్నింపుము. కర్మములను ఫలముగోరక భగవంతుని ప్రీతికై నేర్పుచేఁ జేయుటచే నట్టి యోగబుద్ధి సాధింపనగును. ౫౦

జ్ఞానముతోఁగూడిన బుద్ధిమంతులు కర్మమువలనఁ గలిగెడి ఫలమును గోరనివారై జన్మములనెడి బంధములచేత విడువఁబడి మోక్షమును బొందుదురు. ౫౧

ఎప్పుడు నీ బుద్ధి మోహమువలనఁ గలఁతచెందుట మాని నిర్మలమగునో యప్పుడు నీవిదివఱకు విన్నవానియందును వినఁబోవు వానియందును విరక్తిగలుగును. ౫౨

పెక్కువిధములుగాఁ జెప్పెడి వేదవాక్యములవలనఁ గలఁత చెందిన నీబుద్ధి యెప్పుడు నిలుకడకలదియగునో యప్పుడు నీకాత్మ సాక్షాత్కారము (యోగము) కలుగును. అనిన నర్జునుం డిట్లనియె. *

---

* మొదట శాస్త్రశ్రవణము. దానివలన నాత్మజ్ఞానము. అనఁగా నాత్మ స్వరూప జ్ఞానము. తరువాత ఉపాసనము (ఎడతెగక స్మరించుట) దీనికే జ్ఞానయోగ మని పేరు. ఆవల నాత్మసాక్షాత్కారము (యోగము).

కేశవా! యెట్టి లక్షణములుగలవాఁడు దృఢజ్ఞానముగల వాఁడు? వాఁడు దేనిని బలుకును? ఎట్లు నడచును? అనినఁ గృష్ణుం డిట్లనియె.

అర్జునా! దృఢజ్ఞానమనఁగా వెలుపలి లాభములయం దపేక్ష లేక యాత్మస్వరూపమందే తృప్తిఁ బొందియుండుట. ఇట్టివాఁడు స్థిత ప్రజ్ఞుఁడనఁబడును. వీని దశలు నాలుగు. అందుఁ గడపటిదగు నాలుగవదశయం దుండువాఁ డాత్మ నొక్కదానినే మనస్సునఁ గోరి దానియందే మనస్సు నిలిపి తక్కినకార్యము లన్నియు విడుచును. మూఁడవదశయందుండువాఁడు తన కిష్టమైన వస్తువులు లేకపోవు టచేఁ గలుగు దుఃఖములచే మనస్సును గలవరపెట్టక సుఖము నొసఁగు నిష్టపదార్థములం దాశలేక, యనురాగము, భయము, క్రోధములేక, యాత్మధ్యానముచేయువాఁడు. రెండవదశయం దుండువాఁ డిష్ట పదార్థములందంతట యుపేక్షనహించి శుభము కలిగిన సంతోషింపక యశుభము కలిగిన ద్వేషింపక యుండును. మొదటి దశయందుండు వాఁడు తాఁబేలు తన యవయవములను దనలోనికి ముణుఁచుకొను నట్లు లింద్రియముల నన్నివిషయములనుండి మరలించుకొనుచుం డును, మొదటిదశఁ గడ తేఱినవాఁడు రెండవదశను రెండవదశయందుఁ గడ తేఱినవాఁడు మూఁడవదశను దానిని సాధించినవాఁడు నాల్గవదశను బొందును. ౫౮

ఇంద్రియముల కాహారము విషయములును భోజనపదార్థము లును. ఇది లభింపకపోయినపు డింద్రియములు వానినుండి మర లునుగాని వానియందలి యభిరుచిమాత్రము వదలక వానిని బొందఁ గోరుచునే యుండును. ఆత్మస్వరూపముఁ జూచినపిమ్మట వానియం దభిరుచియు వదలిపోవును. ౫౯

జ్ఞానవంతుఁడై యింద్రియములను జయింపవలయునని ప్రయ త్నముచేయుచున్న వాని మనస్సునుగూడఁ గలఁతపెట్టు స్వభావము గల యింద్రియములు బలాత్కారముగ లాగుకొనిపోవుచున్నవి. కావునఁ దొలుత నాయందాసక్తి గలిగి యింద్రియముల నెల్ల స్వాధీనము

చేసికొని యోగయుక్తుఁడై యుండవలయును. ఇంద్రియములను దన వశమున నుంచుకొని యుండువాఁడే నిలుకడమైన జ్ఞానముగల వాఁడు. (స్థితప్రజ్ఞుఁడు.) ౬౧

విషయములను బలుమా ఱాలోచించుటచే వానియందుఁ బ్రీతి కలుగును. ఆ విషయప్రీతివలనఁ గామము పుట్టుచున్నది. కోరిక కొనసాగదేని, గ్రోధము జనించును. క్రోధమువలన నిది కార్య మిది యకార్యమని తెలిసికొను వివేకము చెడుచున్నది. అవివేకమువలన దాను నడపుచున్న యింద్రియ జయము మొదలగువాని యందు మఱపు కలుగుచున్నది. మఱపువలన నంతఃకరణము చెడి యాత్మ జ్ఞానమునందుఁ గృషిచేయుట మాని మరల జనన మరణములకుఁ బాలుపడును. విషయాసక్తివలన నరుఁ డిట్లు నాశమొందును.

ఇంద్రియజయమునకు నాయందలి యాసక్తియే యుపాయము.

రాగద్వేషములు లేక తనకు లోబడిన యింద్రియములచే విషయముల ననుభవించువాఁ డంతఃకరణమును దన స్వాధీనమం దుంచుకొని నిర్మలమైన మనస్సు కలవాఁడగుచున్నాఁడు. ౬౪

మనస్సెప్పుడు నిర్మలమగునో యప్పుడే సర్వదుఃఖములు నశించును. ఆత్మావలోకమునకు విరోధులగు దోషములు లేక నిర్మలమైన మనస్సుగలవాని శుద్ధాత్మవిషయబుద్ధి శీఘ్రముగ నిలుకడ కలది యగును. ౬౫

యోగమున (భగవంతునియందు) మనస్సు నిలుకడగ నుంచని వానికి నాత్మజ్ఞానము లేదు. అట్టివాని కాత్మధ్యానము గలుగదు. ఆత్మధ్యానము లేనివానికి విషయము లందలి యాశ యణఁగదు. విషయములం దాశయుడుగక వానియం దాసక్తిగలవానికి దుఃఖము గాక సుఖమెట్లు కలుగును?

సముద్రమునఁ బోవు నోడను దప్పుగాలి సరియైన మార్గము నుండి తప్పించి వేఱొకమార్గమున కీడ్చుకొని పోవునట్లు మనోనిగ్రహము లేనివాని తెలివిని విషయసుఖముల ననుభవించు నింద్రియములవెంటఁ బోవు మనస్సు వంకరత్రోవ కీడ్చుచున్నది. ౬౭

కాబట్టి యన్నివిధములచేతను నెవ్వఁడు విషయములనుండి యింద్రియముల నిగ్రహించునో వాని బుద్ధి నిలుకడగలది యగును. అట్టి వాఁడే జ్ఞాని యనఁబడును.

సమస్తప్రాణుల కేది రాత్రియో దానియందు యోగి మేలుకొని యుండును. దేనియందు ప్రాణులు మేలుకొనియుందురో తెలివిగల ముని కది రాత్రియగును. సమస్తప్రాణులకు నాత్మజ్ఞానము రాత్రి విషయజ్ఞానము మునికి రాత్రి. ౬౯

ఎన్ని యేనదులు తమనీటి నంతయుఁ బ్రవేశింపఁజేసినను జలింపక పొంగకయుండు సముద్రమువలె నెవ్వాని కెన్నికోరికలు మనస్సున జొచ్చినను వికారము చెందక తనలోనే యణఁచుకొనుచు దానికిగా నే ప్రయత్నమును జేయకుండునో, వాఁడు మోక్షమును బొందుచున్నాఁడు గాని కోరికలఁ గోరువాఁ డెన్నఁటికిని మోక్షమును బొందఁడు. ౭౦

కోరికలనెల్ల వదలి యెవఁ డాశలేని వాఁడును మమకారాహంకారములు లేని వాఁడునై జీవనమాత్ర కార్యములందు సంచరించుచుఁ గార్యఫలము లనుభవించు చున్నాఁడో వాఁడు మోక్షమును బొందును.

అర్జునా! యీ స్థితి *పరబ్రహ్మప్రాప్తిని గలిగించును. ఇట్టి స్థితి యందుండువాఁడు సంసార మోహంబునఁ దగులు కొనఁడు. వార్ధకమం దిట్టి దశయందుండువాఁడు గూడ బ్రహ్మానందమును బొందును.

సాంఖ్యయోగంబను ద్వితీయాధ్యాయము సంపూర్ణము.

---

*ఆత్మజ్ఞానము కలిగి స్థితప్రజ్ఞుఁడై ఫలాకాంక్ష లేక కర్మములఁ జేయుస్థితి.

## తృతీయాధ్యాయము.

### —♦ కర్మయోగము ♦ —

అనిన నర్జునుం డిట్లనియె. కృష్ణా! కర్మముకంటె జ్ఞానము శ్రేష్ఠమని నీ యభిప్రాయమేని నన్నేల ఘోరకర్మములఁ జేయుమని ప్రేరించెదవు? కొంతసేపు కర్మము మేలని కొంతసేపు జ్ఞానము మేలని చెప్పుటచే నామనస్సు కలవరపడుచున్నది. నేనేమార్గ మవలంబించుటచే శ్రేయస్సు గందునో యాయొక్క దానిని మాత్రమే నీవు నిశ్చయించి చెప్పుము. అనినఁ గృష్ణుండిట్లనియె. ౧-౨

అర్జునా! నే నిదివఱకు నిష్ఠలు రెండువిధము లని చెప్పితిని. అందాత్మమాత్ర విషయమైన జ్ఞానముకలిగి బ్రహ్మచర్యమందే సన్న్యస్తులైన వారికి జ్ఞానయోగమని, యంతటిశక్తిచాలక విషయములందు వ్యాకులమైన బుద్ధి గలిగి కర్మములు చేయువారికిఁ గర్మయోగమని చెప్పితిని, కార్యములు చేయుట మానిన వాఁ డంతమాత్రముననే యంతఃకరణశుద్ధి గలిగి కర్మములను విడిచినవాఁడు పొందు ఫలమును బొందఁడు. కర్మము లారంభించి వదలినను జ్ఞానసిద్ధి కననేరఁడు.

ఎట్టివానికైన, నే దశయందైన, క్షణమేని, యేదైనఁ గార్యము చేయక యూరకుండుటకు సాధ్యపడదు. సత్త్వరజస్తమోగుణములకు లోపడి స్వాతంత్ర్యము లేనివాఁడై యెట్టి వాఁడును నేదో కర్మమును జేయుచునే యుండును.

వాక్కు, చేయి, కాలు, గుదము, ఉపస్థమను నివి యైదును గర్మేంద్రియములు. ఎవ్వఁ డీ యైదింటిచేఁ గార్యములు చేయకని బిగించుకొని విషయములపై మనస్సును బోనిచ్చునో వాఁడు బుద్ధి మాలిన వాడనియు మిథ్యాచారుఁడనియుఁ జెప్పఁ బడును. ౬

కావున నర్జునా! తొలుత మనస్సును స్వాధీనపఱుచుకొని యింద్రియములను దన వర్ణమునకు నాశ్రమమునకుఁ దగిన శాస్త్రీయ కర్మము లందు నియమించి యాకర్మఫలంబులందు నాసక్తి లేక యుండునో వాఁడు శ్రేష్ఠుఁడు. ౭

నీవు నీవర్ణాశ్రమములకుఁ దగిన కర్మము చేయుము. కర్మము చేయకుండుట కంటెఁ గర్మము చేయుట శ్రేష్ఠము. జ్ఞానికిని సాధనము పూర్తియగువఱకు దేహమునిలుపుకొనుట యావశ్యకము గావునఁగర్మములఁ జేయుచుఁ గర్త యాత్మగాదని తలంచుచుండ వలయును. నేను గర్మమునే చేయనందువా నీకు శరీరము కూడ నిలువదు. ౮

నన్ను నర్చించు నిమిత్తమై చేయు కర్మముచేత బంధము గలుగదు. అదితప్ప మఱి దేని నుద్దేశించి కర్మము చేసినను దానివలన నీకు బంధము తప్పదు. కాఁబట్టి నీవేకర్మము చేసినను ఫలమునుగోరక మదర్పణ బుద్ధితోఁ జేయుము. అటుగాక నేను జేయు యజ్ఞఫలము నన్ను నావారిని బొందవలయునని కోరితివా సంసారము పాలగుదువు. ౯

సర్వేశ్వరుఁడు తొలుతఁ గర్మములతోడఁ బ్రజలను సృజించి యో ప్రజలారా! వీనిచే మీరు వృద్ధి పొందుఁడు. ఈకర్మములే మీరు కోరిన కోరికల నిచ్చును. ఈకార్యములచే మీరు దేవతల నారాధింపుఁడు. దేవతలు మిమ్ము వర్షాదులచేఁ బోషింతురు. ఇట్లు లొకరినొకరు పోషించుచు నిరువురును మోక్షము పొందుదురు. అని చెప్పెను. ౧౧

యజ్ఞములచే దేవతలను మీరారాధించినఁగదా మీకు వారిష్ట భోగముల నొసంగుదురు. వారిచ్చిన వానిని వారి కీయక తా నొక్కఁడే భుజించువాఁడు దొంగయే. ఇతరులు తమ కార్యమునకై సంపాదించి నీయొద్దనుంచిన దానిని వారికీయక నీవనుభవించితివేని దొంగవేకదా యగుదువు. ౧౨

దేవయజ్ఞ, బ్రహ్మయజ్ఞ, పితృయజ్ఞ, మనుష్యయజ్ఞ, భూతయజ్ఞములను గావించి దేవతల రూపమును ధరించిన పరమపురుషు నారాధించి మిగిలినదానిని భుజించువారు, ప్రొయ్యి. రోఁకలి, రుబ్బుడుగుండు, నీళ్ళకడవ, చీపురుకట్ట, వీని నుపయోగించుట యందుఁ జిన్న చిన్న పురుగులకుఁ గావించెడి హింసచేఁ గలిగిన పాపము లనాదిగా సంపాదించిన యాత్మజ్ఞాన విరోధి పాపములు లోనగు సమస్త పాపము

లను బోఁగొట్టుకొందురు. ఎవ్వరు తమ కడుపునిమిత్తమాని వండుకొం దురో యట్టి పాపులు పాపమునే భుజింతురు. ౧౩

అన్నము వలన జీవులతోడి శరీరములు కలుగును. మేఘము వలన నన్నము కలుగును. యజ్ఞము వలన మేఘము కలుగును. యజమానుని వ్యాపారమువలన యజ్ఞము కలుగును. ఆ వ్యాపారము శరీరము వలనఁబుట్టినది. అట్టి శరీరము లన్నము వలనఁ బుట్టినవి. కావున నీవిధముగ నొకదానికొకటి కారణమై చక్రమువలెఁ దిరుగుచుండుదానిని




కర్మయోగాధికారిగాని జ్ఞానయోగాధికారిగాని జ్ఞానికాని ప్రవర్తింపఁ జేయఁడేని వాఁడు తినునది భగవదర్పితముకాదు. కావున నట్టి తిండిచేఁ బాపములఁ జేయుటకే ప్రవృత్తమైన యాయుస్సుగలవాఁడును, బాపరూపముగాఁ బరిణమించిన యాయుస్సుకలవాఁడును నగును. అట్టివాఁ డింద్రియారాముఁడగునుగాని యాత్మారాముఁడు గాఁడు. కాఁబట్టి యాత్మావలోకనమునందుఁ బ్రవర్తింపని వాని బ్రదుకు వ్యర్థమే. ౧౬

ఆత్మయందే యాసక్తిగలవాఁడును, నాత్మయందే తృప్తిని బొందినవాఁడును, నాత్మయందే సంతోషించిన వాఁడును నగు మానవుఁడు చేయవలసిన కర్మమేదియు లేదు. అన్నికర్మములు నాత్మావలోకనమునకు సాధనములు గాన నది లభ్యపడినవాఁడై శరీరము నిలువఁబెట్టునదియుఁ బుష్టిని గలిగించునదియు, సుఖము నొసంగునదియు నాత్మయే యని యుండువాఁడై ధన దారపుత్రాదులందు మమతలేక శరీరము నిలుచుటకు మాత్రము భిక్షగ్రహించు జ్ఞాని యాత్మావలోకనము తప్పఁ జేయవలసిన కార్యము లేదు. ఇతర కర్మములుచేయని దోషమతని నంటదు. అట్టి జ్ఞానికిఁ గర్మములు చేయుటచేఁ గలుగు లాభ

ముగాని చేయఁదగిన గలుగు నష్టముగాని లేదు. సమస్త భూతములందును వానికిఁ బ్రయోజనపడునది యొకటియు లేదు. నీవట్టివాఁడవు కావు. కావున సంగము లేక కర్మములను నాత్మప్రాప్తికలుగువఱకు సదా చేయుచుండుము. సంగము లేక కర్మములు చేయువాఁడు ముక్తినిబొందును. జనకుఁడు మొదలైనవారు కర్మముల నాచరించియే సిద్ధినిబొందిరి కదా.

నీవు జ్ఞాని వనియే యనుకో. అట్లులున్నను జనులందు నీవు సంచరించుచుండువఱకు వారిని తప్పుత్రోవలఁ బోనీయకుండుటకై, నైనను నీవు కర్మములు చేయవలసినవాఁడవే. ఏలందువా? శ్రేష్ఠుఁడైనవాఁ డెట్లు చేయునో వానియందు గౌరవబుద్ధిగల జ్ఞానహీనులు "అంతటివాఁ డేల చేయరానిపనిఁ జేయును? కావున నతఁడు పోవు మార్గమే సరి. మనము నట్లులే చేయుద"మని నిజమారయ లేక వాని యట్ల కర్మములుమాని వర్తింతురు. ఇట్లు తెలియనివారిని జెడఁగొట్టుటచేఁ గలిగిన పాపము జ్ఞాని జ్ఞానయోగముంగూడఁ జెఱుచును. గావున లోకమును గాపాడుటకై శిష్టుఁడని ప్రసిద్ధిగన్నవాఁడు వర్ణాశ్రమ ధర్మముల నాచరింపవలయును. —౨౧

అర్జునా! యీ మూఁడు లోకములందును నేను జేయఁదగినదేదియు లేదు. ఇదివఱకు లేనిది యిప్పుడు కర్మములుచేసి సంపాదింపవలసినదియు లేదు. అట్లున్నను లోకమును జక్కఁగఁ బ్రవర్తింపఁజేయుటకే కార్యములను జేయుచున్నాను.

నేనెప్పుడైనఁ బ్రాలుమాలి కర్మములను జేయకుందునేని కృష్ణుడే యీ కర్మమును జేయ లేదే చేసి ప్రయోజనము లేదేమో కావున మనమేల చేయవలయునని లోకులును నన్నిప్రకారముల నావలెనే యూరకుందురు. కావున నేను గర్మములఁ జేయకుందునేని లోకులు చెడుదురు. నేనే సంకరము చేయువాఁడనై ప్రజలను జెఱిపినవాఁడ నగుదును. —౨౩

అజ్ఞానులు ఫలాసక్తిగలిగి కర్మము నెంత శ్రద్ధాభక్తులతోఁ జేయుదురో యట్టులే జ్ఞానియు ఫలాసక్తి లేక లోకమును బాగుపఱుపఁ గర్మములఁ జేయవలయును. —౨౫

అంతియకాదు. అజ్ఞులు కర్మములం దాసక్తిం గలిగి కార్యములు చేయునపుడు జ్ఞానియగువాఁడు మీరు చేయునది సరిగాదు దాని వలన ఫలములేదని వారు చేయుదానియందు నవిశ్వాసబుద్ధి కలిగింపరాదు. తాను బూనికతోఁ గర్మములఁ జేయుచు వారును సర్వకర్మముల నాచరింపఁ జేయవలయును. మనుష్యుఁడుచేయు సమస్త కర్మములు ప్రకృతి గుణములే చేయుచున్నవి. వాస్తవ మిటులున్నను నహంకారముచేఁ దెలివిమాలినవాఁడు 'కార్యమును జేయువాఁడను నేను" అని తలంచును. ౨౭

ఇవి సత్త్వాదిగుణములు. ఇవి వానికర్మములు. అని సత్యమెఱిఁగి భేదమేర్పఱుచుటయందు నిపుణుఁడగువాఁ డింద్రియాదులువిషయముల యందు వర్తించుచున్నవని తలంచి వానియందాసక్తి మానునుగాని యా గుణముల కర్మములను దాను జేయుచున్నాననితలపఁడు. ౨౮

ఆత్మదర్శనమునకై యత్నించియు నాత్మదర్శనమును గలిగించు మార్గమునందును ఆత్మస్వరూపమునందును సంపూర్ణజ్ఞానము లేని వారు ప్రకృతిగుణములైన సత్త్వాదులచే మోహముచెంది యాత్మ యిట్టిదని సత్యమెఱుంగనివారై సత్త్వాదిగుణముల కర్మములనే యాసక్తితోఁ జేయుచున్నారు కాని ప్రకృతికంటె భిన్నమైన యాత్మస్వరూపమునం దాసక్తిగలవారుగారు. ఇట్టివారు జ్ఞానయోగమునకు దగరు. వీరు కర్మయోగమునకే యర్హులు. సంపూర్ణజ్ఞానముగలవాఁడు తాను జ్ఞానయోగ మవలంబించి కర్మములను విడిచి యిట్టి మందబుద్ధులకుఁ గర్మయోగమునుండి బుద్ధిని జలింపఁ జేయరాదు. కర్మయోగమునందు వారి కుపేక్షకలిగినా జ్ఞానయోగమం దశక్తులు గర్మయోగమం దాసక్తి తొలఁగినవారునై వారు రెంటను జెడుదురు. కావున నలువురిలోఁ శ్రేష్ఠుఁడని ప్రసిద్ధికెక్కినవాఁడు జ్ఞానయోగమందుఁ దన కధికారమున్నను గర్మములనే యాచరించుచు నాత్మస్వరూపజ్ఞానముగల వాఁడగుటచేఁ దానుజేయు కర్మములకుఁ దాను గర్తగానని తలంచుచుఁ గర్మయోగమే యాత్మసాక్షాత్కారమునకు సాధనమని తెలుపుచుండవలయును. ౨౯

ఆత్మస్వరూపవిషయమైన జ్ఞానమును దృఢముగా మనస్సునందు నిలిపి, సమస్తకర్మములను నాయందు సమర్పించి, యాకార్యములవలనఁ గలుగు ఫలమును నీవు కోరక, సర్వము భగవన్మయము కావున సమస్తకర్మములు చేయువాఁడు భగవంతుఁడేకాని నేనుగానని స్వాతంత్ర్యము నీపైఁ బెట్టుకొనక, సంతాపమును వదలి యుద్ధకార్యమును జేయుము. ౩౦

ఎవరు నేనిపుడు చెప్పిన నా యభిప్రాయముచొప్పున సర్వదా నడచుకొను చున్నారో, యొకవేళ నడచుకొనక పోయినను ననుకూల పడునపుడు శ్రద్ధగలిగి యీప్రకారము చేసితినా యీ ఫలము తప్పక కలుగునని నమ్మియున్నారో, యొకవేళ శ్రద్ధలేక పోయినను నిది సరియైన మార్గముగాదని యసూయచేతఁ దప్పులు పట్టకున్నారో, వీరందఱు శీఘ్రకాలమునందే కర్మములవలన లభించు బంధములనుండి ముక్తులగు చున్నారు. ౩౧

ఈ నామతము నెవ్వరు ద్వేషించుచు. నా ప్రకారమునడచుకొన కున్నారో వారన్ని జ్ఞానములందు మూఢులనియుఁ జెడినవారనియు విపరీతజ్ఞానము గలవారనియుఁ దెలిసికొనుము. ౩౨

ఆత్మస్వరూప మిట్టిది. దానికిఁ బ్రకృతిసంబంధము లేదు. అను జ్ఞానము కలవాఁడుకూడఁ బూర్వజన్మవాసన కనుగుణముగఁ బ్రకృతి సంబంధమైన విషయములందే ప్రవర్తించుచు నాత్మవిచారము చేయక వానివాని ప్రకృతి ననుసరించి కార్యములు చేయుచుండును. అట్టి వారిని శాస్త్రము చదువుటవలనఁ గలుగు జ్ఞానమేమి చక్కఁబెట్టఁ గలదు? జీవులన్నియుఁ బ్రకృతి ననుసరించినవి కావున దానిని నిగ్రహించి యేమి చేయనగు?

జ్ఞానేంద్రియముల విషయములగు శబ్దాదులందును, కర్మేంద్రియ విషయములగు వచనాదులయందును, బూర్వ వాసనవలనఁ గలిగినదియు, వానిని ననుభవింపవలయునను కోరిక రూపముగా నుండునదియునగు ననురాగమును, నట్టి సుఖానుభవమునకు విఘ్నము కలిగినపుడు విఘ్నము కలిగించిన వారిపై ద్వేషమును, దృఢముగ నేర్పడి

యున్నది. ఇవి వదలి పోవునవి కావు, కాఁబట్టి యాత్మ యిట్టిదని శాస్త్రములు చదువుటవలనఁ దెలియఁగలవానిని రాగద్వేషములు తమకు లోఁబఱుచుకొని తమకిష్టమైన కార్యములఁ జేయించుచున్నవి. కావున వాని జ్ఞానము వ్యర్థమగును.

ఈ కారణముచే జ్ఞానయోగ మారంభించునపుడు రాగద్వేషములకు వశపడ రాదు. ఆ రెండును నసాధ్యములయిన శత్రువులు. వానికి లోఁబడుటయే కలిగెనా యవి యట్లు లోఁబడినవాని జ్ఞానాభ్యాసమును జెఱుచును. ౩౪

పరధర్మమును జక్కఁగ నాచరించుట కంటె గుణము లేనిదైనను స్వధర్మమును నాచరించుటే శ్రేయస్కరము. స్వధర్మమునందు మరణము వచ్చినను మేలే. పరధర్మము భయకారణము. ధర్మబద్ధుఁడై పుట్టిన వానికిఁ గర్మయోగము స్వధర్మము. ప్రకృతితోఁ గూడిన వానికి నసాధ్యమగు జ్ఞానయోగము పరధర్మము. కర్మయోగమునకు నడుమ విఘ్నము కలిగినను, జన్మాంతరమందైన నది నిర్విఘ్నముగఁ గొనసాగును. జ్ఞానయోగము ప్రమాద సహితమగుటచే నడుమ భంగపడినను బడవచ్చును. భంగముకలిగిన దానికి ఫలము లేదు. కావున జ్ఞానయోగము భయకారణము. విచ్ఛిన్నమైన జ్ఞానయోగముకంటె, విగుణమైన కర్మయోగము వేగముగ ఫలమొసఁగును. అనిన నర్జునుం డిట్లనియె.

కృష్ణా! పురుషుఁడు పాపముచేయ నిచ్ఛలేనివాఁడయ్యు వేని చేతనో ప్రేరింపఁబడిన వాఁడై బలాత్కరింపఁబడిన వానివలెఁ బాపమును జేయుచున్నాఁడు గదా. ఇట్లు ప్రేరించునవి యేవి? ౩౬

కృష్ణుఁ డిట్లనియె. ఇట్లు ప్రేరించునది కామము. ఇది రజోగుణమునఁబుట్టినది. ఇది తృప్తియనునది యెఱుఁగని శత్రువు. ఈ కామమే (విఘ్నమైనపుడు) క్రోధముగాఁ బరిణమించును. ఇది మహాపాపములకుఁ గారణమైనది, జ్ఞానమునకీ కామము సహజ శత్రువు.

అగ్ని పొగచేతను, నద్దము మురికిచేతను, పిండము మావి చేతను గప్పఁబడి యుండునట్లు ప్రాణిసమూహము కామముచేఁ గప్పఁబడి యున్నది. అది యెట్లనెదవా? విషయములందుఁ గోరిక పుట్టించుటచేత ననాదిశత్రువై, యాశయను స్వరూపముగలదై, పూరింప నసాధ్యమై, యగ్నివలెఁ దృప్తినెఱుఁగని యీ కామము జ్ఞానికిఁ గల యాత్మవిషయ జ్ఞానమును గప్పియున్నది.

ఈకామ మింద్రియములు మనస్సు బుద్ధియను వాని మూలమున స్వతంత్రమగు నాత్మను నాక్రమించి వశపఱిచికొని జ్ఞానమును మఱుఁగుపఱిచి జీవుని మోహింపఁ జేయుచున్నది. ఈ సాధనములచేఁ గామము జీవుని స్వాధీనపఱచుకొని యాత్మజ్ఞానమందు నాసక్తిలేని వానిఁగను విషయసుఖములం దాసక్తిగలవానిఁగను జేయును. ౪౦

కావున నర్జునా! మోక్షమునుగోరి ప్రయత్నించు నపుడు తొలుత నింద్రియములను స్వాధీనపఱుచుకొని, కర్మయోగమందు వానిని నియమించి, దేహమునకంటె నాత్మ వేఱనుజ్ఞానమును, నాత్మ యణువని యానందమయుత్వము లోనగు ధర్మములఁగలది యని దానికి నితరములైనవానికిఁ గల తారతమ్య మెఱిఁగి విజ్ఞానమునుగూడ నాశముచేయు పాపస్వరూపపుఁ గామమును నాశ మొనర్పుము. ౪౧

ఈ విధముగ జ్ఞానము నిరోధించుటయందు నింద్రియము మొదటి విరోధులు. వానికంటె మనస్సు. దానికంటె బుద్ధి. బుద్ధి కంటెను గామమె ప్రబలవిరోధిగాఁ దెలిసికొని బుద్ధిచేత మనస్సును గర్మయోగమున నిలిపి జయించుటకు సులభముగాని యీ కామమను శత్రువును నాశ మొనర్పుము.

రుక్మిణమ్మా! కృష్ణమూర్తి చెప్పినదాని సారాంశమిపుడు చెప్పెద వినుము. ప్రకృతి సంబంధముగల పురుషుఁడు మోక్షమున నాసక్తి గలవాఁడగు నేని యాతఁడు ప్రారంభమందే జ్ఞానయోగము నభ్యసింప శక్తిగలవాఁడు కాఁజాలఁడు. కావున నట్టివాఁడు కర్మయోగమే చేయవలయును. తాను జేయుసమస్తకర్మములుభగవత్కైంక

కర్య బుద్ధితోఁ జేయుచు వానిఫలము తాను గోరక భగవంతునకే యర్పించుచుండుట కర్మయోగ మనఁబడు. పూర్వ జన్మమునఁ గర్మ యోగ మభ్యసించి పరిపక్వమైన బుద్ధిగలిగి యీ జన్మమున జ్ఞాన యోగాధికారి యగువాఁడు కూడఁ గర్మములు చేయవలయును గాని కర్త తాను గాడనియు భగవంతుఁడే యనియు నిశ్చలమై నిశ్చయ మైన బుద్ధితోఁ జేయవలయును. జను లెవ్వనిని శ్రేష్ఠుఁడని తలంచు చుందురో యట్టివాఁడు జితేంద్రియుఁడై జ్ఞానియై కర్మములతోఁ బని లేని వాఁడైనను గర్మములు చేయుచుండవలయును. ఏల? అతఁడు చేయకుండిన యెడల నింతటి గొప్పవాఁడు తెలిసినవాఁడు కర్మ ములఁ జేయుటలేదే కర్మములవలన ఫలముండిన నీతఁడు చేయకుండు నా యని భ్రమగొని పామరులును గర్మమును జేయకుందురు. కావున మార్గదర్శియగు వాఁడు తనకుఁ బ్రయోజనముండినను లేకుండినను గర్మములఁ జేయుచుండవలయు.

కర్మయోగము సంపూర్ణము.

---

## చతుర్థాధ్యాయము—జ్ఞానయోగము.

శ్రీకృష్ణమూర్తి:—

అర్జునా! యీ కర్మయోగమును దొలుత నేను సూర్యున కుపదేశించితిని. సూర్యుఁడు వైవస్వతమనువునకుఁ జెప్పెను, మను విక్ష్వాకునకు బోధించెను. ఈ విధముగ సంప్రదాయ పరంపరగా వచ్చిన యీ యోగమును రాజర్షు లెఱుంగుదురు. దీర్ఘకాలమగుట చేతను వినెడివారు క్రమక్రమముగాఁ దెలివితక్కువవా రగుటచేతను నీయోగము భూలోకమున నశించెను. ౧

నీవు నాకు భక్తుడవు సఖుఁడవు గావున నీ కా యోగము సవిస్తరముగ నుపదేశించితిని. నేను నీ కుపదేశించిన విధము పూర్వ కాలమున సూర్యునకు నే నుపదేశించిన స్వరూపము గలది గాని

యిప్పుడు లోకమునఁ జెడిముండు విధమునగలకు కాను. ఇది యుత్తమ రహస్యవిషయముసుమా! కావుననే దీని సంపూర్ణముగఁ జెప్పుటకుఁ దెలియుటకు నాకుఁ దప్ప నితరులకశక్యము.

అర్జునుఁడు:—

కృష్ణా! సూర్యుఁడు నీకంటె నెన్నాళ్ళకో ముందు జన్మించినవాఁడు. నీవో యిప్పుడు జన్మించితివి. నీవు సూర్యునకుఁ దొలుత నుపదేశించితివని నే నెట్లు నమ్ముదును! ౪

కృష్ణమూర్తి:—

అర్జునా! నాకును నీకును నెన్నియో జన్మములు గడచినవి. నీ యిప్పటి జన్మ మెట్లు సత్యమో నా జన్మ మట్టులే సత్యముగాని మిథ్య గాదు. ఇంద్రజాలమును గాదు. అట్టులే నీ పూర్వజన్మములు నా పూర్వజన్మములు. వానినెల్ల నే నెఱుంగుదునుగాని నీ వెఱుఁగవు. కావునఁ బూర్వజన్మమున నేను జేసినపని స్మరించి సూర్యున కుపదేశించితినని చెప్పితిని. నేను బుట్టువు లేనివాఁడను. నాశము లేనివాఁడను. సర్వప్రాణులకు నియామకుఁడను. అయినను నా స్వభావమును విడువక నా సంకల్పముచేత నేను జనించుచుందును. ఎప్పుడు నీవు జన్మింతువందువా? ఎప్పుడెప్పుడు ధర్మము హానిచెందునో, యధర్మము ప్రబలునో, యప్పుడు నన్ను నేను సృజించుకొందును. అంతియు కాని నా జన్మమునకుఁ గాలనియమము లేదు. పుట్టి నీవు చేయు కార్య మేమందువా? సాధువులను రక్షింతును. పాపులను నశింపఁ జేయుదును. ధర్మమును జక్కఁగా స్థాపింతును. ఈ కార్యములు చేయుటకై యుగయుగమందుఁ బుట్టుచుందును. నీ వీకార్యములను సంకల్పముచేతనే చేయరాదా దీనికై యవతారమెత్తవలయునా యందువేని వినుము. నా నామము, కర్మము, స్వరూపము మనుష్యులకుఁ బూర్ణముగ వచించుటకు ధ్యానించుటకు నందునవికావు. కావున నా భక్తులగువారును నన్నే యాశ్రయించియుండు సాధువులును, నా నామజపముచేతను నా కర్మముల వర్ణించుటచేతను నన్ను

ధ్యానించుటచేతను బూర్ణముగఁ దృప్తినొందినవారై నన్నే తమ కన్నులఁ జూడఁగోరుచుందురు. అట్టివారు నేను గరుణించి దర్శన మిత్తునను ధైర్యముచేతనే దేహధారణమును దేహపోషణమును జేయుచుందురు. నా దర్శనము లేనిక్షణ మొకకల్పముగ నెంచి దుఃఖింతురు. అట్టివారి కోరిక నేను వ్యర్థపఱుపఁజాలను గావున వారికై నే నవతారమెత్తక తప్పదు. దుష్టశిక్షణము సంకల్పముచేఁ జేసినను నిది చేయ సాధ్యపడునదికాదు. నా భక్తులను నేను మోసగింపను గాన యథార్థముగ వారికి దర్శన మిత్తును. ౮

అర్జునా! ఇవఁడు నా యవతారమును సాధురక్షణము లోనగు కార్యములను నీవిధముగానఁగా నా జన్మము ప్రకృతికి సంబంధించినది కాదనియుఁ, గావుననే సమస్త కల్యాణగుణములతోఁ గూడినదనియు, నేను సాధువుల రక్షించుట వారు నన్నాశ్రయించుటయే ప్రయోజనముగాఁ గలదనియు, నెఱుఁగుచున్నాఁడో వాఁడీదేహమును విడిచినతరువాత మరల జన్మింపఁడు. నన్నే పొందును. ౯

అనురాగమును భయమును గోపమును విడిచినవారును, నాయందే మనస్సునిలిపిన వారును నన్నాశ్రయించిన వారును నగు ననేకులు నాజన్మకర్మములజ్ఞాన మనుతపస్సుచేఁ బవిత్రులై నాస్వరూపమును బొందిరి. ౧౦

అర్జునా! యెవరెవ రెట్లెట్లు నన్ను భావించుకొని నన్నాశ్రయింతురో వారువారు భావించుకొన్న విధముగనే వారివారి కోర్కులనెఱవేర్చుచు నాయందు వారిని స్వీకరించుచున్నాను. నేను సర్వదా యిట్లే మనుష్య స్వరూపముతోనో దేవతా స్వరూపముతోనో యవతరించియే నాయాశ్రితులను రక్షింతునని తలంపకుము. కొందఱు నన్నుఁ దండ్రిగను గొందఱు భర్తగను గొందఱు మిత్రుఁడుగను నుండఁగోరుదురు. కొందఱు నాకు భృత్యులుగనుండఁ గోరుదురు. ఇంత యేల. జనులు వారు కోరిన రూపములు గలవానిఁగా నన్ను సేవింతురు. వారు కోరినట్లే వారికి దర్శన మిత్తును. అన్నివిధముల మనుష్యులు నా స్వభావము ననుభవించి వర్తింతురు. ౧౧

మనుష్యలోకమున మనుష్యులు చేయు కర్మములకు ఫలము శీఘ్రకాలమునందే కలుగును గావున నీలోకమునందు మనుష్యులు ధనధాన్యపశుస్వర్గాది ఫలములను శీఘ్రముగఁ బొందఁగోరినవారై యాగ దానాది కర్మములచే నింద్రాదిదేవతలనే యారాధించుచున్నారుగాని మోక్షమందాసక్తికలిగి నన్నారాధించి కర్మములఁ జేయరు. ౧౨

సత్త్వరజస్తమస్సులను గుణభేదమునుబట్టియు శమము దమము లోనగు కర్మలఁబట్టియు నేనే బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులను నాలుగు వర్ణముల సృజించితిని. ఆ సృష్టికి నేను కర్తనైనను నేను కర్తను గాననియు నాశములేనివాఁడననియుఁ దెలిసికొనుము. నేనే కర్తనని చెప్పుచు నన్నుఁ గర్తఁగాఁ దలంపకుమని చెప్పెదవే. యది యెట్లంటివేని వినుము. ఒకరిని దేవతగా సృష్టింపవలయునని యొకరిని మనుష్యునిఁగా సృష్టింపవలయునని నాకుఁ గోరికగాని పక్షపాతబుద్ధిగాని లేదు. వారువారు చేసిన పుణ్యపాపములఁబట్టి వారి వారికి మనుష్యత్వము దేవత్వము పశుత్వము పక్షిత్వము లోనగునవి కలుగుచున్నవిగాని నేనై నా యిచ్ఛకొలఁది స్వతంత్రించి యిచ్చినవి కావు. ఎవరెవ రెంతపుణ్య మెంత పాపము చేసిరో చూచి యాపుణ్య పాపముల ఫలముల ననుభవించుటకుఁ దగిన రూపముల నేను గలిగించుట తప్ప నంతకెక్కువ స్వాతంత్ర్యము నే నుంచుకొన్నవాఁడను గాను. వారివారి రూపములకు వారువారు చేసిన పుణ్యపాపములే కారణములు. కావునఁ గర్తలు వారే యగుదురు. ఎవరెవ రెట్టి పదార్థముల భోగింపఁ గోరుదురో వారికి వారి కట్టిపదార్థముల భోగించుట కనుకూలపడు కరణ కళేబరముల నిత్తును. ఆ కోరికల వలని ఫలము మంచియో చెడ్డయో వారే యనుభవింతురుగాని యా యనుభవించుటయు నాసంకల్పమువలనఁగాదు. కావున నాకర్మ ఫలమునందు నాకు రక్తిలేదు. ఈ విధముగ నన్నెవ్వఁ డెఱుఁగుచున్నాఁడో వాఁడు కర్మములచేఁ గట్టఁబడఁడు. ౧౩

ఈ ప్రకార మెఱింగిన పూర్వులు మోక్షేచ్ఛగలవారై కర్మము లాచరించిరి కావున నీవును బూర్వులవలెఁ బురాతనమైన కర్మములనే చేయుము. ౧౫

ఎట్టిది కర్మమో యెట్టిదియకర్మమో పండితులుగూడ యథార్థ మెఱుఁగరు. కావున దేనిఁ దెలిసికొని సంసారబంధమునుండి తప్పించుకొనుదురో యట్టి కర్మమును నీకుఁ దెలియఁజెప్పెద వినుము. ౧౬

కర్మవిధము తెలిసికొనుట యంతటి కష్టమా యందువేని యవును. కర్మమనఁగా నెట్టిది? వికర్మమనఁగా నెట్టిది? అకర్మమనఁగా నెట్టిది? యిదంతయుఁ దెలిసికొనవలయును. కావునఁ గర్మవిధము తెలిసి కొనుట మిక్కిలి కష్టము. ఎట్టికర్మము మోక్షమునకు సాధనమగును? మనుష్యులు దినదినము చేయు నిత్యకర్మములు నైమిత్తిక కర్మములు, ధనార్జనము లోనగు కామ్యకర్మములు నేవిధముగఁ జేసిన మోక్షమొనఁగ సమర్థములగును? జ్ఞానమనఁగా నెట్టిది? యివి యన్నియు నున్నదున్నట్లు తెలిసికొనుట కష్టముకదా. ౧౭

కర్మమును నకర్మముగను, నకర్మమును గర్మముగను నెవఁడు చూచునో వాఁడే మనుష్యులలో బుద్ధిమంతుఁడు. యోగముకలవాఁడు వాఁడే. అన్నికర్మములు చేయువాఁడును వాఁడే. కర్మములు చేయుచు వీనిని జేయువాఁడను నేనుగాను. ఇంద్రియములు చేయుచున్నవి కాని జ్ఞానానంద మయుండనై కాలుసేతులు లేని నేను గర్మములఁ జేయువాఁడను గాను. అని యాత్మజ్ఞానము విడనాడక కర్మములఁ జేయుటయే కర్మమందకర్మమెఱుంగుట. అకర్మ మనఁగా జ్ఞానము. ఆత్మ యాథాత్మ్యము ననుసంధానముచేయుట. ఇట్లు చేయుటయుఁ గర్మమే కావున జ్ఞానము (అకర్మము) కర్మమం దంతర్గతమైయున్నదని యెవఁడు తెలిసికొనునో వాఁడే మోక్షార్హుఁడు. అకర్మమందుఁ గర్మమును గనువాఁడు వీఁడే.

“నేను వీనిని జేసెదను వీనివలన నా కీఫలములు కలుగ వలయు” ననుకోరికలు సంకల్పములు లేక యెవఁడు సమస్తకర్మములను

జేయునో యట్టివాని కర్మములు జ్ఞానమనెడి నగ్నిచే దహింపఁబడినవై బంధము లనుఫలముల నీయఁజాలవు గనుకఁ దత్త్వము తెలిసిన వారు వానినే జ్ఞానవంతునిఁగాఁ జెప్పుచున్నారు. ౧౯

'నే నీ కార్యమును జేసెదను దీనివలన నాకీ ఫలము కలుగ వలెను.' అని కోరక తన యాత్మయం దెల్లప్పుడు తృప్తిని జెందిన వాఁడై 'యిది నాకాశ్రయము. ఇది నన్ను రక్షించును.' అని ప్రకృతి సంబంధమైన దేనియందును నాశ్రయబుద్ధి లేక కర్మములను జేయువాఁ డేకర్మమును జేయనివాఁడే.

ఫలము నుద్దేశింపక చిత్తమును నింద్రియములను వశపఱుచు కొని భోగ్యములగు శబ్దాదివిషయములగు ప్రకృతివస్తువులందును భోగముల కుపకరణములగు నింద్రియములందును, మమకారము లేనివాఁడై శరీరమును నిలుపుటకై శరీరసంబంధమగు కర్మమును మాత్రము చేయువాఁడు జ్ఞానయోగి గాకపోయినను సంసారబంధ రూపమగు పాపమును బొందఁడు. ౨౧

తనంత లభించిన వస్తువు లెంత కొంచెమైనను నదియే పది వేలని తృప్తివడుచుఁ,జలివేఁడిలోనగు ద్వంద్వములను సహించుచుఁ, దనకుఁ గలుగు కీడులనుఁ దాను జేసినకర్మమే కారణమని తలఁచుటచే నితరులందు ద్వేషము విడిచి, చేయునట్టికార్యము ఫలించినను వ్యర్థ మైనను సమచిత్తుఁడై యుండువాఁడు, జ్ఞానయోగము నభ్యసింపక కర్మములు చేయుచుండినను, సంసారబంధములఁ గట్టుపడఁడు.

ఇంతవఱకుఁ బ్రకృతి బంధములేని శుద్ధాత్మస్వరూపము నను సంధానము చేయుటతోఁ గూడినదగుటచేఁ గర్మము జ్ఞానాకారమైన దని చెప్పితిని. ఇఁక స్రుక్స్రువము మొదలగు పరికరములతోఁ గూడి చేయఁబడు యజ్ఞములోనగు సమస్తకర్మములు పరబ్రహ్మాత్మక మైనవను ననుసంధానముతోఁ గూడినదగుటచేత నాకర్మముగూడ జ్ఞానాకారముఁ బొందుట చెప్పెదను వినుము. ఆత్మజ్ఞానమందే మనస్సు నిలిపినవాఁడగుటచేత నాత్మకంటె వేఱువస్తువులందు నాసక్తి

విడిచినవారై యేపదార్థమందును మమకారముంచక యజ్ఞములు లోనగు దేవతాకార్యములు చేయుటకై వర్తించువాని ప్రాచీనకర్మ మొత్తము సమూలము నశించుచున్నది. ౨౩

హోమసాధనము బ్రహ్మము. హవిస్సు బ్రహ్మము. అగ్ని బ్రహ్మము. హోమము బ్రహ్మము. హోమముచేయువాఁడు బ్రహ్మము ఇట్టి బ్రహ్మస్వరూపమైన కర్మముచేఁ బొందఁదగినది బ్రహ్మమే. ౨౪

కొందఱు కర్మయోగులు దేవతార్చనారూపమగుయజ్ఞమందుఁ దక్కినవారికంటె నెక్కువ నిష్ఠకలవారై యుందురు. మఱికొందఱు బ్రహ్మస్వరూపమైన యగ్నియందు స్రుక్కులు మొదలగు యజ్ఞసాధనములచే హవిస్సును హోమము చేయుచున్నారు. మఱికొందఱు శ్రోత్రము మొదలగు నింద్రియములనెడి హవిస్సును నిగ్రహమను నట్టియగ్నియందు హోమముచేసి యింద్రియములను వ్యాపారములు లేనివానినిగాఁ జేయుదురు. మఱికొందఱు శబ్దము మొదలైన విషయములను నింద్రియములను నగ్నియందు వేల్చుటచే శబ్దాదివిషయముల ననుభవించుచు వానియం దాసక్తిలేనివారై యుందురు. మఱికొందఱు మనస్సునకు నింద్రియవ్యాపారములయందును నుచ్ఛ్వాసనిశ్వాసములు లోనగు ప్రాణవ్యాపారములందును గలయాసక్తిని నివర్తింప యత్నింతురు. తాము చేయఁదగు కార్యములందు దృఢసంకల్పము దృఢప్రయత్నముగల కొందఱు తాము సంపాదించిన ద్రవ్యమును దేవతార్చన దానాదులందు వినియోగింతురు. కొంద ఱుపవాసము చాంద్రాయణము లోనగు వానియందు నిష్ఠగలవారై యుందురు. కొందఱు తీర్థక్షేత్రసంచారముచేయ మనస్సుగలవారై యుందురు. కొందఱు వేదములు పఠింతురు. కొందఱు దానియర్థము నభ్యసింప నాసక్తిగలవారగుదురు.

కొందఱు కర్మయోగు లాహారమున నియమము వహించి పూరక రేచక కుంభకములనెడి ప్రాణాయామనిష్ఠయం దాసక్తిగలవారు. కొందఱు మీఁదికిఁబోవు ప్రాణవాయువును గ్రిందివైపు పోనిచ్చి పూరకము నభ్యసింతురు. కొందఱు క్రిందికిఁబోవు నపాన

వాయువును మీఁదికిఁ బోనిచ్చి రేచకము నభ్యసింతురు. కొందఱు మీఁదికిఁబోవు వాయువును క్రిందికిబోవు వాయువును వెలుపలఁ బోనీక లోననిలిపి కుంభక ప్రాణాయామము నభ్యసింతురు. ద్రవ్య యజ్ఞము మొదలుగఁ బ్రాణాయామ పర్యంతమగు నానావిధ కర్మ యోగములందు నాసక్తిగలిగి వర్తించువారందఱు మహాయజ్ఞములో నగు నిత్యనైమిత్తికకర్మరూప యజ్ఞములందు నిష్ఠగలవారై వానిచేతనే పాపము నశింపఁజేసి యమృతమను పేరుగల దైవనివేదితాన్నము చేతనేశరీరము రక్షించుచు శాశ్వతబ్రహ్మమునుబొందుదురు. అర్జునా! మీఁదఁజెప్పినట్లు నిత్యనైమిత్తికాది కర్మములవలన దేవపూజనేయని వారికి నీలోకమునఁ బురుషార్థములే ఫలింపవు. ఇఁక మోక్షమెట్లు లభించును? 30

ఈవిధముగ ననేకవిధములైన కర్మయోగము లాత్మప్రాప్తికి సాధనములైయున్నవి. నానాభేదము లయిన యీ కర్మయోగము లన్నియు దినదినము మనుష్యులుచేయు నిత్యనైమిత్తిక కర్మములవలనఁ గలిగినవే. ప్రతిదినముచేయు పనులన్నియు భగవత్ప్రీతిగఁ గావించి ఫలము భగవంతునకు సమర్పించుటే కర్మయోగ మనుష్ఠించుట యనియు దానివలననే యాత్మప్రాప్తి కలుగుననియుఁ దెలిసి కొనుము. ఇట్లు తెలిసి కార్యములు చేసితివా సంసారబంధము నిన్ను వదలిపోవును.

కర్మయోగము సాధించుటకు ధనాదిపదార్థములను జ్ఞానమును రెండును గావలయునని చెప్పితినిగదా. అందు ద్రవ్యమయమయిన దానికంటె జ్ఞానమయమయిన భాగము ప్రధానము. సమస్తకర్మ ములు సమస్తసాధనములతో జ్ఞానమునందుఁ బర్యవసించుచున్నది. సమస్త సాధనములచేఁ బొందదగిన జ్ఞానము కర్మాంతర్గత మగునట్లు లభ్యసింపఁబడుచుఁ గ్రమముగ నాత్మ సాక్షాత్కారమునకుఁ గారణ మగును. 33

ఆత్మజ్ఞానమును దెలిసికొనఁ గోరికగలదేని జ్ఞానులలో నాత్మ స్వరూపసాక్షాత్కారము గలవారుగనుండు వారియొద్దకుఁ బొమ్ము

భక్తిశ్రద్ధలతో సాష్టాంగ నమస్కారము గావించి శుశ్రూష సలిపి పరిప్రశ్నలచే నడుగుము. వారు నీకు జ్ఞానము నుపదేశింతురు. 3౪

ఆ జ్ఞానము నీకుఁ గలిగినా దేహమే నేననునభిమానమును మమకారమును బొందవు. మఱియు నన్ని దేహములందుండు నాత్మలు ప్రకృతి సంబంధరహిత జ్ఞానైకాకారములగుట నీతో సమానులనియు నాపరిశుద్ధాత్మ వస్తువులన్నియు నీవలెనేయుండుటను జూడఁగలవు. 3౫

మహాపాతకములు చేసినవారికంటె నీవధికపాపము చేసినను నట్టి పాపమను మహాసముద్రమును జ్ఞానమను నావచే దాటఁగలవు. చక్కఁగా మండెడునగ్ని కట్టెలను భస్మీకరించునట్లు జ్ఞానమను నగ్ని మోక్షప్రతిబంధక కర్మముల నన్నిటిని భస్మముచేసి వానివలనఁ గలుగఁ గల కార్యములను శేషములేని వానిగాఁ జేయును. 3౭

జ్ఞానముతో సమానమైనదియుఁ బవిత్రమైనదియు నీలోకమునందు లేదు. జ్ఞానాకారముగాఁ గర్మముల నాచరించుచు నందు సిద్ధి పొందిన వానికిఁ గాలక్రమమున జ్ఞానముతానే లభించుచున్నది. 3౮

జ్ఞానము వృద్ధిచేసికొనుటయందు శ్రద్ధగలవాఁడై దానియందే యాసక్తిగలిగి యింద్రియనిగ్రహముగలపురుషునకు జ్ఞానములభించును. జ్ఞానము లభించినపిమ్మట శీఘ్రముగ మోక్షమును బొందుచున్నాఁడు.

జ్ఞానము లేనివాఁడును శ్రద్ధ లేనివాఁడును నీ జ్ఞానమువలన ఫలముగలదో లేదోయని సందేహించువాఁడును నశించుచున్నాఁడు. సంశయముగలవాఁడీలోకమును బరలోకమునుగూడఁ జెడును.

మీఁదఁ జెప్పఁబడిన యోగముచే జ్ఞానాకారమును బొందిన కర్మము గలవాఁడును నాత్మజ్ఞానముచే సందేహముతీఱిన వాఁడును దన కుపదేశింపఁబడిన విషయములందు దృఢమైన మనస్సుగల వాఁడును నగు పురుషునిఁ గర్మములు బంధింపవు.

కావున నర్జునా! యజ్ఞానమువలనఁ గలిగి హృదయములందుండు నాత్మను గుఱించిన సంశయమును నే నుపదేశించిన జ్ఞానమను కత్తిచే నఱకి నే నుపదేశించినట్లు కర్మయోగమునాచరింపవలెను.

చతుర్థాధ్యాయము, జ్ఞానయోగము సంపూర్ణము.

పంచమాధ్యాయము.

## —♦ కర్మసన్యాసయోగము. ♦—

అర్జునుడు:—

కృష్ణా! మొదటఁ గర్మయోగమే చేయవలసినదనియు, నట్లు చేసిన కర్మయోగమువలన నంతఃకరణము నందలి దోషము లన్నియుఁ దొలఁగిపోయి యది పరిశుద్ధమగుననియు, నట్లు పరిశుద్ధ మైన వెనుక జ్ఞానము లభించుననియు, దానిచేత నాత్మదర్శనము కలుగుననియుఁ జెప్పితివి. ఇట్లు కర్మయోగముచే జ్ఞానయోగము జ్ఞానయోగముచే నాత్మసాక్షాత్కారము కలుగునని చెప్పి మరల జ్ఞానయోగమున కధికారియగువానికిని గర్మయోగమే శ్రేష్ఠమనియు నది జ్ఞానయోగ సాహాయ్యము లేకయే యాత్మప్రాప్తి కలిగించు ననియుఁ జెప్పితివి. కావున జ్ఞానయోగ కర్మయోగములను నీ రెంటిలో సులభముగాఁ జేయదగినదియు శీఘ్రముగ నాత్మప్రాప్తిని గలిగించునదియు నేదో నిశ్చయించి చెప్పుము.

కృష్ణమూర్తి:—

అర్జునా! జ్ఞానయోగము కర్మయోగము రెండును మోక్షమును గలిగించునవియే. అయినను నా రెంటిలోఁ గర్మత్యాగ పూర్వకమగు జ్ఞానయోగముకంటెఁ గర్మయోగము శ్రేష్ఠమైనది. ఏ కర్మయోగి యాత్మదర్శనము తప్ప నితరము కోరఁడో కావున దేనియందును ద్వేషబుద్ధిగలవాఁడు కాఁడో కావుననే చలి వేడి సుఖము దుఃఖము శోకము సంతోషము వీనిని సహించువాఁడగునో యట్టివాఁడు నిత్య జ్ఞాననిష్ఠుఁడని యెఱుఁగుము. వాఁడు సంసారబంధమునుండి విడివడిన వాఁడే. జ్ఞానయోగము వేఱు, కర్మయోగము వేఱని తెలియనివారు చెప్పుదురుగాని తత్త్వమెఱిఁగినవారు చెప్పరు. జ్ఞానయోగమునకు గర్మయోగమునకు నాత్మావలోకనమే ఫలముగదా. ఆ రెంటిలో దేనినైన నొక్కటిని జక్కఁగా నాశ్రయించినవాఁడు రెంటి ఫలమును బొందఁగలఁడు. జ్ఞానయోగులచేఁ బొందఁబడు స్థానమేదియో

యదియే కర్మయోగులచేతను బొందఁబడును. జ్ఞానయోగము కర్మయోగము రెండు నొక్క ఫలమునే యిచ్చునవి యగుటచే నొక్కటిగ నెవఁడెఱుఁగునో వాఁడే చక్కఁగాఁ దెలిసినవాఁడు. కర్మయోగ మార్గమునఁగాక జ్ఞానయోగము సాధించుట యశక్యము. కర్మయోగము నాచరించు ముని స్వల్పకాలములోనే యాత్మను బొందుచున్నాఁడు. కేవల జ్ఞాననిష్ఠుఁడు జ్ఞానము నతి కష్టముచే సంపాదింపవలసి యుండుటచే దీర్ఘకాలమునకుఁగాని యాత్మను బొందఁజాలఁడు. రెంటికిని భేద మంతియే. కావుననే కర్మయోగము శ్రేష్ఠమని చెప్పితిని. ౬

కర్మయోగి పరిశుద్ధమై వశపడిన మనస్సుగలవాఁడును, నింద్రియ నిగ్రహముగలవాఁడును, దన యాత్మ యెట్టిదో తక్కిన సమస్త భూతములయందలి యాత్మలు నట్టివిగాఁ దలఁచువాఁడునై తాను జేయు పుణ్యపాపములచే నంటఁబడఁడు. ఆత్మజ్ఞానముగల కర్మయోగి చూచుచున్నను, వినుచున్నను, దాఁకుచున్నను, వాసన చూచుచున్నను, దినుచున్నను, నడచుచున్నను, నిద్రించుచున్నను, నూపిరి విడుచుచున్నను, మాటలాడుచున్నను, మలమూత్రములవిడుచుచున్నను గ్రహించుచున్నను, గన్నులు తెఱచుచున్నను, మూయుచున్నను, నాయాయింద్రియము లాయాశబ్దాది విషయములందుఁ బ్రవర్తించుచున్నవని తలఁచునుగాని యం దొకటియైన 'నేను' జేయుచున్నానని తలఁపఁడు. పూర్వకర్మ లబ్ధమైన యీ దేహమునకుండు నాయా యవయవములు వినుచున్నవి, తినుచున్నవి, యిట్టి కార్యములు చేయుచున్నవి. కాని యవయవములులేక జ్ఞానాకారముగనుండు నేను వినుటలేను, కనుటలేను, మఱి యేకార్యము చేయుట లేదని తలఁచును. ౯

కనుట వినుట లోనగు నింద్రియ వ్యాపారములను నాయా యవయవములుగాఁ బరిణమించిన ప్రకృతియందుంచి నాయా కార్యముల వలనఁ గలుగు ఫలమును గోరక కర్మముల నెవఁడు చేయుచున్నాఁడో వాఁడు నీటిలోఁ బుట్టి పెరిఁగినను దామర పాకు నీటిచేఁ

దడియక కొట్టుంబునో యట్టి యాకర్మములవలనఁ గలుగు దేహాభిమాన రూపక పాపములచే నంటఁబడఁడు.

ఆత్మకుఁ బ్రాచీన కర్మములవలనఁ గలిగిన బంధము నివర్తించుకొఱకు యోగులు శరీరముచేతను, మనస్సుచేతను, బుద్ధిచేతను, కేవల జ్ఞానేంద్రియములచేతను, ఫలమును గోరక కర్మములఁ జేయుదురు. ఆత్మావలోకమందే యాసక్తి గలవాఁడు కర్మఫలాపేక్షను విడిచి కర్మములఁ గావించి శాంతిని బొందుచున్నాఁడు. ఆత్మావలోకనమందాసక్తి లేని వాఁడు కామప్రేరితుఁడై ఫలములఁగోరి కర్మము లాచరించి వానిచే సంసారమున బద్ధుఁడగు చున్నాఁడు. ౧౨

దేహధారి మనస్సుచే నవరంధ్రములు గల దేహమునందు సమస్తకర్మముల కర్తృత్వమును వద లిస్వతంత్రుఁడై తాను దేహము నధిష్ఠించుటచేఁ జేయఁగలుగు ప్రయత్నములఁ జేయక యా దేహముచే దేనిని జేయింపక సుఖముగా నుండును. ౧౩

ఇఁక నాత్మస్వభావ రూపమును జెప్పెద వినుము. కర్మములకు లోపడకస్వభావ స్వరూపముతో నుండెడి యాత్మ దేవతలు మనుష్యులు పక్షులు పశువులు మొదలగువాని రూపములుగలిగి ప్రకృతితోఁ జేరియుండు నీ లోకమునకు నిందలి దేవతలు మనుష్యులు లోనగు వారికి నాయాకర్మములందుఁ గర్తృత్వమును గాని యాయాకర్మములను గాని యాకర్మములవలనఁ గలిగెడి ఫలమునుగాని కలుగఁజేయ లేదు.

అనాదిగ నీ యాత్మకుఁ బ్రకృతిసంబంధ మున్నది. అగ్నిసంబంధముచే నెఱ్ఱఁగఁ గాలిన యినుపగుం డగ్నివలె నైనట్లు దేహసంబంధముగల బద్ధాత్మ యజ్ఞానముచేఁ దాను దేహమనియే తలఁచి నేను మనుష్యుఁడను. నేను దేవత, నని భ్రమపడుచుండును. దేహమే తా నను నభిమాన మాత్మకుఁ గలుగఁగా దేహము చేసిన కర్మములు తాను జేసినట్లెంచి యా ఫలముల నది యనుభవించును గాని పరిశుద్ధాత్మ కార్యములు చేయదు, చేయింపదు, వాని ఫలముల ననుభవింపదు, కర్మములు చేయునది దేహమేకాని యాత్మగాదు. ౧౪

ఆత్మ తన కనుకూలుఁడగు వాని దుఃఖమును బోఁగొట్ట లేఁడు. ప్రతికూలుఁడగు వాని సుఖమును బోఁగొట్ట లేఁడు. తాను జేసిన కర్మముల ఫలము ననుభవింపఁదగిన సమస్త దేహములందును ప్రవేశించు యోగ్యతగలవాఁడు గావున సర్వవ్యాపకుఁడు. కావున నొక్కని కనుకూలుఁడు గాఁడు. వేఱొక్కనికిఁ బ్రతికూలుఁడును గాఁడు. వీఁడు సంబంధి వీఁడు ప్రతికూలుఁ డనుభావములు పూర్వ వాసనచేఁ గలుగునవి కాని యాత్మకు స్వభావమైనవి కావు. ఆత్మకట్టి విపరీతవాసన కలుగుటకుఁ గారణము వినుము. కర్మములు జ్ఞానవిరోధులు జ్ఞానముగల వాఁడు కర్మఫలములగు సుఖదుఃఖములు ప్రాప్తించినపుడు పొంగఁడు క్రుంగఁడు కావున ఫలానుభవము లేని వాఁడే యగును. కావునఁ గర్మములు తమ ఫలముల ననుభవింపఁ జేయవలసియుండినచో జ్ఞానమును గొంచెత పఱుపవలయును. కర్మములు చేయుపని యిదియే. దీనివలన జ్ఞానము తక్కువగుటచేఁ గర్మ ఫలముల నాత్మ యనుభవించును. ఈ విధముగ నజ్ఞానముచే జ్ఞానము కప్పఁబడుటచేత మనుష్యాదులు మోహము పొలగు చున్నారు. ౧౫

ఈ విధముగ నాత్మ లన్నియు వర్తింపఁగా వానిలో నేయాత్మ లాత్మ స్వరూప మిట్టిదని యుపదేశము పొందుటచేఁ బుట్టి, యభ్యాసముచేఁ బెరిగి, మిక్కిలి పవిత్రమైన జ్ఞానముచే నజ్ఞానమును నాశము చేయునో యాయాత్మలకుఁ దమ యుత్కృష్టమైన స్వభావ జ్ఞానము సూర్యునివలె సమస్త మున్న దున్నట్లు ప్రకాశింపఁ జేయును. ౧౬

ఆత్మ దర్శనమందే బుద్ధిగలవారు, నాత్మ విషయమందేమనస్సు గలవారు. నాత్మజ్ఞానాభ్యాసమందే యాసక్తిగలవారు, నాత్మనే పరమ ప్రయోజనమని తలఁచువారు, మరల జన్మముకలిగింపనియాత్మ సాక్షాత్కారమును బొందుదురు.

ఆత్మతత్త్వ మెఱింగినవారు విద్యావినయ సంపన్నుని బ్రాహ్మణుని గోవును నేనుఁగును గుక్కను జండాలుని సమదృష్టితోఁ జూతురు. ఇట్టి దేహములు ప్రకృతి సంబంధించినవి గనుకను, వాని యందలి

యాత్మలన్నియు జ్ఞానమే స్వరూపముగఁ గలవి గనుకను దత్త్వదృష్టికి నన్నియు సమానములే కదా! ౧౫

ఆత్మలన్నియు సమానములని యెవరికి మనస్సు స్థిరపడి యుండునో వారీసాధనానుష్ఠాన దశయందే సంసారమును జయించిన వారగుదురు. ప్రకృతి సంబంధ మనుదోషము లేక సమముగా నుండు నాత్మవస్తువే బ్రహ్మము. కాఁబట్టి యాత్మలన్నియు సమానములని నిశ్చయ బుద్ధిగల వారీలోకమున ముక్తులే యగుదురు.

సర్వము సమానమను జ్ఞాన మెట్లు కలుగునో చెప్పెదవినుము. ఆత్మస్వరూపమిట్టిదని తత్త్వజ్ఞులచే నుపదేశము పొందవలయును. ఆత్మ స్వరూప మిట్టిది కదా యని ప్రతిదిన మభ్యసింపవలయును. ఇట్లు చేసి దేహమే యాత్మయను నభిమానము లేనివాఁడు కావలయును. అట్టి యభిమానమును దొలఁగఁ ద్రోచి యాత్మ వేఱనియు ననాత్మ (దేహము) వేఱనియు దృఢ నిశ్చయ జ్ఞానము కలిగి యావల దేహ విచారము మాని యాత్మయందే బుద్ధిని స్థిరముగ నిలుపవలయును. ఇట్లు చేయునపుడు మేలు కలిగినా సంతోషింపరాదు. కీడు కలిగినా దుఃఖింపను రాదు.

ఆత్మకంటె భిన్నమైన బాహ్యవస్తువులయం దాసక్తిగలిగి యుండరాదు. అంతరాత్మయందే సుఖమనుభవించు చుండవలయును. ఈ విధముగ నాత్మాభ్యాసముతోఁ గూడిన మనస్సుగలవాఁడు శాశ్వత సుఖమును బొందును.

బాహ్య విషయములందు నాసక్తి యెట్లు తొలఁగు నందువా వినుము. విషయేంద్రియ సంబంధమువలనఁ గలిగిన సుఖములన్నియు దుఃఖకారణములని యెఱుఁగుము. శాశ్వత పదార్థము శాశ్వత సుఖము నీయఁగలదు గాని యనిత్యమగునది నిత్య సుఖ మెట్లీయఁ గలదు? ఇంద్రియములు విషయములు దేహములుగాఁ బరిణమించిన ప్రకృతికి సంబంధించిన వగుటచే శాశ్వతమైనవి కావు. వానికి మొదలు తుద గలవు కావున నవి యిచ్చు సుఖములకు మొదలు తుదయుండును. కావున నవి యల్పకాలమే యనుభవింపఁ దగినవై

యుండును. ఆవల దుఃఖమే కదా కలుగును. కాబట్టి పర్యవసాన దుఃఖము కలిగించు సుఖములందుఁ దత్త్వజ్ఞుఁడు మనస్సు పోనీయరాదు. తత్కాలమునకు నోరు తీపగునని విషము కలిసిన పాయసమెవ్వఁడు త్రాగును? ౨౨

శరీరమును విడుచుటకుముందు సాధనానుష్ఠాన దశయందే కామక్రోధముల వేగమును నెవ్వఁ డణఁచుటకు శక్తుఁడో వాఁడే యాత్మానుభవమునకుఁ దగిన వాఁడు, వాఁడే సుఖి.

సమస్తములైన బాహ్య విషయములను ననుభవించుట మాని యాత్మానుభవమే సుఖముగాఁ గలిగి. యాత్మయందే తనకు సుఖమును నభివృద్ధి పొందించుననియు నదియే జ్ఞానమనియుఁ దెలిసి వర్తించునో యట్టి బ్రహ్మస్వరూపుఁడగు యోగి యాత్మానుభవ సుఖమును బొందును.

ఉష్ణము, శీతము నను ద్వంద్వములను విడిచి యాత్మయందే మనస్సు నియమించి సమస్త ప్రాణుల మేలు గోరుచు నాత్మావలోకనము చేయువా రాత్మప్రాప్తికి విరోధులగు పాపముల నాశము చేసిన వారై యాత్మానుభవ సుఖమును బొందుదురు. ఈ విధముగా ౧ సంతోష శోకములను విడచుట, ౨ బాహ్యవిషయములం దాసక్తి లేకుండుట, ౩ బాహ్యవిషయములను దోషయుక్తములుగాఁ జూచుట ౪ కామక్రోధముల నణచుట ౫ యాత్మస్వరూపమునే యన్నివిధములయిన భోగ్యముగాఁ జేసికొనుట, ౬ సమస్త భూతములకు మేలు కోరువాఁడగుటయును నీ యారింటిచే ముందు చెప్పిన సమదర్శిత్వము కలుగును.

కామక్రోధములను విడిచి యాత్మయందే మనస్సుంచి మనస్సును జయించిన యతులకు నాత్మానుభవ సుఖము మిక్కిలి సులభము.

బాహ్యములయిన శబ్దాదివిషయ సంబంధములను వెలుపలనే వదలి, చూపును గనుబొమలనడుమ నునిచి, యుచ్ఛ్వాస నిశ్వా

సములు నాసాభ్యంతరమున సమానమైన గమనముగల వానిఁగాఁ జేసి, బాహ్యేంద్రియములను మనస్సును బుద్ధిని నాత్మావలోకనమందు నియమించి, కోరిక భయము క్రోధముమాని, మోక్షాసక్తి గలిగి, యాత్మావలోకనపరుఁడైన వాఁడు సర్వదా ముక్తుఁడే.

నన్ను యజ్ఞతపస్సుల ననుభవించువానినిగాను, సమస్తలోకేశ్వరులకు నీశ్వరునిఁగాను, సమస్త ప్రాణులకు హితునిఁగాను దెలిసికొనువాఁడు సుఖముగఁ గర్మయోగము సాధింపఁగలఁడు.

పంచమాధ్యాయము, కర్మసన్యాసయోగము సంపూర్ణము.

---

## షష్ఠాధ్యాయము.

### —♦ ఆత్మసంయమయోగము. ♦—

కర్మముల ఫలము నపేక్షింపక, "నా వర్ణాశ్రమధర్మములనుబట్టి నే నీకార్యము చేయఁదగినది. కావునఁ జేయుచున్నాను." అని యెవఁడు కర్మములఁ జేయునో వాఁడే జ్ఞానయోగనిష్ఠుఁడు; వాఁడే కర్మయోగనిష్ఠుఁడు. వాఁడు యజ్ఞాదులు లేనివాఁడు కాఁడు. చేయవలసిన క్రియలు మానినవాఁడును గాఁడు.

దేనిని జ్ఞానయోగమందురో యదియే కర్మయోగమని తెలిసికొనుము. దేహమం దాత్మ భ్రాంతి ఫలాపేక్ష వదలనివాఁ డెన్నఁడు కర్మయోగి కాఁజాలఁడు.

ఆత్మావలోకనముఁ బొందఁగోరు మునికిఁ గర్మయోగము సాధనము. ఆత్మావలోకనమున స్థిరపడిన యోగారూఢునికిఁ గర్మనివృత్తి సాధనము కావున నాత్మావలోకనరూపమైన మోక్షము లభించువఱకుఁ గర్మములఁ జేయవలయును.

ప్రకృతి సంబంధవిషయములందును, వానికి సంబంధించిన కర్మములందును, నెప్పు డాసక్తి లేనివాఁడగుచున్నాఁడో యప్పుడు

సమస్తసంకల్పములను విడిచి యాత్మదర్శనమందు స్థిరపడిన యోగారూఢుఁడని చెప్పబడును.

విషయములం దాసక్తి లేనిమనస్సుచేత నాత్మను సంసారసాగరమునుండి తరింపఁ జేయవలయును. విషయములపై మనస్సుపోనిచ్చి యాత్మను నధోగతిపాలు చేయరాదు. మనస్సే యాత్మకు బంధువు. మనస్సే యాత్మకు శత్రువు.

ఎవఁడు తాను దనమనస్సు విషయముల పాలుగాకుండ జయించునో యట్టివానికి వాని మనస్సే బంధువు. అట్లు మనస్సును జయింపని వానికి వాని మనస్సే శత్రువునలె నపకారము చేయును.

ఇఁక యోగమునకుఁ దగినవాని లక్షణములఁ జెప్పెద వినుము. చలి వేఁడిములు, సుఖదుఃఖములు, మానావమానములు, గలిగినప్పుడు మనస్సున నెట్టి వికారము లేనివాఁడును, బాహ్యేంద్రియ వ్యాపార నివృత్తిగలవాఁడు నగు పురుషునికి మనస్సునందుఁ బ్రత్యగాత్మ నిజస్వరూపముతో స్పష్టముగ ననుసంధింపఁబడుచుండును. ఆవలఁ బరిశుద్ధాత్మను దర్శించుట కలుగును. 2

ఎవఁడు దేహమునకంటె భిన్నమైన యాత్మ యొకటి కలదను జ్ఞానముచేతను, ఆయాత్మ ప్రకృతికంటె విజాతీయమై ప్రకృతికి లేని నిత్యత్వము, నిరతిశయానందత్వములోనైన గుణములుగలది యను విజ్ఞానముచేతను, దృప్తిఁబొందిన మనస్సుగలవాఁడై, తాను దేవతగా నుండినను మనుష్యుఁడుగా నుండినను మఱియేదశ నుండినను మార్పుచెందక యనుసరించు జ్ఞానమే యాకారముగాఁగల యాత్మ యందే మనస్సు నిలిపినవాఁడై, యింద్రియముల జయించి మట్టిపెళ్ళవలన రాతివలన నెంత ప్రయోజనమో బంగారువలన నంతే ప్రయోజనమని కావునఁ బ్రాకృతికములైనవియన్నియు సమానములని తలఁచువాఁడాత్మదర్శన రూపమగు యోగము నభ్యసింప నర్హుఁడు. 3

వయస్సునఁ దనకంటెఁ జిన్నలు పెద్దలుగానుండి తన మేలు గోరువారియందును సమానవయస్సుగలిగి హితము గోరువారియందును, బగవారియందును, నుదాసీనులందును, మధ్యస్థులందును,

దాయాదులయందును, బంధువులయందును, సాధువులందును, బా పాత్ములయందును, సమానమైన బుద్ధిగలవాఁడు యోగాభ్యాసము నకుఁ దగినవాఁడు గావున నధికుఁడు.

యోగాభ్యాసమందాసక్తిగలవాఁడు ప్రతిదినము యోగాభ్యాసమునకు నర్హమైన కాలములందెల్ల మనుష్యులులేక నిశ్శబ్దముగా నుండు స్థలమందు నొంటరిగాఁ గూర్చుండి యితరచింతలేని మనస్సుతోఁ, నాత్మకంటె వేఱైనవస్తువులందునపేక్షగానియునాత్మవస్తు వేద్వైనను నాదియను తలంపుగాని లేక తన్నుఁ దాను జూచుకొను చుండవలయును. ఇదియే యోగాభ్యాస మనఁబడును. ౧౦

ఇట్లు యోగాభ్యాసము చేయువాఁడు పరిశుద్ధప్రదేశమందు గట్టిగాను గదలకయుండునదిగాను నుండు పీఁటమొదలగుదానిపైఁ గూర్చుండవలయును. ఇది మిక్కిలి యెత్తుగ నుండరాదు. మిక్కిలి తగ్గుగాను నుండరాదు. ఈ యాసనముమీఁదఁ దొలుత దర్భలు పఱిచి దానిపైఁ గృష్ణాజినమువైచి దానిపై వస్త్రము పఱవవలయును. ఆ వస్త్రముమీఁద సుఖాసనమువేసికొని కూర్చుండి మనస్సు నటునిటు పోనీక కదలకుండ నిలిపి చిత్తేంద్రియ వ్యాపారములెల్ల మాని యాత్మబంధ నివృత్తికొఱకు దేహమునకంటెఁ దాను భిన్నుఁడ ననియుఁ దాను నిట్టిట్టి గుణములుకలవాఁడననియు నేకాగ్ర చిత్తుఁడై ధ్యానింపవలయును. ౧౧

ఇట్లభ్యాసముచేయునపుడు వెన్నముక కంఠము శిరస్సు వంపు లేక మూఁడును జక్కఁగ నుండవలయును. దేహము కదలక స్థిరముగ నుండవలయును. చూపు ముక్కుకొనపై నుండవలయు. దిక్కులు చూడరాదు. మనస్సును వశపఱచికొని దానిని నాయందే నిలుపవలయును. మనస్సు నాయందుంచినపుడు హెచ్చరిక తప్పరాదు. నన్నే చింతించుచుఁ గూర్చుండవలయును. నిలఁబడిగాని పండుకొనిగాని యభ్యసించుట యుత్తమపక్షముగాదు. యోగాభ్యాసముసేయువాఁడు బ్రహ్మచర్యవ్రత మనుష్ఠింపవలయు. దేనికిని భయపడరాదు. ౧౪

ఈవిధముగఁ బ్రతిదినము యోగాభ్యాసమునకుఁ దగినకాలములందెల్ల మనస్సును నాయందునిలుపువాఁడు నన్నేస్పృశించుటచేఁ బవిత్రుఁడగుటవలన నిశ్చలమైన మనస్సుగలవాఁడై నన్నే చింతించుటవలన శ్రేష్ఠమైన మోక్షసుఖమును బొందుచున్నాఁడు. ౧౫

ఇట్లు యోగాభ్యాసము చేయువాఁడు మితిమించి తినినను, బొత్తిగ భుజింపక పస్తులుండినను, ఎక్కువ నిద్రపోయినను, నిద్రయే మానినను యోగము లభింపదు. అట్టివాఁడు యోగి కాఁజాలఁడు.

ఆహారము సంచారము మితముగ నుండవలయును. చేయునట్టి వ్యాపారములును మితముగనే యుండవలయును. నిద్ర జాగరణము మితముగ నుండవలయును. ఇట్లుండిచేయు నభ్యాసమువలన సంసారబంధము నాశముచేయు యోగము సిద్ధించును. ౧౭

ఇట్లభ్యాసము చేయఁగాఁ జేయఁగా నెపుడు చిత్తము తనయందే విశేషముగ నిలిచి కోరికలన్నియుఁ దొలఁగిపోవునో యప్పుడట్టివాఁడు యోగయుక్తుఁడగును. ౧౮

గాలిలేనిచోటఁ గుండిలోనుంచిన దీపమెట్లు కదలకయుండునో యట్లితర వ్యాపారములనుండి మరలించిన మనస్సు కదలక యేకాగ్రమై యుండవలయును. ఆత్మదర్శనముసేయువాని మనస్సున కీదీపమే యుపమానము. ౧౯

విషయములనుండి మరలింపఁబడిన మన స్సేయోగాభ్యాసమందు "నాహా యిదియెంతటి గొప్ప సుఖము. విషయ సుఖము దీనిలోఁ గోట్యంశమునకైన సరిపోవునా" యని సుఖము ననుభవించుచున్నదో, దేనియందుఁ దన్నుఁ దాను మనస్సుచేఁ జూచుకొని సంతోషించుచు నితరములను గోరక యుండునో, దేనియందు నింద్రియాదులకు నలభ్యమై యాత్మవిషయక బుద్ధిచేతనే గ్రహింపఁదగిన యుత్కృష్ట సుఖము ననుభవించునో, దేనియందుండువాఁడు దానిని విడిచి వేఱొకదానికిఁ బోవఁడో, దేనియందుండు వాఁ డభ్యాసము చాలించియుండు సమయమందును దానినే కోరుచు దానికంటె

మించిన లాభము వేఱొకటి లేదని తలఁచుచుండునో, దేని యం దుండువాఁడు దారపుత్రాదులు మరణించుట లోనగు మహాదుఃఖ ములు కలిగినను మనస్సునఁ జలింపకయుండునో, దుఃఖ సంబంధ మును దొలఁగించు నట్టిదే యోగమనఁబడును. యోగాభ్యాసము చేయువాఁడు తనకుముం దిట్టిదశ రాఁబోవునని యెఱిఁగి యిట్టి దశ వచ్చినపుడు వ్యాకులుఁడు కారాదని యోగారంభ దశయందే నిశ్చ యించుకొని, యిట్టిది వచ్చినపు డిదిముందు మనము నిశ్చయించు కొన్నదే కదా యిప్పుడేల విచారమని చింతలేక సంతుష్టుఁడై యభ్యా సము చేయవలయును. యోగాభ్యాసము యావజ్జీవము చేయఁదగి నది. నడుమ బంధువియోగాదులు రాక మానవు. వానివలనఁ దత్కాలమున విఘ్నము కలిగినను విఘ్నకారణములు దొలఁగి పోఁ గానే మరల నభ్యసింప వలయునుగాని మానరాదు. —౨౩

కామములు రెండు విధములు. స్పర్శజములు, సంకల్పజములు. తాఁకుటవలనఁ గలిగిన చలివేఁడి లోనైనవి స్పర్శజములు. సంకల్ప ములవలనఁ గలిగిన పుత్రులు పసువులు లోనైనవి సంకల్పజములు. స్పర్శజము లనివార్యములు. వలదనిన రాకమానునవికావు. ఎండ వలన వేఁడి, చలిగాలివలనఁజలి, కలుగకుండఁ జేసికొన సాధ్యపడదు. కావున నట్టివి వచ్చినపుడు సంతోషపడరాదు; దుఃఖమును బడరాదు. సహించి యూరకుండ వలయును. సంకల్పజములు తానై కోరి తెచ్చు కొన్నవి. ఇట్టి వానిని సంపూర్ణముగ విడువవలయును. వీనియందు మనస్సు పోనీయక యింద్రియములను విషయములనుండి మెల్లమెల్లగ మరలించి, మనస్సు విషయములమీఁదఁ బోయినపు డంతయు "నయ్యో! దుఃఖకారణములైన విషయములకై యేల పరువు పాఱెద వని మనస్సును వానియం దుండనీక మరల్చి యాత్మయం దుంపవలయును గాని కొంచెమైనను నాత్మగానిదానిని స్మరింపరాదు.

మనస్సు నిలుకడలేక యెల్లప్పుడు చలించుచుండునది. విష యాసక్తి కలిగించుటకుఁ గారణమగు దానికై యొకదానినుండి మఱి యొక దానికై పరువెత్తు చుండునది. కావున నెప్పుడెప్పు డది యాత్మ

యం దుండక యితర పదార్థములకై పోవునో వెంటవెంటనే దానిని నచటనుండనీక మరలించి తెచ్చి యాత్మయందే నిలిపి దానికి వశపడి యుండునట్లు చేయవలయును. ౨౬

ఆత్మయందు మనస్సును నిలుకడగా నిలుపుటచే సకల పాపములు నాశములగును. కావున నతనియందలి రజోగుణము నశించును. ఆ కారణముచే నతఁడు శుద్ధాత్మ స్వరూపుఁడగును. ఇట్టి యోగికి నిరతిశయ సుఖము కలుగును. ౨౭

ఈ విధముగా యోగి యాత్మయోగ మభ్యసించుచుఁ గల్మషములనెల్ల నశింపఁజేసి బ్రహ్మానుభవ రూపమై పరిమితిలేని సుఖమును సర్వదా సుఖముగ ననుభవించును. ౨౮

యోగముచే నాత్మస్వరూపమును పొందినవాఁ డాత్మలన్నియు సమానము లని చూచును. తన యాత్మ సర్వభూతములయం దున్నట్టును సమస్త భూతములు తనయాత్మయం దున్నట్టును జూచును.

అన్నియాత్మలు సమానాకారము లను జ్ఞానముకంటె నెక్కువ పరిపాకదశఁ బొందినవాఁడు సమస్తాత్మలయందు నన్నును నాయందు సమస్తాత్మవస్తువులను జూచును. వానికి నేను గనఁబడకపోను. వాఁడును నాకెప్పుడును గనఁబడుచునే యుండును. ౩౦

ఎవఁ డసంకుచితజ్ఞానమే యాకారముగఁ గలిగి తాను నేను సమానమగు టెఱిఁగి సమస్తభూతములందుండు నాతో సమానమైన తన యాత్మస్వరూపమును దర్శించుచున్నాఁడో వాఁడు యోగమును విడిచి లేచి లౌకికవ్యాపారములయందున్నను నాయందున్నవాఁడే.

అంతటఁగల యాత్మలన్నియు సమానములనియు నితరుల సుఖదుఃఖములు తనకెట్లు సంబంధింపవో యట్లే తన దేహసుఖదుఃఖములును దనకు సంబంధింపవని యెవఁడు చూచునో వాఁ డుత్కృష్టుఁడైన యోగియగును. ౩౨

అనిన నర్జునుం డిట్లనియె.

కృష్ణా! యింతవఱకు దేవతలు మనుష్యులు మొదలగు రూపభేదములవలనను, జీవుఁడు ఈశ్వరుఁడు అనుభేదమువలనను నాత్మ

లన్నియు నానాకారములని తలంచియుంటిని. ఇప్పు డాత్మలన్నియు నొండొంటితో సమానములగుటయే కాక యీశ్వరునితోడను సమానములని సమదర్శనరూపమైన యోగమును నీవు నాకుఁ జెప్పితివి. ఈ యోగమువలన నాత్మలన్నియు సమానములుగదా యని యనుకొనుటేకాని చిత్తశుద్ధిలేని కారణముచేతను, అనాదిగా భేదబుద్ధిగలవాఁడనగుటను నామనస్సున నాయోగము స్థిరముగా నిలవకున్నది. మనస్సు చపలస్వభావముగలది. బలాత్కారముగాఁ గలవరపెట్టునది దృఢమైనదికదా. అట్టిమనస్సును నిరోధించుట యన వాయువును నిరోధించుటవలె మిక్కిలి దుష్కరమని తలఁచెదను. ౩౪

అనిన శ్రీకృష్ణమూర్తి యిట్లనియె.

అర్జునా! నీవు చెప్పినది సత్యము. మనస్సు చంచలస్వభావము కలది గనుకనే నిగ్రహింపరానిది. సందేహము లేదు. అయినను అభ్యాసముచేతను వైరాగ్యముచేతను నది పట్టుపడుచున్నది. ౩౫

మనస్సును జయింపని వానికి యోగము సాధ్యముకాదని నానిశ్చయము. మనస్సును వశపఱచికొనినవాఁడు కర్మయోగమను నుపాయముచే నీ యోగమును బొందఁగలుగును. ౩౬

అనిన నర్జునుం డిట్లనియె.

కృష్ణా! యొకఁడు యోగాభ్యాసమునందు శ్రద్ధగలిగి ప్రవర్తించుచున్నాఁడుగాని యేదో కారణముచే దృఢముగా నభ్యసించు ప్రయత్నము లేకుండుటచే నా జన్మమందు యోగసిద్ధిని బొందఁజాలకున్నాఁడు. అట్టివాని గతియేమి? వీఁడు మోక్షాపేక్షచే యోగమభ్యసించుచు ఫలములను గోరి కర్మములు చేయుమని స్వర్గాది సౌఖ్యములు వీనికి లేవు. మోక్షసాధనమైన యోగమును దుదముట్ట నభ్యసింపమిని మోక్షమును లేదు. ఇట్టివాఁడు పెద్దమేఘమునుండి చీలి వేఱొక మేఘముతోఁ గలిసికొనలేక నడుమనే రూపుమాసి నశించిన మేఘము తునుకవలె నుభయభ్రష్టుఁడు కాఁడుగదా. ఈ నాసందేహమును నిశ్శేషముగాఁదీర్ప నీకంటె శక్తిగలవాఁడు నాకు లభింపఁడు. ౩౬

అనిన భగవంతుం డిట్లనియె.

అర్జునా! యోగభ్రష్టునకుఁ బ్రాకృతస్వర్గాదిభోగము లనుభవించుటయందుఁ గాని బ్రహ్మానుభవమందుఁ గాని నాశములేదు. నాయనా! శుభరూపమగు యోగము నభ్యాసము చేయువాఁ డెవ్వఁడును దుర్గతిని బొందఁడు. యోగము నభ్యసింపఁ బ్రారంభించి దానినుండి భ్రష్టుఁడైనవాఁడు పుణ్యాత్ములు పొందులోకములకుఁ బోయి యందుఁ దానట్టి భోగములఁ గోరి యోగమునుండి భ్రష్టుఁడయ్యెనో యాభోగములకంటె మేలైన భోగముల ననుభవించుచు నాయాశ తీఱువఱ కాలోకమందేయుండి యది తీఱినవెనుక శుచులును శ్రీమంతులునైన వారింటఁ దన మహిమచేఁ బుట్టుచున్నాఁడు. అనుభవముచేఁ బుణ్యము క్షీణించునుగాని యోగమహాత్వము క్షీణింపదు. ౪౧

అట్లు యోగయోగ్యుల యింటఁ బుట్టఁడేని తామే యోగులుగానుండి యోగ ముపదేశించువారి యింటనైనఁ బుట్టును. ఇట్టి జన్మము మిగుల దుర్లభము. యోగారంభమున భ్రష్టుఁడైనవాఁడు యోగయోగ్యుల యింటను, బరిపక్వమగునపుడు భ్రష్టుఁడైనవాఁడు యోగులయింటను బుట్టును. ఇట్టి జన్మములు యోగమహత్త్వము వలనఁ గలుగును గాని యితరవిధములఁ గలుగదు. ౪౨

అర్జునా! యా మఱు జన్మమందు వానికిఁ బూర్వజన్మమందుఁ గలిగిన యోగవిషయమైన బుద్ధి మరలఁ గలుగును. ఆ బుద్ధివలన మరల విఘ్నములుగాక భ్రష్టుఁడుగా నుండునట్లు వాఁడు దృఢప్రయత్నము చేయును. వాఁడీజన్మమున దానిని మఱచి పరవశుఁడై యున్నను బూర్వజన్మమున యోగమభ్యసించుచుండిన వాఁడగుటచేత నా యభ్యాసబలమే వానిని మరల యోగ మభ్యసింపఁ జేయుచున్నది. ౪౩

యోగమభ్యసింపక యోగస్వరూపమును దెలియ నిచ్ఛగలవాఁడును దానినుండి చలించినను మఱుజన్మంబున నా యిచ్ఛనే మరలఁ బొందినవాఁడై మొదటఁ గర్మయోగమును బిదప నాత్మ

సాక్షాత్కారరూపమైన యోగమును నభ్యసించి ప్రకృతి బంధము నుండి విడివడుచున్నాఁడు. ౪౪

ఈ యోగ మహాత్త్వ మిట్టిదగుటవలనఁ బూర్వజన్మముల నార్జించిన పుణ్యములచేఁ బాపములనెల్ల నాశమొనర్చి యాకారణమున యోగమున కర్హుఁడై యెక్కువ పూనికతో యోగ మభ్యసించుచుండిన వాఁడు దానినుండి చలించినను మరల నా యోగమునే పొందుచు ననేక జన్మసిద్ధుఁడై యుత్తమగతిని బొందును. యోగాభ్యాసము చేయువాఁడు కేవల కృచ్ఛ్రాదితపస్సులు చేయువానికంటె నధికుఁడు. ఆత్మజ్ఞానముతప్ప దక్కిన జ్ఞానముగలవారికంటె నధికుఁడు. కేవల మశ్వమేధాదికర్మములఁ జేయువానికంటె నధికుఁడు. కావున యోగివికమ్ము. ౪౬

ఎవఁడు నాయందు మనస్సుంచి నన్ను బొందుటకుఁ ద్వరగలవాఁడై నాయందు భక్తిగలవాఁడగుచున్నాఁడో వాఁడు ముందు చెప్పఁబడిన యోగులకంటెను, దపస్వులు లోనగు వారికంటెను, శ్రేష్ఠుఁడని నా యభిప్రాయము. ముందు చెప్పఁబడిన యోగులు ప్రత్యగాత్మ నవలోకనము చేయువారు, భక్తులు నన్నే యుపాసించువారు కావున యోగులకంటె నా భక్తులు శ్రేష్ఠులు. ౪౭

షష్ఠాధ్యాయము, ఆత్మసంయమయోగము సంపూర్ణము.

---

## సప్తమాధ్యాయము.

### —♦ విజ్ఞానయోగము. ♦—

రుక్మిణి:-అప్పా! యోగమువలననే మోక్షము వచ్చునని ముందు చెప్పి యిప్పుడు 'యోగులకంటె భక్తులు శ్రేష్ఠులు!' అని కృష్ణభగవానుఁడు చెప్పెనే యేమి కారణము? యోగులు మోక్షమును బొందువారే, భక్తులును మోక్షము చెందువారేకదా? ఆ యిరువురిలో భక్తు లెట్లు శ్రేష్ఠులు? మోక్షమునకు మించినది మఱి యొకటి కలదా?

తండ్రి:-బ్రహ్మలోకమునకుఁ బోయినవారికిని మరల జన్మముగలదు. అక్కడనుండి మోక్షమునకు యోగ్యత సంపాదించుకొని దానిని దాఁటిపోయినవారందఱు ముక్తులే. ముక్తి దశయందవాంతర భేదములు గలవు. అన్నిటికంటె నెక్కువదశ భగవత్ప్రాప్తి. యోగమునందుఁ గేవల మాత్మావలోకనము చేయువాఁడు కైవల్యమును బొందును. కైవల్యమునకుఁ బోయినవానికి మరల జన్మను లేకపోయినను నది భగవత్ప్రాప్తికంటెఁ దక్కువది. భక్తుఁడు భగవంతునిఁ బ్రాపించును. ఆ యిరువుర కది భేదము. కాఁబట్టి యోగి యాత్మస్వరూప మిట్టిదని తెలిసి యిట్టిదేకదా పరమాత్మ స్వరూపమనియెంచి పరమాత్మను ధ్యానించుచు మనస్సాయనయందు లయింపఁ జేసి యా మహిమ ననుభవించుచు సంతోషించు చుండవలయును. కాఁబట్టి భక్తికి యోగము నిచ్చెనమెట్టు వంటిది. భగవంతునియందు భక్తి కుదురుటకై భగవంతుని స్వరూపతత్త్వమును, నది మనకు గోచరింపక ప్రకృతివలన మఱుఁగుపడియుండఁ గారణము నా తెర తొలఁగిపోవు నుపాయము మొదలైన విఁకఁ జెప్పఁబడును.

శ్రీకృష్ణమూర్తి :—

అర్జునా! నాయందే మనస్సు దృఢముగా నిలిపి, నన్నే యాధారముగఁగొని, యోగాభ్యాసముచేయు నీవు యోగమునకు విషయమైన నన్ను నిస్సంశయముగను బూర్ణముగను నే జ్ఞానముచేఁ దెలిసికొనఁగలవో యట్టిదానిని వినుము. సమస్త చేతనాచేతములకంటె భగవంతుఁడు విలక్షణుఁడు అను విజ్ఞానముతోడ నా స్వరూపవిషయమైన జ్ఞానమును బూర్ణముగాఁ జెప్పెదను. ఇది దెలిసికొనినపిమ్మట నీవీవిషయమున మరలఁ దెలిసికొనఁదగిన దేదియు నుండదు.

వేలకొలఁది మనుష్యులలో నెవఁడో యొకఁడు సిద్ధి కలుగువఱకుఁ బ్రయత్నించును. అట్లు సిద్ధిపర్యంతము యత్నము చేయువారిలో నెవఁడో యొకఁడు నాతత్త్వమిట్టిదని యున్నదున్నట్లు తెలిసికొనుచున్నాఁడు. ఇఁక నా స్వరూప యాథార్థ్యమును జెప్పెద వినుము,

భూమి - జలము - అగ్ని - వాయువు-ఆకాశము-మనస్సుతోఁడఁ బదునొకొండింద్రియములు, బుద్ధి యనెడి మహత్తత్వము - అహంకారతత్త్వము - అని ప్రకృతి యనిమిది విధములం గలది. ౪

ఈజగత్తునకు మూలమైన ప్రకృతినాదే. ఇది యచేతనమైనది. అర్జునా! యీ ప్రకృతి నికృష్టమైనది దీనికంటె వేఱై జీవస్వరూపముగ నుండు చేతన ప్రకృతి మఱియొకటుగలదు. అది ప్రధానమైనదిగఁ దెలిసికొనుము. ఈ చేతన ప్రకృతిచేతనే యచేతనమైన జగత్తు ధరింపఁబడుచున్నది.

సమస్తములైన భూతముల యుత్పత్తికి నీచేతనాచేతన ప్రకృతులే కారణము. సమస్త జగత్తు రెండు ప్రకృతులవలనఁ బుట్టుట చేతను ఆ ప్రకృతులు నావలనఁ గలిగినవి కావున నావియగుట చేతను జగత్తున కంతయుఁ బుట్టుచోటు నశించుచోటు నేనే.

ఈ విధముగ నేనే యన్నిటికంటె నధికుఁడను. నాకు మించినది వేఱొకటి లేదు.

ఏ ప్రకారము హారమునందు దారము రత్నముల సమూహములోపలఁ దూఱియుండి వాని కాధారమై యుండునో యట్లే నేను నంతర్యామినై సమస్తచేతనాచేతన వస్తువులందుండి వాని కాధారమై యున్నాఁడను.

ఏ పదార్థములం దెట్లుండు నందు వేని యుదకములందు రుచి నేను. చంద్రసూర్యులయందుఁ గాంతి నేను. సమస్త వేదములందోంకారము నేను. ఆకాశమందు శబ్దము నేను. నరవారియందుఁ బుంస్త్వము నేను. భూమియందలి పుణ్యగంధము నేను. అగ్నియందు దహించు శక్తి నేను. సమస్త శరీరములందుఁ బ్రాణముస్థితికి హేతువు నేను. తపస్వులయందుఁ దపము నేను. సమస్త భూతములకు నిత్యమైన బీజము నేను. బుద్ధిమంతుల యందలి బుద్ధి నేను. తేజస్వుల యందుఁ దేజస్సు నేను. బలముగల వారియందుఁ గామ రాగములు లేనిబలము నేను. ప్రాణులయందు ధర్మశాస్త్ర విరుద్ధము కాని కామము నేను.

సాత్త్విక భావములు - రాజసభావములు - తామసభావము లే వేవిగలవో యవి యన్నియు నావలననే కలిగినవి. అవి నాయం దున్నవి కాని వానియందు నేను లేను. వాని యునికికి నేనాధార మను గాని నా యునికికి నవి యాధారము కావు. ౧౨

ఈ ప్రపంచమంతియు సత్త్వ రజస్తమోగుణ మయములగు పదార్థములచే మోహితమైనది. కావున నీపదార్థములకంటె మిక్కిలి యుత్కృష్టుఁడగు నన్నది యెఱుఁగ లేకున్నది. ఏలంటివా. ౧౩

దేవుఁడనగు నాచే నిర్మింపఁబడి త్రిగుణమయమైన నా మాయ యతిక్రమింప రానిది. ఇది నా స్వరూపము తెలియ రాకుండునట్లు లడ్డపడును గాని యెవరు నన్నే శరణు చొత్తురో వా రీమాయను దాఁటి నా స్వరూపమును జూడఁ గలవారగుచున్నారు. ౧౪

మూఢులు, నరాధములు, మాయాపహృతజ్ఞానులు, అసుర భావాశ్రితులని పాపాత్ములు నాలుగువిధముల వారు కలరు. వీరు నన్ను భజింపరు.

సర్వ పదార్థములు నాకు భోగ్యములై యుండఁగా నవి తమకు భోగ్యములని తలఁచువారు మూఢులు. సామాన్యముగా నా స్వరూపము కొంత యెఱిఁగిన వారయ్యు నాయం దాసక్తి లేని వారు నరాధములు. సర్వమునకు స్వామి నేనే యను జ్ఞాన ముదయించి యుండినను కుయుక్తులచే నా జ్ఞానమును బోఁగొట్టుకొను వారు మాయాపహృతజ్ఞానులు. నన్నును నాయైశ్వర్యమును గుఱించిన జ్ఞానము కలిగియు దానివలన నాయందు ద్వేషబుద్ధిగలవా రసుర భావాశ్రితులు. ఇందు ముందు జెప్పిన వారికంటె వెనుకఁ జెప్పఁబడిన వా రెక్కువ పాపాత్ములు.

నాలుగు విధములుగల పుణ్యాత్ములు నన్ను సేవింతురు. వీరు - ఆర్తుఁడు-అర్థార్థి - జిజ్ఞాసువు-జ్ఞానియును వారలు. ఐశ్వర్యమును బోఁగొట్టుకొని మరల నైశ్వర్యము గోరువాఁ డార్తుఁడు. నూతనముగ నైశ్వర్యము గోరువాఁ డర్థార్థి. శుద్ధాత్మస్వరూపముఁ బొందఁ గోరువాఁడు జిజ్ఞాసువు. నన్నే పొందఁగోరువాఁడు జ్ఞాని. ఈ నలువురిలోఁ

ముందు చెప్పఁబడిన వానికంటె వెనుకఁ జెప్పఁబడిన వాఁడు శ్రేష్ఠుఁడు.

ఈ నలుగురిలో జ్ఞానియే శ్రేష్ఠుఁడు. తక్కిన ముగ్గురు వారి వారి కోరిక నెఱవేఱుటకే నన్ను నుపాసింతురు. జ్ఞానియో సర్వకాలము లందు నా యొక్కనియందే భక్తిగలవాఁడై యుండును. నన్ను సేవించుట తప్ప నతనికి నితరములైన కోరికలు లేవు. కావున నేను జ్ఞానికి మిక్కిలి ప్రియుఁడను. అతఁడును నాకట్టి యిష్టుఁడే. వీరందఱు నుదారబుద్ధిగలవారే. అందు జ్ఞానినాయాత్మయేయని నానిశ్చయము. వాఁడు నాతోడి కూడికను నెదురు చూచుచు నన్నే యుత్తమగతిగా నిశ్చయించుకొని యున్నవాఁడగును. అనేక జన్మములైన తరువాతఁ గడపట మీఁదఁ జెప్పఁబడిన జ్ఞానము కలవాఁడైన సర్వము వాసుదేవుఁడే యని నన్ను నుపాసించుచున్నాఁడు. ఇట్టి మహాత్ముఁడు దుర్లభుఁడు. ౧౯

తమకుఁ బూర్వజన్మమందలి యనుభవముచేఁ గలిగిన పాపవాసనతో నెడఁబగని సంబంధముగలవారై, యీ వాసన కనురూపములగు పదార్థములఁ గోరుచు. ఆ కోరికచేత భగవంతుని విషయమైన జ్ఞానమును బోఁగొట్టుకొని తముఁ గోరిన పదార్థముల నే దేవత లిత్తురని వారు తలంతురో యట్టి దేవతలకుఁ బ్రీతికరములైన నియమములు కలిగి నాకంటె నితరులైన దేవతలను భజించుచున్నారు. ఏ దేవతను బూజించినను నన్నే పూజించినట్లైనను వారు నన్నుఁ బూజించుచున్నామను ననుసంధానము లేనివారగుటచే నా దేవతలను బూజించిన మితఫలము మాత్రమే వారికిఁ గలుగుచున్నది. ౨౦

ఎవ్వఁడెవ్వఁడేయే దేవతారూపమును భక్తి శ్రద్ధలతో నర్చింపఁ గోరునో యాయా పురుషునకా శ్రద్ధనే దానియందు నిర్విఘ్నమైన దానిఁగా నేను జేయుచున్నాను. ఆ భక్తుఁడు నిశ్చలమైన శ్రద్ధతో నా దేవతల యారాధనము చేయఁ గోరినను, ఆ దేవతలఁ బూజిం

చుట వలనఁ దాను గోరిన పదార్థములను నేనే వానికి లభింపఁ జేయుచున్నాను. ౨౧

స్వల్ప బుద్ధిగలవారై యితర దేవతలను బూజించువారి కా దేవతారాధనమువలనఁ గలుగు ఫలము శీఘ్ర కాలమందే నశించును. ఏ దేవతయు దన యధికారమునకు మించిన ఫలము నీయఁ జాలఁడు. ఆ దేవతలును దమ పుణ్యానుభవము తీఱఁగానే మరలఁ గ్రిందికి రావలసినవా రగుదురు. వారితోపాటు వీరును వత్తురు. నేను శాశ్వతుఁడను గనుక నన్ను సేవించిన వారికి మరల జన్మము లేదు. వారు నన్నే పొంది నిత్యసుఖ మనుభవింతురు. ౨౩

"నీవు శీఘ్రముగ వరమిచ్చు వాఁడవు కావు. ప్రత్యక్షమగు వాఁడవును గావు. కావున శీఘ్రఫలప్రదాతలగు దేవతలవిడిచి నిన్నె వ్వఁడు సేవించు" నందువా వినుము.

నిత్యమై నిరతిశయమైన నా పరస్వభావమును దెలిసి కొనలేక యీశ్వరుఁడనై యుండియుఁ దమమీఁద కరుణచే మనుష్యావతార మెత్తితినని గ్రహింపనేరక తమ వలెనే నేనును బూర్వము తెలియబడక యుండి, కర్మబద్ధుఁడనై మనుష్యుఁడుగాఁ బుట్టితినని బుద్ధిలేని వారు దలంతురు. ఈ కారణముచే సులభుఁడనై యుండునప్పుడును వారు నన్నాశ్రయింపరు. ౨౪

నేను యోగమాయచే నావరించు కొనఁబడిన వాఁడనై నా పరస్వభావ మందఱకుఁ బూర్ణముగఁ దెలియనీయక యుందును. అట్లని నా పరస్వభావమంతయు దాఁచినవాఁడను గాక మనుష్యులకు సాధ్యపడని కార్యములఁ జేయుచు నా తేజస్సును బ్రకాశింపఁ జేయు చుందును. అట్టి యమానుష చరిత్రములనుబట్టియైన నా పరస్వభావము నిర్ణయించు కొనలేక మూఢజనులు నన్నుఁ దమతోపాటు సామాన్య మనుష్యునిగాఁ దలతురు. ౨౫

జరిగినవి జరుగుచున్నవి జరగఁబోవునవి యగుభూతముల నేనెఱుఁగుదునుగాని నన్నొక్కటియు నెఱుఁగదు. ౨౬

అన్ని భూతములు పుట్టినప్పుడే యభిలాష ద్వేషములవలనఁ గలిగిన శీతోష్ణ సుఖదుఃఖాది ద్వంద్వములచే మోహము చెందు చున్నవి. ౨౭

అందుఁ బాపములు క్షీణించి పుణ్యాత్ములగువారె సుఖ దుఃఖాది ద్వంద్వములనుండి విడివడినవారై దృఢసంకల్పముతో నన్ను సేవింతురు. ౨౮

ఎవరు నన్నాశ్రయించి యాత్మదర్శనమునకై యత్నింతురో యట్టివారు తద్బ్రహ్మమును బూర్ణముగ నధ్యాత్మమును సకల కర్మముల నెఱుఁగవలయుదు. వీరు కైవల్యార్థులు. ౨౯

నన్ను నధిభూతముగాను, నధిదైవముగాను, నధియజ్ఞునిగాను, నెవరు తెలియుదురో వారు మరణకాలమందుఁగూడ నియమితమన స్సుతో నన్నెఱుఁగవలయు. 30

సప్తమాధ్యాయము, విజ్ఞానయోగము సంపూర్ణము.

---

## అష్టమాధ్యాయము.

### ♦ అక్షర పరబ్రహ్మయోగము. ♦

అనిన అర్జునుం డిట్లనియె.

కృష్ణా! బ్రహ్మమని చెప్పితివే యా బ్రహ్మమేది? అధ్యాత్మ మన నేమి? ఎట్టిది కర్మము? అధిభూత మెట్టిది? అధిదైవ మన నెద్ది? ఈ దేహమునందు నధియజ్ఞుఁ డెవఁడు? నియతాత్ములగువారు ప్రాణ ప్రయాణసమయమం దధియజ్ఞుని నెట్లు తెలిసికొనఁగలరు? ౨

అనినఁ గృష్ణుం డిట్లనియె,

దేహములతోఁగూడిన యాత్మలు క్షేత్రజ్ఞులు. ఆ క్షేత్రజ్ఞుల సముదాయమే యక్షరము. దీనికే బ్రహ్మమని పేరు. అధ్యాత్మమనఁ గాఁ బ్రకృతి. మనుష్యాదిస్వరూపములను గలిగించు రేతస్సును విడుచుట కర్మము. అధిభూత మనఁగా శబ్దస్పర్శరూపరస గంధ

ములు. అధిదైవమనఁగాఁ బురుషుఁడు. ఈ దేహమందు నేనే యధి యజ్ఞుఁడను. ४

మరణకాలమం దెవఁడు నన్నే స్మరించుచు దేహమును విడుచునో, వాఁడు నా వెట్టి యాకారమును స్మరించునో యట్టి యాకారమును బొందుచున్నాఁడు. ఈ విషయమున సందేహమేమియు లేదు.

అర్జునా! మరణకాలమం దెవఁ డేరూపమును జింతించుచు దేహమును విడుచునో వాఁడు మఱుజన్మమున నట్టి రూపమునే పొందును. వాఁడు జీవించియున్నప్పు డెల్లవేళల దేనిని స్మరించునో యది మరణవేళనుగూడ నభ్యాసవశమున స్మరించును. ౬

కావున నర్జునా! సర్వకాలములందు నన్నే స్మరించుచుండుము. యుద్ధమునుగూడఁ జేయుము. నాయందు మనస్సును బుద్ధి నిలిపితివా నన్నే నిస్సందేహముగఁ బొందగలవు.

అభ్యాసము ధ్యానము వీనితోఁగూడి వేఱువిషయములఁ బ్రవర్తింపని మనస్సుతో నప్రాకృతదివ్యస్వరూపుఁడనైన నన్ను నంత్యకాలమున స్మరించువాఁడు నన్నుఁ బొందుచున్నాఁడు. ౮

సర్వదర్శియు, ననాదిపురుషుఁడును, ప్రపంచమును నియమించువాఁడును నణువగు జీవాత్మకంటె సూక్ష్మతరమైనవాఁడును, సకలజగత్సృష్టికర్తయును, జింతింప నశక్యమైన స్వరూపముగలవాఁడును, ప్రకృతికావల సూర్యునివలె వెలుంగువాఁడును, నగు పరమపురుషుని నెవఁడు భక్తితోను, యోగబలముతోనుగూడి నిశ్చలమైన మనస్సుచే మరణకాలమందుఁ బ్రాణవాయువును గనుబొమల నడుమ నిలిపి స్మరించునో వాఁ డాపరమపురుషుని బొందును. ౧౦

వేదవేత్తలు నాశములేనిదని దేనిని జెప్పుచున్నారో, కోరికలను విడిచిన జితేంద్రియులే యక్షరమును బ్రవేశించుచున్నారో, నే యక్షరమును బొందఁగోరువారు బ్రహ్మచర్యమునఁ జరింతురో, యట్టి నాస్వరూపమును నుపాసించుటకుఁ దగినట్లు నీకు సంగ్రహముగా జెప్పెదను. ౧౧

ఇంద్రియములనెల్ల విషయములందుఁ బోనీక త్రిప్పి, మనస్సును హృదయపద్మమందుంచు నాపై నిలిపి, యోగమున నిశ్చలుఁడై పరబ్రహ్మవాచకమగు నోంకారము నుచ్చరించుచు, ఆ ఓంకార వాచ్యుఁడనైన నన్ను ధ్యానించుచుఁ, దన ప్రాణవాయువును శిరస్సున నుండు నాడియందుంచి శరీరమును విడిచి యెవఁడు పోవునో వాఁ డుత్కృష్టమైనగతిని బరిశుద్ధాత్మస్వరూపమును గైవల్యమును బొందును.

అర్జునా! యెవ్వఁడు జ్ఞానమార్గమారంభించినది మొదలుకొని యెల్లవేళల నైశ్వర్యము మొదలగు నితరవిషయములందు మనస్సు పోనీక నన్నే చింతించుచున్నాఁడో, నాతోడి నిత్యయోగము గోరునట్టి మునికి నేను సులభముగా లభ్యపడుచున్నాను. (అంత్యకాలమున రోగాది బాధలచే వాఁడు నన్ను స్మరింపకుండినను నేనే వానిని స్మరించి వరింతును.)

గొప్పమనస్సు గలవారగుటవలన నాస్వరూపము నెఱిఁగిన వారై యుత్కృష్టసిద్ధిని బొందినవారు నన్నుఁ బొంది మరల నశాశ్వతము దుఃఖాలయము నగు జన్మమును బొందరు.　　　౧౫

బ్రహ్మలోకపర్యంతము గల లోకములన్నియు నశించునవియే. కావున నా యా లోకములకుఁ బోయినవారును వానితోడ నశించి మరల జన్మింతురు. నన్నుఁ బొందినవారు మరల జన్మింపరు.　　　౧౬

అర్జునా! నాలుగుయుగములు కలసిన నొక మహాయుగమగును. అట్టి వేయిమహాయుగములు బ్రహ్మకొక పగలు. అట్టి వేయి మహాయుగములు బ్రహ్మకొక రాత్రి. ఒకరేయి పగటికిఁ గల్పమని పేరు. బ్రహ్మకుఁ బగలు కాఁగానే ప్రకృతినుండి బ్రహ్మదేహమును బొందిన లోకములందన్నిటఁ గానవచ్చు పదార్థములన్నియుఁ బుట్టుచున్నవి. బ్రహ్మకు రాత్రియయినపుడు మరల నన్నియు నా ప్రకృతియందే లీనమగుచున్నవి. ఈ విధముగ భూతసమూహమంతయు వాని కర్మబలమున బ్రహ్మమేలుకొన్నపుడు పుట్టిపుట్టి యాయన నిద్రపోవునపుడు లీనమగుచున్నది.

ఆ ప్రకృతికంటెను గొప్పదియు వేఱైనదియు నింద్రియములకుఁ దెలియరానిదియు సత్యమైనదియు నగుజీవాత్మయనెడు పదార్థము భూతములన్నియు నశించినను దాను నశించునదికాదు. కావున నే ప్రమాణముచేతను దెలియరాని పరిశుద్ధాత్మస్వరూపము ముఖ్యమైన గతిగాఁ జెప్పుదురు. ఆ పరిశుద్ధాత్మ స్వరూపమును బొందినవారు మరల జన్మింపరు. ఆ పరమధామము నాదియే. ౨౧

ఇప్పుడు నేను జెప్పిన కైవల్యప్రాప్తి యాత్మనిష్ఠగలవారికిఁ గలుగునది. ఇఁక జ్ఞానముతోఁగూడిన తదేకభక్తిగలవారెవనియందు సమస్తభూతము లంతర్గతములైయున్నవో యెవఁ డన్నిట వ్యాపించి యున్నాఁడో యట్టివంటి పరమపురుషునిఁ గలయుచున్నారు. ౨౨

(రుక్మిణి—అప్పా! ముందాత్మదర్శనము వలన భగవత్ప్రాప్తియని చెప్పితివే, యిపుడు కైవల్యప్రాప్తి చెప్పెదవే యది యేమి?

తండ్రి—ఇప్పుడు చెప్పినది యాత్మనిష్ఠ. ఆత్మయందే మనస్సునిలిపి, పొందవలసినది యాత్మస్వరూపమే, యనువాఁ డాత్మనిష్ఠుఁడు. భక్తి నాధారము చేసికొని పొందవలసినది భగవంతుని నని యాత్మావలోకనము చేయువాఁ డాత్మదర్శి. ఆత్మనిష్ఠునకు వాఁడు కోరినప్రకారమాత్మస్వరూప ప్రాప్తి. ఆత్మదర్శికి వాఁడు కోరిన ప్రకారము భగవత్ప్రాప్తి. అంతియభేదము. ఇరువురకు మరల జన్మములేదు. వీ రిరువురు పోవుమార్గ మొకటే యని భగవంతుఁడు చెప్పుచున్నాఁడు విను.)

శ్రీ కృష్ణుఁడు:—

అర్జునా! జ్ఞానులుశరీరమువిడిచి యేమార్గమునఁబోయి మరల జన్మింపరో, పుణ్యములుచేసిన వారేమార్గమునఁ బోయి మరల జన్మింతురో యామార్గములను జెప్పెదను. బ్రహ్మవేత్తలుత్తరాయణమున శుక్లపక్షమునఁ బగటివేళ దేహమునువిడిచి యా కాలాభిమాన దేవతలుండు మార్గమునఁబోయి పరబ్రహ్మమునుబొంది మరల జన్మింపరు. ఈ మార్గమునకే యర్చిరాది మార్గమనియు దేవయానమనియుఁ బేర్లు. ౨౩

ఇట్లు పుణ్యము చేసినవారు దక్షిణాయనమున గృష్ణపక్షమున రాత్రివేళ మరణించి యా కాలాభిమాన దేవతలును, ధూమాదిదేవతలును నే మార్గమున గలరో యామార్గమున బోయి చంద్రసంబంధమగు తేజస్సును బొంది పుణ్యఫలము లనుభవించిన తరువాత మరల జన్మింతురు. ఇది ధూమాదిమార్గము పితృయానము నందురు.

రుక్మిణి:—అప్పా! పాపాత్ము లేత్రోవ బోవుదురు?

తండ్రి:—పాపాత్ములును ధూమాదిమార్గముననే పోదురు. వీరు యమలోకమునకు బోవుమార్గము ఘోరమైనది.

అర్చిరాది మార్గము, ధూమాదిమార్గము అను రెండును లోకమున జ్ఞానులకు బుణ్యకర్ములకు శాశ్వతమైన మార్గములు. అర్చిరాదిమార్గమున బోయినవాడు మరల జన్మింపడు, ధూమాది మార్గమున బోయినవాడు మరల జన్మించును. ౨౬

ఈ రెండు మార్గములను దెలిసిన యేయోగియు మరణకాలమున భ్రమ నొందడు. కావున సర్వకాలములందు నీ వర్చిరాదిమార్గమున బోవలయునను చింతగలవాడవై యుండుము. ౨౭

ఈ భగవన్మాహాత్మ్యమును దెలిసికొనినవాడు వేదము-యజ్ఞము-తపస్సు-దానము వీనివలనగలుగు పుణ్యఫలములను నన్నిటిని నతిక్రమించుచున్నాడు. అట్టివాడు జ్ఞానియై యాదియు నుత్కృష్టమునగు స్థానమును బొందుచున్నాడు.

అష్టమాధ్యాయము, అక్షరపరబ్రహ్మయోగము సంపూర్ణము.

---

## నవమాధ్యాయము.

## —♦ రాజవిద్యా రాజగుహ్య యోగము. ♦—

అర్జునా! గుణములందు దోషములను వెదకు చిత్తవృత్తిలేని నీకు భక్తిరూపమైన యుపాసనమనబడెడి యతిగోప్యమగు జ్ఞాన

మును నుపాసనప్రకారముతోడఁ జెప్పెదను. ఈ జ్ఞానము ననుష్ఠాన పర్యంతము తెలిసితివేని మత్ప్రాప్తికి విరోధులగు సమస్త పాపములు తొలఁగును. ౧

ఇది రాజవిద్య. మిక్కిలి రహస్యమైనది. ఉత్తమము. పవిత్రమైనది. ఉపాసింపఁబడు నన్నుఁ బ్రత్యక్షముగాఁ గనఁబడునట్లు చేయునది. ధర్మయుక్తమైనది. సుఖముగ ననుష్ఠింపఁ దగినది. నాశరహితమైనది. ౨

అర్జునా! యీ యుపాసనమనెడి ధర్మమందు శ్రద్ధలేనివారు నన్నుఁ బొందక మృత్యుస్వరూపమైన సంసారమునఁ బడుచున్నారు. ఇట్టి యుపాసనమునకు ఫలము నేను. ఫల మాహాత్మ్యము తెలియకుండిన నుపాసనమందు శ్రద్ధపుట్టదు. కావున నా మహిమ చెప్పెద వినుము. ౩

ఇంద్రియములచేఁ దెలియరాక యంతర్యామిగనుండు నా చేత సమస్త ప్రపంచము వ్యాప్తమైయున్నది. అన్ని భూతములు నన్నాధారముగఁగొని నిలిచియున్నవిగాని వానివలన నాకే యుపకారము లేదు. నేను భూతముల కాధారముగ నుండుట నీళ్ళకుఁ గుండ యున్నట్లు కాదు, ఈశ్వరసంబంధమైన నా యోగమహిమఁ జూడుము, భూతములను భరించువాఁడనైనను భూతములందు నేను లేను. నా సంకల్పమే భూతములను గలిగించును భరించును. ౫

ఆకాశము పట్టులేనిది కావునఁ దనయందు నెల్లప్పుడు సంచరించు మహావాయువునకు స్థితి చలనములు కలిగింపనేరదు. అట్లైన మహావాయువుస్థితి చలనములకుఁ గారణ మెవరందువా నేను. అటులే నేను గనులకుఁ గానరాకున్నను, సమస్తభూతముల కాధారమని నిశ్చయించుకొనుము. ౬

చరాచర భూతము లన్నిటిని నర్జునా! కల్పాంతమందు నాప్రకృతిని బొందించుచుందును. మరలఁ గల్పారంభమందు సృజించుచుందును. ౭

నా ప్రకృతిని నేనిమిదివిధము లగునట్లు పరిణమింపఁజేసి యట్టి ప్రకృతికి లోపడి స్వాతంత్ర్యము చెడిన సమస్తభూత సమూహమును మరల మరల నానావిధములుగా సృజించుచున్నాను.

అర్జునా! యీ కర్మములు నన్ను బంధింపఁజాలవు. ఏలనఁగా భూతములను నానావిధములుగా హెచ్చుదక్కువలుగ సృజింపవలయు నని నా కాసక్తిలేదు. కావున నిర్దయత్వము పక్షపాతములోనైనవి నాయందుఁ గలుగవు. నే నుదాసీనుఁడను. ౯

నన్ను నధ్యక్షునిఁగాఁగల ప్రకృతి చరాచరములను బుట్టించు చున్నది, ఈ హేతువుచేత జగము ప్రవర్తించుచున్నది. జీవుల కర్మాను గుణముగ నేను బ్రకృతిచేఁ గార్యములు చేయించుచుందును. ౧౦

సర్వ భూతములకు మహేశ్వరుఁడనగు నా పరత్వమును దెలియ లేక తమవలె నేనును మనుష్యుఁడనని మూఢులు తలంచుచుం దురు. పరమేశ్వరుఁడనగు నేను దమయందలి దయచే స్వరూప పర స్వభావములను విడువకయే మనుష్యునివలె నైతినని తెలియక వేఱు విధముగ భావించుట మూఢత్వలక్షణమే కదా. ౧౧

అసుర సంబంధము రాజసము, రాక్షససంబంధమగు తామ సము నగుటచేఁ గ్రోధలోభాదిమయమై ముందు చెప్పినట్లు నా పరత్వమును బామరులకుఁ దెలియనీయక మోహపఱుచు ప్రకృ తినే యాశ్రయించినవారు చరాచర వస్తువుల నున్నదున్నట్లెఱుఁగఁ జాలరు. కావున విపరీతజ్ఞానముగలవారై యా కారణముచేతనే వ్యర్థమైన జ్ఞానము వ్యర్థములైన కోరికలు వ్యర్థకర్మములు గలవారగు చున్నారు.

అర్జునా! సాత్త్వికప్రకృతి నాశ్రయించిన మహాత్ములు భూత ముల కాదినై నిత్యుఁడనైన నన్నెఱిఁగి యితర విషయములందు మనస్సు పోనీక నన్నె యుపాసింతురు. ఈ విధముగ నన్ను భజించు వా రెల్లప్పుడు నా నామగుణములను గీర్తించుచుందురు. ఎప్పుడును దృఢచిత్తులై నా కైంకర్యమునకుఁ గావలసిన విషయములం దేయత్నము

జేయుచుందురు. నన్నుద్దేశించియే నమస్కరింతురు. నాతో నెడఁబగని సంబంధము గోరుచు నన్ను నుపాసింతురు. మఱి కొందఱు కీర్తనాదుల వలన కాక జ్ఞానయజ్ఞమునఁగూడ నన్ను నుపాసింతురు. దేవతలని మనుష్యులని పశువులని పక్షులని వృక్షములని నేనే నానావిధములుగాఁ గానఁబడుచున్నాననియు నానా విధములుగఁ దోఁచు దేవమనుష్యాదులన్నియు నాకు శరీరమగుటవలన నే నొక్కఁడనె కాని యితరము లేదనియుఁ దలఁచి యుపాసింతురు. ౧౫

అర్జునా! క్రతువు నేనే బ్రహ్మయజ్ఞాదులు నేనే, స్వధనేనే, హవిస్సు నేనే, మంత్రము నేనే, నేయి నేనే, అగ్ని నేనే, హోమము నేనే, ఈ ప్రపంచమునకుఁ దండ్రిని నేనే, తల్లిని నేనే, దాతయు నేనే, ధాతయు నేనే, తెలిసికొనదగిన పవిత్రమైన యోంకారము నేనే, ఋగ్వేదము యజుర్వేదము సామవేదము నేనే, పొందవలసిన స్థానము, భరించువాఁడు, దండించువాఁడు, సాక్షి, నివాసము, రక్షకుఁడు. మిత్రుఁడు, ప్రతివస్తువునకుఁ బుట్టుచోటు, లయించుచోటు, ఉండుచోటు, నాశరహితము నేనే. ౧౮

అగ్ని సూర్యాది రూపముగఁ దపింపజేయువాఁడను నేనె. వర్షము నిలుపువాఁడను విడుచువాఁడను నేనె, లోకము జీవించుటకు గారణము, నశించుటకుఁ గారణము, జరిగినది, జరగుచున్నది, జరగఁ బోవునది నేనే.

ఇఁకఁ గోరికలు కోరువారిగతి చెప్పెదవినుము.

వేదాంతనిష్ఠులుగాక వేదనిష్ఠులగు వారు సోమపానము గావించి పాపముక్తులై నన్ను స్వర్గఫలమునిమ్మని కోరుదురు. వారు వారి కోరికచొప్పున దుఃఖసంబంధము లేని యింద్రలోకమునకుఁ బోయి స్వర్గమునందు దేవతాభోగము లనుభవింతురు. వారు విస్తారమైన స్వర్గసుఖములన్నియు ననుభవించి యా పుణ్యము క్షీణింపఁగా మరల మనుష్యలోకమునఁ బ్రవేశింతురు. కావున వేదోక్తకర్మములనే యాచరించి కామ్యములను గోరువారు భూమికి

స్వర్గమునకు మరలమరల రాకపోకలు గావించుచుందురే కాని మోక్షమును బొందఁజాలరు. ౨౧

అటుగాక యితరచింతలను విడిచి నన్నుఁ జింతించుచు నెవ రుపాసింతురో యట్టివారు నాతో నిత్యసంబంధము గోరువారగుటచే వారి యోగక్షేమముల నేనే వహింతును. మత్ప్రాప్తికై వారి కేమేమి కావలయునో యవి నేనే కలిగింతును. మత్ప్రాప్తి లభించిన పిమ్మట మరల వదలిపోకుండను జేయుదును. ఈ భారములను నా భక్తులమీఁద వేయను. ౨౨

అర్జునా! యితర దేవతలందు భక్తిగలిగి వారి నెవరు శ్రద్ధతోఁ బూజింతురో వారును, నన్నే పూజించిన వారగుదురు గాని వారి మార్గము విధియుక్తమైనది కాదు. దేవతలఁ బూజించినపుడు వారి కాత్మభూతుఁడను నేను గనుక నన్నుఁ బూజించినట్లెంచక యా దేవతలనే పూజించిన ట్లెంచుకొనుట విధి సమ్మతము కాదు. ౨౩

సమస్తయజ్ఞముల నారాధింపఁబడువాఁడను వానిఫలము నిచ్చు వాఁడను నేనే. అట్టి నన్ను యథార్థముగా నెఱుఁగక యితర దేవత లారాధ్యులని తలఁచి యల్పభోగముల కాశించి వారిని బూజించి యవిపొంది మరల వానినుండి భ్రష్టులగుచున్నారు. ౨౪

దేవతలను సంకల్పించి వ్రతములను జేయువారు దేవలోక మునకుఁ బోదురు. పితృదేవతల సంకల్పించి వ్రతముచేయువారు పితృదేవతలను, యక్షరాక్షసాది భూతముల సంకల్పించి వ్రతములు చేయువారు యక్షరాక్షసాది భూతములను బొందుదురు. ఆ దేవతలు నా శరీరమనియు, నా దేవతల నారాధించుట నన్నారాధించుటయే యనియు సంకల్పించి రెవరు నన్నారాధింతురో వారు నన్నుఁ బొందుదురు. ౨౫

అర్జునా! దేవతల సంకల్పించి యజ్ఞాదివ్రతములు చేయువారి కంటె నన్నారాధించువారికిఁ గలవిశేషము చెప్పెదవినుము. ఎవ్వఁడు నా కత్యంతప్రీతితో తులసిమొదలగు నాకులుగాని పూవుగాని పండు గాని నీళ్లుగాని యిచ్చుచున్నాఁడో వాఁడు చిత్తశుద్ధితోను భక్తి

తోను సమర్పించిన దానిని నే నత్యాదరముతో భుజించుచున్నాను. నన్నారాధించుటయందు దేశనియమము కాలనియమము నాచార నియమము ధనములోనైన దేదియు నక్కఱలేదు. ఇతర దేవతల నట్లారాధింపరాదు. చిత్తశుద్ధి భక్తి నాకుఁ బ్రధానములుగాని యర్పించునట్టి పదార్థములవెల నాకుఁ బ్రధానముగాదు. ౨౬

కాఁబట్టి యర్జునా! దేహయాత్రయందు నీవు దేనిని జేయుదువో, దేనిని భుజింతువో, యేది హోమముచేయుదువో, దేనిని దానముచేయుదువో, యేతపము సలిపెదవో, యిట్టివాని నన్నిటిని నా కర్పణము చేయుచుండుము. ౨౭

ఈవిధముగా సర్వము నాకుసమర్పించుట యను యోగముతోఁ గూడిన మనస్సుగలవాఁడవై తివా మేలుగీళ్లు నొసఁగు కర్మబంధముల నుండి విడువఁబడి నన్నుఁ బొందెదవు. ౨౮

నేను సర్వభూతములయెడల సముఁడను. నాకు ద్వేష్యుఁడు లేఁడు. ప్రియుఁడును లేఁడు. భక్తిచేత నన్ను నెవరుభజింతురో వారికి నాయందెట్టి ప్రీతిగలదో వారియందు నాకు నట్టి ప్రీతియే కలుగును. కావున భక్తులగువారు నన్నుఁ దమతోసమానునిగఁ దోడివానిఁగఁ జూచుకొందురుగాని యెందో దూరముగ నుండువాఁడనని దుర్లభుఁడ నని పరమేశ్వరుఁడనగుటచే నాకు భయపడవలయునని తలఁపరు.

తన వర్ణమునకు నియమితమైన దానిని విడుచువాఁడును, నితర వర్ణమునకు నియమితమైన దానిని జేయువాఁడును, దురాచారుఁడనఁ బడును. ఎంతటి దురాచారుఁడైనను నితరలాభ మపేక్షింపక నన్ను భజించునో వాఁడు సజ్జనుఁడే. గౌరవింపఁబడఁ దగినవాఁడే. ఏలం దువా వానికి నాయందు నిశ్చయజ్ఞానము గలదు. దురాచారునికి బ్రహ్మప్రాప్తిలేదని వేదములు చెప్పుచుండ దురాచారుఁడైనను నీసేవ వలనఁ దరించునని చెప్పెదవే యది యెట్లందువేని విను. నాయందుఁ బ్రీతియుంచి యితరమునందుఁ బోనీని మనస్సుచే నన్నుభజించువాని పాపములను నా భజనమే శీఘ్రముగ నిర్మూలించుచున్నది. కావున

వాఁడు శాంతిని బొందుచున్నాఁడు. అర్జునా! నాభక్తుఁ డెన్నఁటికి నాశము నొందఁడని తెలిసికొనుము. 31

నీచజాతియందుఁ బుట్టిన స్త్రీలు వైశ్యులు, శూద్రులుకూడ, నన్నాశ్రయించి మోక్షమును బొందుచున్నారు. ఇఁకఁ బుణ్యులు, భక్తిగలవారునగు బ్రాహ్మణులు రాజర్షులు నుత్తమగతిని బొందుదురని వేఱ చెప్పవలయునా? అస్థిరమై సుఖము లవమైన లేని యీలోకమున జనించిన నీవు నన్ను భజించియే కడతేఱవలయును. 32

సర్వకాల సర్వావస్థల నన్ను ధ్యానింపుము. నాయందుఁ బ్రీతి గలవాఁడవు కమ్ము. నన్నే పూజింపుము నాకు నమస్కరింపుము. ఇట్లు చేసితివా నన్నే యాధారము గాఁగలవాఁడవై నన్ననుభవించుట కర్తవ్యమైన మనస్సునుబొంది నన్నుఁ బొందెదవు. 34

నవమాధ్యాయము, రాజవిద్యా రాజగుహ్యయోగము సంపూర్ణము.

---

## దశమాధ్యాయము.

### —♦ విభూతియోగము ♦—

అర్జునా! నామాటలువిని సంతోషించు నీకు నీమేలుగోరి యిదివఱకుఁ జెప్పినదానినే విస్తరించి మరలఁ జెప్పెదను. హెచ్చరికతో వినుము. నా ప్రభావమును దేవతలుగాని మహర్షులుగాని యెఱుఁగరు. 1

దేవతలకు మహర్షులకు వారి జ్ఞానశక్తులకు మూలమైన వాఁడను నేనే. వారివారి యోగ్యతకుఁ దగినట్టు నేనేవారికి శక్తులిచ్చి యుండ నసంపూర్ణ జ్ఞానశక్తులుగలవారు సంపూర్ణ జ్ఞానశక్తులుగల నన్నెట్లెఱుఁగఁగలరు? 2

మనుష్యులలో నెవఁడు నేనును దమవలె నొక మనుష్యుఁడనని మోహపడక, పుట్టువు లేనివాఁడనని యాది లేనివాఁడనని, లోకేశ్వరుల కందఱకు నీశ్వరుఁడనని తెలిసికొనుచున్నాఁడో వాఁడు సమస్త పాపములవలన విముక్తుఁడగుచున్నాఁడు. 3

బుద్ధి, జ్ఞానము, భ్రాంతి, క్షమ, సత్యము, బహిరింద్రియనిగ్రహము, అంతరింద్రియనిగ్రహము, సుఖము, దుఃఖము, పుట్టువు, పుట్టువులేమి భయము, భయములేమి, అహింస, సమత్వము, సంతోషము, తపము, దానము, యశస్సు, అపయశస్సు, యీ మొదలైన నానావిధభూతభావములు నావలనఁ గలుగుచున్నవి. ౫

పూర్వమున్వంతరమున బ్రహ్మమనస్సువలన నేడుగురు మహర్షులు జనించిరి. అట్లే దక్షప్రజాపతి కూఁతురగు ప్రియయందు సావర్ణికులను నలుగురు మనువులు పుట్టిరి. వీరివలన లోకమునందుఁ బ్రజలు పుట్టిరి. ప్రజాకారణ భూతులైన ఋషులు, మనువులు, నాసంకల్పమునకు లోపడియే ప్రజాసృష్టి సలిపిరి కాని నన్నుఁ గాదని వారు చేసిన దేమియులేదు. ౬

సమస్తము నాకు లోబడిన యుత్పత్తి స్థితిలయములు గలది యనెడి నా యైశ్వర్యమును, కల్యాణగుణ రూపమైన యోగమును, నున్న దున్నట్లు తెలిసికొనుచున్నాఁడో వాఁడు నిశ్చలమైన భక్తియోగముగలవాఁ డగుచున్నాఁడు. ౭

సమస్తమునకు నుత్పత్తికారణము నేను. జగద్వ్యాపారమంతయు నావలన జరగుచున్నది. అని తలఁచి జ్ఞానులు నాయందు మనస్సు నిలిపి నన్ను భజించుచున్నారు. ౮

మనస్సు నాయందు నిలిపినవారును, నాయందే తమ ప్రాణములను నిలిపినవారును, దమతమ యనుభవముచే నన్ను గుఱించి తెలిసికొనిన విషయముల నొకరినొకరు తెలుపుచు వర్ణించి చెప్పుచు సదా సంతోషించుచున్నారు. వినువారును నానందించుచున్నారు.

ఎప్పుడు నెడఁబాయక నన్నుఁ గూడియుండఁ గోరువారును, నాయందలి భక్తి యభివృద్ధి నొందినవారును, నన్నుఁ బ్రీతితో భజించువారును నగువారికి దేనిచేత నన్ను వారు ప్రాపింపఁగలరో యట్టి పరిపక్వమైన బుద్ధి యోగమును నేనిచ్చుచున్నాను. అట్టివారికి నేనే సాక్షాత్కరించి వారి బుద్ధిని బరిపక్వమగునట్లు చేయుచున్నాను. నేను సాక్షాత్కరించినపిమ్మట మత్ప్రాప్తి కలుగును. ౧౦

వారల నేననుగ్రహించుటకయియే వారియందు దయగల వాఁడనై వారి మనోవృత్తికి గోచరించి నేను బ్రకాశింపఁజేయు జ్ఞానదీపముచే వారి యజ్ఞానమనెడి చీఁకటిని నాశముచేసెదను. ౧౧

అనిన నర్జునుఁ డిట్లనియె.

నీవు పరబ్రహ్మమవని, పరజ్యోతివని, పరమపావనుఁడవని వేదములు చెప్పుచున్నవి. సమస్తఋషులు, నారదుఁడు, అసితదేవతల వ్యాసులును, నవతరించియుండు నీవే నిత్యుఁడవనియుఁ. బరమాకాశమందుండువాఁడ వనియుఁ బరాత్పరుఁడవనియు, నాదిదేవుఁడ వనియుఁ, బుట్టువులేనివాఁడవనియు, సర్వవ్యాపివనియుఁ జెప్పిరి. నీవు నాకట్లే చెప్పితివి.

కృష్ణా! నీవు నాకుఁ జెప్పునదియంతయు సత్యమేయని తలఁచెదను. నీ జ్ఞానశక్తి బలైశ్వర్య వీర్య తేజస్సులను నిన్నుఁ దెలుపునట్టి విధమును దేవదానవు లెవ్వరు నెఱుఁగరు.

పురుషోత్తమా! సకలభూతస్సృష్టికర్తా! భూతేశ్వరా! జగత్పతీ! నీ జ్ఞానముచే నిన్ను నీవుమాత్ర మెఱుఁగుదువు. ఇతరు లెవ్వరు నెఱుఁగఁజాలరు. కావున నే విభూతులతోఁ గూడి యీ లోకమున వ్యాపించియున్నావో యట్టి నీ విభూతుల నన్నిటిని జెప్ప నీవే యర్హుఁడవు. భక్తియోగముచే నేను నిన్నెల్లప్పుడు చింతింపఁ బూనితిని గాన నీ వేయే భావములందున్నాఁడవో నే నెఱుగ వలయును. కావున జగత్సృష్టిని జగత్తును బ్రవర్తింపజేయు విధమును సవిస్తరముగ నాకు మరలఁ జెప్పుము. నీ మాహాత్మ్య మెంత వినినను నాకుఁ దృప్తిలేదు.

అనిన శ్రీకృష్ణమూర్తి యిట్లనియె.

మేలు. నీ మాటకు సంతోషించితిని. నా విభూతులఁ కంతము లేదు గావున నందు ముఖ్యమైన శుభవిభూతులఁ జెప్పుచున్నాను. సమస్తభూతముల హృదయముననుండు నాత్మను నేను. భూతముల సృజించువాఁడను, రక్షించువాఁడను, అంతము నొందించు వాఁడను నేను. ఆదిత్యులయందు విష్ణుఁడను నేను. ప్రకాశింపఁ జేయువారిలో సూర్యుఁడను నేను. సప్తమరుత్తులలో మరీచియను పేరుగల పరివహా

వాయువు నేను. నక్షత్రములకుఁ బతియగు చంద్రుఁడు నేను. వేదములలో సామవేదము నేను. దేవతలలో నింద్రుఁడ నేను. ఇంద్రియములందు మనస్సు నేను. భూతములందలి తెలివి నేను. రుద్రులందు శంకరుండ నేను. యక్షరాక్షసులకుఁ బతియగు కుబేరుఁడ నేను. వసువులలో నగ్ని నేను. శిఖరములుగల పర్వతములలో మేరువు నేను. పురోహితులలో ముఖ్యుఁడగు బృహస్పతి నేను. సేనాపతులలోఁ గుమారస్వామి నేను. సరస్సులలో సముద్రము నేను. మహర్షులలో భృగువు నేను. అర్థముగల శబ్దములలో నోంకారము నేను. యజ్ఞములలో జపయజ్ఞము నేను స్థావరములలో హిమాలయము నేను. సమస్త వృక్షములలో రావిచెట్టు నేను. దేవర్షులలో నారదుఁడు నేను. గంధర్వులలోఁ జిత్రరథుఁడు నేను. సిద్ధులందుఁ గపిలముని నేను. గుఱ్ఱములలో నమృతమందుబుట్టిన నుచ్చైశ్రవము నేను. ఏనుఁగులందు నైరావతము నేను. మనుష్యులలో రాజను నేను. ఆయుధములందు వజ్రము నేను. ఆవులందుఁ గామధేనువు నేను. ప్రజల యుత్పత్తికిఁ గారణభూతుఁడగు మన్మథుఁడ నేను. ఒంటితల నాగములలో వాసుకి నేను. నాగములయం దాదిశేషుఁడ నేను. జలచరమునకుఁ బతియైన వరుణుఁడ నేను. పితృదేవతలలో నర్యముఁడ నేను. దండించువారిలోఁ యముఁడ నేను. దైత్యులందు ప్రహ్లాదుఁడను నేను. గణించువారిలోఁ గాలపురుషుఁడ నేను. మృగములలో సింహము నేను. పక్షులలో గరుత్మంతుఁడ నేను. గమనముగల వారిలో వాయువు నేను. ఆయుధధారులలో రామునందలి యాయుధధరత్వము నేను. మత్స్యములలో మొసలి నేను. ప్రవాహములలో గంగ నేను. సృజింపఁబడువానికి నాదిమధ్యాంతములు నేను, విద్యలలో నధ్యాత్మవిద్య నేను. వాదించువారి వాదములలోఁ దత్త్వనిర్ణయము కొఱకైన వాదము నేను. అక్షరములం దకారము నేను. సమాసములలో ద్వంద్వసమాసము నేను. అక్షయమైన కాలము నేను. చతుర్ముఖబ్రహ్మ నేను. సమస్తప్రాణులహరించు మృత్యువు నేను. పుట్టఁగలవారి పుట్టువు నేను. స్త్రీలలో లక్ష్మి నేను. కీర్తి నేను. స్మృతి

నేను. మేధ నేను. ధృతి నేను. క్షమ నేను. సామగానములలో బృహ త్సామము నేను. ఛందస్సులలో గాయత్రి నేను. మాసములలో మార్గశీర్షము నేను. ఋతువులలో వసంతము నేను. వంచన చేయు వానిలో జూదము నేను. తేజోవంతుల తేజస్సు నేను. జయము నేను. వ్యవసాయము నేను. సాత్త్వికుల సత్త్వగుణము నేను. వృష్ణు లలో వాసుదేవుఁడ నేను. పాండవులలో ధనంజయుఁడ నేను. మునులలో వ్యాసుఁడ నేను. కవులలో శుక్రుఁడ నేను. శిక్షించువారి శిక్ష నేను. జయింపఁగోరువారి రాజనీతి నేను. గోప్యమైనవానిలో మౌనము నేను. నన్నువిడిచియుండెడి జంగమస్థావర పదార్థమేదియు లేదు. దివ్యములైన నా విభూతులకంతము లేదు. ఇప్పుడు కొన్ని సంక్షేపముగాఁ జెప్పితిని. విభూతిగలదియుఁ, గాంతి యుక్తమైనదియు, మిగుల నుత్సాహముగలదియు నగు వస్తుసమూహ మేదికలదో యది నా తేజస్సునందలి యొక యంశముచేఁ గలిగినట్లు తలఁపుము. ఇంతయేల? ఈ సమస్త ప్రపంచము నే నొక్క యంశముచే నిలువఁ బెట్టి యున్నాను.

దశమాధ్యాయము, విభూతియోగము సంపూర్ణము.

---

## ఏకాదశాధ్యాయము.

### ——♦ విశ్వరూప సందర్శనయోగము: ♦——

అనిన నర్జునుం డిట్లనియె.

నన్ననుగ్రహింపఁగోరి మిక్కిలి రహస్యమైన యాత్మవిషయము చెప్పితివి. దానివలన నా యజ్ఞానము తొలఁగిపోయెను. సమస్త భూతములకు నీవలన నుత్పత్తినాశములు కలుగుచున్నవనియు సవిస్తర ముగా వింటిని. శాశ్వతమైన నీ మాహాత్మ్యమును వింటిని. పర మేశ్వరా! నీవు నిన్నుఁగూర్చి యెట్టివాఁడనని చెప్పికొంటివో యది యంతయు నిజమని నమ్మితినిగాని యట్టి నీ యీశ్వరసంబంధరూప మును గనులారఁ జూడఁగోరుచున్నాను. అట్టి నీ రూపమును జూచు

టకు నాకు సాధ్యమని తలఁచెదవేని యోగీశ్వరా! నిన్ను నీవు నాకుఁ గనఁబడఁజేయుము.

అని యడిగిన యర్జునునకు భగవంతుఁ డిట్లనియె.

అర్జునా! నూర్లకొలఁది వేలకొలఁది నానావిధములై దివ్యములై నానావర్ణములు నానాకారములుగల నా రూపములను జూడుము. ఆదిత్యులను, వసువులను, రుద్రుల నశ్వులను, మరుత్తులను బూర్వమెన్నఁడు జూడని నానాద్భుతములను జూడుము.

చరాచరములతోఁగూడిన సమస్త ప్రపంచమును, మఱియు నీవు దేనిని జూడఁగోరెదవో దానినెల్ల నాయీయొక్క దేహమునం దొక్కచోటనే యుండఁగాఁ జూడుము. నీ యీకన్నులతో నన్నుఁ జూడ శక్తుఁడవు గావు. నీకు దివ్యదృష్టి యిచ్చెదను. దానిచే నా యసాధారణమహిమను జూడుము.

అని కృష్ణమూర్తి తన యుత్కృష్ట విశ్వరూపమును జూపెను. అది యనేక ముఖములు, ననేక నేత్రములుగలదై యనేకాద్భుతములు గనఁబడుచున్నదై, యనేకదివ్యాభరణములు దివ్యమాలాంబరముల ధరించి యనేక దివ్యాయుధములనెత్తి పట్టుకొని దివ్యగంధమును బూసికొని సర్వాశ్చర్యములచేనిండి ప్రకాశించుచు నంతము లేనిదై యన్నిప్రక్కల ముఖములుగలదై యుండెను.

ఆకాశమునందు నేకకాలమున వేయి సూర్యబింబములు ప్రకాశించినను నది యమ్మహాత్ముని కాంతికి సరిగాదు. దేవమనుష్యాది భేదములచే నానావిధములుగా విభజింపఁబడిన సమస్తప్రపంచ మా కృష్ణమూర్తి శరీరమందొక్కచోటనే యర్జునుఁడు చూచెను. అప్పుడర్జునుఁ డాశ్చర్యపడి దేహము పులకరింప శ్రీకృష్ణదేవుని శిరస్సుచే నమస్కరించి చేతులుమోడ్చి యిట్లనియె.

దేవా! నీ శరీరమందు సమస్త దేవతలను సమస్త ప్రాణికోటులను, బ్రహ్మను, బ్రహ్మయందుండెడి యీశ్వరుని ఋషులను నాగేంద్రులను జూచుచున్నాను.

విశ్వేశ్వరా! విశ్వరూప! నీ వనేక బాహువులు, నుదరములు, ముఖములు, నేత్రములు, నంతములేని యాకారముకలవాఁడవై యుండుటయుఁ జూచుచున్నాను. నీకు మొదలేదో తుద యేదో నాకుఁ గానరాలేదు.

నీవు కిరీటము గద చక్రము ధరించి తేజోరాశివై యంతటను బ్రకాశించు ప్రకాశమును, నంతట జ్వలించు సూర్యాగ్నుల కాంతిని గలిగి చూడఁ గ పరిమితిలేకయుండుటయుఁ జూచుచున్నాను. అప్పుడు నాకుఁ బ్రాకృతచక్షులకుఁ గానవచ్చిన నీవే పరమాత్మరము ప్రపంచమునకు గొప్ప యాధారము. అవ్యయుఁడవు నీవే. శాశ్వత ధర్మములను బాలించువాఁడవు పురాణపురుషుఁడవు నీవేయని తెలిసికొంటిని.

ఆదిమధ్యాంతములు లేనివాఁడవు, ననంతపరాక్రమముగలవాఁడవు, లెక్కలేని చేతులుగలవాఁడవు, చంద్రసూర్యులవంటి కన్నులుగలవాఁడవు, మండుచున్న యగ్నిహోత్రునివంటి ముఖముగలవాఁడవు, నీ తేజస్సుచే జగమును దపింపఁజేయుచున్నవాఁడవగు నిన్నుఁ జూచుచున్నాను.

ఆకాశము భూమి యంతరశము దిక్కులన్నియు నిండి నీ వొక్కఁడవే వ్యాపించియున్నాఁడవు. భయంకరము నాశ్చర్యకరమునగు నీ విశ్వరూపమును జూచి యుద్ధముఁ జూడవచ్చిన దేవరాక్షసాదులు భయపడియున్నారు.

ఈ దేవతాసమూహములు నీయందుఁ బ్రవేశించుచున్నవి. కొందఱు భయముచే నంజలిమోడ్చి స్తుతించుచున్నారు. మహర్షులు సిద్ధులు లోకమునకు మేలుకలుగునుగాక యనుచు నిన్ను విశేషముగ స్తోత్రముచేయుచున్నారు. రుద్రులు నాదిత్యులును వసువులును సాధ్యులును విశ్వులు నశ్వులును మరుత్తులును బితృదేవతలును గంధర్వులును యక్షులు నసురులును సిద్ధులును నిన్నుఁజూచి యాశ్చర్యపడుచున్నారు.

స్వామీ! యనేక ముఖములును నేత్రములును బాహువులును దొడలును పాదములు నుదరముగలిగి యనేకములగు కోఱలచే భయంకరమైన నీ మహారూపమునుజూచి జనులు భయముచే వణఁకు చున్నారు. నేను నట్లే భయపడుచున్నాను.

విష్ణుమూర్తీ! యాకాశమునందే ప్రకాశించుచు ననేకవర్ణములు గలిగి నోళ్ళు తెఱచుకొని మండుచున్న నేత్రములతోనుండు నిన్నుఁజూచి మిగుల భయపడి ధైర్యము శమము లేనివాఁడనైతిని.

దేవేశా! కోఱలచే భయంకరములై ప్రలయకాలాగ్నితో సమానములైన నీ ముఖములను జూచిన మాత్రమున నాకుఁ దిక్కు తెలియలేదు. సుఖమును బొందఁజాలకున్నాను. జగన్నివాసా! ప్రసన్నుఁడనగుము.

ఈ ధృతరాష్ట్ర పుత్రులందఱును భీష్ముఁడు ద్రోణుఁడు కర్ణుఁడు సమస్తరాజులతోడను మా పక్షమునందు యోధముఖ్యులతోడను భయంకరములైన కోఱలుగల నీనోళ్ళయందుఁ దొందర దొందరగాఁ బ్రవేశించుచున్నారు. కొందఱు దంతముల సందున నిఱికికొని చూర్ణము చేయఁబడిన తలలతోఁ గానవచ్చుచున్నారు. ౨౭

అనేక నదుల జలప్రవాహములు సముద్రమునకై యెట్లు పాఱుచున్నవో యట్లే యీశూరులగు మనుష్యులు నీ నోటిలోనికిఁ జొరఁ బాఱుచున్నారు. మిడుతలెట్లు వేగముగఁబోయి మంటలో దుమికి నాశమగుచున్నవో యట్లే తమ నాశము కొఱకే యీమనుష్యులు జ్వలించు నీ నోళ్ళయందుఁ బ్రవేశించుచున్నారు. ౨౯

విష్ణుమూర్తీ! మండెడు నోళ్ళచేత రాజసమూహము నెల్ల మ్రింగుచు నన్నిప్రదేశముల నాలుకలు చాఁచుచున్నావు. నీభయంకర కిరణములు తమ ప్రకాశముచే లోకముల నింపి మిక్కిలి తపింపఁ జేయుచున్నవి. 30

సర్వేశ్వరా! నీ మహైశ్వర్యమును జూపుమని నే నడుగఁగా భయంకరాకారమును గనఁబఱిచితివి? నీ వెవ్వఁడవు? ఏమిపని చేయఁ

బూని యిట్టి ఘోరరూపమును ధరించితివి. ఆద్యుఁడవగు నిన్నెఱుఁగఁ గోరుచున్నాను. నీ యత్నమేమో నాకుఁ దెలియదు. తెలియఁ జెప్పుము. నీకు నమస్కరించెదను. ప్రసన్నుఁడవగుము. ౩౧

అనిన శ్రీకృష్ణమూర్తి యిట్లనియె.

అర్జునా! యిప్పుడు ప్రజాక్షయముగావింప నిట్టి ఘోరరూపముతోఁ బెరిఁగి సకల రాజలోకమును జంపఁ బ్రవర్తించుచున్నాఁడను. నీ విరోధి సేనలందుండువారందఱు నీవు వారిని జంపఁబూనకున్నను బ్రతుకఁజాలరు. నా సంకల్పముచేతనే వారిని నశింపఁ జేయుదును. అట్లైనచో నన్నేల ప్రేరించెదవంటివేని నీకు యశముఁ గలిగింపఁగోరియే యని తెలిసికొనుము. కావున యుద్ధమునకు లెమ్ము. శత్రువులజయింపుము. రాజ్య మనుభవింపుము. వీరందఱు చావ నాచే ముందే సంకల్పింపఁబడిరి. కావునఁ జచ్చినవారే. సవ్యసాచీ! నీ వీకార్యమున నిమిత్త మాత్రము కమ్ము. ౩౨

నాచే ముందేచంపఁబడిన ద్రోణుని భీష్ముని సైంధవునిఁ గర్ణునిఁ దక్కిన యోధవీరులను నీవు చంపుము. వ్యథపడకుము. యుద్ధము చేయుము. నీవు శత్రువుల గెలుతువు.

అని చెప్పిన కృష్ణువాక్యములు విని కృతాంజలియై వణఁకుచు నర్జునుఁడు మఱిమఱి నమస్కరించి భయముతో గద్గదకంఠుఁడై యాయనతో నిట్లనియె. ౩౩

కృష్ణా! యుద్ధమును జూడవచ్చిన దేవగంధర్వ సిద్ధవిద్యాధరాదులు నీ యనుగ్రహమువలన నాతోపాటు దివ్యదృష్టిగలవారై నిన్నుఁజూచి నీ కీర్తికిఁ జాల సంతోషించి యనురాగము గలవారగుచున్నారు. రాక్షసులుభయపడి నలుదిక్కులకుఁ బరువులెత్తుచున్నారు. సిద్ధాదులునీకు నమస్కరించుచున్నారు. అనుకూలురు సంతోషించి నమస్కరించుటయుఁ బ్రతికూలురు భయపడి పరువెత్తుటయు యుక్తమే కదా. ౩౪

బ్రహ్మకు నాదికర్తవై యుత్తమోత్తముఁడవైన నీకు వారేల నమస్కరింపకుందురు.

అనంత ! దేవేశ! జగన్నివాసా ! యక్షరమనఁబడు జీవాత్మ తత్త్వమునీవ. కార్యకారణావస్థలఁబొంది సదసత్తులని పేరొందిన ప్రకృతియు నీవ. ఆ రెంటికిని బరమైన ముక్తాత్మతత్త్వము నీవ. నీవే సృష్టి కర్తవు. పురాణపురుషుఁడవునీవే. ఈప్రపంచమునకుఁ బరమాధారము నీవే. తెలిసికొనువాఁడవు, తెలియఁబడినది, యుత్తమ ప్రాప్యస్థానము నీవే. అనంతరూపా ! చిదచిదాత్మక ప్రపంచరూపమంతయు నీచే వ్యాపింపఁ బడినది. వాయువు యముఁడు నగ్ని వరుణుఁడు చంద్రుఁడు బ్రహ్మయు నందఱకును మూత్తాతయు నీవ.

దేవా! నీకు వేయునమస్కారములు. మరలమరల నీకునమస్కారము. ముందు–వెనుకఁ–బక్కల–దిశల–సన్నిహలముల నిండియుండునీకు నమస్కారము. అనంతవీర్య ! యమితవిక్రమ ! నీవేసర్వము నాత్మ స్వరూపమునఁ బొందెదవు. కావున సర్వము నీవే. ౪౦

నీ మహిమ నెఱుఁగక పొరపాటునను, జనవుచేతను, కృష్ణా యని, యాదవుఁడాయని చెలికాఁడాయని వినయముతప్పి నోగ తాళిగఁ బిలుచుచు సత్కరింపక పోయితిని. కృష్ణా విహారమందును, శయనించినపుడును, గూర్చుండునపుడును, భోజనకాలమునను, నొంటరిగా నుండునపుడును బదుగురిలోను నేను నిన్ను సత్కరింపక పరిహాసవాక్యము లాడితిని. అప్రమేయుఁడవగు నీవు నన్ను క్షమింపుము. ౪౧

అసమానప్రభావా ! చరాచరరూపమైన యీ ప్రపంచమందలి జీవులకు నీవే తండ్రివి. పూజ్యుండవునీవే. గొప్పగురుఁడవు నీవే. నీకు సమానులు లేరన నిఁక నీకంటె నధికుఁడెవఁడు? కావున నీకు సాష్టాంగ నమస్కారము గావించి యీశ్వరుఁడవు స్తోత్రపాత్రుఁడవు, నగు నిన్నుఁ బ్రసన్నునిగాఁ జేసికొనుచున్నాను. దేవా! పుత్రునకుఁ దండ్రివలెను, మిత్రునకు మిత్రునివలెను, బ్రియురాలికిఁ బ్రియుని వలెను, నిష్టుఁడవైన నీవు నన్ను క్షమింపుము. ౪౨

దేవా! మున్నెన్నఁడుచూడని నీ విశ్వరూపమునుజూచి సంతోషించితిని. నా మనస్సు భయముచే వ్యథపడుచున్నది. కావున నీ ప్రసన్నస్వరూపమును జూపుము, ఈశ్వరా! ప్రసన్నుండవగుము. ౪౫

సహస్రబాహూ ! విశ్వమూర్తీ ! మునుపటివలెఁ గిరీటము గద చక్రము నాలుగుచేతులుధరించి * యుండు నిన్నుఁజూడఁ గోరెదను. అనిన శ్రీ కృష్ణమూర్తి యిట్లనియె.

తేజోమయమై సమస్తమున వ్యాపించి తుదమొదలులేక యాద్యమై యుత్కృష్టమై నీవుతప్ప నింతకుముం దెవ్వరుచూడని యీ విశ్వరూపమును నీయందుఁగల యనుగ్రహబుద్ధిచే నా సంకల్పము వలనఁ జూపితిని. ४८

కేవల వేదాధ్యయనముచేతను, దానములచేతను, హోమాది క్రియలచేతను, నుగ్రతపస్సులచేతను, నా యిట్టి విశ్వరూపమును మనుష్యలోకమున నీకుఁ దప్ప మఱి యెవరికిఁ జూడ సాధ్యపడదు.

ఇట్టి భయంకరాకారమును జూచి వ్యథపడకుము. దిగ్భ్రమ నొందకుము. భయమువిడిచి సంతోషింపుము. ఇదిగో నీకు వాడుక పడిన నా సౌమ్యరూపమును జూడుము. ४९

అని చెప్పి శ్రీకృష్ణమూర్తి తనస్వరూపమును మరలఁజూపెను. భయపడిన యర్జునుని శాంతరూపముగలవాఁడై భగవంతుఁ డూరార్చెను. ५०

అర్జునుఁ డిట్లనియె.

సౌమ్యమైన నీయీ మానవస్వరూపమును జూచి జనార్దనా యెప్పటియట్ల స్వస్థచిత్తుఁడనైతిని. ५१

అనిన శ్రీ కృష్ణుండిట్లనియె.

నీకుఁ గానవచ్చిన నా విశ్వరూపముఁ జూచుటకు మిగులఁ గష్టమైనది. దానినిజూడ దేవతలును నిత్యము గోరుచుందురు. వేదాధ్యయనముచేతను, దానముచేతను, దపస్సుచేతను, యాగముల చేతను, నీవు చూచిన నా రూపమునుజూడ సాధ్యుఁడగాను.

అర్జునా ! యితరప్రయోజనముగోరని భక్తిచేతనే దెలిసికొనుటకుఁ జూచుటకుఁ బ్రవేశించుటకు సాధ్యపడుదును. ५४

---

*కంసునిఁ జంపువఱకుఁ గృష్ణుఁడు ద్విభుజుఁడు. అవలఁ జతుర్భుజుఁడు.

కావున నెవఁడు నా యారాధనరూపములని సమస్తకర్మములు చేయునో, యన్ని కార్యములకు నన్నే పరమోద్దేశ్యముగాఁ గలవాఁడగునో యెవఁడు నాయందు భక్తిగలవాఁడగునో యెవఁ డితరసంగములనెల్ల వదలుకొనునో, యెవఁడు సమస్తభూతములయందు వైరబుద్ధి లేనివాఁడగునో వాఁడు నన్నే పొందుచున్నాఁడు. ౫౫

ఏకాదశాధ్యాయము, విశ్వరూపసందర్శనయోగము సంపూర్ణము.

---

## ద్వాదశాధ్యాయము.

### —♦ భక్తియోగము. ♦—

అర్జునుఁ డిట్లనియె.

కృష్ణా! యవతారమూర్తివై నాకు గోచరించుచుండు నిన్ను నీవు చెప్పినట్లు ధ్యానించుచుఁ గైంకర్యము చేయుచునుండు సగుణోపాసకులగు భక్తులును, నింద్రియగోచరుఁడవుగాక యక్షరస్వరూపుఁడవైన నిన్ను నుపాసించు నిర్గుణోపాసకులును నిరువురు యోగవిదులే కదా. ఈ యిరువురిలో నెవరు శ్రేష్ఠులు. ౧

అని యడిగినఁ గృష్ణమూర్తి యిట్లనియె.

ఎవ్వ రవతారమూర్తినగు నాయందు మనస్సు నిలిపి నాతో నిత్యయోగముఁ గోరుచు శ్రద్ధతో నన్ను నుపాసింతురో వారే యోగిశ్రేష్ఠులని నాయభిప్రాయము. ౨

ఇంద్రియసమూహమును వశపఱచుకొని, సమస్తభూతములందు సమబుద్ధులై, సమస్తభూతములకు మేలుకోరుచు, నెవరు నిర్దేశింపరానిదియు నింద్రియగోచరము గానిదియు, సమస్తమున వ్యాపించియుండునదియు, నిట్టిదని చింతింపరానిదియు సర్వసాధారణమైన దేహాదులతో సంబంధము లేనిదియుఁ, జలింపనిదియు, నిత్యమైనదియునగు నక్షరమును నుపాసింతురో వారును నన్నే ప్రాపింతురు. అయినను నవ్యక్తమం దాసక్తిగల నిర్గుణోపాసకులకుఁ గష్టము మిక్కిలి యధి

కము. అవ్యక్తవిషయమైన మనోవృత్తి దేహధారులకుఁ గష్టముతోఁ గాని కలుగదు. ౫

• అర్జునా! సమస్తలౌకిక వైదిక కర్మములను నాయందుసమర్పించి నేనే పరమ ప్రాప్యుఁడనని తలఁచి యితరప్రయోజనముకోరని యోగముచే నెవ్వరు నన్ను ధ్యానింతురో యుపాసింతురో నాయందుమనస్సు నిలిపిన యట్టివారిని శీఘ్రముగా మృత్యువుఁబోలిన సంసారమనెడి సముద్రమునుండి సముద్ధరింతును. కావున నాయందే మనస్సు లఘుంపఁజేయుము. నాయందే బుద్ధినిలుపుము. అటుచేసితివా తరువాత నాయందే నివసింతువు. సందేహములేదు. ౮

ఒకవేళ స్థిరముగ నీవు నీమనస్సును నాయందునిలుప శక్తిలేనివాడవైతివా యభ్యాసయోగముచే నన్నుఁ బొందఁగోరుము. అభ్యాసముచేయుటకు నీకు శక్తిలేదేని నాకుఁ గైంకర్యరూపములగు కార్యములను జేయుము. నన్నుద్దేశించి కర్మములు చేసినను నీకు మత్ప్రాప్తి కలదు. ౧౦

భక్తియోగము నాశ్రయించి కైంకర్యరూపములగు కార్యములను జేయఁజాలవేని నీవు చేయు సకలకర్మములఫలము నాకుఁ గాఁద్యజింపుము. (దీనినే కర్మయోగ మందురు.) ౧౧

ప్రీతిలేని స్మరణమునకంటె నాత్మజ్ఞానము సులభముగసాధింపఁ గూడియుండుటచే మేలైనది. అట్టి జ్ఞానముకంటె ధ్యానము మేలైనది. ధ్యానముకంటెఁ గర్మఫలము వదలుటమేలు. ఫలము గోరక కర్మములుచేయుపిదప మనశ్శాంతి కలుగును. మనశ్శాంతి కలిగిన నాత్మధ్యానము లభించును. ధ్యానమువలన నాత్మ సాక్షాత్కరించును. దానివలన భక్తి కలుగును, కావున భక్తి యోగము నభ్యసింపశక్తి లేనివారికి నాత్మనిష్ఠ మేలు. ౧౨

కర్మఫలమును భగవంతుని కర్పించు కర్మనిష్ఠున కుండవలసిన గుణములఁ జెప్పుచున్నాను. సమస్త భూతములయెడ ద్వేషము కూడదు. అన్నిటియెడ స్నేహబుద్ధిగలవాఁడై యుండవలయు. దయగలవాఁడు నహంకారము మమకారము లేనివాఁడు, సంకల్పము

వలనఁ గలుగు సుఖదుఃఖములయందు సముఁడు, తమంత వచ్చు సుఖదుఃఖముల నోర్చువాఁడు, లభించినదానితో సంతోషించువాఁడు, నెప్పుడు నాత్మానుసంధానము చేయువాఁడు, నియమింపఁబడిన మనోవృత్తి గలవాఁడు, నధ్యాత్మ శాస్త్రములందు దృఢమైన నమ్మిక గలవాఁడు, మనస్సు బుద్ధి నాకు సమర్పించినవాఁడునగు నన్ను భజించువాఁడెవఁడో వాఁడు నాకుఁ బ్రియుఁడు. ౧౪

ఎవనికి లోకము భయపడదో, యెవఁడు లోకమునకు భయపడఁడో, యెవఁడు సంతోషము, కోపము, భయము, మనోవ్యాకులత లేనివాఁడో వాఁడు నా ప్రియుఁడు. ౧౫

ఆత్మవస్తువుదప్ప మఱిదేనిని గోరనివాఁడు, శాస్త్రీయమగు నాహారముచేఁ బరిశుద్ధుఁడు, నితరకార్యములం దుపేక్ష గలవాఁడు, చలి వేఁడి మొదలగువానికి వ్యథపడనివాఁడు, శాస్త్రవిరుద్ధకర్మములను దేనిని నారంభింపనివాఁడు, నన్ను భజించువాఁడు నెవఁడో వాఁడు నాకుఁ బ్రియుఁడు. ౧౬

మేలుకలిగినపు డుప్పొంగక, కీడుకలిగినపుడు ద్వేషింపక, యిష్టవస్తువు పోయెనని యేడువక, పుణ్యపాపములు రెంటిని వదలి నన్ను భజించువాఁడు నాకుఁ బ్రియుఁడు. ౧౭

శత్రువులందును, మిత్రులందును, మానావమానములందును, నిందాస్తుతులందును, శీతోష్ణములందును, సుఖదుఃఖములందును, సముఁడై దేనియందు నాసక్తిలేక వాఙ్నియమము కలవాఁడై తనంత నేది లభించునో దానితో సంతుష్టిపడుచు, స్థిరబుద్ధిగలవాఁడై, గృహాదులం దాసక్తిలేక స్థిరమైన యునికిపట్టు లేక నన్ను భజించువాఁడు నాకుఁ బ్రియుఁడు. ౧౮

ఎవరు శ్రద్ధావంతులై నేనే తమకు ముఖ్యగతిగాఁ దలంచుచు ధర్మముతోఁగూడిన యీ యమృతమును మీఁదఁ జెప్పినట్టు లుపాసించుచున్నారో యా భక్తులు నాకు మిక్కి లి ప్రియులు.

ద్వాదశాధ్యాయము, భక్తియోగము సంపూర్ణము.

---

## త్రయోదశాధ్యాయము.

## —♦ క్షేత్రక్షేత్రజ్ఞ విభాగయోగము. ♦—

అనిన అర్జునుం డిట్లనియె.

కృష్ణా! ప్రకృతియన నేది? పురుషుఁడనువాఁ డెవఁడు? క్షేత్ర మనఁగా నేమి? క్షేత్రజ్ఞుఁ డెవఁడు? జ్ఞానలక్షణ మెట్టిది? తెలియవలసిన విషయ (జ్ఞేయ) మేది? ౧

అనిన శ్రీకృష్ణమూర్తి యిట్లనియె.

అర్జునా! యీ శరీరమునకు క్షేత్రమని పేరు. ఈ దేహము నాదియని యెవఁ డెఱుఁగునో వాఁడు క్షేత్రజ్ఞుఁడు. ఈ క్షేత్రజ్ఞుఁడే జీవుఁడు. అన్ని దేహములందుండెడి క్షేత్రజ్ఞుఁడుకూడ నేనే యని యెఱుఁగుము. క్షేత్రము వేఱు, క్షేత్రజ్ఞుఁడు వేఱు. ఈరెంటికి నేనే యాత్మభూతుఁడని తెలియు తెలివియేదో దానికే జ్ఞానమని పేరు. 3

ఇఁక క్షేత్రమన నెట్టిదో, దాని వికారము లేవియో, యది యేల పుట్టినదో, దాని స్వరూప మెట్టిదో, క్షేత్రజ్ఞుఁ డెట్టిస్వరూపము గలవాఁడో యెట్టి ప్రభావము గలవాఁడో, యివన్నియు సంగ్రహము గాఁజెప్పెద వినుము. ౪

ఈ విషయము ఋషులచేతను సంగ్రహముగాను సమగ్రముగాను వేఱువేఱు విధములు గల వేదములచేతను, హేతువులచే నిశ్చయింపఁబడిన బ్రహ్మసూత్రములచేతను, వర్ణింపఁబడినది. ౫

పంచమహాభూతములు, నహంకారము, బుద్ధియనెడి మహత్తత్త్వ, మవ్యక్తమనెడి మూలప్రకృతి, మనస్సుతోఁగూడిన యింద్రియములు పదునొకండు, నింద్రియములకు గోచరించు విషయములు, శబ్ద స్పర్శరూప రస గంధములనెడిఁయైదు, కోరిక, ద్వేషము, సుఖము, దుఃఖము, తెలివి, ధైర్యము, జీవుఁడు సుఖదుఃఖముల ననుభవింప నాధారమైన యైదు భూతముల కూడిక, వీని కన్నిటికి క్షేత్రమని పేరు.

క్షేత్రలక్షణము దానిలోఁ గలుగు మార్పులతోడ సంగ్రహముగాఁ జెప్పితిని. ఇఁక క్షేత్రకార్యములయిన గుణములలో నాత్మజ్ఞానమునకు సాధనములుగా నుండువానిని జెప్పెదను. ౭

గర్వము దంభము హింస యివి లేకుండుట. మనస్సు కలఁతజెందకుండుట, ఋజుత్వము, నాచార్యు నుపాసించుట, మనోవాక్కాయములు నిర్మలముగా నొక్కవిధముగా నుండుట, స్థైర్యము, మనోనిగ్రహము, నింద్రియార్థములందు వైరాగ్యము, నహంకారము లేకుండుట, జనన మరణ జరావ్యాధిదుఃఖములయందలి దోషము లెఱిఁగి యివి పొమ్మనినఁ బోవునవి కావు గనుక నివి కలిగినపుడు దుఃఖింపకుండుట, యాత్మకంటె నితరవస్తువులం దాసక్తి లేకుండుట, కొడుకు, భార్య, యిల్లు మొదలగువానియందు ననురక్తి లేకుండుట, మేలు కీళ్లయం దెప్పుడు మనస్సు సమముగ నుంచుకొనుట, సర్వేశ్వరుఁడ నగు నాయందు నేకాంతమై స్థిరమైన భక్తి నుంచుట, జనులు లేని ప్రదేశమున నివసించుట, జనసమూహముతోఁ గలసియుండుటయందుఁ బ్రీతిలేకుండుట, యాత్మవిషయజ్ఞాన మందుస్థిరుఁడైయుండుట, తత్త్వజ్ఞానము గలిగించు చింతనమం దాసక్తి, వీనికి జ్ఞానమని పేరు. ఇవి యాత్మజ్ఞానమునకు సాధనములు. వీనికి వ్యతిరిక్తమైన దంతయు నజ్ఞానము. అది యాత్మజ్ఞానమునకు విరోధి. ౧౨

ఇఁక క్షేత్రజ్ఞుని స్వరూపమును జెప్పెదను వినుము. ఇది తెలియఁదగినది కావునఁ దెలిసికొంటివా మోక్షమును బొందెదవు.

అది యుత్పత్తిలేనిది. నన్నే ముఖ్యునిగాఁ గలది. దేహము మొదలగునావరణము లేక వేఱైయుండునది. అది సత్తుగాదు, అసత్తుగాదు. ఆ పరిశుద్ధాత్మస్వరూపమునకు సర్వత్ర కాలు సేతులు గలవు. అనఁగాఁ గాలు సేతులతోఁ జేయు పనిని నవి లేకయే యెంతైనఁ జేయఁ గలదు. అంతటఁ గన్నులు, తల, ముఖము, చెవులు, గలది. లోకమందంతయు వ్యాపించియున్నది.

శుద్ధాత్మస్వరూప మింద్రియములు లేనిదైనను నింద్రియగుణములచే విషయముల నెఱుఁగ శక్తిగలది. దేహసాంగత్యము లేనిది

సమస్తమును భరింప శక్తిగలది. సత్త్వాదిగుణములు లేనిది సత్త్వాది గుణముల భోగించు శక్తిగలది. పంచభూతముల లోపల వెలుపల వర్తించునది. స్వభావముచేఁ గదలకున్నను దేహసంబంధముచేఁ గదలునది. అది యతిసూక్ష్మమగుటవలనఁ దెలియ శక్యము గానిది. అది దంభాదిగుణములు గలవారికి దూరమందున్నది. అది లేనివారికి సమీపమందే యున్నది. స్వరూపముచే దేవమనుష్యాది విభాగములు లేకుండినను నది దేవమనుష్యాది విభాగములు కలదానివలెఁ గాన వచ్చుచుండును.

దేహరూపముగాఁ గూడిన పృథివ్యాది భూతములను నది భరించునని భుజించునని యవి పుట్టుటకుఁ గారణమని తెలిసికొనుము. ఆ భూతములె యన్నాది రూపముల నొంది భుజింపఁబడుచున్నవి. భుజింపఁబడుదానికంటె భుజించునదియును, బుట్టుదానికంటెఁ బుట్టుకకుఁ గారణమైనదియు వేఱని తెలియుము. భుజించుట దేహధర్మముగాదు. ఎట్లన నాత్మ దేహమును విడిచిపోయిన తరువాత దేహము భుజింపదు కావున దేహముభుజించుట కాత్మ కారణము.

ఆ యాత్మస్వరూపము ప్రకాశించువానికిఁగూడఁ బ్రకాశము గలుగఁజేయునది. సూక్ష్మప్రకృతికంటె నితరమైనది. జ్ఞానమే యాకారముగాఁగలది, తెలియఁగలది. జ్ఞానముచేఁ బొందఁదగినది. సమస్త ప్రాణుల హృదయమం దుండునది. ౧౮

ఇట్లు క్షేత్రము, జ్ఞానము, జ్ఞేయమనఁగా నేమో సంక్షేపముగాఁ జెప్పితిని. దీనిని దెలిసికొని నా భక్తుఁడు నాస్వభావముగల వాఁడగుటకుఁ దగినవాఁడగును. ౧౯

ఆత్మయును బ్రకృతియును రెండు ననాదులు. అందు వికారములు గుణములు ప్రకృతివలనఁ గలుగునవి యని తెలిసికొనుము.

శరీరము, నింద్రియములు కార్యములు చేయుటయందు నాత్మతోఁగూడియుండు ప్రకృతియే కారణము. సుఖదుఃఖముల ననుభవించుటయందుఁ బ్రకృతితోఁగూడిన జీవుఁడే కారణము. ౨౧

జీవుఁడు ప్రకృతితోఁగూడినవాఁడై ప్రకృతివలనఁ బుట్టిన సత్త్వాదిగుణములవలనఁ గలిగిన సుఖదుఃఖముల ననుభవించుచున్నాఁడు. పురుషుఁడు మంచి యోనులందును, చెడ్డ యోనులందును జన్మించుటకు సత్త్వాదిగుణకార్యములైన సుఖాదులందు వానికిఁ గల యాసక్తియే కారణము. ౨౨

ఈ దేహమందుండు జీవుఁ డీ దేహమునకుఁ దన సంకల్పముచేతను ప్రేరణముచేతను బ్రవృత్తిని గలిగించుచు దానిని నియమించుచు భరించుచు నున్నాఁడు కావుననే యా ప్రవృత్తివలనఁ గలిగిన సుఖదుఃఖముల ననుభవించుచున్నాఁడు. కావుననే యీ దేహేంద్రియములకు మనస్సునకు గొప్ప నియామకుఁడగుచున్నాఁడు. ౨౩

ఈవిధముగా గుణములతోడి ప్రకృతిపురుషుల నెవ్వఁ డెఱుఁగునో వాఁడు సర్వవిధముల వర్తించుచుండినను మరల జన్మింపఁడు. ౨౪

కొందఱు యోగబలముచే నాత్మను ధ్యానముచే మనస్సుచేఁ జూచుచున్నారు. కొందఱు జ్ఞానయోగముచేతను జూచుచున్నారు.

మఱికొందఱు కర్మయోగముకూడ నెఱుఁగక జ్ఞానులగు నితరులచే విని తెలిసికొని యాత్మ నుపాసించుచున్నారు. వారును శ్రవణమందు నిష్ఠగలవారగుటచే సంసారమునుండి తరింతురు. ౨౬

అర్జునా! స్థావరముగఁగాని జంగమముగఁగాని పుట్టెడి దేది గలదో యది క్షేత్రము క్షేత్రజ్ఞుఁడు కలియుటచేతనే పుట్టినదని తెలియుము. క్షేత్రక్షేత్రజ్ఞులు గలిసి తామే జంతువుగాఁ బుట్టుచున్నారు. ౨౭

సమస్తప్రాణులయందు దేహేంద్రియమనస్సులకుఁ బరమ నియామకుఁడై యుండు నాత్మను నంతట సమముగాను దేహములు నశించినను నశింపని స్వభావముగల వానినిగాను దెలిసికొనినవాఁడే యెఱుకగలవాఁడు. ౨౮

సమస్తదేహములందుండు నాత్మను సమానాకారముగల వానినిగాఁ దెలిసికొనినవాఁడు మనస్సుచేఁ దన యాత్మను హింసింపఁడు

మఱి సంసారమునఁ బడకుండ రక్షించును. ఇట్టి జ్ఞానముచేఁ బరమగతిని బ్రాపించును. ౨౯

చేయఁబడు సమస్తకార్యములు బ్రకృతిమాత్రమే చేయుచున్నదనియు, నాత్మ యే కార్యమును జేయదనియు నెవ్వఁ డెఱుఁగునో వాఁడే నిజము తెలిసినవాఁడు. ౩౦

బ్రకృతిపురుషులు కలియుటవలన భూతములు పుట్టుచున్నవి. ఇందుఁ గొన్ని పొట్టిగాను, గొన్ని పొడవుగాను, గొన్ని మనుష్య స్వరూపముతోను, గొన్ని పశుపక్ష్యాదులుగాను, నానా విధములుగాఁ గానవచ్చుచున్నవి. మఱియు నీ భూతములు పుత్రపౌత్ర సంతానముచే విస్తారమగుచున్నవి. ఈ భేదములన్నియుఁ బ్రకృతి తత్త్వమందే యున్నవని యెవఁడు తెలిసికొనునో వాఁడు శుద్ధాత్మ స్వరూపమును బొందుచున్నాఁడు. ౩౧

అర్జునా! యీయాత్మ శరీరమం దుండినవాఁడైనను నాదిలేని వాఁడగుటను, నాశములేనివాఁడగుటను, సత్త్వాదిగుణములు లేని వాఁడగుటను, గర్మముల నేనిని జేయఁడు. దేహ స్వభావము లతని నంటవు. ౩౨

ఆకాశము సమస్తవస్తువులయందు వ్యాపించియున్నను సూక్ష్మమగుటచే నావస్తుస్వభావము దానికంటనట్లు జీవాత్మ యతిసూక్ష్మమగుటవలన దేహములందున్నను దేహస్వభావములచే నంటఁబడఁడు.

సూర్యుఁ డొకఁ డెట్లు లోకముసంతయుఁ బ్రకాశింపఁజేయునో యట్లే క్షేత్రజ్ఞుఁడును దేహమునంతయు లోపల వెలుపల నాపాద మస్తకము బ్రకాశింపఁ జేయుచున్నాఁడు. ౩౪

ఈ జ్ఞాననేత్రముచే నెవ్వఁడు క్షేత్రక్షేత్రజ్ఞులకుఁగల భేదమును, భూతములు బ్రకృతినుండి మోక్షమును బొందునుపాయమును దెలిసి యాప్రకార మాచరించునో వాఁడు పరమును బొందుచున్నాఁడు. ౩౫

త్రయోదశాధ్యాయము. క్షేత్రక్షేత్రజ్ఞ విభాగయోగము సంపూర్ణము.

## చతుర్దశాధ్యాయము.

### —♦ గుణత్రయ విభాగయోగము. ♦—

అర్జునా! మునులందఱు దేనిని దెలిసికొని దీనికంటె గొప్ప సిద్ధిని బొందిరో యట్టి యుత్తమజ్ఞానమును మరలఁ జెప్పెద వినుము. ఈ జ్ఞానము నాశ్రయించినవారు నాతో సమానులై సృష్టియందుఁ బుట్టరు. ప్రలయమందు నశింపరు. ౧

సమస్తసృష్టికి నా గొప్పయచేతన ప్రకృతియే యోని. దాని యందు నేను జేతనప్రకృతిని గర్భముగా నుంచుచున్నాను. దాని వలన సమస్తభూతములు పుట్టుచున్నవి. ౩

సమస్తజాతులయందును నే దేహములు పుట్టుచున్నవో వానికి నచేతనప్రకృతి మాతృస్థానము. చేతనవర్గ మను బీజమును గూర్చు తండ్రిని నేను. ౪

ప్రకృతివలనఁ గలిగిన సత్త్వము రజస్సు తమస్సననెడి మూఁడుగుణములు దేహమందుండు నవ్యయుఁడైన జీవుని బంధించు చున్నవి. ౫

అందు సత్త్వగుణము నిర్మలమై ప్రకాశమును సుఖమును కలుగఁజేయుచుఁ బురుషునికి జ్ఞానమునందును సుఖమునందును గోరికలు గలిగించుచున్నది. వాఁడవి లభించుటకుఁ గర్మములు చేయఁగా నవి యనుభవించుటకై జన్మములు కలిగించుచు నీవిధముగ బంధించు చున్నది. ౬

అర్జునా! రజోగుణము స్త్రీపురుషుల యన్యోన్యానురాగమునకుఁ గారణమనియు, విషయములందలి యాశకుఁ బుత్రాది సంబంధులయందలి కోరికకుఁ బుట్టుచోటనియు నెఱుఁగుము. ఆరజోగుణము కర్మములఁ జేయువలయునను కోరిక కలిగించుటచే బంధించు చున్నది. ౭

తమోగుణము విపరీతజ్ఞానమువలనఁ బుట్టి సమస్త ప్రాణులను మోహింపఁ జేయుచున్నది. తమోగుణము నిద్ర, సోమరితనము, హెచ్చరిక లేమి యనువానిచే బంధించుచున్నది. ౮

సత్త్వగుణమునకు సుఖసంగము ప్రధానము. రజోగుణమునకుఁ గర్మసంగము ప్రధానము. తమోగుణము జ్ఞానమును మఱుఁగుపఱచి విపరీతకార్యములు చేయించుచున్నది. ౯

ప్రతిజీవియందును సత్త్వరజస్తమోగుణములు మూఁడును నుండును. అందు సత్త్వ మెక్కువయయ్యెనా యది రజస్తమస్సుల నణఁచుచున్నది. రజస్సెక్కువ యయ్యెనా సత్త్వతమస్సుల నణఁచుచున్నది. తమస్సెక్కువ యయ్యెనా తక్కిన రెంటిని నణఁచుచున్నది. ౧౦

ఈ దేహమందుఁ గల కన్నులు మొదలగు సమస్తజ్ఞానేంద్రియముల మూలమున వస్తువుల యథార్థస్వరూపము తెలియు జ్ఞాన మెప్పుడు కలుగుచున్నదో యప్పుడు సత్త్వము వృద్ధిపొందినదని తెలియుము. ౧౧

రజోగుణము వృద్ధిపొందినపుడు పిసినారితన మత్యాశ, ప్రయోజనము లేక చేష్టలు చేయుట, ఫలమును గోరి కార్యములు చేయుట, యింద్రియముల యుద్రేకము, విషయములందలి కోరిక కలుగుచున్నవి. ౧౨

తమోగుణము వృద్ధినొందినపుడు జ్ఞానము లేకుండుట, కార్యములు చేయక సోమరియై యుండుట, పరాకు, విపరీతజ్ఞానము కలుగుచున్నవి. ౧౩

సత్త్వగుణము వృద్ధిపొందినపుడు మరణించువాఁ డాత్మస్వరూప మెఱిఁగినవారి పవిత్రలోకములకుఁ బోవుచున్నాఁడు. ౧౪

రజోగుణము వృద్ధియయినపుడు మరణించువాఁడు ఫలాపేక్షతోఁ గర్మములు చేయువారి వంశమునఁ బుట్టుచున్నాఁడు. ౧౫

తమోగుణము వృద్ధియగుచుండ మరణించువాఁ డేపురుషార్థమునకుఁ దగని నీచయోనులయందుఁ బుట్టుచున్నాఁడు.

ఫలాపేక్షలేక భగవత్ప్రీతిగ మంచి కర్మములు చక్కఁగఁ జేయువానికి వాఁడు మరణించినపిమ్మట మఱుసటి జన్మమున నాత్మజ్ఞానము గలవారి వంశమునఁ బుట్టి మునుపటికంటె నెక్కువ సత్త్వగుణము కలవాఁడై లవమైనను దుఃఖమును బొందకుండుటే ఫలము. అట్టులే రజస్సునను ధనాపేక్షతోఁ గర్మములు చేయువారి యింటఁ బుట్టి తాను సత్కర్మచేయుచు నా ఫలముల ననుభవింప మరల మరలఁ బుట్టుచు దుఃఖములపాలగుటయే ఫలము.

సత్త్వమువలన జ్ఞానము, రజస్సువలన లోభము, తమస్సు వలనఁ బ్రమాద మోహములు నజ్ఞానము కలుగుచున్నవి.

సత్త్వగుణము కలవారు మోక్షమునకుఁ బోవుదురు. రజోగుణముకలవారు నడిమిలోకముల నుందురు. తమోగుణము గలవా రధోలోకముల పాలగుదురు. ౧౮

ఆత్మజ్ఞానము గలవాఁడు కర్మములను జేయునవి గుణములేకాని యాత్మయగు తానుగాదని యెప్పుడు తెలిసికొనుచున్నాఁడో యప్పుడు నాతో సమానమైన భావమును బొందును. ౧౯

పురుషుఁడు దేహమువలనఁ గలిగిన యీ మూఁడుగుణముల నతిక్రమించి జననమరణములు జరాదుఃఖము లనువానిచే విడువఁబడి శుద్ధాత్మ స్వరూపము ననుభవించును. ౨౦

అనిన నర్జునుం డిట్లనియె.

మూఁడుగుణముల నతిక్రమించినవాఁడు కృష్ణా! యెట్టి లక్షణములు కలవాఁ డగును? వాని యాచార మెట్టిది? ఎట్లు వాఁడీ మూఁడుగుణముల నతిక్రమించును. ౨౧

అని యడిగిన శ్రీకృష్ణమూర్తి యిట్లనియె.

అర్జునా! ప్రియములు లభించినపుడు సంతోషము, నప్రియములు లభించినపుడు ద్వేషమును, నిష్టమైనవి పోయినపుడు మరల వానిని గోరుటయు లోకమున వారికి సహజము కదా: గుణాతీతుఁడో యట్టివాఁడుకాఁడు. అనిష్టములను ద్వేషింపఁడు. ఇష్టవస్తువులు పోయినను మరల వానిని గోరఁడు. దేనియందు వాని కనుకూలబుద్ధి

గానిఁ ద్వేషబుద్ధిగాని లేను, దేహ మొకటి యుండఁగా నిష్టానిష్ట ములం దనుకూల ప్రతికూల బుద్ధులు లేకుండునా యందు వేమో. గుణాతీతుఁ డాత్మకార్యములకంటెఁ దక్కినవానియం దుదాసీనుఁడై గుణములచేతఁ జలింపఁడు, గుణములే వాని వాని కార్యములు చేయుచున్నవని తలఁచి యూరకుండునుగాని వానికై యేచేష్టలును జేయఁడు. ఆత్మవిచారమం దే యున్నవాఁడగుటచే సుఖదుఃఖములందు సమచిత్తముగలవాఁడై బంగారును రాతిని మట్టిని సమముగాఁ జూచుచు నిష్టానిష్టములందు సముఁడై ధీరుఁడై తన్నొకరు దూషించినను భూషించినను, నవమానించినను, గౌరవించినను, మోదము ఖేదము లేక సముఁడై వీఁడు శత్రుఁడని వీఁడు మిత్రుఁడని భేదమెంచక యిరువురిపట్ల నొక్కటియై సంసారమునకుఁగాఁ గావలసిన కార్యములేవియుఁ జేయ యత్నింపకయుండును. ఇట్టి గుణములు కలవాఁడే గుణాతీతుఁడు. ౨౫

ఇట్టి గుణాతీతుఁ డగుటకు సుపాయము చెప్పెద విను.

నన్నెవఁడు నిశ్చలమైనభక్తితో సేవించునో వాఁడీమూఁడుగుణములను దాఁటి పరబ్రహ్మసమానపరిశుద్ధాత్మస్వరూపమునుబొందును.

ఆ కారణముచే నాశరహితుఁడు, నవ్యయుఁడు నగు జీవాత్మస్వరూపమునకు, శాశ్వతధర్మమునకు, నేకాంతభక్తుఁడును జ్ఞానిపొందదగిన మోక్షమునకు నేనే యాధారము. ౨౭

చతుర్దశాధ్యాయము, గుణత్రయవిభాగయోగము సంపూర్ణము.

---

## పంచదశాధ్యాయము.

### —♦ పురుషోత్తమప్రాప్తియోగము. ♦—

మఱియు శ్రీకృష్ణమూర్తి యిట్లనియె.

సంసారమనెడి రావిచెట్టూర్ధ్వలోకమందలి చతుర్ముఖబ్రహ్మయే మూలముగాఁ గలదగుటచేత మీఁద వేరులు గలదనియు భూలోక:

మంపుంపు మనుష్యులు కొనలుగాఁగలదగుటచేతఁ గొమ్మలు క్రిందికి వ్యాపించియున్నవనియు, నీ చెట్టునకుఁ గామ్యకర్మములను బ్రతిపాదించు వేదము లాకులనియు, నిది నిత్యమనియు నెవ్వఁ డెఱుఁగునో వాఁడు వేదము నెఱిఁగినవాఁడు. ౧

ఈ సంసారవృక్షమునందలి కొన్ని కొమ్మలు క్రిందుగా నర పశు మృగాది రూపములుగాను, గొన్ని మీఁదుగ గంధర్వ యక్ష దేవతల రూపములుగాను వ్యాపించినవి. ఈ కొమ్మలు సత్త్వాదిగుణములచేఁ బెరిఁగి శబ్దాదివిషయము లను చిగుళ్లు గలవై యున్నవి. క్రింది మనుష్యలోకమున విడువక వెంట నంటివచ్చు కర్మము లే వేళ్లై విస్తరించియున్నవి. ౨

ఈ సంసారవృక్షస్వరూప మేదో దీని నశింపఁజేయు టెట్లో సంసారులు తెలిసికొనలేకున్నారు. దీనికి గుణమయములైన భోగము లందలి యాసక్తియే మూలమనియు నా యాసక్తిని వదలుటె దీనిని నశింపఁజేయు విధమనియు, నాత్మకాని దానిని నాత్మగాఁ దలఁచుట యను నజ్ఞానమే దీనికి స్థానమనియు నెఱుఁగరు.

చక్కఁగా నానావిధములఁ బెరిఁగిన వేళ్లుగల యీసంసార వృక్షము నాసక్తిలేమి యనెడి బలిష్ఠమైన కత్తిచే నఱికి యాకారణమున నే స్థానముఁ జేరినవారు మరల జన్మాదులకు రారో యట్టి స్థానమును వెదకవలయును.

సర్వము సృష్టించినవానినుండియే గుణసంగ మను పురాతన ప్రవృత్తివ్యాపించియున్నది. కనుక నాద్యుఁడైన యా పురుషునే శరణు చొచ్చినయెడల నాయనయే దానిని నివర్తింపఁజేయును. ఇది మఱి యొకనికి సాధ్యపడునది కాదు. ౪

ఇట్లు నన్ను శరణుచొచ్చి దేహాభిమానరూపమగు మోహము లేక, భోగములయందలి యాసక్తిమాని, యాత్మజ్ఞాననిరతులై, కోరికల నివర్తింపఁజేసి, సుఖదుఃఖము లను పేరుగల ద్వంద్వములచే విడువఁబడి, యాత్మానాత్మ స్వరూపము తెలిసిన జ్ఞానులు పరిశుద్ధాత్మస్వరూపమును బొందుదురు. ౫

పరమోత్కృష్టమైన యాత్మజ్యోతి నాకు సంబంధించినది. దానిని సూర్యుఁడుగాని చంద్రుఁడుగాని యగ్నిగాని ప్రకాశింపఁ జేయఁడు. ఆ స్వరూపమును బొందినవారు మరల జన్మింపరు. ౬

అనాదియగునాత్మ నాయంశమేయైనను గర్మబద్ధుఁడై జీవుఁడు జీవలోకమునందు మనుష్యాది శరీరములకు సంబంధించి మనస్సు నాఁఱవదిగాఁగల యింద్రియములను నిటులొగి లాకర్షించుచుండును.

పూవులమీఁద వ్రాలినగాలి యెట్లాపూలవాసననుగొని పోవుచుండునో యట్లే శరీరమునుబొందిన జీవుఁ డా యా శరీరమునుండి వెడలిపోవునపుడును, మరల శరీరముసఁ బ్రవేశించునపుడును, నింద్రియములను సూక్ష్మభూతములతోడ గ్రహించికొని పోవుచున్నాఁడు.

ఈ జీవుఁడు చెవులు, కన్నులు, త్వక్కు, నాలుక, ముక్కు, మనస్సు అను నీ యింద్రియములను దమ తమ విషయ వ్యాపారములకుఁ దగినవానిగాఁ జేసికొని శబ్దాదివిషయముల ననుభవించును.

దేహమునందున్నప్పుడుగానీ శరీరము విడిచిపోవునపుడుగానీ విషయముల ననుభవించునపుడుగానీ గుణములతోఁగూడిన జీవుని మూఢులు చూడలేరు. జ్ఞాననేత్రములు గలవారు చూతురు. ౧౦

నాయందు భక్తిగలిగి యత్నముచేయు యోగులు శరీరమందుండు నాత్మను జూతురు. యత్నముచేసియు సంస్కారములేని వారాత్మావలోకమునకుఁ దగిన మనస్సులేనివారు చూడలేరు. ౧౧

సూర్యునియందలి యే తేజస్సు లోకమును బ్రకాశింపఁ జేయుచున్నదో చంద్రాగ్నులయందే తేజస్సున్నదో యా తేజస్సు నాది.

నేనే వారియందుఁ గొంత యుంచితినని యెఱుంగుము. భూమియందావేశించి నేను జరాచరభూతములనెల్ల ధరించుచున్నాను. అమృతరసమయుఁడగు చంద్రుఁడనై సమస్తములైన యోషధులను బోషించుచున్నాను. ౧౩

నేనే జఠరాగ్నినై ప్రాణులదేహము నాశ్రయించి ప్రాణాపానవాయువులతోఁగూడి వారుతినెడి నాలుగువిధములైన యన్నమును బక్వము చేయుచున్నాను. ౧౪

నేను సర్వభూతముల హృదయమందుండువాఁడను, నావలననే స్మృతి జ్ఞాన మూహకలుగుచున్నవి. సమస్త వేదములచేఁ దెలియఁదగినవాఁడను నేనే. వేదములందుఁ జెప్పఁబడిన ఫలమునిచ్చువాఁడను నేనే. అట్టి వేదము లెఱిఁగినవాఁడను నేనే. ౧౫

లోకమున క్షరుఁడనియక్షరుఁడని యిరువురు పురుషులుగలరు. అందొకఁడు నశించు స్వభావముగల యచిత్తుతోఁగూడిన బద్ధజీవుఁడు. వీఁడే క్షరుఁడు. మఱియొకఁ డచిత్తుతోఁగూడక పరిశుద్ధుఁడుగానుండు ముక్తుఁడు. వీఁడే యక్షరుఁడు. ౧౬

ఈ యిరువురు పురుషులకంటె నుత్తముఁడు వేఱొకఁడు గలఁడు. అతనిని వేదములు పరమాత్మయని పిలుచుచున్నవి. అతఁడే లోకత్రయము నావేశించి భరించువాఁడు. అతఁ డవ్యయుఁడు ఈశ్వరుఁడు.

క్షరమున కతీతుఁడను నక్షరమునకంటెను నుత్తముఁడనుగాన వేదములందును స్మృతులందును నేను బురుషోత్తముఁడనని ప్రఖ్యాతి నహించితిని. ౧౮

పురుషోత్తముఁడనఁగా నిట్టివాఁడనిజ్ఞానముగలవాఁడై యెవఁడు తెలిసికొనుచున్నాఁడో వాఁడన్నియు నెఱిఁగినవాఁడై నన్నన్ని విధముల భజించుచున్నాఁడు.

పాపరహితుఁడవైన యర్జునా! మిక్కిలి రహస్యమైన యీ శాస్త్రమును నేను నీకుఁజెప్పితిని. దీనిని దెలిసికొనినవాఁడు బుద్ధిమంతుఁడై కృతకృత్యుఁడగును.

పంచదశాధ్యాయము, పురుషోత్తమ ప్రాప్తియోగము సంపూర్ణము.

---

## షోడశాధ్యాయము.

### దైవాసురసంపద్విభాగయోగము.

అర్జునా! భయములేకుండుట, యంతఃకరణశుద్ధి, యాత్మజ్ఞానమందు నిష్ఠ, సత్పాత్రదాన, మంతరింద్రియ నిగ్రహము, భగవదా

రాధనముగ యజ్ఞాదులుచేయుట, వేదాభ్యాసము, తపస్సు, మనో
వాక్కాయము లొక్కరీతిగ నుంచుకొనుట, యహింస, సత్యము,
క్రోధము, త్యాగము, శాంతి, యనర్థకవాక్యములు పలుకకుండుట,
భూతదయ, విషయములందు స్పృహలేకుండుట, మృదుత్వము, లజ్జ,
చపలతలేకుండుట, తేజ మోర్పు, పట్టుదల, శౌచము, ద్రోహము
లేమి, గర్వములేకుండుట, యను నీగుణములు దైవసంపదయందుఁ
బుట్టినవారికిఁ గలుగును. ౩

దంభము, గర్వ, మభిమానము, క్రోధము, నిష్ఠురత్వ మజ్ఞాన
మును నివి యసురసంపదయందుఁ బుట్టినవారికిఁ గలుగును. ౪

దైవసంపద సంసారబంధము నివర్తింపఁ జేయును. అసురసంపద
యధోగతిని బొందించును, అర్జునా! నీవు దైవసంపదయందుఁ బుట్టి
తివి. దుఃఖింపకుము. ౫

ఈలోకమునందు దైవము, అసురము, నను రెండువిధములైన
గుణములుకల ప్రాణులు కలవు. దేహ సంబంధమైన యుత్పత్తిని
గుఱించి విస్తారముగఁ జెప్పితిని. ఇఁక నాసురమును జెప్పెద
వినుము. అసురులు ప్రవృత్తియు నెఱుఁగరు. నివృత్తియు నెఱుఁ
గరు. వారియందు శౌచము, ఆచారము, సత్యములేవు. ప్రపంచ
మసత్యమని చెప్పుదురు. ప్రపంచమునకు గామమే కారణమనియు,
స్త్రీపురుష సంయోగముచేఁ బుట్టినదనియు, దానివలన మఱియొక
దానితో దానికి నక్కఱలేదనియుఁ జెప్పుదురు. ౬

ఇట్టి విపరీతజ్ఞానము గలవారై యాత్మయొకటి యుండు టెఱుఁ
గక వివేకము లేనివారై క్రూర కార్యములు చేయుచు పాపులై
వీరు లోకనాశముకొఱకుఁ బుట్టుచున్నారు. వీరు పారములేని యాశ
నాశ్రయించి, యజ్ఞానముచే నన్యాయ్యమార్గమున నార్జించి, యపరి
శుద్ధవ్రతములు గలవారై, దంభమాన మదములతోఁగూడి వర్తించు
చున్నారు. పరిమితిలేక, ప్రలయాంతమువఱకు సాధింపఁదగిన విషయ
ములుగల చింతకు లోఁబడి గామభోగములే పరపురుషార్థమని నమ్మి
యంతకుమించిన పురుషార్థము లేదని తలఁతురు. ఆశలనుగూడి

యనేకపాశములచేఁ గట్టబడి కామక్రోధపరాయణులై విషయ సుఖములకై యన్యాయమార్గమున ధనమార్జింపఁగోరుదురు. ఈ పదార్థముల నన్నిటిని నా సామర్థ్యముచే సంపాదించితిని. ఇఁక మిగిలిన కోరికలను నెఱవేర్చుకొనఁగలను ఈ ధనము నాది. ఇంకను ధనము సంపాదింపగలను. ఈశత్రువులను నేను జంపితిని. తక్కిన వారిని జంపెదను. నేనే యీశ్వరుఁడను. నేనే భోగిని. నేనే సిద్ధుఁడను నేనే బలవంతుఁడను, నేనే సుఖిని, నేనే పండితుఁడను, నేనేధనవం తుఁడను. నేనుత్తమకులమునఁ బుట్టితిని. నాతో సముఁడెవ్వఁడు? నేను యాగము చేసెదను. నేను దానము చేసెదను. నేను సంతోషించెదను. ఇట్లని యజ్ఞానముచే వివేకము చెడినవారు తలఁతురు. ౧౫

నానావిధములగు మనోవ్యాపారములచే భ్రాంతిఁ బొంది, మోహపాశములచేఁ జుట్టబఁడి, కామభోగములయందు నాసక్తిగలవా రపరిశుద్ధమైన నరకమందుఁ బడుదురు. ౧౬

తమ్ముఁ దామే గౌరవించుకొనుచు స్తబ్ధులయి ధనమానమద ములతోఁగూడి యహంకారము బలము దర్పము కామము క్రోధము నాశ్రయించి తమదేహములందును, నితరదేహములందును, నుండు నా విషయమై యసూయపడుచు ద్వేషించుచు దంభముతో నశా స్త్రీయపద్ధతిని బేరునమాత్రము యజ్ఞమనిపించుకొను యజ్ఞములఁ జేయుచున్నారు.

అహంకారము బలము గర్వము కామము క్రోధము నాశ్ర యించినవారై తమదేహములందు నితరుల దేహములందుండు నా యెడ నసూయవహించి నన్ను ద్వేషించువారును గ్రూరులును నశుభకార్యములు చేయునట్టివారును నగునట్టి నరాధములను సంసారమందు నాసురయోనులందే యెల్లప్పుడు ద్రోసెదను. అర్జునా! యాసురజన్మమును బొంది జన్మ జన్మమున మఱింత మూఢులగుచు నగుచు నన్నుఁ బొందకయే వీరు క్రమక్రమమున నీచగతికిఁ బోవు చున్నారు.

కామము, క్రోధము, లోభము, ననుమూఁడును నట్టి నరకమునకుఁ బోవు మార్గములు. ఇవి యాత్మనాశకము లగుటవలనవానిని వదలిపెట్టుము. ౨౧

విపరీతజ్ఞానమునకుఁ గారణములైన కామ క్రోధ లోభములను వదలినవాఁడు తన యాత్మకు శ్రేయస్కరమైనదానిని జేయుచున్నాఁడు. దానివలనఁ బరమగతిని బొందుచున్నాఁడు. ౨౨

ఎవఁడు శాస్త్రవిధిని వదలి యిష్టమువచ్చినట్లు ప్రవర్తించునో వానికి ఫలసిద్ధిగాని యిహలోక సుఖముగాని పరమగతిగాని లేదు. కావున నిది కార్య మిది యకార్యమని నిర్ధారించుటయందు శాస్త్రము ప్రమాణము. అట్టి శాస్త్రమునందుఁ జెప్పబడిన కర్మమును దెలిసికొని యిచ్చటఁ గర్మము చేయుము.

షోడశాధ్యాయము, దైవాసురసంపద్విభాగయోగము సంపూర్ణము.

---

## సప్తదశాధ్యాయము.

## —♦ శ్రద్ధాత్రయ విభాగయోగము ♦—

అనిన నర్జునుం డిట్లనియె.

కృష్ణా! శ్రద్ధతోఁగూడిన వారయ్యు యాగములను శాస్త్రనియమము వదలి చేసెదేని వారి శ్రద్ధ సాత్త్వికమా? రాజసమా? తామసమా?

అనిన శ్రీకృష్ణమూర్తి యిట్లనియె.

సర్వప్రాణులకు వారు వారు చేసిన పూర్వకర్మముల వాసనను బట్టి శ్రద్ధ స్వభావముగఁ గలుగుచున్నది. అది సాత్త్వికశ్రద్ధ యనియు, రాజసశ్రద్ధ యనియుఁ, దామసశ్రద్ధ యనియు మూఁడువిధములు. వాని లక్షణము వినుము.

సమస్త జనులకు వారి వారి యంతఃకరణ మెట్టిగుణముతోఁ గూడి యున్నదో యా గుణవిషయమైన శ్రద్ధ గలుగుచున్నది. ఈ

పురుషుఁడు శ్రద్ధామయుఁడు. ఎవ్వఁడెట్టి శ్రద్ధగలవాఁడో యాశ్రద్ధకుఁ దగిన ఫలమునే పొందును.

సాత్త్వికులు దేవతలఁ బూజింతురు. రాజసులు యక్షరాక్షసుల బూజింతురు. తామసజనులు ప్రేతభూతగణములఁబూజింతురు. ఎవరు దంభాహంకారములతోను గామరాగములవలనఁ గలుగు బలముతోనుగూడి బుద్ధిలేనివారై శరీరమందున్న పృథివ్యాదిభూతసమూహమును, లోపలిశరీరమందుండు నా యంశమైన జీవుని నుపవాసాదులచేఁ గృశింపఁజేయుచు శాస్త్రోక్తము గానివిధముగ దారుణతపస్సును యోగాదులను జేయుచున్నారో వారసురులకుఁ గలనిశ్చయమును గలవారని తెలిసికొనుము.

సమస్తప్రాణులకు మూఁడువిధములగు నాహారము ప్రియము అట్లులే యజ్ఞము, తపస్సు, దానము, మూఁడు మూఁడు విధములు. వాని భేదములను వినుము.

ఆయుస్సును, అంతఃకరణమువలన గలుగు జ్ఞానమును, బలమును, నారోగ్యమును, సుఖమును, ప్రీతిని వృద్ధిపొందించునవియు మధురరసముగల ఫలాదులును, జమురుగలవియు, దేహమునందు రసరక్త మాంసాదిరూపముగఁ జాలఁగాలముండునవియు, గంటికింపైనవియును నగు నాహారములు సాత్త్వికులకుఁ బ్రియములు. ౮

కాఁకరకాయ మొదలగు చేదుపదార్థములును, చింతపండువంటి పుల్లని పదార్థములును, నుప్పనిదియు, మిక్కిలి వేఁడి చేయునదియు, దప్పిపుట్టించునవియుఁ, దాపము గలిగించునవియు నగు నాహారములు రాజసులకుఁ బ్రియములు, ఇవి కష్టమును, శోకమును రోగమును గలుగఁజేయును. ౯

చలిదియన్నము, రుచిచెడినది, దుర్గంధముగలది, పాసినది, యితరులు తినఁగా మిగిలినది, అమేధ్యము, (అపవిత్రపదార్థము) భగవంతునికి నివేదింపనిది యగు నాహారము తామసులకుఁ బ్రియము.

ఈ యజ్ఞము భగవదారాధనరూపమగుటచేఁ దప్పక చేయఁదగినది యని మనస్సున నిశ్చయించుకొని దానివలన ఫలముగోరక శాస్త్రమునఁ జెప్పఁబడినట్లు చేయఁబడునది సాత్త్వికయజ్ఞము. ౧౧

ఫలము గోరియు దంభార్థముగను జేయఁబడు యజ్ఞము రాజసయజ్ఞము. ౧౨

విధిరహితమై, మంత్రహీనమై, దక్షిణలేక, శ్రద్ధయులేక, యశాస్త్రవిధముగ సంపాదించిన వస్తువులతోఁ జేయు యజ్ఞము తామస యజ్ఞము. ౧౩

దేవతలను, బ్రాహ్మణులను, గురువులను, జ్ఞానులను బూజించుటయుఁ, బుణ్యతీర్థస్నానముచే దేహమును బరిశుద్ధముగ నుంచుకొనుటయు, మనోవాక్కాయము లొకరీతిగ నుంచుకొనుటయుఁ, బరస్త్రీలను గామముచేఁ జూడకుండుటయు, స్వస్త్రీలతోనైనను నిషిద్ధకాలముల నిషిద్ధరీతుల భోగింపకుండుటయు, నహింస, యివి శరీరసంబంధమైన తపస్సగును. ౧౪

సత్యము, ప్రియము, హితమునై యితరులకు మనస్సు నొవ్వకుండ మాటలాడుటయు, వేదాధ్యయనము వాగ్రూపమైన తపస్సగును. ౧౫

మనస్సు నిర్మలముగా నుంచుకొనుట. క్రూరబుద్ధిలేక యితరుల మేలు కోరుట. మితముగ భాషించుట, మనస్సును సద్విషయమున నిలుకడగ నుంచుకొనుట, యాత్మవిషయముకన్న వేఱువిషయమును జింతింపకుండుట యివి మానసికతపస్సనఁబడును. ౧౬

ఫలముల నాశింపక మిక్కిలి శ్రద్ధతోఁ దాను జేసెడి కార్యము భగవదారాధనమను తలంపుతోఁ జేసెడి తపస్సు సాత్త్వికతపస్సు.

పరులు తన్నాదరింపవలయునని, పొగడవలయునని, గౌరవింపవలయునని, దంభముతోఁ జేయఁబడెడి తపస్సు రాజసమగును. దీని వలనఁ గలుగు స్వర్గాదిఫలములు చంచలములై క్షయించును.

తెలివిలేని పట్టుదలచేత దేహకష్టముతో నితరుల నాశము చేయఁ జేయఁబడెడి తపస్సు తామసమనఁబడును. ౧౯

ఈదాన మీయఁదగినదని తలఁచి పుణ్యక్షేత్రమందుఁ బుణ్య కాలమందు నుపకారము చేయని చేయలేని సత్పాత్రునకిచ్చెడి దానము సాత్త్వికము. ౨౦

ఇదివఱకుఁ దనకుఁ జేసిన మేలునకై కాని యికముందు తనకు మేలు చేయవలయుననికాని ఫలము గోరికొని మనస్సునఁ గష్టపడుచు నిచ్చెడి దానము రాజసదానము. ౨౧

ప్రశస్తముకాని దేశకాలములందు నయోగ్యులకు సత్కార ముగ నవమానయుక్తముగ నిచ్చెడి దానము తామస దానము.

వేదకర్మునకు నిర్దేశించుశబ్దములు ఓం, తత్, సత్, అని మూఁడువిధములు. బ్రహ్మ క్షత్రియ వైశ్యులు వేదములు యజ్ఞము లామూఁటితోఁ బూర్వము నాచే నిర్మింపబడినవి. ఆ కారణము వలన వేదవాదులగు బ్రహ్మ క్షత్రియ వైశ్యులు తాముచేయు శాస్త్రోక్తములైన యజ్ఞదానతపః క్రియలను నెల్లప్పుడు తొలుత ఓం అని యుచ్చరించియె ప్రారంభించుచున్నారు. ౨౪

మోక్షము గోరువారు వేఱుఫలమును గోరక తత్ అని యుచ్చరించి యనేకవిధములైన యజ్ఞదానములు తపః క్రియలు చేయుచున్నారు. ౨౫

ఈ వస్తు విప్పుడు కలదను నర్థమునందును శ్రేష్ఠములను నర్థము నందును శుభకార్యములందును, సత్ శబ్దము ప్రయోగింపఁబడు చున్నది. ౨౬

అశ్రద్ధతోఁ జేయఁబడు హోమము దానము తపస్సులోనైన వన్నియు శాస్త్రీయములైనను నసత్తని చెప్పఁబడును. ఆ క్రియ లీ లోకమందుఁగాని పరలోకమందుఁగాని ఫలమునిచ్చునవి కావు. శ్రద్ధా యుక్తమైన యశాస్త్రీయకర్మముగాని శ్రద్ధలేని శాస్త్రీయకర్మము గాని ఫలవంతము కాఁజాలదు.

సప్తదశాధ్యాయము, శ్రద్ధాత్రయ విభాగయోగము సంపూర్ణము.

## అష్టాదశాధ్యాయము.

### —♦ మోక్ష సన్న్యాస యోగము. ♦—

అనిన నర్జునుం డిట్లనియె.

కృష్ణా! సన్న్యాసము త్యాగము నను నీ రెంటి యథార్థ స్వరూప మెట్టిదో వేఱు వేఱుగఁ దెలియఁ జెప్పుము.
అనిన శ్రీ కృష్ణమూర్తి యిట్లనియె.

అర్జునా! కొందఱు విద్వాంసులు ఫలములను గోరి చేయుకర్మములనే చేయక వదలిపెట్టుట సన్న్యాసమందురు. మఱి కొందఱు సమస్త కర్మములను జేయుచు వాని ఫలమును వదలి పెట్టుట త్యాగమందురు. ౨

కొందఱు రాగాదిదోషములతోఁ గూడి బంధమును గలిగించుటచేఁ గర్మములు విడువఁదగినవందురు. కొందఱు యజ్ఞదాన తపః కర్మములు విడువరానివని యందురు. 3

ఆ త్యాగవిషయమున నా *నిశ్చయము వినుము. త్యాగము ఫలత్యాగము, కర్మత్యాగము, కర్తృత్వత్యాగము, ననిమూఁడు విధములు. యజ్ఞము, దానము, తపమున నెడి కర్మములను విడువరాదు. వాని నవశ్యము చేయవలయును. ఏలందువా? యజ్ఞము దానము తపస్సు ననునవి యీవజ్జీవము భగవంతు నుపాసించు ముముక్షువులకు వారి యుపాసనమును గొనసాగకుండఁ జేయు ప్రాచీనకర్మముల నాశము చేయుటచే వారిని బవిత్రులఁ జేయును. ముందు చెప్పిన కర్మములు గూడ మమకారమును ఫలమును వదలి చేయఁదగినవని యుత్తమమైన నా నిశ్చితాభిప్రాయము. ౬

---

* త్యాగమనినను సన్న్యాసమనినను వదలిపెట్టుట యనియే యర్థము. ఈ వదలిపెట్టుట యెట్లు? కార్యములు చేయుటయే మానుకొనియా లేక కార్యములు చేసి ఫలము నా కక్కఱలేదని వదలుటయా? యను నది భగవంతుఁడు చర్చించుచున్నాఁడు.

నిత్యనైమిత్తికరూపమైన మహాయజ్ఞాదికర్మమును వదలిపెట్టుట యుక్తముకాదు. అజ్ఞానముచే నవి బంధకములని తలఁచి వానిని వదలిపెట్టుట తామసత్యాగము. ౭

దుఃఖము కలిగించునవియు, దేహము బడలిపోవునను భయము చేతను గర్మమును వదలిపెట్టుట రాజసత్యాగము. దీనివలనఁ ద్యాగ ఫలము రాదు. ౮

నిత్యనైమిత్తికరూపమైన కర్మములు స్వయంప్రయోజనములు గావునఁ జేయఁదగినవని మమతను ఫలమును వదలి వానిని జేసినయెడల నట్టి ఫలత్యాగము సాత్త్విక త్యాగము. ౯

సత్త్వగుణములతోఁగూడి తత్త్వజ్ఞానముగలవాఁడై, సంశయముల ఛేదించి, ఫలమును సంగమును వదలిన త్యాగి, యనిష్టఫలము గలకర్మములను ద్వేషింపఁడు. శుభకర్మములం దాసక్తుఁడుగాఁడు. కర్మములను నిశ్శేషముగ వదలుటకు దేహధారులకు సాధ్యపడదు. ఎవఁడు కర్మఫలములను వదలునో వాఁడే త్యాగియనఁబడును. కర్మమునకు ఫలములు మూఁడు. ఇష్టము, ననిష్ట, మిష్టానిష్టము, నని. ఇష్టమనునది స్వర్గాదిఫలము. అనిష్టము నరకాది. ఇష్టానిష్టము పుత్రులులోనైనది. ఈ మూఁడువిధముల ఫలములు కర్మము లాచరించిన తరువాత ఫలములను గోరువారికిఁ గలుగుచున్నవి కాని ఫలము కర్తృత్వమువదలిన వారికి మోక్షవిరోధులగు నా ఫలములుగలుగవు.

సర్వకర్మములు సిద్ధించుటకొఱకు సాంఖ్యసిద్ధాంతమున *నైదు కారణములు చెప్పబడినవి. అవి యేవన, శరీరము, జీవాత్మ, కర్మేంద్రియములతోడి మనస్సు, నానావిధములయిన పంచవాయు వ్యాపారములు నయిదవవాఁడు పరమాత్మ. మనుష్యుఁడు మనోవాక్కాయములచేఁ జేయు కర్మము న్యాయ్యమైనను నన్యాయ్యమైనను నట్టికర్మమునకు నీ యైదును గారణములు. వాస్తవ మిట్లుండ నాత్మమాత్రమే

*సంఖ్య=బుద్ధి, ఉన్న దున్నట్లు తత్త్వమును దెలిసికొను వైదిక బుద్ధి. సాంఖ్య శాస్త్రము=ఇట్టి బుద్ధిచే ననుసంధింపఁబడిన నిర్ణయము.

కర్తయని తలంచువాఁడు శాస్త్రముచే సంస్కరింపఁబడని బుద్ధిగల వాఁడు విపరీతబుద్ధిగలవాఁడు కావునఁ దెలిసినవాఁడుకాఁడు. ౧౬

ఈ కార్యము చేయువాఁడను "నేను" అను నహంకారము లేనివాఁడును, ఈ *కార్యము నేను జేయునందున దీనిఫలము నన్నంటదను కొనువాఁడును లోకములోని జనులనందఱను జంపినను వాఁడు చంపినవాఁడు కాఁడు. ఆకర్మఫలము వాఁడనుభవింపఁడు. ౧౭

కర్మస్వరూపజ్ఞానము, చేయఁదగిన కర్మము, ఆకర్మము నెఱుఁగు వాఁడు నని జ్యోతిష్టోమాదికర్మములు మూఁడువిధములు. అందుఁ గర్మము ద్రవ్యాదికమని, యాగాదికమని, కర్మములచేయునట్టి యనుష్ఠాతయని మూఁడువిధములు. ౧౮

గుణకార్యముల నెన్నుటయందు గుణభేదమును బట్టిజ్ఞానము, కర్మము, కర్త, మూఁడు మూఁడు విధములు. వానివిధము వినుము,

*కార్యములు చేయువాఁడును, దత్ఫల మనుభవించువాఁడును, భగవంతుఁడే యని నిశ్చితజ్ఞానము కలవాఁడు.

కర్తయు ఫలభోక్తయు భగవంతుఁడైనచో నీ కార్యము చేయవలదు. చేసిన పాపమువచ్చును, ఈ కార్యము చేయుము పుణ్యము వచ్చును అని శాస్త్రములేల చెప్పుచున్నవి? మనుష్యులకు సుఖదుఃఖములేల కలుగుచున్నవి? అని సంశయము. కరణకళేబరములకు శక్తి నిచ్చినవాఁడును దాని కాధారముగా నుండువాఁడును నీశ్వరుఁడే. ఇట్టి కొలిముట్లను (దేహమును) జీవునకిచ్చి దీనితో నీవు కర్మములు చేసి బాగుపడుమని నియమించెను. జీవాత్మకును శక్తి నిచ్చువాఁడును సాధారముగా నుండువాఁడును నీశ్వరుఁడే. ఇట్టి సాధనమును గైకొని జీవాత్మ కార్యమునుజేయ నారంభించును. ఆరంభించుటయందు జీవునకు స్వేచ్ఛగలదు. అవల నది కొనసాగుటకై కావలసినవన్నియు నీశ్వరుఁడే సంఘటించుచుండును. కావునఁ దొలుతఁ బుణ్యకర్మమో పాపకర్మమో ప్రారంభించువాఁడు జీవుఁడే. ఇది తెలిసి తెలిసి "యీశ్వరా! యజ్ఞానముచేఁ దొలుత నొక కార్యమును బ్రారంభించితిని. దానిని క్షమింపుము. ఇప్పుడు చేయునవి నీ ప్రేరణముచేఁ జేయుచున్నాఁడను. నీ చేతి యాయుధము నేను. కావున కర్తవు ఫలభోక్తవు నీవే యనువాఁడు తొలుతఁజేసిన పుణ్యపాపములను బ్రారబ్ధమున నల్పశిక్షతో వదలిపెట్టఁబడును. తక్కిన వానిబాధ యతని నంటనేయంటవు. ఈ విధముగ ముక్తికలుగును.

సర్వభూతములు జాతిరూపభేదములచే నానావిధములుగఁ గానవచ్చు చున్నవి. అయినను వీనియందంతటనుండి నిర్వికారమైనది, విభాగ రహితమైనది, యాత్మ యొక్కటియేయనియు, నెఱుఁగునట్టి జ్ఞానము సాత్త్వికమనఁబడును. ౨౦

సర్వభూతములు నానావిధములుగాఁ గానవచ్చుటచేత నందలి యాత్మ వస్తువులు నానావిధము లనుకొను జ్ఞానము రాజసము.

సమస్తఫలములనిచ్చు కార్యమునందువలె నల్పఫలము నిచ్చు దాని యందాసక్తిగలదియుఁ బూర్ణఫలమునీయఁజాలమిని సంగముగలి గియుండఁదగు కారణములేనిదియు, యథార్థముకాని విషయము కల దియు, నీచమైయుండునదియు నగు జ్ఞానము తామసజ్ఞానము. ౨౨

వర్ణాశ్రమములకుఁ దగినట్టిదియై, ఫలముగోరక, దానియందుఁ దాను గర్తయను సంగములేక, కీర్తియందుఁ బ్రీతి, యకీర్తియందు ద్వేషము, లేక చేయఁబడు కర్మము సాత్త్వికము. ౨౩

ఫలాపేక్ష కలిగి, యహంకారముతోడను, మిక్కిలి ప్రయా సముతోడను జేయఁబడు కర్మము రాజసము. ౨౪

కార్యము చేయుటచేఁ గలుగు దుఃఖము, ధననాశము, హింస, తన సామర్థ్యము, వీని నాలోచింపక యజ్ఞానముచేఁ జేయఁబడు కర్మము తామసము. ౨౫

ఫలాపేక్ష లేక యహంకారము లేక ధైర్య సముత్సాహము లతోఁ గూడియుండు మనస్సుతోఁ గర్మముచేసి యది సిద్ధించినఁ బొంగక, సిద్ధింపకుండిన దుఃఖింపక సమచిత్తుఁడై కర్మము చేయువాఁడు సాత్త్వికకర్త యనఁబడును. ౨౬

ఫలాసక్తిగలిగి, యశస్సుగోరి, లోభియై, వలసినంతధనము వెచ్చింపక, పరులను బీడించి, వారివలన ధనాదులఁగొని, కర్మము చేయువాఁడును, గర్మమునకు వలసినంత పరిశుద్ధిలేనివాఁడును, ఫలము వచ్చిన సంతోషించి ఫలము రాకున్న నేడ్చువాఁడును, నగుకర్త రాజసకర్త. ౨౭

అయోగ్యుఁడు, విద్యాహీనుఁడు, స్తబ్ధుఁడు, శఠుఁడు, వంచకుఁడు, సోమరి, యేడుపుగొట్టు, దీర్ఘకాలముగ నాలోచించుచు మెల్లగ నొకనాఁటిపని నెలకుఁ జేయువాఁడు నగుకర్త తామసకర్త.

బుద్ధి ధృతి యనునవి సత్త్వాదిగుణములను బట్టి మూఁడువిధములు. ఆ భేదములను వేఱు వేఱుగాఁ బూర్ణముగాఁ జెప్పెదను,

ప్రవృత్తియనెడి యిహలోకసాధనమైన కర్మమును, నివృత్తియనెడి మోక్షసాధనమైన ధర్మమును, ఇది కార్య మిది యకార్యమ్మనియు, దీనివలన భయముకలుగును, దీనివలన భయముకలుగదనియు, నిది బంధనమునకుఁ గారణము ఇది మోక్షమునకుఁ గారణమనియుఁ దెలిసికొనుబుద్ధి సాత్త్వికబుద్ధి. 30

ధర్మము, నధర్మము, కార్యము, నకార్యము, నున్నదున్నట్లు తెలిసికోఁజాలనిబుద్ధి రాజసబుద్ధి. 31

అజ్ఞానముచేఁ గప్పఁబడుటచేత నధర్మము ధర్మమని యిట్లన్ని విషయములు విపరీతముగఁ దలచుబుద్ధి తామసబుద్ధి. 32

వేఱు ఫలమును గోరక భగవంతు నుపాసించుచు దానికి సాధనములైన మనస్సు ప్రాణము నింద్రియములు వీని వ్యాపారములను దేనిచే నిలుకడగ నుంచుకొనుచున్నాఁడో యట్టి ధృతి సాత్త్వికధృతి. 33

ఫలమును గోరి, మిక్కిలి సంగముకలవాఁడై, ధర్మార్థకామముల సాధించు మనఃప్రాణేంద్రియ వ్యాపారములను భరించువాని ధృతి రాజసధృతి. 34

బుద్ధి లేనివాఁడై యేధృతిచే నిద్ర-మదము-భయము-శోకము-విషాదము విడువఁడో యట్టివాని ధృతి తామసధృతి. 35

సుఖము మూఁడువిధములు. వాని లక్షణములను వినుము.

చిరకాల మభ్యసించుటవలననే సుఖమునం దెక్కువ యానందముగలుగునో, దేనివలన సంసారబాధ తొలఁగునో, తొలుతవిషమువలె నుండినను గడపట నమృతమువలె నగునో యట్టిదై యాత్మస్వరూపవిషయమైన బుద్ధిప్రసన్నతచేఁ గలుగు సుఖము సాత్త్వికసుఖము.

ఏ సుఖము విషయేంద్రియముల కూడికవలనఁ దొలుత నమృతముగాఁదోఁచి తుదకు విషమగునో యట్టి సుఖము రాజసము.

ఏ సుఖము మొదటఁ దుదఁగూడ మోహహేతువగుచున్నదో నిద్ర-సోమరితనము - హెచ్చరికలేమి వీనివలన జనించినదో యట్టిది తామససుఖము. ౩౯

అర్జునా! సత్త్వరజస్తమోగుణములచేఁ విడువఁబడిన ప్రాణి మనుష్యలోకమందును లేదు. స్వర్గాదిలోకములందలి బ్రహ్మాదిదేవతలలోనైనను లేదు. ౪౦

బ్రహ్మక్షత్రియ వైశ్య శూద్రుల కర్మములు వారివారి జన్మములకుఁ గారణమైన ప్రాచీనకర్మమువలనఁ బుట్టిన సత్త్వాదిగుణములచేఁ విభజింపఁబడియున్నవి. ౪౧

శమము-దమము-తపము-శౌచము-క్షాంతి-యార్జవము-జ్ఞానము - విజ్ఞాన - మాస్తిక్యము - *నను నివి బ్రాహ్మణజాతికి స్వభావమువలనఁ గలిగిన కర్మములు. ౪౨

శౌర్యము, తేజస్సు, ధృతి, కార్యముల కొనసాగించు సామర్థ్యము, యుద్ధమునఁ బాఱిపోకుండుట, దానము, నెల్లవారిని నియమించు సామర్థ్యము నను నివి క్షత్రియులకు స్వభావమువలనఁ గలుగును.

సేద్యము-గోరక్షణము-వాణిజ్యము నననివి వైశ్యులకుస్వభావకర్మములు. సేవారూపకమైన కర్మము శూద్రులకు స్వభావకర్మము. ౪౪

* పురుషోత్తముఁడును, వాసుదేవుఁడును, పరబ్రహ్మమనిపిలువఁబడువాఁడునగు భగవంతుఁ డెట్టిదోషలేశమును లేనివాఁడు. సంపూర్ణజ్ఞానబలశక్త్యైద్యనేకకల్యాణగుణములు స్వభావముగఁ గలవాఁడు. సమస్తవేదాంతముచేఁ దెలియఁబడెడివాఁడు నతఁడే. అతఁడే జగమునకుఁ గారణము. ఆధారము నతఁడే. సమస్తమును బ్రవర్తింపఁ జేయువాఁడు నతఁడే. ఆయనలేక తృణాగ్రముగూడఁ జలింపదు. వేదోక్తములైన సమస్తకర్మములు నాయనయారాధనములే. ఆకర్మములచే నారాధింపఁదగినవాఁడాయనయే, అట్లారాధించినవారికి ధర్మార్థకామమోక్షములను ఫలములనిచ్చువాఁడు నాయనయే. ఇది సత్యమను నిశ్చయమే యాస్తిక్యము.

తన తన వర్ణాశ్రమమునకుఁ దగిన కర్మములం దాసక్తిగల పురుషుఁడు పరమపదమును బొందును స్వకర్మనిరతుల కాపరమపదప్రాప్తి కలుగు మార్గము వినుము.

ఎవనివలన భూతములన్నియుఁ బుట్టుచున్నవో వర్తించుచున్నవో సర్వమునం దెవఁడు వ్యాపించియున్నాఁడో యట్టి భగవంతుని దమ తమ వర్ణాశ్రమములకు నియమితమైన కర్మములచే నారాధించువారు మోక్షమును బొందుదురు. ౪౬

ఇతర వర్ణాశ్రమములవారికి నియమించిన ధర్మమును దాను జక్కఁగ నాచరించుటకంటె తనవర్ణమునకు నాశ్రమమునకు నియమితమైనధర్మము గుణము లేనిదైనను నాచరించుట శ్రేయస్కరమైనది. స్వభావముచే నియమితమైన కర్మమును జేయువాఁడు సంసారరూపపాపమును బొందఁడు.*

కాయకష్టము దుఃఖములోనగు దోషములతోఁ గూడి యున్నను సహజమైన కర్మము విడువరాదు. అగ్నిని ధూమము కప్పియున్నట్లు సకల కర్మములు దోషయుక్తములయినవే. ఒకదానిలో నొకవిధమైన కష్టముండిన మఱియొకదానిలో మఱియొకవిధమైన కష్టముండును. కావున సహజకర్మము సుకరము నిరపాయము. ౪౭

ఎవ్వఁడేకర్మము చేసిననేమి? ఫలమునం దాసక్తిలేక, మనస్సును నిగ్రహించి స్పృహలేనివాఁడై నేను గర్త ననునభిమానము

---

*తక్కువవర్ణమువారు తాము చేయుకర్మము దోషయుక్తమని తలఁచియెక్కువవర్ణమువారు చేయుకర్మమును జేయరాదు. అట్లు లేకర్మయోగము తక్కువ జ్ఞానయోగమెక్కువ యని తలఁచికర్మయోగమున కర్హులైనవారు దానినిమానరాదు. జ్ఞానయోగమునకు సకలేంద్రియ నియమనము సర్వకాలముల నత్యావశ్యకము. అదియునుగాక యది ప్రమాదయుక్తము కావున జ్ఞానయోగమున నేమికొంచెము పొరపడినను సంసారమునఁ గూలఁబలసి యుండును. కర్మయోగులకుఁ బ్రమాదమువలనఁ గలుగు నష్టిలేదు. కావున దానిని జక్కఁగ సాధించువాఁడు మోక్షార్హుఁడు నగును. ఉట్టికెక్కలేనమ్మ స్వర్గాని కేమి యెక్కునన్నట్లు స్వభావముచే లభించి చేయ సుకరమైనది చేయలేనివాఁ డెక్కువవారి నియమములు ప్రమాదగహితముగ నెట్లు సాధింపఁగలఁడు?

లోనైన వానిని వదలి యెవ్వఁడే కర్మము చేసినను జ్ఞానయోగము లనఁ గలుగు ధ్యానయోగనిష్ఠను బొందుచున్నాఁడు. ౪౯

ధ్యానయోగసిద్ధిని బొందినపిదప ధ్యానరూపమైన జ్ఞానమునకు ఫలమైన బ్రహ్మమును బొందు విధము చెప్పెదను వినుము.

పరిశుద్ధమైన బుద్ధితోఁగూడ, ధైర్యముచే మనస్సు నిగ్రహించి, శబ్దాదివిషయములను విడిచి, రాగద్వేషముల మాని, జనరహితమై ధ్యానమునకు విఘ్నము కలిగించునవి లేని పవిత్రస్థలములందుండి, మితముగ భుజించుచు, మనోవాక్కాయముల నియమించి యెల్లప్పుడు ధ్యానయోగపరుఁడై, వైరాగ్యము నాశ్రయించి యహంకారము బలము దర్పము కామక్రోధములు నభిమానము విడిచి, మమకారము లేనివాఁడై, శాంతుఁడై, యుండువాఁడు బ్రహ్మత్వమున కర్హుఁడు. ఇట్టివాఁడు పరిశుద్ధాత్మస్వరూపమును ననుభవించును. ౫౩

ఇట్లు శుద్ధాత్మస్వరూపము నొందినవాఁడు ప్రసన్నచిత్తుఁడై దేనికి శోకింపఁడు. దేనిని గోరఁడు సమస్త భూతములందు సముఁడై యుండును. ఇట్టివానికి నాయందుఁ బరభక్తి జనించును. ఇట్టి పరభక్తిచే నే నెవఁడను నెట్టివాఁడను అని నన్నెఱుఁగుచున్నాఁడు. నన్ను యథార్థముగాఁ దెలిసికొనిన యనంతరము నా పరభక్తివలన నన్నుఁ బొందుచున్నాఁడు. ౫౫

ఎల్లప్పుడు నన్నే యాధారముగఁ గొని సమస్తకర్మములను గూడఁ జేయువాఁడు నా యనుగ్రహమువలన శాశ్వతమై నాశరహితమైన పదమును బొందును. ౫౬

కాఁబట్టి మనస్సుచే సమస్త కర్మములు నాయందు విడిచి యా కర్మమువలనఁ బొందఁదగు ఫలము నేనే యని తలంచుచు నీ బుద్ధియోగమును నాశ్రయించి యెల్లప్పుడు నాయందు మనస్సు నిలిపినవాఁడవు కమ్ము.

నాయందు మనస్సు నిలిపిన నీవు నా యనుగ్రహమువలన సాంసారిక కష్టములన్నియుఁ దొలఁగిపోవును. ఇంత చెప్పినను నీ వహంకారముచే నా మాటలు వినకపోయితివా చెడెదవు. ౫౮

నా మేలు కీళ్లు నే నెఱుఁగనా? ఒకరు నాకుఁ జెప్పఁ బని యేమి యను నహంకారముతో నేను యుద్ధము చేయనని నిశ్చయించుకొంటివేని నీ నిశ్చయ మసత్యముకాఁగలదు. నీ క్షత్రియ స్వభావమే నిన్నా (యుద్ధ) కార్యమునందు నియోగించును. ౫౯

అర్జునా! నా పలుకు లాలకింపక యజ్ఞానముచే నీవు స్వభావసిద్ధమైన కర్మమును జేయ నిచ్చగింపవేని ప్రకృతికిఁ బరవశుఁడవై దానిని జేయఁగలవు. అదెట్లందువా? సర్వభూతముల హృదయములందు నీశ్వరుఁడున్నాఁడు. ఆయనయే దేహేంద్రియ రూపముగఁ బరిణమించిన ప్రకృతి యనెడి యంత్రమునకు సమస్త భూతములను గట్టి సత్త్వాదిగుణమయమైన తన మాయచేఁ ద్రిప్పుచున్నాఁడు. ౬౧

ఈ మాయ యెట్లు తొలఁగునందువా విను. ఎవనిమాయ నిన్ను మోహింపఁ జేయుచున్నదో యట్టి సర్వనియంత యయి హృదయస్థుఁడైన యీశ్వరునే శరణంబు వేఁడుము. ఆయన యనుగ్రహముచే నుత్తమశాంతియు శాశ్వతమైన పరమపదమును బొందఁగలవు. ౬౨

ఇట్లు రహస్యములలో నతిరహస్యమైన జ్ఞానము నీ కుపదేశించితిని. దీనిని సంపూర్ణముగ విమర్శించి నీ యిష్టమువచ్చినట్లు నడుచుకొనుము. రహస్యము లన్నిటిలో మిక్కిలి రహస్యమై యుత్తమమైన నా పలుకును మరల వినుము. నీవు నాకు మిక్కిలి ప్రియుఁడవగుటచేత నీకు హితమును జెప్పుచున్నాను. ౬౪

నాయందుఁ బ్రీతిగలవాఁడవై, నాయందేమనస్సునిలిపిన వాఁడవై, నన్నారాధింపుము. నాకు నమస్కరింపుము. ఇటు చేసితివేని నన్నుఁ బొందఁగలవు. నీవు నాకుఁ బ్రియుఁడవు కావున నిది సత్యమని ప్రతిజ్ఞచేసి చెప్పుచున్నాను. ౬౫

సమస్తధర్మములువిడిచి నన్నొక్కనినే శరణు పొందుము. ఇట్టి నిన్ను నేను సమస్తపాపములనుండి విడిపింతును. దుఃఖింపకుము.*౬౬

---

*దీనికిఁ జరమవాక్యమని ప్రసిద్ధి. సమస్త ధర్మములువిడిచి యనఁగా ధర్మములను వదలి యధర్మములను జేయుమనికాని కర్మముల నన్నిటిని వదలుమనిగాని యర్థము చెప్పరాదు. కర్మములన్నియు వదల సాధ్యపడదని యజ్ఞదానతపః కర్మములు చేయవలయునని ముందే భగవంతుఁడు చెప్పెను. కావున ధర్మములనఁగా మోక్షసాధన ధర్మములని భావము. అనఁగాఁ గర్మజ్ఞాన భక్తియోగములు. విడుచుట యనఁగాఁ గార్యములు చేయక విడుచుట కాదు. కార్యములు చేయుచు వాని ఫలములను నీశ్వరార్పణము చేయుచు నే నీకార్యము చేయుచున్నాఁడనను నభిమానమును వదలవలయును.

ఇట్లహంకర్తృత్వాభిమానత్యాగము, కర్మత్యాగము (ఈకర్మము తనది యను నభిమానము వదలుట) ఫలత్యాగము గావించి శాస్త్రీయ కర్మములన్నియు భగవత్కైంకర్యములను భావముతోఁ గావించుచు నన్నొక్కనినే (యితర దేవతలనెల్ల మాని) కర్తయనియు నారాధ్యుఁడనియు (ఆరాధింపఁదగినవాఁడు) ప్రాప్యుఁడనియు (పొందఁదగినవాఁడు) విశ్వసించి శరణు చొరుము. కర్త భగవంతుఁడేయని భావించుటచే నేను గర్తనను నభిమానము పోవును. కర్మమున కారాధ్యుఁడు భగవంతుఁడే యనుటచే స్వకీయతాభిమానము పోవును. ప్రాప్యుఁడు భగవంతుఁడొక్కఁడే యనుటచే స్వర్గాది ఫలత్యాగము కలుగును.

రెండవ యర్థము:—ఈ వాక్యము చెప్పుటకుముందు నాయందే ప్రీతికలిగి నాయందే మనస్సు నిలుపుమని భక్తియోగ ముపదేశింపఁగాఁ బూర్వజన్మకృత పాపములు భక్తియోగమునకు విరోధులై చేయనీయవే యేమి గతియని విషాదపడు నర్జునుఁజూచి భగవంతుఁడు చెప్పుచున్నాఁడు. భక్తియోగమునకు విరోధులైన పాపములను బోఁగొట్టుకొనుటకుఁగాను కృచ్ఛ్రము చాంద్రాయణము లోనగు ప్రాయశ్చిత్తములను గాని యితర పుణ్యకార్యములనుగాని చేయవలసిన పనిలేదు. "భగవంతుఁడా! నీవే నాకు దిక్కు, నన్నుఁ గాపాడవలసిన భారము నీది" యని దృఢ నిశ్చయముతోఁ బ్రార్థింపుము. నిన్ను రక్షించెదను. అనేకజన్మములఁ జేసిన పాపములా యనంతములు. అవియన్ని పోయినఁగాని పరభక్తి కుదురదు. అవియన్ని పోఁగొట్టుకొనుటకై ప్రాయశ్చిత్తము లనేకములు విధింపబడినవి. అవి యన్ని చేయఁబూనినచో నాయువు చాలదు. ఇఁక భక్తియోగ మెట్లు కుదురును? తైలధారావిచ్ఛిన్నముగాఁ (నూనెధారవలెఁ దెంపులేక) మనస్సు భగవంతునందే

దీనిని నీవు తపస్సు లేనివానికిని, భక్తి లేనివానికిని, శుశ్రూష చేయనివానికిని, నాయందు దసూయగల వానికిని నెప్పటికిని జెప్ప కుము. ౬౭

పరమరహస్యమైన యీ శాస్త్రమును నా భక్తుల కెవఁ డుప దేశించునో యతఁడు నాయందుఁ బరభక్తికలిగి నన్నే పొందును. సందేహములేదు. భూమియందును వానికంటె నా కెక్కువప్రియుఁ డొక్కఁడును లేఁడు. అంతకంటెఁ బ్రియతరుఁడు నాకుఁ గలుగను బోఁడు. ౬౯

ధర్మయుక్తమైన మన యిరువురసంవాద మైనఁ డధ్యయనము చేయునో యా పురుషుఁడు నన్నుసంధానముచేయుటయను విశేషరూపము గల జ్ఞానయజ్ఞముచే నన్నారాధించినవాఁడగును. అని నా నిశ్చయము. ౭౦

ఎవఁడు శ్రద్ధావంతుఁడై యసూయలేనివాఁడై దీనిని వినునో వాఁడును బుణ్యకర్మములుచేయు నాభక్తుల లోకమును బొందును. అర్జునా ! నే నుపదేశించిన శాస్త్రము నీవు నిశ్చలమైన మనస్సుతో వింటివికదా. నీ యజ్ఞానమోహము పోయినదికదా. ౭౨

అనిన నర్జునుఁ డిట్లనియె.

నీ యనుగ్రహమువలన నాయజ్ఞానము నశించెను. జ్ఞానము గలవాఁడనైతిని. సందేహము తీఱెను. నీవు చెప్పినట్లు వర్తించెదను. అని చెప్పి యుద్ధమున కుపక్రమించెను.

యుద్ధము ప్రారంభమగుటకుఁ బూర్వము ధర్మరాజు సోదర కృష్ణసహితుఁడై కౌరవసేనలోనికిఁబోయి భీష్మద్రోణ కృపశల్యులచే ననుజ్ఞయు దీవనయుఁబడసి మరలివచ్చెను. కౌరవులపక్షమున భీష్ముఁడు

---

యెట్లు వర్తించును ? కావున దేహకష్టము ధననష్టముతోఁ గూడిన ధర్మకార్యములు చేయవలయునను తలంపువిడిచి భగవంతుఁడొక్కఁడే దిక్కని సర్వదా దృఢనిశ్చయము కలవాఁడై యీశ్వరార్పణ బుద్ధి కర్మములు చేయువాఁడు తప్పక కడతేఱును. ఇది పర్యవసానపుమాట.

సేనానాయకుఁడుగానుండి పదిదినములు యుద్ధముచేసి శరతల్పగతుఁ డయ్యెను. ఆవల ద్రోణుఁడైదుదినములు, కర్ణుఁడు రెండుదినములు, శల్యుఁ డొకమధ్యాహ్నము రణమొనరించి హతులైరి. ఆసాయంకాల మంద దుర్యోధనుఁడు భీమునితో గదాయుద్ధమొనరించి తొడలు విఱిగి కూలెె. ఆరాత్రి యశ్వత్థామ నిద్రపోవుచున్న ధృష్టద్యుమ్నాది యోధులనెల్ల గొంతులుకోసి చంపెను. ఈవిధముగఁ బదునెనిమిది దినములలోఁ బదునెనిమిది యక్షౌహిణులసేన పదునెనమండ్రుగురు ముఖ్యయోధులచే హతమయ్యె. దుర్యోధను పక్షమువారిలో కృపాశ్వత్థామలు చిరజీవులుగావున బ్రతికిరి. కృతవర్మ యాదవుఁడు కృష్ణు బంధువునగుట జీవింపఁగలిగె. ఇట్లు ముగ్గురు బ్రదికిరి. పాండవపక్షమునఁ బంచపాండవులు సాత్యకి బ్రదికిరి. శరణాగతి నొందిన భక్తురాలగు ద్రౌపది నిమిత్తమై కృష్ణమూర్తి తమకట్టి యాపదరానీయక రక్షించుటఁ బాండవులు జీవింపఁగలిగిరి.

రుక్మిణి—శ్రీకృష్ణుఁడు సారథిగాఁగదా యుండెను. ఆయన చేయఁగల సాహాయ్యము చక్కఁగఁ దేరుదోలుటకదా. అంతకెక్కువ యేమి చేయఁగలిగెను ?

తండ్రి—కృష్ణసాహాయ్యము లేకుండినఁ బాండవులు మొదటినాఁడే హతులైయుందురు. శ్రీకృష్ణుఁ డెట్టెట్టివేళల నెట్టెట్టిసాహాయ్యమొనర్చెనో చెప్పెద వినుము. భక్తురాండ్రగు గోపికల బృందావనంబున రక్షించెను. భక్తురాలగు ద్రౌపదికై యామె సంబంధులగు పాండవుల భారతరణమున రక్షించెను.

భీష్ముఁడు మూఁడవనాటి యుద్ధమున దుర్యోధన ప్రేరితుండై తన బలపరాక్రమంబులు చూపఁగోరి పాండవసేనపైఁ గవిసి విజృంభించి విచ్చలవిడి పెచ్చుపెరిఁగి యోధులు ఱిచ్చవడి చూచుచుండ నెందుఁజూచినఁ దానయై పగతురసేనను జీకాకుపఱిచి నేలకుఁ గోలకుఁదెచ్చినఁ బాండవసేనావీరులు పలాయమాన పటిష్ఠులైరి. అర్జునుండు భీష్మునెదిరించి కొంత రణంబుఁ జేసెఁగాని యాయన చిత్త

జల్లువలెఁ బెల్లుగఁగురియించు శరపరంపరల నివారింపలేక బెండువడి గండడఁగిపోయె. అప్పుడు శ్రీకృష్ణుం డోహో మోసమువచ్చునట్లున్నది. శాంతనవు నెదిరింపఁజాలు పరాక్రమవంతుఁ డీ కౌంతేయ సేనాసంతానంబున నొకండును గానరాఁడు. భీష్ముఁడిట్లు నేఁడంతయు సంగరంబొనరించెనా సూర్యునితోడఁ బాండవసేనయు నస్తమించు. కావున గాంగేయువిజృంభణ మణఁపవలయునని యాగ్రహోదగ్రుఁడై కన్నుల నిప్పులురాలఁ జేతనున్న పగ్గంబు లావలఁబడవైచి చక్రాయుధముఁ గేలఁగొని యేనుఁగుమీఁదికి లంఘించు సింగమువలె భీష్ము మీఁదికి లంఘించెను. అప్పుడు భీష్ముండును జడియక శరచాపములు గేలనుండ రథంబునందయుండి యిట్లనియె.

దేవదేవ ! జగన్నివాసా ! రారమ్ము. మాధవా ! చక్రపాణీ నీకు నమస్కారము. సర్వశరణ్యా ! లోకనాథా ! రణరంగమున నన్ను నరదంబునుండి క్రిందఁబడద్రోయుము. కృష్ణా ! నీచేత నేను నిహతుఁడనైతినా యుభయలోకముల శ్రేయస్సుగాంతును. నాకు ముల్లోకములవారిచే గౌరవముగలిగించిన వాఁడవగుదువు. అనినఁ గృష్ణుండిట్లనియె.

ఈ ప్రజాక్షయమునకెల్ల మూలకారణము నీవు. నీదుర్యోధనుఁడు నేగతిఁబట్టునో చూడుము. ధర్మవర్తి సజ్జనుఁడగు మంత్రి దుష్టద్యూతాసక్తుఁడైన రాజును బలాత్కారముగనైన వారింపవలయు నొండె, నటుగాక యా నీచుఁడు రాజధర్మవ్యతిక్రమంబొనర్చె నేని వానివిధి వానిని వినాశమార్గమున నీడ్చుచున్నదని వానిని బరిత్యజింపవలయు నొండె. నీవేదియుఁ జేయవైతివని భీష్ముం డిట్లనియె.

విధి బలిష్ఠము. అది సర్వశక్తిమంతము. యాదవులు కంసుని త్యజించి సుఖించిరి. అట్లే నేను ధృతరాష్ట్రునకు బోధించితినిగాని యతఁడు నామాట పెడచెవిఁబెట్టెను. ఆసన్నవినాశకాలుఁడగు వాఁడు విధివశంబున హితభాషణంబుల నాలకింపఁడు. అను నింతలోన నర్జునుండు తేరుడిగ్గనుఱికి పాదచారియై కృష్ణువెంటఁ బరువిడి మింట నేగు నాయన రెండుపాదంబులం బట్టుకొని నేనుగాని కృష్ణుఁడు

కోపావేశంబున నిలువక మహావాయువు వృక్షమును గొనిపోవునటు లతనినిగూడ నీడ్చుకొనిపోయెను. ఇట్లుపోవు కృష్ణునెట్టకేలకు నర్జునుఁ డీడిగలఁబడి బలవంతముగఁ బదియవయడుగున నిలువఁజెట్టి పాదములపై పడి యిట్లనియె.

పురుషసింహమా! కోప ముపసంహరింపుము. పాండవులకు నీవే దిక్కు. నేను గావించిన బాస తప్పనని పుత్రులపై సోదరులపైఁ బ్రమాణము చేసెదను. నీ యాజ్ఞచొప్పునఁ గౌరవుల నెల్ల నేనే ధ్వంసము గావించెదను. అనిన నతని ప్రతిజ్ఞయు సమయము నాలోచించి రక్షి జనార్దనుండు ప్రీతుండై సుదర్శనంబుతోడ మరల రథ మధిరోహించి పగ్గంబులఁ గేలఁగొని యరదంబు గడపె. ఆవల నర్జునుండు దుర్జయుండై రోషంబున నైంద్రాస్త్రంబుఁ బ్రయోగించి శత్రుసేనల నుఱుమాడి పరిభవించె.

అమ్మణ్ణి—కక్కా! కృష్ణుండు తానాయుధమునుబట్టి యుద్ధ మొనర్ప నని ప్రతిజ్ఞచేసెఁ గదా. ఇప్పుడెట్లు ప్రతిజ్ఞాహానిఁ గావించెను.

తండ్రి— నీవు చెప్పినట్లు కృష్ణుఁడు ప్రతిజ్ఞగావించుట సత్యము. ఇప్పుడు కృష్ణుఁ డాయుధమును బట్టెనేకాని యుద్ధము చేయలేదు. తా నావిధముగ నటించినఁగాని యర్జునుఁడు రోషావేశంబున యథాశక్తి యుద్ధము చేయఁడు. భీష్ముఁడు తమయం దభిమానము ప్రీతిగలవాఁడనియు, వృద్ధుఁడనియుఁ, బితామహుఁడనియుఁ దమ్మెత్తి పెంచినవాఁడనియు నర్జునునకు నాయనయందు భక్తి గౌరవములు మెండు. కావున నాయనతో నెదురెదురై యథాశక్తి పోరక జంకుచుఁ గేడించి పోవుచుండెను. ఈ విషయము కృష్ణుఁడేకాక ధర్మరాజును గనిపెట్టి యర్జునుఁడు శక్తికొలఁది నిర్వంచనముగఁ బోరాడక ప్రజలను భీష్మునకుఁ బలియిచ్చుచున్నాఁ డని మొఱపెట్టెను. కావున నీ నటన మర్జును జడిపమూన్చి యతనిఁ బ్రేరింపనేకాని వాస్తవముగ భీష్ము వధింపఁగాదు.

అంతియకాక. నేనే కౌరవుల నెల్ల జయించెదనని యర్జునుఁడు సమయముగావించెను. ఇప్పుడు ప్రాణసంకటసమయమునఁ దన ప్రతిజ్ఞ

కాపాడుకొనవలయునా? భక్తుల రక్షింపవలయునా? భగవంతుఁడాశ్రిత పక్షపాతి. తన ప్రతిజ్ఞనైన విడుచునుగాని తన భక్తునికిఁ బ్రతిజ్ఞాభంగము దానివలన నతనికి మానప్రాణహాని గలిగింపఁడు. ఈ విషయమున మఱియొకటియుఁ గలదు.

కృష్ణుఁడు తా నాయుధము బట్టనని ప్రతిజ్ఞ చేయుటవిని భీష్ముఁడాయన నాయుధము పట్టునట్లు చేసెదనని ప్రతిజ్ఞ గావించె. భీష్ముఁడును దనకు భక్తుఁడే కావున నాశ్రితరక్షా పరాయణుండగు నారాయణుం డాయన ప్రతిజ్ఞదీర్ప నాయుధము కేల నందెను. భగవంతుఁడు భక్తపరాధీనుఁడు సమయభంగమున నాయన కేనష్టియు లేదుగాని యొక కార్యముచే నెన్ని కార్యములు సాధించెనో యాలోచింపుము.

రుక్మిణి.—అప్పా! భీష్మున కిప్పటికెంత వయస్సు. ముసలివాఁడు కదా. ప్రాయపువారినందఱ నోడించుశక్తి యెట్లు కలిగెను ?

తండ్రి:—వయస్సుల విచారము మఱియొకపరి చేసెదను. ఇప్పుడు భీష్ముఁడు నూట యిరువది యేండ్లకుఁ బైబడినవాఁడే. ఆయన యస్ఖలిత బ్రహ్మచారి. రామాయణమున హనుమంతుఁడెట్లో భారతమున భీష్ముఁడట్లు అస్ఖలిత బ్రహ్మచారి యోగి. కావుననే వారికి సము లెవ్వరు లేరు. వీర్యనష్టమువలనఁ గలుగు కీడు బ్రహ్మచర్యమువలనఁ గలుగు మేలు మీఁకుఁ బతిహితచర్యాది గ్రంథము లందుఁ జెప్పితినిగదా. అస్ఖలిత బ్రహ్మచారి మృత్యువుతల దన్నఁ గలఁడు. ఇఁకఁ దక్కినవారేమి లెక్క? తర్వాత వినుము. తొమ్మిదవనాఁటి యుద్ధమునందును దుర్యోధన ప్రేరితుఁడై భీష్ముఁడట్లే విజృంభించెను. ఆ దినమందును నర్జునుఁడు మెత్తఁబడుట చూచి శ్రీకృష్ణుఁడు సేలగోలఁ జేతఁ దీసికొని భీష్ముని మీఁదికిఁ బోయెను. అర్జునుఁడు ప్రార్థింప మరలి రథముమీఁదికి వచ్చెను.

శిఖండిని ముందుంచుకొని యర్జునుఁడు శరవర్షముచే భీష్ముని నంపశయ్యపైఁ ద్రోచెను. ఆవల దుర్యోధనుఁడు సేనాధిపత్యమునకు ద్రోణుని నభిషేకించెను.

ద్రోణుని రెండవనాఁటి యుద్ధమున నర్జునునకును నరకాసురుని కుమారుఁడు భగదత్తునకును ఘోరయుద్ధము జరిగెను. అందు భగదత్తుఁ డర్జునుఁ జంపనెంచి యతనిపై వైష్ణవాస్త్రముఁ బ్రయోగించెను. అది యర్జునునకుఁ దగులకుండునట్లు శ్రీకృష్ణుండు తన దేహముఁ బెంచి యర్జునుఁడు మఱుఁగుపడఁ జేసెను. ఆ నిమిత్తమున నా యస్త్రము శ్రీకృష్ణు వక్షస్థలమునందగిలి యందు వైజయంతీమాలికయై వెలిఁగెను. అదిగని యర్జునుండు కటకటపడి యిట్లనియె.

కృష్ణా ! రథచోదకవృత్తిగాని యుద్ధకర్మము నొనర్పననికదా నీవు నాకు బాసచేసితివి. ఏల నీ ప్రతిజ్ఞ నీవు రక్షించుకొనవు. నేను వ్యసనంబున మునిఁగియుండినను, దానిని వారింప నశక్తుఁడనైనను నీవిట్లు చేయుట తగునుగాని నేనిట్లు సమరోద్యమముననుండ నీకిట్టి చేఁత న్యాయ్యమా ? నేను బాణ బాణాసనపాణినై సురాసుర నరలోకమునంతయు గెలువఁగలనని నీ వెఱుంగుదువుకదా. అని విషాదపడు కిరీటిఁగని శ్రీకృష్ణుం డిట్లనియె.

అర్జునా ! నీకుఁ బరతరరహస్యమొండు వాకొనెద వినుము. లోకహితార్థంబు పొంత నేను నాలుగు భాగములుగా విభజించుకొని నాలుగుమూర్తులు ధరించి సదా జగమును బాలించుచుందును. ఒకమూర్తి భూమియందు బదరికాశ్రమంబున సదా తపస్సు గావించుచుండును. రెండవమూర్తి లోకమునందలి మంచి చెడ్డ నడవడులు చూచుచుండును. మూఁడవమూర్తి యవతారరూపంబున మనుష్యలోకము నాశ్రయించి కర్మములు గావించుచుండును. నాలుగవమూర్తి సహస్రవర్షంబుల జలంబుల నిద్రించును. సహస్రవర్షానంతర మామూర్తి లేచి వరములకు యోగ్యులగువారికి వారు కోరిన వరము లొసంగును. ఒకసారి యట్టికాలము వచ్చుటెఱింగి భూదేవి నా కుమారుఁడు నరకుఁడు దేవదానవుల కవధ్యుఁడగుఁ గాక. వానికి నీ వైష్ణవాస్త్రము నిమ్ము అని భూమి యమోఘాస్త్రముఁ గోరిన నట్లకానిమ్మని యా యస్త్రప్రభావము చెప్పియిచ్చితిని. దానివలనవాఁడు ముల్లోకముల జయించి ప్రబలుండయ్యె. ఆ నరకుఁ డా యస్త్రమును

దన సుతుఁడగు భగదత్తున కొసంగె. లోకమున నెవ్వఁడేని నింద్ర రుద్రులైనను నా యస్త్రమునఁ జావక పోఁజాలరు. దానిని నేనుదప్ప మఱియెవ్వరు సహింపఁజాలరు. కావున నాశ్రితుండవైన నిన్ను రక్షించుకొఱకు నా ప్రతిజ్ఞనైనవదలి యిట్లు గావించితి. విషాదపడకుము. అస్త్రనష్టికై వెలవెలఁబోవు పగతు వధింపుము. అనిన నర్జునుం డట్లగావించె.

తనకు సేనాధిపత్యమొసంగెనని ద్రోణుఁడు సంతసించి దుర్యోధనుని నీ కేమివరము కావలయునని యడిగెను. అతఁడు ధర్మరాజును బ్రాణముతోఁ బట్టి తెమ్మని కోరెను. ధర్మ రాజుతో సంధి చేసికొన గోరి యాయనను బట్టి తెర దుర్యోధనుఁడు కోరెనని యూహించి బాఁపఁడు తలచి యట్టులే యని సమ్మతించి వరమిచ్చి నీ యభిప్రాయ మేమని యతని నడిగెను. వాఁడును నీవు ధర్మరాజును బట్టి తెచ్చితివేని మరల జూదమున నోడించి యడవుల కంపెదనని చెప్పెను. ఆ మాటలు విని యాతని దుర్నీతికిఁ దన మతిమాలుటకుఁ గుత్సించి యిట్లనియె. నీ కోరిక నెఱవేర్ప బాసచేసితిని. అవశ్యము చేసెదను గాని యర్జునుఁడు సేనలోలేకుండఁ జేయుము. అర్జునుఁడు సేనలో నిలిచి ధర్మజునకు రక్షకుఁడై యుండెనేని యాయనను బట్టుట యసాధ్యము, అని నెపముపెట్టెను.

మూఁడవనాఁటి యుద్ధమున సంశప్తకులను వారర్జునుని బ్రత్యేక రణమునకై పిలువఁగా ధర్మరాజునకుఁ దగినవారిని రక్షకులుగా నుంచి సేనాసముదయము విడిచి సంశప్తకులతోఁ బోర నర్జునుండు దూరమేగెను. ఆ నాఁడు ద్రోణుఁడు పద్మవ్యూహము పన్నెను. దానిలోఁ జొచ్చి మరలి వచ్చుమార్గ మర్జునుఁడుతప్ప మఱి యెవ్వరెఱుఁగరు. అభిమన్యుఁడు లోనికిఁబోవ నెఱుగునుగాని వెలికి రానెఱుఁగఁడు. ధర్మరాజున కీరహస్యము తెలియదు కావున నర్జునుఁ డెఱింగినవన్నియు నభిమన్యుఁ డెఱుఁగునను తలంపుతో ధర్మరాజభిమన్యుని బద్మవ్యూహము భేదింపఁ బురికొల్పెను. వీరుఁడైన యా బాలుఁడును దానిని భేదించి లోపలఁజొరఁబడెను. అతని వెంట భీమ నకుల సహ

దేవాదులును బోవ నెన్నివిధములనో యత్నించిరి గాని వారికి సైంధవుఁ డడ్డపడి శంకరదత్త వరబలంబున నందఱ కజయ్యుఁడై వారించె. వ్యూహములోపల నభిమన్యుఁ డొక్కఁడమాత్రము చిక్కుకొనిరు. అతఁ డొంటివాఁడు బాలుఁడునయ్యు ద్రోణ కర్ణ శకుని దుర్యోధన దుశ్శాసనాది వీరుల నెల్ల నోడించి యనేకులం జంపి మహాయుద్ధంబు గావించె, అతని కట్టెదుట నిలువఁబడు దిట్ట యొకఁడే నియు దుర్యోధను సైన్యంబున లేఁడయ్యె. అంత గర్ణాదులు మోసగించివెనువైపునుండి యందఱొక్కసారి మీఁదఁబడి విల్లుదునిమివిరథుఁ గావించి నిరాయుధుఁజేసిరి. అంతను నతఁడు జడియక గదాహతులఁబోరి యనేకుల వధింప ననేకు లొక్కటై యతనిఁజంపిరి. ఇది యన్యాయ యుద్ధమని భూతము లాక్రోశించె.

సంశప్తకుల నెల్ల జయించి యర్జునుండు శిబిరమున కరుదెంచి యభిమన్యు మరణవార్తవిని దుఃఖించి సైంధవునిపై నాగ్రహించి రేపు సూర్యుం డస్తమించులోపల సైంధవుతల ద్రుల్లనేయనేని గాండీవముతోడ నగ్నిప్రవేశము గావింతునని శపథము వచించె. ఇది చాల దుష్కరము. ద్రోణ ద్రౌణి కర్ణ కృప శల్య కృతవర్మ దుర్యోధనాది మహావీరరక్షితుం డగువానిని సాయంసమయములోపల సమయించుట యసాధ్యకార్యము. అంతియకాక, సైంధవుని తల నెవ్వఁడు క్రిందఁబడఁజేయునో వానితల శతధాభిన్నంబగునని యతనితండ్రి శపించియున్నవాఁడు. కావున సైంధవుని జంపినను గండమే. చంపకుండినను గండమే. ఈ రహస్యము కృష్ణుఁ డెఱుఁగునుగాని పార్థుఁ డెఱుఁగఁడు. కావున భక్తరక్షాదీక్షవహించిన పుండరీకాక్షుఁ డారాత్రి కలలో నర్జునుని గైలాసమునకుఁ బిలుచుకొనిపోయి పూర్వ మాయనకు శంకరుఁడిచ్చిన పాశుపతాస్త్రమును బ్రయోగించువిధానము చక్కఁగ బోధపడునట్లు మరల నేర్చుకొనఁజేసెను.

మఱునాఁడు ద్రోణుఁడు వ్యూహములలో వ్యూహములను జాలనిడివిగాఁ బన్ని యందు దుట్టతుద సైంధవుని నిలిపి వానికిఁదగిన రక్షకులుగఁ గర్ణాదుల నియమించి తాను వ్యూహముఖమున నిలిచె.

అర్జునుఁ డొక్కఁడే యీ వ్యూహపరంపరలనెల్ల భేదించుకొనిపోయి పోయి సైంధవుఁ జేరెనుగాని యతనిఁ జంపుటకు మహావీరవరరక్షితుండైన యతఁడు దృగ్గోచరుఁడుగామి వృథాపోరుచుండెను. ప్రొద్దు పోవుచుండెను. సూర్యుఁడా క్రుంకుసమయమయ్యెను. తన ప్రతిజ్ఞ వ్యర్థమగునని యర్జునుఁడు విషాదపడఁజొచ్చెను. ఇఁక యుద్ధము చేయుచుండిన నర్జునుకార్యము నెఱవేఱదని యెఱింగి ముందుగ నర్జునుఁడు సమ్మతింప ముకుందుండు తన యోగమాయనుబంప నది సూర్యబింబమును మఱుఁగుపఱిచెను. దానంజేసికురువీరులందఱు సూర్యుఁడ స్తమించె. సైంధవుండు హతుండు కాఁడయ్యె. సత్యప్రతిజ్ఞుఁడైన సవ్యసాచి యగ్నిప్రవేశంబుచేయక తప్పదని సంతోషంబున నొకరినొకరు మెచ్చుకొనుచు బాహువులప్పళించుచు సల్లాపించుచుఁ దలలెత్తి యాకాశమువంకఁ జూచుచుండిరి. అప్పుడు సైంధవుండును రథంబుమీఁదనుండి యత్తెత్తి రవివంకఁ జూచుచుండె. అప్పుడు కృష్ణుఁ డతని నర్జునునికిం జూపి యిట్లనియె. వాఁడె దురాత్ముండగు సైంధవుండు తలయెత్తి నిక్కినిక్కి పడమర చూచుచున్నవాఁడు. వాఁడిబాణంబున వానిమస్తకంబు ద్రెక్కొన నఱకుమనిన నర్జునుండు తన పరాక్రమంబు సవ్యాజంబయ్యెనని విషాదపడుచు నొక్క శాత శరంబున నతనిశిరంబు నఱకె. అప్పుడా కృష్ణుఁడు నర్జునా! యర్జునా! యాశిరంబు ధరణిఁ గూలఁగరాదు. మింటన నిలుపుమనిన నతఁ డట్లుచేయుచుండె. మాయాతిమిరము తొలఁగినంతన లోకబాంధవుండు కురువీరలోకశత్రుండై మరలఁగానవచ్చె. కురువీరులందఱు చేతులు విదుల్చువారును, బెదవులు గొఱుకువారును, నిట్టూర్చువారును, గన్నులెఱ్ఱచేయువారునై కిరీటితో మరల రణంబునకుఁ దలపడిరి. అర్జునుఁడు వారితో రణమొనర్చుచునే సైంధవుశిరంబు నేలఁబడకుండఁ గాచుచుండి, కృష్ణా యీతల నెంతసేపని యాకాశంబున నుండ రక్షింతును. ఇక్లేల చేయవలసె ననిన సర్వజ్ఞుఁ డిట్లనియె.

ఫల్గునా! యతని జనకుండు వృద్ధక్షత్త్రుండు, తపస్సంపన్నుండు. అతఁడు తన కుమారుఁడైన యీజయద్రథుని బాల్యంబునఁ దొడలపై

నిడికొని లాలించుచుండ నాకాశవాణి యిట్లనియె. "ఓయి రాజా! నీ యీకుమారుండు సంగరంబున నేమఱిపాటునఁ దల దునుమంబడి మరణించు." ఆ పలుకులువిని యతం డులికిపడి బంధుప్రులనెల్లరావించి యాకాశవాణివచనంబులు వినిచి యెవ్వఁ డీతనిశిరంబు ధరణింబడఁజేయు వానిశిరంబు నూఱువ్రక్కలగుఁగాక యనియె. ఇప్పుడా వృద్ధక్షత్రుండు జీవించి కురుక్షేత్రంబున కావలఁ దపస్సుచేయుచున్నవాఁడు. కావున నీ వీ జయద్రథు తలను బాశుపతాస్త్రంబున నాసీనుఁడైన వృద్ధక్షత్రు తొడపై బడ వేయుము. ఇట్టి కార్యం బాయస్త్రంబునఁగాక మఱియొకట నసాధ్యంబు.

అనిన నర్జునుండు పాశుపతాస్త్రంబు దానిపైఁ బ్రయోగించె. ఆ మహాస్త్రంబు మణికుండలభాసితంబైన యాశిరంబుఁగొనిపోయి ధ్యానపరవశుఁడైన వృద్ధక్షత్రు తొడపైవైచి చనియె. అతఁడు నులికిపడి యది తన పుత్రుశిరంబని యరయక తటాలునఁ గ్రిందఁద్రోచి శకలీకృత శిరస్కుఁడై మరణించె.

ఆ నాఁడు సాయంకాలమగుటఁ బ్రతిదినంబునందువలెఁ దమ శిబిరంబులకుంబోక దుర్యోధనాదులు సైంధవ వధజనిత రోషావేశంబున నారాత్రియు యుద్ధంబుఁ గావించిరి ఆరాత్రి రణంబున భీముని కుమారుండగు ఘటోత్కచుండు తన మాయాబలంబున విజృంభించి కౌరవ సేననంతయుఁ జీకాకుగావించి పాండవసేనఁ గాచించు కర్ణు వధింపఁ గృష్ణు పనుపున నతనిఁదాఁకె. వారిరువురకు నఘోరయుద్ధం బయ్యె. ఘటోత్కచుండు దుర్నివారుండై రేఁగి కర్ణుని తేరిగుఱ్ఱములను సారథిని జంపి తేరు తుత్తుమురుగావించినఁ గర్ణుఁడు విరథుండై ధైర్యంబు విడనాడక పోరుచుండె. అంతఁగనిసి హిడింబానందనుండు కర్ణు వధింపనమకట్టి భయంకర గదాదండంబుఁ గేలఁ గొని మింటికెగసి పార్వతంబుపైఁ బ్రాఁలుడేగవలె ఱివ్వున నతనిపై రెండవదండధరుండోయనఁ బఱతెంచె. అప్పుడు కర్ణుండు చావు తప్పించుకొన వేఱు మార్గంబులేక తన కవచకుండలంబులు హరించు సమయంబున నింద్రుండిచ్చిన యమోఘశక్తి నతనిపైవైచె. అదిఘటో

త్కచు వధించి చనియె. మహాబలపరాక్రమ సంపన్నుఁడైన యా మహాబలపౌత్రుఁ దెగుటగని పాండవ సేనయంతయు విహ్వలపాటొందె. పాండవులందఱు వెలవెలనయి దుఃఖింపసాగిరి. అర్జునుండు నిర్విణ్ణుండై నిశ్చేష్టుండై తేరిమీఁదఁ జతికిలఁబడియుండె. కృష్ణుఁడు మాత్రము పగ్గంబులు నొగలముడిచి నవ్వుచు సంతోషంబున రథంబుపైఁ దాండవమాడుచు నర్జును వీఁపు చఱచుచు నత్యుల్లాసంబునఁ బెల్లుగ నటించె. అప్పు డర్జునుం డా వికారచేష్టలఁగని యిట్లనియె.

కృష్ణా! నీకు మతితప్పినదా యేమి? ఏల యిట్లు పిల్లచేష్టలు చేసెదవు? ఘటోత్కచు మరణంబునకుఁ బాండవసేన యంతయు వగచి వెన్నిచ్చి పాఱుచున్నది. సేనానాయకులు, నాయన్న దమ్ములు విహ్వలులై వగచుచున్నారు. శోకాతిరేకంబున నా మనస్సు నాకు వశపడకున్నది. ఇట్టి దుఃఖసమయమున నీవు సంతోషపడుచుఁ జేకలు వేయుచు గంతులుపెట్టెదవు. ఈ విపరీతచర్యకుఁ గారణంబేమనిన దరహాసరోచిష్ణుండు శ్రీకృష్ణుం డిట్లనియె.

అర్జునా! నేనిం కెఁగడ కన్నార నిద్రింతును. కర్ణునొద్ద నింద్రదత్తంబైన మహాస్త్రంబుండువఱకు నిన్నెట్లు రక్షింతునా యని చింతచేఁ గంటికి నిద్రలేదు. ఆ యస్త్రంబొక్కని నెట్టివానినైన వధించు. నిన్ను వధింపఁ దానినతఁడు మీఁదు కట్టి యుంచెను. అది యిప్పుడు రాక్షసుండగు ఘటోత్కచు వధించి వ్యర్థమైపోయె. కావున నిఁక నిన్ను రక్షించుట సుకరము. ఘటోత్కచునకై దుఃఖింపఁ గారణము లేదు. అతఁడు రావణు నట్టివాఁడు బ్రాహ్మణహంత. మునిజనద్వేషి. మీయందలి భయగౌరవంబుల నణఁగి యున్నవాఁడు. నరకాదుల వలె నింతకుమున్న యతని వధింపక యీ కార్యమునకై మీఁదు కట్టి యుంచితిని. అనిన నీ వాక్యంబులను బ్రక్కనుండి వినుచుండిన సాత్యకి కృష్ణునితో నిట్లనియె.

అన్నా! వాసవదత్తంబైన యమోఘశక్తి యొక్క నిమాత్రమను వధింపునని యెఱ్ఱఁగి యెఱిగి కర్ణుం డర్జును రణంబునకు బిలిచి దియైన

నతనిపై నేల ప్రయోగింపఁడయ్యె ననినఁ గృష్ణుం డిట్లనియె.

సాయనా! కర్ణుని తలంపట్టిద. వాని వారందఱు ప్రతిదినము రాత్రులందు నతని నా యస్త్రమును రేపు యుద్ధమునకుఁబోయిన యాక్షణంబ ధనంజయు సంగరంబునకుఁ బిలిచి యతనిపైఁ బ్రయోగింపుమని బోధించుచుందురు. అతఁ డవశ్యమట్లె కావించెదనని చెప్పుచుండు. ఇట్లు వారు నిశ్చయించుకొనుచుందురు. రణరంగమునఁ బ్రవేశించిన వెంటనే వాఁడును వారును మఱచునట్లు నేను జేయుచుందును. ఈ హేతువున నతఁ డాయస్త్రమును నర్జునునిపైఁ బ్రయోగింపఁ జాలఁడయ్యెనని చెప్పెను.

ద్రోణుం డై దవనాఁటి యుద్ధంబునఁ గోపావిష్టచిత్తుండై న్యాయము లేక మలయుచు విజృంభించి పాంచాల విరాటసేనలనెల్లఁ గోలుముసఁగి దివ్యాస్త్రంబులచేమాడ్చి వేయుచుండెను. అతని తేజం బెట్టివారికి దుస్సహంబయ్యె ఈయన యిట్లు రణసన్నాహంబున నుండునేని మన సేననెల్ల సాయంకాలంబులోపల వారణహోమంబుగావించు. ఏమి చేయవచ్చునని ధర్మరాజు విచారపడఁ జొచ్చెను. అప్పుడు కృష్ణుం డాయనతో నిట్లనియె.

నీవు విచారపడుట వ్యర్థంబు. ఈయన నెదిరించి యెట్టివాఁడును దుర మొనరింపజాలఁడు. మిక్కిలి యప్రియమైన వార్తవిననేని యీయన రణంబుచాలించి మరణంబుకోరును. అనిన నామాటలు వినుచుండిన భీముఁడు ద్రోణుని జూసి యశ్వత్థామ చచ్చెనని చెప్పెను. తన యొంటికొడుకు చచ్చెనన్న దుర్వార్త శ్రవణతాడితంబగుడు బిడుగుపడినట్లు నిశ్చేష్టుండై తప్పులేని నిజమెఱుంగఁగోరి యది సత్యమాయని ధర్మరాజునడిగెను. అప్పుడు కృష్ణుం డిట్లనియె. ఇప్పుడు నీవు సత్యముచెప్పితివా నీతమ్ములతోడ నందఱు నేలపాలని తలంపుము. నీకు నీతమ్ములు బంధువులే దక్కరన రాజ్యముమాట యేల? కావున రాజ్యము వలతువేని నిస్సందేహముగ నశ్వత్థామ చచ్చెనని చెప్పుమనిన భీముఁడును నాచేత నశ్వత్థామ యనునొక గజంబు హతమయ్యె. నే నాశపథము పెట్టిచెప్పితిని. నీ వట్టులే వచింపుమనియె.

ధర్మరాజును గట్టిగ ద్రోణునకు వినవచ్చునటు లశ్వత్థామ చచ్చెనని చెప్పి యాయనకు వినరాకుండునటు లేనుఁగని చెప్పెను. ధర్మరాజసత్యమాడఁడని నమ్మి ద్రోణుఁడు ధనుర్బాణంబుల వదలి యోగ బలంబునఁ బ్రాణములు విడిచె. అంతవఱకు భూమినంటక సంచరించు చున్న ధర్మరాజు రథ మాయన యీ యసత్యమాడిన వెంటనే భూమిమీఁదికి దిగెను.

అమ్మణ్ణి—అశ్వత్థామ చిరంజీవిగదా. అతఁడు చచ్చెనని ద్రోణుఁడెట్లు నమ్మెను ?

తండ్రి—విపత్తికాలము సమీపించినపుడు బుద్ధిమంతులకును మతిపోవు చున్నది. కాలబల మది.

రుక్మిణి—అప్పా! కృష్ణుఁడు చేసినదన్యాయము. కృష్ణుఁడు భగవంతుఁడైయుండి ధర్మరాజుచే నసత్యమాడించి భ్రష్టునిఁ జేయవచ్చునా?

తండ్రి—కృష్ణుఁడు భగవంతుఁడని నీ వెప్పుడంగీకరించితివో యప్పుడే నీప్రశ్నము తప్పు. సర్వాంతర్యామియై సర్వభూతముల హృదయములనుండి వాని వాని కర్మానుసారముగ వానికివానికిబుద్ధిపుట్టించుచుండువాఁడు భగవంతుఁడని నీవు భగవద్గీతయందుఁ జదువ లేదా. భగవంతుఁడు సర్వసముఁడని యొకరియందు ద్వేషమైనఁ గాని మఱియొకరియందుఁ బ్రీతిగాని లేనివాఁడని మెఱుఁగవా. ఒకఁడుత్తమపదవి కోరినపుడు వాఁడాపదవికిఁ దగినగుణములుకలవాఁడవునా కాఁడాయని భగవంతుఁడు పరీక్షించి దోషములున్న వెలికిఁదీసి యట్టిదోషము మరల వానినంటకుండఁజేసి తరువాత నాపదమున నిలుపును. బంగారము మనముతీయునపు డది మంచి దగునా కాదాయని యగ్నియందుఁ బరీక్షించికదా యావలఁ దీయుదుము. ధర్మరాజెంత ధర్మమందాసక్తిగలవాఁడైనను నతని యందు లోభగుణము కించిత్తు గలదు. దానిని బయటఁదీసి దానికిఁ దగినశిక్ష కల్పించి యాయనను బరిశుద్ధుని జేయవలయు ననియే శ్రీకృష్ణుని యభిప్రాయము. ధర్మరాజసత్యమాడుటచేఁ

గృష్ణునకు రాఁగల లాభము లేదు. ధర్మరాజునందు లోభగుణము లేదేని కృష్ణుఁడు ప్రేరింపఁగానే యాయన యేల లోఁబడవలయును? రాజ్యము వచ్చినరానీ పోయినఁబోనీ నే నసత్యమాడనని యేల చెప్పరాదు? రాజ్యలోభముచేఁగదా యట్లు చేయఁడయ్యె. సత్యమునకంటె రాజ్యమాయనకు నెక్కువగఁ దోఁచెఁగదా. అసత్యమాడి గురువధము గావించితినని యావజ్జీవము ధర్మజుఁడు పశ్చాత్తప్తుఁడగుచునే యుండెను. దానివలన సగము పాపముపోయెను. ఆవల నసత్యమాడకుండుటచేతను నరకదర్శనమునను దక్కిన పాపము క్షయించెను. పరోక్షమున నంతర్యామిగనుండి చేయుపనియే కృష్ణుఁడు ప్రత్యక్షముగఁ జేసెను. ఇట్టి పరీక్షలందు దృఢబుద్ధి ధర్మమందు నిలిచినవాఁడు ధన్యుఁడు. ఇట్టి విషమ పరీక్షయందు సైంధవవధ నాఁ డర్జునుఁడు నోడెను. ఆవల వినుఁడు.

ద్రోణుఁడు మరణించినవార్తవిని యాయన కుమారుఁ డశ్వత్థామ కోపించి పాండవసేనసంతయు నేకకాలమున భస్మీభూతముఁ గావింతునని నారాయణాస్త్రంబుఁ బ్రయోగించెను. ఆయస్త్రరాజమనివార్యము. అప్రతిహతము. అదియొక్కసారిగ నలుముఖముల జ్వాలలు గ్రక్కుచుఁ బాండవసేనాసమూహముపైఁ బడి ధ్వంసముచేయ నారంభించెను. అప్పుడు కృష్ణుం డందఱువిన నిట్లనియె. ఓ వీరులారా! యిదినారాయణాస్త్రంబు. దీనికి మాఱులేదు. ఇది నిరాయుధులను జంపదు. కావున మీరందఱు నాయుధములు నేలవైచి వాహనములు డిగి చేతులు జోడించుకొని నేల నిలఁబడుఁడు. అట్లైననిది శాంతించును. అని బోధించెను.

అర్జునుఁడులోనుగా నందఱు నట్లు గావించిరి. భీముఁడు మాత్రము రథము దిగక యాయుధము విడువకయుండెను. ఆ యస్త్రమందఱువిడిచి భీముపైఁ గవిసెను. ఆయన రథము మండఁజొచ్చెను. అప్పుడు కృష్ణార్జును లాయన తేరిమీఁదికి దుమికి యా యస్త్రప్రభా

వంబు దెలిపి యాయనచేతివిల్లు బలవంతముగా లాగివైచి యాయనను గ్రిందికిఁ ద్రోచిరి. అంతటితో నాయస్త్రముపశమిల్లెను.

ద్రోణుని యనంతరము దుర్యోధనుని నచ్చినబంటు కర్ణుఁడు సేనాధిపతి యయ్యెను. అతడు రెండుదినములే యుద్ధముచేసెను. రెండవనాఁటి యుద్ధమున నర్జునుఁడు సంశప్తకులతోఁ బోరుచు దూరమున నుండు సమయంబునఁ గర్ణుఁడు యుధిష్ఠిరుపైఁగవిసి పరాజయమొందించి పరిభవించి విడిచెను. ధర్మరాజు సంగరంబున బాణార్దిత గాత్రుఁడై నిలువలేక శిబిరంబునకుఁ బోయెను. సంశప్తకవధంబు గావించి మరలివచ్చి యర్జునుఁడు సేనామధ్యంబున నగ్రజుఁ గానక వెదకికొనుచు శిబిరంబునకుఁబోయి ధర్మజునకు నమస్కరించెను. అర్జునుఁడు కర్ణుని జంపి వచ్చినవాఁడని యుధిష్ఠిరుండు సంతసించి యాయనను బెక్కువిధముల ప్రశంసించెనుగాని కర్ణుఁడు చావఁడనియు నింకను జీవించి యున్నవాఁడనియు విని కుపితుఁడై యిట్లనియె.

నాయనా! నీవు కర్ణుని జంపఁగలవని నమ్మినదానికిఁ జక్కఁగఁ జేసితివి. నీవు రణభారమంతయు భీముపై వైచి పిఱికివై యేమని యిచ్చటికి వచ్చితివి? ద్వైతవనమందుఁ గర్ణుని నేను వధింతునని చెప్పిన కారణంబునఁగదా నిన్ను నమ్మి యుద్ధమున కుపక్రమించితి. నీమేలుకోరు నన్నేల శత్రువులనడుమఁ బైకెత్తి నేలవైచితివి? నీవు కుంతికడుపునఁ బుట్టకుండిన మేలు. గర్భంబునఁ జొచ్చినను నైదవనెల గర్భపాతమై యుండిన క్షేమకరము. విశ్వకర్మ నిర్మితంబై యభేద్యంబైన రథము హనుమద్ధ్వజము నక్షయతూణీరములు నాలుజేనలంత పొడుగు గాండీవము నివన్నియు నేల కాల్పనా? అభిమన్యుఁ డొండె ఘటోత్కచుఁ డొండె నుండిన నాకీపాటేల గలుగు. రాధేయునకు నీవింత భీతిల్లెదవేని కృష్ణునకు నీ గాండివంబిచ్చి యాయనకు నీవు సారథివగుము. ఆయన సాయుధుఁడై పోరనొల్లఁడేని నీకంటె బలపరాక్రమసంపన్నుఁడైన వేఱొకరాజునకైన దానినిమ్ము. అని తూలనాడిన నర్జునుఁడాయనను జంప నొఱనుండి చివాలునఁ గరవాలంబు దూసెను. శ్రీకృష్ణుం

డాయన కేలు తటాలునఁ బట్టుకొని యర్జునా! కత్తితో నిచ్చటనేమి పనియనినఁ బార్థుం డిట్లనియె.

కృష్ణా! నన్నెవ్వఁడు నీ గాండీవంబుఁ బరులకిమ్మని నోనాడు నట్టివానితల ఛేదింపఁ బ్రతినపట్టినవాఁడను. ఇప్పు డీయన నన్నట్లు పలికెఁ గావున నీయన శిరంబుత్తరించి తీర్ణప్రతిజ్ఞుఁడనై సత్యసంధుఁడ నయ్యెదననినఁ గృష్ణుఁ డిట్లనియె.

చీచీ యేమి వినరాని కఠోరోక్తులాడెదవు. ఆసమయంబున కుపితుఁడవగుట నీవు వృద్ధసేవఁ జేసినవాఁడవు గావని యిప్పు డెఱింగితిని. ధర్మభీరువు నపండితుఁడనగు నీవలె ధర్మవిభాగ మెఱింగిన వారు పలుకరు. అకార్యమువలెఁ దోఁచుచు నెవ్వి కార్యములగునో యెవ్వి కార్యములవలెఁ దోఁచినను నకార్యములగునో యవి యెఱుంగనివాఁడు పురుషాధముఁడు. అనుభవమువలన ధర్మవిధము సవిస్తరముగ సంక్షేపముగఁ దెలిసిన పండితులు శిష్యుల కుపదేశింప నీవు విన్నవాఁడవు కావు. నిశ్చయము. కార్యాకార్యవినిశ్చయమందు నిశ్చయజ్ఞాన మీవిధముగ సంపాదింపనివాఁడు నీవలె నజ్ఞాన మోహితుఁడగును. కార్యమిది యకార్యమిదియని తెలిసికొనుట సులభసాధ్యముగాదు. శ్రుతమువలననే తెలియవలయు. ఆ విధము నీ వెఱుంగవు. విజ్ఞానహీనుండ వగుట నీ విపుడు ధర్మజ్ఞుఁడననుకొని సత్యము రక్షింపఁ జూచుచున్నాఁడవు. ధార్మికుఁడనని తలఁచెదవు గాని ప్రాణివధమువలన నగుపాపమెట్టిదో యెఱుఁగవు. ప్రాణివధముచేత సర్వధర్మములు వ్యర్థములగునని నా యభిప్రాయము. అసత్యమైనఁ జెప్పవచ్చునుగాని యెన్నఁడు హింసచేయరాదు. ధర్మరహస్య మిట్లుండ నన్నయు రాజును ధార్మికుఁడునగువానిని బామరుని వలె నీ వెట్లు చంపఁదలపెట్టితివి?

యుద్ధము చేయనివానిని, గురువును, శత్రువు కానివానినిఁ బరాఙ్ముఖుఁడైనవానిని, బరువెత్తువానిని, శరణాగతుని, కృతాంజలిని, బ్రపన్నుని, బ్రమత్తుని వధింపరాదు. ఈ గుణములు మీ యన్నయం దున్నవి. పిల్లతనపు బుద్ధిచే నీవు వ్రతము పట్టితివి. అట్టి యధర్మ

సంయుక్తవ్రతమునుబట్టి నీ విప్పుడు మూర్ఖుఁడవై హింసారతుఁడవుగాఁ జూచితివి. ధర్మసూక్ష్మవిధము నాలోచింపక యేమని నీవు స్వగురు వధంబునకై పరువులు పెట్టెదవు ? నీకు భీష్ముఁడుగాని యుధిష్ఠిరుఁడు గాని విదుర గాంధారీ కుంతీదేవులుగాని ద్రౌపదిగాని చెప్పవలసిన ధర్మరహస్యముఁ జెప్పెదవినుము. సత్యభాషణము మేలు. సత్యమున కంటె శ్రేష్ఠమైనది లేదుగాని యాచారమందేది సత్య మేది యసత్యమని యెఱుఁగుట దుష్కరము. ఒక్కొక్కసత్యమే యసత్యఫలము నిచ్చును గావున నట్టి యెడ సత్యభాషణము దోషావహము. ఒక్కొక్కచోట నసత్యమే సత్యఫలదాయియగు. అట్టిచో నసత్యాలాపంబు శ్లాఘ్యంబు.

ఆ. పరిణయంబువేళఁ, బ్రాణాపదలయందు
సర్వధనముపోవు సమయమునను
బ్రాహ్మణార్థముగను, రతి, నసత్యంబొప్పఁ
గల్లలైదు పాతకములు గావు.

ఇట్టి సమయంబుల సత్యంబు కార్యహానికరంబగునేని యది యసత్యమగు. అసత్యంబు కార్యసాధనంబగునేని సత్యఫలంబునిచ్చు. సందర్భముల కొలఁది సత్యాసత్యముల నిశ్చయింపలేక సత్యమందె వర్తింతుననువాఁడు బాలిశుఁడు. సత్యానృత లక్షణంబెఱింగి వివేకి యగువాఁడు ధర్మవిధుఁడు, కావునఁ గ్రూరమృగంబును వధించిన బలాకునివలె ధర్మాత్ముఁడగువాఁడు క్రూరకార్య మొనర్చియు మహాపుణ్యంబుగడించుట యేమివింత. అట్టులే ధర్మకాముఁడై యపండితుఁడగు మూఢుఁడు కౌశికునివలె మహాపాపం బార్జించు టేమి విచిత్ర మనిన నర్జునుండు నా కాకథలఁ దెలుపుమనినఁ గృష్ణుండిట్లనియె.

బలాకుండను బోయ యొకఁడు జంతుహింసాభిలాషిగాక యుఁ గులధర్మమగుట దారపుత్రాదిరక్షకై వనమృగంబుల వధించుచుండె. ఆతఁడొకనాఁడు ధనుర్బాణ పాణియై విపినంబునఁ గ్రుమ్మరుచు నెందు నొకమృగంబేనిఁ గానక విసివి చరించునెడ నొకఘ్రాణచక్షుష్క

మగు శ్వాపదంబు దృగ్గోచరంబగుడు దానిని వధించె. ఆగ్రుడ్డి వన్య సత్త్వంబును జంప నతనిపై దేవతలు పుష్పవృష్టి గురియించి విమానంబునఁ గూర్చుండఁబెట్టుకొని స్వర్గంబునకుఁ గొంపోయిరి. ఆ మహా క్రూరమృగంబు బ్రహ్మకై తపంబొనర్చి సర్వజంతు వినాశం బొనర్ప వరంబు వేఁడుటయు నట్లె కానిమ్మని చెప్పి బ్రహ్మ దానిని గ్రుడ్డిగ నొనర్చె. అట్లుండియు నది వాసనఁబట్టి జంతుహింస గావించుచుండె. లోకోపద్రవకారకంబైన యద్దాని వధించునతఁడు హింసాపాపంబుఁ బొరయక పుణ్యంబునఁ బ్రాప్తస్వర్గపదుండయ్యె.

నదీసంగమస్థలంబున నొక గ్రామంబున కనతిదూరంబునఁ గౌశికుం డనువిప్రుండు వసించుచుండెను. అతండు సత్యవ్రతుం డగుట సత్యవాదియని ప్రఖ్యాతివహించె. ఒకనాఁడు కొందఱు చోరులు బాటసారులఁ దఱిమిరి. ఆ బాటసారులు వారికిఁజిక్కక పరువిడి కౌశికునాశ్రమముపొంతఁ బొదలలో డాఁగిరి. వారిని వెదకుచు వచ్చినతస్కరులు సత్యవాదీ! యీత్రోవ పాంథులు కొందఱువచ్చిరి. వారెందుఁబోయిరని యడిగిన వారు మ్రుచ్చులని యెఱిఁగియు నసత్యభీతి సత్యదీక్షగల యతండు వారియునికి నెఱింగించె. ఘాతుకు లా పథికులఁ దునిమిరి. ఆవధకుఁ గారణభూతుఁడైన యా కౌశికుండు నిరయంబునకుఁ జనియె. కావున ధర్మంబుల నవిశారదుఁడైనవాఁడు సందేహవిషయముల వృద్ధుల నడుగక ప్రవర్తించిన నరకకూపమువఁ బడును. కాన, నిదిపుణ్య మిదిపాపమని తెలిసికొనఁ గొన్నిలక్షణము లుండవలయును. కొందఱు సత్యమే ధర్మమందురు. ఇది నేను గాదననుగాని యిది యన్నిసమయంబుల శ్లాఘ్యంబుగాదు. అనేకులు వేదోక్తమే ధర్మమందురు. ఇదియు నేను గాదననుగాని సర్వవిషయంబులు శ్రుతులందు లేవు. అహింసాయుక్తమగునదియే ధర్మమగుట నిశ్చయము. అహింసార్థమే ధర్మప్రవచనంబు చేయఁబడెను. అన్నిటిని ధరించునది గనుకనే దానికి ధర్మమని పేరు. కావున ధర్మముప్రజల భరించునదియై యుండవలయుఁగాని హరించునదియై యుండరాదు. భూతముల ప్రభవంబునకై ధర్మములు వాకొనఁబడియె. కావున,

దేనివలన భూతంబులు ప్రభవంబులగునో యది ధర్మమగుట నిశ్చయము. కారణము తర్కింపక విధులననుసరించి ధర్మమునఁ బుణ్యము నొందగోరువానితోడను నట్టులే వేదోక్తములుగాని సందర్భముల నర్తించువానితోడను గలసి వర్తింపరాదు. వేదంబులఁ జెప్పబడకయు పరిశీలించి వివేకింపరానట్టి సందర్భముల మాటలాడవలసి వచ్చెనేని మౌనధారణము మేలు. అట్టి మౌనము తనకుఁగాని యితరులకుఁగాని క్షేమునకు మూలమగునేని యనృతమాడుట యొప్పును. అట్టి యనృతము సత్యమే యగు,

ఉ. ప్రాణభయంబునప్పుడు, వివాహము వేళల, సర్వబంధువుల్
మానక చావనున్నెడ, సమస్త ధనంబును మూలముట్టుగా
పోనిగ, హాస్యమాడు సమయంబునయందు, నసత్యమాడినన్
దానిని దోషమంచనరు ధర్మవిధిజ్ఞులు పాండునందనా !

అంతియకాదు వినుము. ఒకఁడు చోరులచేఁ జిక్కువడెనేని ప్రమాణముచేసియైన నసత్యమాడుటొప్పు. తన కష్టార్జితంబు జీవనాధారంబు ధనం బన్యాయవిధిని బరులపాలుసేత ధర్మంబుగాదు కావున నట్టిపట్టుల సత్యంబుకంటె నసత్యంబె శ్రేయస్కరంబు. సత్యంబుపలికి యపాత్రులకు ధనమర్పింపరాదు. పాపులకు ధనమిచ్చినవాఁడు పాపఫలభోజియగును. కావున, సత్యభాషణంబునట్టి లక్ష్యోద్దేశంబు విధియుక్తంబు. ఇది యెఱింగి యుధిష్ఠిరుండు వధ్యుఁడో కాఁడో వచింపుమనిన నర్జునుం డిట్లనియె.

మహాప్రాజ్ఞుఁడు మహాయశుఁడు సుహృత్తు నగువాఁడెట్లు బోధింపవలయు నట్లు బోధించితివి. నీవే మాకుఁ దల్లివి తండ్రివి. పరమగతివి. పరాయణమవు. నీకుఁ దెలియనిది మూఁడులోకంబుల లేదు. కావున యథాతథంబుగఁ బరధర్మంబులనెల్ల నెఱుగుదువు. యుధిష్ఠిరుఁ డవధ్యుఁడనియే నిశ్చయించితి. నే నధర్మముపాలఁ బడకుండు విధ మెఱిఁగింపుము. ఇతరులకు గాండీవమిమ్మనువాని వధింతు నన్న ప్రతిజ్ఞ నీవెఱుంగుదువు. ఇట్టులే భీముఁడు *తూవరకుఁడని తన్నన్న

*తూవరకుఁడు=గడ్డములేనివాఁడు. అనఁగాఁ బౌరుషహీనుఁడని యర్థము.

ఘాని వధింపఁ బ్రతిజ్ఞపట్టియున్నవాఁడు. గాండీవము పరులకిమ్మని రాజు నీయెదుటనే పలుమాఱాడెను. ఈయనను వధించితినా యది యన్యాయ్యకార్యమగుట నావల క్షణమైన జీవింపను. నా ప్రతిజ్ఞఁ లోకమంతయు నెఱుఁగు. యుధిష్ఠిరుఁడును నేనును జీవించు నుపాయమేదో తెలుపుము. అనిన కృష్ణుఁ డిట్లనియె.

రాజు నిస్సట్లుపలుకఁ గారణమేమో యూహింపుము. నిన్నుఁ బరిభవపఱుపవలయునని నీవు నిజముగ నశక్తుఁడవని యాయన తలంపని నీవు చెప్పఁజాలవుకదా. అట్లైనచో నాయన యుద్దేశమేమి? ఈరాజు నేఁటియుద్ధమునఁ గర్ణ శరతాడితుఁడై నొచ్చియున్న వాఁడు. యుద్ధముచేయని యీయనను వాఁడు నొప్పించి నిష్ఠురములాడెను. ఈయన దేహబాధచే మనోవేదనచేఁ బీడింపఁబడు చున్నాఁడు. అట్టివాఁడు కర్ణువధ గోరుట వింతగాదు. కర్ణుఁడు చచ్చినఁ గౌరవసేనయంతయుఁ జచ్చినట్లె. కర్ణునితో యుద్ధము సరి. వానిని నీవుతప్ప మఱి యెవ్వరును చంపఁజాలరని యీయన యెఱుఁగును. ఇంతకు నీ వా కార్యమునకుఁ బూనుకొనవైతివి. కావున నీకు రోషముఁగల్పించి నీచే వానిని జంపించుట యీ రాజునుద్దేశమగుట నిస్సందేహము. ఇది దురుద్దేశమని నీవు చెప్పగలవా? కావున ధర్మపుత్రుండు వధ్యుండుకాఁడు. నీ ప్రతిజ్ఞయుఁ బరిపాలనీయము. కావున యుధిష్ఠిరుండు బ్రతికియుఁ జచ్చినవాఁడగు నుపాయంబు చెప్పెదను. సమ్మానార్హుఁడగువాఁడు లోకంబున నెంతవఱకు గౌరవింపఁబడుచుండునో యంతవఱకే వాఁడు మనుష్యులలో జీవించియుండువాఁడు. అట్టివాఁ డెప్పు డవమానపాత్రుఁడగునో యప్పుడే జీవన్మృతుఁడగును. ఈయనను మీరందఱును, శూరులును, వృద్ధులును సమ్మానించువారునుగదా. ఇప్పు డీయనను నవమానవాక్యములనుము. నీవు నీవని పలుకుము. పూజ్యుఁడగు పెద్దవానిని నీవని యేకవచనంబునఁ బలుకుటయుఁ జంపుటయు సమానములు. ఇది యాంగీరసోక్తి. కావున నీవిట్లుచేసి తీర్ణప్రజ్ఞుఁడ వగుము. ఇట్లు పలికి యవల నమస్కారాదుల గౌరవింపుము. నీ యున్న ధర్మమార్గానుసారిగావున

నీపై నలుగఁడు. ఈవిధముగ ననృతదోష భ్రాతృవధదోషముల వలన ముక్తుఁడవై సూతపుత్రు వధింపఁబొమ్ము. అనియిట్లు కృష్ణుండు బోధించిన నర్జునుండు ననుక్తపూర్వంబులు పరుషంబులునగు వాక్యంబుల నగ్రజు నిట్లనియె.

రాజా! నీవా నన్ను నాక్షేపించువాఁడవు? పగఱకు వెన్నీయక జడియక సమరరంగంబున స్వేచ్ఛావిహారంబు నిర్భీకుఁడై సలుపుచుఁ బరులకు గుండెగాలమై చరించు భీమసేనుండు నన్నాక్షేపింప నర్హుఁడుగాని యరాతులఁగని భీతిఁబఱచి యిల్లుచేరి మూలదాఁగిన నీయట్టి పిఱికి కండ నన్నాక్షేపింప నర్హుండా? అట్టులే నకులసహదేవులు పరభయంకరులై కౌరవుల నేలకు గోలకుఁ దెచ్చుచున్నవారు. అట్టివారు నన్నాక్షేపింప నర్హులు. మాకెల్లరకుఁ గలిగిన కష్టనష్టములకు నీవకదా కారణభూతుఁడవు. తెలివిమాలి నీవు జూదమాడుటఁబట్టికదా నేపాపమెఱుఁగని మేము ద్రౌపది పడరానిపాట్లంబడితిమి. మేమందఱము నిన్నొక పెద్దఁజేసి గౌరవించుచుండుటచేత నీవు లోకమునకు మాననీయుఁడవైతివిగాని నీవు స్వతంత్రించి చేసిన ఘనకార్యమెద్ది? మావలనఁ గలుగు నుపకారమైన స్మరింపక నీ శక్తిసామర్థ్యంబులు దలంపక నన్నే యాక్షేపింపఁ జొచ్చితివి. నీవు ప్రమత్తుఁడవు. మూఢుఁడవు. భారతులం దసాధువవు. కావున నిన్ను రాజ్యంబుప్రాపించి నష్టమగుటయేగాక మాకెల్ల దాస్యంబు లభించె. మా దాస్యంబునకు వనవాసంబునకుఁ గారణము నీవకదా. అని యనేకవిధంబుల నిందించి మరలఁ గత్తిదూసినఁ గృష్ణుం డిదేమి మరలఁ గత్తిదూసితివనిన నగ్రజుండును లోకపూజ్యుండును రాజును దేవతాసముఁడును నగు నిమ్మహాత్ము ననరాని కాఱులని మహాపాపం బొనర్చితి. నాయట్టి పాతకి లోకంబున జీవింపఁదగఁడు. కావున శిరస్సు ఛేదించుకొనుటయ దానికిఁదగిన ప్రాయశ్చిత్తంబని చిత్తంబున నిశ్చయించితి ననిన వాసుదేవుం డిట్లనియె.

ఆత్మప్రశంసయుఁ బరనిందయు మరణతుల్యంబులు. కావున నాత్మప్రశంస గావింపుము. దాన నీ వాత్మహత్య చేసికొనినవాఁడ

వగుదువు. నీవు చేసిన పాపంబున కదియు ప్రాయశ్చిత్తంబనిన నర్జు నుం డిట్లనియె.

ధర్మనందనా! నీవు నన్ను భీరువగు ప్రాకృతునట్టులు తలంచితివికాని నా పౌరుష బలపరాక్రమంబు లించుకైన దలపోసినవాఁడవు కావు. నా బలపరాక్రమభీతుండై కదా ధృతరాష్ట్రసుతుండు రేపల్లఁ గనుమూయఁడు. నా సహాయంబునఁగాకున్న నీవు రాజసూయాధ్వరంబు నెఱవేర్పఁ జాలియుందువా? ఘోషయాత్రయందు గంధర్వుల జయించుట నీ వెఱుఁగవా? ద్రౌపదిని నీవు భార్యగాఁ గొనిగులకరించుట నేను మత్స్యయంత్రంబుఁ ద్రెగవేయుటచేఁగదా. త్రిలోచను మెప్పించి పాశుపతాస్త్రంబుగొన్న ధీరుండను. కాలకేయ నివాతకవచుల నేకరథంబున జయించిన వీరుండను. ఇంద్రుని యర్ధ సింహాసనంబునఁ గూర్చుండిన మేటిని నేనుగానా? భీష్మద్రోణ కర్ణాది పాలిత కౌరవసేన నోడించి విరాటపురంబునఁ బసులఁ బెట్టించిన నా యసమానవిక్రమంబైనఁ దలపోయవైతివి. దేవతాగణ పరివృతుండైన నాఖండలు నోడించి ఖాండవం బగ్నికి సమర్పించిన నాకంటె నీవేమి ఘనకార్యము లాచరించితివి.? అస్త్రజ్ఞానహీనులపై దివ్యాస్త్రములు ప్రయోగింపరాదని యుపేక్షించితిఁగాని కాకుండినఁ గౌరవసేననంతయు నొకనాఁట నొకపూఁట నొకవ్రేటున భస్మీభూతంబుఁ గావింపనా? అని యిట్లు తన బలపరాక్రమంబులు పొగడుకొని వెండియుఁ గరంబులుమోడ్చి భ్రాతతో నిట్లనియె.

అన్నా! నన్నుక్షమింపుము. ఇదెపోయి కర్ణుని మార్కొని రాధను బుత్రవిహీనఁగావించెద. కాదేని కుంతి నైన నట్టిది యగుఁ గాక. అనుజ్ఞయిమ్ము. రణరంగమునకుఁ బోయెదననుటయుఁ బరుష వాక్య తాడిత చిత్తుండైన యానృపసత్తముండు కోపంబున ముఖంబున గంటుపెట్టుకొని శయనంబుననుండి చివాలున లేచి యర్జునునుంగని యిట్లనియె.

వీరాగ్రేసరా! నేను మూఢుఁడను, క్రూరుండను, బిఱికి పందను నగుట నిజము. నావలన మీరు పెక్కిడుముల పాలగుటయు

సత్యము, నాయట్టి మూఢునకు భీరునకు మీరు లోఁగిపడియుండనేల? భీమసేనుండు రాజగుఁగాక. నేనుదేవనంబుల కేగెద నని వనగమనోన్ముఖుండైన కౌంతేయాగ్రజు పాదంబుల వ్రాలి కృష్ణుఁ డిట్లనియె.

రాజేంద్రా! తన గాండీవంబుఁ బరులకిమ్మని పలికినవాని శిరంబు ఛేదింతునని యర్జునుండు ప్రతినపట్టుట నీ వెఱుంగుదు. ఎఱింగియు నీవతని నట్టులాడితివి. అర్జునుండు సత్యప్రతిజ్ఞుఁడగుటయు ని వెఱుఁగుదువు. అతండు మానధనుండు. వ్యర్థప్రతిజ్ఞుండై యెట్లు సరి వారిలోఁ దలయెత్తి తిరుగఁగలఁడు. కావున నతనికి భ్రాతృవధదోషంబు లేకుండఁ బ్రతిజ్ఞ వ్యర్థగాకుండ నేన యతని నిన్ను నిష్ఠురములాడ నియోగించితి. పెద్దల నవమానించి పలుకుటయు వధించుటయు సమానంబులు గావున నేనట్టి యుపాయముఁ గల్పించితి. నిన్ను నిష్ఠురములాడితినని యతఁ డెంత పరితపించెనో నీవ చూచితివి. దీనివలన నిన్నాడిన నిష్ఠురములు కార్యసాధకము లగుఁగాని యహంకృతియుక్త బుద్ధిపూర్వకములు గావని నీవ యెఱుంగుదువు. ఆత్మవధోద్యుక్తుండైన నతని వారింపఁగోరి యాత్మశ్లాఘఁ గావింపుమని నేన నిర్దేశించితి. ఇట్టి యుపాయము నేను జేయకున్న మీరిరువు రనవేల పాండవులందఱు బంధుమిత్రాదులతో నేమై యుందురో యాలోచింపుము. ఇంక నిన్ను నిష్ఠురములాడించిన దోషిని నేనుగాని యర్జునుండు కాఁడు. నాయెడఁ బ్రసన్నుఁడవగుము. అని చరణంబుల వ్రాలి లేవకుండు నాయనను లేవనెత్తి ప్రసన్నచిత్తుండై యుధిష్ఠిరుం డిట్లనియె.

నీవలన మే మిరువుర మనవేల యందఱము మరల జన్మించిన వారమైతిమి. కర్ణబాణతాడితుండ నగుట నతఁడు జీవించియుండు వాఁడవని కోపంబు సైఁపక యుక్తాయుక్తంబు లాలోచింపక యట్లు పలికితి. నీవు తేపగా మే మీ విపత్సాగరముఁ దరించి దరిచేరితిమి.

అర్జును నెడ రోషంబు విడిచితిని. మీరు రణరంగమునకుఁ బోయి యెక్కటిపోరు వృకోదరునకు బాసటై కర్ణునవధింపుఁడు. అని

తెలివొంది పలికినఁ గృష్ణార్జునులు తదనుమతి రథారూఢులై సంగర రంగమునకుఁ జనిరి. ఆనాఁడే భీముఁడు దుశ్శాసను వక్షంబుఁ జీల్చి నెత్తురు ద్రావి యతని వధించె. అంతఁ గర్ణార్జునులుపోరఁ దొడఁగిరి. అందు శల్యసారథికుఁడగు కర్ణుఁడు పార్థుతో మహాహవంబొనర్చి యాతనను వధింపఁ జిరకాలంబుగ దాఁచి యుంచిన నాగాస్త్రంబుఁ బ్రయోగించె. దైవోపహతుండైన కర్ణుం డాయస్త్రంబును నర్జును కంఠంబునకు గుఱిపెట్టక తప్పి లలాటంబునకు గుఱిచూచి ప్రయోగించె. అదిగని కృష్ణుండు పార్థు నరదంబును బంచాంగుళి ప్రమాణము నేల దిగఁబడ నదిమె. రథంబు దిగంబడుటయు రథాశ్వంబులు మోఁకటిల్లె. కర్ణప్రయుక్త నాగాస్త్రము కిరీటిశిరంబున వెలుఁగొందు దేవదత్త కిరీటంబును భేదించికొని చనియె. ఇవ్విధంబునఁ గృష్ణుఁడు చేసిన యుపాయంబున నర్జునుండు జీవింపఁ గలిగె.

మరలఁ గర్ణార్జునులు ఘోరంబుగఁ బోరిరి. బ్రాహ్మణ శాపంబునఁ గర్ణ రథచక్రంబు నేలఁగ్రుంగె. రథం బొడ్డగెడనై యుండుట గని శరసంధానక్రియకు వలను పడక కర్ణుండు తేరుగిడి చక్రమెత్తుచు, ధర్మంబు తన్నుఁ గావదయ్యెనని ధర్మంబును నిందించుచుఁ బార్థునితో నిట్లనియె.

అర్జునా ! నీవు సత్కులప్రసూతుఁడవు. ధర్మవేదివి. ధర్మనిష్ఠుడవు. నీవు రథస్థుండవు. నేను భూమిస్థుండఁ బాదచారిని. ఇట్టి నాపై నీవు శరప్రయోగంబుసేత ధర్మ్యముగాదు. ధర్మముఁ దలఁచి నాపై నారాచప్రయోగంబు సేయకు. ఇది నీకును గృష్ణునకును వెఱచి చెప్పుటగాదు. ధర్మంబు బోధించెదననిన శ్రీకృష్ణుండాతని కిట్లనియె.

కర్ణా! యిప్పుడైన నీకు ధర్మమనుపదము స్మరణమునకు వచ్చెఁగదా యని సంతసించెదను. నీచులు వ్యసనమగ్నులైనపుడు ప్రాయికముగా దైవమును నిందింతురుగాని యది తమ దుష్కృతఫలంబని తలంపరు. నీవు నట్టివాఁడవేయైతివి. నీవుచేసిన దుష్కృతముల స్మరింపుము. ధర్మంబు నిన్నుఁ గావదయ్యెనని ధర్మంబు నేల దూఱెదు? ధర్మంబును నీవు రక్షించినఁగదా యది నిన్ను రక్షించు. నీ బోధనకాదే దుర్యోధ

నుండు పాండవులకు విషమిడుట, పాములఁ గఱపించుట. అప్పుడు నీకుధర్మంబు రుచింపదయ్యెఁగదా. నీవు బోధించుటచే గదా దుర్యోధనుఁడు పాండవుల లక్కయింట దహింపయత్నించె. నీ కీధర్మబుద్ధి యానాఁ డెందుఁబోయె. యుద్ధకుశలు లయుద్ధకుశలుల యుద్ధమునకుఁ జీరరానట్లు ద్యూతనిపుణు లద్యూతనిపుణుల జూదమాడఁ బిలువఁ రాదని యెఱింగియు మాయావియగు శకునితోడ జూదమాడ రమ్మని మీరు ధర్మసుతుఁ బిలిచినపు డీ ధర్మవిచార మెందేగె.

స్త్రీజనమధ్యస్థితను, రజస్వలను, నేకవస్త్రను, ద్రౌపదిని సభలోనికి మీ రీడ్చినపు డీ ధర్మబుద్ధి యేల పుట్టదయ్యె? పేరోలగంబున ద్రౌపదిని బరిభవింప నామె కట్టుపుట్టంబులు కట్టిడులై యొలిపించు నాఁడు ధర్మ మెందుండుటయైనఁ దోఁపదయ్యెఁ గదా. "పాండవులు వినష్టులై శాశ్వతనరకంబునంబడిరి. ద్రౌపదీ! వేఱొకమగనిఁ గోరుకొను" మని పతివ్రతయగు పాంచాలిని నీవు పలికిననాఁడు నీకీ ధర్మబుద్ధి యెందుఁబోయె? పదుమూఁడేండ్లరణ్యవాస మజ్ఞాతవాసము జరపివచ్చిన పాండవులకు వారి రాజ్యము వారికి మరల నీయవలయునను ధర్మ మానాఁడు స్మరణీయము కాదయ్యెఁ గదా. పలువురు గుమిగూడి బాలు నభిమన్యు మోసవిధంబునఁ జంపునాఁ డీ ధర్మస్మృతి నీ కెందుఁబోయె. ఇప్పుడు నీ వుపదేశించు ధర్మ మిన్ని సమయముల నీచే ననుష్ఠింపఁబడకుండియు నిప్పుడు ధర్మము ధర్మమని కుత్తుకయెండ నేల వదరెదవు? ఇప్పుడేల నీవు ధర్మమును స్మరించెదవు? అట్లైనను నీవు ప్రాణములతో విడువఁబడవని నమ్ముము.

అనినఁ గర్ణుఁడు లజ్జావనతశిరస్కుండై యూరకుండె. అంతఁ గృష్ణుఁడు నిజవాక్యంబుల రోషావిష్టహృదయుండైన బీభత్సుంగని వీని శతాంగంబురథాంగం బమోఘ బ్రాహ్మణశాపంబున వికలంబయ్యె. అది యేమిటను నెంతకాలము వేచినను జక్కఁబడునది కాదు. వృథా కాలయాపనమేల? కావున నితనిశిరంబుఁ దెగవేయుమని బోధింప నతఁడును నంజలికాసుగంబు దివ్యమంత్రంబున నభిమంత్రించి తెగ నిండఁదీసి విడుచుటయు నది కర్ణు శిరంబు దెగఁదీసె.

గుక్కిశి—అప్పా! కర్ణుఁడు సహజకవచకుండలుఁడై పుట్టనేమి కారణము?

గంద్రి—పూర్వము సహస్రకవచుండను ప్రబలరాక్షసుండు బ్రహ్మకు ఘోరతపంబొనర్చి ప్రత్యక్షంబైన యాయనను నమృతత్వంబు గోరె. అది యీయక పరమేష్ఠి వేఱొండువరంబుఁ గోరుమనుటయు నతండిట్లనియె. దేవా! యమర్త్యత్వము నీ వొసంగఁజాలవేని నాకు సహస్ర కవచంబులును కుండలంబులు నొసంగుము. ఒక్కొక కవచం బొక్కొండు పదివేలవర్షంబులు తపంబుఁ గావించి పదివేలవర్షంబులు నాతో యుద్ధంబు జేయఁగలవానికిఁ దక్క నితరుల కభేద్యంబు గానిమ్ము. అనిన విరించియు నట్లౌనని యరిగె. దానవతండు సహస్రకవచుండనఁ బ్రసిద్ధుండయ్యె. ఇట్టి వరంబంది యాతండు బృందారకులను, ఋషులను, మనుష్యులను నానావిధముల బాధించుచు సుందరీబృందంబును బందిగొనుచు దేవతల వెట్టిగొనుచుఁ గాఱియపెట్టుచుండెను. వాని రాయిడి సైఁపలేక దేవతలెల్ల జగద్రక్షాదీక్షితుండైన పుండరీకాక్షుం జేరనరిగి తమగోడు విన్నవించిరి. వారి కా లోకనాథుం డభయంబొసంగి పొండని పనిచి, బదరికాశ్రమంబున నరనారాయణమూర్తులు వహించి తపంబుచేయుచుండఁగ. దశసహస్రవర్షానంతరంబున నారాయణుండు సహస్రకవచు రణంబునకుఁ జీరి యాతనితో దశసహస్రవర్షంబులు పోరి యొక్క కవచంబు భేదించె. నారాయణుండు రణంబు సేయుకాలంబునఁ దపంబున్న నరుండు వెంటనే రణసన్నద్ధుండై యా రాక్షసుం దొడరి పదివేలవత్సరంబులు పోరి రెండవ కవచంబు భేదించె. ఇట్లా యిరువు రొకరు తపంబు సేయునెడ వేఱొకరు రణంబు సేయుచుఁ బర్యాయంబుగఁ దపంబు రణంబు సేయుచుఁ దొంబదినూర్ల తొంబదితొమ్మిది కవచంబుల భేదించిరి. రాక్షసుం డేకకవచుండై పోరుచు నదియుఁ దెగనున్నసమయంబున భీతుండై పలాయితుండయ్యె. అతండు కర్ణుండై జనించె. అతనియందు రాక్షసాంశ ముండుటచేతనే యధర్మాభిమానియయ్యె. అతనియందు నరకావేశమును గలదు.

రుక్మిణి—కర్ణునితో భారతమందురే యట్లైన నేమి ?

శ్రీకృష్ణ—కర్ణవిషయ మిప్పుడు ప్రస్తుతముగాదు. అయినను సూక్ష్మముగఁ జెప్పెదను. కర్ణుఁడు కుంతీపుత్రుండని పాండవులకుఁ దెలిసియుండినా భారతయుద్ధము లేదు. ఇదియొక కారణము. రెండవది, తాను లోకైకవీరుండని కీర్తిచెందవలయునను తలంపుతో నట్టికీర్తి సంపాదించిన యర్జునుమీఁది స్పర్ధచేఁ గౌరవ పాండవులకు సంధి చేసి కులనాశము ప్రజానాశము మాన్పుటకుమారు నీకు నేను సహాయుఁడనై యుండ నీకేమిభయము. అర్జును నేను వధించెదనని దుర్యోధనుతో నమ్మఁబలికి విరోధము పెంచకుండినను భారత యుద్ధము లేదు. వీని ప్రోత్సాహము లేకుండిన భీష్మ ద్రోణ కృపాశ్వత్థామ శల్య బాహ్లికాదులు మధ్యస్థులు పాండవపక్షపాతులు గాన దుర్యోధనుఁడు కలహమునకు సాహసించియుండఁడు. వీని బలమును నమ్మియే యతఁడు పాండవులతో విరోధించెను. తన కీర్తిఁగోరి దన తమ్ములతోఁ గలహించి తనస్వామికిఁ గీడుకలిగించిన వాఁడు కర్ణుఁడు వీని విషయమై చెప్పవలసిన మేలుగీళ్లు చాలఁ గలవుగాని యిది సమయముగాదు. అవల వినుము.

కర్ణవధానంతరంబున దుర్యోధనుండు శల్యునిఁ గౌరవసేనానాయకుంగావింప నొక మధ్యాహ్నము పోరి యతండు ధర్మసుతుచే మృతుండయ్యె. ఆతఁ డెంతబలిష్ఠుఁడో కంటిరా. భీష్ముఁడు ద్రోణుఁడు కర్ణుఁడు పాండవుల జయింపలేక చావఁగా శల్యుఁడు వారిని జయింపునట. పలాయితుండై ద్వైపాయన హ్రదంబున డాఁగిన దుర్యోధనుఁడు యుధిష్ఠిర నిష్ఠురవాక్యబాణపీడితుండై రోషంబున వెలువడి భీమసేనుతోఁ గదాయుద్ధంబుఁ గావించె.

ఇట్లు భీమ దుర్యోధను లుద్యతగదాయుధులై హోరాహోరి మృత్యుజనభయంకరంబుగఁ బోరుచుండిరి. జయాపజయంబులు నిర్ణయింపరాకుండెను. అప్పు డర్జునుండు తనప్రక్కనున్న శ్రీకృష్ణుని గాంచి యిట్లనియె.

కృష్ణా! యీ యిరువురు వీరులలో నెవ్వఁ డేవిషయమున శ్రేష్ఠుఁడు. నీయభిప్రాయంబు తెలుపుమనిన వాసుదేవుఁడిట్లనియె.

అర్జునా! యుపదేశంబున వీరిరువురు తుల్యులు. భీముఁడు బలవత్తరుఁడు దుర్యోధనుం డభ్యాసాధికుఁడు భీముని వధింపఁగోరి యతం డరణ్యంబుల నవయునపుడు చిరకాల మభ్యసించుటచే దుర్యోధనుఁడు భీమునకంటె నేర్పరియయ్యె. భీమసేనుఁడు ధర్మసేతువు భేదింపరాదని తలఁచి యుద్ధముచేసెనా జయింపఁజాలఁడు అధర్మ నిరతు దుర్యోధను నన్యాయయుద్ధంబునం దచంపవలయు. సుర లసురుల మాయచే నిర్జరించిరని మనము వినుచున్నవారము కదా. ఇంద్రుఁడు మాయారక్షితుండై కదా విరోచనవృత్రులశిక్షించె. కానఁ బావనియు మాయనాశ్రయించుటే మేలు. అంతియకాక భీముఁడు దుర్యోధను తొడలు గదచే విఱుగఁగొట్టెదనని ద్యూతకాలంబున ప్రతిజ్ఞ వచించినవాఁడు. ఆ ప్రతిన నెఱవేర్చుకొనుఁగాక. మాయావి రాజును మాయచే వధించునుగాక. అటుగాక వృకోదరుండు న్యాయమందే నిలిచెనా ధర్మరాజు విపన్నుఁడగును. అర్జునా? మఱియొక పరి వచింతు వినుము. ధర్మజు దోషమువలన మనకు మరల భయము ఘటిల్లెను. ఎంతో శ్రమించి భీష్మాదుల వధించి కార్యము సాధించి జయంబు కరగతంబైయుండ దానిని మరల నాయన సంశయావస్థకుఁ దెచ్చెను.

మాలో నెవ్వనినైన నొకని జయించి రాజ్యప్రాప్తి గనుమని వచించి యుధిష్ఠిరుండు చాల మతిమాలినపని చేసెను. దుర్యోధనుఁడు కుశలుఁడు వీరుడు ఏకోద్దేశముగలవాఁడు. ఈ విషయమునఁ బురాతన శుక్రగీతలు వినుము.

తే. గీ. భగ్నమై రణసీమను బాఱిపోయి
వెండి గుమిగూడి మరలి పై వెడలినట్టి
వైరిశేషంబునకు భయపడఁగవలయు,
గెలుపొ మరణంబొ యొక్కఁడె తలచుఁగాన.

తే. గీ. జీవితాశనుమాని నిశ్చింతవృత్తి
సాహసోద్యోగమును బూని సమరమునకు
వచ్చువీరునకెదుట విర్వచ్చు! నిలువఁ
జాలఁడని విశ్వసింపుము శక్రుఁడైన.

సుయోధనుఁడా విఱిగినవాఁడు. హతసైన్యుఁడు. మడుఁగుఁజొ దాఁగినవాఁడు. పరాజితుఁడు. రాజ్యలాభంబున నిరాశుఁడు. వనప్రేప్సుఁడు. ఇట్టివాని నేమతిమంతుఁడు మరల ద్వంద్వయుద్ధమునకుఁ బిలుచును? ఏకోద్దేశముతోఁ బదుమూఁడు వత్సరములు గద నభ్యసించిన వీరుఁడు గెలువజాలఁడని యెట్లు తలంపవచ్చు? అదే చూడుము. భీమవధోద్యుక్తుఁడై దుర్యోధనుం డెట్లునిలువుగ సడ్డముగ నెగురుచున్నవాఁడో. భీముఁడన్యాయము నాశ్రయింపకుండిన మీకెల్ల దుర్యోధనుఁడే రాజు కాఁగలఁడు. అనుసమయంబున భీమసేనుఁడర్జును వంకఁగన నతండు తొడలప్పళించె. దాని యర్థంబు గ్రహించి గదాఘాతంబున భీమసేనుఁడు దుర్యోధను తొడలు విఱుగ నడిచె.

గదారణంబున నాభిక్రింది దేశంబు నొప్పింపరాదను నియతి మీఱి సామీరి కురురాజు కుఱువులు విఱుగనడుచుటఁ గని సంగ్రామాలోకనకాంక్ష నరుదెంచిన బలరాముఁ డాగ్రహోదగ్రుఁడై చివాలున లేచి యిది యధర్మము. నీతిమాలి భీముఁడు దుర్యోధను తొడలు విఱుగఁ గొట్టెనని హలహస్తుఁడై భీమసేను వధింపఁబోవుటయుఁ గృష్ణుం డడ్డమై యాయనను గౌఁగిలించుకొని యిట్లనియె.

అన్నా నీవేల కోపించెదవు వినుము. ఆత్మవృద్ధి మిత్రవృద్ధి, మిత్ర మిత్రవృద్ధియు శత్రుక్షయము, శత్రు మిత్రక్షయము, శత్రు మిత్ర మిత్రక్షయము, లను నీయాఱును నాత్మవృద్ధికి హేతువులు. తన కొండెఁ దన మిత్రులకొండె విపరీతము సంభవించెనా తన చేటు కాలము డాసెనని యెఱింగి ప్రతిక్రియ చేయవలయు. మనకుఁ బాండవులు సహజమిత్రులు. శుద్ధపౌరుషులు. నీతండ్రితోఁ బుట్టిన దాని పుత్రులు. పరపీడితులు. ప్రతిజ్ఞాపాలనము క్షత్రధర్మంబనినీ వెఱుఁ

గదా ? గదాయుద్ధంబున దుర్యోధనుని తొడలు భగ్నంబులు చేసె దనని సభాతలంబున భీముండుచేసిన ప్రతిజ్ఞ జగద్విదితముకదా. పూర్వము మహర్షి మైత్రేయుండును దుర్యోధనా! నీ యూరువులు భీము గదాఘాతంబున భగ్నంబులగునని శపించెఁగదా. కావున భీముకృత్యం బెట్లు దుష్టంబగు? పాండవులు మనకు రక్తసంబంధులు. సుహృదులు. వారి వృద్ధియందు నా వృద్ధి నిలిచియున్నది. కావునఁ గోపింపకుము.

అన్నా! నీవు ధర్మవత్సలుఁడవు. జితకోపుఁడవు, అని ప్రఖ్యాతి గన్నవాఁడవు. కానఁ గోపము సంహరించుకొనుము. కలియుగము ప్రాప్తించెనని తెలుసుకొనుము. పాండవులు తీర్ణప్రతిజ్ఞులై ప్రతిజ్ఞా ఋణముక్తులగుదురుగాక. నిష్కృతిప్రజ్ఞుని నిష్కృతి వధించుట దోషంబు గాదు. అందధర్మభయంబు లేదు. వంచనచేగాని వసులుగాని వంచకులఁ బ్రాణపద సమయమందైనను వంచింపరాదని తేరకఁ దాను జావవలయునా? యుధ్యమానుఁడును, వీరుఁడును, వృష్ణి కురుకుల యశస్కరుండునైన యభిమన్యుని బాలుని వీని ప్రోత్సాహముచేఁగదా కర్ణుఁడు వెనుగొట్టి యతని విరథుఁ గావించె. వీని ప్రోత్సాహముచేఁగదా యుపలాయనుఁడగు వాని ననేకులు గుమిగూడి వధించిరి. వీఁడు జన్మప్రభృతి లుబ్ధుఁడు. పాపాత్ముఁడు. దుర్మతి. కులపాంసనుఁడు. ఇట్టి వీనిని బహుమాయోపాయములు కాచి కాచియుండి భీముఁడు వధించినఁ దప్పేమి? అదియునుగాక భీముని ప్రతిజ్ఞ తెలిసి తెలిసి వీఁడేల తన్నుఁ గాచుకొనఁడయ్యె. తన్నుఁ జంపుటకై తెగిరి పైపడివచ్చు నతని తొడ లూర్ధ్వభాగంబున నుండఁగా భీముఁడు విఱుగ నడిచెఁగాని నిలిచి యుండునప్పుడుగాని మండల భ్రమణంబునఁగాని కాదు. తా నాశ్రయించిన యధర్మము ఫలము దానుగను వక యెట్లు తప్పు?

అని నెపముతోడి ధర్మమును కృష్ణువాక్యంబులు విని బలరాముఁడు సంతసింపక భీము నిందించుచు దుర్యోధనుఁ బొగడుచు సభవిడిచి పోయెను. తరువాతఁ గృష్ణవాక్యముల సోత్సాహులై రాజులందఱు వారివారి శిబిరంబులకుఁ బోయిరి.

అంతఁ గృష్ణుండు హతావశిష్టసేనలను దక్కిన యోధులను నంద నిలిపి పాండవులను సాత్యకిని మాత్రము తోడ్కొని సుయోధను శిబిరంబునకుం జనియె.

ఇట్లు చని పాండవులు కురునరేంద్రు శిబిరంబు సమీపంబున రథంబుడిగిరి. కౌంతేయ యోగక్షేమభారంబు వహించిన కృష్ణుండు పార్థుంగని యిట్లనియె. అర్జునా!

కం. కవగొనలును గాండీవము
నవల నిడం బనుపు ముందరరదము డిగు మే
ను వెనుక *డిగెదఁ శుభకర
మగు నివ్విధమట్లు సేయు మనుడు నతండున్

రథంబు డిగియె.

అంతఁ గృష్ణుండును బగ్గంబులరదంబున ముడిచి డిగియె. అతను డిగిన వెంటనే ధ్వజమునందుండు కపియు నదృశ్యుండయ్యె. అంత నా శతాంగంబు తురంగంబులతోడను ప్రగ్రహంబులతోడను బరికరంబులతోడను దగ్ధంబయ్యె. ఆ వింత గని పాండవులు నివ్వెఱ గొనిరి. అర్జునుండు కృష్ణునకు నమస్కరించి మహానుభావా! యీ యాశ్చర్యంబున కేమి కారణం బనిన నమ్మహానుభావుం డిట్లనియె.

ఫల్గునా! కర్ణద్రోణ ప్రయుక్తంబులయిన దివ్యాస్త్రంబుల నీ రథంబు మున్నె దగ్ధమై యుండవలయును. ఇంతవఱ కటుగాక యుండ నా శక్తి నాఁపితి. ఇఁక దీనితోడ నక్కఱలేమిఁ గాలవిడిచితి. అనిన ధర్మపుత్రుండు నీ కృపవలన నీ విపత్సాగరంబుఁ దరించితిమి. ధన్యులమైతిమి. కృతార్థుల మైతి మని యనేకవిధముల స్తుతించి వెండియు నిట్లనియె.

నీవు కర్ణధారుండవుగ నీ రణనదిని దాఁటితిమిగాని మఱి యొకటి దలఁచిన భయమగుచున్నది. హతసుతయగు గాంధారీదేవి మహాపతివ్రత. నియతశీల. మహాతపస్విని. ఆమె క్రోధానలం

* ఇది చిన్నయసూరిగారి పాఠము.

బున మేము ప్రార్థకుండ నీవు పోయి యామెను శాంతిపఱుపఁ బ్రార్థించెద. ఈ కార్యంబు నీకుఁగాక యితరుల కసాధ్యంబు. అనిన నట్లె కావించెదనని దారుకానీతంబైన తేరెక్కి చయ్యన హస్తినాపురంబునకుం జని ధృతరాష్ట్రు మందిరంబుఁ జొచ్చి యందుఁ బూర్వాగతుండైన వ్యాసునకు గాంధారీ ధృతరాష్ట్రులకుఁ బ్రణామంబుసలిపి యా కురురాజు కరంబులు పట్టుకొని విలపించి తెప్పలకు బాష్పంబులఁ ద్రుడుచుకొని నీటఁ గన్నులు కడుగుకొని యాచమించి ధృతరాష్ట్రుతో నిట్లనియె.

రాజేంద్రా! భూతభవ్యములు నీ వెఱుంగనివి లేవు. కాల వ్యాపారంబును నీకు సువిదితము. ధర్మవత్సలులైన పాండవులు నీ చిత్తానుసారంబు వర్తించుచుఁ గులక్షయభయంబున శాంతివహించి పండ్రెండేఁడులు వనవాసంబును నొకయేఁ డజ్ఞాతవాసంబును జలిపి యిట్టివట్టివని చెప్పరాని పడరానిపాటులెల్ల దుర్బలులవలెఁ బడిరి. యుద్ధకాలమునకుముందు నేను స్వయముగ నరుదెంచి సర్వలోక సాన్నిధ్యంబున నైదుగ్రామంబుల యాచించితి. కాలోపహతుండవును లుబ్ధుండవు నగునీవు వారి కామాత్రమైన నీయ నంగీకరించినవాఁడవు కావు. నీ యపరాధంబున సర్వక్షత్రియనాశంబు సంఘటిల్లె. భీష్మ సోమదత్త బాహ్లీక కృప ద్రోణ ప్రాణి విదురులు శమింపుమని నిన్నెన్నివిధములనో యాచించిరికాదె. నీవు మతిహీనుండవై యీ కార్యమునఁ బ్రవర్తిల్లినట్లు కాలోపహతచిత్తు లందఱు మోహము పాలగుదురు. ఇదంతయుఁ గాలమహిమగాక మఱేమున్నది. దైవ మలంఘనీయము. కావున నృపాలా! పాండవులఁ గినియకుము. మహాత్ములగు వారియందునల్పంబైనను ధర్మన్యాయ స్నేహభావంబుల వ్యతిక్రమంబు గానరాదు. ఆత్మదోషకృత ఫలంబగు దీనినంతయు నాలోచించితివేని పాండుపుత్రులయందుఁ గోపింపఁ గారణము కలుగదు. కులము – వంశము – పిండము పుత్రులకుఁ గర్తవ్యములైన యితర కార్యములు నీకును గాంధారికిఁ బాండవులయందే ప్రతిష్ఠితము లైనవి. కావునఁ బాండవులయెడ నీవొండె గాంధారియొండె

రోషంబున దోషమారోపించి కనలఁదగదు. నిజ వ్యతిక్రమంబు సర్వంబు నాలోచించి కౌంతేయుల మేలుకోరుము. నీకు నమస్కరించెదను. యుధిష్ఠిరునకు నీయందుఁగల సహజభక్తి స్నేహంబు లెట్టివో నీవెఱుఁగుదువు. అపకారరతుల శత్రువుల రణసీమ జయించి బంధువధజాత శోకంబున దివారాత్రంబులు పరితపించుచున్నవాఁడు. సుఖమెట్టిదియో యెఱుఁగఁడు. పుత్రశోకాభితప్తుఁడు బంధువియోగ వ్యాకులితేంద్రియుఁడవగు నిన్ను దర్శింప లజ్జించుచున్నవాఁడు నీకును గాంధారికిని నాపాదిల్లినశోకంబు పెల్లు తలఁచి తలంచి దురపిల్లుచు శోక దగ్ధుఁడగుచున్న వాఁడు. అని ధృతరాష్ట్రు సంబోధించి శోకకర్శితయైన గాంధారిం గని మురారి యిట్లనియె.

సుబలరాజనందనా ! సువ్రతా ! నిజము చెప్పుచున్నాఁడ వినుము. ఇప్పుడు నీతోఁ దుల్యయగు సీమంతిని లోకమున లేదు. నేను రాయబారమరుదెంచిన సమయంబున నాసమక్షమున నుభయ పక్ష క్షేమంబుఁగోరి ధర్మార్థసహితంబుగ దుర్యోధనుఁ గోపించి నీవు పలికినపలుకులు నీ వెఱుంగుదువు. "మూఢుఁడా ! నామాట లాలింపుము. ధర్మమెందో జయమందే" యని నీవు వచింపవా. పతివ్రతాశిరోమణీ నీ వాక్యంబు సత్యంబయ్యె. ఇవియన్నియు నాలోచించి నీవు శోకింపరాదు. మఱియుఁ బాండవులవినాశము నీవు మదినైనఁ దలఁపరాదు. మహాభాగా ! నీవు తపోబలంబున సచరాచరంబైన జగంబు నెల్లఁ గ్రోధదృష్టుల నిర్దహింప శక్తురాలవు.

అనిన గాంధారి యిట్లనియె. కృష్ణా ! నీవు సత్యము చెప్పితివి. మనోవేదనఁ బరితపించు నాకు మతిచలన మొదవెను. నీపలుకులు విని మరలఁ గుదుటఁబడెను. ఈరాజు వృద్ధుఁడు. అంధుఁడు. పుత్రహీనుఁడు. పాండవసహితుఁడవైన నీవే యీయనకు దిక్కు. అని ముఖంబునఁ జేలచెఱంగిడి పుత్రశోకంబున హాయని వాపోయె.

దామోదరుండు నామెను బలువిధంబుల నూరార్చి యిట్లనియె.

తల్లీ ! యిఁక నేనిందు నిలువరాదు. అశ్వత్థామ పాండవులకుఁ గీడురోయు నాలోచించుచున్నవాఁడు. నే నందు బోవలయు. సెల

విచ్ఛేదవేయుమనిన నమ్మహాతపస్విరియు నాయనా! నీవాదుఁబోమ్ము. అశ్వత్థామవలనఁ బాండవులకుఁ గీడు మూఁడకుండఁ జేయుమనిరి. ఆ దంపతుల యనుజ్ఞగొని వాసుదేవుండు పాండవులకడ కరుదెంచి యథావృత్తంబు నివేదించె.

ఆరాత్రి కృపకృతవర్మసమేతుండైన యశ్వత్థామ సుయోధనప్రేరితుండును రుద్రదత్తబలుండునునై సుప్తులైయున్న ధృష్టద్యుమ్నాది సకల వీరులను సేనలతోడ సమయించె. త్రికాలజ్ఞుండగు కృష్ణుండు పాండవుల నిట్టిగండమునుండి తప్పించె.

తన సోదరులు పుత్రులు నశ్వత్థామచే హతులగుటవిని శోకరోషంబులు పెనఁగొన ద్రౌపది భీమార్జునుల నశ్వత్థామను శిక్షింపఁ యతని శిరోమణి హరింపఁబనిచె. వారి రాకగని ద్రోణి క్రుద్ధుండై యాత్మరక్షోపాయంబు వేఱొండుగానక యపాండవంబగుఁ గాక యని బ్రహ్మశిరోనామకాస్త్రంబు ప్రయోగించె. కృష్ణచోదితుండై యర్జునుండును దాని శమింప బ్రహ్మశిరంబ ప్రయోగించె. అమ్మహా దివ్యాస్త్రంబులవలన జనించిన జ్వాలలు భూనభోంతరములఁ లోకం బాకులపడఁజేయ ఋషులెల్ల నరుదెంచి యిదియేమి మీ రస్త్రంబులఁ బ్రయోగించి లోకాపకారంబుఁ గావించుచున్నారని వారిపలుకు శిరసావహించి బ్రహ్మచర్యానిష్ఠుండును గురుభక్తుండునగు నర్జునుండు తనయస్త్ర ముపసంహరించెఁగాని బ్రాహ్మణుండయ్యు నశ్వత్థామ యటు చేయఁజాలక వ్యాసాదిఋషులతో నిట్లనియె,

ఈ యస్త్రం బుపసంహరింప శక్తుండఁగాను. ఇది పాండవేయకళత్ర గర్భంబులనున్న శిశువులనెల్ల నిర్దహించి శాంతింబొందుఁ గాతమనిన వాసుదేవుండు నీమాటపై నిలుమంతకెక్కువ యాశింపకు మనిన నశ్వత్థామ యిట్లనియె.

ఓహో నీ కీలెఱింగితి. నీ వుత్తరాగర్భంబు తప్పింపఁ జూచెదవు. నే నేల దానిని విడుతు. దానిని దగ్ధంబుచేయు కేల మానుదు ననిన శ్రీకృష్ణుం డిట్లనియె. ఓయీ శిశుఘాతకుఁడా! నీ వాశిశువును

